# మనుస్మృతి

(తెలుగు తాత్పర్యంతో)

తాత్పర్య రచన

**డా॥ నల్లందిఘళ్ లక్ష్మీనరసింహాచార్యులు**

ఆంధ్రోపన్యాసకులు

ప్రభుత్వ డిగ్రీ కళాశాల,

గజ్వేల్ (మెదక్ జిల్లా)

**తిరుమల శ్రీ వేంకటేశ్వరుని ఆర్థిక సహాయంవల్ల ముద్రింపబడింది**

# MANUSMRUTHI

*With Telugu Commentory*
*By*

**Dr. N.L. NARASIMHA CHARYA**

READER IN TELGUGU

# 'మనుస్మృతి'

తెలుగు తాత్పర్యంతో

**డా॥ యన్. యల్. నరసింహాచార్య**


గాయత్రీ ప్రచురణలు

ప్రథమ ముద్రణ - 1000 ప్రతులు

ఫిబ్రవరి - 2000





**బౌండు ప్రతి వెల రూ. 160 లు**

**సాధారణ ప్రతి వెల రూ. 120 లు**

ప్రతులకు :

**యన్. రంగనాయకమ్మ**

7-1-110 రెడ్డి ఎన్‌క్లేవ్, దేవుని అల్వాల, హైదరాబాదు - 500 010. ఫోన్ 7862038

ముఖపత్రాలంకరణ : **యన్. వేణుగోపాలాచార్యులు**, అల్వాల్

టైప్ సెట్టింగ్ :

**డీ.బి. గ్రాఫిక్స్,**

5ఏ, అర్చనా ఆర్కేడ్, రామకృష్ణ హోటల్ ప్రక్కన, సికింద్రాబాద్ - 025. ఫోన్ : **7821733**

ముద్రణ :

**శ్రీ దత్త సాయి గ్రాఫిక్స్**

1-8-702/105, నల్ల కుంట, హైదరాబాద్, ఫోన్ : 3020719, ఆఫీస్ : 7633275



**Prof. H. SIVA KUMAR**
**DEAN. FACULTY OF ARTS**
KAKATIYA UNIVERSITY
WARANGAL - 506 009 - A.P.
**✆ : 77101, 77701, Ext. 243**



ఇది **మనుస్మృతి** అంటే ధర్మశాస్త్రం

"ధరతిలోకానితి ధర్మః" - లోకములను ధరించేది ధర్మము అని అర్థము. "ధ్రియతే జనైరితి ధర్మః" - జనులచేత ధరింపబడేది ధర్మము అని మరొక సమన్వయంచేస్తే - ధర్మాచరణ వల్లనే ఈ లోకం నిలిచి ఉన్నదని, అట్లాగే మానవుల స్థితి గతులకు ధర్మమే మూలమని స్పష్టమవుతుంది. అలాంటి ధర్మానికి మూలం వేదం. అందుకే "వేదో ధర్మమూలమ్" అని చెప్పబడింది. 'విద్' శబ్దానికి జ్ఞానమని అర్థం. ధర్మాధర్మ పరిజ్ఞానము కల్గించేది కనుకనే 'వేదమని, ధర్మాధర్మాదులు దీని ద్వారా తెలియ బడతాయి కనుకనే 'శ్రుతి" అని, ఆ ధర్మములు తరతరాలుగా అభ్యసింపబడుతున్నాయి కనుక 'ఆమ్నాయ'మని వేదానికి పేర్లు. ఏది ధర్మమో ఏది అధర్మమో నిర్ణయించేది వేదమన్నమాట. అదే విషయాన్ని మనుస్మృతి కూడా - "వేదోఽఖిలో ధర్మమూలమ్" (2-6) "సర్వోఽభిహితో వేదే" (2-7) "ధర్మఏవహతో హంతి, ధర్మో రక్షతి రక్షితః (8-15) - అని పలుచోట్ల వివరించింది.

మనిషి మనిషిగా బ్రతకటానికి, మనిషిగా ఎదగటానికి చాలా ముఖ్యమైన ధర్మాన్ని ప్రబోధించినవాటిలో వేదం తరువాత, మొదట చెప్పదగినవి, ధర్మ శాస్త్రాలు. అధర్మశాస్త్రాలలో అగ్రగణ్యమైనది మనుస్మృతి. ఒకసారి ధ్యాన నిమగ్నుడైన మనువును, బ్రహ్మదేవుని సమస్త సృష్టి ధర్మాలు తెలుపవలసిందిగా ప్రార్థించిన ఋషిగణానికి, భృగుమహర్షిద్వారా వాటిని చెప్పించాడు. అదే ఈ మనుస్మృతి.

"అల్పజ్ఞాత్ బిభ్యతివేదః ఏష మాం ప్రతిరిష్యతేఇతి తస్మాద్మనురవదత్ తద్భేషజమ్" - అల్పజ్ఞులైన వారు అపార్థకల్పనలు చేస్తారని వేదము భయపడుతుందని, దానికి మందును మనువు చెప్పాడని ప్రతీతి. అందుకే ధర్మ శాస్త్రగ్రంథాలన్నింటిలోనూ మనుస్మృతికి అగ్రస్థానం ఉన్నది. అయితే యుగయుగంలోను ధర్మాలు మారుతూవచ్చాయి. అట్లాగే ధర్మశాస్త్రాలు కూడా మారుతూవచ్చినాయి.

"కృతేతు మానవాః ప్రోక్తాః
త్రేతాయాం గౌతమ స్మృతిః
ద్వాపరే శంఖలిఖితౌ
కలౌ పారాశర స్మృతిః

అన్నశ్లోకం అదే విషయాన్ని చెబుతోంది. కృతయుగంలో మనుస్మృతి పరమ ప్రామాణికంగా పరిగణింపబడింది. అట్లాగే త్రేతాయుగంలో గౌతమ ధర్మశాస్త్రం, ద్వాపరయుగంలో శంఖ లిఖిత స్మృతి ప్రామాణికములు. ఈ కలియుగంలో పరాశరస్మృతి ప్రామాణికంగా ఉన్నదని అర్థము. ఈ శ్లోకము మనుస్మృతి ప్రామాణికతనే కాక, ప్రాచీనత్వాన్ని కూడా తెలుపుతున్నది. పితృశ్రద్ధాలలో మాంసభక్షణము, దేవరన్యాయమున పిల్లలను కనటం వంటివాటిని మనుస్మృతి సమర్థిస్తూండగా పరాశరస్మృతి కలియుగంలో అవి నిషిద్ధములని చెప్పింది. అట్లాగే - నామకరణము శిశువునకు 10 లేక 12వ రోజున చెయ్యవలెనని మనుస్మృతి (2-30) చెబుతూ ఉంటే, 11వదినంలో చెయ్యవలెనని శంఖవచనము. ఇవన్నీ, ఆచారాలు, ధర్మాలు ఎట్లా మారుతూ వచ్చాయో తెలుపుతాయి. మొత్తం మీద - ఈనాడు మనం ఆచరిస్తున్న ఆచార వ్యవహారాలన్నిటికీ మూలం ధర్మశాస్త్రాలే !

ఈనాడు మనం ఆచరిస్తున్న జాతకర్మ, ఉపనయనము, వివాహము వంటి షోడశ సంస్కారములు, శ్రాద్ధవిధి, జాతాశౌచ మృతాశౌచములు స్త్రీ ధర్మాలు వంటి సదాచారములు; అప్పు తీసుకొనటం, క్రయవిక్రయాలలో తలెత్తే వివాదాలు, స్వామి-సేవకుల మధ్య వివాదాలు, భూమి ఎల్లలు, స్త్రీ పురుష వివాదాలు, ఆస్తిపంపకం, జూదం, వ్యభిచారం వంటి అష్టాదశ వ్యవహారాలు; సకాలంలో కర్మలు చేయకపోవటం వలన కలిగే అనర్థాలకు చేస్కుకోవలసిన ప్రాయశ్చిత్తాలు; అన్యాయం చేసినవారికి రాజు విధించవలసిన వివిధ శిక్షలు - వంటి ఎన్నో విషయాలు ఈ ధర్మశాస్త్ర గ్రంథాలలో వివరించబడినాయి. అంటే వేల సంవత్సరాలుగా నిలిచి ఉన్నది, తరతరాలుగా వస్తున్నది అయిన మన సంస్కృతిని నిలబెట్టినవి మన ధర్మశాస్త్రగ్రంథాలే. అందుకే వాటినీ మనం అధ్యయనం చేసి, మన సంస్కృతిని అర్థంచేసుకొని, మన జీవితాన్ని ఆదర్శవంతంగా తీర్చి దిద్దుకోవాలి. అలాంటి వాటిలో అగ్రగణ్యమైనది మనుస్మృతి. కొన్ని వేల సంవత్సరాలక్రితం అందులో చెప్పిన ఆచార వ్యవహారాలే ఈనాటికీ అమలు చేస్తున్నామంటే, అవి మనకు ఎంత ఆదరణీయమో గ్రహించవచ్చు

షోడశకర్మలు, గురు ప్రాశస్త్యము (2-192......), అతిథి పూజనం ( 3-102...),

శ్రాద్ధ విధి ( 3-122....), అశౌచవిధానము ( 5-58 .....), రాజసేవకులను పరీక్షించటం, రాజువాడే వస్తువులను పరీక్షించటం (7-219,220), రాజుకొఱకు వంటవాళ్ళు చేసిన అహారాన్ని పరీక్షించటం ( 7-217), తూనికలు - కొలతలు వంటి వాటిని తరచు పరీక్షించటం (8-403), తండ్రి తాను సంపాదించిన ద్రవ్యాన్ని ఇష్టం వచ్చిన వారికి ఇచ్చుకోవటం ( 9-209), అన్నదమ్ములు తండ్రి ఆస్తి పంచుకున్నప్పుడు ముందుగా తండ్రి చేసిన అప్పులను తీర్చటం ( 9-218) - ఇవన్నీ ఈనాటికీ ఆచరిస్తున్నవే !

ఇక మనస్మృతిలో చెప్పిన ఈ క్రింది విషయాలు అందరూ తెలుసుకోవాలసినవి:

1. *ఆచమన జలపరిమాణ ఎంత ఉండాలి ( 2-62)*

2. *నమస్కార విధానము - తన కుడిచేతితో గురువు ఎడమ పాదాన్ని తన ఎడమ చేతిలో కుడిపాదాన్ని ముట్టుకొని నమస్కరించాలి.*

3. *ఋగ్యజుస్సామ వేదములనుండి అకార ఉకార మకార రూపమైన ప్రణ మును, భూః భువః సువః అనే వ్యాహ్యతి త్రయమును బ్రహ్మ ఏర్పరచినాడు. అట్లాగే ఆమూడు వేదాలనుండీ గాయత్రీ మంత్రానికి సంబంధించిన "తత్సవితుర్వరేణియం, భర్గో దేవస్య ధీమహి, ధియో యోనః ప చోదయాత్" అన్నపాదత్రయాన్ని ఆకర్షించాడట, కనుక ఓంకారంతో, వ్యావృతిత్రయ సహితంగా, త్రిపాది అయిన గాయత్రీ మంత్రాన్ని జపించాలని, అట్లాచేస్తే పరబ్రహ్మను పొందగలుగుతాడని మనుస్మృతి .(2-76 నుండి 82) కాని, నేడు గాయత్రీ మంత్రం 24 అక్షరాలతోనే ఉన్నది కనుక వ్యాహృతులను వదిలి వేస్తూ ఉంటారు. అది పద్ధతి కాదని మనువు !*

4. *ఓంకారమే పరబ్రహ్మము. ఆ ఓంకార జపం యజ్ఞాదులకంటె పదిరెట్లు శ్రేష్ఠం దానిని ప్రక్కవాడికి వినపడకుండాచేస్తే 100 రెట్లు శ్రేష్ఠం. మానసికంగా చేస్తే వెయ్యిరెట్లు శ్రేష్ఠం. ( 2-8385) అది తెలియక చాలా మంది ఓంకారం ఎంత గట్టిగా చెబితే అంత గొప్ప అని భావిస్తూ, సాధనచేస్తున్నారు.*

5. కామము ఉపభోగమువలన ఉపశమిస్తుందని నేటివారి అభిప్రాయము. జాతున కామః కామనాం ఉపభోగేన శామ్యతి' అని మనువు. పైగా అది నెయ్యి పోస్తే ప్రజ్వరిల్లే అగ్నిలాగా పెరుగుతూ పోతుందే కాని తగ్గదు అని మనువు. *(2-94)*

6. పరుల భార్యను, తనకు దగ్గరి సంబంధంలేని స్త్రీని గౌరవనీయురాలని, సోదరి అని పిలవాలి (2-29).

7. కన్యాదానం చేసి తండ్రి వరుని నుండి ధనం తీసుకుంటే, అతనికి కన్యాదాన ఫలం దక్కదు. పైగా తన సంతానాన్ని అమ్ముకున్నవాడౌతాడు. 3-51)

8. ఇంటికి వచ్చిన అతిథుల కుల గోత్రాలను అడగటం, వాంతిచేసుకొన్న అన్నమును పెట్టటంతో సమానము ( 3-109).

9. దేవకార్యంకంటె పితృకార్యం ముఖ్యము ( 3- 203).

10. సంధ్యావందనాన్ని సరియైన సమయాలలో ఎక్కువ సేపు చెయ్యటంవల్లనే ఋషులు దీర్ఘాయుస్సు, యశస్సు, బ్రహ్మవర్చస్సు, ప్రజ్ఞలను పొందగలిగినారు. ( 4-94)

11. పరస్త్రీ వ్యామోహం ఆయుక్షీణాన్ని కల్గిస్తుంది. ( 4-134)

12. తపస్సు వల్లనే పూర్వ జన్మ స్మరణ కలుగుతుంది ( 4-148)

13. సదాచారము వల్లనే దీర్ఘాయువు, ధనము, సత్సంతానము కలుగుతాయి. (4-156)

14. శ్రద్ధగా ఇయ్యకపోతే శ్రోత్రియుని అన్నమైన తినరాదు . ( 4-225)

15. చేసిన దానాన్ని ఇతరులకు చెప్పకూడదు. ( 4-236)

16. ప్రణవంతో చేసే ప్రాణాయామం చాలా గొప్పది. అది ఇంద్రియ దోషాలను పోగొడుతుంది. ( 6-70)

17. జలగలు, దూడలు, తేనెటీగలు ఏవిధంగా కొద్ది కొద్దిగా ఆహారం తీసుకుంటాయో, రాజుకూడ ప్రజలను కష్టపెట్టక కొద్ది కొద్దిగా పన్ను తీసుకోవాలి ( 7-129)

18. దోపిడి, ఇళ్ళు తగుల బెట్టటం వంటి నేరాలను కఠినంగా శిక్షించాలి ( 8-345) .

19. మేనరికం చేసుకుంటే చెల్లిలిని వివాహమాడిన పాపం వస్తుంది ( 11-171)

20. వాలఖిల్యాదులు ఆజన్మ బ్రహ్మచారులై మోక్షాన్ని పొందారు. కనుక పుత్రులుంటేనే మోక్షమని భావించనక్కరలేదు ( 5-160) ఇవికాక ఆచమనం ఎట్లా చెయ్యాలి . (2-60,61), శ్రాద్ధం ఎట్లా చెయ్యాలి ( 3-122- 157), గురువు - ఉపాధ్యాయుడు - ఆచార్యుల మధ్య తేడా ఏమిటి ( 2-140...142), భోజనం చేసేటప్పుడు ఏ దిక్కునకు తిరిగి కూర్చోవాలి ( 2-52), మితాహారం ఎందుకు సేవించాలి ( 2-57), చదువు చెప్పటానికి యోగ్యులెవరు ( 2-109), పెద్దలు వచ్చినప్పుడు ఎందుకులేచి నమస్కరించాలి 2-120), ఎలాంటివారిని మంత్రులుగా చేసుకోవాలి ( 7-60,61) - - వంటి ఎన్నో విషయాలు ఈ మనుస్మృతిలో చక్కగా వివరింపబడినాయి. ఇన్ని అపూర్వ విషయాలను, కొన్ని వేల సంవత్సరాలకు పూర్వమే ప్రవచించిన మనుస్మృతి ఈనాడు పనికిరాని పుస్తకం ఎట్లా అవుతుంది ?

అలాంటి మనుస్మృతి ఈనాడు అనేక విమర్శలకు గురి కావటానికి ప్రధానకారణాలు రెండు మూడు కన్పిస్తున్నాయి. అవి.

1. బ్రాహ్మణజాతిని చాలా గొప్పదిగా చెప్పటం - వారికి అన్ని రాయితీలు కల్పించటం.

2. శూద్రజాతిని దూషించటం.

3. స్త్రీలను అబలలని, అస్వతంత్రులని కించపరచటం.

ఈ విషయాలు కొంచెం పరిశీలించవలసివే !

1. మనుస్మృతిలో చాలాచోట్ల బ్రాహ్మణుల ప్రసక్తి కన్పిస్తుంది. ఆయాచోట్లలో ఉన్న విషయాలను పరిశీలిస్తే, మనువు ఎలాంటి బ్రాహ్మణులను దృష్టిలో పెట్టుకొని వ్రాశాడో విశదమవుతోంది. బ్రాహ్మణుడు ధర్మ రక్షణకై పుట్టినాడు. ధర్మ రక్షణ చేస్తూ ప్రపంచాన్ని రక్షించటానికి బ్రాహ్మణుడు సృష్టించబడినాడు ( 1-93,94). అధ్యయనము, అధ్యాపనము, యజనము, యాజనము, దానము, ప్రతిగ్రహణము - అనే షట్కర్మలను అతడు ఎప్పుడూ చేస్తూ ఉండాలి. ( 1-98, 10-75) అతడు సదాచార సంపన్నుడు కావాలి. అది లేకపోతే వేదాధ్యయనం చేసినా ఫలితం ఉండదు (1-109). ఇతరులను మోసం చెయ్యక, చక్కని మార్గంలో నడవాలి (4-11). అన్యాయంగా ధనం సంపాదించకూడదు. వేదోదితకర్మలనే చెయ్యాలి. ఇంద్రియనిగ్రహంకలవాడై ఉండాలి .

( 4-14..17). అలాంటి శ్రోత్రియుడు ఆకలితో బాధపడకుండా చూడటం రాజు బాధ్యత. ఎలాంటి పరిస్థితిలోనూ అతని నుంచి పన్ను వసూలు చెయ్యకూడదు ( 7-133) ఇక అటువంటివాణ్ణి చంపటం మహాపాపం ( 8-381).

బ్రాహ్మణులకు కోపం వస్తే శపించి రాజును సమైక్యంగా నాశనం చెయ్యగలరు. అగ్నిని సర్వభక్షకుని చేసినది, చంద్రుని క్షయ రోగిగా చేసినది, సముద్రంలోని నీటిని క్షారమయంచేసి త్రాగటానికి వీలు లేకుండా చేసినది బ్రాహ్మణ శక్తే ( 9-313,314). బ్రాహ్మణుడు తన బ్రహ్మం తేజస్సుచేతనే తనకు కీడు చేసిన వారిని శిక్షించాలి. తనకు కీడు చేసిన వారిని అథర్వ వేదంలో ఆంగీరసమహర్షి తెల్పిన అభిచారమంత్రములచేతనే నిగ్రహించాలి. అతనివాక్కే శస్త్రము వంటిది ( 11-32,33) వీటన్నింటినీ పరిశీలిస్తే మనుస్మృతిలో నిర్దేశించిన బ్రాహ్మణులు ఎలాంటివారో అర్థంచేసుకోవచ్చును. వాళ్ళు బ్రాహ్మణబ్రువులు కారు. నిగ్రహానుగ్రహసమర్థులైన తపస్సంపన్నులు. మరి అలాంటి వారు నేటికీ పూజింపబడుతూనే ఉన్నారుకదా! మనువు చెప్పినదానిలో అతిశయోక్తి ఏమున్నది ?

2. శూద్రులను అణగద్రొక్కారనేది - శూద్రులను గురించి మనువు అభిప్రాయాలని చూద్దాము. "శోచంతి ఖిద్యన్త ఇతి శూద్రాః" కష్టపడేవారని అమరము. బ్రాహ్మణులు విరాట్పురుషుని ముఖంనుంచి. శూద్రులు పాదాలనుంచి పుట్టారని మనుస్మృతి ( 1-31). శరీరంలో ముఖం ఎంత ముఖ్యమో పాదాలు అంతే ముఖ్యము. ఛందస్సు వేదపురుషునికి పాదాల వంటిది అన్నదాని భావం కూడా అంతే. మనిషి సర్వాంగములతో కూడిన వాడైనప్పటికీ, కాళ్ళు లేకపోతే ఎంత కష్టమో, అట్లాగే కష్టపడి పంటలు పండించి, సేవలుచేసే వాళ్లు లేక పోతే కూడా అంతే కష్టము. అదే మనువు భావంగా కన్పిస్తుంది అట్లాకాకపోతే అంటరానివాడైన శూద్రుడు కూడా ఆ విరాట్పురుషునినుంచే పుట్టినట్లుగా ఎందుకు వర్ణిస్తాడు? కనుక పై కులాల వారందరికీ శూద్రుడే ఆధారభూతుడని అర్థం చేసుకోవాలి.

అదీకాక - పౌండ్రకులు, ఓఢ్రులు, ద్రవిడులు, కాంభోజులు, యవనులు, శకులు, పారదులు, పహ్లవులు, చీనులు, కిరాతులు, దరదులు, ఖశులు మొదలైనవారు సంస్కార రాహిత్యం వల్లనే శూద్రులయినారని చెప్పబడింది. (10-43...45) కనుక

సంస్కారదూరులైన వారంతా ఆ రోజులలో శూద్రులుగా పరిగణింపబడే వారని తెలుస్తుంది.

అంతేకాదు - 90 సం॥ల పై బడిన శూద్రుడు బ్రాహ్మణునికి గౌరవింపదగినవాడేనట. ( 2-137). ఆకలితో ఉన్న బ్రాహ్మణుడు శూద్రునికంటె తక్కువ వారి ఇంటకూడా భోజనం తినవచ్చును. అందుకు విశ్వామిత్రుడు, భరద్వాజుడు వంటివారే నిదర్శనము. ( 10-107, 108).

కనుక వీటన్నింటిని బట్టీ ఆలోచిస్తే ఆనాటి శూద్రులు, మనమనుకొనే శూద్రులు కారనిపిస్తోంది. అయితే - శూద్రుడు తాకితే అతని నాలుక కోసి వెయ్యాలని ( 8-270,271), ఏ అంగంతో హింసిస్తే ఆ అంగాన్ని ఖండించాలని ( 8-280), శూద్రుడు ఉన్నత జాతి స్త్రీతో రమిస్తే లింగచ్ఛేదం చెయ్యాలని ( 8-374) - మనుస్మృతిలో కన్పిస్తోంది. అది తీవ్రమైన నాటి శిక్షావిధానానికి నిదర్శనం - ఎందుకంటే దొంగతనం చేస్తే శిరచ్ఛేదం చెయ్యమని మనువే చెప్పాడు. ( 9-277)

ఏమైనప్పటికీ అంత క్రూరమైన శిక్షలు సమర్థనీయములు కావు.

3. ఇక స్త్రీ విషయకమైన అభిప్రాయాలను చూద్దాం. "యత్ర నార్యస్తు పూజ్యంతే రమంతే తత్ర దేవతాః" - స్త్రీలు పూజింపబడేచోట దేవతలుకూడా సంతోషిస్తారు. వారికి గౌరవము లేని చోట జరిగే దేవతాపూజలు, క్రతువులూ అన్నీ నిష్ఫలములే ( 3-56) - అని మనువు చెప్పాడు. అయనే "న భజేత్ స్త్రీ స్వతంత్రతామ్" ( 5-148), న స్త్రీస్వాతంత్ర్య మర్హతి" ( 9-3) అనీ చెప్పాడు. 'స్వతంత్ర శబ్దానికి 'ప్రధానమైనది కాదని భావము. అంటే ఎప్పుడూ రక్షణీయమైన వస్తువే అని తాత్పర్యము. చిన్న తనంలో తండ్రి రక్షిస్తాడని, యవ్వనంలో భర్త రక్షిస్తాడని, వృద్ధాప్యంలో పుత్రులు రక్షిస్తారని ఆ శ్లోకభావము. అంతేకాని స్వతంత్రంలేనిదని కాదు. అందుకే స్త్రీలపట్ల అసభ్యంగా ప్రవర్తించిన వారిని విచారించకుండానే శిక్షించమన్నాడు మనువు ( 8-72)

స్త్రీలకు కావలి పెట్టి ఎప్పుడూ రక్షించటం కష్టం కనుక, తమకు తామే కాపాడు కొనే స్థితిలో ఉండాలంటాడు మనువు. ( 9-12)

తండ్రి తన కుమార్తెకు యోగ్యుడైన వానితో వివాహం చెయ్యకపోతే స్వతంత్రించి

తానే పెళ్ళి చేసుకోవచ్చునని ఆనాడే మనువు చెప్పాడు. ( 9-91) స్త్రీ ధనాన్ని వివరించాడు.

వీటన్నింటిని బట్టి ఆనాటి స్త్రీలకున్న ఉన్నతస్థానాన్ని, గౌరవాన్ని ఊహించవచ్చును.

" స్త్రీ రత్నందుష్కులాదపి" (2-238) - అని స్త్రీ రత్నాన్ని దుష్కులంనుంచి అయినా వివాహమాడవచ్చునంటాడు మనువు.

అంతేకాదు - పురుషుల బలహీనతను దృష్టిలో పెట్టుకొని, తన తల్లి - చెల్లెలు - కూతురుతో కూడా పురుషుడు ఒంటరిగా ఉండరాదని శాసించాడు. ' 2-215).

ఇలాంటి పరిస్థితులు నేడు కూడా లచ్చుటచ్చుట కన్పిస్తూనే ఉన్నాయి. అందువలననే స్త్రీ అన్ని విధాలా రక్షణీయవస్తువే అనే ఉద్దేశ్యంతోనే "న స్త్రీ స్వాతంత్ర్యమర్హతి" అని చెప్పినాడు మనువు.

ఇవన్నీ అట్లా ఉంచి - ఆనాటి పరిస్థితుల దృష్ట్యా కూడా ఆలోచించవలసి ఉంటుంది. నిన్న మొన్నటి వరకూ ఈనాడు కూడా నిమ్నజాతి వారు పొందుతున్న కష్టాలే ఇందుకు నిదర్శనం. అట్లాగే స్త్రీలు ఒంటరిగా నిర్భయంగా వెళ్లగలిగిన మంచి రోజులు ఈనాటికీ లేవుకదా! ఇక ఆనాటి వ్యవస్థ ఎట్లా ఉండిందో ఏమో, మనువు ఆ విధంగా వ్రాయటానికి

కనుక ఇలాంటివ్రాతలున్నాయని మనుస్మృతిని బహిష్కరించనక్కరలేదు! దానిని తగులబెట్టనవసరమూలేదు. ఈనాటికైనా మనువు హెచ్చరికలను దృష్టిలో పెట్టుకొని సమాజస్థితిగతులను చక్కదిద్దుకోవాలి !

ఇటీవలికాలంలో అందరి దృష్టి మనుస్మృతి వైపు ఆకర్షింపబడుతున్నది. ఇన్ని వేల సంవత్సరాలైనా దానిని చదువకూడని పుస్తకంగా ఎవరూ తీసి పారవేయ్యలేరు. అంతేకాక అనేక ముద్రణలతో అది ఇంకా అమ్ముడు పోతూనే ఉంది. ఇన్నీ ఆటు-పోటులకు తట్టుకొని, ఇంతకాలం నిలిచి ఉండటమే దాని గొప్పతనానికి ప్రబల నిదర్శనము !

చివరన ఒక సందేహం మనుస్మృతి ఎన్నోసార్లు, ఎన్నో భాషలలోకి అనువదింపబడి

ముద్రింపబడిందికదా! మళ్ళీ ఈ అనువాదం ఎందుకు ? అనేది. ఒక విషయం అందరికీ అర్థమయ్యే విధానము - అది చెప్పబడే తీరులోను, చెప్పేవారి సామర్థ్యం మీదను ఆధారపడి ఉంటుంది. అందుకే డా॥ నరసింహాచార్యులుగారు పాఠకులకు ఎంతవరకు అవసరమో అంతే చెప్పారు. అందరికీ అర్థమయ్యేతీరులో ప్రబోధించారు. అంతేకాదు. శూద్రులు భగవంతుని పాదాలనుంచిపుట్టారు. (పుట-5), నామకరణలో (పుట-21), 'నభజేత్ స్త్రీ స్వతంత్రతామ్' (పుట-140), 'నస్త్రీ స్వాతంత్ర్యమర్హతి' (పుట-240) - మొదలైనచోట్ల ఆచార్యులవారి వ్యాఖ్య చక్కగా సాగింది. గ్రంథంలోని అనేక విషయాలను సుబోధకంగా వివరించారు.

ఈ శాస్త్ర అధ్యయన ప్రయోజనాన్ని మనువే ఇట్లా చెప్పాడు - దీనిని అర్థం చేసుకొన్నవాడు మనోవాక్కాయములతో పాపములు చేయలేడు తనతోపాటు పదిహేను తరములవారిని, ఈ భూమినీ పవిత్రం చేయగలుగుతాడు. అలాంటి యోగ్యునికి ఈ భూమినంతటినీ దానం చెయ్యవచ్చును, సర్వశ్రేష్ఠమైన ఈశాస్త్రం జ్ఞానాన్ని పెంచటమేకాక, కీర్తిని కలిగిస్తుంది. అయుస్సును పెంచుతుంది; మోక్షానికి కూడా కారణమవుతూంది. అందువలన ఈ మనుస్మృతి అందరూ చదవవలసినదే ! అలాంటి గ్రంథాన్ని అందరికీ అందుబాటులో ఉండేటట్లు వ్రాసిన నరసింహాచార్యులు గారు ధన్యులు.

ఆయుష్మాన్ భవ సౌమ్యశ్రీ నరసింహా ! శుభం భూయత్ !

**ఆచార్య హరి శివకుమార్**
*డీన్, ఫాకల్టీ ఆఫ్ ఆర్ట్స్*
కాకతీయ విశ్వవిద్యాలయము
*వరంగల్ - 506 009.*

వరంగల్
1-3-2000

# కృతజ్ఞతలు

కృతజ్ఞతలు చెప్పుకొనేముందు ఒకటి రెండు మాటలు. 24-3-99న 'వార్త' దినపత్రికలో ఒక వార్త వచ్చింది 'చచ్చి సాధించిన మనువు" అనేది దాని శీర్షిక. ముంబాయిలో సంగారే అనే వ్యక్తి మార్చి 20 తేదీన మనుస్మృతి ప్రతిని తగల బెట్టబోయి తాను కాలిపోయాడు అనేది అందలి సారాంశం.

నేను మనుస్మృతిని రేడియోప్రసంగంనిమిత్తం చాలా సంవత్సరాల క్రితం చదివినాను కాబట్టి పై వార్త నన్ను కలచి వేసింది. నిజంగానే ఆ వ్యక్తి మనుస్మృతిని చదివి, నచ్చక ఆ పని చేసినాడా? లేక ఎవరో చెప్పిన దానిని ఏదో ఊహించుకొని చేసినాడా అన్నవి నాముందుండిన ప్రశ్నలు.

మేధావి వర్గం స్వయంగా ఆలోచించి మంచి చెడులను నిర్ణయించాలే తప్ప పూర్తిగా ఇతరులపై ఆధారపడికాదు అనేది నా భావన. అందువల్ల తెలుగులో మనుస్మృతి గురించి ప్రయత్నిస్తే నాకు మార్కెట్లో రెండు కాపీలు దొరికినాయి. ఒకటి కుల్లూకభట్టు వ్యాఖ్యానంతో, సరస్వతి వెంకట సుబ్బరామశాస్త్రిగారి తెలుగు తాత్పర్యంతో 1928 లో వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్ వాళ్ళు ముద్రించిన ప్రతి. దానిని బాల సరస్వతి బుక్ డిపో వారు ఇటీవలే తిరిగి ముద్రించినారు. శ్రీ వెంకట సుబ్బరామశాస్త్రీ గారు ప్రతి శ్లోకానికి విడివిడిగా చక్కని తెలుగు తాత్పర్యం రాసినారు. కాని సుమారు 80 సంవత్సరాల క్రితం రాసిన భాషకు ఇప్పటి వ్యవహారభాషకు చాలా అంతరం ఉంది. పైగా 700 పేజీలతో రాయల్ సైజులో ముద్రింపబడ్డ ఆ పుస్తకం వెల రూ. 300 లు. ఈ ధర చాలామందికి అందుబాటులో లేదు. అందువల్ల పుస్తకం చాలామందికి చేరువకాలేదు.

ఇక రెండవది శ్రీ పానుగోటి కృష్ణారెడ్డిగారు రాసిన మనుస్మృతి పరిచయం. దాని వెల భాష అందరికీ అందుబాటులోనే ఉన్నా వారన్నట్లు అది పరిచయపుస్తకం మాత్రమే. మూలం ఆ పుస్తకంలో చేర్చబడలేదు. పైగా విషయాన్ని దృష్టిలో పెట్టుకొని రాసినందువల్ల ఈ విషయం కనీసం ఏ అధ్యాయంలో ఉందో కూడ సరిగ్గా చెప్పలేం.

అందువల్ల పై రెండు పుస్తకాలను చూచిన తరువాత మూలశ్లోకాలతో కలిపి కొద్దిగా అందరికీ అందుబాటులో ఉండే భాషలో సాధారణ పాఠకుడికీ అందుబాటులో ఉండే ధరలో మనుస్మృతి తాత్పర్యం రాయాలనిపించింది.

ఇదీ నా ప్రయత్నానికి పూర్వ రంగం.

ఇక తాత్పర్యం రాసేటపటప్పుడు కొన్ని చోట్ల కొద్ది మార్పు చేసినాను. అట్లే విషయానుక్రమణికలో ఇంచుమించు ప్రతి శ్లోకంలో ప్రత్యేక విషయం ఉంది. కావున

ప్రధానమైన విషయాలనే దానిలో చూపించినాను. దీనిని పాఠకులుమన్నిస్తారని తలుస్తాను.

నేను తాత్పర్యం మాత్రం రాసినాను. ఎక్కడా దేన్నీ వ్యాఖ్యానించదలుచుకోలేదు. ఎవరి వ్యాఖ్యానం వారిది. దాని మంచిచెడులూ వారివే. కాని మనుస్మృతి చక్కగా చదువకదాన్ని వ్యాఖ్యానించడం మాత్రం కూడదంటాను. చారిత్రకాంశాన్ని కూడా దృష్టిలో పెట్టుకొంటే మంచిదంటాను. నా ప్రయత్నమంతా వారికి ముడిసరుకును స్వచ్ఛంగా అందించేవరకే.

నా ప్రయత్నానికి ధైర్యవచనాలతో తమ ఆమోదం తెలుపుతూ మంగళా శాసనం తెల్పిన శ్రీ శ్రీ శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ చినజీయర్ స్వామివారికి దాసోహములు.

పుస్తక ముద్రణ అధిక ఆర్థిక భారంతో కూడుకున్నపని. అందులోనూ 400 పేజీలున్న ఈ పుస్తకం ప్రింటు చేయాలంటే మరీకష్టం. దీనికి ధార్మిక గ్రంథ ప్రచురణ క్రింద 20 వేల రూపాయల ఆర్థిక సహాయ మందించిన తిరుమల తిరుపతి దేవస్థానం కార్య నిర్వహణాధికారి డా॥ ఐ.వి. సుబ్బారావుగారు ఐ.ఎ.ఎస్ గారికి నా కృతజ్ఞతాభివందనలు.

ఈ గ్రంథానికి ముందు మాట వ్రాస్తూ మనుస్మృతిని అందలి విశేషాలను పాఠకులకు పరిచయం చేసిన అస్మద్గురువరేణ్యులు కాకతీయ విశ్వావిద్యాలయం ఆర్ట్సుశాఖ డీన్ ఆచార్య హరి శివకుమార్ గారికి నా హృదయపూర్వక కృతజ్ఞతాంజలులు.

మనుస్మృతి తాత్పర్య రచన మొదలుపెట్టినప్పటినుండి అన్నివిధాల సహకారమందిస్తున్న నంగారెడ్డి ప్రభుత్వకళాశాల తెలుగుశాఖ అధ్యక్షులు డా॥ కె. నరసింహాచార్యులగారికి

నా అన్ని రచనలలోను చేదోడు వాదోడుగా ఉన్న నా శ్రీమతి రంగనాయకమ్మకు

నా పుస్తకాలకన్నిటికి అందంగా ఆలోచనాత్మకంగా ముఖపత్రాలందిస్తున్నట్లే దీనికీ చక్కగా ముఖపత్రాన్ని అందించిన సోదరుడు యన్. వేణుగోపాలచార్యులకు

ఓపికతో చక్కగా డి.టి.పి పనిచేసిపెట్టిన డి.బి. గ్రాఫిక్స్ అధినేత జి. భూపాల్‌రెడ్డిగారికి

సరియైన సలహాలందిస్తూ అందంగా తీర్చిదిద్ది సకాలంలో ఈ పుస్తకాన్ని అందించిన దత్తసాయి గ్రాఫిక్స్ నిర్వాహకులు శ్రీమతి జి.ఎస్. లక్ష్మిగారికి

ఇంకా ఎందరో మహానుభావులు

అందరికీ నా హృదయపూర్వక వందనములు.

మీ

**యన్. యల్. నరసింహాచార్య**

అలువాల

21-2-2000

# విషయానుక్రమణిక

## ప్రథమాధ్యాయం



## ద్వితీయాధ్యాయం

## మూడవ అధ్యాయం

## చతుర్థాధ్యాయం

## పంచమాధ్యాయం



## షష్ఠాధ్యాయం



## సప్తమాధ్యాయం

## అష్టమాధ్యాయము

## నవమాధ్యాయం



## దశమాధ్యాయం

## ఏకాదశాధ్యాయం



## ద్వాదశాధ్యాయం

శ్రీ లక్ష్మీనరసింహాయనమః

స్వస్తిరస్తు

# మనుస్మృతి

*శ్లో॥ మను మేకాగ్ర మాసీన మభిగమ్య మహర్షయః,*
*ప్రతిపూజ్య యథాన్యాయ మిదం వచనమబ్రువన్. 1.*

ఒకప్పుడు మనువు ఏకాంతస్థలంలోఉండి ధ్యానము చేసికొనే సమయంలో ఋషులందరు అతని దగ్గరకు పోయి అతనిని భక్తి శ్రద్ధలతో గౌరవించి ఈ విధంగా పలికిరి-

*భగవన్ సర్వవర్ణానాం యథావదనుపూర్వశః*
*అంతర ప్రభవాణాం చ ధర్మాన్నో వక్తు మర్హసి. 2*

*త్వమేకో హ్యస్య సర్వస్య విధానస్య స్వయంభువః,*
*అచింత్యస్యాప్రమేయస్య కార్యతత్త్వార్థవిత్ప్రభో. 3*

ఓ పరమ పూజ్యుడా సమస్తవర్ణాలు, ఆయా వర్ణాలకు సంబంధించిన తెగలవారు అనుష్ఠింపవలసిన ధర్మాలన్నటిని మాకు తెలుపుము. నీ వొక్కడవే బ్రహ్మదేవుని యొక్క సమస్తసృష్టి ధర్మాలనెరిగినవాడవు. అట్లే మానవులు చేయువలసిన కార్యాలు, తెలిసికొనవలసిన తత్వాన్ని గుర్తించిన వాడవు నీవొకడవే. అందువలన మానవులు అనుష్ఠింపవలసిన ధర్మములను మాకు తెలుపుమని కోరినారు.

*స తైఃపృష్టస్తథా సమ్యగమితౌజా మహాత్మభిః*
*ప్రత్యువాచార్చ్య తా న్సర్వాన్మహర్షీంచ్ఛ్రూయతామితి. 4*

ఈ విధముగా నా మహాత్ములు మనువును ప్రశ్నింపగా అతడు వారిని గౌరవించుచు ఇట్లు పలికెను.

సృష్టిక్రమము :-

*ఆసీదిదం తమోభూతమప్రజ్ఞాతమలక్షణం,*
*అప్రతర్క్యమవిజ్ఞేయం ప్రసుప్త మివ సర్వతః 5*

ప్రళయానంతరం ఈ ప్రపంచ మంతా తమోమయమై గుర్తించుటకు వీలులేని స్థితిలో నిద్రాణమైనట్లుండెను.

*తతః స్వయంభూర్భగవానవ్యక్తో వ్యంజయన్నిదం*
*మహాభూతాది వృత్తౌజాః ప్రాదురాసీ త్తమోనుదః 6*

*యోఽ సావతీంద్రియగ్రాహ్యః సూక్ష్మోఽ వ్యక్త స్సనాతనః,*
*సర్వభూతమయోఽ చింత్యః స ఏవ స్వయముద్బభౌ.7*

ఆ ప్రళయకాలానంతరం బాహ్యేంద్రియాలకు కనిపించని స్వయంవ్యక్తమైన ఆ భగవంతుడు ప్రపంచమందలి చీకట్లను తొలిగించుచు ఆకాశము మొదలగు

పంచమహాభూతములు మొదలగువాటిని సృష్టిచేయదలచి తనంతటతానే ప్రత్యక్షమయ్యెను. ఆ పరమాత్మ మనస్సునకు మాత్రమే కనిపిస్తాడు. అతడు సూక్ష్మరూపుడు, వ్యక్తముకానివాడు, సనాతనుడు అచింత్యుడు. అట్టి భగవంతుడు తానే స్వయంగా ఆవిర్భవించెను.

*సోఽభిధ్యాయ శరీరత్స్వాత్ సిసృక్షు ర్వివిధాః ప్రజా ః*
*ఆప ఏవ ససర్జాదౌ తాసు బీజమవాసృజత్. 8*

*తదండమభవద్ధైమం సహస్రాంశుసమప్రభం*
*తస్మిన్ జజ్ఞే స్వయం బ్రహ్మా సర్వలోకపితామహః 9*

ఆ పరమాత్మ తన శరీరమునుండి వివిధప్రాణికోట్లను సృష్టింపదలచి, తొలుత జలమును సృష్టించెను. తరువాత ఆజలమున మహదాదిసృష్టికి కారణభూతమైన తన బీజమును ఉంచెను. ఆ బీజమే పరమాత్మయొక్క ఇచ్ఛాశక్తి ననుసరించి మిక్కిలి పరిశుద్ధమైన బ్రహ్మాండమయ్యెను. ఆ బ్రహ్మాండమున సమస్తలోక సృష్టికి కారణుడైన బ్రహ్మదేవుడుదయించెను.

ప్రస్తుతము సమస్తపురాణప్రసిద్ధమైన నారాయణ శబ్దార్థమును చెప్పుచు పైన తాను పేర్కొన్నదానికి సమన్వయము చేయుచున్నాడు.

*ఆపో నారా ఇతి ప్రోక్తా ఆపో వై నరసూనవః,*
*తా యదస్యాయనం పూర్వం తేన నారాయణః స్మృతః 10*

నీటిని నారలని అంటారు ఈ నీరు నరుడని ప్రసిద్ధిగాంచిన పరమాత్మచే సృష్టింపబడ్డాయి. అవి ఆతని యొక్క సంతానంవంటివి. అట్టి నారములు (నీరు) నిలయముగా గల పరమాత్ముని నారాయణుడని పిలుస్తారు.

*యత్తత్కారణమవ్యక్తం నిత్యం సదసదాత్మకం,*
*తద్విసృష్టః స పురుషో లోకే బ్రహ్మేతి కీర్త్యతే. 11*

*తస్మిన్నండే స భగవానుషిత్వా పరివత్సరం,*
*స్వయమేవాత్మనో ధ్యానాత్తదండమకరోత్ ద్విధా. 12*

*తాభ్యాం సశకలాభ్యాం చదివంభూమించనిర్మమే,*
*మద్యేవ్యోమ దిశశ్చాష్టావపాం స్థానం చ శాశ్వతం . 13*
*ఉద్బబర్హాత్మనశ్చైవ మనస్సదసదాత్మకమ్,*
*మనసశ్చాప్యహంకార మభిమంతారమీశ్వరమ్. 14*

అట్టి పరమాత్మ సమస్త చరాచరసృష్టికి కారణభూతుడు. నిత్యుడు సదసత్ స్వరూపుడు. అట్టి పరమాత్మచే సృష్టింపబడ్డ పురుషుడినే బ్రహ్మదేవుడని పిలుస్తున్నాము. ఆ బ్రహ్మదేవుడు ఇంతకుముందు చెప్పబడిన బ్రహ్మాండమున ఒక సంవత్సరముండి తన ధ్యానశక్తిచే ఆ అండమును రెండు భాగములు చేసినాడు. ఆ హేమాండముయొక్క రెండు భాగములలో పై భాగమును స్వర్గముగా క్రింది భాగమును భూమిగా చేసెను. అట్లే రెండిటి యొక్క మధ్యనున్న భాగమున ఆకాశమును, అష్టదిక్కులను, నీటికి

శాశ్వతస్థానమైన సముద్రమును సృష్టించెను. అట్లే తన యొక్క ఆత్మనుండి (సత్ అసత్) సదసద్రూపమైన మనస్సును, ఆ మనస్సుకు ముందు అహంకారమును సృష్టించెను.

*మహాంతమేవ చాత్మానం సర్వాణి త్రిగుణాని చ,*
*విషయాణాం గ్రహీత్రూణి శనైః పంచేంద్రియాణి చ. 15*

*తేషాం త్వవయవాన్సూక్ష్మా న్ షణ్ణామప్యమితౌజసామ్,*
*సన్ని వేశ్యాత్మ మాత్రసు సర్వభూతాని నిర్మమే. 16*

మహత్తత్వాన్ని, 'సత్వరజస్తమోగుణా'లను త్రిగుణాలను, శబ్దస్పర్శరూప రస గంధాల'ను, వాటి తత్వాలను గ్రహించే శ్రోత్రాది పంచజ్ఞానేంద్రియాలను, వాగాది పంచకర్మేంద్రియాల సూక్ష్మరూపములను సృష్టించెను. ఇంకా అనంతమైన శక్తిగల అహంకారాన్ని పంచేంద్రియాలయొక్క సూక్ష్మావయవాలను అయా ఆత్మవికారములలో చేర్చి చరాచరసమస్త సృష్టిని చేసెను.

*యన్మూర్త్యవయవాస్సూక్ష్మా స్త స్యేమాన్యాశ్రయంతి షట్,*
*తస్మా చ్ఛరీర మిత్యాహు స్తస్య మూర్తిం మనీషిణః. 17*

*తదా విశంతి భూతాని మహాంతి సహ కర్మభిః,*
*మనశ్చావయవైస్సూక్ష్మై స్సర్వభూతకృదవ్యయమ్. 18*

అహంకారం మరియు పంచేంద్రియాలకు ఆశ్రయమైయున్నందువల్ల దీనిని శరీరమంటారు. శబ్దాది పంచతన్మాత్రలరూపంలోఉన్న ఆకాశాదిపంచమహాభూతాలు తమ తమ కర్మలతో ఆత్మను ఆశ్రయిస్తున్నవి. అట్లే మనస్సు తన సూక్ష్మకర్మలతో ఆత్మను ఆశ్రయించింది.

*తేషా మిదం తు సప్తానాం పురుషాణాం మహౌజసామ్,*
*సూక్ష్మాభ్యో మూర్తిమాత్రాభ్య స్సంభవత్యవ్యయాద్వ్యయమ్ 19*

*ఆద్యాద్యస్య గుణం త్వేషా మవాప్నోతి పరః పరః,*
*యో యో యావతిథశ్చైషాం స స తావద్గుణః స్మృతః. 20*

నాశనములేని మహదహంకార పంచేంద్రియాలయొక్క సూక్ష్మతత్వాలనుండి నశించునటువంటి శరీరమేర్పడుతున్నది. అట్లే ఆకాశ వాయ్వగ్ని,జల,పృథివీ తత్వాలైన శబ్దస్పర్శ,రూప,రస గంధాలనే పంచభూతాల గుణాలు ఒకదానికంటె మరియొక దానికి ఎక్కువగా నున్నవి. అది ఎట్లనగా ఆకాశం శబ్దమాత్రగుణకం కాగా వాయువులో తన గుణమైన స్పర్శతో పాటు ఆకాశగుణమైన శబ్దంకూడ ఉంది. అగ్నిలో శబ్ద స్పర్శరూపగుణాలున్నవి. నీటిలో శబ్దస్పర్శరూపరసగుణాలున్నవి. గంధతత్వముగల పృథివి శబ్దస్పర్శరూపరస గుణములను కల్గివున్నది. ఈ విధంగా పూర్వ భూతముల గుణాలు తరువాతి పంచమహాభూతాలకు సంక్రమిస్తున్నవి.

*సర్వేషాం తు స నామాని కర్మాణి చ పృథక్ పృథక్,*
*వేదశబ్దేభ్య ఏవాదౌ పృథక్ సంస్థాశ్చ నిర్మమే. 21*

ఈ విధంగా హిరణ్యగర్భుడను పేరున్న ఆ బ్రహ్మదేవుడు సమస్త జీవకోటిని సృష్టించి ఆయాజీవులకు ప్రత్యేకమైన పేర్లను పెట్టి, ఆయా జీవకోటి చేయదగు కర్మను కూడ ప్రత్యేకంగా ఏర్పాటుచేసెను. ఆయా జీవుల పేర్లు అవి చేయాల్సిన కార్యాలతనికి వేదంనుండే తెలిసినవి. వేదాలు అపౌరుషేయాలు కావున తనకన్న పూర్వమే ఉండిన వేదాలను బ్రహ్మదేవుడు పరమాత్మనుండి పొంది ఆ వేదాలననుసరించి సృష్టి తదితర కార్యాలను చేసినాడు

*కర్మాత్మనాం చ దేవానాం సోऽసృజత్ప్రాణినాం ప్రభుః,*
*సాధ్యానాం చ గణం సూక్ష్మం యజ్ఞం చైవ సనాతనమ్. 22*

*అగ్ని వాయురవిభ్యస్తు త్రయం బహ్మసనాతనమ్,*
*దుదోహ యజ్ఞసిద్ధ్యర్థమృగ్యజుస్సామలక్షణమ్. 23*

బ్రహ్మ కర్మాత్మలైన దేవతలను, సాధ్యులను ఇతర దేవతావిశేషమును సనాతనమైన జ్యోతిష్టోమాదియజ్ఞాలను సృష్టించెను. అగ్ని,వాయు రవి దేవతలనుండి సనాతనములైన వేదాలను గ్రహించినాడు. ఈ వేదాలవల్ల సనాతనాలైన యజ్ఞాలొనరించుటకు వీలైనది.

*కాలం కాలవిభక్తీశ్చ నక్షత్రాణి గ్రహాం స్తథా,*
*సరిత స్సాగరాన్ శైలాన్ సమాని విషమాణి చ. 24*
*తపో వాచం రతిం చైవ కామం చ క్రోధమేవ చ,*
*సృష్టిం ససర్జ చైవేమాం స్రష్టు మిచ్ఛన్నిమాః ప్రజాః. 25*

అట్లే సంవత్సరం ఆయనం ఋతువు, మాసం మొదలైన కాల విశేషాన్ని, అశ్విన్యాది నక్షత్రాలను, సూర్యాదిగ్రహాలను, నదులను, సముద్రాలను, పర్వతాలనన్నిటిని అతడు సృష్టించెను. అదే విధముగా తపస్సు, మంచి మాటలు, కామము, కోపము మొదలగువాటిని తాను సృష్టించిన దేవ మానవాదులకొరకు సృష్టించెను.

*కర్మణాం చ వివేకార్థం ధర్మాధర్మౌ వ్యవేచయత్,*
*ద్వంద్వైరయోజయచ్చేమాః సుఖదుఃఖాదిభిః ప్రజాః. 26*

మంచి చెడుపనులను, వివేకంతో తెలిసి కొనుటకు ధర్మాధర్మములనేర్పరచెను. దీనివలన ప్రాణులకు సుఖదుఃఖాది ద్వంద్వములు కలుగునట్లు చేసెను.

*అణ్వ్యోమాత్రా వినాశిన్యో దశార్ధానాం తు యాః స్మృతాః,*
*తాభి స్సార్థ మిదం సర్వం సంభవత్యనుపూర్వశః. 27*

పంచతన్మాత్రలు వాటి పరిణామరూపాలైన పంచమహాభూతాలవల్ల ఈ సృష్టియంతయు ఏర్పడుచున్నది.

*యంతు కర్మణి యస్మిన్ స న్యయుంక్త ప్రథమం ప్రభుః,*
*స తదేవ స్వయం భేజే సృజ్యమానః పునః పునః. 28*
*హింస్రాహింస్రే మృదుక్రూరే ధర్మాధర్మావృతానృతే*
*యద్యస్యసోऽదధాత్సర్గే తత్తస్య స్వయమావిశత్. ॥ 29*

3

ప్రథమాధ్యాయం

*యథుర్తులింగాన్యృతవః స్వయమేవర్తుపర్యయే,*
*స్వాని స్వాన్యభిపద్యంతే తథా కర్మాణి దేహినః.30*

బ్రహ్మదేవుడు తన సృష్టి ప్రారంభంలో ఆయా జాతులకనుమతించినకర్మలే తరువాతి కాలంలోని ఆయాజాతులు చేయునట్లు చేసినాడు. సింహవ్యాఘ్రాదిజంతువులను హింస్రములుగను, లేడి గోవు మొదలగు వాటిని సాధుజంతువులుగా, బ్రాహ్మణాదులను దయా ప్రధానులుగా, క్షత్రియాదులను కఠోర స్వభావులుగా బ్రహ్మచర్యాదులు గురుశుశ్రూషాదులు ధర్మములుగా, హింసచేయుట ఇతరుల దూషించుట మొదలగువాటిని అధర్మములుగా, సత్యాసత్యములు చెప్పుట మొదలగువాటిని సృష్ట్యాదియందు ఏర్పరచినట్లే తరువాతి కాలమున కూడ ఏర్పరచెను. అట్లే వసంతాది ఋతుచిహ్నములు ఆయా ఋతువులకు కలుగుచున్నట్లే హింస్రాది గుణములు మానవులకబ్బుచున్నవి.

*లోకానాం తు వివృద్ధ్యర్థం ముఖబాహూరుపాదతః,*
*బ్రాహ్మణం క్షత్రియం వైశ్యం శూద్రం చ నిరవర్తయత్.31*

లోకములు అభివృద్ధి చెందుటకు తన ముఖము, బాహువులు, ఊరువులు, పాదములనుండి వరుసగా బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్ర వర్ణములనేర్పరచెను. (దీనిని కులమను సామాన్య దృష్టితో కాక నేటి సాంఘిక దృష్టితో చూచినా ఈ నాలుగు వర్గములెచ్చటనైనను ఎప్పుడైనను ఉండక తప్పవు. ఏ సంఘమునందైనను మేధావులు, కార్యనిర్వాహకులు, వారికి సహాయకులైన ఉద్యోగులు, నాలుగవ తరగతి యుద్యోగులు అను వర్గము ఉండకతప్పదు కదా. కాని నాటి సంఘ పద్ధతి ననుసరించి అది వంశక్రమముగా ఉండేది. కాని నేడు ఆ ఆచారము సమసిపోవుచున్నది. నిన్న మొన్నటివరకు రెడ్డికము (పటేల్‌గిరి) పట్వారీతనం వంశపారంపర్యంగా వచ్చుట అందరెరిగిందే).

*ద్విధా కృత్వాత్మనో దేహ మర్థేన పురుషో ऽ భవత్,*
*అర్థేన నారీ తస్యాం స విరాజమసృజత్ప్రభుః. 32*

*తపస్తప్త్వాऽ సృజద్యంతు సస్వయం పురుషోవిరాట్*
*తం మాం విత్తాస్య సర్వస్య స్రష్టారం ద్విజసత్తమాః 33*
*పతీన్ప్రజానామసృజం మహర్షీనాదితో దశ॥*
*మరీచిమత్ర్యంగిరసౌ పులస్త్యం పులహం క్రతుం. 34*

*అహం ప్రజాస్సిసృక్షుస్తు తపస్తప్త్వా సుదుశ్చరమ్,*
*ప్రచేతసం వసిష్ఠం చ భృగుం నారదమేవ చ. 35*

ఆ బ్రహ్మదేవుడు తన దేహాన్ని రెండుగా విభజించుకొని ఒక భాగమును స్త్రీ స్వరూపంగా రెండవభాగమును పురుషుడుగా ఏర్పరచుకొని ఆ స్త్రీయందు విరాట్ సంజ్ఞగల పురుషునికి జన్మనిచ్చినాడు. ఆ విరాట్పురుషుడు చాలాకాలము తపస్సుచేసి ఈ సమస్త సృష్టికి మూల పురుషుడగు నన్ను (మనువును) సృష్టించెను. నేను కూడ ప్రజలను సృష్టింపదలచి దుష్కరమైన తపస్సు చేసినాను. ఆ తప ప్రభావం వల్ల ప్రజాపతులైన

మహర్షులను తొలుత సృష్టిచేసినాను. వారు మరీచి, అత్రి, అంగీరసుడు, పులస్త్యుడు, పులహుడు, క్రతువు, ప్రచేతసుడు, వసిష్ఠుడు, భృగు, నారదుడు అనేవారు.

*ఏతే మనూంస్తు సప్తాన్యా నసృజన్ భూరితేజసః,*
*దేవాన్ దేవనికాయాంశ్చ మహర్షీంశ్చామితౌజసః. 36*

ఈ మరీచి మొదలగు ప్రజాపతులు, గొప్ప తేజస్సుగల సప్తమనువులను, బ్రహ్మదేవుడు సృష్టించని ఇతర దేవతలను, దేవతలు నివసించు స్వర్గాదిస్థానములను అధికతేజోవిరాజితులైన మహర్షులను సృష్టించినారు.

*యక్షరక్షఃపిశాచాంశ్చ గంధర్వాప్సరసో సురాన్,*
*నాగాన్ సర్పాన్సుపర్ణాంశ్చ పితౄణాం చ పృథగ్గణాన్. 37*

*విద్యుతోऽ శనిమేఘాంశ్చ రోహితేంద్రధనూంషిచ,*
*ఉల్కా నిర్ఘాత కేతూంశ్చ జ్యోతీంష్యుచ్చావచాని చ. 38*

*కిన్నరాన్వానరాన్మత్స్యాన్ వివిధాంశ్చ విహంగమాన్,*
*పశూన్మృగాన్మనుష్యాంశ్చ వ్యాళాంశ్చోభయతోదతః. 39*

*క్రిమికీటపతంగాంశ్చ యూకామక్షిక మత్కుణమ్,*
*సర్వం చ దంశమశకం స్థావరం చ పృథగ్విధమ్. 40*

*ఏవమేతైరిదంసర్వం మన్నియోగాన్మహాత్మభిః*
*యథాకర్మ తపోయోగాత్ సృష్టం స్థావరజంగమం 41*

అదేవిధంగా యక్షులు, రాక్షసులు, పిశాచులు, గంధర్వులు, అప్సరసలు, అసురులు, వాసుకి మొదలైన శ్రేష్ఠమైన నాగులను, అలగర్దుడు మొదలైన సాధారణ సర్పాలను, గరుత్మంతుడు మొదలైన పక్షులను, పితృగణము వేరు వేరుగాసృష్టిచేసినారు. అట్లే మేఘాలను అందుకనిపించే మెరుపులను, ఉరుములను, ఇంద్రధనుస్సులను, పిడుగులను, తోకచుక్కలు మొదలైన వాటిని వారు సృష్టిచేసినారు. ఇంకా కిన్నరులనే దేవతాగణాన్ని, వానరులను, చేపలను, వివిధములైన పక్షులను, పశువులను, మృగములను, మనుష్యులను, సింహం మొదలైన మృగరాజులను ఉభయదంతములు కల ప్రాణికోటిని సృష్టించిరి. క్రిమికీటకములను ఉసిళ్ళు మొదలగువాటిని, యూకములు, ఈగలు, నల్లులు మొదలైన జీవ జంతువులను,వృక్షములు మొదలగు స్థావరములనన్నిటిని ఆ ప్రజాపతులు సృష్టిచేసిరి.

ఈ విధముగా నా యొక్క ప్రేరేపణవలన మరీచ్యాది ప్రజాపతులు తపమాచరించి తత్ప్రభావంవలన చరాచరసృష్టిని చేసినారు.

*యేషాం తు యాదృశం కర్మ భూతానా మిహకీర్తితమ్,*
*తత్తథా వోऽ భిధాస్యామి క్రమయోగం చ జన్మని. 42*

ప్రస్తుతము ఆయా ప్రాణులు చేయాల్సిన కర్మలు వాటి జన్మాదిక్రమము మొదలైన విశేషాలన్నిటిని మీకు చెప్పెదను” అని మనువు చెప్పసాగెను.

*పశవశ్చ మృగాశ్చైవ వ్యాళాశ్చోభయతోదతః,*
*రక్షాంసి చ పిశాచాశ్చ మనుష్యాశ్చ జరాయుజాః. 43*

*అండజాః పక్షిణస్సర్పా నక్రా మత్స్యాశ్చ కచ్ఛపాః,*
*యాని చైవంప్రకారాణి స్థలజాన్యౌదకాని చ. 44*

*స్వేదజం దంశమశకం యూకామక్షిక మత్కుణమ్,*
*ఊష్మణశ్చోపజాయంతే యచ్చాన్యత్కించిదీదృశమ్. 45*

పశువులు, మృగములు, రాక్షసులు, పిశాచములు, మనుష్యులు మొదలగు వారు గర్భమునుండి పుట్టుదురు. పక్షులు, సర్పములు, మొసళ్ళు మొదలైనవి చేపలు, తాబేళ్ళు మొదలైన జలచరాలు, స్థలచరాలు అండములనుండి పుట్టును. దోమలు, ఈగలు, నల్లులు మొదలగునవి ఉష్ణము వల్ల పుట్టును.

*ఉద్భిజ్జాస్థావరాస్సర్వే బీజకాండప్రరోహిణః,*
*ఓషధ్యః ఫలపాకాంతా బహుపుష్పఫలోపగాః 46*

*అపుష్పాః ఫలవంతో యే తే వనస్పతయః స్మృతాః,*
*పుష్పిణః ఫలినశ్చైవ వృక్షాస్తూభయతః స్మృతాః, 47*

*గుచ్ఛగుల్మం తు వివిధం తథైవ తృణజాతయః,*
*బీజకాండరుహాణ్యేవ ప్రతానా వల్ల్య ఏవ చ. 48*

*తమసా బహురూపేణ వేష్టితాః కర్మ హేతునా,*
*అంతస్సంజ్ఞా భవంత్యేతే సుఖదుఃఖసమన్వితాః. 49*

చెట్లు రెండు విధములుగా నున్నవి. కొన్ని చెట్లు బీజాల వల్ల అంకురించి పెరుగగా మరికొన్ని ఆ చెట్టు కొమ్మనే భూమిలో నాటినందువల్ల చెట్లై పెరుగుతున్నాయి. కొన్ని చెట్లు ఫలమునిచ్చే వరకు ఉండగా మరికొన్ని చెట్లు అనేక పుష్పములు, ఫలములతో చాలాకాలము బ్రతుకుతున్నాయి. పువ్వులు లేక ఫలించువానిని వనస్పతులందురు. తక్కినవి పూవులు పూసిన తరువాత ఫలిస్తాయి. ఇంకను తీగచెట్లు కొన్ని, పొదగా ఉండు చెట్లుకొన్ని కన్పిస్తున్నాయి. అట్లే తృణజాతులు కూడ కన్పిస్తున్నాయి. ఈ వృక్షజాతియంతా విచిత్ర దుఃఖఫలము అధర్మరూపకర్మకారణమైన తమోగుణంతో కూడుకొన్నందువల్ల వాటికి అంతశ్చైతన్యం మాత్రముంది. అనగా వృక్షాలకు కూడ సుఖదుఃఖములున్నా మానవులు ఇతర జంతువులవలె వాటిని బాహ్యముగా ప్రకటించు సామర్థ్యము మాత్రము వాటికి లేదు.

*ఏతదంతాస్తు గతయో బ్రహ్మాద్యాస్సముదాహృతాః,*
*ఘోరేz స్మిన్ భూతసంసారే నిత్యం సతతయాయిని. 50*

ఈ విధంగా ఈ ప్రపంచమున కనిపించు జీవజాతుల యొక్క బ్రహ్మమొదలుకొని వృక్షాదిస్థావరాల యొక్క సృష్టిక్రమాన్ని మీకు వివరించితిని.

*ఏవం సర్వం స సృష్ట్వేదం మాం చాచింత్యపరాక్రమః,*

*ఆత్మన్యంతర్దధే భూయః కాలం కాలేన పీడయన్. 51*

బ్రహ్మదేవుడీ విధంగా సమస్త చరాచర ప్రపంచమును సృష్టించి కొంతకాలమైన తరువాత దానిని నశింపజేయుచు తాను కూడ శరీరత్యాగము చేయును.

*యదా స దేవో జాగర్తి తదేదం చేష్టతే జగత్,*

*యదా స్వపితి శాంతాత్మా తదా సర్వం నిమీలతి. 52*

*తస్మిన్ స్వపతి సుస్థే తు కర్మాత్మానశ్శరీరిణః,*

*స్వకర్మభ్యో నివర్తంతే మనశ్చ గ్లానిమృచ్ఛతి. 53*

*యుగపత్తు ప్రలీయంతే యదా తస్మిన్ మహాత్మని,*

*తదాయం సర్వభూతాత్మా సుఖం స్వపితి నిర్వృతః. 54*

ఆ బ్రహ్మదేవుడు మేలుకొని యున్నంతవరకు ఈ ప్రపంచం మేల్కొనియుంటుంది. శాంతస్వరూపుడైన ఆ దేవుడు నిద్రపోయినపుడు ఈ జగమంతా లయం చెందుతున్నది. ఆతడు నిత్య వ్యవహారాలను వదిలిపెట్టి నిద్రపోవు సమయాన తమ తమ కర్మలననుసరించి జన్మలనెత్తిన ఈ ప్రాణులన్నీ లయము చెంది తమతమ కర్మలకు దూరమై మనః ప్రవృత్తిని సహితము కోల్పోవుచున్నవి. అదే ప్రళయకాలము. అప్పుడు ఆ బ్రహ్మదేవుడు సహితము తన కర్మకు దూరమై మనఃప్రవృత్తిని కోల్పోయి శరీరత్యాగము చేయుచున్నాడు. ఈ చరాచరసృష్టి యంతయు పరమాత్మ యందే విలీనమగుచున్నది. దీనినే మహాప్రళయమని అంటారు.

**మరణము :-**

*తమోఽ యంతు సమాశ్రిత్య చిరం తిష్ఠతి సేంద్రియః*

*నచస్వం కురుతే కర్మ తదో త్క్రామతి మూర్తితః 55*

జీవుడు జ్ఞానరహితుడై ఇంద్రియములతో ఉన్నప్పటికీ ఉచ్ఛ్వాసనిశ్వాసముల నిర్వర్తించలేని స్థితిలో నున్నప్పుడు మరణము జరుగుతున్నది.

*యదాణుమాత్రికో భూత్వా బీజం స్థాస్ను చరిష్ణు చ,*

*సమావిశతి సంసృష్టస్తదా మూర్తిం విముంచతి. 56*

జీవుడు సూక్ష్మరూపమున నుండి స్థావరము లేక జంగమమైన బీజమున ప్రవేశించి స్థూలశరీరాన్ని గ్రహిస్తున్నాడు.

*ఏవం సజాగ్రత్స్వప్నాభ్యామిదం సర్వం చరాచరమ్,*

*సంజీవయతి చాజస్రం ప్రమాపయతి చావ్యయః 57*

బ్రహ్మదేవుడీ విధంగా తాను మేల్కొని యున్నప్పుడు ఈ చరాచరజీవసృష్టినంతయు చేయుచున్నాడు. అట్లే నిదురపోతున్నపుడు ఈ జంతుజాలమునంతయు లయము చేయుచున్నాడు.

*ఇదం శాస్త్రం తు కృత్వాసౌ మామేవ స్వయమాదితః,*
*విధివద్గ్రాహయామాస మరీచ్యాదీంస్త్వహం మునీన్. 58*

*ఏతద్వోయం భృగు శ్శాస్త్రం శ్రావయిష్యత్యశేషః*
*ఏతద్ధి మత్తోఽధిజగే సర్వమేషోఽఖిలం మునిః 59*

బ్రహ్మ మానవులనుష్ఠించవలసిన ధర్మములకు సంబంధించిన ఈ శాస్త్రాన్ని నిర్మించి తొలుత నాకుపదేశించెను. ఈ మానవ ధర్మశాస్త్రమును మరీచి మొదలగు మహర్షులకు నేను ఉపదేశించితిని. దీనిని మీకు భృగుమహర్షి ఉపదేశము చేయును.

*తతస్తథా స తేనోక్తో మహర్షి ర్మనునా భృగుః*
*తాన బ్రవీదృషీన్ సర్వాన్ ప్రీతాత్మా శ్రూయతామితి. 60*

ఈ విధముగా మనువు అచ్చటనున్న మునులతో చెప్పగా భృగుమహర్షి సంతోషముతో వారికిట్లు చెప్పసాగెను.

*స్వాయంభువస్యాస్య మనోః షడ్వంశ్యా మనవోఽపరే,*
*సృష్టవంతః ప్రజాః స్వాస్వా మహాత్మానో మహౌజసః 61*

*స్వారోచిషశ్చోత్తమశ్చ తామసో రైవత స్తథా,*
*చాక్షుషశ్చ మహాతేజా వివస్వత్సుత ఏవ చ . 62*

*స్వాయంభువాద్యా స్సప్తైతే మనవో భూరితేజసః,*
*స్వే స్వేంఽతరే సర్వమిదముత్పాద్యాపుశ్చరాచరం. 63*

బ్రహ్మదేవుని పుత్రుడైన ఈ స్వాయంభువ మనువు వంశంలో ఆరుగురు మనువులు పుట్టిరి. వారు ఆయా కాలములలో ప్రజాసృష్టి చేసినారు. స్వారోచిషుడు, ఉత్తముడు, తామసుడు, రైవతుడు, చాక్షుషుడు, వైవస్వతుడనునవి ఆ మనువుల పేర్లు. స్వాయంభువ మనువు మొదలైన ఈ ఏడుగురు మనువులు వారివారి కాలములలో ఈ సృష్టినంతయు చేసి పరిపాలించినారు.

**కాలప్రమాణము :-**

*నిమేషా దశ చాష్టౌ కాష్ఠా త్రింశత్తు తాః కలా :*
*త్రింశత్కాలా ముహూర్తస్స్యాదహోరాత్రం తు తావతః 64*

*అహోరాత్రే విభజతే సూర్యో మానుషదైవికే,*
*రాత్రిస్స్వప్నాయ భూతానాం చేష్టాయై కర్మణామహః 65*

పదునెనిమిది నిమిషములను (రెప్పపాటుకాలాన్ని) కాష్ఠయని అంటారు. ముప్పై కాష్ఠములు కళయౌతుంది. ముప్పై కళలు ముహూర్తమను పేర ప్రసిద్ధి చెందింది. ఇట్లే రాత్రిపగలు ఏర్పడుచున్నవి. వీటిలో పగలు దేవగణమునకు రాత్రి పితృగణమునకు సంబంధించినవి. సూర్యుడు ఈ రాత్రింబగళ్లను కల్పిస్తున్నాడు. పగటి కాలమున భూతగణమంతా తమతమ కార్యాలను చేసికొనుచు రాత్రికాలమున నిద్రబోతున్నది.

*పిత్ర్యే రాత్ర్యహనీ మాసః ప్రవిభాగస్తు పక్షయోః,*
*కర్మచేష్టాస్వహః కృష్ణః శుక్లస్స్వప్నాయ శర్వరీ . 66*

*దైవే రాత్ర్యహనీవర్షం ప్రవిభాగస్తయోః పునః*
*అహస్తత్రో దగయనం రాత్రిః స్యాద్దక్షిణాయనం॥ 67*

మానవుల యొక్క నెల పితృలదేవతలకు ఒక దినము (రాత్రి, పగలు) ఈ మాసమును రెండు పక్షములుగా విభజించుచున్నారు. వీటిలో కృష్ణ పక్షము పితృదేవతలకు పగలు కాగా శుక్లపక్షము రాత్రియగుచున్నది. మానవులయొక్క సంవత్సరకాలము దేవతలకు ఒక దినము (రాత్రి, పగలు) అగుచున్నది. దీనియందు ఉత్తరాయణకాలము పగలు కాగా దక్షిణాయన కాలము రాత్రిగా పరిగణింపబడుతున్నది.

*బ్రాహ్మస్య తు క్షపాహస్య యత్ప్రమాణం సమాసతః,*
*ఏకైక శోయుగానాంతు క్రమశస్తన్నిబోధత 68*

ఇక బ్రహ్మదేవుని యొక్క దినమెట్లుండుననే విషయం ఒక్కొక్క యుగమున ఎన్ని సంవత్సరములుండుననే విషయమునంతయు మీకు ఎరిగింతును. అని భృగుమహర్షి చెప్పసాగెను.

*చత్వార్యాహుస్సహస్రాణి వర్షాణాం తు కృతం యుగమ్,*
*తస్య తావచ్ఛతీ సంధ్యా సంధ్యాంశశ్చ తథావిధః 69*

*ఇతరేషు ససంధ్యేషు ససంధ్యాంశేషు చ త్రిషు,*
*ఏకాపాయేన వర్తంతే సహస్రాణి శతాని చ. 70*

దివ్యములైన నాలుగువేల సంవత్సరములవరకు కృత యుగముండును. ఆ యుగ ప్రారంభమున నుండు సంధ్యాకాలము నాలుగు వందల దేవ వర్షములుండును. అట్లే కృతయుగం చివర కలుగు సంధ్యాంశము కూడ నాలుగు వందల దేవ వర్షములుంటుంది. ఇట్లే త్రేతాయుగం మూడు వేల దివ్య సంవత్సరాలు కాగా ఆ యుగము యొక్క సంధ్య, సంధ్యాంశలు మూడేసి వందల దివ్య సంవత్సరాలుంటాయి. ద్వాపరయుగం రెండువేల దివ్య సంవత్సరాలు కాగా ఆ యుగము యొక్క సంధ్య, సంధ్యాంశలు రెండేసి వందల దివ్య వర్షాలుంటాయి. చివరిదైన కలియుగం ఒక వేయి దేవ వర్షముల వరకుంటుంది. దాని సంధ్య, సంధ్యాంశలు రెండును వంద దివ్యసంవత్సరములుంటాయి.

*యదేతత్పరిసంఖ్యాతమాదావేవ చతుర్యుగమ్,*
*ఏతద్ద్వాదశ సాహస్రం దేవానాం యుగముచ్యతే. 71*

*దైవికానాం యుగానాం తు సహస్రం పరిసంఖ్యయా,*
*బ్రాహ్మ మేక మహః జ్ఞేయం తావతీ రాత్రి రేవ చ. 72*

*తద్వై యుగసహస్రాంతం బ్రాహ్మం పుణ్యం మహర్విదుః,*
*రాత్రించ తావతీమేవ తే z హోరాత్రవిదో జనాః 73*

ఈ విధంగా మానవులకు సంబంధించిన నాలుగు యుగాలు పన్నెండు వేల దివ్యవర్షాలుంటాయి. మానవులయొక్క నాలుగు యుగాలు దేవతలకొక యుగమౌతుంది. దేవతాయుగాలు వేయి గడిస్తే బ్రహ్మదేవునికొక పగలౌతుంది. అట్లే వేయి దేవతాయుగాలు బ్రహ్మదేవునికి ఒక రాత్రియౌతుంది. బ్రహ్మ యొక్క రాత్రింబగళ్ళ కాలమును చక్కగా తెలిసిన వానిని అహోరాత్రవిదుడని పండితులంటారు.

*తస్య సోZ హర్నిశస్యాంతే ప్రసుప్తః ప్రతిబుధ్యతే,*
*ప్రతి బుద్ధశ్చ సృజతి మనస్సదసదాత్మకమ్. 74*

పైన పేర్కొనబడ్డ బ్రహ్మదేవుని యొక్క రాత్రి గడిస్తే బ్రహ్మదేవుడు మేల్కొంటున్నాడు. పగలు గడిచినప్పుడు అతడు నిద్రబోతున్నాడు. ఆ దేవుడు నిద్రనుండి లేచిన తరువాత తొలుత మనస్సును సృష్టించినాడు.

*మనస్సృష్టిం వికురుతే చోద్యమానం సిసృక్షయా,*
*ఆకాశం జాయతే తస్మా త్తస్య శబ్దం గుణం విదుః 75*

*ఆకాశాత్తు వికుర్వాణాత్సర్వగంధవహశ్శుచిః,*
*బలవాన్ జాయతే వాయు స్సవై స్పర్శగుణో మతః 76*

*వాయోరపి వికుర్వాణా ద్విరోచిష్ణు తమోనుదమ్,*
*జ్యోతి రుత్పద్యతే భాస్వ త్తద్రూపగుణముచ్యతే. 77*

*జ్యోతిషశ్చ వికుర్వాణాదాపో రసగుణాః స్మృతాః,*
*అద్భ్యో గంధగుణా భూమి రిత్యేషా సృష్టిరాదితః 78*

సృష్టికై ప్రయత్నించు మనస్సునుండి ఆకాశం ఉద్భవించింది. దానిగుణం శబ్దం. ఆకాశంనుండి పవిత్రమైంది, మిక్కిలి బలముకలదియైన వాయువు ఆవిర్భవించింది. ఆ వాయువు యొక్క గుణము స్పర్శ. వాయువునుండి అగ్ని పుట్టింది. దాని గుణం రూపం. అగ్నినుండి రస గుణకమైన నీరు, నీటినుండి గంధగుణకమైన భూమి పుట్టింది.

ఇదీ సృష్టిక్రమం.

*యత్ ప్రాగ్ద్వాదశ సాహస్ర ముదితం దైవికం యుగమ్,*
*తదేకసప్తతిగుణం మన్వంతర మిహోచ్యతే. 79*

*మన్వంతరాణ్యసంఖ్యాని సర్గ స్సంహార ఏవ చ,*
*క్రీడన్నివైతత్కురుతే పరమేష్ఠీ పునఃపునః 80*

పన్నెండువేల దివ్య సంవత్సరాలు గల దివ్యమైన యుగాలు డెబ్భైఒకటి గడచినచో అది ఒక మన్వంతరకాలమౌతుంది. అట్టి మన్వంతరములు అసంఖ్యాకములు. అట్లే సృష్టి సంహారములసంఖ్యాకములు. బ్రహ్మ దేవుడు ఆడుకొనుచున్నట్లు వీటినన్నిటిని మాటిమాటికి చేయుచున్నాడు.

**యుగధర్మములు :-**

*చతుష్పా త్సకలో ధర్మః సత్యం చైవ కృతే యుగే,*
*నాధర్మేణాగమః కశ్చి న్మనుష్యాన్ ప్రతి వర్తతే. 81*

*ఇతరేష్వాగమా ద్ధర్మః పాదశస్త్వవరోపితః,*
*చౌరికానృతమాయాభిర్ధర్మశ్చాపైతి పాదశః. 82*

*అరోగా స్సర్వసిద్ధార్థాశ్చతుర్వర్షశతాయుషః,*
*కృతత్రేతాదిషు హ్యేషామాయుర్హ్రసతి పాదశః. 83*

*వేదోక్త మాయు ర్మర్త్యానా మాశిషశ్చైవ కర్మణామ్,*
*ఫలంత్యనుయుగం లోకే ప్రభావశ్చ శరీరిణామ్. 84*

*అన్యే కృతయుగే ధర్మా స్త్రేతాయాం ద్వాపరే పరే,*
*అన్యే కలియుగే నృణాం యుగహ్రాసానురూపతః. 85*

కృతయుగంలో సమస్త ధర్మాలు నాలుగు పాదాలతోనుంటాయి. అట్లే ఆ కాలంలో మానవులు న్యాయమైన సంపాదన కలిగియుంటారు. మిగిలిన త్రేత, ద్వాపర, కలియుగాలలో ధర్మం ఒక్కొక్క పాదం తగ్గియుంటుంది. ఆ యుగాలలో దొంగతనం, అబద్ధం, మోసాలవల్ల ధర్మం నష్టమౌతుంది. కృతయుగమందలి ప్రజలు రోగాదిబాధలు లేక తమ కోరికలనన్నిటిని న్యాయమైన పద్ధతిలో తీర్చుకొంటారు. వారు నాలుగువందల సంవత్సరములు బ్రతుకుతారు. త్రేత, ద్వాపర, కలియుగాలలోనుండే మానవులు, మూడు, రెండు ఒక వంద సంవత్సరాలు బ్రతుకుతారు. ఈ విధంగా ఒక్కొక్క యుగంలో మానవుల వయస్సు క్షీణిస్తూ ఉంటుంది. వేదాలందు పేర్కొనబడ్డ ఆయుస్సు, ఆశీర్వచనాలు, బ్రాహ్మణాదులకు గల సామర్థ్యం మొదలైన ధర్మాలన్ని ఒక్కొక్కయుగంలో ఒక్కొక్క విధంగా ఉంటాయి.

*తపః పరం కృతయుగే త్రేతాయాం జ్ఞాన ముచ్యతే,*
*ద్వాపరే యజ్ఞమేవాహు ర్దానమేకం కలౌ యుగే. 86*

కృతయుగంలో జనులు తపోనిష్ఠ కలిగియుండగా త్రేతాయుగంలో జ్ఞాననిష్ఠులైయుంటారు. ద్వాపరయుగంలో యజ్ఞపరులైయుండగా కలియుగంలో దానపరులు కావలెను.

*సర్వస్యాస్య తు సర్గస్య గుప్త్యర్థం స మహాద్యుతిః,*
*ముఖబాహూరుపజ్జానాం పృథక్కర్మాణ్యకల్పయత్. 87*

ఈ సమస్త లోకాలను రక్షించుటకై మహాతేజస్సంపన్నుడైన బ్రహ్మదేవుడు బ్రాహ్మణ, క్షత్రియాదులు అనుష్ఠింపవలసిన ధర్మాలను వేరు వేరుగా నిర్దేశించెను.

**వర్ణ ధర్మములు :**

*అధ్యాపనం చాధ్యయనం యజనం యాజనం తథా,*
*దానం ప్రతిగ్రహం చైవ బ్రాహ్మణానా మకల్పయత్. 88*

*ప్రజానాం రక్షణం దాన మిజ్యాధ్యయన మేవ చ,*
*విషయే ష్వప్రసక్తిశ్చ క్షత్రియస్య సమాసతః. 89*

*పశూనాం రక్షణం దాన మిజ్యాధ్యయన మేవ చ,*
*వణిక్పథం కుసీదం చ వైశ్యస్య కృషిమేవ చ. 90*

*ఏక మేవ తు శూద్రస్య ప్రభుః కర్మ సమాదిశత్,*
*ఏతేషా మేవ వర్ణానాం శుశ్రూషామనసూయయా. 91*

బ్రాహ్మణులు అధ్యయనము, అధ్యాపనము, యాగము చేయుట, చేయించుట, దానమిచ్చుట, దానము స్వీకరించుట అను విధులు నిర్వర్తించాలి. క్షత్రియులు ప్రజలను రక్షించుట, దానము, యాగము అధ్యయనములు చేయుట, విషయలోలురు కాకుండుట అను విధులను ఆచరించాలి. వైశ్యుని యొక్క ధర్మాలు పశు రక్షణం, దానం, యాగం, అధ్యయనం చేయుట, వర్తకము చేయుట, అప్పులిచ్చుట, భూమి దున్ని వ్యవసాయము చేయుట అనేవి. శూద్రుడు వీరినందరను అసూయలేక సేవిస్తూ ఉండాలి అని బ్రహ్మదేవుడు నిర్దేశించినాడు.

*ఊర్ధ్వం నాభేర్మేధ్యతరః పురుషః పరికీర్తితః,*
*తస్మా న్మేధ్యతమం త్వస్య ముఖముక్తం స్వయంభువా. 92*

మానవుని శరీరంలో నాభికి పై భాగం పవిత్రమైంది. దానిలోను ముఖం చాల పవిత్రమైంది.

*ఉత్తమాంగోద్భవా జ్జ్యేష్ఠ్యా ద్బ్రహ్మణశ్చైవ ధారణాత్,*
*సర్వ స్యైవాస్య సర్గస్య ధర్మతో బ్రాహ్మణః ప్రభుః. 93*
*తం హి స్వయంభూః స్వాదాస్యా త్తప స్తప్త్వాదితోZ సృజత్,*
*హవ్యకవ్యాభివాహ్యాయ సర్వస్యాస్య చ గుప్తయే. 94*

*యస్యా స్యేన సదాశ్నంతి హవ్యాని త్రిదివౌకసః,*
*కవ్యాని చైవ పితరః కిం భూతమధికం తతః. 95*

బ్రాహ్మణుడు బ్రహ్మదేవుని ముఖమునుండి అన్ని వర్ణములకంటె ముందు పుట్టినాడు. వేదములనధ్యయనము చేసి ఇతరులకు బోధిస్తూ ధర్మమును రక్షిస్తున్నందువల్ల ఈ లోకానికి బ్రాహ్మణుడు పూజ్యుడైనాడు. అతనిని బ్రహ్మదేవుడు యజ్ఞయాగాదులను రక్షించుటకై, ధర్మరక్షణ చేయుచు ప్రపంచమునంతా రక్షింపవలెనని తాను తపస్సు చేసి ప్రత్యేకంగా సృష్టించెను. ఈ బ్రాహ్మణుని వల్లనే దేవతలు హవిస్సును, పితృదేవతలు కవ్యమును భుజింపగలుగుచున్నారు.

*భూతానాం ప్రాణినః శ్రేష్ఠాః ప్రాణినాం బుద్ధిజీవినః,*
*బుద్ధిమత్సు నరాః శ్రేష్ఠా నరేషు బ్రాహ్మణాః స్మృతాః. 96*

*బ్రాహ్మణేషు చ విద్వాంసో విద్వత్సు కృతబుద్ధయః,*
*కృతబుద్ధిషు కర్తారః కర్తృషు బ్రహ్మవేదినః. 97*

*ఉత్పత్తిరేవ విప్రస్య మూర్తిర్ధర్మస్య శాశ్వతీ,*
*స హి ధర్మార్థముత్పన్నో బ్రహ్మభూయాయ కల్పతే. 98*

*బ్రాహ్మణో జాయమానో హి పృథివ్యామధిజాయతే,*
*ఈశ్వరస్సర్వభూతానాం ధర్మకోశస్య గుప్తయే. 99*

*సర్వం స్వం బ్రాహ్మణస్యేదం యత్కించి జ్జగతీగతం !*
*శ్రైష్ఠ్యేనాభిజనేనేదం సర్వంవైబ్రాహ్మ ణో Z ర్హ తి. 100*

ఈ సృష్టియందు ప్రాణులు గొప్పవి. ప్రాణులయందు బుద్ధివల్ల జీవించు జీవులు గొప్పవారు. ఆ జీవులయందు మానవులు మిక్కిలి గొప్పవారు. వారిలో బ్రాహ్మణులు గొప్పవారు. ఆ బ్రాహ్మణులలో విద్వాంసులు శ్రేష్ఠులు. ఆ విద్వాంసులయందు యుక్తాయుక్తవిచక్షణ కలవారు శ్రేష్ఠులు కాగా వారికంటె బ్రహ్మజ్ఞానం కలవారు మిక్కిలి గొప్పవారు. ఈ బ్రాహ్మణుడు ధర్మరక్షణకై పుట్టినాడు. ధర్మాన్ని ఆచరిస్తున్నందువల్లనే ఆతడు బ్రహ్మత్వాన్ని పొందుతున్నాడు. అతడు సర్వశ్రేష్ఠుడు. అందరకు సమీపస్థుడు కావున ఈ ప్రపంచమంతయు ఆతని సొత్తుగానే పరిగణింపబడుచున్నది.

*స్వమేవ బ్రాహ్మణో భుఙ్క్తే స్వం వస్తే స్వం దదాతి చ,*
*ఆనృశంస్యా ద్బ్రాహ్మణస్య భుంజతే హీతరే జనాః. 101*

అందువలన బ్రాహ్మణుడు తన సొత్తును తానే అనుభవించుచున్నాడు. తన వస్త్రములను తానే ధరించుచున్నాడు. తన వస్తువులనే దానము చేయుచున్నాడు పైగా ఆతని దయాదాక్షిణ్యములవలన ఇతరులు బ్రాహ్మణుని సొత్తు ననుభవించుచున్నారు.

శాస్త్ర ప్రశంస :-

*తస్య కర్మవివేకార్థం శేషాణామనుపూర్వశః,*
*స్వాయంభువో మనుర్ధీమానిదం శాస్త్రమకల్పయత్. 102*

*విదుషా బ్రాహ్మణేనేదమధ్యేతవ్యం ప్రయత్నతః,*
*శిష్యేభ్యశ్చ ప్రవక్తవ్యం సమ్యఙ్నాన్యేన కేనచిత్. 103*

*ఇదం శాస్త్రమధీయానో బ్రాహ్మణశ్శంసితవ్రతః,*
*మనోవాగ్దేహజైర్నిత్యం కర్మదోషైర్న లిప్యతే. 104*

*పునాతి పంక్తిం వంశ్యాంశ్చ సప్తసప్త పరావరాన్,*
*పృథివీమపి చైవేమాం కృత్స్నామేకో Z పి సో Z ర్హ తి. 105*

*ఇదం స్వస్త్యయనం శ్రేష్ఠమిదం బుద్ధివివర్ధనమ్,*
*ఇదం యశస్యమాయుష్యమిదం నిశ్శ్రేయసం పరమ్. 106*

*అస్మిన్ ధర్మోZ ఖిలేనోక్తో గుణదోషౌ చ కర్మణామ్,*
*చతుర్ణామపి వర్ణానామాచారశ్చైవ శాశ్వతః. 107*

# ప్రథమాధ్యాయం

బ్రాహ్మణులు, తదితర జాతులవారు అనుష్ఠింపవలసిన కర్మలను తెలుపుటకై బ్రహ్మ సంతతివాడగు మనువు ఈ శాస్త్రాన్ని రచించినాడు. సర్వ విద్యాపారంగతుడైన బ్రాహ్మణుడీ శాస్త్రాన్ని నియమంతో అభ్యసించాలి. గురుముఖతః, తన ధీశక్తివలన అభ్యసించి తన శిష్యులకు దీనిని చక్కగా బోధింపవలెను. ఈ శాస్త్రమును చక్కగా అధ్యయనము చేసి అర్థము చేసికొని తన ధర్మాలను నిర్వర్తించినప్పుడు అతడు మనోవాక్కాయములచే పాపములు చేయలేడు. ఆతడు తన పదునేను తరముల వారిని, ఈ భూమిని, పవిత్రము చేయగలుగును. అట్టివాడు ధర్మజ్ఞుడు కావున యోగ్యుడగును. అట్టి యోగ్యునకు భూమినంతయు దానం చేయవచ్చును. ఈ శాస్త్రం మేలును కలిగిస్తుంది. సర్వశ్రేష్ఠమైంది. జ్ఞానాన్ని పెంచుతుంది. కీర్తిని కలిగిస్తుంది. ఆయుస్సును పెంచుతుంది. మోక్షానికి కూడా కారణమౌతుంది.

ఈ శాస్త్రంలో సమస్త ధర్మాలు, కర్మలలోని మంచి చెడులు చాతుర్వర్ణ్యాలవారు ఎల్లప్పుడు ఆచరించాల్సిన ధర్మాలు చెప్పబడ్డాయి.

*ఆచారః పరమో ధర్మశ్రుత్యుక్తస్మార్తఏవ చ,*
*తస్మాదస్మి న్ సదా యుక్తో నిత్యం స్యాదాత్మవాన్ ద్విజః.* 108

వేదాలు, స్మృతులలో చెప్పబడ్డ ధర్మాలు మిక్కిలి శ్రేష్ఠమైనవి. ఈ శాస్త్రంలో శృతి, స్మృతులకు సంబంధించిన ధర్మములే చెప్పబడ్డాయి. అందువల్ల ఈ శాస్త్రాన్ని నియమంతో అభ్యసించాలి.

*ఆచారాద్విచ్యుతో విప్రో న వేదఫల మశ్నుతే,*
*ఆచారేణ తు సంయుక్తస్సంపూర్ణఫలభాగ్భవేత్.* 109
*ఏవ మాచారతో దృష్ట్వా ధర్మస్య మునయో గతిమ్,*
*సర్వస్య తపసో మూల మాచారం జగృహుః పరమ్.* 110

సదాచారాన్ని పాటించని బ్రాహ్మణుడు వేదాధ్యయనం చేసినా ఫలితం మాత్రం పొందలేడు. సదాచారసంపన్నుడు సమస్త వేదాధ్యయనం చేసిన ఫలితాన్ని పొందుతాడు.

సదాచారాన్ని అనుష్ఠించుట ధర్మ ప్రాప్తికి మూలమని తలచిన మహర్షులు అది తపస్సునకు కూడ కారణమని చెప్పినారు.

**ఇందలి విషయాలు :-**

*జగతశ్చ సముత్పత్తిం సంస్కారవిధిమేవ చ,*
*వ్రతచర్యోపచారం చ స్నానస్య చ పరం విధిమ్.* 111
*దారాధిగమనం చైవ వివాహానాం చ లక్షణం,*
*మహాయజ్ఞవిధానం చ శ్రాద్ధకల్పం చ శాశ్వతమ్.* 112
*వృత్తీనాం లక్షణం చైవ స్నాతకస్య వ్రతాని చ,*
*భక్ష్యాభక్ష్యం చ శౌచం చ ద్రవ్యాణాం శుద్ధి మేవ చ,* 113
*స్త్రీధర్మయోగం తాపస్యం మోక్షం సన్న్యాస మేవ చ,*

జగత్సృష్టి క్రమం, జాతకర్మాది సంస్కారవిధి, బ్రహ్మచారి అనుష్ఠింపవలసిన పద్ధతి, గురుకులంనుండి ఇంటికి తిరిగివచ్చిన బ్రహ్మచారి చేయవలసిన స్నాతక సంస్కార వివరణ, వివాహం, వాటి భేదాలు, వైశ్వదేవాది పంచయజ్ఞాలు చేయవలసిన పద్ధతి, శ్రాద్ధము నాచరింపవలసిన పద్ధతి, జీవనోపాయాలైన వృత్తుల లక్షణము, గృహస్థాశ్రమంలో ఉన్నవాడు చేయాల్సిన వ్రత నియమాలు, తినుటకు యోగ్యాయోగ్యములైన వస్తు వివరణ, జాతాశౌచమృతాశౌచాలు, ద్రవ్యములను శుద్ధి చేయవలసిన పద్ధతి, స్త్రీ ధర్మాలు, వానప్రస్థాశ్రమమునకు వెళ్ళువాడు ఆచరించాల్సిన ధర్మాలు, సన్యాస ధర్మాలు ఇందు చెప్పబడ్డాయి.

*రాజ్ఞశ్చ ధర్మ మఖిలం కార్యాణాం చ వినిర్ణయమ్.* 114
*సాక్షిప్రశ్నవిధానం చ ధర్మం స్త్రీపుంసయోరపి,*
*విభాగధర్మం ద్యూతం చ కంటకానాం చ శోధనమ్.* 115

*వైశ్యశూద్రోపచారం చ సంకీర్ణానాం చ సంభవం*
*ఆపద్ధర్మం చ వర్ణానాం ప్రాయశ్చిత్తవిధిం తథా,* 116

*సంసారగమనం చైవ త్రివిధం కర్మసంభవమ్,*
*నిశ్శ్రేయసం కర్మణాం చ గుణదోషపరీక్షణమ్.* 117

*దేశధర్మాన్ జాతిధర్మాన్ కులధర్మాంశ్చ శాశ్వతాన్,*
*పాషండగణధర్మాంశ్చ శాస్త్రే ౽ స్మిన్నుక్తవాన్ మనుః.* 118

అదే విధంగా రాజులు ఆచరించాల్సిన ధర్మాలు, ఋణాదులు ఇచ్చి పుచ్చుకొనేటప్పుడు చేయాల్సిన పనులు, వ్యవహారాల్లో సాక్షిని ప్రశ్నించు పద్ధతి, భార్యాభర్తల ధర్మాలు, అన్నదమ్ముల ఆస్తి పంపకంలో అనుష్ఠించాల్సిన న్యాయం, దొంగలు మొదలైన ప్రజాపీడకులను వెదుకు రీతి, వైశ్యులు, శూద్రులు చేయు అపచారాలు, సంకీర్ణ జాతుల పుట్టుక, అపద్ధర్మాలు, ఆయా జాతులవారు తప్పు చేసినపుడు చేసికొనవలసిన ప్రాయశ్చిత్తాలు, ఉత్తమ, మధ్యమాధమములని మూడు విధాలైన శుభాశుభకర్మలకు కారణమైన సంస్కారం చేయుట, ఆత్మజ్ఞానవిషయం, మానవుడు చేయు కర్మలయందలి మంచి చెడులను పరీక్షించుట మొదలైనవన్ని ఈ గ్రంథంలో కనిపిస్తాయి. ఇంకా ఆయా దేశవాసులు ఆచరించాల్సిన ధర్మాలు, ఆయా జాతులవారు అనుష్ఠించాల్సిన ధర్మాలు, ఆయా కులాలవారు చేయాల్సిన ధర్మాలు, వేదబాహ్యులైన పాషండులు ఆచరించాల్సిన ధర్మాలు, గణములుగా తిరిగేవారు చేయాల్సిన ధర్మాలన్ని ఈ శాస్త్రంలో మనువుచే వివరింపబడ్డాయి.

*యథేదముక్తవాన్ శాస్త్రం పురా పృష్టో మనుర్మయా*
*తథేదం యూయమప్యద్య మత్సకాశాన్నిబోధత.* 119

పూర్వం నేను మనువును ప్రశ్నింపగా చెప్పిన విషయాలనన్నిటిని ఇప్పుడుమీకు బోధింతునని మహర్షులతో భృగు మహర్షి పలికెను.

ఇతి మానవే ధర్మశాస్త్రే భృగుప్రోక్తాయాం, సంహితాయాం
ప్రథమోధ్యాయః

భృగు మహర్షి చెప్పిన మానవ ధర్మశాస్త్రమనే సంహితయందు ప్రథమాధ్యాయము సమాప్తము.

# ద్వితీయాధ్యాయం

**ధర్మలక్షణము :-**

*విద్వద్భి స్సేవితం సద్భిర్నిత్యమద్వేషరాగిభిః,*
*హృదయేనాభ్యనుజ్ఞాతో యో ధర్మస్తం నిబోధత. 1*

వేదవేదాంగ తత్వజ్ఞులైన విద్వాంసులు సదా అనుష్ఠించేది, రాగ ద్వేషాదిగుణాలు లేని సత్పురుషులు కూడా హృదయపూర్వకంగా అనుష్ఠించేది ధర్మం. అట్టి ధర్మాన్ని తెలుసుకొమ్మని భృగుమహర్షి మహర్షులతో పలికినాడు.

*కామాత్మతా న ప్రశస్తా న చైవేహాస్త్యకామతా,*
*కామ్యో హి వేదాధిగమః కర్మయోగశ్చ వైదికః. 2*

మానవుడు ఎల్లప్పుడు కోరికలకు వశమైయుండుట తగనిది. అట్లే కోరికలేమాత్రం లేని మానవుడు సహితము కనిపించడు. అందువల్ల వేదజ్ఞానం పొంది వేద సమ్మతమైన కర్మలను చేయవలెను.

*సంకల్పమూలః కామో వై యజ్ఞాః సంకల్పసంభవాః,*
*వ్రతాని యమధర్మాశ్చ సర్వే సంకల్పజాః స్మృతాః. 3*

మానవుడు తన కోరికలను మొదట మనస్సులో సంకల్పించుకొని తరువాత తదనుగుణంగా ప్రయత్నం చేస్తాడు. అందువల్ల వేద సమ్మతాలైన యజ్ఞాలనాచరించుట, వ్రతనియమాద్యనుష్ఠానం మొదలైనదంతా మానవుని సంకల్పానుసారంగా జరుగుతున్నది

*అకామస్య క్రియా కాచిద్దృశ్యతే నేహ కర్హి చిత్,*
*యద్యద్ధి కురుతే కించి త్తత్తత్కామస్య చేష్టితమ్. 4*

ఏమాత్రం కోరికలు లేనివాడు కర్మలనాచరించుట అనేది ఎచ్చటా కనిపించదు. అందువల్ల మానవులు చేయు కర్మలన్నియు అతని కోరికననుసరించి మాత్రమే జరుగుతున్నాయి.

*తేషు సమ్యగ్వర్తమానో గచ్ఛత్యమరలోకతామ్,*
*యథాసంకల్పితాంశ్చేహ సర్వాన్ కామాన్ సమశ్నుతే. 5*

మానవుడు సద్భావంతో సత్కర్మలనాచరించి ఊర్ధ్వలోకాలను పొందుతున్నాడు. అతడు తన సంకల్పాన్ననుసరించి ప్రయత్నించి తన కోరికలనన్నింటిని తీర్చుకొంటున్నాడు.

ధర్మప్రమాణాలు :-

*వేదోऽ ఖిలో ధర్మమూలం స్మృతిశీలే చతద్విదామ్,*
*ఆచారశ్చైవ సాధూనా మాత్మన స్తుష్టి రేవ చ.* 6

ధర్మానికి వేదాలు ప్రమాణాలు. వేదానికి విరుద్ధంకాని స్మృతులు, వేదవేదాంగాలు తెలిసిన, సత్పురుషుల ప్రవర్తన సైతం ధర్మ విషయంలో ప్రమాణమౌతున్నవి. ఇంకా ధర్మాధర్మ విచక్షణ కలిగినప్పుడు సత్పురుషుల మనస్సు కూడా (వారు ఆలోచించి తగిన నిర్ణయాన్ని చేస్తారు కావున) ప్రమాణమౌతున్నది.

*యః కశ్చిత్కస్యచి ద్ధర్మో మనునా పరికీర్తితః,*
*స సర్వోऽ భిహితో వేదే సర్వజ్ఞానమయో హి సః.* 7

*సర్వం తు సమవేక్ష్యేదం నిఖిలం జ్ఞానచక్షుషా,*
*శ్రుతిప్రామాణ్యాతో విద్వాన్ స్వధర్మే నివిశేత వై.* 8

మనువు నిర్దేశించిన మానవధర్మాలు సకల వేదసమ్మతాలైనవి. అతడు సమస్త జ్ఞానాలు కలవాడు. తన జ్ఞాననేత్రంచే సమస్తం దర్శించుకొని ఇతరులకు ధర్మోపదేశాన్ని చేసే వేదవేదాంగశాస్త్రవేత్తయైన విద్వాంసుడు కూడ వేదప్రామాణ్యాన్ననుసరించే ఇతరులకు ధర్మాన్ని తెలుపుతాడు.

*శ్రుతిస్మృత్యుదితం ధర్మమనుతిష్ఠ న్ హి మానవః,*
*ఇహ కీర్తిమవాప్నోతి ప్రేత్య చానుత్తమం సుఖమ్.* 9

వేదం, స్మృతులు ప్రతిపాదించిన ధర్మములననుష్ఠించినవాడు ఇహపరలోకాల్లో కీర్తిని, సుఖాన్ని పొందుతాడు.

*శ్రుతిస్తు వేదో విజ్ఞేయో ధర్మశాస్త్రం తు వై స్మృతిః,*
*తే సర్వార్థేష్వమీమాంస్యే తాభ్యాం ధర్మో హి నిర్బభౌ.* 10

వేదాన్ని శ్రుతియని అంటారు. స్మృతిని ధర్మశాస్త్రమనియే చెప్పుతారు. ధర్మబోధకాలైన వేదస్మృతుల గూర్చి ధర్మవివేచన సమయంలో ఎదురు ప్రశ్న వేయుట తగని పని.

*యోऽ వమన్యేత తే మూలే హేతుశాస్త్రాశ్రయాద్ద్విజః,*
*స సాధుభిర్బహిష్కార్యో నాస్తికో వేదనిందకః.* 11

ధర్మానికి పరమప్రమాణమైన వేదాన్ని, స్మృతిని హేతు శాస్త్రమైన తర్కాన్ననుసరించి అవమానపరిచే వాణ్ణి సాధుపురుషులందరు తిరస్కరించాలి. వేదనిందచేయు వాడు నాస్తికుడే ఔ తాడు.

*వేదః స్మృతిః సదాచారః స్వస్య చ ప్రియమాత్మనః,*
*ఏతచ్చతుర్విధం ప్రాహుః సాక్షాద్ధర్మస్య లక్షణం.* 12

# ద్వితీయాధ్యాయం

వేదం, స్మృతి, సదాచారం, తన (సత్పురుషుని) ఆత్మ అంగీకరించు విషయం ఈ నాలుగు ధర్మాలను బోధిస్తాయని పెద్దలంటారు.

*అర్థకామేష్వసక్తానాం కర్మజ్ఞానం విధీయతే,*
*ధర్మం జిజ్ఞాసమానానాం ప్రమాణం పరమం శ్రుతిః. 13*

*శ్రుతిద్వైధం తు యత్ర స్యాత్తత్ర ధర్మావుభౌ స్మృతౌ,*
*ఉభావపి హితౌ ధర్మౌ సమ్యగుక్తౌ మనీషిభిః. 14*

*ఉదితేఽనుదితే చైవ సమయాధ్యుషితే తథా,*
*సర్వథా వర్తతే యజ్ఞ ఇతీయం వైదికీ శ్రుతిః. 15*

ధనంపైన, కోరికలపైన ఆసక్తి లేక కర్మను ఆచరించే మహాత్ములకు ధర్మ విషయంలో తన ఆత్మ ప్రమాణమౌతున్నది. ధర్మాన్ని తెలుసుకోవాలనే సామాన్యులకు వేదమే పరమ ప్రమాణమౌతున్నది. అట్లే వేదం పరస్పర విరుద్ధంగా రెండు ధర్మాలనంగీకరిస్తే సమానబలం కల ఆ రెండు ధర్మాల్లో దేనినైనా ఆచరింపవచ్చునని పండితులు చెప్పుచున్నారు. ఎట్లనగా "ఉదితేహోతవ్యం" అను శ్రుతి సూర్యోదయకాలంలో హోమం చేయాలి అని చెప్పుతున్నది. అట్లే ఇంకొక చోట సూర్యోదయానికి ముందు నక్షత్రాలున్నప్పుడే హోమం చేయాలి అని చెప్పుతున్నది. ఇంకొక చోట సమయాధ్యుషితకాలంలో హోమం చేయవలెనని చెప్పుచున్నది. సమయాధ్యుషితమనగా నక్షత్రాలస్తమించిన తరువాత సూర్యోదయానికి ముందున్న ఉషఃకాలము. ఈ విధంగా మూడు చోట్ల మూడు విధములుగా శ్రుతి కనిపించినా వాటిలో దేనినాచరించాలి అని సంశయించక అన్ని కాలములందును యజ్ఞమునాచరింపవచ్చును.

**అధికారి :-**

*నిషేకాదిశ్మశానాంతో మంత్రైర్యస్యోదితో విధిః,*
*తస్య శాస్త్రేఽ ధికారో ఽ స్మిన్ జ్ఞేయో నాన్యస్య కస్యచిత్. 16*

గర్భాదానం మొదలు చనిపోయే వరకు ఉన్న కర్మలన్నిటిని మంత్రపూర్వకంగా అనుష్ఠించే వారికే ఈ మానవ ధర్మశాస్త్రంపై అధికారముంది.

*సరస్వతీదృషద్వత్యోర్దేవనద్యోర్యదంతరమ్,*
*తం దేవనిర్మితం దేశం బ్రహ్మావర్తం ప్రచక్షతే. 17*
*తస్మిన్ దేశే య ఆచారః పారంపర్యక్రమాగతః,*
*వర్ణానాం సాంతరాళానాం స సదాచార ఉచ్యతే. 18*

దేవనదులగు సరస్వతీ, దృషద్వతీ నదుల మధ్యనుండు ప్రదేశమును బ్రహ్మావర్త మందురు. ఈ ప్రదేశము దేవతలచే నిర్మింపబడినదందురు. ఆ ప్రదేశమున జన్మించిన వారి యొక్క పరంపరాగతమైన ధర్మమే సదాచారమనబడుతుంది.

*కురుక్షేత్రం చ మత్స్యాశ్చ పంచాలాశ్శూరసేనకాః,*
*ఏష బ్రహ్మర్షిదేశో వై బ్రహ్మావర్తాదనంతరః. 19*

కురుక్షేత్రం, మత్స్యదేశం, పాంచాలదేశం, మధురాపట్టణం గల శూరసేనదేశం వీటినన్నిటిని బ్రహ్మర్షి దేశములని పిలుస్తారు. ఈ ప్రదేశములు బ్రహ్మావర్తంకంటె తక్కువ గౌరవం కలవి.

*ఏతద్దేశ ప్రసూతస్య సకాశాదగ్రజన్మనః,*
*స్వం స్వం చరిత్రం శిక్షేరన్ పృథివ్యాం సర్వమానవాః. 20*

పైన పేర్కొన్న బ్రహ్మావర్తాది దేశములందు జన్మించిన బ్రాహ్మణులననుసరించి ఈ భూమిపై నున్న సమస్తమానవులు తమ తమ ఆచారాలను అనుష్ఠించాలి.

*హిమవద్వింధ్యయోర్మధ్యం యత్ప్రాగ్వినశనాదపి,*
*ప్రత్యగేవ ప్రయాగాచ్చ మధ్యదేశః ప్రకీర్తితః. 21*

వింధ్య హిమాలయ పర్వతముల యొక్క మధ్య సరస్వతీనదికి తూర్పున ప్రయాగకు పడమరగా నున్న భూభాగమును మధ్యదేశమంటారు.

*ఆ సముద్రాత్తు వై పూర్వాదా సముద్రాత్తు పశ్చిమాత్,*
*తయోరేవాంతరం గిర్యోరార్యావర్తం విదుర్బుధాః. 22*

తూర్పు, పడమర దిక్కులందు సముద్రము, దక్షిణోత్తరములలో వింధ్య హిమాలయములుండు ప్రాంతమును ఆర్యావర్తమని పిలుస్తారు.

*కృష్ణసారస్తు చరతి మృగో యత్ర స్వభావతః,*
*స జ్ఞేయో యజ్ఞియో దేశో మ్లేచ్ఛ దేశ స్త్వతః పరః. 23*

లేళ్ళు ఏ ప్రాంతమున ప్రకృతి సిద్ధంగా నివసిస్తాయో ఆ భూభాగం యజ్ఞం చేయుటకు అనువైంది. మిగిలిన భూభాగం యజ్ఞం చేయుటకు తగింది కాదు కావున దానిని మ్లేచ్ఛదేశమంటారు.

*ఏతాన్ ద్విజాతయో దేశాన్ సంశ్రయేరన్ ప్రయత్నతః,*
*శూద్రస్తు యస్మిన్ కస్మిన్ వా నివసేద్వృత్తికర్శితః. 24*

బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు పై దేశములందే ఎట్టైననూ ఉండుటకు ప్రయత్నించాలి. శూద్రులు మాత్రం తమ బ్రతుకు కొరకు ఎచ్చటనైనా ఉండవచ్చును.

*ఏషా ధర్మస్య వో యోనిః సమాసేన ప్రకీర్తితా,*
*సంభవశ్చాస్య సర్వస్య వర్ణధర్మాన్నిబోధత. 25*

ఓ మునులారా! ధర్ముముండు ప్రదేశాన్ని మీకు మిక్కిలి సంక్షిప్తంగా చెప్పినాను. ఇక మీకు ఆయా వర్ణాలవారు ఆచరింపదగిన ధర్మాలను చెప్పెదను. శ్రద్ధగా వినుడని భృగుమహర్షి పలికెను.

*వైదికైః కర్మభిః పుణ్యైర్నిషేకాదిర్ద్విజన్మనామ్*
*కార్యశ్శరీరసంస్కారః పావనః ప్రేత్య చేహ చ. 26*

*గార్భైర్హోమై ర్జాతకర్మచౌళమౌంజీనిబంధనైః,*
*బైజికం గార్భికం చైనో ద్విజానామపమృజ్యతే. 27*

ద్విజాతులైన బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకు గర్భాదానం మొదలైన శరీర సంస్కారాలన్నిటిని వేదమంత్రాలచే తన్నిర్దిష్టములైన వైదిక కార్యాలచే చేయవలెను. దానివలన అతడు ఇహపరలోకములందు పవిత్రుడౌతాడు. గర్భాధానము, జాతకర్మ, చూడాకరణము, ఉపనయనము అనునవి మాతృగర్భమున నివసించుట మొదలగు పాపాలను పోగొట్టుతాయి-

*స్వాధ్యాయేన వ్రతైర్హోమై స్త్రైవిద్యేనేజ్యయా సుతైః,*
*మహాయజ్ఞైశ్చ యజ్ఞైశ్చ బ్రాహ్మీయం క్రియతే తనుః. 28*

వేదమునభ్యసించినందువలన, మధుమాంసాదులను విసర్జించి వ్రత నియమములతో ఉండుటవల్ల, ప్రాతఃసాయంకాలములందు చేయు హోమముల వల్ల, బ్రహ్మచారిగా ఉండునప్పుడు చేయు దేవ, ఋషి, పితృతర్పణాల వల్ల, గృహస్థాశ్రమమును స్వీకరించిన పిదప ధర్మాన్ని ఆచరించుటకై సంతానం పొందుట, బ్రహ్మ యజ్ఞాది మహాయజ్ఞాలు జ్యోతిష్టోమాది యజ్ఞాలవల్ల మానవుడు పరబ్రహ్మను పొందగలుగుచున్నాడు.

*ప్రాఙ్నాభివర్ధనాత్పుంసో జాతకర్మ విధీయతే,*
*మంత్రవత్ప్రాశనం చాస్య హిరణ్యామధుసర్పిషామ్. 29*

మగశిశువునకు బొడ్డు కోయకముందే జాతకర్మ చేయవలెను. అప్పుడే ఆ శిశువుకు మంత్రపూర్వకంగా తేనె, నెయ్యి తినిపించవలెను.

**నామకరణము :-**

*నామధేయం దశమ్యాం తు ద్వాదశ్యాం వా ऽ స్య కారయేత్,*
*పుణ్యే తిథౌ ముహూర్తే వా నక్షత్రే వాగుణాన్వితే. 30*

ఆ శిశువునకు పది లేక పన్నెండవ దినము లేనిచో మంచి తిథి, నక్షత్రము, ముహూర్తము కల దినాన నామకరణం చేయవలెను. ఇచ్చట పదియవనాడు జాతాశౌచము తీరదు కావున పదవదినము దాటిన తరువాత పదకొండవ దినమున నామకరణము చేయువలెనను శంఖ వచనమునుసరించి నామకరణము చేయాలి.

*మంగళ్యం బ్రాహ్మణస్య స్యాత్ క్షత్రియస్య బలాన్వితమ్,*
*వైశ్యస్య ధనసంయుక్తం శూద్రస్య తు జుగుప్సితమ్. 31*

*శర్మవద్బ్రాహ్మణస్య స్యాద్రాజ్ఞో రక్షాసమన్వితమ్,*
*వైశ్యస్య పుష్టిసంయుక్తం శూద్రస్య ప్రైష్యసంయుతమ్. 32*

బ్రాహ్మణ శిశువుకు మాంగళ్యాన్ని తెలిపే పదంతో, క్షత్రియునికి బలాన్ని తెలిపే పదంతో, వైశ్యునికి ధనాన్ని తెలిపే పదంతో, శూద్రునికి దాస్యభావం సూచించే పదంతో పేరు పెట్టవలెను. అందువల్ల బ్రాహ్మణ శిశువునకు శర్మ శబ్దం, క్షత్రియునకు వర్మ,

వైశ్యునకు వసు, శూద్రునకు దాస శబ్దములుండునట్లు రామశర్మ, దేవవర్మ, విశ్వావసు, లక్ష్మణ దాస వంటి పేర్లు పెట్టవలెను.

*స్త్రీణాం సుఖోద్యమక్రూరం విస్పష్టార్థం మనోహరమ్,*
*మంగళ్యం ధీర్ఘ వర్ణాంత మాశీర్వాదాభిధానవత్. 33*

స్త్రీల పేర్లు తేలికగా ఉచ్ఛరించుటకు వీలగునట్లుండవలెను. ఆ పదములలో క్రూరార్థము గోచరింపరాదు. ఆ పదముల యొక్క అర్థం అందరికి తెలిసింది కావలెను. అట్లే మంగళార్థాన్ని, ఆశీర్వచనాన్ని తెలిపే ఆ పదాలు దీర్ఘాంతంగా నుండవలెను. ఉదాహరణమునకు 'యశోదా' అనేది.

*చతుర్థే మాసి కర్తవ్యం శిశోర్నిష్క్రమణం గృహత్,*
*షష్ఠేZ న్నప్రాశనం మాసి యద్వేష్టం మంగళం కులే. 34*

నాలుగవ నెలలో శిశువును పుట్టినింటినుండి బయటకు తీసికొని వెళ్ళవలెను. ఆరవనెలలో అన్న ప్రాశనము చేయవలెను. లేదా ఆయా కులాచారాలననుసరించి వీటిని ఆచరించవచ్చును.

**ఉపనయనకాలము :-**

*చూడాకర్మ ద్విజాతీనాం సర్వేషామేవ ధర్మతః,*
*ప్రథమేZ బ్దే తృతీయే వా కర్తవ్యం శ్రుతిచోదనాత్. 35*
*గర్భాష్టమేZ బ్దే కుర్వీత బ్రాహ్మణస్యోపనాయనమ్,*
*గర్భాదేకాదశే రాజ్ఞో గర్భాత్తు ద్వాదశే విశః. 36*
*బ్రహ్మవర్చసకామస్య కార్యం విప్రస్య పంచమే,*
*రాజ్ఞో బలార్థినష్షష్ఠే వైశ్య స్యేహార్థినో Z ష్టమే. 37*
*ఆషోడశాద్బ్రాహ్మణస్య సావిత్రీనాతివర్తతే*
*ఆద్వావింశాత్క్షత్రబంధోరాచతుర్వింశతేర్విశః 38*
*అత ఊర్ధ్వం త్రయో Z ప్యేతే యథాకాలమసంస్కృతాః,*
*సావిత్రీపతితా వ్రాత్యా భవంత్యార్యవిగర్హితాః. 39*
*నైతైరపూతైర్విధివదాపద్యపి హి కర్హిచిత్,*
*బ్రాహ్మాన్యోనాంశ్చ సంబంధాన్నాచరేద్బ్రాహ్మణస్సహ. 40*

చూడాకర్మ లేక చౌలమనే సంస్కారాన్ని శిశువుయొక్క మొదటి సంవత్సరంలో లేదా మూడవ సంవత్సరంలో చేయవలెను. ఇట్లే ఉపనయన సంస్కారాన్ని బ్రాహ్మణ కుమారునకు గర్భాష్టమమున (శిశువు గర్భమున పడినప్పటినుండి ఎనిమిదవ సంవత్సరంలో) రాజకుమారునకు గర్భైకాదశమున. వైశ్యునకు గర్భద్వాదశసంవత్సరంలో చేయవలెను. ఇంకను బ్రహ్మ వర్చస్సు కావలెనన్నచో బ్రాహ్మణునకు గర్భ పంచమ సంవత్సరంలోనే ఉపనయనము చేయవలెను. అదే విధంగా అధికబలసంపదకై రాకుమారునకు గర్భషష్ఠాన, అధిక ధనసంపద నర్థించినచో వైశ్యునకు గర్భాష్టమున ఉపనయనము చేయవలెను. పై

విధంగా సకాలంలో ఉపనయనం చేయుటకు వీలుకానిచో బ్రాహ్మణునకు గర్భషోడశ సంవత్సరములోపల (గర్భమున పడినప్పటినుండి పదహారు సంవత్సరములలోపల) ఉపనయనం చేయవచ్చును. అదే విధంగా రాకుమారునకు గర్భద్వావింశత్సంవత్సరము లోపల, వైశ్యునకు గర్భచతుర్వింశతి సంవత్సరము లోపల ఉపనయనం చేయవచ్చును. అంతకు మించినచో వీరిని వ్రాత్యులని పెద్దలు దూషిస్తారు. ఇట్టి వ్రాత్యులు శాస్త్ర ప్రకారంగా ప్రాయశ్చిత్తము నాచరింపక బ్రాహ్మణులకు సంబంధించిన అధ్యయన, యజన, దానకరణాది యోగ్యతలకు అన్య సంబంధములకు అర్హతను కోల్పోవుదురు.

**ఉత్తరీయము, మేఖల**

*కార్ష్ణ రౌరవబాస్తాని చర్మాణి బ్రహ్మచారిణః,*
*వసీరన్నానుపూర్వ్యేణ శాణక్షౌమావికాని చ. 41*

*మౌంజీ త్రివృత్సమా శ్లక్ష్ణా కార్యా విప్రస్య మేఖలా,*
*క్షత్రియస్య తు మౌర్వీ జ్యా వైశ్యస్య శణతాంతవీ. 42*

*ముంజాలాభే తు కర్తవ్యాః కుశాశ్మంతకబల్వజైః,*
*త్రివృతా గ్రంథినైకేన త్రిభిః పంచభి రేవ వా. 43*

ఉపనయనం చేసికొన్ని బ్రాహ్మణక్షత్రియ వైశ్యులు తమకు ఉత్తరీయములుగా కృష్ణమృగమనే లేడి, రురువనే లేడి, మేక యొక్క చర్మములను లేక జనుప నారతో, పట్టుతో మేక ఉన్నితో చేయబడిన వస్త్రాలను ధరింపవలెను. అట్లే నడుమునకు మూడు పొరలతో సమానంగానున్న ముంజ అను గడ్డితో చేయబడిన మొలత్రాడును బ్రాహ్మణ వటువు ధరింపలెను. క్షత్రియుడు మూర్వయను గడ్డిచే చేయబడిన మొలత్రాడును, వైశ్యుడు జనపనారతో చేయబడిన మొలత్రాడును (మేఖలను) ధరింపవలెను. ఆపైన పేర్కొనబడ్డ ముంజం మొదలైనవి లభించనిచో దర్భ, అశ్మంతకము, బల్వజము అనుగడ్డిచే చేయబడిన మొలత్రాడును మూడు సమానమైన వరుసలతో ఒకటి, మూడు లేక ఐదు ముళ్ళు వేసి ధరింపవలెను.

## యజ్ఞోపవీతము :

*కార్పాసముపవీతం స్యాద్విప్రస్యోర్ధ్వవృతం త్రివృత్,*
*శణసూత్రమయం రాజ్ఞో వైశ్యస్యావికసౌత్రికమ్. 44*

బ్రాహ్మణునకు యజ్ఞోపవీతము నూలుతో చేసిందైయుండవలెను. అది మూడు వరుసలతో ఊర్ధ్వముఖమైయుండవలెను. రాజు జనపనారతో చేసిన యజ్ఞోపవీతము వైశ్యుడు మేక ఉన్నితో చేసిన యజ్ఞోపవీతము ధరించాలి.

## దండము :

*బ్రాహ్మణో బైల్వపాలాశౌ క్షత్రియో వాటఖాదిరౌ,*
*పైలవౌదుంబరౌ వైశ్యో దండానర్హంతి ధర్మతః. 45*

*కేశాంతికో బ్రాహ్మణస్య దండః కార్యః ప్రమాణతః,*
*లలాటసంమితో రాజ్ఞః స్యాత్తు నాసాంతికో విశః. 46*

*ఋజవస్తే తు సర్వే స్యురవ్రణాః సౌమ్యదర్శనాః,*
*అనుద్వేగకరా నృణాం సత్వచో నాగ్నిదూషితాః. 47*

*ప్రతిగృహ్యేప్సితం దండముపస్థాయ చ భాస్కరమ్,*
*ప్రదక్షిణం పరీత్యాగ్నిం చరేద్భైక్షం యథావిధి. 48*

బ్రాహ్మణుడు మారెడు లేదా మోదుగవృక్షాలకు చెందిన దండాన్ని ,క్షత్రియుడు మర్రి లేదా చంద్ర వృక్షము యొక్క దండాన్ని , వైశ్యుడు పైలవరా 'లేక' ఔదుంబరా వృక్ష దండాన్ని ధరించాలి. బ్రాహ్మణుడు ధరించుదండము అతని వెంద్రుకలకొనలకు తగులునంత ఎత్తుగా ఉండాలి. క్షత్రియవటువు ధరించుదండము అతని నొసలునకు తగులుఁట్లుండవలెను. వైశ్యుడు ధరించుదండము అతని ముక్కునకు తగులునంత ఎత్తున వుండవలెను. అట్లే ఆ దండములు చక్కగా, దెబ్బలు లేకుండ నిప్పులో కాలినవి కాక, పై బెరడు కలిగి ఇతర ప్రాణులకు బాధ కలిగించకుండ ఉండాలి. అట్టి దండాలనావటువులు ధరించి సూర్యునకు అభిముఖంగా ఉండి అగ్నికి ప్రదక్షిణం చేసి ఆ తరువాత యధావిధిగా భిక్షాటన చేయాలి.

**భిక్షాటనము : -**

*భవత్పూర్వం చరేద్భైక్ష ముపనీతో ద్విజోత్తమః,*
*భవన్మధ్యం తు రాజన్యో వైశ్యస్తు భవదుత్తరమ్. 49*
*మాతరం వా స్వసారం వా మాతుర్వా భగినీం నిజామ్,*
*భిక్షేత భిక్షాం ప్రథమం యా చైనం నావమానయేత్. 50*
*సమాహృత్య తు తద్భైక్షం యావదర్థమమాయయా,*
*నివేద్య గురవేఽశ్నీయాదాచమ్య ప్రాఙ్ముఖశ్శుచిః. 51*

భిక్షాటనము చేయునప్పుడు బ్రాహ్మణవటువు భవచ్ఛబ్దాన్ని తొలుత ఉచ్చరించి భిక్షవేడుకోవలెను. ఎట్లనగా బ్రాహ్మణుడు "భవతి! భిక్షాందేహి, భవాన్ భిక్షాందదాతు అనవలెను. క్షత్రియుడు భవచ్ఛబ్దమును పదముల మధ్యనుంచి "భిక్షాంభవతిదేహి, భిక్షాంభవాన్ దదాతు అని భిక్షను యాచింపవలెను. వైశ్యుడు భవచ్ఛబ్దాంతముగా భిక్షాందేహి భవతి ! భిక్షాం దదాతు భవాన్ అని భిక్షను అడుగవలెను. ఉపనయనం జరిగిన తరువాత వటువు తన తల్లినో, సోదరినో, తల్లియొక్క సోదరినో తొలుత భిక్ష అడుగవలయును. అప్పుడా స్త్రీ బ్రహ్మచారిని అవమానింపక అతనికి భిక్ష నొసగవలెను. ఈ విధంగా సమీకరించిన భిక్షను కపటం లేక గురువునకు సమర్పించి అతని అనుజ్ఞ పొంది పరిశుద్ధుడై తూర్పున కభిముఖముగా కూర్చుండి ఆచమనం చేసి భుజించాలి.

# ద్వితీయాధ్యాయం

భోజన విధి :

> ఆయుష్యం ప్రాఙ్ముఖో భుంక్తే యశస్యం దక్షిణాముఖః,
> శ్రియం ప్రత్యఙ్ముఖో భుంక్తే ఋతం భుంక్తే హ్యుదఙ్ముఖః. 52

దీర్ఘాయుస్సు కావలెనను కొనువాడు తూర్పుముఖంగా కూర్చొని భుజించాలి. కీర్తిని కోరువాడు దక్షిణాభిముఖంగా కూర్చొని తినాలి. సంపదలు కోరుకొనువాడు పశ్చిమాభిముఖంగా భుజించాలి. సత్యఫలమును కోరుకొనువాడు ఉత్తర దిక్కునకు కూర్చొని భోజనము చేయాలి.

> ఉపస్పృశ్య ద్విజో నిత్యమన్నమద్యాత్సమాహితః,
> భుక్త్వా చోపస్పృశేత్సమ్యగద్భిః ఖాని చ సంస్పృశేత్. 53

> పూజయేదశనం నిత్య మద్యాచ్చైతదకుత్సయన్,
> దృష్ట్వా హృష్యేత్ప్రసీదేచ్చ ప్రతినందేచ్చ సర్వశః. 54

> పూజితం హ్యశనం నిత్యం బలమూర్జం చయచ్ఛతి,
> అపూజితం తు యద్భుక్తముభయం నాశయేదిదమ్. 55

> నోచ్ఛిష్టం కస్య చిద్దద్యాన్నాద్యాచ్చైవ తథాంతరా,
> న చైవాత్యశనం కుర్యాన్నచోచ్ఛిష్టః క్వచిద్వ్రజేత్. 56

ఇటువు ఆచమనం చేసిన తరువాత నియమంతో కూర్చొని ఆహారాన్ని తీసికొనవలెను. భోజనానంతరం కూడ ఆచమనం చేసి నోటితో ఘ్రాణాదీంద్రియములను స్పృశింపవలెను. అన్నమును ప్రతిదినం గౌరవించాలి. దానినెట్టి స్థితిలోను తిట్టరాదు. తాను తినే ఆహారాన్ని చూచి సంతోషపడాలి. ఇంకా వండినవారిని అభినందించాలి. తాను తినబోవు అన్నాన్ని గౌరవించినచో అది బలాన్ని సామర్థ్యాన్ని పెంపొందిస్తుంది. లేనిచో అది ఆ రెంటిని నాశనం చేస్తుంది. తినగా మిగిలిపోయిన (ఎంగిలి) అన్నాన్ని ఇతరులకెవ్వరికి పెట్టవద్దు. అట్లే సాయం ప్రాతఃకాలములందు తప్ప మధ్య మధ్య తినకూడదు. అతిగా భోజనం చేయకూడదు. ఇంకను భోజనం మధ్యలో ఎక్కడికిని పోకూడదు.

> అనారోగ్యమనాయుష్య మస్వర్గ్యం చాతిభోజనమ్,
> అపుణ్యం లోకవిద్విష్టం తస్మాత్తత్పరివర్జయేత్. 57

అతిగా భోజనము చేసినందువలన అనారోగ్యము కలుగుతుంది. ఆయుస్సు తరిగిపోతుంది. అనారోగ్యం వల్ల స్వర్గకారణమైన యాగాదులను చేయలేకపోవుటచే స్వర్గ దూరుడౌతాడు. పుణ్యహీనుడౌతాడు. అతిగా భుజించువానిని లోకులందరు దూషింతురు. కావున అతి భోజనాన్ని వదలిపెట్టాలి.

> బ్రాహ్మేణ విప్రస్తీర్థేన నిత్యకాలముపః స్పృశేత్,
> కాయత్రైదేశికాభ్యాం వా న పిత్ర్యేణ కదాచన. 58

బ్రాహ్మమైన తీర్థంతో ప్రతిదినం ఆచనమనం చేయాలి. లేదా ప్రాజాపత్యం కానిచో

దైవతీర్థంతోనైనా ఆచమనం చేయవలెనే కాని పితృసంబంధమైన నీటితో ఎప్పుడు కూడ ఆచమనం చేయకూడదు.

**బ్రాహ్మాది తీర్థ లక్షణము :-**

*అంగుష్ఠమూలస్య తలే బ్రాహ్మం తీర్థం ప్రచక్షతే,*
*కాయమంగులిమూలేz గ్రే దైవం పిత్ర్యం తయోరధః. 59*

అంగుష్ఠమూలము వరకుండు తీర్థం బ్రాహ్మతీర్థం. చిటికెన వ్రేలు వరకుండు నీటిని కాయతీర్థం లేక ప్రాజాపత్య తీర్థమంటారు. వ్రేళ్ళపై భాగము వరకుండు నీటిని దైవ తీర్థమని పిలుస్తారు. బొటనవేలు చూపుడు వేళ్ళ క్రిందనుండు నీటిని పిత్ర్యమంటారు.

**ఆచమనం చేయవలసినపద్ధతి :-**

*త్రిరాచామేదపః పూర్వం ద్విః ప్రమృజ్యాత్తతో ముఖమ్.*
*ఖాని చైవ స్పృశేదద్భిరాత్మానం శిర ఏవ చ, 60*

*అనుష్ణాభిరఫేనాభి రద్భిస్తీర్థేన ధర్మవిత్,*
*శౌచేప్సుస్సర్వదా చామేదేకాంతే ప్రాగుదఙ్ముఖః. 61*

బ్రాహ్మం మొదలైన తీర్థంతో మూడు పర్యాయాలు ఆచమనం చేయవలెను. తరువాత అంగుష్ఠంతో ముఖమును (పెదవులను) రెండుమార్లు తుడుచుకొనవలెను. అటు పిమ్మట నీటిచే తన కండ్లను, చెవులను, ముక్కును, హృదయాన్ని. శిరస్సును స్పృశించాలి. ఆచమనం చేసే తీర్థం వేడిగా ఉండకూడదు. నురుగుతో ఉండవద్దు. అట్టి నీటితో శుచిగా నుండగోరువాడు తూర్పుముఖంగా, లేక ఉత్తరాభిముఖంగా కూర్చుండి ఏకాంతంలో ఆచమనాన్ని చేయాలి.

**ఆచమన జలపరిమాణము :-**

*హృద్గాభిః పూయతే విప్రః కంఠగాభిస్తు భూమిపః,*
*వైశ్యోz ద్భిః ప్రాశితాభిస్తు శూద్రః స్పృష్టాభిరంతతః. 62*

బ్రాహ్మణుడు హృదయమునకు చేరునంత నీటితో ఆచమనం చేయాలి. క్షత్రియుడు కంఠం వరకు పోయే నీళ్ళతో. వైశ్యుడు ఆస్యగతమగు నీటితో ఆచమనం చేయాలి. శూద్రుడు నీటిని స్పృశించినంతమాత్రాన ఆచమనం చేసినట్లౌతుంది.

**ఉపవీత్యాది లక్షణము :-**

*ఉద్ధృతే దక్షిణే పాణావుపవీత్యుచ్యతే ద్విజః,*
*సవ్యే ప్రాచీన ఆవీతీ నివీతీ కంఠసజ్జనే.63*

కుడిచేయి ఎత్తినప్పుడు ఎడమ భుజంపై యజ్ఞోపవీతముంటే ఉపవీతియంటాము. కుడిభుజంపై యజ్ఞోపవీతముంటే ప్రాచీనావీతియంటాము. కంఠం పై వ్రేలాడుతూ ఉన్నచో నివీతి యంటాము.

*మేఖలా మజినం దండముపవీతం కమండలుమ్,*

*అప్సు ప్రాస్య వినష్టాని గృహ్ణీతాన్యాని మంత్రవత్. 64*

మేఖల, (నడుముచుట్టు ఉండేది) అజినం, యజ్ఞోపవీతం, కమండలువు భిన్నమైనా, తెగిపోయినా వాటిని నీటిలో (త్రొక్కుడు పడని ప్రదేశంలో) వేసి మంత్రపూర్వకరంగా క్రొత్తవాటిని స్వీకరించాలి.

*కేశాంతః షోడశే వర్షే బ్రాహ్మణస్య విధీయతే,*

*రాజన్యబంధోర్ద్వావింశే వైశ్యస్య ద్వ్యాధికే తతః 65*

గృహ్యసూత్రములందు చెప్పబడిన కేశసంస్కారాన్ని బ్రాహ్మణుడు గర్భషోడశవర్షంలో చేసికొనవలెను. క్షత్రియుడు గర్భద్వావింశతిసంవత్సరంలో వైశ్యుడు గర్భచతుర్వింశతి సంవత్సరంలో చేసికొనవలెను.

*అమంత్రికా తు కార్యేయం స్త్రీణామావృదశేషతః,*

*సంస్కారార్థం శరీరస్య యథాకాలం యథాక్రమం.66*

*వైవాహికో విధిః స్త్రీణాం సంస్కారో వైదికస్స్మృతః,*

*పతిసేవా గురౌ వాసో గృహార్థోऽగ్నిపరిక్రియా.67*

స్త్రీలకు జాతకర్మాది కర్మకాండాన్నంత ఆయా సమయములందు మంత్రరహితంగా చేయాలి. ఈ కర్మకాండమంతా శరీర సంస్కారమునకు సంబంధించింది కావున స్త్రీలకు సైతము దీనిని చేయాలి. కాని వివాహసంస్కారం మాత్రం వేదమంత్రాలచేతనే చేయాలి. వారికి వివాహ సంస్కారమే ఉపనయనం వంటిది. అందలి పతిసేవయే గురుకులవాసం. ఆమె చేయు ఇంటి పని సాయంప్రాతః కాలములందు చేయు హోమముల వంటిది.

*ఏష ప్రోక్తో ద్విజాతీనామౌపనాయనికో విధిః,*

*ఉత్పత్తివ్యంజకః పుణ్యకర్మయోగం నిబోధత.68*

ఓ మునులారా ! ఇంతవరకు బ్రాహ్మణాది ద్విజాతులకు చేయు ఉపనయన విధానము గూర్చి తెల్పినాను. ఈ విధానము ద్విజాతుల రెండవ జన్మకు సంబంధించింది. పరమ పవిత్రమైంది. ఇక ఉపనయనము చేసికొన్న ద్విజాతులు చేయాల్సిన కర్మలను తెలుపుదునని భృగుమహర్షి పలికినాడు.

**ఉపవీతుడు చేయవలసిన పనులు :-**

*ఉపనీయ గురుశ్శిష్యం శిక్ష యేచ్ఛౌచమాదితః,*

*ఆచారమగ్నికార్యం చ సంధ్యోపాసన మేవ చ. 69*

*అధ్యేష్యమాణస్త్వాచాంతోऽ యథాశాస్త్రముదఙ్ముఖః*

*బ్రహ్మాంజలికృతోధ్యాప్యో లఘువాసా జితేంద్రియః 70*

*బ్రహ్మారంభేऽవసానే చ పాదౌ గ్రాహ్యౌ గురోస్సదా,*

*సంహత్య హస్తావధ్యేయం స హి బ్రహ్మాంజలిః స్మృతః 71*

*వ్యత్యస్తపాణినా కార్యముపసంగ్రహణం గురోః,*
*సవ్యేన సవ్యః స్ప్రష్టవ్యో దక్షిణేన చ దక్షిణః. 72*

*అధ్యేష్యమాణం తు గురుర్నిత్య కాలమతంద్రితః*
*అధీష్వ భో ఇతి బ్రూయాద్విరామోz స్త్వితి చారమేత్. 73*

*బ్రహ్మణః ప్రణవం కుర్యాదాదావంతే చ సర్వదా,*
*స్రవత్యనోంకృతం పూర్వం పరస్తాచ్చ విశీర్యతే. 74*

*ప్రాక్కూలా న్పర్యుపాసీనః పవిత్రైశ్చైవ పావితః,*
*ప్రాణాయామైస్త్రిభిః పూత స్తత ఓంకారమర్హతి. 75*

ఉపనయనము చేసికొన్న శిష్యుని గురువు తన ఆశ్రమానికి తీసికొనిపోయి అతనికి మొట్టమొదట శౌచవిధానాన్ని తెలుపాలి. తరువాత స్నానం చేయుట ఆచమనం చేయుటవంటి ఆచారాలను నేర్పించాలి. అటు పిమ్మట సాయం ప్రాతఃకాలము లందు చేయాల్సిన హోమాదికాన్ని సంధ్యావందనాది కార్యాలను నేర్పాలి. శిష్యుడు ప్రతిదినం యథావిధిగా ఆచమనం చేసి ఉత్తరాభిముఖంగా కూర్చొని బ్రహ్మాంజలి పట్టుకొని అధ్యయనం చేయాలి. అతడు జితేంద్రియుడై యుండాలి. తాను ధరించే వస్త్రాలు చిన్నగా పరిశుద్ధంగా ఉండాలి. వేదాధ్యయనం ప్రారంభం చేస్తున్నప్పుడు, సమాప్తం చేస్తున్నప్పుడు గురువు యొక్క పాదాలు పట్టుకొని నమస్కరించి చేతులు కట్టుకొని వేదాధ్యయనం చేయాలి. దానిని బ్రహ్మాంజలియని యంటారు. గురువుయొక్క పాదాలను వ్యత్యస్తకరములచే స్పృశించి నమస్కరించాలి. ఎట్లనగా శిష్యుడు తన కుడిచేతిచే గురువు యొక్క కుడి పాదాన్ని, ఎడమ చేతిచే ఎడమపాదాన్ని పట్టుకొనవలెను. శిష్యుడు వేదాధ్యయనం చేస్తున్నప్పుడు ప్రారంభంలో గురువాతనితో నీవు వేదాధ్యయనం చేయాలి అని అనవలెను. అట్లే అధ్యయన పరిసమాప్తి దశయందు నీవు విరమింపుమని కూడ అనవలెను. అట్లే శిష్యుడు వేదాధ్యయన ప్రారంభంలో మరియు అవసానంలో ఓంకారమునుచ్ఛరించాలి. వేదాధ్యయన ప్రారంభసమయంలో ఓంకారమునుచ్ఛరింపనిచో ఆతడు నేర్చుకొన్న వేదం క్రమంగా క్షీణిస్తుంది. అట్లే అధ్యయనావసానంలో ఓంకారాన్ని ఉచ్చరించనిచో అతనికి వేదం అసలే రాదు. వేదాధ్యయనము చేయుటకు ముందు ప్రాగగ్రమగు దర్భలపై కూర్చొని రెండు చేతులతో దర్భలు పట్టుకొని మూడు ప్రాణాయామాలు చేసి పవిత్రుడైన తరువాత ఓంకారమునుచ్చరింపవలెను.

*అకారం చా ప్యుకారం చ మకారం చ ప్రజాపతిః,*
*వేదత్రయాన్ని రదు హద్భూర్భవస్స్వరితీతి చ. 76*
*త్రిభ్య ఏవతు వేదేభ్యః పాదం పాదమదూదుహత్,*
*తదిత్యృచోz స్యాస్సావిత్ర్యాః పరమేష్ఠీ ప్రజాపతిః 77*

*ఏతదక్షరమేతాం చ జపన్ వ్యాహృతి పూర్వికామ్,*
*సంధ్యయోర్వేదవిద్విప్రో వేదపుణ్యేన యుజ్యతే. 78*

*సహస్రకృత్వస్త్వభ్యస్య బహిరేతత్రికం ద్విజః,*
*మహతో ఽ ప్యేనసో మాసాత్త్వ చేవాహిర్విముచ్యతే. 79*

*ఏతయర్చా విసంయుక్తః కాలే చక్రియయా స్వయా,*
*బ్రహ్మక్షత్రియవిడ్యోనిర్గర్హ ణాం యాతి సాధుషు. 80*

*ఓంకారపూర్వికా స్తిస్రో మహావ్యాహృతయో ఽ వ్యయాః,*
*త్రిపదా చైవ సావిత్రీ విజ్ఞేయం బ్రహ్మణో ముఖమ్. 81*

*యోఽ ధీతేఽ హన్యహన్యేతాం త్రీణి వర్షాణ్యతంద్రితః*
*స బ్రహ్మపదమభ్యేతి వాయుభూతః ఖమూర్తిమాన్ 82*

ఋగ్యజుస్సామవేదములనుండి అకార ఉకారమకార రూపమగు ప్రణవమును భూఃభువఃసువః అను వ్యాహృతి త్రయమును బ్రహ్మ ఏర్పరచెను. అట్లే మూడు వేదములనుండి గాయత్రీ మంత్రమునకు సంబంధించిన ''తత్సవితుర్వరేణియం, భర్గోదేవస్యధీమహి, ధియోయోనః ప్రచోదయాత్'' అను పాదములను ఆకర్షించెను. అందువల్ల ఓంకారాన్ని, త్రిపదయైన గాయత్రీమంత్రాన్ని వ్యాహృతి త్రయపూర్వకంగా సంధ్యాకాలములందు జపించే వేదజ్ఞుడైన బ్రాహ్మణుడు వేదాధ్యయనం చేసిన పుణ్యాన్ని పొందుతాడు. ప్రణవ వ్యాహృతులతో నున్న త్రిపదయైన గాయత్రిని వేయి పర్యాయములు జపించినచో సర్పము కుబుసమును వదలివేసినట్లు గొప్ప పాపమునుండి విముక్తుడౌతాడు. అట్లే ఈ గాయత్రీమంత్రాన్ని జపించనివారిని, సాయంప్రాతఃకాలాలలో చేయదగిన హోమాలనాచరింపని ద్విజాతులను సజ్జనులు నిందిస్తారు. అందువల్ల సావిత్రీ జపాన్ని జపహోమాది క్రియలను తప్పక నిర్వర్తించాలి. ఓంకారం మూడు వ్యాహృతులు త్రిపదయగు గాయత్రీమంత్రం పరబ్రహ్మ ప్రాప్తికి కారణాలౌతున్నవి. వీటిని మూడు సంవత్సరాలు ప్రతిదినము జపిస్తే అతడు పరబ్రహ్మాన్ని తప్పక పొందుతాడు. అతడు వాయువువలె స్వేచ్ఛగా సంచరింపగలుగుతాడు.

*ఏకాక్షరం పరం బ్రహ్మ ప్రాణాయామాః పరం తపః*
*సావిత్ర్యాస్తు పరం నాస్తి మౌనాత్సత్యం విశిష్యతే. 83*

*క్షరంతి సర్వా వైదిక్యో జుహోతియజతిక్రియాః*
*అక్షరం దుష్కరం జ్ఞేయం బ్రహ్మ చైవ ప్రజాపతిః. 84*

ఏకాక్షరమైన ఓంకారమే పరబ్రహ్మము. ప్రాణాయామాలను మించిన తపస్సు లేదు. అట్లే గాయత్రీ మంత్రాన్ని మించిన మంత్రం కానరాదు. మౌనం కంటె సత్యం పలుకుట చాలా శ్రేష్ఠమైంది. వేదవిహితమైన యజ్ఞయాగాదిక్రియలు నశించి పోతాయి కాని ఓంకారం మాత్రం ఎన్నడూ నశించిపోదు. అది పరబ్రహ్మ స్వరూపము, ప్రజాపతి స్వరూపము కావున దానికి నాశనము కలుగదు.

*విధియజ్ఞాజ్జపయజ్ఞో విశిష్టో దశభిర్గుణైః*
*ఉపాంశుః స్యాచ్ఛతగుణః సాహస్రో మానసఃస్మృతః 85*

వేదవిహితమైన దర్శపౌర్ణమాసి మొదలగు యజ్ఞాలకంటె ఓంకారం మొదలగువాటిని జపించుట పదిరెట్లు శ్రేష్ఠం. దీనిని ఉపాంశువుగా అనగా ప్రక్కవానికి వినిపించకుండ చేయు జపం నూరురెట్లు గొప్పది. ఇంకను మానసిక జపం వేయిరెట్లు గొప్పది.

*యే పాక యజ్ఞాశ్చత్వారో విధియజ్ఞ సమన్వితాః,*
*సర్వే తే జపయజ్ఞస్య కలాం నార్హంతి షోడశీమ్. 86*
*జప్యేనైవ తు సంసిధ్యేద్బ్రాహ్మణో నాత్ర సంశయః,*
*కుర్యాదన్యన్న వా కుర్యాన్మైత్రో బ్రాహ్మణ ఉచ్యతే. 87*

పంచమహాయజ్ఞాలలో బ్రహ్మయజ్ఞం కాక మిగిలిన వైశ్వదేవహోమ, బలికర్మ, నిత్యశ్రాద్ధ, అతిథి భోజనాత్మకములైన నాలుగు పాకయజ్ఞాలు, దర్శము, పౌర్ణమాసి మొదలైన వేదవిహితమైన యజ్ఞాలన్నియు జపయజ్ఞంలో పదునారవవంతైన కాజాలవు. బ్రాహ్మణునికి జపం వల్లనే సమస్త సిద్ధులు కలుగుతాయి. జపసిద్ధి పడసినచో వైదికమైన యాగాది కార్యకలాపములు చేసినా, చేయకపోయినా పరబ్రహ్మన్ని పొందుతాడు

*ఇంద్రియాణాం విచరతాం విషయేష్వపహారిషు,*
*సంయమే యత్నమాతిష్ఠేద్విద్వాన్ యంతేవ వాజినామ్ 88*

జ్ఞానం కలవాడు తన ఇంద్రియాలను నిగ్రహించుకోవాలి. అవి నానా విషయములలో ప్రవర్తిస్తూ ఉంటాయి. అందువల్ల రథికుడు తన రథానికి కట్టబడ్డ గుఱ్ఱాలను తన ఆజ్ఞలో ఉంచుకొన్నట్లు విద్వాంసుడు కూడ తన యొక్క ఇంద్రియాలను తన అధీనంలో ఉంచుకోవాలి.

*ఏకాదశేంద్రియాణ్యాహుర్యాని పూర్వే మనీషిణః,*
*తాని సమ్యక్ప్రవక్ష్యామి యథావదనుపూర్వశః 89*

విద్వాంసులు ఇంద్రియాలు పదకొండని విభజించి చెప్పిరి. వాటిని క్రమముగా మీకు చెప్పుదునని మహర్షులతో భృగుమహర్షి అనెను.

*శ్రోత్రం త్వక్చక్షుషీ జిహ్వా నాసికా చైవ పంచమీ,*
*పాయూపస్థం హస్తపాదం వాక్ చైవ దశమీ స్మృతా 90*

*బుద్ధీంద్రియాణి పంచేషాం శ్రోత్రాదీన్యనుపూర్వశః*
*కర్మేంద్రియాణి పంచైషాం పాయ్వాదీని ప్రచక్షతే. 91*

*ఏకాదశం మనో జ్ఞేయం స్వగుణేనోభయాత్మకమ్,*
*యస్మిన్ జితే జితావేతౌ భవతః పంచకౌ గణౌ. 92*

*ఇంద్రియాణాం ప్రసంగేన దోషమృచ్ఛత్యసంశయమ్,*
*సన్నియమ్య తు తాన్యేవ తతస్సిద్ధిం నియచ్ఛతి 93*

చెవులు, కండ్లు, నాలుక, ముక్కు, త్వగింద్రియము అను నవి ఐదు. పాయువు, ఉపస్థ, చేతులు, పాదములు, వాక్కు అనునవి ఐదు ఇంద్రియములు. వీటిలో శ్రోత్రము

మొదలగు ఐదు ఇంద్రియములు జ్ఞానేంద్రియములు, పాయువు మొదలగు ఐదు కర్మేంద్రియములు. ఇవి కాక మనస్సు అనునది పదకొండవ ఇంద్రియమగుచున్నది. ఇది దానియొక్క స్వభావమునననుసరించి బుద్ధీంద్రియముగా కర్మేంద్రియముగా మారుతున్నది. మనస్సును జయిస్తే తక్కిన జ్ఞాన కర్మేంద్రియాలను జయించినట్లే. ఈ ఇంద్రియాలు విషయాలపై తగులుకున్నందువలన తప్పక దోషము కలుగుతున్నది. అందువల్ల పదకొండు ఇంద్రియాలను నిగ్రహిస్తే తప్పక సిద్ధి కలుగుతుంది.

*న జాతు కామః కామానాముపభోగేన శామ్యతి,*
*హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏవాభివర్ధతే 94*

కోరికలను తీర్చుకొనినచో అవి ఎన్నటికిని తగ్గిపోవు. పైగా నేయి పోసినచో ఇంకను ప్రజ్వరిల్లు అగ్ని వలె ఆ కోరికలు పెరిగిపోవుచునేయుండును.

*యశ్చైతాన్ ప్రాప్నుయాత్సర్వాన్ యశ్చైతాన్ కేవలాం స్త్యజేత్,*
*ప్రాపణా త్సర్వకామానాం పరిత్యాగో విశిష్యతే. 95*

ఈ కోరికలను తీర్చుకొనుచు పోవుట కంటె విషయలోలుడు కాకుండ కోరికలకు దూరంగా ఉండుట మిక్కిలి ప్రశస్తమైంది.

*న తథైతాని శక్యంతే సన్నియంతుమసేవయా,*
*విషయేషు ప్రజుష్టాని యథా జ్ఞానేన నిత్యశః. 96*

*వేదాస్త్యాగశ్చ యజ్ఞాశ్చ నియమాశ్చ తపాంసి చ,*
*న విప్రదుష్టభావస్య సిద్ధిం గచ్ఛంతి కర్హి చిత్ 97*

విషయాలందు ఆసక్తమైన ఇంద్రియాలను విషయాలకు దూరంగా నుంచి నిగ్రహింపవచ్చును. అట్లే విషయాలందున్న దోషాలను గ్రహించే జ్ఞానంవల్ల ఇంద్రియాలను నిగ్రహింపవచ్చును. వేదాలు, దానం, యజ్ఞాలు, యమనియమాలు, తపస్సు ఇవన్నియు భోగాది విషయాలను అనుభవించాలనే చెడు తలపు ఉన్నవానికి ఫలసిద్ధిని కలిగింపవు.

*శ్రుత్వా స్పృష్ట్వా చ దృష్ట్వా చ భుక్త్వా ఘ్రాత్వా చ యో నరః,*
*న హృష్యతి గ్లాయతి వా స విజ్ఞేయో జితేంద్రియః 98*

*ఇంద్రియాణాం తు సర్వేషాం యద్యేకం క్షరతీంద్రియమ్,*
*తేనాస్య క్షరతి ప్రజ్ఞా దృతేః పాదాదివోదకమ్. 99*

*వశే కృత్వేంద్రియగ్రామం సంయమ్య చ మనస్తథా,*
*సర్వాన్ సంసాధయేదర్థానక్షిణ్వన్ యోగత స్తనుమ్ 100*

విషయాలను చూచి విని, స్పృశించి, భుజించి, ఆఘ్రాణించి, రాగవిరాగములను పొందనివాడు జితేంద్రియుడు. సర్వేంద్రియాలలో ఏ ఒక్క ఇంద్రియం విషయాసక్తమైనా

రంధ్రం పడ్డ పాత్రలో నుండి నీరంతా జారిపోయినట్లు అతని జ్ఞానమంతా నశిస్తుంది. అందువల్ల జ్ఞానేంద్రియాలను కర్మేంద్రియాలను మనస్సును అన్నిటిని నిగ్రహించి సమస్త పురుషార్థములను సాధించుకొనవచ్చును. యోగమార్గంలో ఉండి తన శరీరాన్ని బాధపెట్టక కార్యాలను సాధించుకొనవచ్చు.

సంధ్యావందన విధి :-

*పూర్వాం సంధ్యాం జపం స్తిష్ఠే త్సావిత్రీమార్కదర్శనాత్,*
*పశ్చిమాం తు సమాసీనః సమ్యగృక్ష విభావనాత్ 101*

*పూర్వాం సంధ్యాం జపంస్తిష్ఠే న్నైశమేనో వ్యపోహతి,*
*పశ్చిమాంతు సమాసీనో మలం హంతి దివాకృతమ్ 102*

*న తిష్ఠతి తు యః పూర్వాం నోపాస్తే యశ్చ పశ్చిమామ్,*
*స శూద్రవద్బహిష్కార్యః సర్వస్మాద్ద్విజకర్మణః 103*

ప్రాతఃసంధ్యాకాలంలో గాయత్రీమంత్రాన్ని సూర్యోదయం వరకు నిలబడి జపించాలి. అట్లే సాయంసంధ్యయందు గాయత్రీమంత్రాన్ని నక్షత్రాలు కనిపించే వరకు కూర్చొని జపించాలి. ప్రాత:స్సంధ్యను సాయంసంధ్యను ఉపాసించని ద్విజన్ముడు శూద్రునివంటివాడు. అతనిని సమస్త ద్విజకర్మలనుండి బహిష్కరించాలి.

*అపాం సమీపే నియతో నైత్యకం విధిమాస్థితః,*
*సావిత్రీ మప్యధీయీత గత్వారణ్యం సమాహితః. 104*

అనేకంగా ఉన్న వేదాలను అధ్యయనం చేయలేనివాడు అరణ్యానికి పోయి నదీతీరంలో నిత్యకార్యమైన బ్రహ్మయజ్ఞాన్ని చేయుటకు ప్రణవ వ్యాహృతి త్రయోపేతమైన గాయత్రీమంత్రాన్ని అధ్యయనం చేయాలి.

*వేదోపకరణే చైవ స్వాధ్యాయే చైవ నైత్యకే,*
*నానురోధోస్త్యనధ్యాయే హోమమంత్రేషు చైవ హి 105*

*నైత్యకే నాస్త్యనధ్యాయో బ్రహ్మసత్రం హి తత్ స్మృతమ్,*
*బ్రహ్మాహుతిహుతం పుణ్య మనధ్యాయవషట్ కృతమ్. 106*

వేదాంగాలైన శిక్షావ్యాకరణాదులను అధ్యయనం చేసే విషయంలో అనధ్యయనమును పాటింపకూడదు. అట్లే నిత్య కార్యమైన జపయజ్ఞాదులు బ్రహ్మసత్రం కావున తద్విషయంలోను అనధ్యయనంలేదు. వేదమంత్రములచే చేయు హోమములు పుణ్యకార్యములు కావున వాటి విషయముననను అనధ్యాయము లేదు.

*యస్స్వాధ్యాయమధీతేఽబ్దం విధినా నియతశ్శుచిః,*
*తస్య నిత్యం క్షరత్యేష పయో దధి ఘృతం మధు 107*

## ద్వితియాధ్యాయం

వేదాన్ని ప్రతిదినం శుచియై నియమంతో సంవత్సరకాలమధ్యయనం చేస్తే దేవతలను పాలు, పెరుగు, నేయి తేనెలతో సంతోషపెట్టినవాడౌతాడు.

*అగ్నీంధనం భైక్షచర్యామధశ్శయ్యాం గురోర్హితమ్,*
*ఆసమావర్తనాత్కుర్యాత్ కృతోపనయనో ద్విజః. 108*

ఉపనయనం చేసికొన్ని బ్రహ్మచారి ప్రతిదినం సాయంప్రాతః కాలాలలో యజ్ఞ సమిధలను తెచ్చి హోమము చేయుట, భిక్షాచరణం, భూతలశయ్య, గురుశుశ్రూష మొదలైన కార్యాలను స్నాతకం వరకు అనుష్ఠించవలెను.

**శిష్య భేదము :-**

*ఆచార్యపుత్రశ్శుశ్రూషుర్జ్ఞానదో ధార్మికశ్శుచిః,*
*ఆప్తశ్శక్తోzర్థదస్సాధుస్వధ్యాప్యా దశ ధర్మతః 109*

గురుపుత్రుడు, తనకు శుశ్రూష చేయువాడు, వేరొక విద్య నేర్పేవాడు, ధార్మికుడు, శుచిగా ఉండేవాడు, ఆప్తుడు, బోధించినదానిని చక్కగా గ్రహించేవాడు, ధనాన్ని ఇచ్చువాడు, మంచివాడు, తన జ్ఞాతి అను ఈ పదిమందికి సాధారణంగా చదువు చెప్పవలెను.

*నాపృష్టః కస్య చిద్బ్రూయాన్న చాన్యాయేన పృచ్ఛతః*
*జానన్నపి హి మేధావీ జడవల్లోక ఆచరేత్ 110*

*అధర్మేణ చ యః ప్రాహ యశ్చాధర్మేణ పృచ్ఛతి,*
*తయోరన్యతరః ప్రైతి విద్వేషం వాz ధిగచ్ఛతి. 111*

*ధర్మార్థౌ యత్ర న స్యాతాం శుశ్రూషా వాపి తద్విధా,*
*తత్ర విద్యా న వప్తవ్యా శుభం బీజమివోషరే. 112*

అట్లే అడుగనిదే ఎవ్వరికిని చదువు చెప్పరాదు. ప్రశ్నవేయువాని ధర్మమగు భక్తి శ్రద్ధలు లేనిచో అడిగినప్పటికీ చదువు చెప్పరాదు. జ్ఞానవంతుడు తనకు విషయం తెలిసినా జడుని వలె ప్రవర్తించాలి. కాని వాచాలుని వలె చెప్పరాదు. ప్రశ్నవేయువానికి, చదువుకొనువానికి ఉండవలసిన ధర్మమగు భక్తి శ్రద్ధలు లేక అడిగితే అతనికి విద్యనేర్పిన వాడు లేక అడిగినవాడు ఈ ఇద్దరిలో ఒకరు తప్పక మరణింతురు లేనిచో ఇద్దరిమధ్య ద్వేషమేర్పడుతుంది. అదే విధంగా ఎవరివద్ద ధర్మంగాని అర్థంగాని లేక గురుశుశ్రూషణా పరాయణత్వంగాని ఉండవో అతనికి విద్యనేర్పకూడదు. ఆ విధంగా విద్య నేర్పినచో అది చవిటినేలలో పడ్డ విత్తనం వలె వ్యర్థమౌతుంది.

*విద్యయైవ సమం కామం మర్తవ్యం బ్రహ్మవాదినా,*
*ఆపద్యపి హి ఘోరాయాం న త్వేనామిరిణే వపేత్ 113*

*విద్యా బ్రాహ్మణమేత్యాహ శేవధి స్తే z స్మి రక్ష మామ్,*
*అసూయకాయ మాం మాదా స్తథా స్యాం వీర్యవత్తమా 114*

*యమేవ తు శుచిం విద్యాన్నియతంబ్రహ్మచారిణమ్*
*తస్మై మాం బ్రూహి విప్రాయ నిధిపాయాప్రమాదినే 115*

వేదాధ్యయనపరుడు తనకు సరియైన శిష్యుడు లభించకపోతే తన దగ్గర ఉన్న విద్యను ఎవ్వరికి నేర్పించక తానా విద్యతో చనిపోయినా తప్పులేదు కాని ఎంత గొప్ప ఆపద కలిగినా ఆ విద్యను వ్యర్థునకు మాత్రం ఉపదేశింపకూడదు. విద్య బ్రహ్మజ్ఞునితో "నేను నీకు నిధివంటి దాన్ని. నన్ను రక్షించుము. నీవు నన్ను అసూయ కలవానికి ఇవ్వబోకుము. అందువలన నేను మిక్కిలి బలము కలిగియుంటాను. నీవు పవిత్రునికి చక్కగా బ్రహ్మచర్య వ్రతాన్ని పరిపాలించే వానికి మాత్రమే నన్ను (విద్యను) చెప్పుము. అట్టి శిష్యుడు నిధివంటి నన్ను రక్షిస్తాడు. అట్లే నాకు ప్రమాదాన్ని కలిగించదని పలికింది.

*బ్రహ్మ యస్త్వననుజ్ఞాత మధీయానాదవాప్నుయాత్,*
*స బ్రహ్మస్తేయసంయుక్తో నరకం ప్రతిపద్యతే 116*

గురువు యొక్క అనుజ్ఞ తీసికొనక అతని శిష్యుని దగ్గరో, ఇతర శిష్యులకు అధ్యయనము చేయిన్తున్నప్పుడు విని వేదాన్ని అభ్యసిస్తాడో అతడు వేదమునపహరించినవాడౌతాడు. కావున నరకానికి తప్పకపోతాడు.

*లౌకికం వైదికం వాపి తథాధ్యాత్మికమేవ చ,*
*ఆదదీత యతో జ్ఞానం తం పూర్వమభివాదయేత్ 117*

గురువు దగ్గర లౌకిక విద్యలనో, వైదిక విద్యలనో, అధ్యాత్మ విద్యలనో అభ్యసించే శిష్యుడు తన గురువునకు మొదలు నమస్కరింపవలెను.

*సావిత్రీమాత్రసారోపి వరం విప్రస్సుయంత్రితః,*
*నాయంత్రితస్త్రివేదో ఽ పి సర్వాశీ సర్వవిక్రయీ 118*

శాస్త్రజ్ఞానంగల విప్రుడు వేదాలనభ్యసింపక పోయినా, గాయత్రీ జపపరాయణుడైతే శ్రేష్ఠుడౌతాడు. అట్లే శాస్త్రమర్యాదనుసరింపనివాడు మూడు వేదములనభ్యసించిన నూనిందాపాత్రుడౌతాడు.

*శయ్యాసనేఽధ్యాచరితే శ్రేయసా న సమావిశేత్,*
*శయ్యాసనస్థశ్చైవైనం ప్రత్యుత్థాయాభివాదయేత్ 119*

*ఊర్ధ్వం ప్రాణా హ్యుత్క్రమంతి యూనః స్థవిర ఆయతి,*
*ప్రత్యుత్థానాభివాదాభ్యాం పునస్తాన్ ప్రతిపద్యతే. 120*

*అభివాదనశీలస్య నిత్యం వృద్ధోప సేవినః,*
*చత్వారి తస్య వర్ధంత ఆయుర్విద్యా యశో బలమ్ 121*

పెద్దవారు పడుకొనియున్నప్పుడు, ఆసనముపై కూర్చొనియున్నప్పుడు వారితో సమానంగా కూర్చొనకూడదు. అట్లే తాను శయ్యపై నున్నప్పుడు ఆసనముపై నున్నప్పుడు పెద్దలు వస్తే లేచి నమస్కరించాలి. పెద్దలు వచ్చినప్పుడు భయంతో చిన్నవారి ప్రాణాలు పోవుటకు సిద్ధముగా నుంటాయి కావున వెంటనే లేచి వారికి నమస్కరిస్తే ఆ ప్రాణాలు పైకి పోకుండ స్థిరంగా ఉంటాయి. పెద్దలకు నమస్కరించే తత్వం గలవారికి, వారిని సేవించే వారికి ఆయుస్సు, విద్య, కీర్తి, బలం అనేవి అభివృద్ధి చెందుతాయి.

*అభివాదాత్పరం విప్రో జ్యాయాంసమభివాదయన్,*
*అసౌ నామాహమస్మీతి స్వం నామ పరికీర్తయేత్ 122*

*నామధేయస్య యే కేచిదభివాదం న జానతే,*
*తాన్ ప్రాజ్ఞో ऽ హమితి బ్రూయాత్ స్త్రియః సర్వాస్తథైవ చ. 123*

*భో శ్శబ్దం కీర్తయేదంతే స్వస్య నామ్నో ऽ భివాదనే,*
*నామ్నాం స్వరూపభావో హి భోభావ ఋషిభిః స్మృతః 124*

బ్రాహ్మణుడు తనకంటె పెద్దవారికి నమస్కారం చేస్తున్నప్పుడు "అసౌనామాహమస్మి' అని తన పేరు చెప్పుకొనవలెను. అట్లే అభివాదనప్రత్యభివాదన పద్ధతిని తెలియనివారితో అహం అభివాదయే అని మాత్రము చెప్పవలెను. పెద్దలగు స్త్రీలకు సహితమిట్లే నమస్కరింపవలెను. అట్లే 'భోః' అను పదాన్ని నమస్కారము చేయునపుడు చివరకు ఉచ్చరించాలి. ఎట్లనగా అభివాదయే రామశర్మా హమస్మి భోః అనునట్లు నమస్కరించాలి.

*ఆయుష్మాన్ భవ సౌమ్యేతి వాచ్యో విప్రో ऽ భివాదనే,*
*అకారశ్చాస్య నామ్నోంతే వాచ్యః పూర్వాక్షరః ప్లుతః 125*

బ్రాహ్మణుడు తనకంటె పెద్దలకు నమస్కరిస్తున్నప్పుడు వారు ఆయుష్మాన్ భవసౌమ్య అని ఆశీర్వచనము నొసగాలి. నమస్కరించే వాని పేరు యొక్క చివర ఉండు అకారమును ప్లుతముగా ఉచ్చరించాలి. ఆయుష్మాన్ భవసౌమ్య నరసింహా అను విధంగా ఆశీర్వదించాలి.

*యో న వేత్త్యభివాదస్య విప్రః ప్రత్యభివాదనమ్,*
*నాభివాద్యస్స విదుషా యథా శూద్ర స్తథైవ సః 126*

విప్రుడు అభివాదం చేస్తున్నప్పుడు ప్రత్యభివాదము చేయు పద్ధతి తెలియని విప్రునకు ప్రాజ్ఞుడు నమస్కరింపకుండుటయే మేలు.

*బ్రాహ్మణం కుశలం పృచ్ఛేత్ క్షత్రబంధుమనామయమ్,*
*వైశ్యం క్షేమం సమాగమ్య శూద్రమారోగ్యమేవ చ. 127*

బ్రాహ్మణులు కనిపించినపుడు వారిని కుశలమడుగవలయును. క్షత్రియుడు కనిపించినచో అనామయమడుగవలెను. వైశ్యుని క్షేమమును, శూద్రుని ఆరోగ్యముగా నున్నావా అని అడుగవలెను. కుశలము, అనామయము, క్షేమము, ఆరోగ్యము సమానార్థకములేయైనను ఆయా జాతులవారిని ఆయా పదములతో క్షేమమడుగవలయునని మనుస్మృతికారుడు భావించినట్లున్నాడు.

*అవాచ్యో దీక్షితో నామ్నా యవీయానపి యో భవేత్,*
*భోభవత్పూర్వకం త్వేనమభిభాషేత ధర్మవిత్ 128*

ప్రత్యభివాదము చేయునపుడు తనకు నమస్కరించినవాడు వయస్సులో చిన్నవాడైనను, యాగాదులందు దీక్షవహించియున్నచో అతనిని పేరు పెట్టి పిలువరాదు.

అందువలన ధర్మము తెలిసినవాడు 'భోః' 'భవాన్' పదములతో ఆ దీక్షితునితో మాట్లాడవలెను.

*పరపత్నీ తు యా స్త్రీ స్యాదసంబంధా చ యోనితః,*
*తాం బ్రూయాద్భవతీత్యేవం సుభగే భగినీతి చ. 129*

*మాతులాంశ్చ పితృవ్యాంశ్చ శ్వశురానృత్విజో గురూన్,*
*అసావహమితి బ్రూయాత్ ప్రత్యుత్థాయ యవీయసః 130*

*మాతృష్వసా మాతులానీ శ్వశ్రూరపి పితృష్వసా,*
*సంపూజ్యా గురుపత్నీవత్ సమాస్తా గురుభార్యయా 131*
*భ్రాతుర్భార్యోపసంగ్రాహ్యా సవర్ణా హన్యహన్యపి,*
*విప్రోష్య తూపసంగ్రాహ్యా జ్ఞాతి సంబంధియోషితః 132*

*పితుర్భగిన్యాం మాతుశ్చ జ్యాయస్యాం చ స్వసర్యపి,*
*మాతృవద్వృత్తిమాతిష్ఠేన్మాతా తాభ్యో గరీయసీ. 133*

పరులభార్యను, తనకు దగ్గరి సంబంధము లేని స్త్రీని గౌరవనీయురాలని, సోదరియని పిలువవలెను. మేనమామలతో, తండ్రియొక్క సోదరులతో, మామలతో, ఋత్విక్కులతో గురువులతో మాట్లాడేటప్పుడు వారు తనకంటె వయస్సులో చిన్నవారైనా వారికి తన పేరు చెప్పుకొని లేచి గౌరవించాలి. అట్లే తల్లియొక్క అక్కా చెల్లెండ్లను, మేనత్తను, అత్తను, మేనమామ భార్యను, గురుభార్యతో సమానంగా గౌరవించాలి. సోదరుల భార్యలను ప్రతిదినం నమస్కరించాలి. తల్లిదండ్రులకు సంబంధించిన మేనమామ పినతండ్రి పెద్దతండ్రియొక్క భార్యలు ఊరినుండి వచ్చినప్పుడు వారికి పాదాభివందనం చేయాలి. మేనత్తను, తల్లియొక్క అక్కను తల్లితో సమానంగా గౌరవించాలి. ఐనా తల్లి వారందరికంటె శ్రేష్ఠురాలు.

*దశాబ్దాఖ్యం పౌరసఖ్యం పంచాబ్దాఖ్యం కలాభృతామ్,*
*త్ర్యబ్దపూర్వం శ్రోత్రియాణాం స్వల్పేనాపి స్వయోనిము 134*

*బ్రాహ్మణం దశవర్షం తు శతవర్షం తు భూమిపమ్,*
*పితా పుత్రా విజానీయాద్బ్రాహ్మణస్తు తయోః పితా 135*

ఒకే చోట నివసించువారు పది సంవత్సరాలు పెద్దవారైనప్పటికీ వారితో స్నేహం చేయవచ్చును. అంతకంటె వయస్సున పెద్దవారైనచో గౌరవించాలి. గీతవాద్యాదికళలనెరింగిన వారు ఐదు సంవత్సరములు పెద్దవారైనా వారితో స్నేహం చేయాలి. అట్లే శ్రోత్రియులు మూడు సంవత్సరములు పెద్దయైనా స్నేహానికర్హులౌతారు. కాని ఒకే వంశంలో పుట్టినవారు తనకంటే వయసులో కొద్దిగా పెద్దయైనా గౌరవింపదగినవారే. పది సంవత్సరముల బ్రాహ్మణుడు వంద సంవత్సరముల క్షత్రియునకు తండ్రివలె గౌరవింపదగిన వాడౌతాడు.

*విత్తం బంధుర్వయః కర్మ విద్యా భవతి పంచమీ,*
*ఏతాని మాన్యస్థానాని గరీయో యద్య దుత్తరమ్ 136*

*పంచానాం త్రిషు వర్ణేషు భూయాంసి గుణవంతి చ,*

*యత్ర స్యుస్సోఽత్ర మానార్హః శూద్రోఽపి దశమీం గతః 137*

న్యాయంగా సంపాదించిన ధనం, బంధుత్వం, వయస్సు, కులాచారములనాచరించుట, విద్య అనునవి ఒకదాని కంటె ఇంకొకటి మిక్కిలి గౌరవాన్ని కలిగిస్తాయి. ఇవి అధికంగా ఉన్నవాడు మిక్కిలి గౌరవింపదగినవాడు. అట్లే తొంభైసంవత్సరములు పైబడిన శూద్రుడు బ్రాహ్మణునకు కూడ గౌరవింపదగినవాడే.

*చక్రిణో దశమీస్థస్య రోగిణో భారిణః స్త్రియాః,*

*స్నాతకస్య చ రాజ్ఞశ్చ పంథా దేయో వరస్య చ. 138*

*తేషాం తు సమవేతానాం మాన్యౌ స్నాతక పార్థివౌ,*

*రాజస్నాతక యోశ్చైవ స్నాతకో నృపమానభాక్ 139*

రథముపై నున్న వానికి, తొంభై సంవత్సరములు దాటిన వానికి, రోగికి, బరువునెత్తుకున్నవానికి, స్త్రీకి, విద్యను పూర్తిచేసికొని స్నాతకవ్రతము చేసికొన్నవానికి, రాజుకు, వివాహమునకై బయలుదేరినవానికి అడ్డురాక త్రోవనొసగాలి. వీరందరు కలిసి పోతున్నప్పుడు వారిలో రాజుకు, స్నాతకునకు ప్రాధాన్యమియ్యాలి. వీరిలోను రాజుకంటెను విద్యా పరిసమాప్తి చేసి కొన్న స్నాతకునకు అత్యధిక ప్రాధాన్యమీయవలెను. అతడు రాజుకు సహితం గౌరవార్హుడౌతున్నాడు.

**ఆచార్యుడు :-**

*ఉపనీయ తు యశ్శిష్యం వేదమధ్యాపయేద్ద్విజః,*

*సకల్పం సరహస్యం చ తమాచార్యం ప్రచక్షతే. 140*

ఉపనయనం చేసికొన్న శిష్యునకు, కల్పము, రహస్య సహితమైన వేదాన్ని సాంగోపాంగంగా నేర్పించే వానిని ఆచార్యుడని అంటారు.

**ఉపాధ్యాయులు :-**

*ఏక దేశం తు వేదస్య వేదాంగాన్యపి వా పునః,*

*యోఽధ్యాపయతి వృత్త్యర్థముపాధ్యాయస్స ఉచ్యతే 141*

వేదభాగమైన మంత్రాన్నో బ్రాహ్మణాన్నో వేదాంగములైన శిక్షా, వ్యాకరణాదులలో దేనినైనా తన వృత్తి ధర్మాన్ననుసరించి శిష్యునకుపదేశించువానిని ఉపాధ్యాయుడని అంటారు.

**గురువు :-**

*నిషేకాదీని కర్మాణి యః కరోతి యథావిధి,*

*సంభావయతి చాన్నేన స విప్రో గురురుచ్యతే 142*

గర్భాదానం మొదలైన కర్మలను యథావిధిగా చేయించువానిని, అన్నం పెట్టి పోషించువానిని గురువని అంటారు.

ఋత్విక్ :-

*అగ్న్యాధేయం పాకయజ్ఞానగ్నిష్టోమాదికాన్ మఖాన్,*
*యః కరోతి వృతో యస్య స తస్యర్త్విగిహోచ్యతే. 143*

అగ్న్యాధేయం, అష్టకం మొదలైన పాకయజ్ఞాలను, అగ్నిష్టోమాదిక్రతువులను ఇతరుల కోరికపై చేసే వానిని "ఋత్విక్" అని అంటారు.

*య ఆవృణోత్యవితథం బ్రహ్మణా శ్రవణావుభౌ,*
*స మాతా స పితా జ్ఞేయస్తం న ద్రుహ్యేత్కదాచన 144*

సుస్వరంతో చక్కగా వేదం చదువువాడు తల్లి, తండ్రివంటివాడు. అట్టి వేదవేత్తకెప్పుడును ద్రోహము చేయరాదు.

*ఉపాధ్యాయన్ దశాచార్య ఆచార్యాణాం శతం పితా,*
*సహస్రం తు పితౄన్మాతా గౌరవేణాతిరచ్యతే. 145*
*ఉత్పాదక బ్రహ్మదాత్రోర్గరీయన్ బ్రహ్మదః పితా,*
*బ్రహ్మ జన్మ హి విప్రస్య ప్రేత్య చేహ చ శాశ్వతమ్ 146*
*కామాన్మాతా పితా చైనం యదుత్పాదయతో మిథః,*
*సంభూతిం తస్య తాం విద్యాద్యద్యోనావభిజాయతే 147*
*ఆచార్యస్త్వస్య యాం జాతిం విధివద్వేదపారగః,*
*ఉత్పాదయతి సావిత్ర్యా సా సత్యా సాఽజరామరా 148*

ఆచార్యుడు పదిమంది ఉపాధ్యాయులకంటె గొప్పవాడు. నూరుగురు ఆచార్యుల కంటెను జన్మనిచ్చిన తండ్రి మిక్కిలి శ్రేష్ఠుడు. అట్లే తల్లి వేయిమంది తండ్రులకంటె మిన్నగా గౌరవింపదగింది. అదే విధముగా బ్రహ్మోపదేశము లభించినవాడు ఇహ పరలోకములందు శాశ్వత కీర్తిని పొందుతాడు కావున జన్మనిచ్చిన తండ్రికంటె ఉపనయనం చేసి బ్రహ్మోపదేశం చేసిన వాడు అధికపూజ్యుడు. తల్లిదండ్రులు మోహంతో కలుసుకొన్నందువలన పశువులవలె సంతానాన్ని పొందుతున్నారు. కాని వేదములన్నీ అధ్యయనం చేసిన ఆచార్యుడు శాస్త్రప్రకారం ఉపనయనం చేసి అందు గాయత్రీమంత్రమునుపదేశించి ఆ బాలునికి అజరామరము శాశ్వతమునైన జన్మనిస్తున్నందువల్ల తండ్రికంటె అతడు పరమపూజ్యుడు.

*అల్పం వా బహు వా యస్య శ్రుతస్యోపకరోతి యః,*
*తమపీహ గురుం విద్యాచ్ఛ్రుతోపక్రియయా తయా. 149*

*బ్రాహ్మస్య జన్మనః కర్తా స్వధర్మస్య చ శాసితా,*
*బాలోఽ పి విప్రో వృద్ధస్య పితా భవతి ధర్మతః 150*

*అధ్యాపయామాస పితౄన్ శిశు రాంగిరసః కవిః,*
*పుత్రకా ఇతి హోవాచ జ్ఞానేన పరిగృహ్య తాన్. 151*

*తే తమర్థ మపృచ్ఛంత దేవానాగతమన్యవః,*
*దేవాశ్చైతాన్ సమేత్యోచుర్న్యాయ్యం వశ్శిశురుక్తవాన్. 152*

# ద్వితీయాధ్యాయం

వేదములను గాని వ్యాకరణాది శాస్త్రాలను గాని అభ్యసించుటకు ఏమాత్రం సహాయం చేసిన వాడు కూడ గురువని చెప్పబడుచున్నాడు. ఉపనయనం చేసినవాడు, స్వధర్మాలైన వేదార్థాలను చక్కగా వివరించినవాడు వయస్సులో చిన్నవాడైనా అతనిని వృద్ధుడు సహితం తండ్రిని గౌరవించినట్లు గౌరవించాలి. పూర్వం విద్వాంసుడైన అంగిరసుని పుత్రుడు తన పినతండ్రికి, అతని పుత్రులకు జ్ఞానోపదేశము చేస్తూ పుత్రులారా అని పిలిచెనట. అప్పుడతని పినతండ్రి మరియు అతని పుత్రులు, అంగీరసుని పుత్రుడు వయస్సులో తమకంటె చిన్నవాడు కావున చిన్నవాడు తమను పుత్రులారా అని అగౌరవం చేసినాడనికోపిస్తూ దేవతల దగ్గరకు వెళ్ళి ఈ విషయాన్నంతయు తెలిపినారు. అప్పుడా దేవతలు అంగిరసుని పుత్రుడు న్యాయంగానే మిమ్ముల పుత్రులుగా పిలిచినట్లు సమాధానమిచ్చినారు.

*అజ్ఞో భవతి వై బాలః పితా భవతి మంత్రదః,*
*అజ్ఞం హి బాలమిత్యాహుః పితేత్యేవ తు మంత్రదమ్ 153*

*న హాయనైర్న పలితైర్న విత్తేన న బంధుభిః,*
*ఋషయశ్చక్రిరే ధర్మం యోऽనూచానస్స నో మహాన్ 154*

*విప్రాణాం జ్ఞానతో జ్యైష్ఠ్యం క్షత్రియాణాం తు వీర్యతః*
*వైశ్యానాం ధాన్యధనతశ్శూద్రాణామేవ జన్మతః 155*

*న తేన వృద్ధో భవతి యేనాస్య పలితం శిరః,*
*యో వై యువాऽప్యధీయానస్తం దేవాస్థవిరం విదుః 156*

జ్ఞానంలేని వాడు బాలుడు. వేదమంత్రాలనుపదేశించువాడు తండ్రితో సమానుడు. వయస్సువల్ల గాని, గడ్డములు మీసములు తెల్లబడినందువల్లగాని, ధనము వల్లగాని, బంధువులవల్లగాని గౌరవము కలుగదు. చదువుచెప్పి జ్ఞానోపదేశము చేయువాడు అందరికంటె మిన్నయని ఋషులు చెప్పినారు. బ్రాహ్మణులలో అధిక జ్ఞానం కలవాడు గొప్పవాడు. క్షత్రియులలో అధిక బలం కలవాడు, వైశ్యులలో అధిక ధనధాన్యాలు కలవాడు, శూద్రులలో మిక్కిలి వయస్సు గలవాడు శ్రేష్ఠుడు. తల నెరిసినంతమాత్రమున మానవుడు గొప్పవాడు కాదని వయసులో చిన్నవాడైనా అధ్యయనము చేసిన వాడే గొప్పవాడని దేవతలు పల్కిరి.

*యథా కాష్ఠమయో హస్తీ యథా చర్మమయో మృగః,*
*యశ్చ విప్రోऽనధీయానస్త్రయస్తే నామ బిభ్రతి. 157*

*యథా షండో ఫలః స్త్రీషు యథా గౌర్గవి చాఫలా,*
*యథా చాజ్ఞేఫలం దానం తథా విప్రోऽనృచో ఫలః 158*

కట్టెతో చేయబడ్డ ఏనుగు, లోపల గడ్డిగాదముంచి పైన తోలుతో రూపొందించబడ్డ మృగము, అధ్యయనము చేయని మానవుడు వీరు ముగ్గురు పేరుకు మాత్రమున్నవా

తప్ప వారివల్ల ఎట్టి ప్రయోజనం లేదు. స్త్రీల దగ్గర నపుంసకుని వలె, మరియొక అవు దగ్గర ఆవువలె, అయోగ్యునకు దానము చేసినట్లు వేదాధ్యయనము చేయని బ్రాహ్మణుడు వ్యర్థుడు.

*అహింసయైవ భూతానాం కార్యం శ్రేయోऽ ను శాసనమ్,*
*వాక్చైవ మధురా శ్లక్ష్ణా ప్రయోజ్యా ధర్మ మిచ్ఛతా 159*
*యస్య వాఙ్మనసీ శుద్ధే సమ్యగు ప్తే చ సర్వదా,*
*స వై సర్వమవాప్నోతి వేదాంతోపగతం ఫలమ్ 160*

ధర్మం తెలిసిన ఆచార్యుడు శిష్యులను క్రూరంగా హింసించకూడదు. అహింసతోనే వారిని స్వాధీనానికి తెచ్చుకొనవలెను. అట్లే వారితో కఠినంగా మాట్లాడక ఇంపైన మాటలనే పలుకవలెను. అందువలన ఆచార్యుడు తన శిష్యులను కఠినముగా దండింపక మంచి మాటలతోనే వారిని మంచి త్రోవకు తేవలెను. ఇంకను మధురమైనమాటలతో విద్యార్థుల మనస్సునాకర్షింపవలెను. అట్లే తన వాక్కును, మనస్సును నిగ్రహించుకొని పరిశుద్ధంగా ఉంచుకొనే ఆచార్యుడు వేదాంతమున చెప్పబడ్డ సర్వజ్ఞత్వ, సర్వేశ్వరత్వ రూప ఫలితాలను పొందుతాడు.

*నారుంతుదస్స్యాదార్తో పి న పరద్రోహకర్మధీః,*
*యయాస్యోద్విజతే వాచా నాలోక్యాం తాముదీరయేత్ 161*

మానవుడు తాను బాధపడ్డా ఇతరులను సూటిపోటి మాటలతో బాధపెట్టకూడదు. అదే విధంగా ఇతరులకు ద్రోహం చేయవలెనని కూడ తలంపరాదు. ఇతరులకు ఉద్వేగమును కలిగించు మాటలనెప్పుడును మాట్లాడకూడదు.

*సమ్మానాద్బ్రాహ్మణోనిత్యముద్విజేత విషాదివ,*
*అమృతస్యేవ చాకాంక్షేదవమానస్య సర్వదా.162*

*సుఖం హ్యావమతశ్శేతే సుఖం చ ప్రతిబుధ్యతే,*
*సుఖం చరతి లోకేऽస్మిన్నవమంతా వినశ్యతి .163*

*అనేన క్రమయోగేన సంస్కృతాత్మా ద్విజశ్శనైః,*
*గురౌ వసన్ సంచినుయాద్బ్రహ్మాధిగమికం తపః .164*

బ్రాహ్మణుడు తనకు చేయు సన్మానమును చూచి విషమును చూచి భయపడినట్లు భయపడవలెను. అట్లే తనకు జరుగు అవమానమును ఓర్పుతో సహింపవలెనే కాని బాధపడకూడదు. అనగానతడు మానావమానములను సమానముగా స్వీకరింపవలెనని చెప్పబడినది. తనకు జరిగిన అవమానమున బదులుగా పగతీర్చుకొనవలెనని భావించని ఆలోచనాపరుడు తనకు అవమానము జరిగినా బాధపడక సుఖంగా నిద్రపోతాడు. సుఖంగా నిద్రనుండి లేస్తాడు. బాధపడనందువల్ల అతడు ఈ లోకమున సుఖముగా తిరుగుతాడు. కాని ఆ పుణ్యాత్ముని అవమానపరచినవాడు తాను చేసిన పాపపు పని వల్ల నరకం పాలౌతాడు. ద్విజుడు ఈ విధంగా తన మనస్సును తాను క్రమముగా సంస్కరించుకొంటూ గురువు యొక్క ఇంటిలో ఉండి నియమాలనన్నిటిని పాటిస్తూ వేదాన్ని అధ్యయనం చేయవలెను.

*తపోవిశేషైర్వివిధైర్వ్రతైశ్చ విధిచోదితైః,*
*వేదః కృత్స్నో Z ధిగంతవ్యస్సరహస్యో ద్విజన్మనా.165*

*వేదమేవ సదాభ్యస్యేత్తప స్తప్స్యన్ ద్విజోత్తమః,*
*వేదాభ్యాసో హి విప్రస్య తపః పరమిహోచ్యతే.166*
*ఆ హైవ స నఖాగ్రేభ్యః పరమం తప్యతే తపః,*
*యః స్రగ్వ్యపి ద్విజో Z ధీతే స్వాధ్యాయం శక్తితో Z న్వహమ్.167*

*యోZనధీత్య ద్విజో వేదమన్యత్ర కురుతే శ్రమమ్,*
*స జీవన్నేవ శూద్రత్వమాశు గచ్ఛతి సాన్వయః168*

ద్విజుడు వివిధములైన నియమాలతో, శాస్త్రంలో చెప్పబడిన నానా విధాలైన వ్రతాలనాచరిస్తూ వ్యాకరణాద్యంగ సహితమైన వేదాన్నంతా అర్థపూర్వకంగా అధ్యయనం చేయవలెను. ద్విజుడు తపస్సు చేస్తూ వేదాన్ని ఎల్లప్పుడు అధ్యయనం చేయాలి. బ్రాహ్మణునికి వేదాధ్యయనమే అధికమైన తపస్సు. బ్రహ్మచర్యనియమాలను అన్నిటిని అనుష్ఠింపకపోయినా అతడు ప్రతిదినం తన శక్తి కొలది వేదాభ్యాసం చేస్తే అది కూడా గొప్ప తపస్సే ఔతుంది. వేదాధ్యయనం చేయక బ్రాహ్మణుడు ఇతర శాస్త్రములనెన్ని అభ్యసించినా అతడు తన పూర్వ పరవంశముల వారితో కలిసి శూద్రుడగుచున్నాడు. అందువల్ల తమ పుత్రుడు సక్రమంగా వేదమునభ్యసించునట్లు చూడవలసిన బాధ్యత వారి తల్లిదండ్రులపై కలదు.

*మాతురగ్రేZ ధి జననం ద్వితీయం మౌంజిబంధనే,*
*తృతీయం యజ్ఞదీక్షాయాం ద్విజస్య శ్రుతిచోదనాత్.169*

*తత్ర యద్బ్రహ్మజన్మాస్య మౌంజీబంధన చిహ్నితమ్,*
*తత్రాస్య మాతా సావిత్రీ పితా త్వాచార్య ఉచ్యతే.170*

*వేదప్రదానాదాచార్యం పితరం పరిచక్షతే,*
*నహ్యస్మిన్ యుజ్యతే కర్మ కించిదామౌంజిబంధనాత్. 171*

ద్విజుడు మూడు జన్మలనెత్తుచున్నాడని వేదములు చెప్పుచున్నవి. ఆతని తొలిజన్మ తల్లికడుపున పుట్టినందువలన కలుగుచున్నది. మలిజన్మ ఉపనయనసంస్కారమువల్ల కలుగుచున్నది. మూడవ జన్మ ఏదేని యజ్ఞము చేయుటవలన కలుగుచున్నది. ఉపనయన సంస్కారము వలన కలుగు జన్మకు మౌంజీబంధనమే గుర్తు. ఆ జన్మయందు సావిత్రీదేవియే తల్లి, గాయత్రీ మంత్రోపదేశము చేయు ఆచార్యుడు తండ్రి యగుచున్నాడు. ఉపనయనం చేసి వేద వేదాంగములను నేర్పి బ్రహ్మచారికి సంస్కారాన్ని కలిగిస్తున్నందువలన ఆచార్యుడే తండ్రి అని మనువు మొదలగు వారు పేర్కొనుచున్నారు. ద్విజునకు ఉపనయనసంస్కారం వల్లనే శ్రేతస్మార్త కర్మలు చేయు అధికారము కలుగుచున్నది. అట్లు శ్రౌతస్మార్త కర్మలు చేయుటకు ఉపయోగపడే ఉపనయన సంస్కారాన్ని చేసిన ఆచార్యుడే తండ్రియగుచున్నాడు.

*నాభివ్యాహారయేద్బ్రహ్మ స్వధానినయనాదృతే,*
*శూద్రేణ హి సమస్తావద్యావద్వేదే న జాయతే 172*

*కృతోపనయనస్యాస్య వ్రతాదేశనమిష్యతే,*
*బ్రహ్మణో గ్రహణం చైవ క్రమేణ విధిపూర్వకమ్ 173*

*యద్యస్య విహితం చర్మ యత్సూత్రం యా చ మేఖలా,*
*యో దండో యచ్చ వసనం తత్తదస్య వ్రతేష్వపి. 174*

ఉపనయనమగునంతవరకు శ్రాద్ధకాలమున చెప్పవలసిన మంత్రములను తప్ప మిగిలిన వేదమంత్రములనుచ్చరింపకూడదు. ఉపనయనము చేసికొన్న ద్విజుడు నియమపూర్వకంగా యజ్ఞమునకై సమిధాదానం మొదలగు వ్రతాలను, వేదాధ్యయనాన్ని శాస్త్ర ప్రకారంగా చేయవలెను. బ్రహ్మచారికి ఉపనయన సమయంలో విధింపబడిన మృగచర్మం, యజ్ఞోపవీతం, మొలతాడు, దండం, వస్త్రములనే కొత్తవాటిని గోదానాది వ్రతాలు చేస్తున్నప్పుడు అతడు ధరింపవలెను.

*సేవేతేమాంస్తు నియమాన్ బ్రహ్మచారీ గురౌ వసన్,*
*సన్నియమ్యేంద్రియగ్రామం తపోవృద్ధ్యర్థమాత్మనః 175*

బ్రహ్మచారి గురుకులమున నివసిస్తూ తన పంచేంద్రియాలను నియమించుకొని తపోభివృద్ధికై ఈ క్రింది నియమాలను తప్పక పాటించాలి.

*నిత్యం స్నాత్వా శుచిః కుర్యాద్దేవర్షిపితృతర్పణమ్,*
*దేవతాభ్యర్చనం చైవ సమిదాధానమేవ చ 176*

*వర్జయేన్మధుమాంసం చ గంధం మాల్యం రసాన్ స్త్రియః,*
*శుక్తాని యాని సర్వాణి ప్రాణినాం చైవ హింసనమ్ 177*

*అభ్యంగమంజనం చాక్ష్ణోరుపానచ్ఛత్రధారణమ్,*
*కామం క్రోధం చ లోభం చ నర్తనం గీతవాదనమ్ 178*

*ద్యూతం చ జనవాదం చ పరివాదం తథానృతమ్,*
*స్త్రీణాం చ ప్రేక్షణాలంభ ముపఘాతం పరస్య చ 179*
*ఏకశ్శయీత సర్వత్ర న రేతః స్కందయేత్క్వచిత్,*
*కామార్ధీ స్కందయన్ రేతో హినస్తి వ్రతమాత్మనః 180*

*స్వప్నే సిక్త్వా బ్రహ్మచారీ ద్విజశ్శుక్రమకామతః,*
*స్నాత్వార్కమర్చయిత్వా త్రిః పునర్మామిత్యృచం జపేత్ 181*

బ్రహ్మచారి ప్రతిదినము స్నానం చేసి శుచియై దేవ, ఋషి, పితృ తర్పణాలను చేసి తన ఇష్టదేవతను అర్చించి సమిధా ధానము చేయవలెను. అతడు తేనె, మాంసము, సుగంధ ద్రవ్యాలు అనుభవింపరాదు. మాలలు ధరింపకూడదు. స్త్రీ సంపర్కము చేయరాదు. పులిసిన పదార్థముల స్వీకరింపరాదు. అట్లే ఇతర ప్రాణిహింస చేయకూడదు. ఇంకను అభ్యంగన స్నానం చేయకూడదు. కళ్ళకు కాటుకపెట్టుకొనకూడదు. చెప్పులు తొడగరాదు.

గొడుగు వేసికొనకూడదు. కామ, క్రోధ, లోభాలను వదలిపెట్టవలెను. నాట్యం చేయుట, పాటపాడుట, వాద్యములు ప్రయోగించుట తగనిది. అట్లే జూదమాడుట, ఇతరులతో వ్యర్థముగా కలహమునకు దిగుట, ఇతరుల నిందించుట, అబద్ధము చెప్పుట; స్త్రీలను కామేచ్ఛతో చూచుట, వారిని కౌగలించుకొనుట, ఇతరులకు అపకారము చేయుట అనునవి ఎంతమాత్రమును తగినవి కావు. అట్లే అతడు ఎచ్చటనైనను ఒంటరిగానే పండుకొనవలెను. కామముతో తన రేతఃస్ఖలనము చేయరాదు. అట్లు చేసినచో తన బ్రహ్మచర్య వ్రతాన్ని పోగొట్టుకొన్నవాడగును. కావున బ్రహ్మచర్యవ్రతలోపప్రాయశ్చిత్తాన్ని చేసికొనవలెను.

అతడు కోరికలేకుండనే స్వప్నంలో రేతస్ఖలనం చేసికొంటే ఉదయమే లేచి స్నానం చేసి సూర్యుని ప్రార్థించి పునర్మామైత్వింద్రియం అనే మంత్రాన్ని మూడుసార్లు చదువవలెను.

*ఉదకుంభం సుమనసో గోశకృన్మృత్తికాకుశాన్*
*ఆహరేద్యావదర్థాని భైక్షం చాహరహశ్చరేత్. 182*

*వేదయజ్ఞైరహీనానాం ప్రశస్తానాం స్వకర్మసు,*
*బ్రహ్మచార్యాహరేద్భైక్షం గృహేభ్యః ప్రయతో న్వహమ్ 183*

*గురోః కులే న భిక్షేత న జ్ఞాతికులబంధుషు,*
*అలాభే త్వన్యగేహానాం పూర్వం పూర్వం వివర్జయేత్ 184*

*సర్వం వాపి చరేద్గ్రామం పూర్వోక్తానామసంభవే,*
*నియమ్య ప్రయతో వాచమభిశస్తాంస్తు వర్జయేత్ 185*

అతడు ప్రతిదినం దేవతాపూజకై ఉదకంతో నిండిన కుంభాన్ని తీసికొనిపోయి దేవతార్చనకై పూలను కోయవలెను. అట్లే గురువు కొరకు ఆవు పేడను, మట్టిని, దర్భలు మొదలగువానిని తెచ్చియిచ్చి ప్రతిదినము భిక్షాటనము చేయవలెను. అతడు పరిశుద్ధుడై వేదాధ్యయనం, పంచయజ్ఞాలు చేస్తూ తమ వృత్తి ధర్మాన్ని చక్కగా నిర్వహించే గృహస్థులనుండి భిక్షను స్వీకరింపవలెను. బ్రహ్మచారి తన గురువుగారి ఇంటికి భిక్షకై పోరాదు. అట్లే తన దాయాదులు బంధువుల ఇంటికి భిక్షకొరకు పోకూడదు. అతనికి ఎచ్చట కూడ భిక్ష లభింపకపోయినచో తొలుత బంధువుల ఇండ్లకు అటుపిమ్మట దాయాదుల ఇండ్లకు వారి ఇంటిలోకూడా భిక్ష దొరకని సమయమున మాత్రమే గురువు యొక్క ఇంటికి భిక్షకు పోవలెను. అట్లే పైన చెప్పిన సదాచారసంపన్నులెవ్వరు లభించనప్పుడు జితేంద్రియుడై, పరిశుద్ధుడై మౌనంతో ఆ గ్రామంలో ఉన్న బ్రాహ్మణుల ఇంటికి భిక్షకై పోవచ్చును. కాని దుష్టుల ఇండ్లకు మాత్రము భిక్షకై పోరాదు.

*దూరాదాహృత్య సమిధః సన్నిదధ్యాద్విహాయసి,*
*సాయం ప్రాతశ్చ జుహుయాత్తాభిరగ్నిమతంద్రితః 186*

బ్రహ్మచారి దూరమునుండి దర్భలను, సమిధలను తెచ్చి వానిని నేలపై కాకుండ ఎత్తైన ప్రదేశంలో ఎండబెట్టి ఆ దర్భలు, సమిధలతో సాయంప్రాతర్హోమాలను నియమంతో

చేయవలెను. ఎత్తైన ప్రదేశము పాదస్పర్శ రహితము కావున పాదముద్రలతో అపవిత్రముకాని ప్రదేశమున దర్భలను, సమిధలను ఎండబెట్టవలెను.

*అకృత్వా భైక్ష చరణ మసమిధ్య చపావకమ్,*
*అనాతురస్సప్తరాత్రమవకీర్ణి వ్రతం చరేత్ 187*

అనారోగ్యముచే బాధపడుచున్నప్పుడు తప్ప మిగిలిన సమయములందు భిక్షాచరణము సమిధాదానము చేయక ఏడు రాత్రులు గడిపినచో వ్రతభంగము జరుగును కాన అతడు అవకీర్ణి ప్రాయశ్చిత్తము చేసికొనవలెను.

*భైక్షేణ వర్తయేన్నిత్యం నైకాన్నాదీ భవేద్వ్రతీ,*
*భైక్షేణ వ్రతినో వృత్తిరుపవాస సమా స్మృతా 188*

*వ్రతవద్దేవదైవత్యే పిత్ర్యే కర్మణ్యథర్షివత్,*
*కామమభ్యర్థితోZ శ్నీయాద్వ్రతమస్య న లుప్యతే 189*

బ్రహ్మచారి ప్రతిదినము భిక్షాచరణము చేయవలెను దానికై ఒకరి ఇంటికి మాత్రమే వెళ్ళక అనేక గృహస్థుల ఇంటికి వెళ్ళి భిక్ష చేయవలెను. ఆ విధంగా ప్రతిదినము అనేకుల ఇండ్లకు తిరిగి భిక్షను సంపాదించుకొని బ్రహ్మచర్యాశ్రమాన్ని గడిపేవాడు ప్రతిదినోపవాస వ్రతమును చేయు ఫలాన్ని పొందగలడు. ఎప్పుడైనను దేవతా కార్యమున పాల్గొనమని బ్రహ్మచారి నభ్యర్థించినచో వ్రతమునాచరించుచున్నట్లు మధుమాంసాదులను వర్జించి ఒక్కని ఇంటిలోనే భుజింపవలెను. అట్లే శ్రాద్ధాది కార్యమున నిమంత్రితుడైనచో ఋషి వలె మద్యమాంసరహితముగా భోజనము చేయవచ్చును. ఈ సమయములందు మాత్రము ఒకే ఇంటిలో తిన్నను ఆ బ్రహ్మచారికి వ్రతలోపము జరుగదు.

*బ్రాహ్మణస్యైవ కర్మైతదుపదిష్టం మనీషిభిః,*
*రాజన్య వైశ్యయో స్త్వేవం నైతత్కర్మ విధీయతే. 190*

ద్విజులైన బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులలో దేవతా, పితృసంబంధకార్యక్రమంలో బ్రాహ్మణుని మాత్రమే ఆమంత్ర నిమంత్రణములు చేయుదురు కావున పైన పేర్కొన్న ఏక గృహ భోజనం బ్రాహ్మణులకు మాత్రం పరిమితమైంది. వైశ్య క్షత్రియులకు పై నియమము వర్తింపదు.

*చోదితో గురుణా నిత్యమప్రచోదిత ఏవ వా,*
*కుర్యాదధ్యయనే యత్నమాచార్యస్య హితేషు చ. 191*

గురువు చెప్పినా చెప్పకున్నను బ్రహ్మచారి ప్రతిదినము వేదాధ్యయనాన్ని చేయవలెను. అట్లే గురువు యొక్క శుశ్రూషణాదికాన్ని తప్పక చేయవలెను.

*శరీరం చైవ వాచం చ బుద్ధీంద్రియమనాంసి చ.*
*నియమ్య ప్రాంజలి స్తిష్ఠే ద్వీక్షమాణో గురోర్ముఖమ్. 192*
*నిత్యముద్ధృత హస్త స్స్యాత్సాధ్వాచారస్సుసంయతః*
*ఆస్యతామితి చోక్త స్సన్నాసీతాభిముఖం గురోః 193*

*హీనాన్న వస్త్ర వేషస్స్యాత్సర్వదా గురుసన్నిధౌ,*
*ఉత్తిష్ఠేత్ప్రథమం చాస్య చరమం చైవ సంవిశేత్ 194*

*ప్రతిశ్రవణంసంభాషే శయానో న సమాచరేత్,*
*నాసీనో న చభుంజానో న తిష్ఠన్న పరాఙ్ముఖః 195*
*ఆసీనస్య స్థితః కుర్యాదభిగచ్ఛంస్తు తిష్ఠతః,*
*ప్రత్యుద్గమ్య త్వావ్రజతః పశ్చాద్ధావన్తు ధావతః 196*

*పరాఙ్ముఖస్యాభిముఖో దూరస్థస్యైత్య చాంతికమ్,*
*ప్రణమ్య తు శయానస్య విదేశే చైవ తిష్ఠతః 197*

*నీచశయ్యాసనం చాస్య సర్వదా గురుసన్నిధౌ,*
*గురోస్తు చక్షుర్విషయే న యథేష్టాసనో భవేత్ 198*

*నోదాహరేదస్య నామ పరోక్షమపి కేవలమ్,*
*న చైవాస్యానుకుర్వీత గతిభాషిత చేష్టితమ్ 199*

*గురోర్యత్ర పరీవాదో నిందా వాపి ప్రవర్తతే,*
*కరౌ తత్రపిధాతవ్యౌ గంతవ్యం వా తతోఽన్యతః 200*

*పరీవాదాత్ఖరో భవతి శ్వా వై భవతి నిందకః*
*పరిభోక్తా క్రిమిర్భవతి కీటో భవతి మత్సరీ 201*

గురువు ఏ వేళ తనకేమి ఉపదేశించునో యని భావిస్తూ బ్రహ్మచారి తన ఇంద్రియాలనన్నింటిని నిగ్రహించుకొని గురువుముఖంవైపే చూస్తూ సదానిలుచుండవలెను. అట్లే తన కుడి భుజం మాత్రం కన్పించునట్లు ఉత్తరీయాన్ని కప్పుకొని, గురువు తనను కూర్చుండుమని నియమించినపుడు మాత్రమే ఆతనికి ఎదురుగా కూర్చొనవలెను. గురువు దగ్గర శిష్యుడెల్లప్పుడు అతనికన్న హీనమైన వస్త్రములను ధరించి, భోజనం చేస్తూ ఉండవలెను. శిష్యుడు గురువుకంటె ముందుగానే మేల్కొనవలెను. అతడు పడుకొని కాని, కూర్చుండికాని, తినుచుండికాని, పెడముఖంతో కాని గురువుతో ముచ్చటలాడకూడదు. గురువు కూర్చున్నప్పుడు తాను నిలబడి, గురువు నిలబడియున్నప్పుడు తానెదురేగి, గురువు ఎదురుగా వచ్చునపుడు తాను వారినెదుర్కొని, గురువు పోవుచున్నప్పుడు వారివెంటపోవుచు శిష్యుడు గురువుతో మాట్లాడవలెను. అట్లే అతని యాజ్ఞను స్వీకరింపవలెను. అట్లే గురువు పెడముఖము పెట్టినపుడు తాను గురువునకెదురేగి, గురువు దూరంగా ఉన్నప్పుడు తానతనిని సమీపించి, గురువు పడుకొని యున్నప్పుడు తానతనికి నమస్కరించి, గురువు నిలబడియున్నప్పుడు తానతనికి దగ్గర నిలబడి గురువు యొక్క ఆజ్ఞను స్వీకరింపవలెను. అదే విధంగా గురువు కంటె తక్కువ ఎత్తులో కూర్చుండవలెను. నిద్రపోవలెను. గురువు ముందుకాళ్ళు చాపుకొని కూర్చొనరాదు. అట్లే గురువు యొక్క మాటలను, చేష్టలను అనుకరించరాదు. గురువును నిందించే సమయంలో ఆ ప్రాంతంలో ఉండరాదు. విధిలేక ఉండవలసి వస్తే తన రెండు చెవులను మూసికొనవలెను. గురువుపై అపవాదము

వేయరాదు. ఇట్లు అపవాదము చేసినచో శిష్యుడు గాడిద జన్మనెత్తుతాడు. గురువును నిందిస్తే శునకమై పుట్టుతాడు. గురువుయొక్క ధనాన్ని అనుభవిస్తే, అతనిని ద్వేషిస్తే శిష్యుడు క్రిమి కీటకముగా జన్మనెత్తుతాడు.

*దూరస్థో నార్చయేదేనం న క్రుద్ధో నాంతికే స్త్రియాః,*
*యానాసనస్థ శ్చైవైన మవరుహ్యాభివాదయేత్ 202*

*ప్రతివాతేఽ నువాతే చ నాసీత గురుణా సహ,*
*అసంశ్రవే చైవ గురో ర్న కించిదపి కీర్తయేత్ 203*

*గో శ్వోష్ట్రయానప్రాసాద ప్రస్తరేషు కటేషు చ,*
*ఆసీత గురుణా సార్థం శిలాఫలకనౌషు చ. 204*

శిష్యుడు దూరముననుండి గాని, తాను కోపమునను్నప్పుడుగాని, గురువు తన భార్యతోనేకాంతమున నున్నప్పుడుగాని అతనిని పూజింపరాదు. అట్లే శిష్యుడు రథాదులపై నున్నప్పుడు గురువు భూమిపై నిలబడియున్నచో తాను రథము మొదలగువాటినుండి క్రిందికి దిగి నమస్కరింపవలెను. గురువు తన ఇంటికి వచ్చి నప్పుడు తాను గురువు ఇంటికిపోయినప్పుడు గురువుతో సమానంగా కూర్చొనరాదు. అదే విధంగా గురువు విననప్పుడు అతనిని గూర్చి తప్పుగా ఏమియు మాట్లాడరాదు. కాని గురువుతో కలిసి ప్రయాణము చేస్తున్నప్పుడు, మేడ, బండ, చాప , శిలాఫలకము మొదలగు వాటిపై శిష్యుడు గురువుతో సమానముగా కూర్చొనవచ్చును.

*గురో ర్గురౌ సన్నిహితే గురువద్వృత్తిమాచరేత్*
*న చానిసృష్టో గురుణా స్వాన్ గురూనభివాదయేత్ 205*

*విద్యాగురుష్వేతదేవ నిత్యా వృత్తిః స్వయోనిషు,*
*ప్రతిషేధత్సు చాధర్మాన్హితం చోపదిశత్స్వపి. 206*

*శ్రేయస్సు గురువద్వృత్తిం నిత్య మేవ సమాచరేత్,*
*గురుపుత్రేషు చార్యేషు గురోశ్చైవ స్వబంధుషు 207*

*బాలస్సమానజన్మా వా శిష్యో వా యజ్ఞకర్మణి,*
*అధ్యాపయన్ గురుసుతో గురువన్మానమర్హతి 208*

గురువు దగ్గరకు అతని గురువు వచ్చినప్పుడు తన గురువును గౌరవించినట్లతనిని గౌరవింపవలెను. అట్లే గురువు దగ్గరకు తన తలిదండ్రులు వచ్చినప్పటికీ గురువు యొక్క ఆజ్ఞలేక వారికి నమస్కరింపకూడదు. ఆచార్యుడు కాక ఇతర విద్యలను నేర్పు విద్యా గురువులను, పెత్తండ్రి, పినతండ్రి మొదలగు తన బంధువులను, అధర్మమార్గమునుండి తొలగించుచు న్యాయమార్గమునుపదేశించే పెద్దలను ఆచార్యుని గౌరవించినట్లే గౌరవించవలెను. విద్యాదులయందు తనకంటె గొప్పవారిని తనకంటె

# ద్వితీయాధ్యాయం

పెద్దవారైన గురువుయొక్క పుత్రులను, గురు బంధువులను గురువును గౌరవించినట్లే గౌరవింపవలెను. తన గురువు యొక్క శిష్యుడు తనతో సమానమైనను, తనకంటె చిన్నవాడైనను, వేదాన్ని నేర్పింపగలుగు గురుపుత్రుని యాగ సమయంలో గురువును గౌరవించినట్లు గౌరవించ వలెను.

*ఉత్సాదనం చ గాత్రాణాం స్నాపనోచ్ఛిష్టభోజనే,*
*న కుర్యా ద్గురుపుత్రస్య పాదయోశ్చావ సేచనమ్ 209*

కాని గురుపుత్రునికి నలుగుపెట్టుట, స్నానము చేయించుట, అతని ఎంగిలితినుట, అతని పాదములు వత్తుట కడుగుట మొదలగు కార్యములను మాత్రము చేయరాదు.

*గురువత్ప్రతిపూజ్యాః స్యు స్సవర్ణా గురుయోషితః,*
*అసవర్ణాస్తు సంపూజ్యాః ప్రత్యుత్థానాభివాదనైః 210*

*అభ్యంజనం స్నాపనం చ గాత్రోత్సాదన మేవ చ,*
*గురుపత్న్యా న కార్యాణి కేశానాం చ ప్రసాధనం 211*

*గురుపత్నీ తు యువతి ర్నాభివాద్యేహ పాదయోః,*
*పూర్ణవింశతివర్షేణ గుణదోషౌ విజానతా 212*

సవర్ణలైన గురు భార్యలను గురువువలెనే గౌరవింపవలెను. అసవర్ణలైనచో ఎదుర్కొనుట, నమస్కరించుట అను వానిచే మాత్రము వారిని గౌరవింపవలెను. కాని గురు భార్యకు గూడ తలంటుట, నలుగుపెట్టుట, స్నానము చేయించుట, తల దువ్వుట వంటి పనులు చేయరాదు. గురుపత్ని యౌవనవతి యైనచో ఇరవై ఏండ్లు మించిన శిష్యుడు ఆమెకు పాదాభివందనము చేయరాదు.

*స్వభావ ఏష నారీణాం నరాణా మిహ దూషణం,*
*అతోZ ర్థాన్న ప్రమాద్యంతి ప్రమదాసు విపశ్చితః 213*

*అవిద్వాంసమలం లోకే విద్వాంసమపివా పునః,*
*ప్రమదా హ్యుత్పథం నేతుం కామక్రోధవశానుగం 214*

*మాత్రా స్వస్రా దుహిత్రా వా న వివిక్తాసనో భవేత్,*
*బలవానింద్రియగ్రామో విద్వాంస మపి కర్షతి 215*

పురుషులను మోహింపచేయు గుణము స్త్రీలకు సహజసిద్ధమైంది. కావున వివేకవంతులు స్త్రీలదగ్గర జాగ్రత్తగా నుందురు. పురుషుడు వివేకహీనుడైనను వివేకవంతుడైనను కామ క్రోధాలకు వశమైనచో స్త్రీ అతనిని తప్పుడు త్రోవకు తీసికొని పోతుంది. మిక్కిలి బలము గల ఇంద్రియములు వివేకిని సైతం చెడుత్రోవ తొక్కిస్తాయి. కావున మానవుడు తన తల్లితోనైనను, చెల్లితోనైనను, కూతురుతోనైనను ఒంటరిగా నుండకూడదు.

*కామం తు గురుపత్నీనాం యువతీనాం యువా భువి,*
*విధివద్వందనం కుర్యా దసావహ మితి బ్రువన్ 216*

*విప్రోష్య పాదగ్రహణ మన్వహం చాభివాదనం,*
*గురుదారేషు కుర్వీత సతాం ధర్మ మనుస్మరన్. 217*

యువతియైన గురుపత్నికి తన పేరు చెప్పుకొని ఆమె పాదములు పట్టుకొనక నమస్కారము చేయవలెను. దేశాంతరమునుండి వచ్చినప్పుడు మాత్రం గురుపత్ని వయస్సుతో నిమిత్తము పెట్టుకొనక ఆమె పాదములనంటి నమస్కారం చేయవలెను.

*యథా ఖనన్ ఖనిత్రేణ నరో వార్యధిగచ్ఛతి,*
*తథా గురుగతాం విద్యాం శుశ్రూషురధిగచ్ఛతి. 218*

భూమిని తవ్వుచూ పోతే నీరెట్లు పడుతుందో అట్లే గురుశుశ్రూష చేస్తూ పోతే ఆ గురువు దగ్గరున్న విద్య లభిస్తుంది.

*ముండో వా జటిలో వా స్యాదథ వా స్యాచ్ఛిఖాజటః,*
*నైనం గ్రామేऽభినిమ్లోచే త్సూర్యో నాభ్యుదియాత్ క్వచిత్ 219*

*తం చేదభ్యుదియా త్సూర్యః శయానం కామచారతః,*
*నిమ్లోచేద్వాప్యవిజ్ఞానా జ్జపన్నుపవసేద్దినమ్ 220*

*సూర్యేణ హ్యభినిర్ముక్తః శయానోऽభ్యుదితశ్చ యః*
*ప్రాయశ్చిత్తమకుర్వాణో యుక్తః స్యా న్మహతైనసా 221*

బ్రహ్మచారి బోడితలతోనైన, జడలతోనైన, శిఖతోనైన ఉండవచ్చును. ఆతడు సూర్యోదయ, సూర్యాస్తమన సమయములందెన్నడును నిద్రపోకూడదు. అట్లు నిద్రపోయినచో పగటిపూట అంతా గాయత్రీ జపం చేస్తూ ఉపవాసం చేయవలెను. ఈ విధంగా ప్రాయశ్చిత్తం చేసికొననిచో ఆ బ్రహ్మచారి మహాపాపాన్ని పొందుతాడు.

*ఆచమ్య ప్రయతో నిత్య ముభే సంధ్యే నమాహితః,*
*శుచౌ దేశే జపన్ జప్య ముపాసీత యథావిధి 222*

*యది స్త్రీ యద్యవరజః శ్రేయః కించి త్సమాచరేత్,*
*తత్సర్వమాచరేద్యుక్తో యత్ర చాస్య రమేన్మనః 223*

*ధర్మార్థావుచ్యతే శ్రేయః కామార్థౌ ధర్మ ఏవ చ,*
*అర్థ ఏవేహ వా శ్రేయ స్త్రివర్గ ఇతి తు స్థితిః 224*

బ్రహ్మచారి ప్రతిదినం ఆచమనం చేసి పరిశుద్ధుడై సాయం ప్రాతః సంధ్యలయందు పరిశుద్ధమైన ప్రదేశంలో కూర్చుండి శాస్త్ర మర్యాదననుసరించి సంధ్యావందనమాచరింపవలెను. స్త్రీయైనను, శూద్రుడైనను నియమముతో ఏదేని మంచి కార్యమును చేసినచో దానిని కూడ నియమము తో చేయవచ్చును. శాస్త్రవిరుద్ధము కాని

ఏ పనియందైనను అతని మనస్సు లగ్నమైతే దానిని కూడ చేయవచ్చును. ధర్మార్థములు శ్రేష్ఠమైనవని కొందరు, కామార్థములు శ్రేష్ఠమైనవని కొందరు, ధర్మమే శ్రేష్ఠమని, అర్థమే శ్రేష్ఠమని కొందరు చెప్పుచున్నారు. కాని ధర్మార్థకామములు మూడు కూడా శ్రేష్ఠమైనవే.

*ఆచార్యో బ్రహ్మణో మూర్తిః పితా మూర్తిః ప్రజాపతేః,*
*మాతా పృథివ్యా మూర్తిస్తు భ్రాతా స్వో మూర్తిరాత్మనః 225*

*ఆచార్యశ్చ పితా చైవ మాతా భ్రాతా చ పూర్వజః*
*నార్తేనాప్యవమంతవ్యా బ్రాహ్మణేన విశేషతః 226*

*యం మాతాపితరౌ క్లేశం సహేతే సంభవే నృణాం,*
*న తస్య నిష్కృతిశ్శక్యా కర్తుం వర్షశతైరపి 227*

*తయోర్నిత్యం ప్రియం కుర్యా దాచార్యస్య చ సర్వదా,*
*తేష్వేవ త్రిషు తుష్టేషు తప స్సర్వం సమాప్యతే 228*

*తేషాం త్రయాణాం శుశ్రూషా పరమం తప ఉచ్యతే,*
*న తైరభ్యననుజ్ఞాతో ధర్మ మన్యం సమాచరేత్ 229*

*త ఏవ హి త్రయో లోకా స్త ఏవ త్రయ ఆశ్రమాః,*
*త ఏవ హి త్రయో వేదా స్త ఏవోక్తా స్త్రయోగ్నయః 230*

*పితా వై గార్హ పత్యోగ్ని ర్మాతాగ్ని ర్దక్షిణః స్మృతః,*
*గురురాహవనీయస్తు సాగ్ని త్రేతా గరీయసీ. 231*

ఆచార్యుడు పరమాత్మ స్వరూపుడు. తండ్రి ప్రజాపతిరూపుడు. తల్లి భూదేవి వంటిది. అన్న ఆత్మ స్వరూపుడు. ఈ విధముగా వీరందరు దేవతాస్వరూపులు. బ్రాహ్మణుడు వీరిని ఎట్టి పరిస్థితిలోను అవమానపరచకూడదు. ఇతరులు సహితము పై వారిని అవమానింపకూడదు. తలిదండ్రులు బిడ్డల పుట్టుకకై అధికమైన కష్టము ననుభవిస్తారు. వారి శ్రమకు పరిహారం ఎన్ని జన్మలకైనా తీరదు. అందువల్ల తల్లిదండ్రులకు ఆచార్యునకు సదా ప్రీతిని కలుగజేయవలెను. ఆ ముగ్గురు తృప్తి చెందుటయే సంపూర్ణ తపస్సనబడును. వారి యొక్క అనుమతిలేక ఎట్టి పుణ్యకార్యక్రమము ప్రారంభింపరాదు. తల్లి,తండ్రి, ఆచార్యుడు అను ముగ్గురే త్రిలోకములు, గార్హస్థ్య, వానప్రస్థ, సన్యాసములను మూడు ఆశ్రమములు. ఋగ్యజుస్సామములను మూడు వేదములు. దక్షిణాగ్ని, గార్హపత్యాగ్ని, ఆహవనీయాగ్ని అను మూడగ్నులు. వీరిలో తల్లి దక్షిణాగ్ని, తండ్రి గార్హపత్యాగ్ని, ఆచార్యుడు ఆహవనీయాగ్ని. అందువలన అగ్నిత్రయ రూపమైన వీరు మిక్కిలి శ్రేష్ఠులు.

*త్రిష్వప్రమాద్యన్నేతేషు త్రీన్ లోకాన్ విజయేద్గృహీ,*
*దీప్యమానః స్వవపుషా దేవవద్దివి మోదతే 232*

*ఇమం లోకం మాతృభక్త్యా పితృభక్త్యా తు మధ్యమమ్,*
*గురుశుశ్రూషయా త్వేవ బ్రహ్మలోకం సమశ్నుతే 233*

సర్వే తస్యాదృతా ధర్మా యస్యైతే త్రయ ఆదృతాః
అనాదృతా స్తుయస్యైతే సర్వా స్తస్యాఫలాః క్రియాః 234

యావత్రయస్తే జీవేయు స్తావన్నాన్యం సమాచరేత్,
తేష్వేవ నిత్యం శుశ్రూషాం కుర్యాత్ ప్రియహితే రతః 235

తేషామనుపరోధేన పారత్ర్యం యద్యదాచరేత్,
తత్తన్నివేదయే త్తేభ్యో మనోవచనకర్మభిః 236

త్రిష్వేతేష్వితి కృత్యం హి పురుషస్య సమాప్యతే,
ఏష ధర్మః పరస్సాక్షాదుపధర్మోఽన్య ఉచ్యతే. 237

పై ముగ్గురిని చక్కగా సేవిస్తూ బ్రహ్మచారి ముల్లోకాల్లో కీర్తిని పొందుతాడు. ఆతడు స్వర్గలోకంలో దివ్యశరీరంతో ప్రకాశిస్తాడు. మాతృభక్తి కలవాడు ఈలోకాన్ని, పితృభక్తి కలవాడు అంతరిక్షాన్ని, ఆచార్యభక్తి కలవాడు బ్రహ్మలోకాన్ని పొందుతున్నాడు. వీరిని గౌరవిస్తే సర్వ ధర్మాలు నిర్వర్తించినవాడౌతాడు. వీరిని అగౌరవపరిస్తే ఆతడు చేయు ధర్మకార్యాలెట్టివైనా ఫలరహితాలౌతాయి. తల్లి,తండ్రి, ఆచార్యుడు బ్రతియున్నంతవరకు బ్రహ్మచారి వారిని సేవిస్తూ వారి యనుమతి లేనిదే ఇతరులనెవ్వరిని సేవింపకూడదు. ఈ ముగ్గురికి శుశ్రూష చేయుటయే మానవునకు ప్రధాన ధర్మము. తక్కిన ధర్మకార్యములన్ని అప్రధానములే.

శ్రద్దధానశ్శుభాం విద్యామాదదీతావరాదపి,
అంత్యాదపి పరం ధర్మం స్త్రీ రత్నం దుష్కులాదపి. 238

విషాదప్యమృతం గ్రాహ్యం బాలాదపి సుభాషితమ్,
అమిత్రాదపి సద్వృత్తమమేధ్యాదపి కాంచనమ్ 239

స్త్రియో రత్నాన్యథో విద్యా ధర్మ శ్శౌచం సుభాషితమ్
వివిధాని చ శిల్పాని సమాదేయాని సర్వతః 240

మంచి విద్య తనకంటె చిన్నవాని దగ్గరనున్నప్పటికిని శ్రద్ధతో దానిని గ్రహించవలెను. అట్లే ఉత్తమ ధర్మాన్ని చండాలుని దగ్గరనుండి సైతం పొందవలెను. స్త్రీ రత్నం తనకంటె తక్కువ కులంలో పుట్టినా ఆమెను భార్యగా చేసికొనవలెను. అమృతము విషములోనున్నా దానిని పైకి తీసి గ్రహించాలి. అట్లే మంచి మాటలు వినాలి. శత్రువైనా, సదాచారాన్ని బోధిస్తే వినాలి. అట్లే బంగారం ఎచ్చట లభించినా తీసికొనవలెను. సుగుణవంతురాలగు స్త్రీలు, రత్నాలు, సద్విద్య, ధర్మం, శౌచం, సుభాషితం, నానావిధ శిల్పాలు ఎచ్చట నున్నా వాటిని స్వీకరించాలి.

అబ్రాహ్మణాదధ్యయనమసత్కాలే విధీయతే,
అనువ్రజ్యా చ శుశ్రూషా యావదధ్యయనం గురోః 241

## తృతీయాధ్యాయం

*నా బ్రాహ్మణే గురౌ శిష్యో వాసమాత్యంతికం వసేత్,*
*బ్రాహ్మణే చానమూచానే కాంక్షన్ గతిమనుత్తమామ్ 242*

అవసరము వచ్చినప్పుడు బ్రాహ్మణుడు వైశ్య, క్షత్రియులనుండి సహితము వేదాధ్యయనము చేయవచ్చును. అప్పుడు గురువును వెంబడించుట మొదలగు శుశ్రూష మాత్రము గురువునకు చేయవచ్చును కాని పాదప్రక్షాళనము వంటి శుశ్రూషలు చేయరాదు. ఉత్తమగతి కోరు బ్రాహ్మణుడు సాంగవేదాధ్యయనం చేయని బ్రాహ్మణుని దగ్గర, బ్రాహ్మణేతరుడగు గురువు దగ్గర చాలాకాలముండుట తగదు.

*యది త్వాత్యంతికం వాసం రోచయేత గురోః కులే,*
*యుక్తః పరిచరేదేనమాశరీరవిమోక్షణాత్ 243*

*ఆ సమాప్తేశ్శరీరస్య యస్తు శుశ్రూషతే గురుమ్,*
*స గచ్ఛత్యంజసా విప్రో బ్రహ్మణస్సద్మ శాశ్వతమ్ 244*

గురుకులంలో నైష్ఠికబ్రహ్మచర్య రూపమగు వ్రతాన్ని అనుష్ఠిస్తున్నచో నియమనిష్ఠలతో తన జీవిత పర్యంతమాగురువునకు శుశ్రూష చేయవలెను. తన శరీరము నశించు వరకు గురు శుశ్రూష చేయు బ్రాహ్మణుడు తప్పక పరబ్రహ్మ లోకమును చేరుకుంటాడు.

*న పూర్వం గురవే కించిదుపకుర్వీత ధర్మవిత్,*
*స్నాస్యంస్తు గురుణా ऽऽజ్ఞ ప్తశ్శక్త్యా గుర్వర్థమాహరేత్ 245*

*క్షేత్రం హిరణ్యం గామశ్వం ఛత్రోపానహమాసనమ్,*
*ధాన్యం శాకం చ వాసాంసి గురవే ప్రీతిమావహేత్ 246*

వేదాధ్యయనం ప్రారంభించే సమయాన గురువునకేమియు దక్షిణ నొసగరాదు. అట్లే చదువుకొన్న తర్వాత స్నాతక వ్రతాన్ని అనుష్ఠించి గురువు యొక్క అనుజ్ఞ తీసికొని గురుదక్షిణను ఈయవలెను. భూమి, బంగారము, గోవు, గుఱ్ఱము, ఛత్రము, పాదుకలు, ఆసనం, ధాన్యం, కూరగాయలు, బట్టలు మొదలగు వానిని గురువునకు సంతోషం కలుగుట కొరకు గురు దక్షిణగా నీయవలెను.

*ఆచార్యే తు ఖలు ప్రేతే గురుపుత్రే గుణాన్వితే,*
*గురుదారే సపిండే వా గురువద్వృత్తిమాచరేత్ 247*

*ఏతేష్వవిద్యమానేషు స్థానాసనవిహారవాన్,*
*ప్రయుంజానోऽగ్ని శుశ్రూషాం సాధయేద్దేహ మాత్మనః 248*

నైష్ఠిక బ్రహ్మచారి తన గురువు చనిపోయినప్పుడు మంచి గుణములు కల గురుపుత్రుడు, గురువు భార్య, గురువు యొక్క సపిండులైన చిన్నాయన, పెదనాయన మొదలగువారికి గురువు వలె శుశ్రూష చేయవలెను. పై వారెవ్వరు బ్రతికియుండనప్పుడు హోమ కుండ సమీపమున కూర్చొని హోమాల ద్వారా అగ్ని శుశ్రూష చేస్తూ జీవితం గడపవలెను.

*ఏవం చరతి యో విప్రో బ్రహ్మ చర్యమవిప్లుతః*
*న గచ్ఛత్యుత్తమం స్థానం న చేహ జాయతే పునః 249*

ఈ విధంగా బ్రహ్మచర్యాశ్రమమును నియమనిష్ఠలతో గడిపే బ్రాహ్మణుడు ఉత్తమ స్థానాన్ని తప్పకపొందుతాడు. అతనికి పునర్జన్మ అనునది లేనే లేదు.

ఇతి మానవే ధర్మశాస్త్రే భృగు ప్రోక్తాయాం సంహితాయాం ద్వితీయోధ్యాయః

భృగుమహర్షి చెప్పిన మానవధర్మశాస్త్రమను సంహితయందు రెండవ అధ్యాయము సమాప్తము.

# తృతీయాధ్యాయం

*షట్ త్రింశదాబ్దికం చర్యం గురౌ త్రైవేదికం వ్రతమ్,*
*తదర్ధికం పాదికం వా గ్రహణాంతిక మేవ వా. 1*

*వేదానధీత్య వేదౌ వా వేదం వాపి యథాక్రమమ్,*
*అవిప్లుత బ్రహ్మ చర్యో గృహస్థాశ్రమమావసేత్ 2*

బ్రహ్మచారి గురుకులంలో ముప్పదియారు సంవత్సరములుండి మూడు వేదాలను సంపూర్ణంగా నేర్చుకొనవలెను. దానిని త్రైవేదికవ్రతమందురు. ముప్పదియారు సంవత్సరములు గురుకులంలో ఉండలేనిచో పదునెనిమిది సంవత్సరములైనా, కానిచో తొమ్మిది సంవత్సరములైనా, కనీసము విద్యను నేర్చుకొనునంత వరకైనా ఉండవలెను. బ్రహ్మచారి గురుకులంలో ఉండి వేదాలనన్నిటిని సాంగోపాంగంగా అధ్యయనం చేయవలెను. లేనిచో రెండు వేదాలనైనా, అదికూడ వీలుకానిచో తన శాఖా వేదాన్నైనా సంపూర్ణంగా అధ్యయనం చేయాలి. ఆ తరువాత గృహస్థాశ్రమానికి వెళ్ళవలెను.

*తం ప్రతీతం స్వధర్మేణ బ్రహ్మదాయహరం పితుః,*
*స్రగ్విణం తల్ప ఆసీనమర్హయే త్ప్రథమం గవా 3*

తండ్రి దగ్గరగాని ఆచార్యుని దగ్గరగాని వేదాధ్యయనం చేసిన బ్రహ్మచారిని తండ్రి లేక ఆచార్యుడు పుష్పమాలలచే అలంకరించి, పరుపుపై కూర్చుండబెట్టి గోదానవ్రతమును చేయింపవలెను.

*గుణాఽనుమతః స్నాత్వా సమావృత్తో యథావిధి,*
*ఉద్వహేత ద్విజో భార్యాం సవర్ణాం లక్షణాన్వితామ్ 4*

ద్విజుడు గురువు యొక్క అనుజ్ఞ తీసికొని శాస్త్ర ప్రకారముగా స్నాతక వ్రతమును, పూర్తిచేసికొని మంచి లక్షణములు కల సవర్ణ స్త్రీని వివాహమాడవలెను.

*అసపిండా చ యా మాతురసగోత్రా చ యా పితుః,*
*సా ప్రశస్తా ద్విజాతీనాం దారకర్మణి మైథునే 5*

*మహాంత్యపి సమృద్ధాని గోజావిధనధాన్యతః,*
*స్త్రీ సంబంధే దశై తాని కులాని పరివర్జయేత్ 6*

ద్విజుడు వివాహం చేసికొనే కన్య ఆమెతల్లికి సపిండురాలు కాకూడదు. అనగా చిన్నమ్మను వివాహం చేసికొనకూడదు. అట్లే ఆ కన్య తండ్రి వంశమునకు చెందకూడదు. గోవులు, మేకలు, గొఱ్ఱెలు, ధనధాన్యాలు అధికంగా నున్నా వివాహ విషయమున ఈ క్రింది పది కులములకు చెందిన కన్యలను వివాహమాడరాదు.

హీనక్రియం నిష్పురుషం నిశ్ఛందోరోమశార్శసమ్,
క్షయ్యామయావ్యపస్మారిశ్విత్రికుష్ఠి కులాని చ 7

*నోద్వహేత్కపిలాం కన్యాం నాధికాంగీం న రోగిణీమ్*
*నాలోమికాం నాతిలోమాం న వాచాటాం న పింగలామ్ 8*

*నర్క్ష వృక్షనదీనామ్నీం నాంత్యపర్వత నామికామ్,*
*న పక్ష్యహి ప్రేష్యనామ్నీం న చ భీషణ నామికామ్ 9*

జాతకర్మాది క్రియలు లేనిది, పురుషసంతానము లేనిది, వేదాధ్యయనం లేనిది, పొడువైన వెంట్రుకలు కలది, మూలవ్యాధి గలది, క్షయ, అజీర్ణము, అపస్మారము, శ్వేతకుష్ఠము (బొల్లి), కుష్ఠువ్యాధులున్న వంశాలకు చెందిన కన్యను వివాహము చేసికొనకూడదు. ఇంకను కపిలవర్ణపు వెండ్రుకలు కలది, అధికాంగి, రోగములు కలది, వెండ్రుకలు లేనిది, అధికమైన వెండ్రుకలు కలది, అధికముగా మాట్లాడునది, పచ్చని కళ్ళు గల కన్యను వివాహమాడరాదు. అట్లే నక్షత్రాలు, వృక్షాలు, నదులపేర్లు కల కన్యను, పేరుయొక్క చివర పర్వతాల పేర్లు గలది, పక్షులు, సర్పములు, దాసులపేర్లు కలది, భయంకరమైన పేరు గల కన్యను వివాహమాడరాదు.

*అవ్యంగాంగీం సౌమ్యనామ్నీం హంసవారణగామినీమ్,*
*తనులోమ కేశదశనాం మృద్వంగీముద్వహేత్ స్త్రియమ్ 10*

చక్కని అవయువాలు కలది, మంచిపేరు కలది, హంస, ఏనుగులవంటి నడకగలది, పలుచని వెండ్రుకలు, దంతములు గలది, మృదువగు అవయవాలు గల కన్యను వివాహమాడవలెను.

*యస్యాస్తు న భవేద్భ్రాతా న విజ్ఞాయేత వా పితా,*
*నోపయచ్ఛేత తాం ప్రాజ్ఞః పుత్రికాధర్మశంకయా 11*

తాను వివాహం చేసికొనబోవు కన్య యొక్క తండ్రి లేక సోదరుల విషయం తెలియనిచో ఆ స్త్రీ జ్ఞాతి వంశానికి కూడ చెందియుంటుంది కావున సోదరి యను భావనతో ఆమెను వివాహం చేసికొనరాదు.

*సవర్ణాగ్రే ద్విజాతీనాం ప్రశస్తా దారకర్మణి,*
*కామతస్తు ప్రవృత్తానామిమాఃస్యుః క్రమశో వరాః 12*

ద్విజులు తమ ప్రధమ వివాహాన్ని తమ వంశమునకు చెందిన కన్యతోనే వివాహం చేసికోవాలి. కామించే తరువాత వివాహం చేసికొంటే ఈ క్రింది అనులోమ విధానాన్ని అనుసరించి వివాహం చేసికోవాలి.

శూద్రైవ భార్యా శూద్రస్య సా చ స్వా చ విశః స్మృతే,
తే చ స్వా చైవ రాజ్ఞశ్చ తాశ్చ స్వా చాగ్రజన్మనః 13

న బ్రాహ్మణక్షత్రియయోరాపద్యపి హి తిష్ఠతోః,
కస్మింశ్చిదపి వృత్తాంతే శూద్రాభార్యోపదిశ్యతే 14

హీనజాతి స్త్రియం మోహాదుద్వహంతో ద్విజాతయః,
కులాన్యేవ నయంత్యాశు ససంతానాని శూద్రతామ్ 15

శూద్రావేదీ పతత్యత్రేరుతథ్యతనయస్య చ,
శౌనకస్య సుతోత్పత్త్యా తదపత్యతయా భృగోః 16

శూద్రుడు తన వంశంలో పుట్టిన కన్యనే వివాహమాడాలి. వైశ్యుడు వైశ్య, శూద్ర కన్యలను వివాహం చేసికొనవచ్చును. క్షత్రియుడు క్షత్రియ, వైశ్య, శూద్ర కన్యలను వివాహము చేసికొనవచ్చును. బ్రాహ్మణుడు నలుగురిని పెండ్లి చేసికొనవచ్చును. కాని బ్రాహ్మణ క్షత్రియులు ఎట్టి పరిస్థితిలోను శూద్రకన్యను వివాహమాడకూడదు. తన కంటె తక్కువ కులంలో పుట్టిన కన్యను వివాహం చేసికొంటే తమ కులాన్ని, తమ సంతానాన్ని కూడ చెడగొట్టుతున్నాడు. ఈ విషయాన్ని అత్రిమహర్షి, గౌతమమహర్షి, శౌనకమహర్షి, భృగుమహర్షి సైతము వివరించినారు.

శూద్రాం శయనమారోప్య బ్రాహ్మణో యాత్యధోగతిమ్,
జనయిత్వా సుతం తస్యాం బ్రాహ్మణ్యాదేవ హీయతే 17

దైవపిత్ర్యాతిథేయాని తత్ప్రధానాని యస్య తు,
నాశ్నంతి పితృ దేవాస్తన్న చ స్వర్గం స గచ్ఛతి 18

వృషలీఫేనపీతస్య నిశ్వాసోపహతస్య చ,
తస్యాం చైవ ప్రసూతస్య నిష్కృతిర్న విధీయతే 19

బ్రాహ్మణుడు శూద్రకన్యను వివాహం చేసికొంటే తాను చెడిపోతాడు. ఆ కన్యయందు సంతతిని కన్నచో అతడు బ్రహ్మత్వాన్ని కోల్పోతాడు. శూద్రస్త్రీతో కలిసి దేవతలకు సంబంధించిన యజ్ఞయాగాలను, పితృసంబంధమైన శ్రాద్ధం మొదలగు వాటిని చేస్తే దేవతలు ఆ బ్రాహ్మణుడిచ్చిన హవ్య కవ్యాలను స్వీకరించరు. ఆస్త్రీని వివాహం చేసికొని సంతానాన్ని కన్న బాహ్మణునికి ప్రాయశ్చిత్తం కూడాలేదు.

చతుర్ణామపి వర్ణానాం ప్రేత్య చేహ హితాహితాన్,
అష్టావిమాన్ సమాసేన స్త్రీవివాహాన్నిబోధత 20

*బ్రాహ్మోదైవస్తథైవార్షః ప్రాజాపత్య స్తథాసురః,*
*గాంధర్వో రాక్షసశ్చైవ పైశాచశ్చాష్టమోఽధమః 21*

బ్రాహ్మం, దైవం, ఆర్షం, ప్రాజాపత్యం, ఆసురం, గాంధర్వం, రాక్షసం, పైశాచం అనేవి నాలుగు వర్ణాలవారు చేసికొనతగిన వివాహాలు.

*యో యస్య ధర్మ్యో వర్ణస్య గుణదోషౌ చ యస్య యౌ,*
*తద్వస్సర్వం ప్రవక్ష్యామి ప్రసవే చ గుణాగుణాన్ 22*

*షడానుపూర్వ్యా విప్రస్య క్షత్రస్య చతురోఽవరాన్,*
*విట్ఛూద్రయోస్తు తానేవ విద్యాద్ధర్మ్యాన్న రాక్షసాన్ 23*

*చతురో బ్రాహ్మణస్యాద్యాన్ ప్రశస్తాన్ కవయో విదుః,*
*రాక్షసం క్షత్రియస్యైకమాసురం వైశ్యశూద్రయోః 24*

బ్రాహ్మణుడు మొదటి ఆరు విధములైన వివాహాలు చేసికొనవచ్చును. క్షత్రియుడు చివరి నాలుగు విధములైన వివాహములనే చేసికొనవలెను. వైశ్యుడు, శూద్రుడు రాక్షసము తప్ప ఆసుర, గాంధర్వ పెశాచ వివాహములు చేసికొనవచ్చునని చెప్పుతారు. వీటిలోను బ్రాహ్మణుడు బ్రాహ్మ, దైవ, ఆర్ష, ప్రాజాపత్యాలనే నాలుగు విధాలైన వివాహాలు చేసికొనుటయే సర్వశ్రేష్ఠమంటారు. క్షత్రియునకు రాక్షస వివాహం, వైశ్య, శూద్రులకు ఆసుర వివాహం సర్వశ్రేష్ఠమైందని పెద్దలు చెప్పుతారు.

*పంచానాం తు త్రయో ధర్మ్యా ద్వావధర్మ్యౌ స్మృతావిహ,*
*పైశాచశ్చాసురశ్చైవ న కర్తవ్యౌ కదాచన. 25*

*పృథక్ పృథగ్వా మిశ్రౌ వా వివాహౌ పూర్వచోదితౌ,*
*గాంధర్వో రాక్షస శ్చైవ ధర్మ్యౌ క్షత్రస్య తౌ స్మృతౌ 26*

పై అష్ట విధ వివాహములందు దైవం, ఆర్షం, ప్రాజాపత్యం, ధర్మసమ్మతమైనవి. గాంధర్వ వివాహం, రాక్షసవివాహం ధర్మ విరుద్ధమైనవి. అట్లే ఆసుర, పైశాచ వివాహాలను ఎట్టి పరిస్థితియందు చేసికొనవద్దని పెద్దలు చెప్పుతారు. క్షత్రియుడు గాంధర్వ రాక్షస వివాహములను చేసికొనవచ్చని అంటారు.

*ఆచ్ఛాద్య చార్చయిత్వా చ శ్రుతిశీలవతే స్వయమ్,*
*ఆహూయ దానం కన్యాయా బ్రాహ్మో ధర్మః ప్రకీర్తితః 27*

*యజ్ఞేతు వితతే సమ్యగృత్విజే కర్మ కుర్వతే,*
*అలంకృత్య సుతాదానం దైవం ధర్మం ప్రచక్షతే 28*

*ఏకం గోమిథునం ద్వే వా వరాదాదాయ ధర్మతః,*
*కన్యా ప్రదానం విధివదార్షో ధర్మస్స ఉచ్యతే 29*

*సహోభౌ చరతాం ధర్మ మితి వాచాఽనుభాష్య చ,*
*కన్యా ప్రదానమభ్యర్చ్య ప్రాజాపత్యో విధిః స్మృతః 30*

*జ్ఞాతిభ్యో ద్రవిణం దత్వా కన్యాయై చైవ శక్తితః,*
*కన్యా ప్రదానం స్వాచ్ఛంద్యాదాసురో ధర్మ ఉచ్యతే 31*

*ఇచ్ఛయాऽన్యోన్యసంయోగః కన్యాయాశ్చ వరస్య చ,*
*గాంధర్వస్సతు విజ్ఞేయో మైథున్యః కామ సంభవః 32*

*హత్వా ఛిత్వా చ భిత్వా చ క్రోశంతీం రుదతీం గృహాత్,*
*ప్రసహ్య కన్యాహరణం రాక్షసో విధిరుచ్యతే 33*

*సుప్తాం మత్తాం ప్రమత్తాం వా రహో యత్రోపగచ్ఛతి,*
*స పాపిష్ఠో వివాహానాం పైశాచశ్చాష్టమోऽధమః 34*

బ్రాహ్మం :- చక్కని చదువు, మంచి నడవడిక కల పురుషుని మర్యాదతో పిలిచి గౌరవించి చేయు కన్యాదానాన్ని బ్రాహ్మ వివాహ మందురు.

దైవం :- యజ్ఞయాగాది కర్మలందు ఋత్విక్కుడై చక్కగా యాగకర్మ చేయు బ్రాహ్మణునకు తన కుమార్తెను చక్కగా అలంకరించి చేయు వివాహం దైవ వివాహం.

ఆర్షం :- వరుడు దానం చేసిన ఆవులను తీసికొని కన్యాదానం చేసినచో ఆ వివాహం ఆర్షవివాహము.

ప్రాజపత్యం :- కన్యయొక్క తలిదండ్రులు తన కుమార్తెకు అల్లునకు ధర్మమాచరింపుడని చెప్పుచు చేసిన వివాహము ప్రాజాపత్య వివాహము

ఆసురం :- కన్యయొక్క చుట్టాలకు, కన్యకు తగిన ధనమిచ్చి చేసికొను వివాహము ఆసుర వివాహము.

గాంధర్వం :- స్త్రీ పురుషులిద్దరు తమయొక్క అన్యోన్య సమ్మతిచే తామే చేసికొను వివాహం గాంధర్వం. (ఇచ్చట పెద్దవారి అనుమతి, వారి ప్రసక్తి యనునవి ఉండవు.)

రాక్షసం :- కన్యక యొక్క తలిదండ్రులు, ఆమె బంధువులు సమ్మతింపనప్పుడు వారిని తిట్టి కొట్టి, ఆకన్యకకు కూడ ఇష్టము లేనందువల్ల ఆమె ఏడుస్తూ ఉంటే ఆమెను బలవంతంగా ఎత్తుకొని వచ్చి చేసికొను వివాహం రాక్షస వివాహం.

పైశాచం :- ఒళ్లు తెలియక పడుకొని యున్న కన్యను చెరిచి చేసికొనే వివాహం పైశాచము. దీనిని అన్ని విధాలుగా అందరు గర్హిస్తున్నారు. ఇది అధమమైన వివాహం.

*అద్భి రేవ ద్విజాగ్ర్యాణాం కన్యాదానం విశిష్యతే,*
*ఇతరేషాం తు వర్ణానామితరేతరకామ్యయా 35*

బ్రాహ్మణులకు జలధారాపూర్వకంగ కన్యాదానం చేయాలి. తక్కిన వారికా నియమం లేదు. కన్యావరుల యొక్క పరస్పరేష్టము, కన్యయొక్క తలిదండ్రులు అందరిముందు తమ కుమార్తెనిత్తుమను మాటయు సరిపడును.

*యో యస్యైషాం వివాహానాం మనునా కీర్తితో గుణః,*
*సర్వం శృణుత తం విప్రాః సర్వం కీర్తయతో మమ 36*

*దశ పూర్వాన్ పరాన్ వంశ్యానాత్మానం చైకవింశకమ్,*
*బ్రాహ్మీపుత్రస్సుకృతకృన్మోచయేదేనసః పితౄన్ 37*

*దైవోఢాజస్సుతశ్చైవ సప్త సప్త పరావరాన్,*
*ఆర్షోఢాజస్సుతస్త్రీం స్త్రీన్ షట్ షట్ కాయోఢజస్సుతః 38*

*బ్రాహ్మాదిషు వివాహేషు చతుర్ష్వేవానుపూర్వశః,*
*బ్రహ్మవర్చస్వినః పుత్రా జాయంతే శిష్టసమ్మతాః 39*

*రూపసత్త్వ గుణోపేతా ధనవంతో యశస్వినః*
*పర్యాప్తభోగా ధర్మిష్ఠా జీవంతి చ శతం సమాః 40*

*ఇతరేషు తు శిష్టేషు నృశంసానృతవాదినః,*
*జాయంతే దుర్వివాహేషు బ్రహ్మధర్మ ద్విషస్సుతాః 41*

*అనిందితైః స్త్రీ వివాహైరనింద్యా భవతి ప్రజా,*
*నిందితైర్నిందితా నృణాం తస్మాన్నింద్యాన్ వివర్జయేత్ 42*

బ్రాహ్మ వివాహం వల్ల జన్మించినపుత్రుడు తనకు ముందున్న పది తరాలవారిని, తరువాత పుట్టబోవు పదితరాలవారిని, తనను, ఇట్లు ఇరువది ఒక్క తరాలవారిని ఉద్ధరిస్తాడు. దైవ వివాహం వల్ల పుట్టిన పుత్రుడు తనకుముందున్న ఏడు తరాలను, తరువాతి ఏడు తరాలను తనను ఇట్లు పదహేను తరముల వారిని ఉద్ధరించును. ఆర్షవివాహం వల్ల పుట్టిన పుత్రుడు తనకు ముందు మూడు తరాలు తరువాత మూడు తరాలు తాను అనే ఏడు తరాలను, ప్రాజాపత్య వివాహం వల్ల పుట్టినవాడు పదమూడు తరముల వారిని నరకమునుండి రక్షిస్తాడు. అందువల్ల బ్రాహ్మది నాలుగు వివాహాల వల్ల పుట్టిన వారు బ్రహ్మతేజో విరాజితులై, శిష్టసమ్మతులై రూపం, బలం, గుణసంపదకలవారై, ధనవంతులై కీర్తిగలవారై పరిపూర్ణాయుస్సు కలవారై ధర్మప్రవర్తనతో జీవిస్తారు. తక్కిన ఆసురాది వివాహాల వల్ల జన్మించిన పుత్రులు క్రూరులు, అసత్యవాదులు, వేదవిరోధులు, యజ్ఞయాగాది కార్యాలను ద్వేషించు వారౌతారు. అనిందితాలైన వివాహాల చేత మంచి సంతతి కలుగగా నిందితాలైన వివాహాలవల్ల దుష్ట సంతతి కలుగుతుంది.

*పాణిగ్రహణసంస్కారః సవర్ణాసూపదిశ్యతే,*
*అసవర్ణాస్వయం జ్ఞేయో విధిరుద్వాహకర్మణి 43*

ఆపస్తంబుడు మొదలగు మునులు తెల్పిన పాణిగ్రహణ సంస్కారం ఒకే కులమున పుట్టినవారికి జరుగును. అసవర్ణస్త్రీలకు పాణిగ్రహణ సంస్కారము కాక ఈ క్రింది పద్ధతి నవలంబింపవలెను.

*శరః క్షత్రియయా గ్రాహ్యః ప్రతోదో వైశ్యకన్యయా,*
*వసనస్య దశా గ్రాహ్యా శూద్రయోత్కృష్టవేదనే 44*

బ్రాహ్మణుడు క్షత్రియ కన్యను వివాహం చేసికొన్నప్పుడు ఆ క్షత్రియకన్య బ్రాహ్మణుని చేతిని కాక అతడు పట్టుకొన్న బాణం కొనను పట్టుకొనాలి. బ్రాహ్మణ క్షత్రియులు వైశ్యకన్యను వివాహం చేసికొనే సమయంలో ఆ వైశ్య కన్య వరుడు పట్టుకొన్న మునికోలను పట్టుకోవాలి. బ్రాహ్మణక్షత్రియ వైశ్యులు శూద్రకన్యను వివాహమాడే సమయాన ఆ కన్య వరుడు ధరించిన పై పంచె కొంగును పట్టుకోవాలి.

*ఋతుకాలాభిగామీ స్యాత్స్వదారనిరతస్సదా,*
*పర్వవర్జం వ్రజేచ్చైనాం తద్వ్రతో రతికామ్యయా 45*

*ఋతుస్స్వాభావికః స్త్రీణాం రాత్రయః షోడశ స్మృతాః,*
*చతుర్భిరితరైస్సార్థమహోభిస్సద్విగర్హితైః 46*

*తాసామాద్యాశ్చతస్రస్తు నిందితైకాదశీ చ యా,*
*త్రయోదశీ చ శేషాస్తు ప్రశస్తా దశ రాత్రయః 47*

*యుగ్మాసు పుత్రా జాయంతే స్త్రియోఽయుగ్మాసు రాత్రిషు,*
*తస్మాద్యుగ్మాసు పుత్రార్థీ సంవిశేదార్తవే స్త్రియం 48*

*పుమాన్పుంసోఽధికే శుక్రే స్త్రీ భవత్యధికే స్త్రియాః*

*సమేఽపుమాన్ పుంస్త్రియౌ వా క్షీణేఽల్పే చ విపర్యయః 49*
*నింద్యాస్వష్టాసు చాన్యాసు స్త్రియో రాత్రిషు వర్జయన్,*

*బ్రహ్మచార్యేవ భవతి యత్ర తత్రాశ్రమే వసన్. 50*

మానవుడు తన భార్యను సంతోషపెట్టుటయే తన వ్రతమని భావించి, ఇతర స్త్రీలను మనస్సులోనైన కోరక పర్వదినములను, ఇతర నిషిద్ధ దినములను వదలిపెట్టి భార్యాసంగమము చేయవలెను. స్త్రీలకు స్వభావసిద్ధముగా పదహారు దినములు ఋతుకాలము. ఆ ఋతుకాలమున తొలి నాలుగు రాత్రులు, పదకొండవ పదమూడవ రాత్రులు తప్ప మిగిలిన పదిరాత్రులు భార్యాసంగమమునకు ప్రశస్తమైనవి. ఈ పదిరాత్రులలో సరి దినములందు పుత్రులు పుట్టుతారు. బేసి రాత్రులలో స్త్రీ సంతానము కలుగుతుంది. కావున ఆయా సంతానాన్ని కోరుకొనువారు ఆయా రాత్రులలో సంగమం చేయాలి. అట్లే శుక్రకణాలధికమైతే పురుషుడు పుడ్తాడు. స్త్రీ కణాలు అధికమైతే స్త్రీ పుట్టుతుంది. శుక్రశోణితములు సమానంగా ఉంటే నపుంసకుడుగాని స్త్రీ పురుషులిద్దరు గాని పుట్టుతారు. రెండు తక్కువగా నున్నచో గర్భస్రావం జరుగుతుంది.

ఋతుకాలంలో నింద్యాలైన మొదటి నాలుగురాత్రులు, పదకొండు, పదమూడవ రాత్రి అను రెండు దినములు, పర్వకాలమైన అమావాస్యా పున్నమి రాత్రులు ఈ ఎనిమిది రాత్రులు వదలి పెట్టి భార్యా సంగమం చేయువాడు గృహస్థాశ్రమందున్నను బ్రహ్మచర్య వ్రతమనుష్ఠిస్తున్న వానితో సమానుడగుచున్నాడు.

*న కన్యాయాః పితా విద్వాన్ గృహ్ణీయాచ్ఛుల్కమణ్వపి,*
*గృహ్ణంఛ్శుల్కం హి లోభేన స్యాన్నరోఽపత్యవిక్రయీ 51*

## తృతీయాధ్యాయం

వివేకం కల తండ్రి తన కూతురునిస్తూ వరునినుండి ఏ మాత్రం ధనం తీసికోకూడదు. ఆశతో ఏమాత్రం ధనం తీసికొన్నా ఆ తండ్రికి కన్యాదాన ఫలం దక్కదు. పైగా అతడు తన సంతానాన్ని అమ్ముకొన్నవాడౌతాడు.

*స్త్రీధనాని తు యే మోహాదుపజీవంతి భాంధవాః,*
*నారీ యానాని వస్త్రం వా తే పాపా యాంత్యధోగతిం 52*

*ఆర్షే గోమిథునం శుల్కం కేచిదాహుర్మృషైవ తత్,*
*అల్పోZప్యేవం మహాన్ వాZపి విక్రయస్తావ దేవ సః 53*

*యాసాం నాదదతే శుల్కం జ్ఞాతయో న స విక్రయః,*
*అర్హ ణం తత్కుమారీణామానృశంస్యం చ కేవలమ్ 54*

తన కూతురునకు పెండ్లి చేసిన తరువాత ఆ స్త్రీకి సంబంధించిన ధనాన్ని, వాహనాలను, వస్త్రాలను తల్లిదండ్రులు లేక ఆ స్త్రీ యొక్క బంధువులు ఉపయోగించుకొంటే పాపం పొంది అధోగతికి చేరుతారు. ఆర్షవివాహంలో గో మిధునాన్ని (ఒక ఆవు ఒక ఎద్దు) పిల్ల తండ్రి తీసికొనవచ్చని కొందరంటారు. ఓలి తక్కువగా తీసికొన్నప్పటికీ తన కన్యను అమ్ముకొన్నట్లే ఔతుంది. కాని కన్యాదానం చేసినట్లు కాదు. కన్యాబంధువులు, తల్లితండ్రి మొదలైన వారు కన్యాశుల్కం తీసికొనక వరుని పక్షం వారిచ్చిన ధనాన్ని తిరిగి తన కూతురికే ఇచ్చివేస్తే అది కన్యా విక్రయం కాజాలదు.

*పితృభిర్భ్రాతృభిశ్చైతాః పతిభిర్దేవరైస్తథా,*
*పూజ్యా భూషయితవ్యాశ్చ బహుకల్యాణమీప్సుభిః 55*

*యత్ర నార్యస్తు పూజ్యంతే రమంతే తత్ర దేవతాః,*
*యత్రైతాస్తు న పూజ్యంతే సర్వా స్తత్రాఫలాః క్రియాః 56*

*శోచంతి జామయో యత్ర వినశ్యత్యాశు తత్కులమ్,*
*న శోచంతి తు యత్రైతా వర్ధతే తద్ధి సర్వదా 57*

*జామయో యాని గేహాని శపంత్యప్రతిపూజితాః*
*తాని కృత్యాహతానీవ వినశ్యంతి సమంతతః 58*

*తస్మాదేతాస్సదా పూజ్యా భూషణాచ్ఛాదనాశనైః*
*భూతికామైర్నరైర్నిత్యం సత్కారేషూత్సవేషు చ, 59*

తమకు మేలు జరుగవలెనని కోరు తల్లిదండ్రులు, అన్నదమ్ములు, భర్త మరదులు మొదలగువారు స్త్రీలను గౌరవిస్తూ భూషణాదులచే అలంకరించి ఆమె యొక్క మెప్పును పొందాలి. స్త్రీలకు గౌరవమున్నచో దేవతలెల్లప్పుడు సంతోషిస్తారు. స్త్రీలకు గౌరవము లేనిచో అచ్చట జరుగు దేవతాపూజ, యజ్ఞయాగములు మున్నగు క్రియలన్నీ వ్యర్థమైపోతాయి. అట్లే స్త్రీలు దుఃఖించినచో వారి దుఃఖములకు కారణమైన వారి వంశమంతా నశించిపోతుంది. స్త్రీలు సదా సంతోషంతో ఉంటే ఆ ఇల్లు, వారి వంశం సదా కళకళలాడుతూ ఉంటుంది. స్త్రీ అవమానాల పాలై తిట్టినచో ఆ కులమంతా నశిస్తుంది.

అందువల్ల తమకు మేలు కలుగవలెనని కోరువారు స్త్రీలను సదా ఆభరణములు, వస్త్రములు, చక్కని భోజనము మొదలైనవాటిచే సంతోషపెట్టాలి.

*సంతుష్టో భార్యయా భర్తా భర్త్రా భార్యా తథైవ చ,*
*యస్మిన్నేవ కులే నిత్యం కల్యాణం తత్ర వైధ్రువమ్ 60*

*యది హి స్త్రీ న రోచేత పుమాంసం న ప్రమోదయేత్,*
*అప్రమోదాత్పునః పుంసః ప్రజనం న ప్రవర్తతే 61*

*స్త్రియాం తు రోచమానాయాం సర్వం తద్రోచతే కులమ్,*
*తస్యాం త్వరోచమానాయాం సర్వమేవ న రోచతే. 62*

భర్త భార్యను, భార్య భర్తను సంతోషపెట్టుతూ ఉంటే ఆ ఇంట నిత్య కల్యాణం జరుగుతూ ఉంటుంది. స్త్రీ తన భర్తను సంతోషపెట్టకపోతే వారికి సంతానము కలుగుట దుర్లభం. అట్లే స్త్రీ సంతోషంతోఉంటే ఆమె వంశమంతా సంతోషంతో కళకళలాడుతూ ఉంటుంది. ఆమెకు సంతోషం లేకపోతే వంశాన్నంతా చెడగొట్టుతుంది.

*కువివాహైః క్రియాలోపై ర్వేదానధ్యయనేన చ,*
*కులాన్యకులతాం యాంతి బ్రాహ్మణాతిక్రమేణ చ. 63*

*శిల్పేన వ్యవహారేణ శూద్రాపత్యైశ్చ కేవలైః*
*గోభిరశ్వైశ్చ యానైశ్చ కృష్యా రాజోపసేవయా 64*

*అయాజ్యయాజనైశ్చైవ నాస్తిక్యేన చ కర్మణాం,*
*కులాన్యాశు వినశ్యంతి యాని హీనాని మంత్రతః 65*

*మంత్రతస్తు సమృద్ధాని కులాన్యల్పధనాన్యపి,*
*కులసంఖ్యాం చ గచ్ఛంతి కర్షంతి చ మహద్యశః 66*

తమ తమ కులాలకు నిషిద్ధమైన వివాహాలచే, తమ తమ వంశాచారాలను అనుష్ఠింపకపోతే బ్రాహ్మణులను గౌరవింపకపోతే సత్కులములు కూడ హీనస్థితికి చేరుకుంటాయి. చిత్రలేఖనం మొదలైన శిల్పరచనవల్ల, ద్రవ్యం అధికంగా సంపాదించాలి అని చేయు వ్యవహారాల వల్ల, శూద్రులయందు సంతతిని కన్నందువల్ల, గోవులు, గుఱ్ఱాలు బండ్లు మొదలగు వాని క్రయవిక్రయాల వల్ల, సేద్యం చేయుటవల్ల, రాజును సేవించుట వల్ల, యాగార్హత లేనివారిచే యాగాలు చేయించుట వల్ల, నాస్తిక్య బుద్ధివల్ల వేదాధ్యయనం చేయనందువల్ల తమ కులం గౌరవాన్ని కోల్పోతుంది. వేద, వేదాంగములను చక్కగా అధ్యయనం చేసినవారు ధనహీనులైనను గొప్ప కీర్తిని పొందుతున్నారు.

*వైవాహికేఽగ్నౌ కుర్వీత గృహ్యం కర్మ యథావిధి,*
*పంచయజ్ఞ విధానం చ పంక్తిం చాన్వాహికీం గృహీ 67*

*పంచ సూనా గృహస్థస్య చుల్లీ పేషణ్యుపస్కరః,*
*కండనీ చోదకుంభశ్చ బధ్యతే యాస్తు వాహయన్. 68*

*తాసాం క్రమేణ సర్వాసాం నిష్కృత్యర్థం మహర్షిభిః,*
*పంచక్లృప్తా మహాయజ్ఞాః ప్రత్యహం గృహమేధినాం 69*

*అధ్యాపనం బ్రహ్మయజ్ఞః పితృయజ్ఞస్తు తర్పణం,*
*హోమో దైవో బలిర్భౌతో నృయజ్ఞోஉతిథిపూజనమ్ 70*

*పంచైతాన్ యో మహాయజ్ఞాన్ న హాపయతి శక్తితః,*
*సగృహేஉపి వసన్నిత్యం సూనాదోషైర్న లిప్యతే. 71*

*దేవతాతిథిభృత్యానాం పితౄణామాత్మనశ్చ యః,*
*న నిర్వపతి పంచానాముచ్ఛ్వసన్న స జీవతి 72*

గృహస్థాశ్రమ ధర్మాన్ని అనుష్ఠించువాడు గార్హపత్యాగ్ని యందు సాయంప్రాత స్సమయములలో ఔపసనాదిక్రియలను వైశ్య దేవాది క్రియలను, ప్రతిదినము చేయదగిన పాకక్రియ మొదలగు పంచ మహాయజ్ఞాలను చేయాలి. గృహస్థు తన ఇంటిలో నుంచుకొన్న పొయ్యి, రోలు, రోకలి, ఇంటిని అలుకుగుడ్డ, నీళ్ళ కడవ అను వాటిచే ఐదు విధాలైన హత్యాపాపాలు పొందుతున్నాడు. వాటిని పోగొట్టుకొనుటకై పంచమహాయజ్ఞాలను ప్రతిదినం చేయవలెను. బ్రహ్మయజ్ఞ, పితృయజ్ఞ, దైవయజ్ఞ, భూతయజ్ఞ, మనుష్యయజ్ఞం అ పంచమహాయజ్ఞాలు. వేదాన్ని అధ్యయనం చేయుట, చేయించుట అనేది బ్రహ్మయజ్ఞం పితృదేవతలకిచ్చు తర్పణము పితృయజ్ఞం, యజ్ఞయాగాది కార్యం దైవ యజ్ఞం, భూతబలి భూతయజ్ఞం, ఇంటికి వచ్చు అతిధులను గౌరవించుట అనునది మనుష్య యజ్ఞం. ఈ పంచయజ్ఞములను యథాశక్తిగా నాచరించు గృహస్థుడు తానింటిలో ఉన్నా పంచహత్యా దోషములను పొందడు. దేవతలకు, అతిథులకు, సేవకులకు, పితృదేవతలకు, అన్నమును పెట్టనివాడు బ్రదికియున్నా చనిపోయినవానితో సమానుడౌతాడు.

*అహుతం చ హుతం చైవ తథా ప్రహుతమేవ చ,*
*బ్రాహ్మ్యం హుతం ప్రాశితం చ పంచ యజ్ఞాన్ ప్రచక్షతే 73*

*జపోஉహుతో హుతో హోమః ప్రహుతో భౌతికో బలిః,*
*బ్రాహ్మ్యం హుతం ద్విజాగ్ర్యార్చా ప్రాశితం పితృతర్పణమ్ 74*

అహుతము, హుతము, ప్రహుతము, బ్రాహ్మహుతము, ప్రాశితము అనేవి పంచయజ్ఞాలు. అహుతమనగా జపం. హుతమనగా అగ్నిహోత్రంలో చేయబడు హోమం. భూతబలి ప్రహుతం. బ్రాహ్మణోత్తముని పూజ బ్రాహ్మహుతం. ప్రాశితమనగా పితృతర్పణం.

*స్వాధ్యాయే నిత్యయుక్తస్స్యాత్ దైవే చైవేహ కర్మణి,*
*దైవే కర్మణి యుక్తో హి బిభర్తీదం చరాచరమ్ 75*

*అగ్నౌ ప్రాస్తాహుతి స్సమ్యగాదిత్యముపతిష్ఠతే,*
*ఆదిత్యాజ్జాయతే వృష్టి ర్వృష్టేరన్నం తతః ప్రజాః 76*

దరిద్రం మొదలైన కారణాలవల్ల నిత్యం అతిధిపూజ చేయలేకపోయినా బ్రాహ్మణుడు ప్రతిదినం వేదాధ్యయనమందు దేవతార్చనయందు శ్రద్ధ కలిగియున్నచో అతడు

ఈ సమస్త ప్రపంచమును భరింపగలడు. అగ్నియందు చక్కగా వేల్చబడిన ఆహుతులు సూర్యుని చేరుతాయి. సూర్యుని వల్ల వర్షం కలుగుతుంది. వర్షం వల్ల అన్నం పుట్టుతుంది. సమృద్ధిగా ఆహారముంటే జనులు బాగా సుఖపడుతారు.

*యథా వాయుం సమాశ్రిత్య వర్తంతే సర్వజంతవః,*
*తథా గృహస్థమాశ్రిత్య వర్తంతే సర్వ ఆశ్రమాః 77*

*యస్మాత్త్రయోఽప్యాశ్రమిణో జ్ఞానేనాన్నేన చాన్వహమ్,*
*గృహస్థేనైవ ధార్యంతే తస్మాజ్జ్యేష్ఠాశ్రమో గృహీ 78*

*స సంధార్యః ప్రయత్నేన స్వర్గమక్షయమిచ్ఛతా,*
*సుఖం చేహేచ్ఛతా నిత్యం యోఽధార్యో దుర్బలేంద్రియైః 79*

ప్రాణవాయువు నాశ్రయించి సమస్త జీవులు బ్రతుకుతున్నట్లు తక్కిన ఆశ్రమాలందున్నవారు (బ్రహ్మచారులు, వానప్రస్థులు, సన్యాసులు) గృహస్థునాశ్రయించుకొని జీవిస్తున్నారు. గృహస్థు తక్కిన యాశ్రమములవారిచే వేదాధ్యయనం చేయించి, అన్నం పెట్టుతున్నందువల్ల మిగిలిన ఆశ్రమాలవారికి అతడే ప్రధానమౌతున్నాడు. పరలోకంలో నాశనం లేని స్వర్గాన్ని, ఇహలోకంలో స్త్రీ సంభోగాది సుఖములనపేక్షించే గృహస్థు ఇంద్రియనిగ్రహాన్ని పాటిస్తూ తన గృహస్థాశ్రమాన్ని చక్కగా నిర్వర్తించాలి.

*ఋషయః పితరో దేవా భూతాన్యతిథయస్తథా,*
*ఆశాసతే కుటుంబిభ్యస్తేభ్యః కార్యం విజానతా 80*

*స్వాధ్యాయేనార్చయేతర్షీన్ హోమైర్దేవాన్ యథావిధి,*
*పితౄన్ శ్రాద్ధైశ్చ నౄనన్నైర్భూతాని బలికర్మణా 81*

*కుర్యాదహరహః శ్రాద్ధమన్నాద్యేనోదకేన వా,*
*పయోమూలఫలైర్వాపి పితృభ్యః ప్రీతిమావహన్ 82*

ఋషులు, పితరులు, దేవతలు, భూతాలు, అతిథులు మొదలగువారందరు గృహస్థులనుండి పలు విషయాలను కోరుకొంటారు. కావున గృహస్థ ధర్మంలో ఉన్నవాడు వారి వారికి కావలసిన వాటిని తెలుసుకొని ఇవ్వవలెను. ఎట్లనగా

వేదాధ్యయనం చేత ఋషులను, యజ్ఞయాగాదులచే దేవతలను, శ్రాద్ధతర్పణములచే పితృదేవతలను, అన్నంచేత అతిథులను, బలికర్మచే జంతువులను శాస్త్రప్రకారంగా పూజించాలి. గృహస్థుడు ప్రతిదినం పితృదేవతలకు సంతృప్తి కలుగుటకై అన్నాదులచే, ఉదకదానముచే, పాలు, దుంపలు, ఫలములు దానం చేస్తూ శ్రాద్ధాన్ని ఆచరించాలి.

*ఏక మప్యాశయే ద్విప్రం పిత్రర్థే పాంచయజ్ఞికే,*
*న చైవాత్రాశయేత్కించి ద్వైశ్వదేవం ప్రతి ద్విజమ్ 83*

*వైశ్వదేవస్యసిద్ధస్య గృహ్యేఽగ్నౌ విధిపూర్వకమ్,*
*ఆభ్యః కుర్యాద్దేవతాభ్యో బ్రాహ్మణో హోమమన్వహమ్ 84*

అగ్నేస్సోమస్య చైవాదౌ తయోశ్చైవ సమస్తయోః,
విశ్వేభ్యశ్చైవ దేవేభ్యో ధన్వంతరయ ఏవ చ, 85

కుహ్వై చైవానుమత్యై చప్రజాపతయ ఏవ చ,
సహద్యావాపృథివ్యోశ్చ తథా స్విష్టకృతేఽంతతః 86

పంచమహాయజ్ఞాలందొకటైన పితృయజ్ఞంలో ఒక్క బ్రాహ్మణునికైనను ప్రతిదినము భోజనము పెట్టవలెను. వైశ్వదేవము లేక భూతయజ్ఞంలో బ్రాహ్మణునకు భోజనము పెట్టక బలిమాత్రము వేయాలి. వైశ్వదేవానికై ఉంచుకొన్న అన్నాన్ని హోమం చేస్తూ ఈ దేవతలకు ఆహుతులు ఇవ్వ వలెను. తొలుత అగ్నికి, సోమునకు విడివిడిగాను, తరువాత అగ్నీ షోములిద్దరికి కలిపి, ఆ తరువాత విశ్వే దేవతలకు ధన్వంతరికి ఆహుతులివ్వలెను. అటుపిమ్మట కుహూ దేవతకు అనుమతికి, ప్రజాపతికి, ద్యావా పృథివీ దేవతలకు ఆహుతులిస్తూ చివర స్విష్ఠకృద్ధోమము చేయవలెను.

ఏవం సమ్యగ్ఘవిర్హుత్వా సర్వదిక్షు ప్రదక్షిణమ్,
ఇంద్రాంత కాప్పతీందుభ్యః సానుగేభ్యో బలిం హరేత్ 87

మరుద్భ్య ఇతి తు ద్వారి క్షిపేదప్స్వద్భ్య ఇత్యపి,
వనస్పతిభ్య ఇత్యేవం ముసలోలూఖలే హరేత్ 88

ఉచ్ఛీర్షకే శ్రియై కుర్యాద్భద్రకాళ్యై చ పాదతః,
బ్రహ్మవాస్తోష్పతిభ్యాం తు వాస్తు మధ్యే బలిం హరేత్ 89

విశ్వేభ్యశ్చైవ దేవేభ్యో బలిమాకాశ ఉత్క్షిపేత్,
దివాచరేభ్యో భూతేభ్యో నక్తంచారిభ్య ఏవ చ. 90

పృష్ఠవాస్తుని కుర్వీత బలిం సర్వాత్మ భూతయే,
పితృభ్యో బలిశేషం తు సర్వం దక్షిణతో హరేత్. 91

శూనాం చ పతితానాం చ శ్వపచాం పాపరోగిణామ్,
వాయసానాం కృమీణాం చ శనకైర్నిర్వపేద్భువి. 92

ఏవం యస్సర్వభూతాని బ్రాహ్మణో నిత్యమర్చతి,
స గచ్ఛతి పరం స్థానం తేజోమూర్తిపథర్జునా 93

ఈ విధంగా చక్కగా హోమం చేసి అన్ని దిక్కులలో ప్రదక్షిణ పద్ధతిలో అగ్ని యమవరుణ సోములకు వారి పరివార దేవతలకు బలిని ఇవ్వవలెను."మరుద్భ్యఃస్వాహా"" అని ద్వారదేశంలో మరుత్తులకు, 'అద్భ్యః స్వాహా'' అని నీటియందు జలాధిదేవతకు, "వనస్పతిభ్యః స్వాహా'' అని రోలు రోకళ్ళున్న ప్రదేశంలో వన దేవతలకు బలి నుంచవలెను. "శ్రియైనమః" అను మంత్రంతో వాస్తు పురుషుని శిరోభాగమైన ఈశాన్యదిశయందు లక్ష్మీదేవికి, "భద్రకాళ్యైనమః'అని వాస్తుపురుషుని పాదభాగమగు నైఋతి దిక్కున భద్రకాళికి, "బ్రహ్మణేనమః" అను మంత్రంతో బ్రహ్మదేవునికి "వాస్తోష్పతయేనమః'' అను మంత్రం చే వాస్తు పురుషునకు గృహమధ్యభాగంలో బలిని పెట్టవలెను. "విశ్వేభ్యో దేవేభ్యోనమః"

అను మంత్రం చే విశ్వేదేవతలకు ఆకాశమున బలిని విసరివేయవలెను. అట్లే "దివాచరేభ్యో భూతేభ్యోనమః"అని పగటిపూట తిరుగు భూతాలకు, "నక్తంచరేభ్యో భూతేభ్యోనమః" అని రాత్రిపూట సంచరించు భూతాలకు బలినీయవలెను. "సర్వాత్మ భూతయే స్వాహా" అని 'సర్వాత్మభూతికై ఇంటి పైభాగాన, "పితృభ్యః స్వాహా" అని మిగిలిపోయిన బల్యన్నాన్ని ఇంటికి దక్షిణభాగంలో పితృదేవతలకై వేయవలెను. అట్లే శునకములకు, పతితులకు, చండాలురకు, కుష్ఠు మొదలగు రోగబాధితులకు, కాకులకు, పురుగులకు మెల్లగా భూమిపై బలినొసంగవలెను. ఇట్లు బలిహరణంచే సమస్త భూతాలను ప్రతిదినము ఆరాధించే బ్రాహ్మణుడు తేజఃస్వరూపుడై ఋజుమార్గమున పరబ్రహ్మను పొందుతున్నాడు.

*కృత్వైతద్బలికర్మైవమతిథిం పూర్వమాశయేత్,*
*భిక్షాం చ భిక్షవే దద్యాద్విధివద్బ్రహ్మచారిణే. 94*

*యత్పుణ్యఫలమాప్నోతి గాం దత్వా విధివద్గురోః,*
*తత్పుణ్య ఫల మాప్నోతి భిక్షాం దత్వాద్విజో గృహీ 95*

ఈ విధంగా బలికర్మను పూర్తి చేసిన తరువాత మొదట అతిథికి భోజనం పెట్టవలెను. తరువాత సన్యాసికి ఆటు పిమ్మట బ్రహ్మచారికి భిక్ష నీయవలెను. ఇట్లు భిక్షనిచ్చినందువల్ల గృహస్థుడు తన గురువుకు శాస్త్రమర్యాదననుసరించి గోదానం చేసినంత ఫలితమును పొందుతున్నాడు.

*భిక్షామప్యుదపాత్రం వా సత్కృత్య విధిపూర్వకమ్,*
*వేదతత్త్వార్థవిదుషే బ్రాహ్మణాయోపపాదయేత్. 96*

*నశ్యంతి హవ్యకవ్యాని నరాణా మవిజానతామ్,*
*భస్మీభూతేషు విప్రేషు మోహాద్దత్తాని దాతృభిః 97*

*విద్యాతపస్సమృద్ధేషు హుతం విప్రముఖాగ్నిషు,*
*నిస్తారయతి దుర్గాచ్చ మహతశ్చైవ కిల్బిషాత్. 98*

వేదార్థాన్ని వేదతత్వాన్ని బాగా తెలిసిన బ్రాహ్మణుని విధి పూర్వకంగా సత్కరించి తన శక్తి కొలది భిక్షను గాని అది కూడ ఇచ్చుటకు శక్తిలేనిచో త్రాగుటకు నీరు గల పాత్రను గాని దానంగా ఈయవలెను. యోగ్యత నెరుగక ఇచ్చిన దానం నిష్ఫలమౌతుంది. అధ్యయనం అధికమైన తపస్సు చేసిన బ్రాహ్మణునకిచ్చిన దానం అగ్నిహోత్రాన వేయబడ్డ ఆహుతులవలె ఇహ పర పాపములను పోగొట్టుంది.

*సంప్రాప్తాయ త్వతిథయే ప్రదద్యాదాసనోదకే,*
*అన్నం చైవ యథాశక్తి సత్కృత్య విధిపూర్వకం 99*

*శిలానప్యుంఛతో నిత్యం పంచాగ్నీనపి జుహ్వతః*
*సర్వం సుకృతమాదత్తే బ్రాహ్మణోzనర్చితో వసన్ 100*

*తృణాని భూమిరుదకం వాక్ చతుర్థీ చ సూనృతా,*
*ఏతాన్యపి సతాం గేహే నోచ్ఛిద్యంతే కదాచన 101*

# తృతీయాధ్యాయం

ఇంటికి వచ్చిన అతిథిని శాస్త్ర పద్ధతి ననుసరించి గౌరవించి అతనికి ఆసనాన్ని, కాళ్ళు చేతులు కడుగుకొనుటకు త్రాగుటకు నీరునిచ్చి తన శక్తి ననుసరించి అన్నాన్ని పెట్టవలెను. అతిథి సత్కారాన్ని చేయనివాడు శిలోంఛా వృత్తిచే (పొలమున రాలిన గింజలనేరి వాటితో) జీవిస్తున్నా, పంచాగ్ని మధ్యలో తపస్సుచేసినా వాటి ఫలితాన్ని మాత్రం పొందజాలడు. సజ్జనుల ఇంటిలో అతిథులు పండుకొనుటకు గడ్డిపోచలు, విశ్రాంతి తీసికొనుటకు స్థలము, త్రాగుటకు మంచినీరు, ప్రియమైన మాటలు ఎల్లప్పుడు లభిస్తాయి.

*ఏకరాత్రం తు నివసన్నతిధి ర్బ్రాహ్మణః స్మృతః,*
*అనిత్యం హి స్థితో యస్మాత్తస్మాదతిథిరుచ్యతే 102*

*నైకగ్రామీణమతిధిం విప్రం సాంగతికం తథా,*
*ఉపస్థితం గృహే విద్యాద్భార్యా యత్రాగ్నయోఽపి వా 103*

*ఉపాసతే యే గృహస్థాః పరపాకమబుద్ధయః,*
*తేన తే ప్రేత్య పశుతాం వ్రజంత్యన్నాదిదాయినామ్ 104*

*అప్రణోద్యోఽతిథిస్సాయం సూర్యోఢో గృహమేధినా,*
*కాలే ప్రాప్త స్త్వకాలే వా నాస్యానశ్నన్ గృహేవసేత్. 105*

*న వై స్వయం తదశ్నీయాదతిథిం యన్న భోజయేత్,*
*ధన్యం యశస్యమాయుష్యం స్వర్గ్యం చాతిథిపూజనమ్, 106*

ఒక దినం మాత్రమే ఉంటే, వానిని అతిథియంటారు. అతిథి అంటే నిత్యము స్థితి లేనివాడని యర్థం. ఒక ఊరులో ఎల్లప్పుడు ఉండువానిని, వింత మాటలతో కాలం పుచ్చేవాణ్ణి అతిథియని అనకూడదు. అతిథికి ఆదరసత్కారములు లభించునని ఎల్లప్పుడు తిరుగుచు ఇతరుల ఇంట భోజనం చేస్తూ కాలక్షేపం చేసే గృహస్థులు తరువాతి జన్మలో తనకు భోజనం పెట్టినవారి దగ్గర పశువులై పుట్టుతారు. సూర్యుడస్తమించిన తరువాత వచ్చిన అతిథి తిరిగి తన ఇంటికి చీకటిలో పోలేడు కావున అతనికి అతిథి సత్కారములు చేయవలెను. అట్లే భోజనసమయమునకు వచ్చినను, భోజనకాలమునతిక్రమించి వచ్చినను అతిధికి సత్కారము తప్పక చేయవలెను. అతిథికి పెట్టని పాలు, పెరుగు మొదలగు వస్తువులను గృహస్థు తినకూడదు. అతిథి పూజచేసినచో ధనము, కీర్తి, ఆయుస్సు, పరలోకమున స్వర్గ సుఖాలు లభిస్తాయి.

*ఆసనావసథౌ శయ్యా మనువ్రజ్యా ముపాసనమ్,*
*ఉత్తమేషూత్తమం కుర్యాద్ధీనే హీనం సమే సమమ్ 107*

*వైశ్వదేవేతు నిర్వృత్తే యద్యన్యోఽ తిథిరావ్రజేత్,*
*తస్యాప్యన్నం యథాశక్తి ప్రదద్యాన్న బలిం హరేత్. 108*

*న భోజనార్థం స్వే విప్రః కులగోత్రే నివేదయేత్,*
*భోజనార్థం హి తే శంసన్ వాంతాశీత్యుచ్యతే బుధైః 109*

ఆసనం, విశ్రమస్థానం, పాన్పు, వీడ్కోలు, శుశ్రూష ఇట్టి ఉపచారాలు అతిథి

యొక్క యోగ్యతననుసరించి చేయాలి. వైశ్వదేవయజ్ఞం చేసిన తరువాత ఇంకొక అతిథి ఇంటికి వచ్చినచో తన శక్తి కొద్దీ అతనికి కూడ భోజనం పెట్టాలి. భోజనానికై వచ్చిన అతిథి తన కులగోత్రాలను చెప్పవలసిన పని లేదు. తన ఇంటికి వచ్చిన అతిథి యొక్క కుల గోత్రాలను అడిగితే అతనికి వాంతి చేసికొన్న అన్నమును పెట్టినవానితో సమానుడగునని పెద్దలంటారు.

*న బ్రాహ్మణస్య త్వతిథిగృహే రాజన్య ఉచ్యతే,*
*వైశ్య శూద్రౌ సఖా చైవ జ్ఞాతయో గురు రేవ చ. 110*

*యది త్వతిథిధర్మేణ క్షత్రియో గృహ మావ్రజేత్,*
*భుక్తవత్సు చ విప్రేషు కామం తమపి భోజయేత్ 111*

*వైశ్యశూద్రవపి ప్రాప్తౌ కుటుంబేఽతిథిధర్మిణౌ,*
*భోజయేత్సహ భృత్యైస్తావానృశంస్యం ప్రయోజయన్ 112*

*ఇతరానపి సఖ్యాదీన్ సంప్రీత్యా గృహ మాగతాన్,*
*సత్కృత్యాన్నం యథాశక్తి భోజయేదవిచారయన్ 113*

*సువాసినీః కుమారీశ్చ రోగిణో గర్భిణీః స్త్రియః,*
*అతిథిభ్యోఽగ్ర ఏవైతాన్ భోజయేదవిచారయన్ 114*

బ్రాహ్మణుని ఇంటికి రాజు మొదలగువారు అతిథిగా పోరాదు. అట్లే స్నేహితుడు, బంధువులు, తనతో సమానులు కావున వారు అతిథులు కాజాలరు. అదే విధంగా గురువు తనకంటె గొప్పవాడు, సదా గౌరవించతగినవాడు కావున అతడు కూడ అతిథి కాజాలడు. బ్రాహ్మణుని ఇంటికి క్షత్రియుడు అతిథిగా వస్తే బ్రాహ్మణ భోజనము తరువాత అతనికి భోజనము పెట్టవలెను. వైశ్యశూద్రులకు ఆ తరువాత భోజనము పెట్టవలెను. స్నేహితులు మొదలైనవారు తన ఇంటికి వచ్చినచో వారికి కూడ మర్యాదతో భోజనము పెట్టవలెను. అట్లే సువాసినులు, బాలికలు, రోగులు, గర్భిణీస్త్రీలకు అథితుల కంటె ముందుగానే భోజనము పెట్టవలెను.

*అదత్వా తు య ఏతేభ్యః పూర్వం భుజ్క్తే విచక్షణః,*
*న భుంజానో న జానాతి శ్వగృధ్రైర్జగ్ధి మాత్మనః 115*

*భుక్తవత్స్వథ విప్రేషు స్వేషు భృత్యేషు చైవ హి,*
*భుంజీయాతాం తతః పశ్చాదవశిష్టం తు దంపతీ 116*

సువాసినులు, బాలికలు, అతిథులు మొదలుకొని సేవకులవరకు భోజనము పెట్టక తాను ముందే భోజనము చేసినచో అట్టి వాడు చనిపోయిన తరువాత అతని శరీరాన్ని కుక్కలు, గద్దలు తినును. అనగా అతనికి ప్రేతసంస్కారం చేసే వారెవ్వరు లేక అనాథశవంగా మారుతాడు. విప్రులు, అతిథులు, తన భృత్యులు మొదలగువారందరు భోజనం చేసిన తరువాత మిగిలిన శాకపాకాలను గృహయజమాని తన భార్యతో కలిసి భుజించాలి.

*దేవానృషీన్మనుష్యాంశ్చ పితౄన్ గృహ్యాశ్చ దేవతాః,*
*పూజయిత్వా తతః పశ్చాద్గృహస్థ శ్శేషభుగ్భవేత్ 117*

*అఘం స కేవలం భుఙ్క్తే యః పచత్యాత్మ కారణాత్,*
*యజ్ఞశిష్టాశనం హ్యేతత్సతామన్నం విధీయతే. 118*

దేవతలను, ఋషులను, మనుష్యులను, పితృదేవతలను, గృహమునందున్న దేవతలనందరిని భోజనాదులచే పూజించిన తరువాత మిగిలిన దానిని ఇంటి యజమాని తినవలెను. తన పొట్ట నింపుకొనుటకు మాత్రమే తినువాడు పాపాన్ని సంపాదించుకొన్నవాడౌతాడు. పంచయజ్ఞాలు చేసిన తరువాత మిగిలిన అన్నాన్ని భుజించుటయే ఉత్తమమని పెద్దలంటారు.

*రాజర్త్విక్స్నాతకగురూన్ ప్రియశ్వశురమాతులాన్*
*అర్హ యేన్మధుపర్కేణపరిసంవత్సరాత్పునః 119*

*రాజా చ శ్రోత్రియశ్చైవ యజ్ఞకర్మణ్యుపస్థితౌ,*
*మధుపర్కేణ సంపూజ్యౌ న త్వయజ్ఞ ఇతి స్థితిః 120*

రాజు, ఋత్విక్కు, స్నాతకవ్రతం చేసికొన్నవాడు, గురువు, మామగారు, మేనమామ, వీరు సంవత్సరము తరువాత తిరిగివచ్చినచో వారికి మధుపర్కము మొదలగువాటినిచ్చి సత్కరించాలి. రాజు, ఋత్విక్కు, వీరు తనుఇంటికి సంవత్సరము తరువాత యజ్ఞసమయమందు, వివాహసమయమున వచ్చినచో అప్పుడు మాత్రమే వీరిని మధుపర్కాదులచే పూజించాలి. తక్కినవారు యజ్ఞము చేయనపుడు వచ్చిననువారిని మధుపర్కాదులచే గౌరవించాలి.

*సాయం త్వన్నస్య సిద్ధస్య పత్న్యమంత్రం బలిం హరేత్,*
*వైశ్వదేవం హి నామైతత్సాయం ప్రాతర్విధీయతే 121*

సాయంకాలమున గృహపత్ని మంత్రరహితముగా భూతబలిని చేయాలి. ఇట్లు ఉదయం ఇంటియజమాని, సాయంకాలం యజమానురాలు ఈ వైశ్వదేవహోమము చేయవలెను.

*పితృయజ్ఞం తు నిర్వర్త్య విప్రశ్చంద్రక్షయేఽగ్నిమాన్,*
*పిండాన్వాహార్యకం శ్రాద్ధం కుర్యాద్మాసానుమాసికమ్ 122*

*పితౄణాం మాసికం శ్రాద్ధ మన్వాహార్యం విదుర్బుధాః,*
*తచ్చామిషేణ కర్తవ్యం ప్రశస్తేన ప్రయత్నతః 123*

అమావాస్యనాడు పితృయజ్ఞాన్ని (శ్రాద్ధము) చేసి తరువాత ప్రతినెల పిండాన్వాహార్యకమను శ్రాద్ధము చేయవలెను. పితృదేవతలకు ప్రతినెల పెట్టు శ్రాద్ధమును అన్వాహార్యక మంటారు. ఆ శ్రాద్ధమును ప్రశస్తమైన మాంసముతో చేయవలెను.

*తత్ర యే భోజనీయాస్స్యు ర్యే చ వర్జ్యా ద్విజోత్తమాః*
*యావంతశ్చైవ యైశ్చాన్నైస్తాన్ ప్రవక్ష్యామ్యశేషతః 124*

*ద్వౌ దైవే పితృకార్యే త్రీ నేకైక ముభయత్ర వా,*
*భోజయేత్సుసమృద్ధోపి న ప్రసజ్జేత విస్తరే 125*

*సత్క్రియాం దేశకాలౌ చ శౌచం బ్రాహ్మణ సంపదః,*
*పంచైతాన్విస్తరో హంతి తస్మాన్నే హేత విస్తరమ్. 126*

*ప్రథితా ప్రేతకృత్యైషా పిత్ర్యం నామ విధుక్షయే,*
*తస్మిన్ యుక్తస్యైతి నిత్యం ప్రేతకృత్యైవ లౌకికీ 127*

అన్వాహార్య శ్రాద్ధంలో భోజనమునకు నిమంత్రణ చేయదగిన వ్యక్తులు, అందు పెట్టే ఆహార వస్తువులివి .

శ్రాద్ధంలో విశ్వే దేవతాస్థానంలో ఇద్దరు బ్రాహ్మణులను, పితృదేవతా స్థానమున ముగ్గురు బ్రాహ్మణులను, లేక విశ్వే దేవతాస్థానమున ఒక బ్రాహ్మణుని, పితృదేవతాస్థానమున ఒక బ్రాహ్మణుని నిమంత్రింపవలెను. ఎంత ధనవంతుడైనను పై సంఖ్యకు మించిన బ్రాహ్మణులను శ్రాద్ధానికై నిమింత్రించకూడదు. శ్రాద్ధంలో అధిక సంఖ్యలో బ్రాహ్మణులను పిలిస్తే యజమాని చేసిన బ్రాహ్మణ సత్కారము దేశకాలాలు, కర్త, భోక్త, పరిచారకులు చేయు ఆచారము గుణవంతులగు బ్రాహ్మణులను సంపాదించుట అనునైదిటిని చెడగొట్టుతుంది. కావున బ్రాహ్మణులను పై సంఖ్యకంటె ఎక్కువమందిని భోక్తలుగా పిలువకూడదు. అమావాస్యయందు చేయబడు ఈ పితృకార్యము చాలా ప్రశస్తమైంది. ప్రతినెలలో చేయు ఈ పితృకార్యము సుపుత్రులు, ధనధాన్యము, మొదలగు శుభములను కలిగిస్తుంది.

*శ్రోత్రియాయైవ దేయాని హవ్యకవ్యాని దాతృభిః*
*అర్హత్తమాయ విప్రాయ తస్మై దత్తం మహాఫలమ్. 128*

*ఏకైక మపి విద్వాంసం దైవే పిత్ర్యేచ భోజయేత్,*
*పుష్కలం ఫలమాప్నోతి నామంత్రజ్ఞాన్ బహూనపి 129*

*దూరాదేవ పరీక్షేత బ్రాహ్మణం వేదపారగమ్,*
*తీర్థం తద్ధవ్యకవ్యానాం ప్రదానే సోఽతిథిః స్మృతః 130*

*సహస్రం హి సహస్రాణామనృచాం యత్ర భుంజతే,*
*ఏకస్తాన్ మంత్రవిత్ప్రీతః సర్వానర్హతి ధర్మతః 131*

*జ్ఞానోత్కృష్టాయ దేయాని కవ్యాని చ హవీంషి చ,*
*నహి హస్తావసృగ్దిగ్ధౌ రుధిరేణైవ శుద్ధ్యతః 132*

*యావతో గ్రసతే గ్రాసాన్ హవ్యకవ్యేష్వమంత్రవిత్,*
*తావతో గ్రసతేప్రేత్య దీపశూలర్ష్ట్య యోగుడాన్. 133*

దేవతా ప్రీతికై ఇచ్చు హవ్యమును, పితృప్రీతికై ఇచ్చు కవ్యమును శ్రోత్రియుడు, మంచి యోగ్యత కలిగిన బ్రాహ్మణునకు మాత్రమియ్యవలెను. దైవ, పితృకార్యములందు

# తృతీయాధ్యాయం

వేద వేదాంగతత్వమెరిగిన బ్రాహ్మణుని ఒక్కనినైనా పిలుచుకొని హవ్య, కవ్యముల నొసగవలెను. వేదము ఏమాత్రము చదువుకొనని బ్రాహ్మణులనెందరిని భోక్తలుగా పిలిచినను ఫలితముండదు. వేదాధ్యయనము చేసిన బ్రాహ్మణుని ముందుగనే పరీక్షించి అతనికే హవ్యకవ్యములనిచ్చుట శ్రేష్ఠమైంది. వేద వేత్తయగు ఒక బ్రాహ్మణుడు మాత్రం హవ్యకవ్యాలను పరిగ్రహిస్తే వేదహీనులగు పదిలక్షలమంది బ్రాహ్మణులకు భోజనము పెట్టినంత ఫలితాన్ని ఈయగలదు. జ్ఞానోత్కృష్టుడైన వానికే హవ్య కవ్యా లిచ్చుట శ్రేష్ఠము. నెత్తుటిచేత తడిసిన చేతులను నెత్తుటిచే కడుగు కొనలేం కదా. అట్లే శ్రాద్ధకార్యమున జ్ఞానోత్కృష్టుని ఆహ్వానించినచో తన వంశము పవిత్రమగును. వేద మంత్రములు నేర్వని భోక్త శ్రాద్ధంలో ఎన్ని ముద్దలు తినునో శ్రాద్ధకర్త దేహాంతమున నరకములో శూలర్ష్టిలను మండుచున్న అన్ని ఇనుపగుండ్లను తినును.

*జ్ఞాననిష్ఠా ద్విజాః కేచిత్తపోనిష్ఠా స్తథాఽపరే,*
*తపస్స్వాధ్యాయనిష్ఠాశ్చ కర్మనిష్ఠాస్తథాఽపరే 134*

*జ్ఞాననిష్ఠేషు కవ్యాని ప్రతిష్ఠాప్యాని యత్నతః,*
*హవ్యాని తు యథాన్యాయం సర్వేష్వేవ చతుర్ష్వపి 135*

*అశ్రోత్రియః పితా యస్య పుత్రః స్యాద్వేదపారగః,*
*అశ్రోత్రియో వాపుత్రస్స్యా త్పితా స్యాద్వేదపారగః 136*

*జ్యాయాంసమనయోర్విద్యాద్యస్య స్యాచ్ఛ్రోత్రియః పితా,*
*మంత్రసంపూజనార్థం తు సత్కారమితరో ఽర్హతి. 137*

కొందరు బ్రాహ్మణులు ఆత్మజ్ఞానమందు నిష్ఠ కలిగి ఉంటారు. మరికొందరు తపస్సే తమ పరమావధి అని అనుకొంటారు. ఇంకను కొందరు తపస్సు, వేదాధ్యయనం రెండింటియందు నిష్ఠ కలిగియుంటారు. కొందరికి యజ్ఞయాగాది కర్మలయందు నిష్ఠ గలిగియుంటుంది. వీరిలో జ్ఞాననిష్ఠులైన బ్రాహ్మణులను శ్రాద్ధాది పితృకర్మలయందు తప్పక నియమించవలెను. దైవ కర్మలయందు యథాన్యాయంగా ఎవరినైనను నియమింపవచ్చును. కొన్ని సమయాలందు పుత్రుడు వేదవేదార్థవేత్తయై ఉండగా అతని తండ్రి వేదజ్ఞాన శూన్యుడు కావచ్చును. అట్లే తండ్రి చక్కని శ్రోత్రియుడై ప్రసిద్ధినొందిన అతని పుత్రుడు వేదములు చదువనివాడూ కావచ్చును. వీరిలో శ్రోత్రియుడైన తండ్రి గొప్పవాడు. వేదములను గౌరవించు సందర్భమున శ్రోత్రియుడైన పుత్రుడే శ్రేష్ఠుడిగా పరిగణించబడుతున్నాడు.

*న శ్రాద్ధే భోజయేన్మిత్రం ధనైః కార్యో ఽస్య సంగ్రహః*
*నారిం న మిత్రం యం విద్యాత్తం శ్రాద్ధే భోజయేద్ద్విజమ్ 138*

*యస్య మిత్రప్రధానాని శ్రాద్ధాని చ హవీంషి చ,*
*తస్య ప్రేత్య ఫలం నాస్తి శ్రాద్ధేషు చ హవిష్షు చ. 139*

*యస్సంగతాని కురుతే మోహాచ్ఛ్రాద్ధేన మానవః,*
*న స్వర్గాచ్చ్యవతే లోకాచ్ఛ్రాద్ధమిత్రో ద్విజాధమః 140*

*యథేరిణే బీజముప్త్వా న వప్తా లభతే ఫలమ్,*
*తథా Z నృచే హవిర్దత్వా న దాతా లభతే ఫలమ్ 142*

*దాతౄన్ ప్రతిగ్రహీతౄంశ్చ కురుతే ఫల భాగినః*
*విదుషే దక్షిణాం దత్వా విధివత్ప్రేత్య చేహ చ 143*

*కామం శ్రాద్ధే Z ర్చయేన్మిత్రం నాభిరూపమపి త్వరిమ్,*
*ద్విషతా హి హవిర్భుక్తం భవతి ప్రేత్య నిష్ఫలమ్ 144*

శ్రాద్ధంలో మిత్రుని భోక్తగా పిలువకూడదు. భోక్త శత్రువు, మిత్రుడు కాక జ్ఞానవంతుడు మాత్రం కావలెను. దేవతా కార్యాలందు, పితృకార్యములందు స్నేహితులను భోక్తలుగా పిలుచుకొంటే కర్త ఆయా కార్యములు చేసినందువలన కలుగు ఫలితాన్ని పొందజాలడు. శ్రాద్ధంలో మిత్రులను భోక్తలుగా పిలుచుకున్నవాడు తాను చేసిన శ్రాద్ధ ఫలాన్ని పొందలేక స్వర్గభ్రష్టుడగుచున్నాడు. మిత్రుని భోక్తగా పిలుచుకొని అతనికిచ్చిన దక్షిణను పైశాచదక్షిణ అని అంటారు. ఆ శ్రాద్ధం మిత్రుని సంతృప్తి పరచుటకు చేసినందువలన గుడ్డెద్దు ఆయా ప్రాంతములందె తిరుగాడుచున్నందువల్ల వ్యర్థమైనట్లు వ్యర్థమగును. చవిటి భూమిలో విత్తనం చల్లితే ఎట్లు వ్యర్థమౌతుందో అట్లే శ్రాద్ధంలో వేదాధ్యయనం చేయని వానిని భోక్తగా పెట్టుకున్నందు వలన శ్రాద్ధం వ్యర్థమౌతుంది. శ్రాద్ధంలో వేదాధ్యయనం చేసినవానికి విధి పూర్వకంగా దక్షిణ ఇచ్చినందువలన దాత, దానము, స్వీకరించిన భోక్త ఇద్దరు ఫలితాన్ని పొందుతున్నారు. గుణవంతులు ఎచ్చటను దొరకని సమయంలో మంచి మిత్రుని శ్రాద్ధమున భోక్తగా నియమింపవచ్చును. కాని ఎట్టి పరిస్థితులలోనూ ఎంత సుగుణవంతుడైనను శత్రువును భోక్తగా నియమింపరాదు.

*యత్నేన భోజయేచ్ఛ్రాద్ధే బహ్వృచం వేదపారగమ్,*
*శాఖాంతగమథాధ్వర్యుం చంధోగం తు సమాప్తిగమ్ 145*

*ఏషామన్యతమో యస్య భుంజీత శ్రాద్ధమర్చితః,*
*పితౄణాం తస్య తృప్తిః స్యాచ్ఛాశ్వతీ సాప్తపౌరుషీ 146*

శ్రాద్ధమున ఋగ్వేదమును చక్కగా అధ్యయనము చేసిన వానిని కాని పరిపూర్ణముగా యజుర్వేదమునధ్యయమును చేసిన వానిని గాని సంపూర్ణముగా సామవేదమునధ్యయనము చేసినవానిని గాని భోక్తగా నియమించాలి. వీరిలో ఏ ఒక్కరికైనను శ్రాద్ధంలో భోజనం పెట్టితే అది శ్రాద్ధకర్తయొక్క ఏడు తరముల వారిని సంతృప్తి పరుస్తుంది.

*ఏష వై ప్రథమః కల్పః ప్రదానే హవ్యకవ్యయోః*
*అనుకల్పస్త్వయం జ్ఞేయః సదా సద్భిరనుష్ఠితః. 147*

*మాతామహం మాతులం చ స్వస్త్రీయం శ్వశురం గురుమ్,*
*దౌహిత్రం విట్పతిం బంధుమృత్విగ్యాజ్యౌ చ భోజయేత్ 148*

*న బ్రాహ్మణం పరీక్షేత దైవే కర్మణి ధర్మవిత్,*
*పిత్ర్యే కర్మణి తు ప్రాప్తే పరీక్షేత ప్రయత్నతః 149*

యే స్తేనపతితక్లీబా యే చ నాస్తికవృత్తయః,
జటిలం చానధీయానం దుర్బలం కితవం తథా,
తాన్ హవ్యకవ్యయోర్విప్రానసర్హాన్మను రబ్రవీత్ 150
జటిలం చానధీయానం దుర్బలం కితవం తథా,
యాజయంతి చ యే పూగాం స్తాంశ్చ శ్రాద్ధే న భోజయేత్ 151
చికిత్సకాన్ దేవలకాన్ మాంసవిక్రయిణ స్తథా,
విపణేన చ జీవంతో వర్జ్యాః స్యుర్హవ్యకవ్యయోః 152
ప్రేష్యో గ్రామస్య రాజ్ఞశ్చ కునఖీ శ్యావదంతకః,
ప్రతిరోద్ధా గురోశ్చైవ త్యక్తాగ్నిర్వార్ధుషి స్తథా 153
యక్ష్మీ చ పశుపాలశ్చ పరివేత్తా నిరాకృతిః
బ్రహ్మద్విట్ పరివిత్తిశ్చ గణాభ్యంతర ఏవ చ 154
కుశీలవోఽవకీర్ణీ చ వృషలీపతి రేవ చ,
పౌనర్భవశ్చ కాణశ్చ యస్య చోపపతిర్గృహే. 155
భృతకాధ్యాపకో యశ్చ భృతకాధ్యాపితస్తథా,
శూద్రశిష్యో గురుశ్చైవ వాగ్దుష్టః కుండగోళకౌ. 156
అకారణపరిత్యక్తా మాతాపిత్రోర్గురోస్తథా,
బ్రాహ్మైర్యౌనైశ్చ సంబంధై స్సంయోగం పతితైర్గతః.157

దేవతలకు పితృదేవతలకు సంబంధించిన హవ్యకవ్యములలో పై పద్ధతి తొలుత అనుసరింప దగినది. తరువాత చేయదగిన కార్యమిది :-

హవ్యకవ్యములందు జ్ఞానవంతులు ప్రత్యేకంగా దొరకనప్పుడు తల్లియొక్క తండ్రిని, మేనమామను, మేనల్లుని, పిల్లనిచ్చిన మామను, గురువును, తన కూతురు యొక్క పుత్రుని, అల్లుని, బంధువును, ఋత్విక్కును, శిష్యుని భోక్తగా పిలుచుకొనవచ్చును. ధర్మశాస్త్రాలనెరిగినవాడు దైవకార్యములందు బ్రాహ్మణుని కులగోత్రాదులను పరీక్షింపకూడదు. కాని పితృకార్యమందు మాత్రము భోక్తయగు బ్రాహ్మణుని కుల గోత్రాదులను తప్పక పరీక్షించవలెను. దొంగలు, పతితులు, నపుంసకులు, నాస్తికులు, వీరందరు హవ్యకవ్యములకు తగనివారని మనువు పేర్కొన్నాడు. అట్లే జడలు గలవానిని లేక బ్రహ్మచారిని వేదాధ్యయనం చేయనివానిని, దుర్బలుని, మోసగాడిని, అనేకమందిచే యాగము చేయించువానిని, హవ్య కవ్యాలకు పిలువరాదు. ఇంకను వైద్యులను జీతం తీసికొని గుడిపూజ చేయువారిని, మాంసము విక్రయించే బ్రాహ్మణులను, వర్తకము చేసే బ్రాహ్మణులను, జీతం తీసుకొని ఊరి పనులు, రాజుయొక్క పనిచేసేవారిని, పుచ్చుగోళ్ళుకలవానిని, నల్లని పండ్లున్న వానిని, గురువుయొక్క ఆజ్ఞకు విరుద్ధముగా నడుచుకొనే వానిని, అగ్ని హోత్రాలను వదలిపెట్టినవానిని, వడ్డీ తీసికొని బ్రతుకుచున్న బ్రాహ్మణుని, క్షయరోగము కలవానిని, బ్రతుకు దెరువునకై పశువులు మేపువానిని, అన్నకంటె

ముందు వివాహము చేసుకున్నవానిని, వివాహానంతరము పంచమహాయజ్ఞాలు చేయనివానిని, బ్రాహ్మణాదులను ద్వేషించువాని, తమ్మునకు వివాహమైనను, వివాహము చేసికొనని వానిని, ఇతరుల ధనముచే బ్రదుకువానిని, నాట్యము చేయువానిని , బ్రహ్మచర్యము చెడగొట్టుకొను వానిని, శూద్రస్త్రీని వివాహము చేసుకొన్న బ్రాహ్మణుని, రెండవ వివాహం వల్ల జన్మించిన వానిని, మెల్లకన్ను కలవానిని, ఉపపతిని తన యింటిలో ఉంచుకొన్న వానిని, జీతము తీసికొని వేదము చెప్పువానిని, జీతమునిచ్చి చదువుకున్న వానిని, శూద్రుని శిష్యుని, శూద్రుని గురువును, కఠినంగా మాట్లాడేవానిని, కుండ, గోళకులను, తల్లిని, తండ్రిని, గురువును, కారణము లేక వదలిపెట్టినవానిని పతితులతో సంబంధం పెట్టుకున్న వానిని, హవ్యకవ్యాలకు పిలువరాదు.

*అగారదాహీ గరదః కుండాశీసోమవిక్రయీ,*
*సముద్రయాయీ వందీ చ తైలికః కూటకారకః.158*

*పిత్రా వివదమా నశ్చ కితవో మద్యపస్తథా,*
*పాపరోగ్యభిశ స్తశ్చ దాంభికో రసవిక్రయీ.159*

*ధనుశ్శరాణాం కర్తా చ యశ్చాగ్రేదిధిషూపతిః,*
*మిత్రధ్రు గ్ద్యూతవృత్తిశ్చ పుత్రాచార్యస్తథైవ చ.160*

*భ్రామరీ గండమాలీ చ శ్విత్ర్యథో పిశున స్తథా,*
*ఉన్మత్తోఽంధశ్చ వర్జ్యాః స్యుర్వేదనిందక ఏవ చ.161*

అట్లే ఇల్లు తగులబెట్టినవానిని, విషము పెట్టినవానిని, కుండ, గోళకుల అన్నము తిన్నవానిని, సోమలతను అమ్మినవానిని, సముద్ర ప్రయాణం చేసినవానిని, స్తోత్రాలు చేయువానిని, నూనె తీయువానిని, కూట సాక్ష్యాలు చెప్పువానిని, తండ్రితో కొట్లాడువానిని, జూదమాడువానిని, కల్లుత్రాగువానిని, చెడు రోగాలు కలవానిని, డాబుగా నుండువానిని,రసవస్తువుల నమ్మువానిని, ధనుర్బాణములు చేయువానిని చనిపోయిన సోదరుని భార్యను కామించువానిని, (దిధిషూపతి) మిత్రద్రోహిని, జూదమే వృత్తిగా కలవానిని, కొడుకు దగ్గర వేదాధ్యయనం చేసినవానిని, అపస్మార రోగము కలవానిని, గండమాల రోగం కలవానిని, బొల్లి అను రోగమున్నవానిని, లోభం కలవానిని పిచ్చి వానిని, గుడ్డి వానిని, వేదములనిందించువానిని హవ్యకవ్యాలకై పిలువకూడదు.

*హ స్తిగోశ్వోష్ట్రదమకో నక్షత్రైర్యశ్చ జీవతి,*
*పక్షిణాం పోషకో యశ్చ యుద్ధాచార్యస్తథైవ చ.162*

*స్రోతసాం భేదకో యశ్చ తేషాం చావరణే రతః,*
*గృహసంవేశకో దూతో వృక్షారోపక ఏవ చ.163*

*శ్వక్రీడీ శ్యేనజీవీ చ కన్యాదూషక ఏవ చ,*
*హింస్రో వృషలవృత్తిశ్చ గణానాం చైవ యాజకః.164*

*ఆచారహీనః క్లీబశ్చ నిత్యం యాచనక స్తథా,*
*కృషిజీవీ శ్లీపదీ చ సద్భిర్నిందిత ఏవ చ.165*

*ఔర(భికో మాహిషికః పరపూర్వాపతిస్తథా,*
*(పేతనిర్యాతకశ్చైవ వర్జనీయాః (ప్రయత్నతః.166*

*ఏతాన్విగర్హి తాచారా నపాఙ్క్తేయాన్ ద్విజాధమాన్,*
*ద్విజాతి(ప్రవరో విద్వానుభయత్ర వివర్జయేత్.167*

అదే విధముగా ఏనుగు ఎద్దు గుఱ్ఱం ఒంటెలను లొంగదీసుకొను వానిని, జోతిష్యం చెప్పి (బతుకువానిని, పక్షులను పెంచేవానిని, ఆయుధ విద్యలనుపదేశించేవానిని, చెఱువుల యొక్క అనకట్టలను తెంపే వానిని, అట్లే ఆ చెఱువులోనికి వచ్చు నీటికి అడ్డుకట్ట వేయువానిని, వాస్తు విద్య వలన (బతుకువానిని, రాజదూతను, వేతనం తీసుకొని వృక్షముల నాటువానిని, కుక్కలను, డేగలను పెంచి ఆడుకొనువానిని, కన్యలను చెడగొట్టు దుర్మార్గుని, హింసించువానిని, శూద్ర వృత్తిచే (బతుకువానిని, వినాయకుడు మొదలగు గణములను పూజించి (బదుకువానిని, ఆచారం లేనివానిని, నపుంసకుని, (ప్రతిదినము యాచనచేసి జీవించువానిని, వ్యవసాయం చేయువానిని, బోదకాలు గలవానిని, సజ్జనులు నిందించువానిని, మేకలు, గేదెలచే (బదుకువానిని, విధవావివాహము చేసుకున్నవానిని, శవములమోయువానిని హవ్యకవ్యములకెప్పుడును పిలువకూడదు. వీరు ఆచార హీనులు, పంక్తిభోజనమునకు కూడా అనర్హులు. (బ్రాహ్మణాధములు, కావున విజ్ఞానవంతుడగు (బ్రాహ్మణుడు పైవారినెప్పుడును దేవకార్యములకు, పితృకార్యములకు పిలువకూడదు.

*(బ్రాహ్మణస్త్వనధీయానస్తృణాగ్నిరివ శామ్యతి,*
*తస్మైహవ్యం న దాతవ్యం నహి భస్మని హూయతే. 168*

వేదాధ్యయనము చేయని (బ్రాహ్మణుడు మండుచున్న గడ్డిపోచలవలె వెంటనే శమించును. అతని కొసగిన హవ్యకవ్యాలు బూడిదలో పోసిన ఆహుతుల వలె నిష్ఫలమగును.

*అపాఙ్క్త్యదానే యో దాతుర్భవత్యూర్ధ్వం ఫలోదయః*
*దైవే హవిషి పిత్ర్యే వా తత్ (ప్రవక్ష్యామ్యశేషతః. 169*

*అవ్రతైర్య ద్ద్విజైర్భుక్తం పరివేత్రాదిభిస్తథా,*
*అపాఙ్క్తేయైర్యదన్యైశ్చతద్వైరక్షాంసి భుంజతే. 170*

పంక్తియోగ్యుడు కానివానికి హవ్యకవ్యాలనిస్తే కలిగే ఫలితమెట్లుందో వివరిస్తాను.

వేద(గహణమునకై చేయవలసిన (బహ్మచర్య (వతాలన్ని అనుష్ఠింపనివారు, పరివేత్తలు, పంక్తి బాహ్యులు మొదలైనవారు తిన్న హవ్యకవ్యాలు రాక్షసులకు చెందుతాయి.

*దారాగ్నిహో(త్రసంయోగం కురుతే యోఽ(గజే స్థితే,*
*పరివేత్తాసవిజ్ఞేయః పరివిత్తి స్తు పూర్వజః 171*

*పరివిత్తిః పరివేత్తా యయా చ పరివిద్యతే,*
*సర్వే తే నరకం యాంతి దాతృయాజకపంచమాః 172*

అన్నకంటె ముందు వివాహం చేసుకున్నవానిని పరివేత్త అని అంటారు. ఆ

అన్నను పరివిత్తి అంటారు. అన్నకంటె ముందు వివాహము చేసుకున్న తమ్ముడు ఆతని అన్న తమ్ముని వివాహం చేసుకున్న స్త్రీ ఆ పిల్లనిచ్చినవాడు, ఆ వివాహం చేయించినవాడు వీరందరు నరకానికి పోతారు.

*భ్రాతుర్మృతస్య భార్యాయాం యోఽనురజ్యేత కామతః*
*ధర్మేణాపి నియుక్తాయాం సజ్ఞేయోదిధిషూపతిః 173*

సోదరుడు చనిపోయిన తరువాత అతని భార్యను కామించువానిని దిధిషూపతి అంటారు.

*పరదారేషు జాయేతే చ ద్వౌ సుతౌకుండగోళకౌ,*
*పత్యౌ జీవతి కుండః స్యాన్మృతే భర్తరి గోళకః 174*

*తౌ తు జాతౌ పరక్షేత్రే ప్రాణినౌ ప్రేత్య చేహ చ,*
*దత్తాని హవ్యకవ్యాని నాశయేతే ప్రదాయినామ్.175*

భర్త బ్రతికియుండగా ఇతరుల వల్ల పుట్టినవాడు కుండుడు. భర్త చనిపోయిన తరువాత ఇంకొక పురుషుని వలన పుట్టినవాడు గోళకుడు. ఇట్లు పరుని వలన పుట్టిన కుండ, గోళకుల కిచ్చిన హవ్య కవ్యాలు సైతం దాతయొక్క పుణ్యాన్ని హరిస్తాయి.

*అపాఙ్క్త్యో యావతః పాఙ్క్త్యాన్ భుంజానా ననుపశ్యతి,*
*తావతాం న ఫలం తత్ర దాతా ప్రాప్నోతి బాలిశః 176.*

*వీక్ష్యాంధో నవతేః కాణ ః షష్టేః శ్విత్రీ శతస్య తు,*
*పాపరోగీ సహస్రస్య దాతు ర్నాశయతే ఫలమ్. 177*

*యావతస్సంస్పృశేదంగైర్బ్రాహ్మణాన్ శూద్రయాజకః*
*తావతాం న భవేద్దాతుః ఫలం దానస్య పౌర్తికమ్. 178*

పంక్తి బాహ్యుడు భోజనం చేస్తూ తన పంక్తిలో నున్న వారినెందరిని చూస్తాడో దాత వారికి భోజనం పెట్టిన ఫలితాన్ని కోల్పోతాడు. గుడ్డివానిని పంక్తిలో కూర్చొనబెట్టి భోజనం పెట్టినందువల్ల తొంబదిమందికి భోజనం పెట్టిన ఫలాన్ని కోల్పోతాడు. ఒంటి కంటి వానికి పంక్తిలో భోజనం పెట్టిన అరవైమందికి భోజనం పెట్టిన ఫలితాన్ని, తెల్ల కుష్ఠు కలవానికి పంక్తిలో భోజనం పెట్టితే నూరుగురికి భోజనం పెట్టిన ఫలితాన్ని, క్షయవ్యాధి పీడితునికి పంక్తిలో భోజనం పెట్టితే వేయిమందికి భోజనం పెట్టిన పుణ్యాన్ని పోగొట్టుకుంటాడు. కావున వీరికి ప్రత్యేకంగా భోజనం పెట్టవలెను. శూద్రులకు పురోహితుడైన వాడు తన పంక్తి యందు కూర్చున్న బ్రాహ్మణులనెందరిని తగులుతాడో కర్త అంతమంది బ్రాహ్మణులకు భోజనం పెట్టిన పలితాన్ని కోల్పోతాడు.

*వేదవిచ్చాపి విప్రోఽస్య లోభాత్కృత్వా ప్రతిగ్రహమ్.*
*వినాశం వ్రజతి క్షిప్రమామయపాత్రమివాంభసి. 179.*

*సోమవిక్రయిణే విష్ఠా భిషజే పూయశోణితమ్,*
*నష్టం దేవలకే దత్తమప్రతిష్ఠం తు వార్ధుషౌ. 180*

*యత్తు వాణిజకే దత్తం నేహ నాముత్ర తద్భవేత్,*
*భస్మనీవ హుతం హవ్యం తథా పౌనర్భవే ద్విజే 181*

వేదవేత్తయైన బ్రాహ్మణుడు సైతం అత్యాశవల్ల దానం స్వీకరిస్తే పచ్చికుండ నీటిలో పడి నశించినట్లు వెంటనే నశిస్తాడు. సోమలతను అమ్మినవానికి దానంచేస్తే దాత పంది ఔతాడు. వైద్యునకు దానం చేస్తే దాత చీముురక్తము తిను పురుగౌతాడు. పూజారికిచ్చిన దానం వల్ల ఫలితముండదు. అట్లే వడ్డీనిచ్చువానికి దానం చేస్తే అప్రతిష్ఠ కలుగుతుంది. వర్తకం చేయువానికి రెండవమారు పెండ్లి చేసుకున్న స్త్రీ యొక్క భర్తకు శ్రాద్ధంలో పెట్టిన భోజనం వల్ల ఇహపరలోకాలలో సుఖం లభించదు. పైగా అది బూడిదలో పోసిన ఆహుతి వలె నిష్ఫలమౌతుంది.

*ఇతరేషుత్వపాఙ్క్త్యేషు యథోద్దిష్టేష్వసాధుషు,*
*మేదో సృఙ్మాంసమజ్జాస్థి వదంత్యన్నం మనీషిణః 182*

దుష్టులు పంక్తి బాహ్యులైన ఇతరులకు పెట్టిన యన్నం వల్ల దాతకు మేధస్సు, రక్తమాంసములు, కొవ్వు, ఎముకలు పెట్టిన ఫలితం చేకూరుతుంది.

*అపాఙ్క్త్యోపహతా పఙ్క్తిః పావ్యతే యైర్ద్విజోత్తమైః*
*తాన్నిబోధత కార్త్స్న్యేన ద్విజాగ్ర్యాన్ పఙ్క్తిపావనాన్ 183.*

పంక్తి బాహ్యులవల్ల అపరిశుద్ధమైన బ్రాహ్మణ పంక్తిని పవిత్రం చేసే పంక్తి పావనులైన బ్రాహ్మణోత్తముల గూర్చి వివరిస్తాను.

*అగ్ర్యాస్సర్వేషువేదేషు సర్వప్రవచనేషు చ,*
*శ్రోత్రియాన్వయజాశ్చైవ విజ్ఞేయాః పఙ్క్తిపావనాః 184*

సమస్త వేదాలను, వేదాంగాలను చక్కగా అధ్యయనం చేసి అధ్యాపనం చేయుశ్రోత్రియ వంశములలో పుట్టినవారు పంక్తి పావనులౌతారు.

*త్రిణాచికేతః పంచాగ్ని స్త్రీసుపర్ణష్షడంగవిత్,*
*బ్రహ్మదేయాత్మసంతానో జ్యేష్ఠసామగ ఏవచ 185*
*వేదార్థవిత్ప్రవక్తా చబ్రహ్మచారీ సహస్రదః*
*శతాయుశ్చైవ విజ్ఞేయా బ్రాహ్మణాః పఙ్క్తిపావనాః 186*

అధ్వర్యు వేదభాగమైన త్రిణాచికేతవ్రతం తెలిసిన వాడు పంచమహా యజ్ఞాలొనర్చువాడు, ఋగ్వేద భాగమైన త్రిసుపర్ణము నెరిగినవాడు, శిక్షాది షడాంగాలనెరిగినవాడు, బ్రాహ్మ వివాహం చేసికొన్న స్త్రీ యొక్క పుత్రుడు, జ్యేష్ఠసామం గానంచేసే వాడు అనే ఆరుగురు పంక్తి పావనులు. అట్లే వేదార్థవేత్త, వేదార్థ ప్రవచనం చేసేవాడు, బ్రాహ్మచర్య వ్రతాన్ని అనుష్ఠించేవాడు, వేయి గోవులను దానం చేసినవాడు, శతాయుష్కుడైన శ్రోత్రియుడు వీరంతా పంక్తి పావనులు.

శ్రాద్ధ బ్రాహ్మణులు

*పూర్వేద్యు రపరేద్యుర్వా శ్రాద్ధకర్మణ్యుపస్థితే,*
*నిమంత్రయేత త్ర్యవరాన్ సమ్యగ్విప్రాన్ యథోదితాన్.187*

శ్రాద్ధానికి ఒకటి లేక రెండు దినాలముందు ముగ్గురికి తగ్గకుండా సద్బ్రాహ్మణులను నిమంత్రణ చేయవలెను.

*నిమంత్రితో ద్విజః పిత్ర్యే నియతాత్మా భవేత్సదా,*
*న చ ఛందాంస్యధీయీత యస్య శ్రాద్ధం చ తద్భవేత్.188*

*నిమంత్రితాన్ హి పితర ఉపతిష్ఠంతి తాన్ ద్విజాన్.*
*వాయువచ్చానుగచ్ఛంతి తథాసీనానుపాసతే.189*

*కేతితస్తు యథాన్యాయం హవ్యకవ్యే ద్విజోత్తమః,*
*కథంచిదవ్యతిక్రామన్ పాపసూ్కరతాం వ్రజేత్.190*

*ఆమంత్రితస్తుయః శ్రాద్ధే వృషల్యా సహ మోదతే,*
*దాతుర్యద్దుష్కృతం కించిత్తత్సర్వం ప్రతిపద్యతే.191*

*అక్రోధనా శ్శౌచపరాస్సతతం బ్రహ్మచారిణః,*
*న్యస్తశస్త్రా మహాభాగాః పితరః పూర్వదేవతాః.192*

శ్రాద్ధమందు నియుక్తులైన బ్రాహ్మణులు, శ్రాద్ధకర్త శ్రాద్ధదినమున నిత్యం చేస్తున్న గాయత్రీ మంత్రం, తప్ప ఇతర వేద మంత్రాలను చదువరాదు. శాద్ధ దినాన నిమంత్రితులైన బ్రాహ్మణులను పితృదేవతలు ఎల్లప్పుడు అంటిపెట్టుకొని యుంటారు. అందువల్ల నిమంత్రితులాదినమున పరిశుద్ధులై ఉండవలెను. శ్రాద్ధం లో భోక్తగా ఉండుటకు ఒప్పుకొని ఏదో కారణం వల్ల భోక్తగా రాకపోయినచో మహాపాపాన్ని పొందును. శ్రాద్ధమున నిమంత్రితుడైన బ్రాహ్మణుడు ఆ దినమున స్త్రీ సంగమము చేసినచో శ్రాద్ధకర్త చేసిన పాపమునంతయు పొందును. పితృదేవతలు, పరమశాంతులు, ఆచారవంతులు ఎల్లప్పుడు వేదాధ్యయనం చేసేవారు, పరమశ్రేష్ఠులు కూడ. కావున శ్రాద్ధకర్త, శ్రాద్ధభోక్తలాదినమున పరమశాంతులై సదాచారాన్ని పాటిస్తూ ఉండాలి.

*యస్మా దుత్పత్తిరేతేషాం సర్వేషామప్యశేషతః,*
*యే చ యైరుపచర్యాస్స్యు ర్నియమైస్తాన్ని బోధత.193*

ఈ పితృ దేవతలు ఎవరి వల్ల పుట్టిరి? వారిని ఏ యే నియమాలతో సేవించాలి మొదలైన విషయములను తెలుపుమని ఋషులు భృగు మహర్షినడిగినారు.

*మనోర్హై రణ్యగర్భస్య యే మరీచ్యాదయః సుతాః,*
*తేషామృషీణాం సర్వేషాం పుత్రాః పితృగణాః స్మృతాః.194*

*విరాట్సుతా స్సోమసదః సాధ్యానాం పితరః స్మృతాః,*
*అగ్నిష్వాత్తాశ్చ దేవానాం మారీచా లోకవిశ్రుతాః.195*

*దైత్యదానవయక్షాణాం గంధర్వోరగరక్షసామ్,*
*సుపర్ణ కిన్నరాణాం చ స్మృతా బర్హి షదోఽత్రిజాః.196*

*సోమపా నామ విప్రాణాం క్షత్రాయాణాం హవిర్భుజః,*
*వైశ్యానా మాజ్యపా నామ శూద్రాణాం తు సుకాలినః.197*

హిరణ్య గర్భునికి మనువు పుత్రుడు. అతని పుత్రులు మరిచి మొదలైన మహర్షులు. వారి సంతానమే పితృగణం. విరాట్పుత్రులైన సోమసదులనేవారు సాధ్యులనే వారియొక్క పితృ గణం. అదే విధంగా అగ్ని ష్వాత్తులు అనే మరీచి మహర్షియొక్క పుత్రులు దేవతలకు పితృగణంగా ప్రసిద్ధి చెందినారు. అత్రి మహర్షి పుత్రులైన బర్హిషదులనేవారు దైత్య దానవ యక్షులకు గంధర్వులకు, సర్పములకు, రాక్షసులకు గరుడ, కిన్నరులకు పితరులు. బ్రాహ్మణులకు సోమపులనేవారు క్షత్రియులకు హవిర్భుజులు, వైశ్యులకు ఆజ్యపులు, శూద్రులకు సుకాలినులనే వారు పితరులు.

*సోమపాస్తు కవేః పుత్రా హవిష్మంతోఽంగిరస్సుతాః,*
*పుల స్త్యస్యాజ్యపాః పుత్రా వసిష్ఠస్య సుకాలినః198*

*అగ్ని దగ్ధానగ్నిదగ్ధాన్ కావ్యాన్ బర్హి షదస్తథా,*
*అగ్నిష్వాత్తాంశ్చ సౌమ్యాంశ్చ విప్రాణా మేవ నిర్దిశేత్.199*

*య ఏతే తు గణా ముఖ్యాః పితౄణాం పరికీర్తితాః,*
*తేషామపీహ విజ్ఞేయం పుత్రపౌత్ర మనంతకమ్.200*

*ఋషిభ్యః పితరో జాతాః పితృభ్యో దేవమానవాః,*
*దేవేభ్యస్తు జగత్సర్వం చరం స్థాణ్వానుపూర్వశః.201*

వీరిలో సోమపులనేవారు శుక్రుని యొక్క పుత్రులు. హవిష్మంతులు అంగిరస మహర్షి యొక్క పుత్రులు. ఆజ్యపులు పులస్త్య మహర్షి య్యొ పుత్రులు. సుకాలినులనే పితరులు వసిష్ఠ మహర్షి యొక్క పుత్రులు. ఇంకా అగ్ని దగ్ధులు అనగ్ని దగ్ధులు, కావ్యులు (శుక్రపుత్రులు) బర్హిషదులు, అగ్నిష్వాత్తులు సౌమ్యులు వీరందరుకూడ బ్రాహ్మణుల యొక్క పితృ దేవతల సంతానమే. ప్రస్తుతమున్న పితృగణమంతా పైపితృదేవతల యొక్క సంతానమే. ఋషులవలన పితృదేవతలు పుట్టిరి. వారికి దేవ దానవులుద్భవించిరి. వారి వలన ఈ చరాచర సృష్టియంతా ఆవిర్భవించింది.

పార్వణ శ్రాద్ధనియమము :-

*రాజతై ర్భాజనై రేషా మథోవా రాజతాన్వితైః,*
*వార్యపి శ్రద్ధయా దత్తమక్షయాయోపకల్పతే.202*

*దేవకార్యాద్ద్విజాతీనాం పితృకార్యం విశిష్యతే,*
*దైవం హి పితృకార్యస్య పూర్వమాప్యాయనం స్మృతమ్.203*

*తేషా మారక్షభూతం తు పూర్వం దైవం నియోజయేత్,*
*రక్షాంసి హి విలుంపంతి శ్రాద్ధమారక్షవర్జితమ్.204*

*దైవాద్యంతం తదీహేత పిత్రాద్యంతం నతద్భవేత్,*
*పిత్రాద్యంతం త్వీహమానః క్షిప్రం నశ్యతి సాన్వయః.205*

శ్రాద్ధంలో భోక్తలు భోజనం చేయుటకు వెండి పళ్ళేరములు లేక వెండి పూసిన పాత్రలనుపయోగించాలి లేక శ్రద్ధతో ఇవ్వబడిన నీరైనను పితృదేవతలకు అక్షయ తృప్తినిస్తుంది. బ్రాహ్మణులకు దేవకార్యం కంటె పితృకార్యం చాలా ముఖ్యమైంది దేవకార్యం పితృకార్యం కంటే ముందున్నా పితృకార్యానికి అది అంగమని పేర్కొనబడింది. పితృ దేవతలను రక్షించుటకై తొలుత విశ్వే దేవరూప బ్రాహ్మణుని నియోగింపవలెను. రక్షణ రూపమైన విశ్వే దేవత లేనిచో పితృకార్యాన్ని రాక్షసులు నాశనం చేస్తారు. శ్రాద్ధమున పితరులకు ముందు విశ్వేదేవ స్వరూపుడైన బ్రాహ్మణుని చివర శ్రీమహావిష్ణు స్వరూపుడైన బ్రాహ్మణుని ఉంచవలెనే కాని దేవతాస్వరూపుడగు బ్రాహ్మణుని మధ్యన ఉంచి ఇటునటు పితృస్వరూపులైన బ్రాహ్మణులనుంచకూడదు. ఆ విధంగా శ్రాద్ధం చేస్తే శ్రాద్ధకర్త తనకుటుంబంతో సహ నశిస్తాడు.

*శుచిం దేశం వివిక్తం చ గోమయేనోపలేపయేత్,*
*దక్షిణాప్రవణం చైవ ప్రయత్నేనోపపాదయేత్.206*

శ్రాద్ధ బ్రాహ్మణుల పాద ప్రక్షాళనకై పరిశుద్ధమైన ప్రదేశాన్ని ఎన్నుకొని ఆవు పెండతో ఆ స్థలము నలుకవలెను. పాదప్రక్షాళనకు ఉపయోగించే ప్రదేశం దక్షిణ దిక్కుకు కొద్దిగా వంపుతో నుండాలి.

*అవకాశేషు చోక్షేషు నదీతీరేషు చైవ హి,*
*వివిక్తేషు చ తుష్యంతి దత్తేన పితరస్సదా.207*

పితృతర్పణాన్ని వస్తుతః పరిశుద్ధమైన అరణ్యాలలో గాని, నదీ తీరాలలోగాని, నిర్జన ప్రదేశాలలో గాని చేస్తే పితృ దేవతలెల్లప్పుడు సంతోషము పొందుతారు. 207

*ఆసనేషూపక్లృప్తేషు బర్హిష్మత్సు పృథక్పృథక్,*
*ఉపస్పృష్టోదకాన్ సమ్యగ్విప్రాంస్తానుపవేశయేత్.208*

*ఉపవేశ్య తు తాన్ విప్రానాసనేష్వజుగుప్సితాన్,*
*గంధమాల్యైస్సురభిభిరర్చయేద్దైవపూర్వకమ్.209*

*తేషాముదకమానీయ సపవిత్రాంస్తిలానపి,*
*అగ్నౌకుర్యాదనుజ్ఞాతో బ్రాహ్మణో బ్రాహ్మణైస్సహ.210*

శ్రాద్ధంలోనిమంత్రితులైన బ్రాహ్మణులు స్నానం చేసి పరిశుద్ధులై ఉండాలి. స్నానం చేసిన ఆ బ్రాహ్మణులను దర్భలు పరచి (ఉత్తరాగ్రాలుగా) ప్రత్యేకంగా కూర్చుండబెట్టవలెను. ఆ విధంగా వారిని కూర్చుండబెట్టి విశ్వేదేవతాస్వరూపుడైన బ్రాహ్మణునితో ప్రారంభించి గంధం, మాలలు, మొదలైన వాటితో వారిని పూజింపవలెను. తరువాత వారికి అర్ఘ్యోదకంతో పవిత్రమైన నువ్వులను సమర్పించి ఆ బ్రాహ్మణులయొక్క అనుజ్ఞను పొంది శ్రాద్ధకర్త అగ్ని యందు ఈ దేవతలకై హోమము చేయవలెను.

*అగ్నేస్సోమయమాభ్యాం స కృత్వాప్యాయనమాదితః,*
*హవిర్దానేన విధివత్పశ్చాత్సంతర్పయేత్పితౄన్.211*

*అగ్న్యభావే తు విప్రస్య పాణావేవోపపాదయేత్,*
*యో హ్యగ్నిస్స ద్విజో విప్రైర్మంత్రదర్శిభిరుచ్యతే. 212*

*అక్రోధనాన్ సుప్రసాదాన్ వదంత్యేతాన్ పురాతనాన్,*
*లోకస్యాప్యాయనే యుక్తాన్ శ్రాద్ధదేవాన్ ద్విజోత్తమాన్.213*

తొలుత అగ్నికి, సోమునకు, యమునకు శాస్త్ర ప్రకారంగా హవిస్సులు సమర్పించి తరువాత పితృదేవతలకు హవిస్సులనీయవలెను. బ్రహ్మచారి, స్నాతకుడు, భార్యారహితుడు ఈ ముగ్గురికి గార్హపత్యాగ్ని యుండదు. కావున వారు బ్రాహ్మణుని కుడిచేతిలోనే పై మూడాహుతులనివ్వవలెను. బ్రాహ్మణుడు అగ్ని హోత్ర స్వరూపుడని మంత్రతత్వవేత్తలగు బ్రాహ్మణులే పేర్కొనుచున్నారు. అట్లే శ్రాద్ధంలోనియుక్తులైన బ్రాహ్మణులు పరమశాంతులు, మిక్కిలి దయకలవారు, పెద్దవారు లోకానికి మేలు చేస్తారు. కావున వారి చేతిలో హోమం చేయవచ్చునని పెద్దలు చెప్పుతారు.

*అపసవ్యమగ్నౌ కృత్వా సర్వమావృత్య విక్రమమ్,*
*అపసవ్యేన హస్తేన నిర్వపేదుదకం భువి.214*

*త్రీంస్తు తస్మాద్ధవిశ్శేషాత్పిండాన్ కృత్వా సమాహితః,*
*ఔదకేనైవ విధినా నిర్వపేద్దక్షిణాముఖః.215*

*న్యుప్య పిండాంస్తతస్తాంస్తు ప్రయతో విధిపూర్వకమ్,*
*తేషు దర్భేషు తం హస్తం విమృజ్యాల్లేపభాగినామ్.216*

*ఆచమ్యోదక్పరావృత్య త్రిరాయమ్య శనైరసూన్,*
*షడృతూంశ్చ నమస్కుర్యా త్పితౄ నేవ చ మంత్రవత్.217*

*ఉదకం నినయేచ్ఛేషం శనైః పిండాంతికే పునః,*
*అవజిఘ్రేచ్చ తాన్ పిండాన్ యథా న్యుప్తాన్ సమాహితః.218*

*పిండేభ్యస్త్వల్పికాం మాత్రాం సమాదాయానుపూర్వశః,*
*తేనైవ విప్రానాసీనాన్ విధివత్పూర్వమాశయేత్.219*

అగ్నియందు చేయాల్సిన హోమానుష్ఠానక్రమమంతా దక్షిణ దిక్కులోనే చేయాలి. అట్లే కుడిచేతితో పిండప్రదాన స్థలంలో దర్భలు పరచినచోట నూవుల నీళ్ళు వదలవలెను. తర్వాత హోమం తర్వాత మిగిలిన అన్నంనుండి మూడు పిండాలు చేసి శ్రాద్ధకర్త శ్రద్ధతో దక్షిణాభిముఖుడై నూవుల నీళ్ళు వదలిన ప్రదేశంలో ఆ పిండాలను పెట్టాలి. ఈ విధంగా తమ తమ సూత్రోక్త ప్రకారాన పిండాలను పెట్టి దర్భల మొదళ్లలో తన చేతిని రాచి తన చేతి కంటుకొన్న మెతుకులను లేపభాక్కులగు పితరులకు ఒసగవలెను. తరువాత అతడు ఉత్తరాభిముఖుడై ఆచమనం చేసి మెల్లగా మూడు ప్రాణాయామాలను చేసి "వసంతాయనమస్తుభ్యం" మొదలైన మంత్రాలతో ఆరు ఋతువులకు నమస్కరించి

అటుపిమ్మట పితృ దేవతలకు నమస్కరించాలి. తరువాత పిండాలు పెట్టిన స్థలమందున్న నీటిలో కొంతభాగాన్ని తీసికొని మెల్లగా పిండాల దగ్గర వదలవలయును. తరువాత ఆ పిండాలను వరుసగా తీసికొని వాటిని వాసన చూచి ఆ పిండాలలోనుండి కొద్ది భాగాన్ని తీసికొని వరుసగా కూర్చున్న భోక్తలు తినునట్లు పెట్టవలెను.

*ధ్రియమాణే తు పితరి పూర్వేషామేవ నిర్వపేత్,*
*విప్రవద్వాఽపి తం శ్రాద్ధే స్వకం పితరమాశయేత్. 220*

*పితా యస్య తు వృత్తస్స్యాజ్జీవేచ్చాపి పితామహః,*
*పితుస్స నామ సంకీర్త్య కీర్త యేత్ప్రపితామహమ్. 221*

*పితామహో వా తచ్ఛ్రాద్ధం భుంజీతేత్యబ్రవీన్మనుః,*
*కామం వా సమనుజ్ఞాతః స్వయమేవ సమాచరేత్. 222*

*తేషాం దత్వా తు హస్తేషు సపవిత్రం తిలోదకమ్,*
*తత్పిండాగ్రం ప్రయచ్ఛేత స్వధైషామస్త్వితి బ్రువన్. 223*

తండ్రిబ్రతికి యున్నప్పుడు శ్రాద్ధము పెట్టవలసి వచ్చినచో తండ్రిని వదలి తక్కినవారికి శ్రాద్ధము పెట్టవలయును. పితృస్థానమున తన తండ్రిని కూర్చుండబెట్టి భోజనము పెట్టవలెను. అప్పుడు పిండం మాత్రం పితామహప్రపితామహులకే ఉండును. లేక తండ్రి చనిపోయి పితామహుడు (తాత) బ్రతికి ఉంటే తండ్రికి, ప్రపితామహునికి మాత్రమే పిండప్రదానం చేయాలి. లేక బ్రతికి యున్న పితామహుని (తాతను) పితామహుని స్థానముననుంచి అతనికే భోజనం పెట్టాలి. ఈ విధంగా పితృ,పితామహ, ప్రపితామహులనావాహన చేసి బ్రాహ్మణుల చేతిలో తిలలు, దర్భలు కల నీటిని పోసి అంతకుముందు పిండాల నుండి తీసిన భాగములను పిత్రేస్వధాస్తు, పితామహాయస్వధాస్తు, ప్రపితామహాయ స్వధాస్తు అని వరుసగా వారిచేతులలో పెట్టాలి.

*పాణిభ్యాం తూపసంగృహ్య స్వయమన్నస్య వర్ధితమ్,*
*విప్రాంతికే పితౄన్ ధ్యాయన్ శనకైరుపనిక్షిపేత్. 224*

*ఉభయో ర్హస్తయోర్ముక్తం యదన్న ముపనీయతే,*
*తద్విప్రలుంపంత్యసురా స్సహసా దుష్టచేతసః. 225*

*గుణాంశ్చ సూపశాకాద్యాన్ పయో దధి ఘృతం మధు,*
*విన్యసేత్ప్రయతః పూర్వం భూమావేవ సమాహితః. 226*

*భక్ష్యం భోజ్యం చ వివిధం మూలాని చ ఫలాని చ,*
*హృద్యాని చైవ మాంసాని పానాని సురభీణి చ. 227*

అన్న పాత్రను రెండు చేతులతో పట్టుకొని పితృ దేవతలను స్మరిస్తూ మెల్లగా భోక్తల సమీపంలో పెట్టవలెను. అన్న పాత్రను రెండు చేతులతో పట్టుకొనక బ్రాహ్మణుల సమీపానికి తెస్తే ఆ అన్నాన్ని దుష్టబుద్ధిగల రాక్షసులు వెంటనే హరిస్తారు. శ్రాద్ధకర్త పప్పు, కూరగాయలు, పెరుగు, పాలు, తేనె మొదలగువానిని శ్రద్ధాభక్తులతో అన్నం కంటె ముందే

వడ్డింపవలెను. వడలు మొదలైన భక్ష్యాలను, పాయసం మొదలైన భోజ్యములను ఫలమూలాలను, ఇష్టమైన మాంసాలను, సువాసనాభరితమైన పానీయాలను తెచ్చి ఉంచవలెను.

*ఉపనీయ తు తత్సర్వం శనకైస్సుసమాహితః,*
*పరివేషయేత ప్రయతో గుణాన్సర్వాన్ ప్రచోదయన్. 228*

*నాస్రమాపాతయేజ్జాతు న కుప్యేన్నానృతం వదేత్,*
*న పాదేన స్పృశే దన్నం న చైతదవధూనయేత్ 229*

*అస్రం గమయతి ప్రేతాన్ కోపోఽరీనన్నృతం శునః,*
*పాదస్పర్శస్తు రక్షాంసి దుష్కృతీనవధూననమ్. 230*

*యద్యద్రోచేత విప్రేభ్యస్తత్తద్దద్యాదమత్సరః,*
*బ్రహ్మోద్యాశ్చ కథాః కుర్యాత్పితృణా మేతదీప్సితమ్ 231*

*స్వాధ్యాయం శ్రావయేత్పిత్ర్యే ధర్మశాస్త్రాణి చైవ హి,*
*అఖ్యానానీతిహాసాంశ్చ పురాణాని ఖిలాని చ. 232*

*హర్షయేద్బ్రాహ్మణాం స్తుష్టో భోజయేచ్చ శనైశ్శనైః,*
*అన్నా ద్యేనాసకృచ్చైతాన్ గుణైశ్చ పరిచోదయేత్.233*

పై పదార్థాలనన్నిటిని శ్రద్ధతో తెచ్చి వాటి గుణాలను వర్ణిస్తూ మెల్లగా భోక్తలకు వడ్డించవలెను. అట్లు వడ్డించు సమయాన చనిపోయిన వారిని తలచుకొని దుఃఖింపరాదు. కోపమునకు రాకూడదు. అట్లే అబద్ధాలాడకూడదు. ఇంకా అన్నాన్ని కాలితో తొక్కరాదు. అన్నం చెల్లాచెదరగునట్లు వడ్డింపరాదు. వడ్డిస్తున్నప్పుడు కన్నీరు విడిచినచో శ్రాద్ధాన్నాన్ని ప్రేతలు తింటాయి. కోపంతో వడ్డించినచో శ్రాద్ధాన్నం తన శత్రువులజేరును. అన్నాన్ని కాలితో తొక్కినచో శ్రాద్ధాన్నం రాక్షసుల జేరును. అన్నం చెల్లాచెదరగునట్లు వడ్డిస్తే ఆ అన్నాన్ని పాపాత్ములు తింటారు కావున శ్రద్ధతో మెల్లగా భోక్తలకు అన్నాదికమును వడ్డించాలి. భోక్తలుగా వచ్చిన బ్రాహ్మణులకు ఏది ఇష్టమో దానినే మాత్సర్యమును వదలి వడ్డించాలి. అట్లే బ్రాహ్మణులు భోజనంచేసే సమయాన బ్రహ్మతత్వాన్ని ప్రతిపాదించే కథలను చెప్పవలెను. పితృదేవతలకీ కథలే చాలా ఇష్టమైనవి. అట్లే బ్రాహ్మణభోజన సమయాన వేదాలను ,ధర్మశాస్త్రాలను, ఆఖ్యానాలను, ఇతిహాసాలు పురాణాలు మొదలైనవాటిని వినిపించవలెను. శ్రాద్ధకర్తతాను సంతోషంతో ఉండి బ్రాహ్మణులను సంతోషపెట్టుచు పదార్థాలగుణాలను వర్ణిస్తూ వారికి చక్కగా భోజనం పెట్టవలెను.

*వ్రతస్థమపి దౌహిత్రం శ్రాద్ధే యత్నేన భోజయేత్,*
*కుతపం చాసనం దద్యాత్తిలైశ్చ వికిరేన్మహీమ్.234*

*త్రీణి శ్రాద్ధే పవిత్రాణి దౌహిత్రః కుతపస్తిలాః,*
*త్రీణి చాత్ర ప్రశంసంతి శౌచమక్రోధమత్వరామ్.235*

అత్యుష్ణం సర్వమన్నం స్యా ద్భుంజీరంస్తే చ వాగ్యతాః,
న చ ద్విజాతయో బ్రూయు ర్దాత్రా పృష్టా హవిర్గుణాన్.236

యావదుష్ణం భవత్యన్నం యావదశ్నంతి వాగ్యతాః,
పితరస్తావదశ్నంతి యావన్నోక్తా హవిర్గుణాః.237

యద్వేష్టితశిరా భుఙ్క్తే యద్భుఙ్క్తే దక్షిణాముఖః,
సోపానత్కశ్చ యద్భుఙ్క్తే తద్వై రక్షాంసి భుంజతే.238

చాండాలశ్చ వరాహశ్చ కుక్కుటశ్శ్వా తథైవ చ,
రజస్వలా చ షండశ్చ నేక్షేరన్నశ్నతో ద్విజాన్.239

హోమే ప్రదానే భోజ్యే చ యదేభిరభివీక్ష్యతే,
దైవే కర్మణి పిత్ర్యే వా తద్గచ్ఛత్యయథాతథమ్.240

ఘ్రాణేన సూకరో హన్తి పక్షవాతేన కుక్కుటః,
శ్వాతు దృష్టినిపాతేన స్పర్శేనావరవర్ణజః.241

ఖంజో వా యది వా కాణో దాతుః ప్రేష్యోఽపి వా భవేత్,
హీనాతిరి క్తగాత్రో వా తమప్యపనయేత్పునః242

బ్రాహ్మణం భిక్షుకం వాపి భోజనార్థముపస్థితమ్,
బ్రాహ్మణైరభ్యనుజ్ఞాతః శక్తితః ప్రతిపూజయేత్.243

బ్రహ్మచారిగా నున్నను కూతురు యొక్క కొడుకును (మనుమని) శ్రాద్ధంలో భోక్తగా నియోగించాలి. అట్లే శ్రాద్ధ బ్రాహ్మణులకు కంబళమును ఆసనంగా ఈయవలెను. శ్రాద్ధభూమియందు నువ్వులను చల్లవలెను. శ్రాద్ధమున దౌహిత్రుడు, కంబళి, నువ్వులు అను మూడు ప్రధానమైనవి. అట్లే శుచిగా నుండుట, కోపము లేకుండుట, తొందరపాటు లేకుండుట అనునవి చాల శ్రేష్ఠమైనవని చెప్పుదురు. శ్రాద్ధమున భోక్తులు మౌనంగా వేడియైన అన్నాన్ని తినవలెను. శ్రాద్ధకర్తకు భోక్తలు శాకపాకాల గుణములను అడిగినప్పటికి చెప్పకూడదు. భోక్తలు తిను వేడి వేడి అన్నమునే పితృదేవతలు భుజింతురు. అట్లే శాకాపాకాల గుణాలను భోక్తలు చెప్పనంతవరకే పితృదేవతలు భుజిస్తారు. భోక్తలు తలకుపాగా మొదలగునవి చుట్టుకొని, దక్షిణాభిముఖులై కాళ్ళకు పాదుకలు ధరించి భుజించినచో ఆ అన్నం రాక్షసుల వశమౌతుందే గాని పితృదేవతలు దానిని తినరు. అట్లే శ్రాద్ధభోక్తలైన బ్రాహ్మణులు భోజనం చేస్తున్నపుడు వారు తినే ఆహారాన్ని చండాలుడు, ఊరపంది, కుక్క, కోడి, రజస్వల, నపుంసకుడు మొదలైన వారు చూడకూడదు. హోమం చేస్తున్నపుడు, దానం చేస్తున్నప్పుడు, శ్రాద్ధభోక్తలు తినునపుడు దర్శ, పౌర్ణమాసి మొదలైన కర్మలలో, పితృకర్మలలో భోజనాన్ని చండాలుడు మొదలగువారు చూస్తే ఆ కర్మలన్ని వ్యర్థమై పోతాయి. ఊరపంది వాసన చూచినంత మాత్రాన, కోడి యొక్కగాలి వీచినంత మాత్రాన, కుక్క చూచినంత మాత్రాన, శూద్రుడు తాకుటచే పదార్థములన్ని అపవిత్రమౌతాయి. కుంటివాడుగాని, ఒంటికంటివాడుగాని, దాతయొక్క దాసుడుగాని, హీనగాత్రుడుగాని, అతిరిక్తగాత్రుడుగాని శ్రాద్ధభోజన సమయమంలో పరిసరములందుండరాదు. శ్రాద్ధ

సమయమున వచ్చిన అతిథిని, సన్యాసిని, భోజనార్థము వచ్చిన ఇతర బ్రాహ్మణులను శ్రాద్ధభోక్తల అనుమతితో యథాశక్తి పూజింపవలెను.

*సార్వవర్ణికమన్నాద్యం సన్నీయాప్లావ్య వారిణా,*
*సముత్సృజేద్భుక్తవతామగ్రతో వికిరన్ భువి.244*

*అసంస్కృతప్రమీతానాం త్యాగినాం కులయోషితామ్,*
*ఉచ్ఛిష్టం భాగధేయం స్యాద్దర్భేషు వికిరశ్చ యః.245*

*ఉచ్ఛేషణం భూమిగతమజిహ్మస్యాశఠస్య చ,*
*దాసవర్గస్య తత్పిత్ర్యే భాగధేయం ప్రచక్షతే.246*

భోక్తలందరు భోజనంచేసిన తరువాత మిగిలిన శాకపాకాలనన్నిటిని తీసికొని కొద్దిగా నీరుపోసి ఒక పిండాన్ని చేసి శ్రాద్ధభోక్తల యెదుట దర్భలు పరచిన ప్రదేశంలో వికిరపిండాన్ని వేయవలెను. ఈ వికిర పిండాలు అగ్ని సంస్కారమునకు అర్హతలేని బాలురకు ఇంటిని వదలిపోయిన కులస్త్రీలకు, పెద్దలను వదలివంటరిగా నుండేవారికి ఆహారంగా ఔతాయి.

భూమియందు పడి మిగిలిపోయిన అన్నాన్ని కపటం సోమరితనం లేని దాసదాసీవర్గానికి ఆహారంగా పెట్టవలెను.

*అసపిండక్రియా కర్మ ద్విజాతేస్సంస్థితస్య తు,*
*అదైవం భోజయేచ్ఛ్రాద్ధం పిండమేకం తు నిర్వపేత్. 247*

*సహపిండక్రియాయాం తు కృతాయామస్య ధర్మతః,*
*అనయైవావృతా కార్యం పిండనిర్వపణం సుతైః. 248*

చనిపోయిన బ్రాహ్మణునకు సపిండీకరణము జరిగే వరకు విశ్వేదేవబ్రాహ్మణుడు, మహావిష్ణు స్వరూప బ్రాహ్మణులకు వదలి ఒకే బ్రాహ్మణుని నియమించి ఒకే పిండాన్ని పెట్టవలెను. తరువాత ఏకోద్దిష్ట విధానంతో శ్రాద్ధం చేయబడి సపిండీకరణం జరిగిన తరువాత విశ్వేదేవపూర్వకంగా నిష్ణ్వంతముగా (దేవపూర్వం దేవాంతం) శ్రాద్ధంచేసి మూడు పిండాలు పెట్టవలెను.

*శ్రాద్ధం కృత్వా య ఉచ్ఛిష్టం వృషలాయ ప్రయచ్ఛతి,*
*సమూఢో నరకం యాతి కాలసూత్రమవాక్శిరాః. 249*

*శ్రాద్ధభుగ్వృషలీతల్పం తదహర్యోఽధిగచ్ఛతి,*
*తస్యాః పురీషే తన్మాసం పితరస్తస్య శేరతే.250*

*పృష్ట్వా స్వదితమిత్యేవం తృప్తా నాచామయేత్తతః,*
*ఆచాంతాంశ్చానుజానీయాదభితో రమ్యతా మితి.251*

*స్వధాస్త్విత్యేవ తం బ్రూయుర్బ్రాహ్మణా స్తదనంతరమ్,*
*స్వధాకారః పరా హ్యాశీః సర్వేషు పితృకర్మసు.252*

*తతో భుక్తవతాం తేషా మన్నశేషం నివేదయేత్,*
*యథా బ్రూయుస్తథా కుర్యాదనుజ్ఞాత స్తతో ద్విజైః.253*

శ్రాద్ధం చేసిన తరువాత బ్రాహ్మణులు తిని పారవేసిన ఆహారాన్ని శూద్రున పెట్టకూడదు. అట్లే భోక్త ఆనాడు స్త్రీ సాంగత్యము చేయకూడదు. భోక్తలు చక్క భోజనం చేసిన తరువాత వారిని చక్కగా భోజనం చేసితిరా అని అడిగి వారు తృప్తి చెందిన సమాధానం ఇచ్చిన తరువాతనే వారు చేతులు కడుక్కొనుటకు నీళ్ళు ఇవ్వవలెను. విధంగా వారు భోజనం చేసిన చేతులు కడుగుకున్న తరువాత పెద్దలారా కూర్చుండుడ వారిని సుఖప్రదేశమున కూర్చుండబెట్టవలెను. భోక్తలైన బ్రాహ్మణులు తాము చక్క భోజనం చేసి చేతులు కడుగుకొని కూర్చున్న తరువాత 'స్వధాస్తు' అని చెప్పవలెను. 'స్వధాస్ అనుమాటయే శ్రాద్ధమున గొప్పనైన ఆశీర్వచనము. అటుపిమ్మట శ్రాద్ధకర్త భుక్తశేషవ నేమి చేయవలెనని భోక్తలనడిగి వారు చెప్పినట్లు చేయవలెను.

*పిత్ర్యే స్వదితమిత్యేవ వాచ్యం గోష్ఠే తు సుశ్రుతమ్,*
*సంపన్న మిత్యభ్యుదయే దైవే రుచితమిత్యపి.254*

*అపరాహ్ణ స్తథా దర్భావాస్తుసంపాదనం తిలాః,*
*సృష్టిర్మృష్టిర్ద్విజాశ్చాగ్ర్యాః శ్రాద్ధకర్మసు సంపదః.255*

*దర్భాః పవిత్రం పూర్వాహ్ణో హవిష్యాణి చ సర్వశః,*
*పవిత్రం యచ్చ పూర్వోక్తం విజ్ఞేయా హవ్యసంపదః.256*

*మున్యన్నాని పయస్సోమో మాంసం యచ్చానుపస్కృతమ్,*
*అక్షారలవణం చైవ ప్రకృత్యా హవి రుచ్యతే.257*

పిత్రాదిశ్రాద్ధంలో స్వదితమని, గోష్ఠీశ్రాద్ధంలో సుశ్రుతమని, వృద్ధిశ్రాద్ధం సంపన్నమని, దైవశ్రాద్ధంలో రుచితమని ప్రశ్న వేయవలెను. ఇందలి గోష్ఠీ శ్రాద్ధాన్ని గూ విశ్వామిత్రుడు తెలిపెను. దైవశ్రాద్ధం భవిష్యపురాణంలో చెప్పబడింది. అపరాహ్ణకాల దర్భలు, శ్రాద్ధానికి తగిన ప్రదేశాన్ని ఎన్నుకొనుట, యాచనచేయకుండ సంపాదించి వస్తువులు, అన్నాదిపాకాలు, సద్బ్రాహ్మణులు శ్రాద్ధమున ప్రధానమైన సంపదలు. దర్భల మంత్రాలు, పూర్వాహ్ణం, మునులు భుజించు వస్తువులు ఇంకా ఇంతకుముందు చెప్పబ పవిత్రమైన వస్తువులు మొదలైనవి దైవ శ్రాద్ధంలో ప్రధానమైనవి. పాలు, సోమరస మంచిమాంసం, ఉప్పు,కారం లేని వస్తువులు వీటిని మునుల ఆహారపదార్థాలని అంటార

*విసృజ్య బ్రాహ్మణాం స్తాం స్తు నియతో వాగ్యతశ్శుచిః,*
*దక్షిణాం దిశమాంకాంక్షన్ యాచేతేమాన్ వరాన్ పితౄన్.258*

శ్రాద్ధం పూర్తియైన తరువాత నియమంతోనుండి పరిమితమైన మాటలాడుచ శ్రాద్ధభోక్తలైన బ్రాహ్మణులను పంపించి దక్షిణదిక్కును జూచుచు పితృదేవతలనీ విధం ప్రార్థింపవలెను.

*దాతారో నోఽభివర్ధంతాం వేదా స్సంతతిరేవచ,*
*శ్రద్ధా చనో మావ్యగమద్బహుదేయం చ నోఽస్త్వితి. 259*

మా కులమున దాతలగు పురుషులు అభివృద్ధి చెందుదురు గాక. వేదము నధ్యయనము చేయుట, వేదార్థములనెరుగుట, వేద ప్రాతిపాద్యములగు యాగవ

చేయుటవలన అభివృద్ధి చెందుగాక. నా సంతతి అభివృద్ధి చెందుగాక. మాకు వేదము యొక్క అర్థము తెలిసికొనుటలో శ్రద్ధపెరుగు గాక. ఇతరులకు దానము చేయుటకై ధనము వర్ధిల్లుగాక అని ప్రార్థించవలెను.

*ఏవంనిర్వపణం కృత్వాపిండాం స్తాంస్తదనంతరమ్.*
*గాం విప్రమజమగ్నిం వా ప్రాశయేదప్సు వాక్షిపేత్.260*

*పిండనిర్వపణం కేచిత్పురస్తాదేవకుర్వతే.*
*వయోభిః ఖాదయంత్యన్యే ప్రక్షిపంత్యనలే zప్సు వా.261*

*పతివ్రతా ధర్మపత్నీ పితృపూజనతత్పరా.*
*మధ్యమం తు తతః పిండమద్యాత్సమ్యక్ సుతార్థినీ.262*

*ఆయుష్మంతం సుతం సూతే యశోమేధాసమన్వితమ్,*
*ధనవంతం ప్రజావంతం సాత్వికం ధార్మికం తథా. 263*

అన్నశేషాన్ని గురించి భోక్తలనడిగి వారి యనుజ్ఞపై పిండాన్ని గోవునకు గాని, బ్రాహ్మణునికి గాని, మేకకుగాని పెట్టవలెను. లేనిచో అగ్నిహోత్రములోగాని, నీటియందు గాని వేయవలెను. పిండ ప్రదానాన్ని కొందరు భోక్తలు భుజించిన తరువాత చేస్తారు. కొందరు ఆ పిండాలను పక్షులకు పెట్టుతారు. పతివ్రత పితృపూజా పరాయణయగు శ్రాద్ధ కర్త ధర్మపత్ని పుత్ర సంపదకొరకు మధ్యమ పిండమైన పితామహ పిండాన్ని భక్షింపవలెను. ఆ విధంగా భక్షించుట వల్ల ఆమెకు ఆయుష్మంతుడు కీర్తి, బుద్ధిసమన్వితుడు, ధనవంతుడు, సంతానవంతుడు, సాత్వికుడు, ధార్మికుడు ఐన పుత్రుడు కలుగుతాడు.

*ప్రక్షాళ్య హస్తావాచమ్య జ్ఞాతిప్రాయః ప్రకల్పయేత్,*
*జ్ఞాతిభ్యస్సత్కృతం దత్వా బాంధవా నపి భోజయేత్ 264*

తరువాత శ్రాద్ధకర్త హస్తప్రక్షాళనం, ఆచమనం చేసి జ్ఞాతులు బంధువులందరికి భోజనం పెట్టవలెను.

*తతో గృహబలిం కుర్యాదితి ధర్మోవ్యవస్థితః*
*ఉచ్ఛేషణం తుతత్తిష్ఠేద్యావ ద్విప్రావిసర్జితాః 265*

శ్రాద్ధభోక్తలైన బ్రాహ్మణులనందరిని పంపిన తరువాత వారి యుచ్ఛిష్టాన్ని తీసి ఆ స్థలాన్ని పరిశుభ్రం చేసి వైశ్వదేవం, బలిహోమం, నిత్యశ్రాద్ధం, అతిథిభోజనం జరుపవలెను.

*హవిర్యచ్చిర రాత్రాయ యచ్చానంత్యాయ కల్పతే*
*పితృభ్యోవిధివద్దత్తం తత్ ప్రవక్ష్యామ్యశేషతః 266*

పితృదేవతలకెట్టి హవిస్సులనిస్తే వారికి చాలాకాలంవరకు తృప్తి కలుగుతుందో ఆ విషయాలన్నిటిని చెప్పెదనని భృగు మహర్షి తెలిపెను.

*తిలైర్వ్రీహియవైర్మాషైరద్భిర్మూలఫలేన వా,*
*దత్తేన మాసం తృప్యంతి విధివత్పితరో నృణామ్. 267*

నూవులు, బియ్యం, యవలు, మినుములు, ఫలమూలాలు, మాంసం మొదలైన వానిని శాస్త్రప్రకారమిస్తే వారి పితృదేవతలు సంతోషపడతారు.

*ద్వౌ మాసౌ మత్స్యమాంసేన త్రీన్ మాసాన్ హారిణేన తు,*
*ఔరభ్రేణాథ చతురః శాకునేనాథ పంచ వై. 268*

*షణ్మాసాం శ్ఛాగమాంసేన పార్షతేన చ సప్త వై,*
*అష్టావేణస్య మాంసేన రౌరవేణ నవైవతు 269*

*దశమాసాంస్తు తృప్యంతి వరాహమహిషామిషైః*
*శశకూర్మయోస్తు మాంసేన మాసానేకాదశైవ తు. 270*

*సంవత్సరం తు గవ్యేన పయసా పాయసేన చ,*
*వార్ధ్రీణసస్య మాంసేన తృప్తిర్ద్వాదశ వార్షికీ 271*

*కాలశాకం మహాశల్కాః ఖడ్గలోహామిషం మధు,*
*ఆనంత్యాయైవ కల్పంతే మున్యన్నాని చ సర్వశః 272*

శ్రాద్ధంలో మత్స్యాలను వండినచో రెండు నెలలు, లేడిమాంసం వల్ల మూడు నెలలు, గొఱ్ఱె మాంసంచే నాలుగు నెలలు, పక్షి మాంసంతో ఐదు నెలలు, మేకమాంసంతో ఆరు నెలలు, చారలున్న జింకమాంసంతో ఏడు నెలలు, కృష్ణమృగ మాంసంచే ఎనిమిది నెలలు, దుప్పి మాంసం చే తొమ్మిది నెలలు, ముళ్లపంది, అడవిదున్న వీటి మాంసములచే పదినెలలు, కుందేలు, తాబేలు వీని మాంసంచే పదకొండునెలలు, ఆవు పాల పాయసముతో సంవత్సరము వార్ధ్రీణసమను ముసలి మేకపోతు మాంసముచే పన్నెండు సంవత్సరములు పితృదేవతలు తృప్తి పొందుతారు. కాలశాకమనే శాకం, ముండ్లు గల చేపలు, ఖడ్గమృగము, ఎఱ్ఱనిపొట్టేలు, నివ్వరి ధాన్యము, తేనె మొదలగు మున్యన్నములచే పితరులు అంతులేని కాలం తృప్తి పొందుతారు.

*యత్కించిన్మధునా మిశ్రం ప్రదద్యాత్తు త్రయోదశీమ్,*
*తదప్యక్షయమేవ స్యాద్వర్షాసు చ మఘాసు చ 273*

*అపి నస్స కులే జాయాద్యోనో దద్యాత్త్రయోదశీమ్,*
*పాయసం మధుసర్పిర్భ్యాం ప్రాక్ఛాయే కుంజరస్య చ 274*

*యద్యద్దదాతి విధివత్సమ్యక్ శ్రద్ధాసమన్వితః,*
*తత్తత్పితౄణాం భవతి పరత్రానంతమక్షయమ్ 275*

*కృష్ణపక్షే దశమ్యాదౌ వర్జయిత్వా చతుర్దశీమ్,*
*శ్రాద్ధే ప్రశస్తా స్తిథయో యథైతా న తథేతరాః 276*

*యుక్షు కుర్వన్ దినర్క్షేషు సర్వాన్ కామాన్ సమశ్నుతే,*
*అయుక్షు తు పితౄన్ సర్వాన్ ప్రజాం ప్రాప్నోతి పుష్కలామ్ 277*

*యథా చైవాపరః పక్షః పూర్వపక్షాద్విశిష్యతే,*
*తథా శ్రాద్ధస్య పూర్వాహ్ణాదపరాహ్ణో విశిష్యతే 278*

వర్ష ఋతువునందు, మఖా నక్షత్రముతో నున్న త్రయోదశినాడు తేనెతో కూడిన ఏ పదార్థాన్నైనా శ్రాద్ధంలో ఇస్తే అది కూడా పితరులకు అక్షయతృప్తినిస్తుంది. మఖాయుక్త త్రయోదశి నాడు అపరాహ్ణకాలంలో (శ్రాద్ధదినమున) తేనె, నేయి గల పాయసం ఇచ్చేవాడు మాకులంలో పుట్టాలి అని పితృదేవతలు ఆశిస్తారు. శ్రద్ధాసక్తులతో శాస్త్ర పద్ధతిననుసరించి పితృదేవతలకు ఏ వస్తువును సమర్పించిన అది పితృదేవతలకు అనంతము, అక్షయమైన సంతోషాన్నిస్తుంది. కృష్ణ పక్షచతుర్దశి తప్ప కృష్ణ పక్షంలో దశమి నుండి అమావాస్య వరకున్న తిథులు శ్రాద్ధంలో శ్రేష్టమైనట్లు తక్కిన తిథులు కావు. సరిసంఖ్యగల తిథులు నక్షత్రాలలో శ్రాద్ధం చేసినవాడు సమస్తమైన కోరికలను పొందుతాడు. అట్లే బేసి సంఖ్యగల తిథులు, నక్షత్రములలో శ్రాద్ధం చేస్తే పుష్కలమైన సంతానాన్ని పొందుతాడు. శ్రాద్ధంలో శుక్లపక్షంకంటె కృష్ణపక్షం శ్రేష్ఠమైనట్లే అపరాహ్ణం పూర్వాహ్ణం కంటె శ్రేష్ఠమైనది.

*ప్రాచీనావీతినా సమ్యగపసవ్యమతంద్రిణా,*
*పిత్ర్య మానిధనాత్కార్యం విధివద్దర్భ పాణినా 279*

*రాత్రౌ శ్రాద్ధం న కుర్వంతి రాక్షసీ కీర్తితాహిసా*
*సంధ్యయోరుభయోశ్చైవ సూర్యంచైవాచిరోదితే. 280*

శ్రాద్ధకర్త ప్రాచీనావీతియై (జందెమును కుడిభుజముపై వేసికొని) దర్భలు చేతిలో పట్టుకొని అపసవ్యంగా పితృకార్యాన్ని మృతుడైన దినంనుండి పితృకార్యాలన్ని పూర్తియగు వరకు చేయవలెను. ఎట్టి స్థితిలోను రాత్రిపూట శ్రాద్ధం పెట్టరాదు. రాత్రిని రాక్షసి అని పిలుస్తారు. అట్లే ఉభయ సంధ్యలలోను, సూర్యోదయమైన వెంటనే శ్రాద్ధమాచరింపవద్దు.

*అనేన విధినా శ్రాద్ధం త్రిరబ్దస్యేహ నిర్వపేత్,*
*హేమంత గ్రీష్మ వర్షాసు పాంచయజ్ఞికమన్వహమ్. 281*

*న పైతృయజ్ఞియో హోమో లౌకికేzగ్నౌ విధీయతే,*
*న దర్శేన వినా శ్రాద్ధ మాహితాగ్నేర్ద్విజన్మనః 282*

ఈ విధంగా శ్రాద్ధాన్ని సంవత్సరానికి మూడుమార్లు హేమంత, గ్రీష్మ, వర్ష ఋతువులలో చేయవలెను. అట్లే తమ తమ ఆచారాన్ననుసరించి కుంభ, వృషభ, కన్య మాసములందు (సౌరమానముననుసరించి) చేయవలెను. పంచమహాయజ్ఞాలు నడచుటకై ఒక బ్రాహ్మణుని ప్రతిదినం నియోగించాలి. పితృయజ్ఞానికి సంబంధించిన హోమాన్ని లౌకికమైన గార్హపత్యాగ్నిలో ఎప్పుడూ చేయకూడదు. అట్లే ఆహితాగ్నియైన బ్రాహ్మణుడు అమావాస్య తప్ప మిగిలిన దినాలలో శ్రాద్ధం చేయకూడదు. మృతాహశ్రాద్ధమునకు మాత్రం ఏ నియమం లేదు.

*యదేవ తర్పయత్యద్భిః పితౄన్ స్నాత్వా ద్విజోత్తమః,*
*తే నైవ కృత్స్నమాప్నోతి పితృయజ్ఞక్రియాఫలమ్. 283*

బ్రాహ్మణోత్తముడు ప్రతిదినం స్నానం చేయగనే చేయు పితృతర్పణంతో పితృయజ్ఞఫలితమంతయు పొందును.

*వసూన్ వదంతి పితౄన్ రుద్రాంశ్చైవ పితామహాన్,*
*ప్రపితామహాం స్తథాదిత్యాన్ శ్రుతిరేషా సనాతనీ 284*

శ్రాద్ధంలో పితరులు వసువులని, పితామహులు రుద్రులని, ప్రపితామహులు ఆదిత్యులని వేదములు చెప్తున్నాయి.

*విఘసాశీ భవేన్నిత్యం నిత్యం వాఽమృతభోజనః*
*విఘసో భుక్తశేషం తు యజ్ఞశేషం తథాఽమృతమ్. 285*

అతిథులు భుజించిన తరువాత మిగిలిన దానిని భుజిస్తే అతడు విఘసాన్ని తినువాడౌతాడు. అట్లే యజ్ఞశేషాన్ని భుజిస్తే అతడు అమృతాన్ని తిన్నవాడౌతాడు. ఇది శ్రాద్ధానికి సంబంధించినది కావున ఇచ్చట భుక్త శేషమనగా శ్రాద్ధంలో భోక్తల శేషమని అనుకొనవలెను.

*ఏతద్వో ఽభిహితం సర్వం విధానం పాంచయజ్ఞికమ్,*
*ద్విజాతిముఖ్యవృత్తీనాం విధానం శ్రూయతామితి, 286*

ఓ మునులారా! మీకింతవరకు పంచయజ్ఞాలకు సంబంధించిన విషయాలన్నింటిని తెలిపాను. ఇక బ్రాహ్మణులకు సంబంధించిన వృత్తులగురించి వివరంగా చెబుతానని భృగుమహర్షి పలికినాడు.

*ఇతి మానవేధర్మశాస్త్రే భృగు ప్రోక్తాయాం సంహితాయాం తృతీయో ఽధ్యాయః*

భృగుమహర్షి చెప్పిన మానవధర్మశాస్త్రమను సంహితయందు మూడవ అధ్యాయము సమాప్తము.

## చతుర్థాధ్యాయం

*చతుర్థమాయుషో భాగముషిత్వాఽఽద్యం గురావిహ,*
*ద్వితీయమాయుషో భాగం కృతదారో గృహే వసేత్. 1*

*అద్రోహేణైవభూతానా మల్పద్రోహేణ వా పునః*
*యా వృత్తిస్తాం సమాస్థాయ విప్రో జీవేదనాపది.2*

*యాత్రామాత్ర ప్రసిద్ధ్యర్థం స్వైః కర్మభిరగర్హితైః*
*అక్లేశేన శరీరస్య కుర్వీత ధనసంచయమ్ 3*

*ఋతామృతాభ్యాం జీవేత్తు మృతేన ప్రమృతేన వా,*
*సత్యానృతాభ్యామపి వా న శ్వవృత్త్యా కదాచన. 4*

*ఋతముఞ్ఛశిలం జ్ఞేయమమృతం స్యాదయాచితమ్,*
*మృతం తు యాచితం భైక్షం ప్రమృతం కర్షణం స్మృతమ్.5*

*సత్యానృతం తు వాణిజ్యం తేన చైవాపి జీవ్యతే,*
*సేవా శ్వవృత్తిరాఖ్యాతా తస్మాత్తాం పరివర్జయేత్.6*

## చతుర్థాధ్యాయం

*కుసూలధాన్యకో వా స్యాత్కుంభీధాన్యక ఏవ వా,*
*త్ర్యహైహికో వాపి భవేదశ్వస్తనిక ఏవ వా.7*

ద్విజుడు వయస్సులో నాల్గవ భాగం అనగా ఇరువై సంవత్సరాలు గురువు దగ్గర ఉండి తరువాత పెండ్లి చేసుకొని ఇంటి దగ్గర ఉండవలెను. ఆ సమయంలో అతడు జీవులను బాధపెట్టక లేక స్వల్పముగా బాధకలిగిస్తూ తన వృత్తిననుసరించి బ్రదుకవలెను. జీవిత యాత్ర గడుపుటకై ఇతరులు నిందింపని కర్మలనాచరిస్తూ తన శరీరాన్ని మిక్కిలి కష్టపెట్టక ధనం సంపాదించాలి. ఆపద లేనప్పుడు ఋతం, అమృతం, మృతం, ప్రమృతం అనే పద్ధతులచే జీవించాలే కాని ఎట్టి పరిస్థితులలోను శ్వవృత్తిచే (ఇతరుల సేవించి) కాలం గడుపరాదు. పై వాటిలో ఋతమనగా ఉంఛశిలావృత్తి అనగా ఎవరికీ సంబంధం లేని ప్రాంతాలలో పడ్డ గింజలను ఏరుకొని తినుట, ఇక రెండవదైన అమృతమనగా ఇతరులనెవ్వరిని యాచింపక బ్రదుకుట. మృతమనగా ఇతరులను యాచన చేసి బ్రదుకుట. ప్రమృతమనగా సేద్యం చేసి బ్రదుకుట, వర్తకాన్ని సత్యానృతమని అంటారు. దానితోనైన బ్రతకవచ్చును గాని శ్వవృత్తి అనబడే సేవకావృత్తిచే జీవితం గడుపుట నిందింపదగినది. శ్వవృత్తికాక ఇతర వృత్తులచే జీవించుటకు వీలులేని సమయంలో కుసూలధాన్యకుడు లేక కుంభీధాన్యకుడు లేక త్ర్యహైహికుడు కానిచో అశ్వస్తనికుడు కావలెను. కుసూల ధాన్యకుడనగా తనకు తనసేవకులకు మూడు సంవత్సరాల వరకు ఇంక ఎక్కువకాలమైనా సరిపడు ధాన్యాన్ని గాదెలలో నింపుకొనువాడు. తనకు, తన భృత్యులకు సంవత్సరం వరకు సరిపడే ధాన్యాన్ని నిలువచేసుకొను వానిని కుంభీధాన్యకుడంటారు. మూడుదినాలకు మాత్రం సరిపడే ధనధాన్యాల నిల్వచేసికొనువానిని త్ర్యహైహికుడని పిలుస్తారు. మరుసటి దినానికి మాత్రం సరిపడే ధాన్యాదికాన్ని నిలువ జేసికొనేవాడు అశ్వస్తనికుడు.

*చతుర్ణామపి చైతేషాం ద్విజానాం గృహమేధినామ్,*
*జ్యాయాన్ పరః పరో జ్ఞేయో ధర్మతో లోకజిత్తమః.8*

*షట్కర్మైకో భవత్యేషాం త్రిభిరన్యః ప్రవర్తతే,*
*ద్వాభ్యా మేకశ్చతుర్థ స్తు బ్రహ్మసత్రేణ జీవతి.9*

పైన జెప్పిన నాలుగు తెగలలో తరువాతి వారు ఆ తరువాతి వారు చాల శ్రేష్ఠులు. ఎందుకనగా వారు జీవికకై సంపాదన చేయుటకంటె పరమాత్మ చింతనకై తమ సమయాన్ని వెచ్చిస్తారు. ఈ నాలుగు తెగలలో బహు కుటుంబము కలవాడు ఋతం, అమృతం, మృతం, ప్రమృతం, సత్యానృతం, వృద్ధి జీవనమనే ఆరు విధానాలుగా బ్రదుకవచ్చును. పైవారికంటె తక్కువ కుటుంబం కలవాడు యాజన, అధ్యాపన, ప్రతిగ్రహములనెడు మూడు పద్ధతులచే జీవించవచ్చును. ఇంకా తక్కువ కుటుంబం కలవాడు యాజన, అధ్యాపనములచేతనే జీవింపవలెను. మిక్కిలి తక్కువ కుటుంబ భారము కలవాడు. వేదాధ్యాపనం చేతనే జీవింపవలెను.

*వర్తయంశ్చ శిలోంఛాభ్యామగ్ని హోత్రపరాయణః,*
*ఇష్టీః పార్వాయనాంతీయాః కేవలా నిర్వపేత్సదా.10*

శిలోంఛావృత్తిచే జీవించువాడు ధనమాత్ర సాధ్యాలైన యాగాలను చేయజాలడు కావున అతడు అగ్నిహోత్రాన్ని కాపాడుకొనుచు దర్శ, పూర్ణమాసాలను ఆగ్రయణము అను యాగాలను మాత్రం చేయవలెను.

*న లోకవృత్తం వర్తేత వృత్తి హేతోః కథంచన,*
*అజిహ్మామశఠాం శుద్ధాం జీవేద్బ్రాహ్మణజీవికామ్.11*

*సంతోషం పరమాస్థాయ సుఖార్థీ సంయతో భవేత్,*
*సంతోషమూలం హి సుఖం దుఃఖమూలం విపర్యయః.12*

*అతోఽన్యతమయా వృత్త్యా జీవంస్తు స్నాతకో ద్విజః,*
*స్వర్గాయుష్యయశస్యాని వ్రతానీమాని ధారయేత్.13*

బ్రాహ్మణుడు ఇతరుల వలె ఇచ్ఛకపు మాటలాడుట, నవ్వులాటలాడుట మొదలగు లోక ప్రవృత్తిని అనుసరింపకూడదు. అతడు చక్కని మార్గములో మోసపు ప్రవృత్తి లేక జీవింపవలెను. అతడు సుఖం కావలెనని కోరుకున్నప్పటికిని యమనియమాలతో సంతోషంతోఉండవలెను. సంతోషం వల్ల సుఖం కలుగుతుంది. లేనిచో దుఃఖం కలుగుతుంది. అందువల్ల పైన పేర్కొన్న ఋతం మొదలగు వృత్తులలో దేనినైన స్వీకరించి స్వర్గం ఆయుస్సు, కీర్తిని కలిగించే ఈ వ్రతాలను అనుష్ఠించవలెను.

*వేదోదితం స్వకం కర్మ నిత్యం కుర్యాదతంద్రితః,*
*తద్ధి కుర్వన్ యథాశక్తి ప్రాప్నోతి పరమాం గతిమ్.14*

*నేహేతార్థాన్ ప్రసంగేన న విరుద్ధేన కర్మణా,*
*న విద్యమా నేష్వర్థేషు నార్త్యామపి యతస్తతః.15*

*ఇంద్రియార్థేషు సర్వేషు న ప్రసజ్యేత కామతః,*
*అతిప్రసక్తిం చైతేషాం మనసా సన్నివర్తయేత్ 16*

*సర్వాన్ పరిత్యజే దర్థాన్ స్వాధ్యాయస్య విరోధినః,*
*యథా తథాధ్యాపయంస్తు సాహ్యాస్య కృతకృత్యతా 17*

*వయసః, కర్మణో Z ర్థస్య శ్రుతస్యాభిజనస్య చ,*
*వేషవాగ్బుద్ధిసారూప్యమాచరన్ విచరేదిహ 18*

*బుద్ధి వృద్ధికరాణ్యాశు ధన్యాని చహితాని చ,*
*నిత్యం శాస్త్రాణ్యవేక్షేత నిగమాంశ్చైవ వైదికాన్ 19*

*యథా యథా హి పురుషః శాస్త్రం సమధిగచ్ఛతి.*
*తథా తథా విజానాతి విజ్ఞానం చాస్య రోచతే 20*

బ్రాహ్మణుడు వేదమునందు చెప్పబడ్డ కర్మను చక్కగా అనుష్ఠిస్తే అతనికి ఉత్తమగతి లభిస్తుంది. బ్రాహ్మణులకు విరుద్ధమైన కర్మల ద్వారా ధనాన్ని మాత్రం సంపాదింప కూడదు. ధనమున్నా లేకున్నా కష్టస్థితిలో సహితం అన్యాయంగా ధనం సంపాదించకూడదు. సకలేంద్రియ విషయాలను మోహంతో కోరరాదు. ఈ ఇంద్రియ విషయాలందు ఎక్కువ

కోరికను పెట్టుకొనక మనస్సును వాటినుండి మరల్చవలెను. వేదాన్ని అధ్యయనం చేయుటకు ఆటంకంగా ఉన్న సమస్త విషయాలను వదలిపెట్టి తాను నేర్చుకొన్న వేదాలను ఇతరులకు చెప్పవలెను. దానివలననే అతడు కృతకృత్యుడౌతాడు. తన వయస్సు, యాగం మొదలైన కర్మ, తాను చదివిన విద్య, తన బంధుజనం, వీనికి దగిన వేషభాషలతో చక్కగా తిరుగవలెను. తర్వగా బుద్ధిని పెంచు వ్యాకరణ మీమాంసాస్మృతిపురాణాలను, ధనాన్ని తెచ్చిపెట్టే అర్థశాస్త్రాలను, ఇహంలో జనులకు ఉపకరించే వైద్యం జ్యోతిషం మొదలైన శాస్త్రాలను వేదార్థాన్ని తెలిసే గ్రంథాలను ప్రతిదినం పఠింపవలెను. పురుషుడు శాస్త్రాలను చదివిన కొద్ది అతనికి జ్ఞానం దినదినం అభివృద్ధి చెందుతుంది.

*ఋషి యజ్ఞం దేవయజ్ఞం భూత యజ్ఞం చ సర్వదా*
*నృయజ్ఞం పితృయజ్ఞం చ యథాశక్తి న హాపయేత్ 21*

*ఏతానేకే మహాయజ్ఞాన్ యజ్ఞశాస్త్రవిదో జనాః,*
*అనీహమానాస్సతతమింద్రి యేష్వేవ జుహ్వతి 22*

*వాచ్యేకే జుహ్వతి ప్రాణం ప్రాణే వాచం చ సర్వదా,*
*వాచి ప్రాణే చ పశ్యంతో యజ్ఞ నిర్వృత్తిమక్షయామ్ 23*

*జ్ఞానేనైవాపరే విప్రా యజం త్యేతైర్మఖై స్సదా,*
*జ్ఞానమూలం క్రియామేషాం పశ్యంతో జ్ఞాన చక్షుషా 24*

*అగ్ని హోత్రం చ జుహుయాదాద్యంతే ద్యునిశోస్సదా,*
*దర్శేన చార్ధమాసాంతే పౌర్ణమాసేన చేవ హి. 25*

*సస్యాంతే నవసస్యేష్ట్యా తథర్త్వంతే ద్విజోzధ్వరైః*
*పశునా త్వయనస్యాదౌ సమాంతే సౌమికైర్మఖైః 26*

గృహస్థుడు ఋషి యజ్ఞాన్ని (తర్పణాన్ని) దేవయజ్ఞాన్ని (దేవతారాధన) భూతయజ్ఞం (వైశ్వదేవం) నృయజ్ఞం( అతిథిపూజ) పితృయజ్ఞం (శ్రాద్ధము) వీటిని యథాశక్తి ఎల్లప్పుడు చేస్తూ ఉండాలి. కొందరు పెద్దలు పై పంచయజ్ఞాలందు కోరికను వదలివేసి తమ ఐదు జ్ఞానేంద్రియములయందే హోమం చేస్తారు. మరి కొందరు పెద్దలు యజ్ఞఫలం వాక్కులో, ప్రాణంలో ఉందని భావిస్తూ ప్రాణాన్ని వాక్కులో, వాక్కును ప్రాణంలో అణచుకొని యజ్ఞఫలితాన్ని పొందుతారు. ఇంకా కొందరు బ్రహ్మజ్ఞానులు తమ జ్ఞాననేత్రంచే సకల యాగాలు జ్ఞానమూలములైనవని భావించి ఆ జ్ఞానాన్నే చక్కగా పొందుటకు ప్రయత్నిస్తారు. సాయంప్రాతఃకాలాలలో అగ్నిహోత్రాన్ని చేయవలెను. అట్లే అమావాస్య నాడు దర్శయాగాన్ని, పూర్ణిమనాడు పౌర్ణిమాసియాగాన్ని చేయవలెను. ధాన్యం అయిపోవునపుడు (కొత్త ధాన్యము వచ్చినపుడు) నవసస్యయాగాన్ని, ఋతువుల చివర చాతుర్మాసమువంటి యాగాలను, ఉత్తరదక్షిణాయనముల మొదట పశువధ రూపమైన యాగాన్ని, సంవత్సరాంతంలో సోమరసం కల అగ్నిష్టోమయాగాన్ని చేయవలెను.

*నానిష్ట్వా నవసస్యేష్ట్యా పశునా చాగ్నిమాన్ ద్విజః*
*నవాన్న మద్యాన్మాంసం వా దీర్ఘ మాయుర్జిజీవిషుః 27*

*నవేనానర్చితా హ్యస్య పశుహవ్యేన చాగ్నయః,*
*ప్రాణానేవాత్తుమిచ్ఛంతి నవాన్నామిషగర్ధినః 28*

ఆహితాగ్నియైన బ్రాహ్మణుడు నవసస్యేష్టిని చేయక కొత్త బియ్యపుటన్నమును తినరాదు. అట్లే పశుయాగం చేయక మాంసం తినరాదు. అతడు నవసస్యేష్టిని పశుయాగం చేయకపోతే అగ్నులు నవాన్నం, మాంసం పైగల కోరికతో యజమాని ప్రాణాలనే హరిస్తాయి.

*ఆసనాశనశయ్యాభిరద్భిర్మూలఫలేన వా,*
*నాస్య కశ్చిద్వ సేద్గేహే శక్తితోఽనర్చితో ఽతిథిః 29*

*పాషండినో వికర్మస్థాన్ బైడాల వ్రతికాన్ శఠాన్,*
*హైతుకాన్ బక వృత్తీంశ్చ వాఙ్మాత్రేణాపి నార్చయేత్ 30*

*వేదవిద్యా వ్రతస్నాతాన్ శ్రోత్రియాన్ గృహమేధినః,*
*పూజయేద్ధవ్యకవ్యేన విపరీతాంశ్చ వర్జయేత్. 31*

*శక్తితోఽపచమానేభ్యో దాతవ్యం గృహమేధినా,*
*సంవిభాగశ్చ భూతేభ్యః కర్తవ్యోఽనుపరోధతః 32*

ఆహితాగ్ని తన ఇంటికి వచ్చిన అతిథిని అసనం, భోజనం, శయ్య, మంచినీరు, ఫలమూలాలచే అర్చించకపోయినట్లైతే అతని ఇంటిలో ఏ అతిథి కూడ ఉండరాదు. అట్లే అతడు అతిథికాలంలో వచ్చినా పాషండులను, శాస్త్రవిరుద్ధమైన కర్మలు చేయువారిని, పిల్లి, కొంగలవలె ప్రవర్తించువారిని, వేదాలను నమ్మనివారిని, వేదవిరుద్ధంగా తర్కవాదాలు చేయువారిని మంచి మాటచే సహితం సత్కరింపరాదు. వేదాలను పూర్తిగా జదివి వ్రతాలను పూర్తి చేయక సమావర్తనం చేయు విద్యాస్నాతకుని, వ్రతాలను పూర్తి చేసినప్పటికీ వేదాలను పూర్తిగా జదువక ఇంటికి మరలిన వ్రతస్నాతకుని, వేదాలను పూర్తి చేసి వ్రతాలను పూర్తి చేసిన విద్యా వ్రతస్నాతకుని గృహస్థుడు హవ్యకవ్యాలతో గౌరవించాలి. మిగిలినవారిని గౌరవింపక వదలిపెట్టవచ్చును.

వంటచేయక భోజనాన్ని బిచ్చమెత్తే బ్రహ్మచారి, సన్యాసి మొదలగువారికి గృహస్థుడు శక్తికొద్ది భిక్షను ఇవ్వవలెను. వృక్షాలు జంతువులు మొదలైన వాటిని వాటి వాటికి తగినట్లు సంతృప్తి జేయవలెను.

*రాజతో ధనమిన్విచ్ఛేత్సంసీదన్ స్నాతకః క్షుధా,*
*యాజ్యాంతేవాసినో ర్వాపి న త్వన్యత ఇతి స్థితిః. 33*

*నసీదేత్స్నాతకో విప్రః క్షుధా శక్తః కథంచన,*
*న జీర్ణమలవద్వాసా భవేచ్చ విభవే సతి 34*

*క్లుప్త కేశనఖ శ్మశ్రు ర్దాంతశ్శుక్లాంబరశ్శుచిః,*
*స్వాధ్యాయే చైవ యుక్తస్స్యా న్నిత్యమాత్మహితేషు చ. 35*

*వైణవీం ధారయేద్యష్టిం సోదకం చ కమండలుమ్,*
*యజ్ఞోపవీతం వేదం చ శుభే రౌక్మే చ కుండలే 36*

## చతుర్థాధ్యాయం

స్నాతకవ్రతం చేసికొన్నవాడు ఆకలితో బాధపడుచున్నప్పుడు మాత్రమే క్షత్రియునినుండి, తనచే యాగం చేయించుకొన్న వానినుండి, తన శిష్యుని నుండి ధనాన్ని స్వీకరింపవచ్చు గాని ఇతరులనుండి ధనాన్ని పొందరాదు. విద్యా వ్రతస్నాతకుడైన బ్రాహ్మణుడు తనకు ధనమిచ్చే రాజువంటివారుండగా ఆకలిచే బాధపడరాదు. అదే విధంగా తనకు ధనం దొరికినప్పుడు చిరిగిపోయిన మురికి పట్టిన వస్త్రాలు ధరింపరాదు. అతడు విహితకాలంలో వెంట్రుకలను కొరిగించుకొని, గోళ్ళను కత్తిరించుకొని, తెల్లని వస్త్రాలు ధరించి పరిశుద్ధుడై, వేదాన్ని అధ్యయనం చేస్తూ తనకు హితమైన పనులు చేయవలెను. అతడు వెదురు కఱ్ఱను, నీటితో నున్న కమండలువును, జందెమును, బంగారు కుండలాలను ధరింపవలెను.

*నేక్షేతోద్యంతమాదిత్యం నాస్తంయంతం కదాచన,*
*నోపసృష్టం న వారిస్థం న మధ్యం నభసో గతమ్.* 37

*న లంఘయేద్వత్సతంత్రీం న ప్రధావేచ్చ వర్షతి,*
*న చోదకే నిరీక్షేత స్వం రూపమితి ధారణా* 38

*మృదం గాం దైవతం విప్రం ఘృతం మధు చతుష్పథమ్,*
*ప్రదక్షిణాని కుర్వీత ప్రజ్ఞాతాంశ్చ వనస్పతీన్.* 39

అతడెప్పుడు కూడ ఉదయించుచున్న లేక అస్తమించుచున్న సూర్యుని చూడరాదు. అట్లే సూర్యుడు రాహుగ్రస్తుడై యుండగా, నీటియందు ప్రతిఫలించియుండగా, మధ్యాహ్నమున ఉన్నప్పుడు చూడరాదు. అతడు దూడకట్టుత్రాటిని దాటరాదు. వర్షం పడుతున్నప్పుడు పరుగెత్తరాదు. నీటిలో ప్రతిఫలించిన తన ప్రతిబింబాన్ని చూడరాదు. ప్రయాణం చేస్తున్నప్పుడు మట్టిదిబ్బ, ఆవు, దేవతాప్రతిమలు, నేతికుండ, తేనెకుండ, నాలుగు దారులు కలియుచోటు, రావి, మఱ్ఱి వంటి గొప్ప వృక్షాలు తటస్థపడితే ప్రదక్షిణం చేస్తూ పోవలెను.

*నోపగ చ్ఛేత్ప్రమత్తోఽపి స్త్రియమార్తవదర్శనే,*
*సమానశయనే చైవ న శయీత తయా సహ.* 40

*రజసాఽభిప్లుతాం నారీం నరస్య హ్యుపగచ్ఛతః,*
*ప్రజ్ఞా తేజో బలం చక్షురాయుశ్చైవ ప్రహీయతే* 41

*తాం వివర్జయత స్తస్య రజసా సమభిప్లుతామ్,*
*ప్రజ్ఞా తేజో బలం చక్షురాయుశ్చైవ ప్రవర్ధతే* 42

కామార్తుడైనను రజోదర్శనకాలమందు స్త్రీతో కూడరాదు. అట్లే ఒకే శయ్యపై పడుకొని యుండకూడదు. ముట్టైన స్త్రీతో సంగమించినచో అతని ప్రజ్ఞ, తేజస్సు, బలం, దృష్టి, ఆయుస్సు నశిస్తున్నాయి. లేనిచో ప్రజ్ఞాదిగుణాలు అభివృద్ధి చెందగలవు.

*నాశ్నీయాద్భార్యయా సార్ధం నైనామీక్షేత చాశ్నతీమ్,*
*క్షువతీం జృంభమాణాం వా న చాసీనాం యథాసుఖమ్* 43

నాంజయంతీం స్వకే నేత్రే న చాభ్యక్తామనావృతామ్,
న పశ్యేత్ ప్రసవంతీం చ తేజస్కామో ద్విజోత్తమః. 44

నాన్నమద్యాదేకవాసా న నగ్నస్స్నానమాచరేత్
న మూత్రం పథి కుర్వీత న భస్మని న గోవ్రజే 45

న ఫాలకృష్టే న జలే న చిత్యాం న చ పర్వతే,
న జీర్ణ దేవాయతనే న వల్మీకే కదాచన 46

న ససత్త్వేషు గర్తేషు న గచ్ఛన్నాపి చ స్థితః,
న నదీతీర మాసాద్య న చ పర్వత మస్తకే 47

వాయ్వగ్ని విప్రామాదిత్యమపః పశ్యం స్తథైవ గాః,
న కదాచన కుర్వీత విణ్మూత్రస్య విసర్జనమ్ 48

భార్యతో కలసి భోజనం చేయకూడదు. పైగా భార్య భోజనము చేస్తున్నప్పుడు, తుమ్ముచున్నప్పుడు, ఆవులిస్తున్నప్పుడు, కాళ్ళు చాచుకొని కూర్చున్నప్పుడు చూడకూడదు. అట్లే భార్య కండ్లకు కాటుక పెట్టుకొనుచున్నప్పుడు, అభ్యంగనం చేసికొనుచున్నప్పుడు, పైటలేక యున్నప్పుడు, ప్రసవించుచున్నప్పుడు తేజస్సును కోరు బ్రాహ్మణుడు చూడరాదు. అట్లే ఒకే వస్త్రం ధరించి, నగ్నంగాను స్నానము చేయరాదు. త్రోవలో, బూడిదయున్నచోట, ఆవులుండు కొట్టంలో మూత్రం చేయరాదు. అదే విధంగా నాగేటి చాలులో, నీటిలో, అగ్నిహోత్రానికై ఇటుకలు పరచిన ప్రదేశంలో, పర్వతంలో, పాడుబడ్డ గుడి, పుట్టలున్న చోట మలమూత్రాలు వదలకూడదు. ఇంకా వాయువు, అగ్ని, బ్రాహ్మణుడు, సూర్యుడు, నీరు, గోవు వీటిని చూస్తూ వాటికెదురుగా కూర్చుండి మలవిసర్జనం చేయరాదు.

తిరస్కృత్యోచ్చ రేత్కాష్ఠలోష్టపత్రతృణాదినా,
నియమ్య ప్రయతో వాచం సంవీతాంగో ऽవగుంఠితః. 49

మూత్రోచ్చారసముత్సర్గం దివా కుర్యాదుదఙ్ముఖః,
దక్షిణాభిముఖో రాత్రౌ సంధ్యయోశ్చ తాథా దివా 50

ఛాయాయామంధకారే వా రాత్రావహని వా ద్విజః,
యథా సుఖముఖః కుర్యాత్ప్రాణ బాధాభయేషు చ. 51

ప్రత్యగ్నిం ప్రతిసూర్యం చ ప్రతిసోమోదకద్విజాన్,
ప్రతిగాం ప్రతివాతం చ ప్రజ్ఞా నశ్యతి మేహతః 52

నేలను కొయ్యలు, మట్టి గడ్డలు, గడ్డి, ఆకులు మొదలగువాటిచే కప్పి తలకు గుడ్డను చుట్టుకొని మౌనంతో మలమూత్ర విసర్జన చేయవలెను. పగటిపూట ఉత్తరదిక్కునకు ముఖంపెట్టి, రాత్రిపూట దక్షిణదిశకు ముఖం పెట్టి సంధ్యాకాలములందు ఉత్తరాభిముఖుడై మలమూత్ర విసర్జన చేయవలెను. రాత్రులందు నీడకప్పుకొన్నప్పుడు, పగటిపూట నీడ, మంచు గప్పియున్నప్పుడు, దొంగలు, పులి మొదలగువాటిచే ప్రాణభయం కలిగినప్పుడు తన ఇష్టము వచ్చిన దిక్కుకు ముఖం పెట్టి మలమూత్ర విసర్జన చేయవచ్చును. అగ్ని

కెదురుగా, సూర్యుడు, చంద్రుడు, నీటి పట్టులు, బ్రాహ్మణులు, అవులు, గాలికి ఎదురుగా మలమూత్రములు విడుచు వానికి ప్రజ్ఞ నశిస్తుంది.

*నాగ్నిం ముఖేనోపధమేన్నగ్నాం నేక్షేత చస్త్రియమ్,*
*నామేధ్యం ప్రక్షిపేదగ్నౌ న చ పాదౌ ప్రతాపయేత్ 53*

*అధస్తాన్నోపదధ్యాచ్చ నచైనమభిలంఘయేత్,*
*న చైనం పాదతః కుర్యాన్న ప్రాణాబాధ మాచరేత్ 54*

*నాశ్నీయాత్సంధివేళాయాం న గచ్ఛేన్నాపి సంవిశేత్,*
*నచైవ ప్రలిఖేద్భూమిం నాత్మనోపహరేత్స్రజమ్ 55*

*నాప్సు మూత్రం పురీషం వా ష్ఠీవనం వా సముత్సృజేత్,*
*అమేధ్యలిప్తమన్యద్వా లోహితం వా విషాణి వా 56*

*నైకస్సుప్యేచ్ఛూన్య గేహే శయానం న ప్రబోధయేత్,*
*నోదక్యయాఽభిభాషేత యజ్ఞం గచ్ఛేన్న చావృతః 57*

నిప్పును నోటితో ఊదరాదు. నగ్నంగా నున్న స్త్రీలను చూడరాదు. మూత్రపురీషాద్య మేధ్య వస్తువులను అగ్నియందు వేయరాదు. అట్లే అరికాళ్ళనునిప్పులో కాచుకొనకూడదు. మంచం కింద అగ్నిని పెట్టుకొనరాదు. అట్లే అగ్నిపై నుండి దాటకూడదు. కాళ్ళవైపునిప్పును ఉంచుకొనకూడదు. ఇతరులను హింసించకూడదు. సంధ్యాకాలంలో తినరాదు. గ్రామాంతరానికి పోరాదు. నిద్రపోరాదు. అట్లే భూమిపైన కాలితో రాయకూడదు. తాను ధరించిన పుష్పమాలను తానే తీసివేయరాదు. నీటిలో మూత్రం గాని, మలంగాని ఉమ్మినిగాని, మలమంటిన వస్తువులను గాని, రక్తమును గాని, విషాన్ని గాని కలుపకూడదు. ఒంటరిగా ఇంటిలో పడుకొనకూడదు. తనకంటె పెద్దవాడు నిద్రపోతున్నప్పుడు అతనిని తట్టి లేపకూడదు. ముట్టయిన స్త్రీతో మాట్లాడకూడదు. అదే విధంగా తనను రమ్మని పిలువకపోతే ఋద్విజుడు యాగానికి పోకూడదు.

*అగ్న్యగారే గవాం గోష్ఠే బ్రాహ్మణానాం చ సన్నిధౌ,*
*స్వాధ్యాయే భోజనే చైవ దక్షిణం పాణిముద్ధరేత్ 58*

యాగశాలయందు, పసులకొట్టంలో, బ్రాహ్మణుల సమీపంలో, వేదాధ్యయన సమయంలో, భోజనసమయంలో కుడిచేతిని ఉత్తరీయానికి వెలుపలనుంచుకొనవలెను.

*న వారయేద్గాం ధయంతీం న చాచక్షీత కస్యచిత్,*
*న దివీంద్రాయుధం దృష్ట్వా కస్యచిద్దర్శయేద్బుధః 59*

*నాధార్మికే వసేద్గ్రామే న వ్యాధిబహులే భృశమ్,*
*నైకః ప్రపద్యేతాధ్వానం న చిరం పర్వతే వసేత్ 60*

*న శూద్రరాజ్యే నివసేన్నాధార్మికజనావృతే,*
*న పాషండిగణాక్రాంతే నోపసృష్టేఽంత్యజైర్నృభిః 61*

నీరు త్రాగుచున్న ఆవును, పాలుకుడుచుచున్న దూడను గాని నివారించరాదు.

ఒరుల దూడలు పాలు కుడుచుచున్నప్పుడు వారికి చెప్పరాదు. అట్లే ఇంద్రధనస్సునా కాశంలో జూచి దానినితరులకు చూపించరాదు. ధార్మికులు లేని గ్రామంలో, వ్యాధులు ప్రబలిన గ్రామంలో, చాలాకాలం పర్వతమందు నివసించ కూడదు. ఒంటరిగా ఊరికి వెళ్ళకూడదు. శూద్రుడేలు రాజ్యంలో ధార్మికజనంలేని రాజ్యంలో పాషండులు మొదలగువారున్న గ్రామంలో అంత్యజాతివారు విశేషంగా బాధపెట్టు గ్రామంలో నివసించకూడదు.

*న భుంజీతోద్ధృత స్నేహం నాతి సౌహిత్యమాచరేత్,*
*నాతిప్రగే నాతిసాయం న సాయం ప్రాత రాశితః 62*

*న కుర్వీత వృథాచేష్టాం న వార్యంజలినా పిబేత్,*
*నోత్సంగే భక్షయేద్భక్ష్యాన్న జాతు స్యాత్కుతూహలీ 63*

*న నృత్యేదథవా గాయేన్న వాదిత్రాణి వాదయేత్,*
*నాస్ఫోటేన్నచ క్ష్వేడేన్నచ రక్తో విరావయేత్ 64*

*న పాదౌ ధావయేత్కాంస్యే కదాచిదపి భాజనే,*
*న భిన్నభాండే భుంజీత న భావప్రతిదూషితే 65*

*ఉపానహౌ చ వాసశ్చ ధృతమన్యైర్న ధారయేత్,*
*ఉపవీతమలంకారం స్రజం కరక మేవ చ 66*

నూనె పూర్తిగా పిండివేసిన తెలకపిండిని (నూనెలో వేగించిన పదార్థాలను) తినకూడదు. కడుపుపూర్తిగా నిండునట్లు భుజించరాదు. సగం కడుపును పదార్థాలతోను, పావుభాగం నీటితోను నింపి, మిగిలిన పావుభాగాన్ని వాయు సంచారానికై వదలిపెట్టవలెను. పూర్తి ఉదయాన గాని, పూర్తి సాయంకాలాన గాని భోజనం చేయరాదు. పగటిపూట పూట కడుపునిండ తిన్నవాడు రాత్రిపూట తినకూడదు. వృధాగా ఏ పనులు చేయకూడదు. నీటిని దోసిలితో త్రాగకూడదు. భక్ష్యాలను (కుడుములు, దోసెలు మొదలగువానిని) తొడపై పెట్టుకొని తినరాదు. ప్రయోజనం లేనప్పుడు కుతూహలాన్ని ప్రదర్శింపకూడదు. అశాస్త్రీయమైన నృత్యాన్ని గాని గానాన్ని గాని చేయకూడదు. అట్లే అశాస్త్రీయముగా వాద్యాలు వాయించవద్దు. స్నేహపూర్వకంగానైనా భుజంపై తట్టరాదు. దంతాలు కన్పించునట్లు దగ్గరాదు. కావలెనని గాడిద యరుపులు మొదలగునవి చేయరాదు. కంచుపాత్రయందు పాదములను కడుగుకొనకూడదు. పగిలిన కుండలందు, మనసునకింపుగాని పాత్రల్లో తినకూడదు. ఇతరులుపయోగించిన పాదరక్షలు, వస్త్రాలను ధరించరాదు. అట్లే ఇతరులుపయోగించిన యజ్ఞోపవీతాలు అలంకారాలు, పూలదండలు, కమండలువు మొదలగువానిని ఉపయోగించరాదు.

*నావినీతైర్వ్రజేద్ధుర్యైర్న చ క్షుద్వ్యాధిపీడితైః*
*న భిన్న శృంగాక్షిఖురైర్న వాలధివిరూపితైః 67*

*వినీతైస్తు వ్రజేన్నిత్యమాశుగైర్లక్షణాన్వితైః*
*వర్ణ రూపోపసంపన్నైః ప్రతోదేనాతుదన్ భృశమ్ 68*

*బాలాతపః ప్రేతధూమో వర్జ్యం భిన్నం తథాఽఽసనం,*
*న ఛ్ఛింద్యాన్నఖలోమాని దంతైర్నోత్పాటయేన్నఖాన్ 69*

*న మృల్లోష్టం చమృద్నీయాన్న ఛ్ఛింద్యాత్కరజై స్తృణం,*
*న కర్మనిష్ఫలం కుర్యాన్నాయత్యామసుఖోదయమ్ 70*

తుంటరివి, మిక్కిలి యాకలి గలవి, కొమ్ములు విరిగినవి, గుడ్డివి, గిట్టలు విరిగినవి, తోకలేనివి అగు ఎడ్లు కట్టిన వాహనాలందు ప్రయాణం చేయకూడదు. బండికి కట్టిన ఎడ్లు సాధుస్వభావం కలవి, వడిగనడచునవి, మంచి లక్షణాలు కలవి, మంచి రంగు రూపం కలవి, మునిగోలతో పొడవకనే నడచునవి కావలెను. లేతఎండ, స్మశానంపైనుండి వచ్చు పొగ, విరిగిపోయిన ఆసనాన్ని వదలిపెట్టవలెను. గోళ్ళను దంతాలతో గొరికి తీయరాదు. గడ్డిని తుంచరాదు. నిష్ఫలమైన పనులు చేయరాదు. కష్టము కలిగించే పని చేయరాదు.

*లోష్టమర్దీ తృణచ్ఛేదీ నఖఖాదీ చ యో నరః*
*స వినాశం వ్రజత్యాశు సూచకోఽ శుచి రేవ చ. 71*

*న విగర్హ్య కథాం కుర్యాద్బహిర్మాల్యం న ధారయేత్,*
*గవాం చ యానం పృష్ఠేన సర్వథైవ విగర్హితమ్ 72*

*అద్వారేణ చ నాతీయాద్గ్రామం వా వేశ్మ వావృతమ్,*
*రాత్రౌ చ వృక్ష మూలాని దూరతః పరివర్జయేత్ 73*

*నాక్షైః క్రీడేత్కదాచిత్తు స్వయం నోపానహౌ హరేత్,*
*శయానస్థో న భుంజీత న పాణిస్థం న చాసనే. 74*

*సర్వం చ తిలసంబద్ధం నాద్యాదస్తమితే రవౌ,*
*న చ నగ్నశ్శయీతేహ న చోచ్ఛిష్టః క్వచిద్వ్రజేత్. 75*

*ఆర్ద్రపాదస్తు భుంజీత నార్ద్రపాదస్తు సంవిశేత్,*
*ఆర్ద్రపాదస్తు భుంజానో దీర్ఘమాయురవాప్నుయాత్ 76*

*అచక్షుర్విషయం దుర్గం న ప్రపద్యేత కర్హి చిత్,*
*న విణ్మూత్రముదీక్షేత న బాహుభ్యాం నదీం తరేత్ 77*

*అధితిష్ఠేన్న కేశాంస్తు న భస్మాస్థికపాలికాః,*
*న కార్పాసాస్థి న తుషాన్ దీర్ఘ మాయుర్జిజీవిషుః. 78*

పనిపాటలు లేక మట్టి ముద్దలను పగులగొట్టువాడు, గడ్డిని గోళ్లచే త్రుంచువాడు, గోళ్ళను తినువాడు, కొండెములు చెప్పువాడు, పరిశుద్ధంగా ఉండనివాడు వీరందరు తొందరగా నాశనమౌతారు. అనవసరమైన మాటలు మాట్లాడకూడదు. బయటకు తెలియునట్లు పూలదండలు ధరింపరాదు. గోవుల వీపుపై కూర్చుండి ప్రయాణం చేయుట మంచిదికాదు. నాల్గువైపుల ద్వారాలున్న గ్రామాన్ని గాని, ఇంటిని గాని తలుపులు మూసియున్నప్పుడు ఇతర పద్ధతులలో లోనికి ప్రవేశించుట దగనిపని. రాత్రిపూట చెట్ల

కింద పడుకొనకూడదు. ఎప్పుడు కూడ జూదమాడకూడదు. తన చెప్పులను చేత బట్టుకొని పోకూడదు. శయ్యపై పడుకొని తినకూడదు. చేతిలో అన్నం ముద్ద పెట్టుకొని కొద్దికొద్దిగా తినరాదు. ఆసనంపై కూర్చొని తినకూడదు. సూర్యుడస్తమించిన తరువాత నూవులు కలిసిన వస్తువులను వేటిని తినరాదు. నగ్నంగా పడుకొనకూడదు. ఎంగిలి చేతులతో ఎక్కడికి పోరాదు. కాళ్ళు కడుగుకొనగా తడిసిన పాదాలతో తినవలెను. కాని తడికాళ్ళతో నిద్రపోరాదు. తడికాళ్ళతో భోజనము చేయువాడు దీర్ఘాయుస్సును పొందుతాడు. చెట్లు చేమలతో నిండి చీకటిగా నుండు దుర్గమారణ్యాన్ని ప్రవేశింపకూడదు. మలమూత్రాలను విసర్జిస్తూ వాటిని చూడకూడదు. ఈత కొట్టుచు నదిని దాటకూడదు. దీర్ఘకాలం బ్రదుకగోరువాడు వెంట్రుకలు, బూడిద, ఎముకలు, చిల్లపెంకులు, దూది, పుల్లలు, ఊముక వీటిపై నిలువకూడదు.

*న సంవసేచ్చ పతితైర్న చాండాలైర్న పుల్కసైః*
*న మూర్ఖైర్నావలిప్తైశ్చ నాంత్యైర్నాంత్యావసాయిభిః 79*

*న శూద్రాయ మతిం దద్యాన్నోచ్ఛిష్టం న హవిష్కృతమ్,*
*న చాస్యోపదిశేద్ధర్మం న చాస్య వ్రతమాదిశేత్ 80*

*యో హ్యస్యధర్మ మాచష్టే యశ్చైవాదిశతి వ్రతమ్,*
*సోఽ సంవృతం నామ తమః సహ తేనైవ మజ్జతి 81*

భ్రష్టులతోను, చండాలురతోను, బానిసలతోను, మూర్ఖులతోను, ధనం మొదలైన కారణాల వల్ల గర్వించినవారితోను, చాకలి మొదలగువారితోను, నీచజాతులతోను ఒకచోట కూడియుండకూడదు. శూద్రునకు జ్ఞానోపదేశం చేయకూడదు. ఉచ్ఛిష్టాన్ని పెట్టకూడదు. అట్లే అతనికి ధర్మ విషయాలను ఉపదేశించకూడదు. వ్రతాలను చెప్పరాదు. శూద్రునకు ధర్మాన్ని గాని వ్రతాలనుగాని చెప్పితే అతడు అసంవృతమనే నరకానికి పోతాడు.

*న సంహతాభ్యాం పాణిభ్యాం కండూయేదాత్మనశ్శిరః,*
*న స్పృశేచ్చైతదుచ్ఛిష్టో నచ స్నాయాద్వినా తతః 82*

*కేశగ్రహాన్ ప్రహారాంశ్చ శిరస్యేతాన్ వివర్జయేత్,*
*శిరస్స్నాతశ్చ తైలేన నాంగం కించిదపి స్పృశేత్ 83*

రెండు చేతులతో తలగోకి కొనరాదు. భోజనం చేస్తూ శిరస్సును ముట్టుకొనవద్దు. అట్లే రోగపీడితుడు కాని సమయంలో శిరస్సును వదలి స్నానము చేయరాదు. అనగా ప్రతిదినము తలపైనుండి స్నానము చేయవలెను. కోపంతోనైనా జుట్టు పట్టుకొని తలపై కొట్టరాదు. శిరస్నానము చేసిన తరువాత మరల ఆ దినముననే నూనెతో శరీరమును తాకరాదు.

*న రాజ్ఞః ప్రతి గృహ్ణీయా దరాజన్య ప్రసూతతః,*
*సూనాచక్రధ్వజవతాం వేశేనైవ చ జీవతామ్ 84*

క్షత్రియవంశానికి చెందని రాజు దగ్గర ప్రతిగ్రహం తీసికొనవద్దు. జంతువులను

చంపి బ్రదుకు కసాయి వాని దగ్గర గానుగ పట్టువాని దగ్గర, మద్యం విక్రయించేవాని దగ్గర, వేశ్యల దగ్గర దానం తీసికొనకూడదు.

దశ సూనాసమం చక్రం దశ చక్రనమో ధ్వజః,
దశధ్వజసమో వేశో దశ వేశ సమో నృపః 85

దశసూనాసహస్రాణి యో వాహయతి సౌనికః
తేన తుల్యః స్మృతో రాజా ఘోరస్తస్య ప్రతిగ్రహః 86

పది వధ్యస్థానములవంటిది గానుగ నాడు ప్రదేశము. అట్లే మద్యమును విక్రయించు స్థలము పదిగానుగలనాడు ప్రదేశముల వంటిది. వేశ్య పది మద్య విక్రయస్థలముల వంటిది. రాజు పదివేశ్యలవంటి వాడు. పదివేల జంతువుల హింసించు కటికవానితో సమానుడు కావున రాజు దగ్గర దానమును స్వీకరింపరాదు.

*యో రాజ్ఞః ప్రతిగృహ్ణాతి లుబ్ధస్యోచ్ఛాస్త్రవర్తినః,*
*స ఫర్యాయేణ యాతీమాన్నరకానేక వింశతిమ్, 87*

*తామిస్రమంధతామిస్రం మహారౌరవరౌరవౌ,*
*నరకం కాలసూత్రం చ మహానరక మేవ చ 88*

*సంజీవనం మహావీచిం తపనం సంప్రతాపనమ్*
*సంహాతం చ సకాకోలం కుడ్మలం పూతిమృత్తికమ్ 89*

*లోహశంకుమృజీషం చ పంథానం శాల్మలీం నదీమ్,*
*అసిపత్రవనం చైవ లోహదారక మేవ చ. 90*

*ఏతద్విదంతో విద్వాంసో బ్రాహ్మణా బ్రహ్మవాదినః,*
*న రాజ్ఞః ప్రతిగృహ్ణంతి ప్రేత్య శ్రేయోభికాంక్షిణః 91*

లోభి, శాస్త్ర మర్యాదను అతిక్రమించే రాజు దగ్గర దానం స్వీకరించేవాడు తామిస్రము, అంధతామిస్రము, రౌరవం, మహారౌరవం, కాలసూత్రం, మహానరకం, సంజీవనం, మహావీచి, తపనం, సంప్రతాపనం, సంఘాతం, కాకోలం, కుడ్మలం, పూతి, మృత్తికం, లోహశంకువు, ఋజీషం, పంథానం, శాల్మలీనది, అసిపత్రవనం, లోహదారకం, అను ఇరువది యొక్క నరకాలను వరుసగా పొందుతాడు. అందువలన విద్వాంసులు, బ్రహ్మజ్ఞానమునెరిగిన బ్రాహ్మణులు తమ శ్రేయస్సును కోరుకొనుచు రాజుల దగ్గర దానాన్ని పుచ్చుకోకూడదు.

*బ్రాహ్మే ముహూర్తే బుధ్యేత ధర్మార్థౌ చానుచింతయేత్*
*కాయక్లేశాంశ్చ తన్మూలాన్ వేదతత్త్వార్థమేవ చ 92*

బ్రాహ్మణుడు ధర్మమును, అర్థమును చింతిసూ బ్రాహ్మముహూర్తమున నిద్రలేవవలెను. అట్లే ఆ సమయంలో ధర్మార్థచింతనవల్ల కలుగు దేహకష్టాలను, వేదతత్వాన్ని, వేదార్థాన్ని గురించి చింతించవలెను.

ఉత్థాయావశ్యకం కృత్వా కృతశౌచస్సమాహితః,
పూర్వాం సంధ్యాం జపం స్తిష్ఠేత్స్వకాలే చాపరాం చిరమ్ 93

ఋషయో దీర్ఘసంధ్యత్వాద్దీర్ఘమాయురవాప్నుయుః,
ప్రజ్ఞా యశశ్చ కీర్తిం చ బ్రహ్మవర్చసమేవ చ 94

బ్రాహ్మీముహూర్తాన లేచి నిత్య కృత్యాలనన్నిటిని తీర్చుకొని, స్నానాదులవలన పరిశుద్ధుడై నియమంతో ప్రాతఃసంధ్యావందనాన్ని చేసి గాయత్రీ మంత్రాన్ని నిలుచుండి జపం చేయాలి. సాయంసంధ్యను సాయంకాలాన ప్రారంభించి నక్షత్రాలు ఉదయించువరకు గాయత్రీమంత్రజపాన్ని చేయుచుండవలెను. ఋషులు సంధ్యావందనాన్ని ఎక్కువ సమయము అనుష్ఠించినందువల్లనే వారు దీర్ఘాయుస్సును, ప్రజ్ఞను, యశస్సును, కీర్తిని, బ్రహ్మవర్చస్సును పొందగలిగిరి.

శ్రావణ్యాం ప్రౌష్ఠపద్యాం వాఽ ప్యుపాకృత్య యథావిధి,
యుక్తశ్ఛందాన్యధీయీత మాసాన్ విప్రోఽర్ధపంచమాన్ 95

శ్రావణపౌర్ణమినాడు లేక భాద్రపద పౌర్ణిమనాడు తమ తమ గృహ్యసూత్రవిధానాన్ని అనుసరించి ఉపాకర్మను జరిపించి, నాలుగున్నరనెలలు పట్టుదలతో వేదాధ్యయనం చేయవలెను.

పుష్యే తు ఛందసాం కుర్యాద్బహిరుత్సర్జనం ద్విజః,
మాఘశుక్లస్య వా ప్రాప్తే పూర్వాహ్ణే ప్రథమేఽహని 96

యథాశాస్త్రం తు కృత్వైవముత్సర్గం ఛందసాం బహిః,
విరమేత్పక్షిణీం రాత్రిం తదేవైకమహర్నిశమ్. 97

అత ఊర్ధ్వం తు ఛందాంసి శుక్లేషు నియతః పఠేత్,
వేదాంగాని చ సర్వాణి కృష్ణపక్షేషు సంపఠేత్ 98

పుష్యశుద్ధపాడ్యమినాడైనను, మాఘశుద్ధపాడ్యమి నాడైనను పూర్వాహ్ణకాలమందు ఊరి బయటకు పోయి తమతమ గృహ్యసూత్రోక్త విధానంతో ఉత్సర్జనమనే కార్యాన్ని చేయవలెను. ఈ విధంగా శాస్త్రమర్యాదననుసరించి ఊరి బయటకు వెళ్ళి వేదాలకు ఉత్సర్జన చేసిన తరువాత మూడు దినాలు గాని, దానిలో సగం తొంభైఘడియలు కాని లేకపోయినచో ఒక దినము సంపూర్ణముగాకాని వేదాధ్యయనం చేయకూడదు. ఆ తర్వాత శుక్లపక్షంలో మంత్రబ్రాహ్మణరూపమైన వేదాన్ని నియమంతో పఠించవలెను. అట్లే కృష్ణపక్షాలలో వేదాంగాలైన శిక్షా, వ్యాకరణాదులను తప్పక చదువవలెను.

నావిస్పష్టమధీయీత న శూద్రజనసన్నిధౌ,
న నిశాంతే పరిశ్రాంతో బ్రహ్మాధీత్య పునః స్వపేత్ 99

యథోదితేన విధినా నిత్యం ఛందస్కృతం పఠేత్,
బ్రహ్మ ఛందస్కృతం చైవ ద్విజో యుక్తో హ్యనాపది 100

వేదాన్ని అస్పష్టంగా చదువరాదు. శూద్రులముందు చదువకూడదు. బ్రాహ్మముహూర్తంలో లేచి వేదాలు చదువుతూ శ్రమ పొంది తిరిగి నిద్రపోవుటకూడ తగనిపని. యథోక్తమైన విధిననుసరించి

బ్రాహ్మణుడు ప్రతిదినం గాయత్ర్యాదిఛందస్సులతో నున్న మంత్రభాగాన్ని పఠించాలి. కర్మలు చేస్తున్నప్పుడు మాత్రం గాయత్ర్యాది చందోసహితమైన బ్రాహ్మణభాగాన్ని చదువవలెను.

*ఇమాన్నిత్యమనధ్యా యానధీయానో వివర్జయేత్,*
*అధ్యాపనం చ కుర్వాణః శిష్యాణాం విధిపూర్వకమ్ 101*

అనధ్యయనదినములు :- వేదములనధ్యాపనము చేయు గురువు, వేదాధ్యయనము చేయు శిష్యుడు వీరిద్దరు వేదాధ్యయన విషయమున ఈ క్రింది అనధ్యయన దినములను పాటించాలి.

*కర్ణశ్రవేzనిలే రాత్రౌ దివా పాంసుసమూహనే,*
*ఏతౌ వర్షా స్వనధ్యాయా వధ్యాయజ్ఞాః ప్రచక్షతే 102*

*విద్యుత్ స్తనితవర్షేషు మహోల్కానాం చ సంప్లవే,*
*ఆకాలిక మనధ్యాయమేతేషు మనురబ్రవీత్ 103*

*ఏతాం స్త్వభ్యుదితాన్ విద్యాద్యదా ప్రాదుష్కృతాగ్నిషు*
*తదా విద్యాదనధ్యాయమనృతౌ చాభ్రదర్శనే 104*

*నిర్ఘాతే భూమిచలనే జ్యోతిషాం చోపసర్జనే,*
*ఏతానా కాలికాన్ విద్యాదనధ్యాయానృతావపి 105*

*ప్రాదుష్కృతేష్వగ్నిషు తు విద్యుత్ స్తనితనిస్వనే,*
*సజ్యోతిస్స్యాదనధ్యాయః శేషే రాత్రౌ యథా దివా. 106*

వర్షకాలంలో రాత్రి సమయంలో హోరని గాలి వీస్తున్నప్పుడు, దుమ్ము దట్టంగా గ్రమ్ముకొను పగటిపూట అధ్యయనం చేయకూడదు. వర్షకాలంలో ఈ దినముల నధ్యయనాలు. అట్లే ఉరుములు, మెరుపులతో వాన వస్తున్నప్పుడు, అచ్చటచ్చట తోకచుక్కలు పడినప్పుడు తెల్లవారి కూడ వేదాన్ని అధ్యయనం చేయకూడదని మనువు చెప్పినాడు. వర్షకాలంలో సాయంసమయంలో హోమం చేస్తున్నపుడు, ఉరుములు, మెరుపులు మొదలైనవి విన్పిస్తే కన్పిస్తే అనధ్యయనం కాని తక్కిన ఋతువులందు అనధ్యయనం లేదు. తక్కిన ఋతువులందు సాయంకాలం అగ్ని కార్యం ప్రారంభించినపుడు మేఘాలు కన్పించినా అనధ్యయనంగా చెప్పవచ్చును. వర్షర్తువు కాని సమయాలలో పిడుగుపడినా భూమి కంపించినా, నక్షత్రాలు రాలినా అనధ్యయన మౌతుంది. వీటిని అకాలికమైన అనధ్యయనాలని అంటారు. సాయం ప్రాతః సంధ్యలయందు హోమాగ్నిని జ్వలింపజేసిన సమయంలో ఉరుములు మెరుపులు వస్తే దానిని సజ్యోతిరనధ్యయనమని అంటారు. అనగా వెలుతురున్నంతవరకు అనధ్యయనం. అట్లుకాక రాత్రి సమయంలో కూడ పగటి కాలంలో ఉన్నట్లే ఉరుములు మెరుపులతో పాటు వర్షం వస్తే ఆ నాడంతా అధ్యయనమే ఔతుంది.

*నిత్యానధ్యాయ ఏవ స్యాద్గ్రామేషు నగరేషు చ,*
*ధర్మనైపుణ్యకామానాం పూతిగంధే చ సర్వదా. 107*

*అంతర్గతశవే గ్రామే వృషలస్య చ సన్నిధౌ,*
*అనధ్యాయో రుద్యమానే సమవాయే జనస్య చ. 108*

*ఉదకే మధ్య రాత్రే చ విణ్మూత్రస్య విసర్జనే*
*ఉచ్ఛిష్టః శ్రాద్ధభుక్చైవ మనసాఽపి న చింతయేత్ 109*

*ప్రతిగృహ్య ద్విజో విద్వానేకోద్ధిష్టస్య కేతనమ్,*
*త్ర్యహం నకీర్తయేద్బ్రహ్మ రాజ్ఞో రాహోశ్చ సూతకే 110*

*యావదేకానుదిష్టస్య గంధో లేపశ్చ తిష్ఠతి,*
*విప్రస్య విదుషో దేహే తావద్బ్రహ్మ న కీర్తయేత్ 111*

*శయానః ప్రౌఢ పాదశ్చ కృత్వా చైవావసక్థికామ్,*
*నాధీయీతామిషం జగ్ధ్వా సూతకాన్నాద్యమేవ చ. 112*

*నీహారే బాణశబ్దే చ సంధ్యయోరేవ చోభయోః,*
*అమావాస్యాచతుర్దశ్యోః పౌర్ణమాస్యష్టకాసు చ 113*

*అమావాస్యా గురుం హంతి శిష్యం హంతి చతుర్దశీ,*
*బ్రహ్మాష్ట కాపౌర్ణమాస్యౌ తస్మాత్తాః పరివర్జయేత్. 114*

నిపుణత కలిగి, మిక్కిలి ధర్మాన్ని కోరు శిష్యుని ధర్మ నైపుణ్యకాముడని అంటారు. అట్టి వానికి తానున్న గ్రామంలో గాని నగరంలోగాని దుర్వాసన వ్యాపించియుంటే ఆ దుర్వాసన తగ్గే వరకు అనధ్యయనముంటుంది. దానిని నిత్యానధ్యయనమని అంటారు. ఊరిలో శవమున్నంతవరకు, అధార్మికులు తమ సమీపంలో ఉన్నంతవరకు, గుంపుగా జనులు ఏడుస్తున్నంతవరకు శిష్యునకు అనధ్యయనం, నీటి నడుమ నున్నప్పుడు, మధ్యరాత్రి సమయంలో, మలమూత్రాలు వదలుచున్నప్పుడు, ఎంగిలితో నున్నప్పుడు, శ్రాద్ధానికై నియంత్రణ చేయబడ్డప్పుడు వేదమంత్రాలను మనస్సుతోనైనను చింతింపరాదు. ఏకోద్ధిష్టానికై నిమంత్రితుడైనప్పుడు రాజుకు సంతానం కలిగినప్పుడు, సూర్యచంద్రులకు గ్రహణమేర్పడినప్పుడు మూడు దినములవరకు వేదమునధ్యయనము చేయకూడదు. ఏకోద్ధిష్టంకొరకు నిమంత్రితుడై నప్పుడు అతని శరీరంలో కుంకుమాదుల గంధ లేపనం ఎంతవరకుండునో అంతవరకు మూడు దినాలు దాటినా విద్వాంసుడైన బ్రాహ్మణుడు వేదం చదువరాదు. శయ్యపై పడుకొని, ఎత్తైన పీటపై కాళ్ళుపెట్టుకొని, నడుమునకు మోకాళ్ళకు బట్టకట్టుకొని, మాంసం తిని, జాతాశౌచ, మృతాశౌచుల ఇంట అన్నం తిని వేదాన్ని అధ్యయనం చేయరాదు. మంచు గమ్మినప్పుడు, బాణాల ధ్వని వినిపించినపుడు, సాయం పాతస్సంధ్యాకాలములందు, అమావాస్యాచతుర్దశులందు, పౌర్ణమీ, అష్టమీ తిథులందు వేదాధ్యయనం చేయరాదు. అమావాస్యనాడు వేదాధ్యయనం చేస్తే గురువు చనిపోతాడు. చతుర్దశినాడు వేదాధ్యయనం చేస్తే శిష్యుడు మరణిస్తాడు. అష్టమి పౌర్ణమాసీతిథులందు అధ్యయనం చేస్తే వేదమే నశిస్తుంది. కావున పై అనధ్యయన దివసములందు వేదాధ్యయనం చేయకూడదు.

*పాంసువర్షే దిశాం దాహే గోమాయువిరుతే తథా,*
*శ్వఖరోష్ట్రే చ రువతి పఙ్క్తౌ చ న పఠేద్ద్విజః 115*

*నాధీయీత శ్మశానాంతే గ్రామంతే గో వ్రజేఽపి వా,*
*వసిత్వా మైథునం వాసః శ్రాద్ధికం ప్రతిగృహ్య చ. 116*

*ప్రాణి వా యదివాzప్రాణి యత్కించిచ్ఛ్రాద్ధికం భవేత్,*
*తదాలభ్యాప్యనధ్యాయః పాణ్యాస్యో హి ద్విజః స్మృతః 117*
*చోరైరుపద్రుతే గ్రామే సంభ్రమే చాగ్నికారితే,*
*ఆకాలిక మనధ్యాయం విద్యాత్సర్వాద్భుతేషు చ. 118*

దుమ్ము గురిసినపుడు, దిక్కులు మండుచున్నప్పుడు, నక్కలు కూసినప్పుడు, కుక్కలు, గాడిదలు, ఒంటెలు అల్లరి చేస్తున్నపుడు, చాలామంది యున్నప్పుడు వేదాన్ని పఠించకూడదు. శ్మశాన సమీపంలో, గ్రామ సమీపంలో, పసులకొట్టంలో, స్త్రీ సంపర్కం చేసిన వస్త్రాన్ని ధరించి, శ్రాద్ధాన్ని భుజించి వేదాధ్యయనం చేయకూడదు. శ్రాద్ధంలో ప్రాణం గల గోవులు మొదలగువానిని, ప్రాణం లేని వస్త్రాలు మొదలైన వాటిని దానంగా స్వీకరించిన నాడు వేదాధ్యయనం చేయరాదు. బ్రాహ్మణునకు చేయి కూడ నోరువంటిది కావున దానం తీసికొన్న దినంలో అధ్యయనం చేయరాదు. అట్లే గ్రామంలో దొంగలు పడ్డప్పుడు, అగ్నివల్ల ఇండ్లు కాలిపోయి ఊరంతా సంభ్రమంతోనున్నప్పుడు, అనేక విధములైన వింతలు కలిగినపుడు ఆ దినము మరునాడా వేళవరకు ఆకాలికమను అనధ్యయనం చేయదగును.

*ఉపాకర్మణి చోత్సర్గే త్రిరాత్రం క్షపణం స్మృతమ్,*
*అష్టకాను త్వహోరాత్రమృత్యంతాను చ రాత్రిషు 119*
*నాధీయీతాశ్వమారూఢో న వృక్షం న చ హస్తినమ్,*
*న నావం న ఖరం నోష్ట్రం నేరిణస్థో న యానగః 120*
*న వివాదే న కలహే న సేనాయాం న సంగరే,*
*న భుక్తమాత్రే నాజీర్ణే న వమిత్వా న సూతకే. 121*
*అతిథిం చాననుజ్ఞాప్య మారుతే వాతి వా భృశం,*
*రుధిరే చ స్రుతే గాత్రాచ్ఛస్త్రేణ చ పరీక్షతే 122*

ఉపాకర్మ జరిపించిన తరువాత, పుష్యమాఘమాసములందుత్సర్జనవ్రతాన్ని ఆచరించాలి. తరువాత మూడు దినములనధ్యాయములగుచున్నవి. ఆశ్వయుజ పౌర్ణమి తరువాతి మూడు కృష్ణాష్టములందు ఒకదినము (అహోరాత్రము) చైత్రము, ఆషాఢము, ఆశ్వయుజము, పుష్యమాసము ఈనెలల మాస సంక్రమణములందు, రాత్రులందు అనధ్యయనం చేయవలెను. గుఱ్ఱమునెక్కి వేదాధ్యయనం చేయకూడదు. అట్లే చెట్లు, ఏనుగు, నౌక, గాడిద, ఒంటె నెక్కి వేదాధ్యయనం చేయకూడదు. చవిటినేలపై నున్నప్పుడు బండిలో ప్రయాణము చేస్తున్నప్పుడు వేదాధ్యయనం చేయకూడదు. వివాదాలు, కలహాలు జరుగుతున్నప్పుడు, యుద్ధం జరుగుతున్నప్పుడు,భోజనం చేసిన వెంటనే, అజీర్ణంగా

ఉన్నప్పుడు, వాంతి చేసి కొన్నప్పుడు, జాతాశౌచ మృతాశౌచములందు వేదాధ్యయనం చేయకూడదు. నేనధ్యయనం చేసెదనని అతిథి దగ్గర అనుజ్ఞ తీసికొనకపోయినచో , గాలి ఎక్కువగా వీస్తున్నప్పుడు, దేహంనుండి రక్తం గారుతున్నప్పుడు, కత్తితో గాయమై రక్తము కారకపోయినా నాడు అనధ్యయనమే.

*సామధ్వనావృగ్యజుషీ నాధీయీత కదాచన,*
*వేదస్యాధీత్య వాప్యంత మారణ్యకమధీత్య చ. 123*

*ఋగ్వేదో దేవదైవత్యో యజుర్వేదస్తు మానుషః*
*సామవేదః స్మృతః పిత్ర్య స్తస్మాత్తస్యాశుచిర్ధ్వనిః 124*

*ఏతద్విదంతో విద్వాంసస్త్రయీనిష్కర్షమన్వహమ్,*
*క్రమతః పూర్వమభ్యస్య పశ్చాద్వేదమధీయతే 125*

*పశుమండూకమార్జారశ్వ సర్పనకులాఖుభిః,*
*అంతరాగమనే విద్యాదనధ్యాయమహర్నిశమ్ 126*

సామవేదాన్ని చదువుతున్నపుడు, ఋగ్వేదాన్ని యజుర్వేదాన్ని అధ్యయనం చేయకూడదు. వేదమునంతయు అధ్యయనం చేసిన తరువాత అరణ్యకాన్నంతా అధ్యయనం చేసినతరువాత మరల వేదారణ్యకముల నధ్యయనం చేయరాదు. ఋగ్వేదానికి దేవతలు, యజుర్వేదమునకు మానవులు, సామవేదమునకు పితృదేవతలు దేవతలు కావున సామవేద ధ్వనియశుచియైనది. విద్వాంసులకు ఈ విషయం తెలియును కావున బ్రహ్మయజ్ఞంలో ఋగ్యజుస్సామవేదసాముల సారభూతమైన ఓంకారము, వ్యాహృతులు, సావిత్రి అనువానిని క్రమముగా అభ్యసించి వేదాధ్యయనం చేస్తున్నారు. పశువులు, కప్పలు, పిల్లి, కుక్క, పాము, ముంగిస, ఎలుక, గురు శిష్యుల మధ్యనుండి పోయినచో ఆ దినమంతయు అనధ్యయనమే.

*ద్వావేష వరయేన్నిత్యమనధ్యాయౌ ప్రయత్నతః,*
*స్వాధ్యాయభూమిం చాశుద్ధామాత్మానం చాశుచిం ద్విజః 127*

విద్యా నైపుణ్యాన్ని కోరుకొనే శిష్యుడు స్వాధ్యాయం చేయు భూమి అపవిత్రమైనప్పుడు, తాను అపవిత్రమైనప్పుడు ఈ రెండు సమయములందే అనధ్యయనాన్ని పాటించాలి.

**సామాన్యవిధులు :-**

*అమావాస్యామష్టమీం చ పౌర్ణమాసీం చతుర్దశీమ్,*
*బ్రహ్మచారీ భవేన్నిత్యమప్యృతౌ స్నాతకో ద్విజః 128*

*న స్నానమాచరేద్భుక్త్వా నాతురో న మహానిశి,*
*న వాసోభిస్సహాజస్రం నావిజ్ఞాతే జలాశయే 129*

*దేవతానాం గురో రాజ్ఞః స్నాత కాచార్యయో స్తథా,*
*నాక్రామేత్కామతశ్ఛాయాం బభ్రుణో దీక్షితస్య చ 130*

*మధ్యందినేఽర్ధరాత్రే చ శ్రాద్ధం భుక్త్వా చ సామిషమ్,*
*సంధ్యయో రుభయోశ్చైవ న సేవేత చతుష్పథమ్ 131*

*ఉద్వర్తనమపస్నానం విణ్మూత్రే రక్తమేవ చ,*
*శ్లేష్మ నిష్ఠ్యూత వాంతాని నాధితిష్ఠేత్తు కామతః 132*

*వైరిణం నోపసేవేత సహాయం చైవ వైరిణః,*
*అధార్మికం తస్కరం చ పరస్యైవ చ యోషితమ్ 133*

వ్రతస్నాతకుడైన బ్రాహ్మణుడు అమావాస్యనాడు, అష్టమినాడు, పూర్ణిమా, చతుర్దశితిథులందును, భార్య ముట్టైయున్నప్పుడును బ్రహ్మచారియై భార్యాసంగము చేయకూడదు. తిన్న తరువాత స్నానమాచరించకూడదు. జ్వరపీడితుడైనప్పుడు స్నానం చేయరాదు. మధ్యరాత్రి వేళ స్నానం చేయకూడదు. అనేక వస్త్రములతో స్నానం చేయరాదు. అట్లే లోతు తెలియని మడుగులో సైతం స్నానం చేయరాదు. దేవతాప్రతిమల యొక్క, గురువుయొక్క, రాజుయొక్క, విద్యావ్రతస్నాతకుని యొక్క, ఆచార్యుని యొక్క, యజ్ఞదీక్ష వహించిన వారి యొక్క నీడను బుద్ధిపూర్వకంగా తొక్కరాదు. దాటరాదు. మిట్ట మధ్యాహ్నసమయాన, అర్ధరాత్రిపూట, సాయంప్రాతఃస్సంధ్యలలో, శ్రాద్ధభోజనం తిన్న తరువాత ఎక్కువకాలము, నాలుగు దారులు కలిసే కూడలియందుండరాదు. నూరిన ఇప్పపిండి మొదలగు నలుగుపిండిని, స్నానము చేసిన నీటిని, మలమూత్రాలను, రక్తాన్ని, శ్లేషాన్ని, వాంతిచేసికొన్న దానిని, ఉమ్మివేసిన దానిని బుద్ధిపూర్వకంగా తొక్కరాదు. శత్రువును, శత్రువునకు సహాయం చేసే వానిని, ధార్మికుడు కాని వానిని, దొంగను, ఇతరుల భార్యను సేవించకూడదు.

*నహీదృశమనాయుష్యం లోకే కించన విద్యతే,*
*యాదృశం పురుషస్యేహ పరదారోపసేవనమ్ 134*

*క్షత్రియం చైవ సర్పం చ బ్రాహ్మణం చ బహుశ్రుతమ్,*
*నావమన్యేత వై భూష్ణుః కృశానపి కదాచన 135*

*ఏతత్త్రయం హిపురుషం నిర్దహేదవమానితమ్,*
*తస్మాదేతత్త్రయం నిత్యం నావమన్యేత బుద్ధిమాన్ 136*

*నాత్మానమవమన్యేత పూర్వాభి రసమృద్ధిభిః*
*ఆమృత్యోః శ్రియ మన్విచ్ఛేన్నైనాం మన్యేత దుర్లభామ్ 137*

పురుషుని పరభార్యను సేవించుట ఎంతటి ఆయుక్షీణాన్ని చేస్తుందో ఆ విధంగా ఆయుక్షీణాన్ని కలిగించేది ఇంకొకటి లోకంలో కనిపించదు. క్షత్రియుని, సర్పాన్ని, విద్వాంసుడైన బ్రాహ్మణుని, తాను రిక్త స్థితియందున్నను ఎప్పుడు కూడ అవమానించవద్దు.

పై ముగ్గురుని అవమానించినచో అవమానించినవానిని వారు దహించి వేస్తారు కావున బుద్ధిమంతుడు వీరినెన్నడును అవమానము చేయకూడదు. తనకు జరిగిన కష్టాలను చింతిస్తూ తన్ను తాను అవమానించుకొనకూడదు. సంపద దుర్లభమైంది కాదు కావున బ్రతికి యున్నంతవరకు ధనాన్ని సంపాదించుటకు ప్రయత్నించవలెను.

*సత్యం బ్రూయా త్ప్రియం బ్రూయా న్న బ్రూయా త్సత్య మప్రియమ్,*
*ప్రియు చ నానృతం బ్రూయాదేష ధర్మస్సనాతనః 138*

*భద్రం భద్ర మితి బ్రూయాద్భద్రమిత్యేవ వా వదేత్,*
*శుష్కవైరం వివాదం చ న కుర్యాత్కేన చిత్సహ 139*

*నాతికల్యం నాతిసాయం నాతి మధ్యం దినే స్థితే,*
*నాజ్ఞాతేన సమం గచ్ఛేన్నైకో న వృషలై స్సహ 140*

*హీనాంగానతిరిక్తాంగాన్ విద్యాహీనాన్ వయోధికాన్,*
*రూపద్రవ్యవిహీనాంశ్చ జాతిహీనాంశ్చ నాక్షిపేత్ 141*

సత్యాన్నే పలుకవలెను. ప్రియమైన మాటలు పలుకవలెను. కాని ఎవరికిని రుచించని సత్యమును మాత్రము ఎప్పుడు పలుకకూడదు. ప్రియమైన వాక్కు కూడ అబద్ధమైనది కారాదు. ఇది సనాతన ధర్మము. అమంగళకరమైన మాటలెప్పుడు పలుకకూడదు. వాటిని సహితము మంగళమనే పలుకవలెను. ఒకరితో వ్యర్థముగా తగవులాడుట, శత్రుత్వముపెట్టు కొనుట అనునది తగదు. కడు వేకువ జామునను, ప్రదోష సమయమునను, రెండుజాములప్పుడును, కులశీలము లెరుగనివారితో ఒంటరిగా ప్రయాణము చేయకూడదు. అంగహీనులను, అధికాంగులను, వయసు చెల్లినవారిని, రూపము, ధనము లేనివారిని, తక్కువ కులము వారిని అవమానపరచవద్దు.

*న స్పృశేత్పాణినోచ్ఛిష్టో విప్రో గోబ్రాహ్మణానలాన్,*
*న చాపి పశ్యేదశుచిస్సుస్థో జ్యోతిర్గణాన్ దివి 142*

*స్పృష్ట్వైతానశుచిర్నిత్య మద్భిః ప్రాణానుపస్పృశేత్,*
*గాత్రాణి చైవ సర్వాణి నాభిం పాణితలేన తు 143*

*అనాతురః స్వాని ఖాని న స్పృ శేదనిమి త్తతః,*
*రోమాణి చ రహస్యాని సర్వాణ్యేవ వివర్జయేత్ 144*

ఎంగిలి చేతితో బ్రాహ్మణుడు ఆవును, అగ్నిని, ఇంకొక బ్రాహ్మణుని తగలకూడదు. అట్లే ఆరోగ్యముతో నుండి పవిత్రుడు కాక ఆకాశమునందున్న సూర్య చంద్రాది గ్రహములను చూడరాదు. బ్రాహ్మణుడొకవేళ అపవిత్రుడుగా నుండి గోవు మొదలగు వానిని తాకినచో అచమనము చేసి చేతిలో నీళ్ళు పోసికొని, చక్షురాది ఇంద్రియములను, తల, భుజములు, పాదములు మొదలగువాటిని, తన బొడ్డును ముట్టుకొనవలెను. రోగములేని సమయమున, కారణమేమి లేని సందర్భమున తన ఇంద్రియములను తాకరాదు.

*మంగాళాచారయుక్తస్స్యాత్ ప్రయతాత్మా జితేంద్రియః,*
*జపేచ్ఛ జుహుయాచ్చైవ నిత్యమగ్ని మతంద్రితః 145*

*మంగళాచారయుక్తానాం నిత్యం చ ప్రయతాత్మనామ్,*
*జపతాం జుహ్వతాం చైవ వినిపాతో న విద్యతే 146*

బ్రాహ్మణుడు నిర్మలుడు జితేంద్రియుడై గురు సేవ మొదలగు మంచియాచారములు కలిగి అలసట లేక గాయత్రీజపము, అగ్నిహోత్రము వంటి వానిని ఎల్లప్పుడు చేయవలెను. ఎల్లప్పుడు నిర్మలుడైయుండి సదాచారములననుష్ఠింపుచు గాయత్రి జపము చేయుచు హోమములు చేయువానికి మానవుల వలన, దైవము వలన ఎటువంటి ఉపద్రవములు కలుగనేరవు.

*వేదమేవాభ్యసేన్నిత్యం యథాకాల మతంద్రితః,*
*తం హ్యస్యాహుః పరం ధర్మ ముపధర్మోऽన్య ఉచ్యతే 147*

*వేదాభ్యాసేన సతతం శౌచేన తపసైవ చ,*
*అద్రోహేణ చ భూతానాం జాతింస్మరతి పౌర్వికీమ్ 148*

*పౌర్వికీం సంస్మరన్ జాతిం బ్రహ్మైవాభ్యసతే పునః,*
*బ్రహ్మాభ్యాసేన చాజస్ర మనంతం సుఖమశ్నుతే 149*

*సావిత్రాన్ శాంతిహోమాంశ్చ కుర్యాత్పర్వసు నిత్యశః,*
*పితౄంశ్చైవాష్టకాస్వర్చేన్నిత్యమన్వష్టకాసు చ, 150*

బ్రాహ్మణుడు ప్రతి దినము అలసట పెట్టు కొనక ఓంకారము, వ్యాహృతులు, గాయత్రి మొదగు మంత్రములున్న వేదమును చదువుచుండవలెను. వేదాధ్యయనమే బ్రాహ్మణుని ధర్మమని అందురు. వేదాధ్యయనము చేయనిచో ఆ బ్రాహ్మణుడు అధర్మమున నున్నవాడగును. బ్రాహ్మణుడు ఎల్లప్పుడు వేదమునభ్యసించుచు, శుచిగా ఉండి తపమాచరించుచున్నందు వలన తన పూర్వ జన్మను స్మరించుకొనగలుగుచున్నాడు. ఆ పూర్వజన్మ స్మరణవలన తిరిగి అతడు వేదమునే అభ్యసించును. వేదాభ్యాసము వలన అతడు నిరంతరము సుఖమును పొందజాలును. పర్వదినములందు సావిత్రీ దేవతాకములైన హోమము, అనిష్టమును తొలగించు శాంతి హోమములను తప్పక చేయవలెను ఆశ్వయుజకృష్ణాష్టమి మొదలు మూడు కృష్ణాష్టములందు అష్టకములనే శ్రాద్ధముల చేతను, ఆ మాసములందలి కృష్ణనవములందు అన్వష్టకశ్రాద్ధములను చేయవలెను.

*దూరాదావసథాన్మూత్రం దూరాత్పాదావసేచనమ్,,*
*ఉచ్ఛిష్టాన్నం నిషేకం చ దూరాదేవ సమాచరేత్ 151*

ఇంటికి చాలా దూరమున పురీష మూత్రములను చేయవలెను. అట్లే కాళ్ళు కడుగుకొనవలెను. ఉచ్ఛిష్టము, నిషేకములను ఇంటికి దూరముననే చేయుట తగినది.

*మైత్రం ప్రసాధనం స్నానం దంతధావనమంజనమ్,*
*పూర్వాహ్ణ ఏవ కుర్వీత దేవతానాం చ పూజనమ్ 152*

*దైవతాన్యభిగచ్ఛేత్తు ధార్మికాంశ్చ ద్విజోత్తమాన్,*
*ఈశ్వరం చైవ రక్షార్థం గురూనేవ చ పర్వసు 153*

మల విసర్జనము, దేహాలంకారము, స్నానము, దంత ధావనము, కాటుక పెట్టుకొనుట, దేవతార్చనము అను క్రియలన్నిటిని ఉదయమునందే చేయవలెను. అమావాస్యాది పర్వదినములందు ప్రతిమా రూపముననున్న దేవతలను చూచుటకు పోవలెను. ధర్మ పరులైన బ్రాహ్మణోత్తములను తన రక్షణకై ఉన్న రాజును, తల్లిదండ్రులు మొదలగు పెద్దలను చూచుటకు పోవలెను.

*అభివాదయేద్వృద్ధాంశ్చ దద్యాచ్చైవాసనం స్వకమ్,*
*కృతాంజలిరుపాసీత గచ్ఛతః పృష్ఠతోఽన్వియాత్ 154*

*శ్రుతిస్మృత్యుదితం సమ్యక్ నిబద్ధం స్వేషు కర్మసు,*
*ధర్మమూలం నిషేవేత సదాచారమతంద్రితః 155*

*ఆచారాల్లభతే హ్యాయురాచారాదీప్సితాః ప్రజాః,*
*ఆచారాద్ధనమక్షయ్యమాచారో హంత్యలక్షణం 156*

పెద్దలు ఇంటికి వచ్చినప్పుడు వారికి నమస్కారము చేయవలెను అట్లే తాను కూర్చుండు ఆసనమును వారికి ఈయవలెను. వినయముతో వారిని సేవింపవలెను. పెద్దలు వెళ్ళిపోవుచున్నప్పుడు చేతులు జోడించుకొని వారిని సాగనంపవలెను. శృతులలో స్మృతులలో చెప్పబడినది, స్వకర్మలకు అంగముగా చెప్పబడినది, ధర్మమునకు కారణమైన సదాచారమును నియమ నిష్ఠలతో పాటింపవలెను. ఆ సదాచారము వలన దీర్ఘాయుస్సు కలుగును. దాని వలన కోరిన సంతానము లభిస్తుంది. ఇంకను అంతు లేని ధనము లభిస్తుంది. సదాచారము అశుభాలను కలుగనీయదు.

*దురాచారో హి పురుషో లోకే భవతి నిందితః,*
*దుఃఖభాగీ చ సతతం వ్యాధితోఽల్పాయురేవ చ. 157*

*సర్వలక్షణ హీనోఽపి యస్సదాచారవాన్నరః,*
*శ్రద్దధానోఽనసూయశ్చ శతం వర్షాణి జీవతి 158*

దురాచారం కల పురుషుని లోకము నిందిస్తుంది. అతడు వ్యాధుల వల్ల దుఃఖం పొందుతూ అల్పాయుష్కుడౌతాడు. అందువల్ల సదాచారాన్నవలంబింపవలెను. మంచి లక్షణములేమియు లేకపోయినను సదాచారముగల మానవుడు, శ్రద్ధకలిగి, అసూయ లేక నూరు సంవత్సరములు జీవిస్తాడు.

*యద్యత్పరవశం కర్మ తత్తద్యత్నేన వర్జయేత్,*
*యద్యదాత్మవశం తు స్యాత్తత్తత్సేవేత యత్నతః 159*

*సర్వం పరవశం దుఃఖం సర్వమాత్మవశం సుఖమ్,*
*ఏత ద్విద్యాత్సమాసేన లక్షణం సుఖదుఃఖయోః 160*

*యత్కర్మ కుర్వతోఽస్య స్యాత్పరితోషోఽన్తరాత్మన;*
*తత్ప్రయత్నేన కుర్వీత విపరీతం తు వర్జయేత్ 161*

ఇతరులు చేయదగు కర్మను వదలి పెట్టి తాను చేయగలిగి మంచి పనులను కష్టపడి యైనను చేయవలెను. ఇతరులకు అధీనమైన కర్మయ్యంతా దుఖాన్ని కలిగిస్తుంది. తనకు అధీనమైన కర్మయంతా దుఃఖాన్ని కలిగిస్తుంది. ఇదియే సుఖ దుఖాలకు లక్షణము. ఏ పని చేస్తున్నప్పుడు ఆత్మసంతృప్తి కలుగుతుందో దానిని తప్పక చేయవలెను. మిగిలిన దానిని వదలివేయవలెను.

*ఆచార్యం చ ప్రవక్తారం పితరం మాతరం గురుమ్,*
*న హింస్యాద్బ్రాహ్మణాన్ గాశ్చ సర్వాంశ్చైవ తపస్వినః 162*

*నాస్తిక్యం వేదనిందాం చ దేవతానాం చ కుత్సనమ్,*
*ద్వేషం దంభం చ మానం చ క్రోధం తైక్ష్ణ్యం చ వర్జయేత్ 163*

ఉపనయన పూర్వక వేదాధ్యాపనం చేసేఆచార్యుని, వేదభాష్యము మొదలగునవి వ్యాఖ్యానము చేసేవానిని, తల్లిని, తండ్రిని, కొంచెమో గొప్పయో చదువు చెప్పే గురువును, బ్రాహ్మణులను, ఆవులను, మునులను బాధ పెట్టరాదు. నాస్తిక్య బుద్ధిని, వేదములను నిందించు స్వభావాన్ని, దేవతలను ద్వేషించే బుద్ధిని, ద్వేషాన్ని, ఆడంబరాన్ని, కోపమును, కటిక స్వభావమును ఎల్లప్పుడు వదలివేయవలెను.

*పరస్య దండం నోద్యచ్ఛేత్క్రుద్ధో నైనం నిపాతయేత్,*
*అన్యత్ర పుత్రాచ్ఛిష్యాద్వా శిష్ట్యర్థం తాడయేత్తు తౌ 164*

*బ్రాహ్మణాయావగుర్యైవ ద్విజాతి ర్వధ కామ్యయా,*
*శతం వర్షాణి తామిస్రే నరకే పరివర్తతే 165*

*తాడయిత్వా తృణేనాపి సంరంభా న్మతిపూర్వకమ్,*
*ఏకవింశతిమా జాతీః పాపయోనిషు జాయతే 166*

*అయుధ్యమానస్యోత్పాద్య బ్రాహ్మణస్యాసృగంగతః,*
*దుఃఖంచ మహదాప్నోతి ప్రేత్యాప్రాజ్ఞతయా నరః 167*

*శోణితం యావతః పాంసూన్ సంగృహ్ణాతిమహీతలాత్,*
*తావతోzబ్దా నముత్రాన్యైశ్శోణితోత్పాదకోz ద్యతే 168*

*న కదాచి ద్ద్విజే తస్మాద్విద్వానవగురేదపి,*
*న తాడయే తృణేనాపి న గాత్రాత్స్రావయేదసృక్ 169*

*అధార్మికో నరో యో హి యస్య చాప్యనృతం ధనమ్,*
*హింసారతశ్చ యో నిత్యం నేహాసౌ సుఖమేధతే 170*

బ్రాహ్మణుడు ఇతరుని కొట్టుటకై కోపంతో కఱ్ఱనెత్తరాదు. అట్లే కోపంతో ఇతరులను ఎత్తిపడవేయ గూడదు. కాని పుత్రుడు. శిష్యుడు నేరము చేస్తే వారిని దండించ వచ్చును. బ్రాహ్మణుడైనా వేరొక బ్రాహ్మణుని చంపవలెనని కఱ్ఱ మొదలగు వానిని పైకెత్తినచో నూరు సంవత్సరములవరకు తామిస్రమనే నరకంలో బాధలుపడును. కోపముతో బ్రాహ్మణుని గడ్డితోనైనను కొట్టితే అతడు ఇరువై ఒక్క జన్మలు కుక్కలు, గాడిదలు మొదలగు నీచ

యోనులందు పుట్టుతాడు. తనతో పోట్లాడని బ్రాహ్మణుని శరీరమునుండి రక్తము కారునట్లు. చేస్తే మిక్కిలి దుఃఖాన్ని పొందుతాడు. అట్లే ఆ బ్రాహ్మణుని రక్తము ఎన్ని రేణువులను తడుపుచున్నదో అన్ని సంవత్సరములు బ్రాహ్మణుని కొట్టినవాని రక్తాన్ని నక్కలు మొదలైనవి త్రాగుతాయి. ధార్మికబుద్ధిలేని వానికి అబద్ధములాడు వానికి, హింసించు వానికి సుఖము లభించదు.

*న సీదన్నపి ధర్మేషు మనో ధర్మే నివేశయేత్,*
*అధార్మికాణాం పాపానా మాశు పశ్యన్ విపర్యయమ్ 171*

*నాధర్మశ్చరితో లోకే సద్యః ఫలతి గౌరివ,*
*శనైరావర్తమానస్తు కర్తుర్మూలాని కృంతతి 172*

*యది నాత్మని పుత్రేషు న చేత్పుత్రేషు నప్తృషు,*
*నత్వేవ తు కృతో ధర్మః కర్తుర్భవతి నిష్ఫలః 173*

*అధర్మేణైధతే తావత్తతో భద్రాణి పశ్యతి,*
*తతస్సపత్నాన్ జయతి సమూలస్తు వినశ్యతి 174*

ధర్మకార్యాలు చేసే సమయంలో కష్టములెదురైనా అధర్మం చేయరాదు. అటువంటివారు ప్రస్తుతం సుఖమనుభవించినా చివరకు బాధలు పడుటను గుర్తించి, తన మనస్సును అధర్మ కార్యముల వైపు మరల్చరాదు. అధర్మము నాచరిస్తే అది భూమి వలె వెంటనే ఫలితము నివ్వక మెలమెల్లగా ఫలితము నిస్తూ అధర్మం చేసిన వానికి సర్వనాశనం కలుగేటట్లు చేస్తుంది. అధర్మ ఫలము అతనికి కాకపోయినచో అతని పుత్రులకు, వారికి కానిచో అతని పౌత్రులకు, మునిమనుమలకైనా లభిస్తుంది. కాని ఫలితము లేకుండ మాత్రం పోదు. అధర్మాన్నాచరించినవాడు అది పరిపక్వంకానంత వరకు సుఖం పొందితే పొంద వచ్చును. అభివృద్ధికి రావచ్చు. కాని ఆ అధర్మం పరిపక్వమైతే అతడు సమూలంగా నాశననమౌతాడు.

*సత్యధర్మార్యవృత్తేషు శౌచే చైవార మేత్సదా,*
*శిష్యాంశ్చ శిష్యాద్ధర్మేణ వాగ్బాహూదరసంయతః 175*

*పరిత్యజేదర్థకామౌ యౌ స్యాతాం ధర్మవర్జితౌ,*
*ధర్మం చాప్యసుఖోదర్కం లోకవిక్రుష్టమేవచ 176*

*న పాణిపాదచపలో న నేత్ర చపలో஽ నృజుః*
*న స్యాద్వాక్చపలశ్చైవ న పరద్రోహకర్మధీః 177*

*యేనాస్య పితరో యాతా యేన యాతాః పితామహాః,*
*తేన యాయాత్సతాం మార్గం తేన గచ్ఛన్న రిష్యతే. 178*

బ్రాహ్మణుడు తన మాటలను తన చేతులను, కడుపును కట్టి వేసికొని తాను సత్యం, ధర్మం, సదాచారం మొదలగు వాటి యందు శ్రద్ధ కలిగి యుండవలెను. అదే

విధంగా తన శిష్యులు ధర్మ మార్గాన్ని అనుసరించేటట్లు చేయవలెను. ధర్మానికి విరుద్ధాలైనా అర్థకామాలను వదిలి పెట్ట వలెను. ధర్మం కూడ చివరి సమయంలో దుఃఖం కలిగిస్తే వదిలి పెట్టవలెను. లోకం నిందించే ధర్మకార్యాన్ని సైతం చేయరాదు. మానవుడు అనవసరమైన వస్తువులను తెచ్చుకొనరాదు. పనికి మాలిన తిరుగుళ్ళు తిరుగకూడదు. బహుజననింద ఆత్మస్తుతి మున్నగునవి చేయగూడదు. ఇతరులకు ద్రోహం చేయరాదు. తన తలి దండ్రులు, తాతముత్తాతలు ఏ సదాచారాన్ని అనుష్ఠించినారో ఆ సదాచారాన్ని అనుష్ఠించ వలెను.

*ఋత్విక్పురోహితాచార్యైర్మాతులాతిథిసంశ్రితైః*
*బాలవృద్ధాతురైర్వైద్యైర్జ్ఞాతి సంబంధిబాంధవైః 179*

*మాతాపితృభ్యాం జామీభిర్భ్రాతా పుత్రేణ భార్యయా,*
*దుహిత్రా దాసవర్గేణ వివాదం న సమాచరేత్ 180*

*ఏతైర్వివాదాన్ సంత్యజ్య సర్వపాపైః ప్రముచ్యతే,*
*ఏభిర్జితైశ్చ జయతి సర్వాన్ లోకానిమాన్ గృహీ 181*

*ఆచార్యో బ్రహ్మలోకేశః ప్రాజవత్యే పితా ప్రభుః,*
*అతిదిస్త్వింద్రలోకేశో దేవలోకస్య చర్త్విజః 182*

*జామయోऽప్సరసాంలోకే వైశ్యదేవస్య బాంధవాః,*
*సంబంధినో హ్యాపాం లోకే పృథివ్యాం మాతృమాతులౌ 183*

*ఆకాశేశాస్తు విజ్ఞేయా బాలవృద్ధకృశాతురాః*
*భ్రాతా జ్యేష్ఠస్సమః పిత్రా భార్యా పుత్రః స్వకా తనుః 184*

*ఛాయా స్వో దాసవర్గశ్చ దుహితా కృపణం పరమ్,*
*తస్మాదేతైరధిక్షిప్తః సహేతాసంజ్వరస్సదా 185*

ఋత్విక్కులు, పురోహితులు, ఆచార్యులు, మేనమామ, అతిథి, భృత్యులు, బాలురు, వృద్ధులు, రోగగ్రస్తులు, వైద్యులు, జ్ఞాతులు, బావమరిది మొదలైన సంబంధులు, బంధువులు, తలి దండ్రులు, తోబుట్టువులు, కోడలు మొదలగు స్త్రీలు, అన్నదమ్ములు, కొడుకు, భార్య, కూతురు, మొదలగు వారితో గృహస్తు వివాదం పెట్టుకోవద్దు. పై వారితో వివాదం పెట్టుకొనక పోతే తేలికగా గృహస్థు సమస్త పాపాలకు దూరమౌతాడు. వీరిని మన్నిస్తే అతడు సమస్తలోకాలను జయించినవాడౌతాడు. ఆచార్యుడు బ్రహ్మలోకాధిపతి వంటివాడు. తండ్రి ప్రజాపతి లోకానికి ప్రభువు వంటివాడు. అతిధి ఇంద్రలోకానికి ప్రభువు వంటివాడు. ఋత్విక్కులు దేవలోక ప్రభువులు .తోబుట్టువులు కోడండ్రు మొదలగువారు అప్సర లోకానికి, బంధువులు విశ్వే దేవతలలోకానికి, సంబంధులు వరుణలోకానికి, తల్లి మేనమామలు భూలోకానికి ప్రభువులు. బాలురు, వృద్ధులు రోగగ్రస్తులు ఆకాశ లోకానికి ప్రభువులు. కావున వీరితో వివాదం పెట్టుకొనని గృహస్థు ఆయాలోకాలను అనాయసంతో పొందగలుగుతాడు. పెద్ద అన్న తండ్రితో సమానుడు. కావున అన్న ప్రజాపతిలోకానికి ప్రభువు.

భార్య మరి తన పుత్రుడు ఇద్దరు తన శరీరం వంటివారు. కావున వారితో వివాదమనేది సంభవించదు. తన భృత్యులు తన నీడవంటివారు. కూతురెల్లప్పుడు కనికరము జూపదగింది. కావున వీరొకప్పుడు దూషించినా ఓర్చుకొని వీరితో వివాదం పెట్టుకొనరాదు.

*ప్రతి గ్రహసమర్థోऽ పి ప్రసంగం తత్ర వర్జయేత్,*
*ప్రతిగ్రహేణ హ్యస్యాశు బ్రాహ్మం తేజః ప్రశామ్యతి 186*

*న ద్రవ్యాణామభిజ్ఞాయ విధిం ధర్మ్యం ప్రతిగ్రహే,*
*ప్రాజ్ఞః ప్రతిగ్రహం కుర్యాదవసీదన్నపి క్షుధా. 187*

*హిరణ్యం భూమిమశ్వం గామన్నం వాసస్తిలాన్ ఘృతమ్,*
*ప్రతిగృహ్ణన్నవిద్వాంస్తు భస్మీభవతి దారువత్ 188*

*హిరణ్యమాయురన్నం చ భూర్గౌశ్చాప్యోషత స్తనుమ్,*
*అశ్వశ్చక్షుస్త్వచం వాసో ఘృతం తేజస్తిలాః ప్రజాః 189*

బ్రాహ్మణుడు దాన స్వీకారానికి యోగ్యుడైనప్పటికీ దానం స్వీకరించవద్దు. దానం స్వీకరిస్తే బ్రాహ్మణుని తేజస్సు త్వరగా నాశనమౌతుంది. ప్రాజ్ఞుడైనవాడు ధర్మశాస్త్ర విధులను తెలిసికొని దానం స్వీకరించుటకు తగిన వస్తువేదియో తెలిసికొనవలెను. తాను ఆకలితో బాధపడుతున్నా దానాన్ని మాత్రం స్వీకరింపకూడదు. బంగారం, భూమి, గుఱ్ఱం, గోవు, అన్నం, వస్త్రం నూవులు, నేయి వీనిని విద్యా విహీనుడు స్వీకరిస్తే క్షణంలో భస్మమౌతాడు. బంగారాన్ని దానంగా స్వీకరిస్తే ఆయుస్సుక్షీణిస్తుంది. అన్నం, భూమి, ఆవు, వీటిని దానంగా స్వీకరిస్తే శరీరం క్షీణిస్తుంది. అశ్వదానం దృష్టిని పోగొట్టుంది. వస్త్రదానం చర్మాన్ని, నేయి తేజస్సును, నూవులు సంతానాన్ని నశింపచేస్తాయి. కావున వీటిని దానంగా స్వీకరింప కూడదు.

*అతపా స్త్వనధీయానః ప్రతిగ్రహరుచిర్ద్విజః,*
*అంభస్యశ్మప్లవేనేవ సహ తేనైవ మజ్జతి 190*

*తస్మానవిద్వాన్ బిభియాద్యస్మా త్తస్మాత్ప్రతి గ్రహాత్;*
*స్వల్పకే నాప్యవిద్వాన్ హి పంకే గౌరివ సీదతి. 191*

తపస్సు, వేదాధ్యయనం లేని బ్రాహ్మణునకు దానం పై ఆశ ఉన్నచో రాతి ఓడనెక్కి సముద్రాన్ని దాటువాని వలె అనర్హప్రతి గ్రహము వలన కలిగే పాపంతో తాను నరకం పొందుతాడు. అందువల్ల విద్వాంసుడు కాని బ్రాహ్మణుడు దానం స్వీకరించకూడదు. అతడు తక్కువ దానం స్వీకరించినా. బురదలో కూరుకొని పోయిన ఆవు వలె బాధపడుతాడు.

*న వార్యపి ప్రయచ్ఛేత్తు బైడాల వ్రతికే ద్విజే*
*న బక వ్రతికే విప్రే నావేదవిది ధర్మవిత్ 192*

*త్రిష్వప్యేతేషు దత్తం హి విధినాऽ ప్యర్జితం ధనమ్*
*దాతుర్భవత్యనర్థాయ పరత్రాదాతు రేవ చ 193*

*యథా ప్లవే నౌపలేన నిమజ్జత్యుదకే తరన్,*
*తథా నిమజ్జతోऽ ధస్తాదజ్ఞౌదాతృప్రతీచ్ఛకౌ 194*

ధర్మ వేత్తయైన బ్రాహ్మణుడు, బిడాలవ్రతం బక వ్రతం చేసే బ్రాహ్మణులకు, వేదాధ్యయనం చేయని బ్రాహ్మణునకు నీటిని కూడ దానంగా ఇవ్వకూడదు. పైన పేర్కొన్న ముగ్గురికి దానము చేయబడ్డ ధనం న్యాయార్జితమే ఐనా దానమిచ్చిన వానికి, స్వీకరించిన వానికి ఇద్దరికిని అనర్థం కలుగుతుంది. ఇట్లు విద్వాంసుడు కానివానికి దానం చేసినవాడు, దానం స్వీకరించినవాడు ఇద్దరు కూడ నరకానికి పోతున్నారు.

*ధర్మధ్వజీ సదా లుబ్ధశ్ఛాద్మికో లోక దంభకః,*
*బైడాల వ్రతికో జ్ఞేయో హింస్ర స్సర్వాభిసంధకః 195*

*అధోదృష్టిర్నైష్కృతికః స్వార్థ సాధనతత్పరః.*
*శఠో మిథ్యావినీతశ్చ బక వ్రతచరో ద్విజః 196*

*యే బక వ్రతినో విప్రా యే చ మార్జారలింగినః,*
*తే పతంత్యంధతామిస్రే తేన పాపేన కర్మణా 197*

నలుగురి సమక్షంలో ధర్మ కార్యాలాచరించేవాడు. తాను చేసిన ధర్మకార్యాలను తానే ప్రశంసించుకొనుచు ఇతరులు కూడ పొగడునట్లు చేసేవాడు ధర్మధ్వజి అని అనబడుతాడు. ఆ ధర్మధ్వజి, పిసినారి, కపటప్రవర్తనగలవాడు, లోకాన్ని మోసం చేసేవాడు, హింసచేసే స్వభావం కలవాడు అందరిని తప్పులు పట్టే వాడు ఇతనిని బిడాలవ్రతికుడని కూడా అంటారు. ఎల్లప్పుడు క్రింది చూపులు చూచేవాడు, నిష్ఠురంగా ప్రవర్తించే వాడు, స్వార్థపరాయణుడు, ధూర్తుడు, కపటంతో వినయాన్ని ప్రదర్శించేవాడు ఐన బ్రాహ్మణుని బక వ్రతుడని అంటారు. బిడాల వ్రతాన్ని బక వ్రతాన్ని చేసే బ్రాహ్మణులు తాముచేసే పాపపు పనుల వలన అంధతామిస్రమనే నరకానికి పోతారు.

*న ధర్మస్యాపదేశేన పాపం కృత్వా వ్రతం చరేత్*
*వ్రతేన పాపం ప్రచ్ఛాద్య కుర్వన్స్త్రీ శూద్రదంభనం 198*

*ప్రేత్యేహ చేదృశా విప్రాగర్హ్యంతే బ్రహ్మవాదిభిః,*
*ఛద్మనాచరితం యచ్చ వ్రతం రక్షాంసి గచ్ఛతి 199*

*అలింగీ లింగివేషేణ యో వృత్తి ముపజీవతి,*
*సలింగినాం హరత్యేనస్తిర్యగ్యోనౌ చ జాయతే 200*

*పరకీయనిపానేషు న స్నాయాచ్చ కదాచన,*
*నిపానకర్తుస్స్నాత్వా తు దుష్కృతాంశేన లిప్యతే 201*

*యానశయ్యాసనాన్యస్య కూపోద్యానగృహాణి చ,*
*అదత్తాన్యుపభుంజాన ఏనసస్స్యాత్తురీయభాక్ 202*

*నదీషు దేవఖాతేషు తటాకేషు సరస్సు చ,*
*స్నానం సమాచరేన్నిత్యం గర్తప్రస్రవణేషు చ 203*

పాపకార్యాలు చేసి వాటిని పోగొట్టు కొనుటకుచే స్తున్నానని మాత్రం ధర్మకార్యం వ్రతాలను చేయవద్దు. తాను చేసిన పాపాన్ని కప్పి పుచ్చి స్త్రీలు, శూద్రులు మొదలగువారిని

మోసగించుట తగని పని. ఈ విధంగా ఇతరులను మోసగిస్తూ వ్రతాలు చేసే వారిని చూచి బ్రహ్మజ్ఞానులైనవారు నిందిస్తారు. కపట బుద్ధితో చేసిన వ్రతఫలం దేవతలకు దక్కక రాక్షసులకు దక్కుతుంది. గృహస్థుడైనవాడు సన్యాసి వేషాలతో బిచ్చమెత్తుకొని తిరిగితే బ్రహ్మచారి మొదలగు వారి పాపాలను స్వీకరించి చనిపోయిన తరువాత పశువై పుట్టుతాడు. ఇతరులు త్రవ్వించిన చెరువులో స్నానమెప్పుడును చేయరాదు. అట్లు చేసినందువల్లన తన పుణ్యాన్ని చెరువు త్రవ్వించిన వానికి సమర్పించుకొంటాడు. అందువల్ల చెరువులో స్నానం చేసేవాడు చెరువులో నుండి కనీసం ఐదు దోసిళ్ళ మట్టిని ఎత్తి బయట పోయవలెను. బలవంతంగా ఇతరుల యొక్క వాహనాన్ని ఉపయోగించుకొనే వాడు వాటి యజమాని చేసిన పాపంలో నాలుగవవంతు పాపాన్ని అనుభవిస్తాడు.

*యమాన్ సేవేత సతతం న నిత్యం నియమాన్ బుధః*
*యమాన్పతత్యకుర్వాణో నియమాన్ కేవలాన్ భజన్ 204*

విజ్ఞుడైనవాడు తొలుత యమములను సేవించి అటు పిమ్మట నియమములను అనుష్ఠించాలి. అట్లుకాక కేవలం నియమాలనే అనుష్ఠిస్తే పాపం పొందుతాడు. యమములనగా బ్రహ్మచర్యం, దయ, ఓర్పు, సత్యం, పాపాలు చేయకుండుట, అహింస, దొంగతనం చేయకపోవుట, ఇంపైన మాటలు పలుకుట, బహిరింద్రియ నిగ్రహం మొదలైనవి. నియమములనగా స్నానము, మౌనము, ఉపవాసము, యాగం, వేదాధ్యయనం, ఇంద్రియ నిగ్రహం గురుశుశ్రూష, శౌచం మొదలైనవి.

*నాశ్రోత్రియతతే యజ్ఞే గ్రామయాజికృతే తథా,*
*స్త్రియా క్లీబేన చ హుతే భుంజీత బ్రాహ్మణః క్వచిత్, 205*

*అశ్లీక మేత త్సాధూనాం యత్ర జుహ్వత్యమీ హవిః,*
*ప్రతీపమేతద్దేవానాం తస్మాత్తత్పరివర్జయేత్ 206*

*మత్తక్రుద్ధాతురాణాం చ న భుంజీరన్ కదాచన,*
*కేశకీటావపన్నం చ పదా స్పృష్టం చ కామతః 207*

*భ్రూణఘ్నా వేక్షితం చైవ సంస్పృష్టం చాప్యుదక్యయా,*
*పతత్రిణావలీఢం చ శునా సంస్పృష్టమేవ చ. 208*

శ్రోత్రియుడుకాని వాడు చేయుచున్న యజ్ఞంలో, ఒక్కడే చాలమందితో యాగము చేయిస్తున్న సమయంలో, స్త్రీలు, నపుంసకులు చేయు యాగంలో బ్రాహ్మణుడు భోజనం చేయకూడదు. పైన చెప్పిన యాగాలు సాధు పురుషులకు కీడును కలుగ జేస్తాయి. అవి దేవతలకు సంతోషాన్ని కలిగించవు. కావున అట్టి యాగాలలో బ్రాహ్మణుడు భోజనం చేయరాదు. మదించినవారు, కోపంతో నున్నవారు, రోగులు వండిన అన్నాన్ని, వెంట్రుకలు, కీటకాలు పడ్డ అన్నాన్ని, కాలితో తన్నిన అన్నాన్ని ఎప్పుడు కూడ తినకూడదు. శిశు హత్య, గోహత్యలు చేసిన భ్రష్టులు చూచిన అన్నం, ముట్టైన స్త్రీకి పెట్టగా మిగిలిన అన్నం కాకి కుక్క మొదలైన పశు పక్షులు తినగా మిగిలిన అన్నం తినరాదు.

*గవా చాన్నముపఘ్రాతం ఘుష్టాన్నం చ విశేషతః,*
*గణాన్నం గణికాన్నం చ విదుషాం చ జుగుప్సితమ్ 209*

*స్తేనగాయనయోశ్చాన్నం తక్ష్ణో వార్ధుషికస్య చ,*
*దీక్షితస్య కదర్యస్య బద్ధస్య నిగడస్య చ, 210*

*అభిశ స్తస్య షండస్య పుంశ్చల్యా దాంభికస్య చ,*
*శుక్తం పర్యుషితం చైవ శూద్రస్యోచ్ఛిష్ట మేవ చ. 211*

*చికిత్సకస్య మృగయోః క్రూరస్యోచ్ఛిష్టభోజినః,*
*ఉగ్రాన్నం సూతికాన్నం చ పర్యాచాంతమనిర్దశమ్ 212*

*అనర్చితం వృథామాంసమవీరాయాశ్చ యోషితః,*
*ద్విషదన్నం నగర్యన్నం పతితాన్నమవక్షుతమ్ 213*

*పిశునానృతినోశ్చాన్నం క్రతువిక్రయిణ స్తథా,*
*శైలూషతున్న వాయాన్నం కృతఘ్నస్యాన్నమేవ చ 214*

*కర్మారస్య నిషాదస్య రంగావతారకస్య చ,*
*సువర్ణ కర్తుర్వేణస్య శస్త్రవిక్రయిణ స్తథా 215*

*శ్వవతాం శౌండికానాం చ చేలనిర్ణేజకస్య చ,*
*రజకస్య నృశంసస్య యస్య చోపపతిర్గృహే 216*

ఆవు వాసన చూచిన వదలిపెట్టిన అన్నం, భోజన సత్రాలలో పిలిచి పెట్టు అన్నం, నలుగురు కలిసి పెట్టు అన్నం, వేశ్య వడ్డించు అన్నం, పెద్దలు నిందించు అన్నం, దొంగ, గాయకుడు, వడ్ల వాడు, (తక్ష) వడ్డీవలన బ్రతుకుచున్నవాడు, యజ్ఞ దీక్షితుడు, లోభి, సంకెళ్ళుపడినవాడు వీరి అన్నము, మహాపాతకుడని నింద పడ్డవాడు, నపుంసకుడు, ఱంకులాడి, ఆడంబరములు చెప్పుకొనువాడు వీరియన్నం, పులియబెట్టినపాలు, చద్ది అన్నం, వైద్యుడు, వేటకాడు, క్రూరుడు ఎంగిలి అన్నం తినువాడు, ఉగ్రకార్యాలొనర్చువాడు, వీరియన్నం, సూతకమునకై వండిన అన్నం, ఒకపంక్తి యందు అందరు భుజించుచుండగా, మధ్యలో ఒకడు లేచిపోయినచో ఆ పంక్తియందున్న అన్నం, మర్యాదలేకుండ వడ్డింపబడిన అన్నం, దేవతలకు నైవేద్యం పెట్టని అన్నం, భర్త పుత్రులు లేని స్త్రీ వండిన అన్నం, శత్రువు ఇంటిలోని అన్నం, పతితుల అన్నం, తుమ్మిన అన్నం, చాటున ఇతరులను తిట్టువాని అన్నం, తప్పుడు సాక్ష్యములు చెప్పువాని అన్నం, యజ్ఞఫలమును ఇతరులకమ్ముువాని అన్నం, నాట్యముచేయువాని అన్నం, బట్టలు కుట్టువాని అన్నం కృతఘ్నుని అన్నం, లోహపు పని చేయువాడు, బోయవాడు, రంగుల అద్దకముచేయువాడు, కంసాలి, వెదురుపని చేయువాడు, శస్త్రములమ్ముకొనువాడు, కుక్కలను పెంచువాడు, మద్యమమ్ముువాడు, బట్టలుదుకువాడు, బట్టలకు రంగులదద్దువాడు దయలేనివాడు, ఇంటిలోనే జారపురుషుడున్నవాడు వీరి అన్నాన్ని తినరాదు.

*మృష్యంతి యే చోపపతిం స్త్రీజితానాం చ సర్వశః,*
*అనిర్దశం చ ప్రేతాన్నమతుష్టికర మేవ చ. 217*
*రాజాన్నం తేజ ఆదత్తే శూద్రాన్నం బ్రహ్మవర్చసమ్,*
*ఆయుస్సువర్ణ కారాన్నం యశశ్చర్మావకర్తినః 218*

తన భార్య చెప్పినట్లు వింటూ జారపురుషుని తన ఇంటిలోనే ఉంచుకొన్నవాడు, పది దినముల అశౌచము తీరనివాడు, వీరి అన్నం, తృప్తిని కలిగించని అన్నం ఎప్పుడు కూడ తినరాదు. రాజు యొక్క అన్నం తన తేజస్సును, శూద్రుని యొక్క అన్నం బ్రహ్మవర్చస్సును, కంసాలి యొక్క అన్నం ఆయుస్సును, చెప్పులు కుట్టువాని అన్నం కీర్తిని నశింపచేస్తుంది. శిల్పకారుని యొక్క అన్నం సంతతిని, చాకలి వాని యన్నం సంఘమునందు పెట్టబడిన అన్నం, వేశ్య పెట్టిన అన్నం స్వర్గభ్రష్టుని చేస్తుంది.

*కారుకాన్నం ప్రజాం హంతి బలం నిర్ణేజకస్యచ,*
*గణాన్నం గణికాన్నం చలోకేభ్యః పరికృంతతి. 219*

*పూయం చికిత్సకస్యాన్నం పుంశ్చల్యాన్త్వన్నమింద్రియమ్,*
*విష్ఠా వార్ధుషికస్యాన్నం శస్త్రవిక్రయిణో మలమ్. 220.*

*యఏతేz న్యే త్వభోజ్యాన్నా ః క్రమశః పరికీర్తితాః*
*తేషాం త్వగస్థిరోమాణి వదంత్యన్నం మనీషిణః 221*

వైద్యుని అన్నము చీముతో సమానం, అంకులాడి పెట్టిన అన్నం తింటే ఇంద్రియాన్ని భక్షించినట్లౌతుంది. వడ్డీ వ్యాపారి పెట్టి అన్నం మలంతో సమానం, శస్త్రములమ్ముకొనే వాని అన్నం కూడ మలం వంటిదే. పైన పేర్కొన్నవారు కాక మిగిలిన వారి (దొంగ, గాయకుడు మొదలగువారు) అన్నాన్ని తిన్నచో వారి యొక్క చర్మము, ఎముకలు, రోమములు భక్షించినట్లే ఔతుంది. కావున వారి ఇండ్లలో కూడ అన్నాన్ని తినకూడదు.

*భుక్త్వాzతోz న్యతమస్యాన్న మమత్యా క్షపణం త్ర్యహమ్,*
*మత్యా భుక్త్వా చరేత్కృచ్ఛ్రం రేతో విణ్మూత్రమేవ చ. 222*

*నాద్యాచ్ఛూద్రస్య పక్వాన్నం విద్వానశ్రాద్ధినో ద్విజః*
*ఆదదీతామమేవాస్యాదవృత్తావేకరాత్రికమ్. 223*

*శ్రోత్రియస్య కదర్యస్య వదాన్యస్య చ వార్ధుషేః*
*మీమాంసిత్వోభయం దేవాస్సమమన్నమకల్పయన్ 224*

*తాన్ ప్రజాపతి రాహైత్య మా కృధ్వం విషమం సమమ్,*
*శ్రద్ధాపూతం వదాన్యస్య హతమశ్రద్ధయేతరత్. 225*

కావున వీరియన్నాన్ని తెలియక తిన్నచో మూడు దినాలు ఉపవాసముండవలెను. తెలిసి తిన్నచో కృచ్ఛ్ర ప్రాయశ్చిత్తం చేసికొనవలెను. విద్వాంసుడైన బ్రాహ్మణుడు శ్రాద్ధాది పంచమహా యజ్ఞములు చేసి శూద్రునింట తినరాదు. విధిలేనప్పుడు ఒక రాత్రికి మాత్రము

సరిపడు వండని పదార్థములను (పాలు, పండ్లు, బియ్యము మొదలైనవి) తీసికొని తినవలెను, లోభియైన శ్రోత్రియుడు, దాతయైన వడ్డీవ్యాపారి ఈ ఇద్దరు సమానమైన వారేనని దేవతలు నిర్ణయించినారు. ఆ సమయంలో బ్రహ్మ దేవుడచ్చటకు వచ్చి పై వారిద్దరు సమానులు కారు. శ్రద్ధ ఉండి దాతయైన వడ్డీవ్యాపారి శ్రద్ధలేని లోభియైన శ్రోత్రియుని కంటె శ్రేష్ఠుడని నిర్ణయించెను. అందువల్ల శ్రద్ధలేని వాని అన్నం శ్రోత్రియునిదైనను పనికిరానిది.

*శ్రద్ధయేష్టం చ పూర్తం చ నిత్యం కుర్యాదతంద్రితః*
*శ్రద్ధాకృతే హ్యక్షయే తే భవతః స్వాగతైర్ధనైః 226*

*దానధర్మం నిషేవేత నిత్యమైష్టికపౌర్తికమ్,*
*పరితుష్టేన భావేన పాత్రమాసాద్య శక్తితః 227*

ఇష్టాన్ని (యజ్ఞకుండంలో చేయు హోమాదికం) పూర్తాన్ని (యజ్ఞకుండమునకు వెలుపల చేయు తోటలు వేయుట, చెరువులు తవ్వించుట మొదలైన) సోమరితనంలేక శ్రద్ధగా చేయవలెను. తాను సంపాదించిన ధనం శ్రద్ధగా చేసిన ఇష్టాపూర్తాలు అక్షయమైన ఫలితాన్నిస్తాయి. యోగ్యుడైన పురుషుని సంపాదించుకొని శ్రద్ధతో మనస్సునకు తృప్తి కలుగునట్లు దాన ధర్మాలు, ఇష్టాపూర్తాలు శక్తికొలది చేయవలెను,

*యత్కించిదపి దాతవ్యం యాచితేనానసూయయా,*
*ఉత్పత్స్యతే హి తత్పాత్రం యత్తారయతి సర్వతః 228*

*వారిదస్తృప్తిమాప్నోతి సుఖమక్షయ్యమన్నదః*
*తిలప్రదః ప్రజామిష్టాం దీపదశ్చక్షురుత్తమమ్. 229*

*భూమిదో భూమిమాప్నోతి దీర్ఘమాయుర్హిరణ్యదః*
*గృహదోz గ్ర్యాణి వేశ్మాని రూప్యదో రూపముత్తమమ్. 230*

*వాసోదశ్చంద్ర సాలోక్య మశ్విసాలోక్య మశ్వదః*
*అనడుద్ధః శ్రియం పుష్టాం గోదో బ్రధ్నస్య విష్టపమ్. 231*

*యానశయ్యాప్రదో భార్యామైశ్వర్యమభయప్రదః*
*ధాన్యదశ్శాశ్వతం సౌఖ్యం బ్రహ్మదో బ్రహ్మసార్ష్టితాం.232*

తనను ఎవ్వరైనా యాచిస్తే అసూయలేక తన శక్తికొలది దానం చేయవలెను. ఆవిధంగా దానం చేస్తున్నప్పుడు యోగ్యుడైనవాడతని దగ్గరకు వచ్చి దానము అడుగవచ్చును. ఆదానంవల్ల దాత పుణ్యలోకాన్ని పొందుతాడు. నీటిని దానం చేసినచో దాతకు తృప్తి కలుగుతుంది. అన్నం పెట్టినందువల్ల అంతులేని సుఖం కలుగుతుంది. ఆవుల దానమిచ్చువాడు కోరినంత సంతతిని పొందుతాడు. దీపదానం చేయువాడు మంచి దృష్టిని పొందుతాడు. భూదానం చేస్తే భూమి లభిస్తుంది బంగారాన్ని దానం చేస్తే దీర్ఘాయుస్సు

పొందుతాడు. ఇంటిని దానం చేస్తే గొప్పగొప్ప భవనాలను పొందుతాడు. వెండిని దానం చేస్తే దాత చక్కని రూపాన్ని పొందుతాడు. వస్త్రాల దానం చేసినవాడుచంద్రలోకాన్ని పొందుతాడు. గుఱ్ఱాల దానం చేసినవాడు అశ్వినీ దేవతలుండులోకాన్ని చేరుకొంటాడు. ఎద్దులను దానము చేసినవాడు గొప్ప సంపదను పొందుతాడు. ఆవులను దానం చేస్తే సూర్యలోకాన్ని పొందుతాడు, బండ్లను, శయ్యను, దానం చేస్తే చక్కని భార్యను పొందుతాడు . అభయమునిచ్చువాడు గొప్ప ఐశ్వర్యాన్ని పొందుతాడు ధాన్యం చేసినవాడు శాశ్వతసౌఖ్యాన్ని అనుభవిస్తాడు వేదం చదువు చెప్పువాడు బ్రహ్మతో సమానమైనవాడౌతాడు.

*సర్వేషామేవ దానానాం బ్రహ్మదానం విశిష్యతే,*
*వార్యన్నగోమహీవాస స్తిలకాంచనసర్పిషామ్.233*

*యేన యేన తు భావేన యద్యద్దానం ప్రయచ్ఛతి,*
*తత్తత్తేనైవ భావేన ప్రాప్నోతి ప్రతిపూజితః.234*

*యోz ర్చితం ప్రతిగృహ్ణాతి దదాత్యర్చితమేవ చ,*
*తావుభౌ గచ్ఛతస్స్వర్గం నరకం తు విపర్యయే 235*

*న విస్మయేత తపసా వదేదిష్ట్వా చ నానృతమ్,*
*నార్తోz ప్యపవ దేద్విప్రాన్న దత్వా పరికీర్తయేత్ 236*

*యజ్ఞోz నృతేన క్షరతి తపః క్షరతి విస్మయాత్,*
*ఆయుర్విప్రాపవాదేన దానం చ పరికీర్తనాత్ 237*

**దానమహిమ :**

నీరు, అన్నం, గోవు, భూమి, వస్త్రం, నూవులు, బంగారం, నేయి మొదలగు దానాలన్నిటిలో వేదాన్ని దానం చేయుట (చదువు చెప్పుట) చాలా గొప్పనైనది. దానమిచ్చునప్పుడు దాతకు ఎట్టి కోరికయుండునో అతడు జన్మాంతరమున అట్టికోరికను సంపాదించుకొనును. దానం చేయునప్పుడు దాత ప్రతిగ్రహీతను అర్చించి దానం చేయవలెను. దానివలన దాత, దానం స్వీకరించినవాడు (ప్రతిగ్రహీత) ఇద్దరు స్వర్గానికి. లేనిచో ఇద్దరు నరకానికి చేరుతారు. తాను చేసిన తపస్సుయొక్క గొప్పతనానికి అబ్బురపడరాదు. యాగం చేసి అబద్ధములాడరాదు. తాను బాధపడినప్పటికీ బ్రాహ్మణులను నిందించరాదు అట్లేతాను చేసిన దానాన్ని గూర్చి ఇతరులకు చెప్పుకొనకూడదు. అబద్దాలాడినందువల్ల చేసిన యజ్ఞం నశిస్తుంది. తాను చేసిన తపస్సు గొప్పదని భావించినంత మాత్రాన అదీ నశిస్తుంది. బ్రాహ్మణులను దూషించుటవల్ల ఆయుస్సు క్షీణిస్తుంది. తాను చేసిన దానాన్ని నలుగురికి చెప్పుకొన్నందువల్ల ఆదాన ఫలితం వెంటనే నశిస్తుంది.

*ధర్మం శనైస్సంచినుయాద్వల్మీక మివ పుత్తికాః,*
*పరలోక సహాయార్థం సర్వభూతాన్యపీడయన్ 238*

*నాముత్ర హి సహాయార్థం పితా మాతా చ తిష్ఠతః,*
*న పుత్రదారా న జ్ఞాతిర్ధర్మస్తిష్ఠతి కేవలః, 239*

*ఏకః ప్రజాయతే జంతురేక ఏవ ప్రలీయతే,*
*ఏకో ను భుజో సుకృతమేక ఏవ చ దుష్కృతమ్ 240*

*మృతం శరీరముత్సృజ్య కాష్ఠలోష్ఠసమం క్షితౌ,*
*విముఖా బాంధవా యాంతి ధర్మస్తమనుగచ్ఛతి. 241*

*తస్మాద్ధర్మం సహాయార్థం నిత్యం సంచినుయాచ్ఛనైః*
*ధర్మేణ హి సహాయేన తమస్తరతి దుస్తరమ్ 242*

*ధర్మ ప్రధానం పురుషం తపసా హతకిల్బిషమ్,*
*పరలోకం నయత్యాశు భాస్వంతం ఖశరీరిణమ్ 243*

చీమలు పుట్టలు పెట్టినట్లు పరలోకప్రాప్తి కొరకు ప్రాణులను వేటిని బాధింపక మెల్ల మెల్లగా ధర్మాన్ని కూడబెట్టవలెను. తల్లి, దండ్రి, పుత్రులు, భార్య, జ్ఞాతులు ఎవ్వరు కూడ పరలోక సహాయమునకై రారు. పరలోకంలో ధర్మం మాత్రమే సహాయమౌతుంది. ప్రాణి ఒంటరిగా పుట్టుతున్నది ఒంటరిగానే మరణిస్తున్నది. ఒంటరిగానే తాను చేసిన సుకృతములను కాని దుష్కృతములను కాని అనుభవిస్తున్నది. ప్రాణి చనిపోయిన వెంటనే కట్టె, మట్టి ముద్దవంటి శరీరాన్ని వదలి బంధువులందరు వెనకకు పోతారు. కాని అతనిని అతడు చేసికొన్న ధర్మం మాత్రం ఎల్లప్పుడు వెన్నంటియే ఉంటుంది. అందువల్ల పరలోకంలో సహాయానికై ధర్మాన్నెల్లప్పుడు చేస్తూ ఉండవలెను. ధర్మము సహాయముగా వస్తే గొప్ప నరకాన్ని సైతం అవలీలగా దాటగలుగుతున్నాడు. తపస్సు చేత పాపములనన్నిటిని పోగొట్టుకొని, ధర్మమే ప్రధానంగానున్న పురుషుడు దివ్య శరీరంతో పరలోకాన్ని చేరుకొనుచున్నాడు.

*ఉత్తమైరుత్తమైర్నిత్యం సంబంధానాచరేత్సహ,*
*నినీషుః కులముత్కర్ష మధమానధమాంస్త్యజేత్ 244*

*ఉత్తమానుత్తమాన్ గచ్ఛన్ హీనాన్ హీనాం శ్చ వర్జయన్,*
*బ్రాహ్మణః శ్రేష్ఠతామేతి ప్రత్యవాయేన శూద్రతామ్ 245*

తనకు తన కులానికి గొప్ప తనం కావలెనని కోరేవాడు ఎల్లప్పటికి ఉత్తములతో మాత్రం సాంగత్యం చేయవలెను. లేనిచో తనతోటివారితోనైనా కలిసి తిరగవలెనే కాని తన కంటె నీచులతో మాత్రం కలిసి ఎన్నడు తిరుగరాదు. మానవుడు ఉత్తమోత్తములతో స్నేహం చేస్తే తాను కూడ శ్రేష్ఠుడౌతాడు. అధములతో స్నేహం చేస్తే తాను కూడ అధముడౌతాడు.

*దృఢకారీ మృదుర్దాంతః క్రూరాచారైరసంవసన్*
*అహింస్రో దమదానాభ్యాం జయేత్స్వర్గం తథావ్రతః 246*

*ఏధోదకం మూలఫల మన్నమభ్యుదితం చ యత్,*
*సర్వతః ప్రతి గృహ్ణీయాన్మధ్వథాభయదక్షిణామ్, 247*

*ఆహృతాభ్యుద్యతాం భిక్షాం పురస్తాదప్రచోదితామ్*
*మేనే ప్రజాపతిర్గ్రాహ్యామపి దుష్కృతకర్మణః 248*

*నాశ్నంతి పితర స్తస్య దశవర్షాణి పంచ చ.*
*న చ హవ్యం వహత్యగ్ని ర్యస్తామభ్యవమన్యతే 249*

*శయ్యాం గృహాన్ కుశాన్గంధానపః పుష్పం మణీన్దధి,*
*ధానా మత్స్యాన్ పయో మాంసం శాకం చైవ న నిర్ణుదేత్ 250*

తాను చేయదలచుకొన్న పనిని మధ్యలోనే వదిలి వేయక ధృఢ నిశ్చయంతో పూర్తి చేయువాడు, మృదు స్వభావం కలవాడు దమనశీలుడై చెడ్డవారితో కలిసిమెలిసి తిరుగనివాడు, హింసా స్వభావం లేనివాడు తపస్సు వ్రతమనేవి లేకుండనే ఇంద్రియనిగ్రహం, దానశీలత అనువాటిచే స్వర్గాన్ని పొందగలుగుచున్నాడు. కట్టెలు, నీరు, ఫల మూలాలు, ఆహారం మొదలైనవి అయాచితంగా వస్తే గ్రహింపవచ్చును. కులట, పాషండులనుండి వచ్చిన వాటిని మాత్రము స్వీకరింపరాదు. దానం చేసే స్థలానికి తీసికొనివచ్చి, ఎదురుగానుంచిన ధనం అయాచితంగా వస్తే ఆ ధనం చెడ్డవానిదైనా స్వీకరింపవచ్చునని ప్రజాపతియే పేర్కొన్నాడు. ఎవడట్టి దానాన్ని తిరస్కరిస్తాడో అతడొనర్చు కార్యాలను పితృదేవతలు పదునైదు సంవత్సరంల వరకు పరిగ్రహించరు. అదే విధంగా అగ్నిహోత్రుడు హోమ ద్రవ్యాలను (హవ్యమును) తీసికొని దేవతలకు ఇవ్వడు. శయ్య, గృహం, దర్భలు, సుగంధ ద్రవ్యాలు, నీరు, పుష్పాలు, మణులు, పెరుగు, బొరుగులు, పాలు మొదలగు వాటిని అయాచితంగా ఇచ్చినచో కాదనరాదు.

*గురున్ భృత్యాంశ్చోజ్జిహీర్షన్నర్చిష్యన్ దేవతాతిథీన్,*
*సర్వతః ప్రతిగృహ్ణీయాన్న తు తృప్యేత్స్వయం తతః 251*

తనను ఆశ్రయించుకొనియున్న గురువులను, దేవతలను, అతిథులను, తల్లిదండ్రులు మొదలగువారిని సేవకులను భార్యాపుత్రులను రక్షించుటకై పతితులు గాని తక్కిన వారందరినుండి దానాన్ని స్వీకరింపవచ్చును. కాని ఆ ధనాన్ని తన స్వార్థానికై ఉపయోగించరాదు.

*గురుషు త్వభ్యతీతేషు వినా వా తైర్గృహే వసన్,*
*ఆత్మనో వృత్తిమన్విచ్ఛన్ గృహ్ణీయాత్సాధుతస్సదా 252*

*ఆర్ధికః కులమిత్రం చ గోపాలో దాసనాపితౌ,*
*ఏతేశూద్రేషు భోజ్యాన్నా యశ్చాత్మానం నివేదయేత్ 253*

*యాదృశోస్య భవేదాత్మా యాదృశం చ చికీర్షితం,*
*యథా చోపచరేదేనం తథాత్మానం నివేదయేత్ 254*

తన పెద్దలగు తల్లిదండ్రులు చనిపోయిన తరువాత కూడ తాను ఆ ఇంటిలోనే ఉన్నను లేకున్నను తనయొక్క వృత్తిని కోరుకొనుచు సాధు పురుషుల దగ్గరినుండి దానాన్ని స్వీకరింపవచ్చును. తన భూమిని దున్ని వ్యవసాయం చేయువాడు, తన ఇంటి వారికి స్నేహితుడు, గోవుల మేపువాడు, తన భృత్యుడు, తనకు క్షౌరం చేయువాడు తనకు సర్వస్వమునర్పించుకొన్న ఈ శూద్రుల అన్నాన్ని తినవచ్చును. కులశీలాదులచే పై శూద్రుని స్వభావమెట్టిది? అతడు చేయు పనులెట్టివి? అతడెట్లు తనకు సేవచేయును మొదలగు విషయాలన్నీ తెలుస్తాయి. కావున అతని మంచితనాన్ని గుర్తించి ప్రవర్తింపవలెను.

*యోऽ న్యథా సనంత మాత్మానమన్యథా సత్సు భాషతే,*
*స పాపకృత్తమో లోకే స్తేన ఆత్మాపహారకః, 255*

*వాచ్యార్థా నియతాస్సర్వే వాఙ్మూలా వాగ్వినిస్సృతాః,*
*తాంస్తు యః స్తేనయోద్వాచం ససర్వస్తేయకృన్నరః 256*

ఎవ్వడైనను తాను ఒక విధముననుండగా, మరొక విధముగా ఉండునన్నట్లు సజ్జనుల దగ్గర అసత్యములు మాటాడునో వాడు పాపము చేయువారిలో గొప్పవాడు, తన్నుతాను దొంగిలించు చోరుడనియు చెప్పవచ్చును. మాటలందు అన్ని అర్థములున్నవి. శబ్దములకన్నిటికి వాక్కులే ఆధారము. శబ్దాలు వాటినుండియే బయటకు వస్తున్నాయి. అట్టి వాక్కులను మార్చువాడు సర్వస్వాన్ని అపహరించిన దొంగ ఔతాడు.

*మహర్షి పితృదేవానాం గత్వాऽऽనృణ్యం యథావిధి,*
*పుత్రే సర్వం సమాసజ్య వసేన్మాధ్యస్థ్య మాశ్రితః 257*

*ఏకాకీ చింతయేన్నిత్యం వివిక్తే హితమాత్మనః,*
*ఏకాకీ చింతయానో హి వరం శ్రేయోऽ ధిగచ్ఛతి 258*

గృహస్థు దేవర్షి పితృతర్పణముల ద్వారా దేవతలకు ఋషులకు పితృ దేవతలకు ఋణమును తీర్చుకొని పుత్రునిపై గృహభారము వేసి తాను ఏ తగవుల జోలికి పోక మధ్యస్థుడై ఉండవలెను. అతడు ఒంటరిగా తనయొక్క హితమును గూర్చి ప్రతిదినం ఆలోచించాలి. ఆ విధంగా ఆత్మహితాన్ని చింతిస్తే పర శ్రేయస్సనదగు మోక్షాన్ని పొందుచున్నాడు.

*ఏషోదితా గృహస్థస్య వృత్తిర్విప్రస్య శాశ్వతీ,*
*స్నాతకవ్రతకల్పశ్చ సత్త్వ వృద్ధికరశ్శుభః 259*

*అనేన విప్రో వృత్తేన వర్తయన్ వేద శాస్త్రవిత్*
*వ్యపేతకల్మషో నిత్యం బ్రహ్మలోకే మహీయతే 260*

ఈ విధంగా బ్రాహ్మణుడైన గృహస్థుడు ఉండవలసిన విధానమునంతయు తెలిపితిని. ఆ స్నాతక వ్రతానుష్ఠాన విధి సత్యగుణమును అభివృద్ధి పరుస్తుంది. కావున గృహస్థులందరు దీనిని అనుష్ఠించాలి. వేదశాస్త్రవేత్తయైన బ్రాహ్మణుడీవిధంగా ఉంటూ పాపాలకన్నిటికి దూరుడై బ్రహ్మలోకంలో పూజ్యుడౌతున్నాడు.

ఇతి మానవే ధర్మశాస్త్రే భృగుప్రోక్తాయాం సంహితాయాం చతుర్థోz ధ్యాయః

భృగు మహర్షి చెప్పిన మానవ ధర్మశాస్త్రమను సంహితయందు నాలుగవ అధ్యాయము సమాప్తము.

## పంచమాధ్యాయము

*శ్రుత్వైతాన్ ఋషయో ధర్మాన్ స్నాతకస్యయథోదితాన్*
*ఇదమూచుర్మహాత్మా నమనల ప్రభవం భృగుమ్ 1*

ఇంతవరకు చెప్పబడ్డ స్నాతకునియొక్క ధర్మాలనన్నిటిని విని అగ్ని పుత్రుడైన భృగుమహర్షితో మునులీవిధముగా పలికినారు.

*కథం మృత్యుః ప్రభవతి వేద శాస్త్రవిదాం ప్రభో 2*
*ఏవం యథోక్తం విప్రాణాం స్వధర్మ మనుతిష్ఠతామ్,*

ఈ విధంగా స్వధర్మాన్ని చక్కగా అనుష్ఠిస్తున్న బ్రాహ్మణులకు మృత్యువేవిధంగా కలుగుతుందో వేదశాస్త్ర విశారదుడవైన మహర్షీ మాకుతెలుపుమని కోరినారు.

*స తానువాచ ధర్మాత్మా మహర్షీన్ మానవో భృగుః,*
*శ్రూయతాం యేన దోషేణ మృత్యుర్విప్రాన్ జిఘాంసతి 3*

ఈ విధంగా అడిగిన మునులతో మనుపుత్రుడైన భృగుమహర్షి ఏ కారణం వలన బ్రాహ్మణులను మృత్యువు కబళిస్తున్నదో ఆ విషయాన్ని చెప్పుతానని అన్నాడు.

*అనభ్యాసేన వేదానామాచారస్య చ వర్జనాత్,*
*ఆలస్యా దన్న దోషాచ్చ మృత్యుర్విప్రాన్ జిఘాంసతి - 4*

వేదాలనభ్యాసం చేయనందువల్ల, ఆచారం లేనందువల్ల, సోమరితనంవల్ల, అన్న దోషం వల్ల, బ్రాహ్మణులను మృత్యువు కబళిస్తున్నదని పలికెను.

*లశునం గృంజనం చైవ పలాండుం కవకాని చ,*
*అభక్ష్యాణి ద్విజాతీ నామమేధ్య ప్రభవాణి చ 5*
*లోహితాన్ వృక్షనిర్యాసాన్ వృశ్చనప్రభవాంస్తథా,*
*శేలుం గవ్యం చ పీయూషం ప్రయత్నేన వివర్జయేత్ 6*
*వృథాకృసరసంయావం పాయసాపూపమేవ చ,*
*అనుపాకృతమాంసాని దేవాన్నాని హవీంషి చ 7*
*అనిర్దశాయా గోః క్షీరమౌష్ట్రమైకశఫం తథా,*
*ఆవికం సంధినీక్షీరం వివత్సాయాశ్చ గోః పయః 8*
*ఆరణ్యానాం చ సర్వేషాం మృగాణాం మాహిషం వినా,*
*స్త్రీక్షీరం చైవ వర్జ్యాని సర్వశుక్తాని చైవ హి 9*
*దధి భక్ష్యం చ శుక్తేషు సర్వం చ దధిసంభవమ్;*
*యాని చైవాభిషూయంతే పుష్పమూలఫలైశ్శుభైః 10*

## అన్నదోషాలు:-

వెల్లుల్లి, నీరుల్లి, తెల్లపాయలు, పుంటికూర, అమేధ్య స్థలంలో పుట్టిన వస్తువులను బ్రాహ్మణులు భక్షించరాదు. చెట్టునుండి స్వభావసిద్ధంగా కారిన ఎఱ్ఱనిపాలు, కత్తివేటువల్ల కారే పాలు, మునగకాయ, ముఱ్ఱుపాలు వీనిని బ్రాహ్మణుడు తప్పక వదలివేయవలెను. దేవతానైవేద్యానికి కాక తాను తినుటకై సిద్ధం చేసుకొన్న నూవులపాడియన్నం, పాలు కాచి బెల్లమువేసి గోధుమపిండి చేర్చిన ఒక వంటకం, పాయసం, వడలు, మొదలగు భక్ష్యాలు, హెూమం చేయకముందున్నహవిస్సులు దేవతానివేదన కానిచో వీటిని బ్రాహ్మణుడు తినకూడదు. ఈనిన తరువాత పది దినాలు గడవని ఆవు, ఒంటె, మేక, గొఱ్ఱె, ఒంటిగిట్టలు గల గుఱ్ఱము మొదలగు జంతువుల పాలు, చూలుతోనున్న ఆవు యొక్క పాలు, దూడ చనిపోయిన ఆవుపాలు వీటిని భక్షింపకూడదు. బఱ్ఱె తప్ప తక్కిన అడవి జంతువుల పాలు, చనుబాలు, పులియబెట్టిన వస్తువులన్నియు బ్రాహ్మణునకు తినదగినవి కావు. కాని పులియబెట్టిన వస్తువులలో పెరుగు, పెరుగుతో చేయబడిన మజ్జిగ వంటి పదార్థాలను, పువ్వులు, పండ్లు, దుంపలు, నీరు చేర్చి పులియబెట్టిన ఆసవాలను మాత్రం బ్రాహ్మణుడు తినవచ్చును.

*క్రవ్యాదాన్ శకునాన్ సర్వాం స్తథా గ్రామనివాసినః*
*అనిర్దిష్టాం శ్చైకశఫాంష్టిట్టిభం చ వివర్జయేత్ 11*

*కలవింకం ప్లవం హంసం చక్రాంగం గ్రామకుక్కుటమ్,*
*సారసం రజ్జువాలం చ దాత్యూహం శుకశారికే 12*

*ప్రతుదాన్ జాలపాదాంశ్చ కోయష్టి నఖవిష్కిరాన్,*
*నిమజ్జతశ్చ మత్స్యాదాన్ సౌనం వల్లూర మేవ చ. 13*

*బకం చైవ బలాకాం చ కాకోలం ఖంజరీటకమ్,*
*మత్స్యాదాన్ విడ్వరాహంశ్చ మత్స్యానేవ చ సర్వశః 14*

పచ్చి మాంసం తినే గద్దలు మొదలైన పక్షులను, గ్రామంలోనుండే పక్షులను, వేదమందు చెప్పబడని ఒంటిగిట్టలు గల గాడిదలు మొదలైన జంతువులను, టిట్టిభ పక్షులను తినరాదు. ఊరపిచ్చుకలను, నీటి కాకులను, హంసలను, చక్రవాక పక్షిని, కోడిని, సారస పక్షిని, తాటితోక పక్షిని, భరత పక్షిని, చిలుకను, గోరువంకను భక్షింపరాదు బెగ్గురు పక్షులను, వలవంటి పాదాలున్న పక్షులను, గుడ్డి కొంగలను, గోళ్ళతో చీల్చి తినే అడవి కోడి కంటె భిన్నమైన డేగలు వంటి పక్షులను, నీటిలో మునిగి చేపలు మొదలగు వాటిని తినే నీటి కాకుల వంటి పక్షులను, కటికవాని దగ్గర ఉండు మాంసాన్ని, ఎండిన మాంసాన్ని తినరాదు. కొంగ, జెముడు కాకి, కాటుక పిట్ట, చేపలనుదినే పక్షులకంటె భిన్నమైన మొసళ్ళు మొదలగువాటిని, మలమును తిను పందులను, చేపలను తినరాదు

*యో యస్య మాంసమశ్నాతి స తన్మాంసాద ఉచ్యతే,*
*మత్స్యాదస్సర్వమాంసాద స్తస్మాన్మత్స్యాన్ వివర్జయేత్ 15*

మాంసాన్ని తినే ప్రాణిని మాంసాదమందురు. చేపలను తినువాడు సమస్త మాంసమును తిన్నవానితో సమానుడు కావున చేపలను తినరాదు.

*పాఠీనరోహితావాద్యౌ నియుక్తౌ హవ్యకవ్యయోః*
*రాజీవాన్ సింహతుండాంశ్చ సశల్కాంశ్చైవ సర్వశః 16*

వేయి కోరలు గల చేపలు, ఎఱ్ఱ చేపలు, గుంపుగా తిరుగు చేపలు, సింగపు ముఖము గల చేపలు, ముండ్ల చేపలు వీటిని శ్రాద్ధమున నియుక్తులైన బ్రాహ్మణులు మాత్రం తినవచ్చును. కాని శ్రాద్ధకర్త, తక్కినవారు తినకూడదు. తదితరులందరు శ్రాద్ధం లేని సమయంలో వాటిని తినవచ్చును.

*న భక్షయే దేక చరానజ్ఞాతాంశ్చ మృగద్విజాన్,*
*భక్ష్యేష్వపి సముద్దిష్టాన్ సర్వాన్ పంచనఖాం స్తథా 17*

ఒంటరిగా తిరుగు మృగాలను, ఊరుపేరు తెలియని మృగ పక్షులను,ఐదుగోళ్ళున్న కోతులు మొదలగు మృగాలను చంపి తినరాదు.

*శ్వావిధం శల్యకం గోధాం ఖడ్గకూర్మశశాంస్తథా,*
*భక్ష్యాన్ పంచనఖేష్వాహురనుష్ట్రాం శ్చైకతోదతః 18*

ఐదుగోళ్ళున్న జంతువులలో ఏదుపంది, ముండ్లపంది, ఉడుము, ఖడ్గ మృగము, తాబేలు, కుందేలు అను జంతువులను చంపి తినవచ్చును గాని తక్కిన వాటిని తినరాదు. ఒంటె తప్ప ఒంటి పలువరుస ఉన్న జంతువులను తిన్నా తప్పులేదు. ఆపదలందు విధి లేక నిషిద్ధములైన జంతువుల మాంసాన్ని తిన్నా తప్పులేదు.

*ఛత్రకం విడ్వరాహం చ లశునం గ్రామకుక్కుటమ్,*
*పలాండుం గృంజనం చైవ మత్యా జగ్ధ్వా పతేద్ద్విజః 19*

*అమత్యైతాని షడ్జగ్ధ్వా కృచ్ఛ్రం సాంతపనం చరేత్,*
*యతి చాంద్రాయణం వాపి శేషేషూపవసేదహః 20*

పుంటికూర, ఊరబంది, వెల్లుల్లి, ఊరికోడి, నీరుల్లి, ఎఱ్ఱయుల్లి వీనిని కావలెనని తిన్నచో బ్రాహ్మణుడు భ్రష్టుడౌతాడు. కాని అజ్ఞానంతో వీటిని తింటే సాంతపనమనే కృచ్ఛ్రాన్ని గాని యతిచాంద్రాయణ వ్రతాన్ని గాని చేయవలెను. తక్కిన ఇంగువ మొదలైనవి తిన్నప్పుడు దినమంతా ఉపవాసము చేయవలెను.

*సంవత్సరస్యైకమపి చరేత్కృచ్ఛ్రం ద్విజోత్తమః,*
*అజ్ఞాతభుక్తశుద్ధ్యర్థం జ్ఞాతస్య తు విశేషతః 21*

బ్రాహ్మణుడు నిషిద్ధ వస్తువులను తెలియక తిన్న పాపాన్ని పోగొట్టుకొనుటకు సంవత్సరానికొకసారియైనా కృచ్ఛ్రప్రాయశ్చిత్తాన్ని చేసికొనవలెను. తెలిసి తిన్నచో విశేషప్రాయశ్చిత్తాలను చేసికొనవలెను.

*యజ్ఞార్థం బ్రాహ్మణైర్వధ్యాః ప్రశస్తా మృగపక్షిణః,*
*భృత్యానాం చైవ వృత్త్యర్థమగస్త్యో హ్యాచరత్పురా 22*

*బభూవుర్హి పురోడాశా భక్ష్యాణాం మృగపక్షిణామ్,*
*పురాణేష్వపి యజ్ఞేషు బ్రహ్మక్షత్రసవేషు చ 23*

*యత్కించిత్స్నేహసంయుక్తం భోజ్యం భోజ్యమగర్హితమ్,*
*తత్పర్యుషితమప్యాద్యం హవిశ్శేషం చ యద్భవేత్ 24*

*చిరస్థితమపి త్వాద్యమ స్నేహాక్తం ద్విజాతిభిః,*
*యవగోధూమజం సర్వం పయసశ్చైవ విక్రియాః 25*

బ్రాహ్మణులు యజ్ఞానికై, తమ సేవకుల కొరకు వేద సమ్మతములైన మృగాలను, పక్షులను చంపిరి. పూర్వం అగస్త్య మునీంద్రుడు తన తల్లిదండ్రుల పోషణకై శాస్త్ర విహితాలైన పక్షుల చంపినట్లు తెలుస్తున్నది. అట్లే పూర్వ కాలంలో ప్రాచీన మునులు చేసిన యాగాలలో, ఇతర బ్రహ్మక్షత్రియులు చేసిన యాగాలలో శాస్త్రసమ్మతంగా భక్షింపదగిన మృగపక్షులు పురోడాశంగానుండినవి. నేయి, నూనెలతో నుండి దుర్గంధాదులు లేని వస్తువులు నేయి, నూనెలు గల హవిశ్శేషము చాలా కాలమున్నా వాటిని తినవచ్చును. యవలు గోధుమలతో చేసిన పదార్థాలు నేయి, నూనెతో లేకున్నను, ఇంకను పాలనుండి ఏర్పడు పెరుగు, చల్ల, నేయి వంటి పదార్థములు చాలా కాలమున్నను బ్రాహ్మణులు భక్షింపవచ్చును.

*ఏతదుక్తం ద్విజాతీనాంభక్ష్యాభక్ష్య మశేషతః,*
*మాంసస్యాతః ప్రవక్ష్యామి విధిం భక్షణవర్జనే 26*

ఇంతవరకు బ్రాహ్మణులు తినదగిన వస్తువులను, తిన కూడని వస్తువులనన్నిటిని చెప్పితిని. ఇక మాంసాలలో వేటిని తినవచ్చునో వేటిని తినగూడదో కూడ మీకు చెప్పెదనని మునులతో భృగు మహర్షి పలికెను.

*ప్రోక్షితం భక్షయేన్మాంసం బ్రాహ్మణానాం చ కామ్యయా,*
*యథావిధి నియుక్తస్తు ప్రాణానామేవ చాత్యయే 27*

*ప్రాణస్యాన్నమిదం సర్వం ప్రజాపతిరకల్పయత్,*
*స్థావరం జంగమం చైవ సర్వంప్రాణస్య భోజనమ్ 28*

మంత్ర జలంతో ప్రోక్షితమైన పశుమాంస రూప హవిశ్శేషాన్ని, బ్రాహ్మణులు తనను ప్రార్థించినపుడొకసారి, శాద్ధంలో నియుక్తుడైనప్పుడు, ప్రాణులకు ముప్పు కలిగినపుడు మాంసాన్ని బ్రాహ్మణుడు తినవచ్చు. బ్రహ్మదేవుడు మానవులు తినుటకు స్థావరజంగమ రూపాలైన ఈ పదార్థాలను భోజ్యములుగా కల్పించెను.

*చరాణామన్నమచరా దంష్ట్రిణామప్యదంష్ట్రిణః,*
*అహస్తాశ్చ సహస్తానాం శూరాణాం చైవ భీరవః 29*

*నాత్తా దుష్యత్యదన్నాద్యాన్ ప్రాణినోz హన్యహన్యపి,*
*ధాత్రైవ సృష్టా హ్యాద్యాశ్చ ప్రాణినోz త్తార ఏవ చ. 30*

*యజ్ఞాయ జగ్ధిర్మాంసస్యేత్యేష దైవో విధిః స్మృతః,*
*అతో z న్యథా ప్రవృత్తిస్తు రాక్షసో విధిరుచ్యతే 31*

క్రీత్వా స్వయం వాऽప్యుత్పాద్య పరోపకృత మేవ వా,
దేవాన్ పితౄంశ్చార్చయిత్వా ఖాదన్ మాంసం న దుష్యతి 32

నాద్యాదవిధినా మాంసం విధిజ్ఞోऽ నాపది ద్విజః,
జగ్ధ్వా హ్యావిధినా మాంసం ప్రేత్య తైరద్యతేऽ వశః 33

న తాదృశం భవత్యేనో మృగహంతుర్ధనార్థినః,
యాదృశం భవతి ప్రేత్య వృధా మాంసాని ఖాదతః 34

చరాలైన ప్రాణులకు అచరాలైన ప్రాణులు, కోరలు గల ప్రాణులకు కోరలు లేని ప్రాణులు, చేతులున్న ప్రాణులకు చేతులు లేని ప్రాణులు, శూరులకు, పిరికిపందలు ఆహారముగా కల్పించబడ్డారు. ప్రతి దినం అన్నం మొదలైన వానిని, తినదగిన ప్రాణుల మాంసాన్ని తినేవాడు పాపాన్ని పొందడు. బ్రహ్మదేవుడే ఇవి భక్షింప తగినవనియు, వీటిని వీరు భక్షింపవచ్చునని ఏర్పరచెను. యజ్ఞం కొరకై పశువును హింసించి హెూమము చేసి ఆ హవిశ్శేషాన్ని తినుట అనునది దైవవిధి. అట్లు కాక స్వార్థానికై ప్రాణుల చంపి దాని మాంసాన్ని తిను పద్ధతి రాక్షస విధానం. కొన్నది లేక తానే స్వయంగా సమకూర్చుకొన్నది, ఇతరులు ఇచ్చింది ఐన మాంసాన్ని దేవతలకు, పితృదేవతలకు నైవేద్యము పెట్టి తిన్నచో తప్పులేదు. శాస్త్రమర్యాద తెలిసిన బ్రాహ్మణుడు ఆపదలో సహితము దేవతలకు, పితృదేవతలకు నైవేద్యము పెట్టని మాంసమును తినకూడదు. ఆ విధంగా తిన్నచో అతనిని జన్మాంతరమున ఆ జంతువులు తినును. కాని బ్రతుకుదెరువునకై ధనమునాశించి మృగాలను చంపి వాటి మాంసాన్ని అమ్ముకొను బోయవానికి లేక కటిక వానికి, రుచికై జంతువులను చంపి తినువానికి లభించే పాపము అంటదు.

నియుక్తస్తు యథాన్యాయం యో మాంసం నాత్తి మానవః,
న ప్రేత్య పశుతాం యాతి సంభవానేకవింశతిం 35

అసంస్కృతాన్ పశూన్ మంత్రై ర్నాద్యాద్విప్రః కదాచన
మంత్రైస్తు సంస్కృతానద్యాచ్ఛాశ్వతం విధి మాస్థితః 36

కుర్యాద్ఘృతపశుం సంగే కుర్యాత్పిష్టపశుం తథా,
నత్వేవ తు వృథా హంతుం పశుమిచ్ఛేత్కదాచన 37

యావంతి పశురోమాణి తావత్కృత్వో హ మారణమ్,
వృథా పశుఘ్నః ప్రాప్నోతి ప్రేత్య జన్మని జన్మని 38

శాస్త్ర మర్యాదననుసరించి శ్రాద్ధంలో నియుక్తుడైన బ్రాహ్మణుడు పితృ దేవతలకు నివేదించిన మాంసాన్ని తిననిచో అతడు ఇరువై యొక్క జన్మలు పశువై పుడుతాడు. వేద మంత్రాలచే ప్రోక్షణ చేయక ఊరకనే చంపబడ్డ పశువులను బ్రాహ్మణుడెప్పుడు కూడ తినరాదు. మంత్రాలతో సంస్కృతమైన పశువుల మాంసాలను తినుట న్యాయమే కావున వాటిని తినవచ్చును. పశుమాంసాన్ని భక్షించాలి అనే కోరికి కలిగితే నేతితో చేసిన పశువును గాని, పిండితో చేసిన పశువును గాని తినవచ్చును. కాని యజ్ఞాదులు లేక వ్యర్థంగా

పశువునెప్పుడు కూడ చంపకూడదు. యజ్ఞాది దేవతా పితృకార్యాలు లేక వ్యర్థంగా పశువును చంపేవాడు ఆ పశువునందెన్ని వెంట్రుకలున్నవో అన్ని మార్లు పరులచే చంపబడ్తాడు.

*యజ్ఞార్థం పశవస్సృష్టాః స్వయమేవ స్వయంభువా,*
*యజ్ఞోZ స్య భూత్యై సర్వస్య తస్మాద్యజ్ఞే వధోZ వధః 39*

*ఓషధ్యః పశవో వృక్షా స్తిర్యంచః పక్షిణ స్తథా,*
*యజ్ఞార్థం నిధనం ప్రాప్తాః ప్రాప్నువంత్యుత్సృతీః పునః 40*

*మధుపర్కే చ యజ్ఞే చ పితృదైవతకర్మణి,*
*అత్రైవ పశవో హింస్యా నాన్యత్రేత్యబ్రవీన్మనుః 41*

*ఏష్వర్థేషు పశూన్ హింసన్ వేదతత్త్వార్థవిద్ద్విజః,*
*ఆత్మానం చ పశూంశ్చైవ గమయత్యు త్తమాం గతిమ్ 42*

బ్రహ్మ యజ్ఞాలకై పశువులను సృష్టించినాడు. యజ్ఞాలు ప్రపంచానికి మేలు చేయుటకై సృష్టింపబడతాయి. కావున యజ్ఞంలో చేయు పశువధ తక్కిన జంతువధవంటిది కాదు. వడ్లు, యవలు మొదలైన ఔషధులు, పశువులు, వృక్షాలు, తాబేళ్ళు మొదలైనవి పక్షులు యజ్ఞంకొరకు నశిస్తే మళ్ళీ ఉత్తమ జన్మను పొందుతాయి. మధుపర్కం, జ్యోతి ష్టోమాది యజ్ఞం, పితృ దేవతలకు సంబంధించిన శ్రాద్ధం, దేవతలకు సంబంధించిన దేవతా క్రియల యందు మాత్రమే పశువుల చంపవచ్చునని మనువు పల్కెను. వేద తత్త్వము, వేదార్థము చక్కగా తెలిసిన బ్రాహ్మణుడు పై సమయములందు మాత్రమే పశువులను చంపి తాను ఉత్తమ లోకాలకు చేరుతాడు.

*గృహే గురావరణ్యే వా నివసన్నాత్మవాన్ ద్విజః*
*నా వేదవిహితాం హింసామాపద్యపి సమాచరేత్ 43*

*యా వేదవిహితా హింసా నియతాస్మింశ్చరాచరే,*
*అహింసామేవ తాం విద్యాద్వేదాద్ధర్మో హి నిర్బభౌ 44*

*యోZ హింసకాని భూతాని హినస్త్యాత్మసుఖేచ్ఛయా,*
*న జీవంశ్చ మృతశ్చైవ న క్వచిత్సుఖమేధతే 45*

గృహస్థాశ్రమం, బ్రహ్మ చర్యాశ్రమం, వానప్రస్థాశ్రమం వీటిలో ఉన్న బ్రాహ్మణోత్తముడు వేదవిరుద్ధమైన జంతుహింసను ఆపద కలిగినప్పుడు సైతము చేయరాదు. వేద సమ్మతమైన జంతుహింస అహింస వంటిదే ఔతుంది. మనకు ధర్మమంతా వేదం నుండియే తెలుస్తున్నందువల్ల వేద విహితమైన హింస అధర్మం కాజాలదు. పరులను హింస చేయని లేళ్ళు మొదలైన జంతువులను తనపొట్ట కోర్కై చంపువాడు బ్రతికి యున్నా చచ్చినవానితో సమానుడౌతాడు. అతనికెప్పుడును సుఖం కలుగదు.

*యో బంధనవధక్లేశాన్ ప్రాణినాం న చికీర్షతి,*
*స సర్వస్య హితప్రేప్సుః సుఖమత్యంతమశ్నుతే 46*

యద్ధ్యాయతి యత్కురుతే ధృతిం బధ్నాతి యత్ర చ,
తదవాప్నోత్యయత్నేన యో హినస్తి న కించన 47

నాకృత్వా ప్రాణినాం హింసాం మాంసముత్పద్యతే క్వచిత్,
న చ ప్రాణివధస్స్వర్గ్య స్తస్మా న్మాంసం వివర్జయేత్ 48

సముత్పత్తిం చ మాంసస్య వధబంధౌ చ దేహినామ్,
ప్రసమీక్ష్య నివర్తేత సర్వమాంసస్య భక్షణాత్ 49

న భక్షయతి యో మాంసం విధిం హిత్వా పిశాచవత్,
స లోకే ప్రియతాం యాతి వ్యాధిభిశ్చ న పీడ్యతే 50

అనుమంతా విశసితా నిహంతా క్రయవిక్రయీ,
సంస్కర్తా చోపహర్తా చ ఖాదకశ్చేతి ఘాతుకాః 51

జంతువులను కట్టివేయుట, చంపుట, కష్టపెట్టుట అను వాటిని చేయనొల్లని సత్పురుషుడు సమస్త జీవులకు హితమును కోరుచు మోక్షరూపమైన ఆనందాన్ని పొందుతున్నాడు. ఎట్టి ప్రాణిని సైతం బాధించని వాడు తాను ధ్యానించు ధర్మాన్ని, చేయు ధర్మకార్యాన్ని, నిష్ఠగా చింతించు పరమార్థాన్ని సులభంగా పొందగలుగుతాడు. ప్రాణులను హింసింపక మాంసం దొరకనే దొరకదు. ప్రాణివధ చేయకపోవుట స్వర్గానికి తీసికొనిపోతుంది. అందువల్ల ప్రాణివధ ఎప్పుడు కూడ చేయరాదు. మాంసము పుట్టు విధానాన్ని, ప్రాణి వధ, బంధమును, గుర్తించి, వేద విహితములైన మాంసాలతో సహా అన్ని విధాల మాంసాన్ని తినకూడదు. ఒక పద్ధతి లేక దయ్యంవలె మాంసం తినుటను, మానివేసినవాడు లోకంలో అందరికి ఇష్టమైనవాడై రోగపీడితుడు కాక సుఖంగానుంటాడు. ఘాతుకులనగా జీవహింసకు సమ్మతించువాడు, ప్రాణులను చంపి వాటి అవయవములు ఛేదించువాడు, ప్రాణుల చంపువాడు, మాంసము కొనువాడు, దానినమ్మువాడు, వంటచేయువాడు, వడ్డన చేయువాడు, భక్షించువాడు.

స్వమాంసం పరమాంసేన యో వర్ధయితుమిచ్ఛతి,
అనభ్యర్చ్య పితౄన్ దేవాం స్తతోऽన్యో నా స్త్యపుణ్యకృత్ 52

పితృ దేవతలను, దేవతలను సంతోషపెట్టుటకు గాక ఆత్మతృప్తికై పరమాంసంచే తన మాంసాన్ని పెంచుకొనే వానికంటె పుణ్యహీనుడు ఉండడు.

వర్షే వర్షేऽశ్వమేధేన యో యజేత శతం సమాః,
మాంసాని చ న ఖాదేద్యస్తయోః పుణ్యఫలం సమమ్ 53

ఫలమూలాశనైర్మేధ్యైర్మున్యన్నానాం చ భోజనైః,
న తత్ఫలమవాప్నోతి యన్మాంసపరివర్జనాత్ 54

మాంసభక్షయితాऽ ముత్ర యస్య మాంసమిహాద్మ్యహం,
ఏతన్మాంసస్య మాంసత్వం ప్రవదంతి మనీషిణః. 55

*న మాంసభక్షణే దోషో న మద్యే న చ మైథునే,*
*ప్రవృత్తి రేషా భూతానాం నివృత్తిస్తు మహాఫలా 56*

ప్రతి సంవత్సరం అశ్వమేధయాగం చేస్తూ నూరు అశ్వమేధయాగాలు చేస్తే ఎంత ఫలము కలుగుతుందో మాంసభక్షణం చేయనివానికి అంతే ఫలం కలుగుతుంది. ఫలమూలాలను భక్షించుటచేత, మునులు భుజించునెవ్వరి ధాన్యాన్ని భుజించుట చేత కలుగు ఫలం కంటే మాంసభక్షణం చేయనందువల్ల ఎక్కువ ఫలితం కలుగుతుంది. ఈ లోకంలో ఏ జీవి యొక్క మాంసం తింటున్నాడో పరలోకంలో ఆజీవి ఇతని మాంసాన్ని తింటుంది. మాంసం అనగా ఇదియే అర్థమని పెద్దలంటారు. మాంసాన్ని తినుటలో పెద్ద తప్పుకనిపించదు. మద్యాన్ని త్రాగుటలో కూడ దోషం కనిపించదు. జారత్వంలో సైతం దోషం కనిపించదు. కారణమేమన ప్రాణులకు ఈ మూడు సహజమైనవి. కాని అట్టివాని యందు ప్రవృత్తి లేకుండుటచాలా గొప్పదని చెపుతారు.

*ప్రేతశుద్ధిం ప్రవక్ష్యామి ద్రవ్యశుద్ధిం తథైవ చ,*
*చతుర్ణామపి వర్ణానాం యథావదనుపూర్వశః 57*

బ్రాహ్మణులు మొదలైన నాలుగు జాతులవారికి తమ బంధువులు మృతి యైనప్పుడు అశౌచమెన్నిదినములుండునో ఆది ఎప్పుడు నివృత్తియగునో ద్రవ్యములకు శుద్ధి ఎప్పుడో వాటినన్నిటిని వరుసగా తెలుపుదును అని భృగుహర్షి మునులతో పలికెను.

*దంతజాతేz నుజాతే చ కృతచూడే చ సంస్థితే,*
*అశుద్ధా బాంధవాస్సర్వే సూతకే చ తథోచ్యతే 58*

*దశాహం శావమాశౌచం సపిండేషు విధీయతే,*
*అర్వాక్ సంచయనాదస్థ్నాం త్ర్యహమేకాహమేవ చ 59*

పండ్లు మొలుచుట ప్రారంభమైనవాడు, పండ్లు చక్కగా వచ్చినవాడు, చౌళము ఐనవాడు, ఉపనయనమైనవాడు మృతి చెందినపుడు వాని జ్ఞాతులకందరకు అశౌచము కలదు. అట్లే సూతకమునందును అశౌచముండును. బ్రాహ్మణులలో సపిండులకు మృతి వలన ఏర్పడు అశౌచము పది దినములుండును. వేదాధ్యయనం, శౌచం మొదలగు సుగుణాలననుసరించి కొందరకు అస్థిసంచయనం వరకు నాలుగు మూడు ఒక దినము అశౌచముండును. అనగా సాంగ వేదాధ్యయనము చేసి అగ్ని హోత్రములొనర్చుచువ్రత నిష్ఠులైనవారికి ఒకేదినము అశౌచము. కేవలం వేదాధ్యయన సంపన్నునకు మూడు దినములు కేవలాగ్నిహోత్రికి నాలుగు దినములు అశౌచముండును. ఇవి ఏవియు లేనిచో పది దినములశుచియై ఉండవలెను.

*సపిండతా తు పురుషే సప్తమే వినివర్తతే,*
*సమానోదక భావస్తు జన్మ నామ్నోరవేదనే 60*

*యథేదం శావమాశౌచం సపిండేషు విధీయతే,*
*జననేz ప్యేవమేవ స్యాన్నిపుణాం శుద్ధి మిచ్ఛతామ్ 61*

తనతోపాటు తనకు పూర్వమున్న ఏడు తరముల వారికి సపిండత్వము గలదు. అట్లే ఇతడు ఇతని యొక్క పుత్రుడు, ఇతని పేరిది అని పేరు, బంధుత్వము తెలిసినంత వరకు సమానోదకత్వముండును. అది తెలియనిచో సమానోదకత్వముండదు. సపిండులకు మృతి సమయమున పది దినములశౌచమెట్లుండునో అదే విధముగా జననమునందును పది దినములు అశౌచముండును.

*సర్వేషాం శావమాశౌచం మాతాపిత్రోస్తు సూతకమ్,*
*సూతకం మాతురేవ స్యాదుపస్పృశ్య పితా శుచిః 62*

మృతికి సంబంధించిన అశౌచము సపిండీకులకందరకు సమానమే. జాతాశౌచము తల్లి దండ్రులకు మాత్రమే ఉండును అందులోను తల్లికి పది దినములవరకు జాతాశౌచముండును. తండ్రికి శిశువును తగిలి స్నానం చేయునంతవరకే జాతాశౌచముండును.

*నిరస్య తు పుమాన్ శుక్రముపస్పృశ్యైవ శుద్ధ్యతి,*
*బైజికాదభిసంబంధాదనురుంధ్యాదఘం త్ర్యహమ్ 63*

భార్యా సంగమం చేసినవాడు స్నానం చేతనే పరిశుద్ధుడగును. పర భార్యాసంగమం చేసినవాడు మూడు దినాల తరువాత పరిశుద్ధుడగును.

*అహ్నా చైకేన రాత్ర్యా చ త్రిరాత్రైరేవ చ త్రిభిః*
*శవస్పృశో విశుద్ధ్యంతి త్ర్యహాదుదకదాయినః 64*

శవమును ముట్టుకొన్న వారికి కూడ పది దినాల అశౌచము. తరువాత వారు పరిశుద్ధులౌతారు. సమానోదకులు మూడు దినముల తరువాత పరిశుద్ధులౌతారు.

*గురోః ప్రేతస్య శిష్యస్తు పితృమేధం సమాచరన్,*
*ప్రేతహారైస్సమం తత్ర దశరాత్రేణ శుద్ధ్యతి 65*

గురువు చనిపోయినపుడు అతనికి సంస్కారమొనర్చిన శిష్యునకు, గురువు యొక్క దాయాదులతో కలిపి పది దినముల మృతాశౌచముండును.

*రాత్రిభిర్మాసతుల్యాభిర్గర్భస్రావే విశుద్ధ్యతి,*
*రజస్యుపరతే సాధ్వీ స్నానేన స్త్రీ రజస్వలా 66*

స్త్రీకి మూడవ నెల మొదలు ఆరు నెలల వరకు గర్భ స్రావమైనచో ఆగర్భము ఎన్ని నెలలవరకున్నదో అన్ని దినములు అశౌచముండును. ఏడవనెలలవరకున్నదో అన్నిదినములు అశౌచముండును. ఏడవనెలమొదలుకొని జాతాశౌచపద్ధతి నవలంబింపవలెను. పిత్రాదిసపిండులందరికి వెంటనే శుద్ధికలుగును. స్త్రీ రజస్వలయైనచో ఆ రజస్సు ఆగిపోవునంతవరకు నాల్గవ దినమున స్నానం చేసి పరిశుద్ధురాలగుచున్నది. శ్రౌత స్మార్తకర్మలకు ఐదవ నాడు స్నానం చేసిన తరువాత పరిశుద్ధురాలౌతుంది.

*నృణామకృత చూడానాం విశుద్ధిర్నైశికీ స్మృతా,*
*నిర్వృత్త చూడకానాం తు త్రిరాత్రా చ్ఛుద్ధి రిష్యతే 67*

చూడాకర్మ (చౌళము) కాని శిశువు చనిపోయినచో సపిండీకులకు ఒక దినము మాత్రము అశౌచముండును. చూడాకర్మ జరిగిన శిశువు చనిపోయినచో మూడు దినముల తర్వాత శుద్ధి జరుగును.

*ఊనద్వివార్షికం ప్రేతం నిదధ్యుర్బాంధవా బహిః,*
*అలంకృత్య శుచౌ భూమావస్థిసంచయనాదృతే 68*

*నాఽస్యకార్యోఽగ్ని సంస్కారో న చ కార్యోదక క్రియా,*
*అరణ్యే కాష్ఠవత్త్యక్త్వా క్షపేయుస్త్ర్యహ మేవ చ. 69*

*నా త్రివర్షస్య కర్తవ్యా బాంధవైరుదక క్రియా,*
*జాతదంతస్య వా కుర్యుర్నామ్ని వాపి కృతే సతి 70*

రెండు సంవత్సరములు దాటని శిశువు చనిపోయినచో ఆ మృత శిశువును బంధువులు అలంకరించి ఊరికి అవతల ఖననము చేయవలెను. అతనికి అగ్ని సంస్కారంగాని తిలతర్పణాది ఉదకదానం గాని చేయకూడదు. అతని శవమును. ఖననం చేసి మూడు దినములు అ శౌచాన్ని పాటించాలి. మూడు వర్షములు నిండని బాలునకు తండ్రి సపిండీకులు ఉదక దానము (తర్పణము) చేయవలసిన పనిలేదు. అట్లే నామకరణమైన శిశువునకు దంతములు వచ్చిన శిశువుకు ఉదక దానము చేయవచ్చును వదిలి పెట్టవచ్చును.

*సబ్రహ్మచారిణ్యేకాహమతీతే క్షపణం స్మృతం,*
*జన్మన్యేకోదకానాం తు త్రిరాత్రాచ్ఛుద్ధిరిష్యతే.71*

సహాధ్యాయి (కలిసి వేదాధ్యయనముచేసినవాడు) మృతుడైనప్పుడు ఏకరాత్రమశౌచముండును. సోదరుడు గతించెనేని అతని సోదరులకుత్రిరాత్రము అశౌచముండును.

*స్త్రీణామసంస్కృతానాం తు త్ర్యహాచ్ఛుద్ధ్యంతి బాంధవాః,*
*యథోక్తేనైవ కల్పేన శుధ్యంతి తు సనాభయః.72*

*అక్షారలవణాన్నాస్స్యు ర్నిమజ్జేయుశ్చతే త్ర్యహమ్,*
*మాంసాశనం చ నాశ్నీయుః శయీరంశ్చ పృథక్ క్షితౌ.73*

స్త్రీ, వివాహ సంస్కారము కాక వివాహనిశ్చయమై చనిపోయినచో కాబోవు భర్త, అతని జ్ఞాతులకు మూడు దినములవరకు అశౌచముండును. తండ్రి తండ్రి యొక్క దాయాదులకు పూర్వం చెప్పినట్లు మూడు దినముల తరువాత అశౌచనివృత్తి ఔతుంది. ఆ త్రిరాత్రాశౌచమందు ఉప్పులేని అన్నాన్ని తినవలెను. చల్లనినీళ్ళలో స్నానం చేయవలెను. మాంసం తినరాదు. భార్యా భర్తలు వేరు వేరుగా భూమిపై పడుకొనవలెను.

*సన్నిధావేష వై కల్పశ్శావాశౌచస్య కీర్తితః,*
*అసన్నిధావయం జ్ఞేయో విధిస్సంబంధిబాంధవైః.74*

మృతినొందినవాడు తన సమీపమున నున్నప్పుడే పై రీతిననుసరించి అశౌచమునవలంబింపవలెను. మృతుడు సమీపమున లేనప్పుడు సపిండులు ఆచరింప వలసిన అశౌచవిధి ఈ క్రింది విధముగానుండును.

*విగతం తు విదేశస్థం శృణుయాద్యో హ్యనిర్దశమ్,*
*యచ్ఛేషం దశరాత్రస్య తావదేవాశుచిర్భవేత్.75*

*అతిక్రాంతే దశాహే చ త్రిరాత్రమశుచిర్భవేత్,*
*సంవత్సరే వ్యతీతే తు స్పృష్ట్వైవాపో విశుద్ధ్యతి.76*

*నిర్దశం జ్ఞాతిమరణం శ్రుత్వా పుత్రస్య జన్మ చ,*
*సవాసా జలమాప్లుత్య శుద్ధో భవతి మానవః.77*

*బాలే దేశాంతరస్థే చ పృథక్ పిండే చ సంస్థితే,*
*సవాసా జలమాప్లుత్య సద్య ఏవ విశుద్ధ్యతి.78*

దేశాంతరమందున్నవాడు చనిపోయినట్లు పది దినముల లోపల తెలిసినచో మిగిలినదినములు అశుచిపాటించి తరువాత పరిశుద్ధుడగును. దశాహము దాటిన తరువాత మరణ విషయము లేక పుట్టిన విషయము తెలిసినచో వెంటనే స్నానమాచరించి పరిశుద్ధుడగును. దేశాంతరమందున్న చౌళము కాని బాలుడు మృతి నొందినట్లు తెలిసినను, త్రిరాత్రము అశౌచముండదగిన సమానోదకుడు చనిపోయినట్లు తెలిసినను, వెంటనే స్నానమాచరించి పరిశుద్ధుడు కావచ్చును.

*అంతర్దశాహే స్యాతాం చేత్పునర్మరణజన్మనీ,*
*తావత్స్యాదశుచిర్విప్రో యావ త్తత్స్యాదనిర్దశం.79*

పది దినములలో మరల అట్టి దశాహ జననమరణములు జరిగినచో మొదటి అశౌచకాలమెంతవరకుండునో అంతవరకే అశౌచముండును. 79

*త్రిరాత్రమాహురాశౌచమాచార్యే సంస్థితే సతి,*
*తస్య పుత్రే చ పత్న్యాం చదివారాత్రమితి స్థితిః.80*

ఆచార్యుడు చనిపోయినచో శిష్యుడు మూడురాత్రులు అశౌచముండవలెను. ఆచార్యుని పుత్రుడు, అతని భార్య చనిపోతే శిష్యుడు ఒక దినము అశౌచాన్ని పాటింపవలెనని అంటారు.

*శ్రోత్రియే తూపసంపన్నే త్రిరాత్ర మశుచిర్భవేత్,*
*మాతులే పక్షిణీం రాత్రిం శిష్యర్త్విగ్బాంధవేషు చ.81*

*ప్రేతే రాజని సజ్యోతిర్యస్య స్యాద్విషయే స్థితః,*
*అశ్రోత్రియే త్వహః కృత్స్నమనూచానే తథా గురౌ.82*

శ్రోత్రియుడైన బ్రాహ్మణుడు సమీపంలో చనిపోతే మూడు రాత్రులు అశౌచమౌతుంది మేనమామ, శిష్యుడు, ఋత్విక్కు, బంధువులు చనిపోతే పక్షిణీరాత్రి (రెండు

రాత్రులు, ఒక పగలు) అశుచి యగును. రాజు చనిపోయినచో పగలు చనిపోయిన సాయంకాలము వరకు, రాత్రి చనిపోయినచో నక్షత్రములకాంతియున్నంతవరకు బ్రాహ్మణాదులకు అశౌచముంటుంది. అశ్రోత్రియుడైన బ్రాహ్మణుడు తన ఇంట చనిపోయినను, సాంగవేదాధ్యయనము చేసినవాడు, గురువు చనిపోయినను ఒక పగలంతయు అశౌచముగా పరిగణింపవలెను. రాత్రి చనిపోయినచో ఆ రాత్రి మాత్రమే అశౌచముగా పరిగణింపవలెను.

*శుద్ధ్యేద్విప్రో దశాహేన ద్వాదశాహేన భూమిపః,*
*వైశ్యః పంచదశాహేన శూద్రో మాసేన శుద్ధ్యతి.83*

తనసపిండుడు చనిపోయినచో బ్రాహ్మణునకు పది దినముల అశౌచముండును. క్షత్రియునకు పన్నెండు దినముల అశౌచముండును. వైశ్యునకు పది హేను దినములఅశౌచముండును. శూద్రునకు ఒక నెల కాలమశౌచముండును.

*న వర్ధయేదఘాహాని ప్రత్యూహేన్నాగ్నిషు క్రియాః,*
*న చ తత్కర్మ కుర్వాణస్సనాభ్యోz ప్యశుచిర్భవేత్.84*

బ్రాహ్మణుడు అశౌచదినములను పెంచుకొనవద్దు. తన అగ్ని హోత్రాది క్రియలకు భంగము కలిగింప కూడదు. ఆ అశుచి సమయమున పుత్రుడు మొదలగువారు తన తండ్రికి సంబంధించిన అగ్నిహోత్రక్రియలను చేయవచ్చును. అప్పుడతనికి అశౌచము లేదు. అనగా అగ్ని హోత్రక్రియలకు భంగము కలిగించకూడదు.

*దివాకీర్తిముదక్యాం చ పతితం సూతికాం తథా,*
*శవం తత్స్పృష్టినం చైవ స్పృష్ట్వా స్నానేన శుద్ధ్యతి.85*

మంగలిని, రజస్వలను, భ్రష్టుని, సూతికాగృహంలో నున్న దానిని, శవాన్ని శవాన్ని తగిలినవానిని తాకినచో స్నానముచే పరిశుద్ధి కలుగును.

*ఆచమ్య ప్రయతో నిత్యం జపేదశుచిదర్శనే,*
*సౌరాన్మంత్రాన్ యథోత్సాహం పావమానీశ్చ శక్తితః.86*

అపరిశుద్ధ విషయములను చూచినప్పుడు స్నానము చేసిన తరువాత ఆచమనం చేసి సూర్యునికి సంబంధించిన మంత్రాలను, పావమాన సూక్తములను యథాశక్తి జపించవలెను.

*నారం స్పృష్ట్వాస్థి సస్నేహం స్నాత్వా విప్రో విశుద్ధ్యతి,*
*ఆచమ్యైవ తు నిస్స్నేహం గామాలభ్యార్కమీక్ష్య వా.87*

జిడ్డు గలిగిన మనుష్యుని ఎముకను తాకిన బ్రాహ్మణుడు స్నానం చేతనే పరిశుద్ధుడౌతాడు. అదే విధంగా జిడ్డులేని ఎముకను తాకినచో ఆచమనం చేసి, గోవును స్పృశించిగాని సూర్యుని చూచిగాని పరిశుద్ధుడౌతాడు.

*ఆదిష్టీ నోదకం కుర్యాదావ్రతస్య సమాపనాత్,*
*సమాప్తే తూదకం కృత్వా త్రిరాత్రేణైవ శుద్ధ్యతి.88*

బ్రహ్మచర్యము మొదలగు దీక్షపూనినవాడు ఆ దీక్ష పూర్తియగువరకు తల్లి దండ్రులు కాక తక్కిన జ్ఞాతులు మరణించినచో అశౌచముండి ఉదకదానము (తర్పణము) చేయనవసరములేదు. కాని బ్రహ్మచర్య దీక్షా సమాప్తి చేసికొన్న తరువాత మూడు రాత్రుల వరకు అశౌచముండి ఉదకదానము చేయవలెను. తలి దండ్రులు, గురువు మరణించినచో దీక్షను వదలి అశౌచముగా నుండి ఉదక దానం చేసిన తరువాత తిరిగి దీక్ష వహించవలెను.

*వృథాసంకరజాతానాం ప్రవ్రజ్యాసు చ తిష్ఠతామ్,*
*ఆత్మనస్త్యాగినాం చైవ నివర్తేతోదక క్రియా. 89*

*పాషండమాశ్రితానాం చ చరంతీనాం చ కామతః,*
*గర్భభర్తృద్రుహాం చైవ సురాపీనాం చ యోషితామ్. 90*

స్వధర్మాన్ని వదలిపెట్టిన వారికి సంకర జాతులకు, వేద బాహ్యమైన ఎఱ్ఱని బట్టలు కట్టుకొని తిరుగువారికి, విషం ఉరిపోసికొనుట మొదలగు వానిచే ప్రాణత్యాగం చేసిన వారికి, ఉదక దానం మొదలగునవి చేయకూడదు. పాషండ భావాన్ని ఆశ్రయించువారికి, విచ్చల విడిగా తిరుగుస్త్రీలకు, గర్భస్రావము, భర్తకు ద్రోహము మున్నగు పాపములుచేయుస్త్రీలకు, మద్యపానం చేయుస్త్రీలకు ఉత్తర క్రియలు చేయనవసరములేదు.

*ఆచార్యం స్వముపాధ్యాయం పితరం మాతరం గురుమ్,*
*నిర్హృత్య తు వ్రతీ ప్రేతాన్ న వ్రతేన వియుజ్యతే.91*

ఆచార్యునికి, తనకు కొద్దిగనో గొప్పగనో చదువు చెప్పిన ఉపాధ్యాయునికి, తల్లి దండ్రులకు, వేదవేదాంగ తత్వమును చెప్పే గురువుకు, ప్రేత సంస్కారము చేసినచో వారి వ్రతానికెట్టి లోపం జరుగదు.

*దక్షిణేన మృతం శూద్రం పురద్వారేణ నిర్హరేత్,*
*పశ్చిమోత్తరపూర్వైస్తు యథాయోగం ద్విజన్మనః.92*

శూద్రుని శవం దక్షిణ దిశగా, పశ్చిమ దిక్కునుండి వైశ్యుని శవం, ఉత్తరదిక్కునుండి క్షత్రియుని శవం, తూర్పు దిక్కు నుండి బ్రాహ్మణుని శవం ఊరి బయటకు తీసికొని పోవలెను.

*న రాజ్ఞామఘదోషోऽస్తి వ్రతినాం న చ సత్రిణాం,*
*ఐంద్రం స్థానముపాసీనా బ్రహ్మభూతా హి తే సదా.93*

పట్టాభిషిక్తులైన రాజులకు, బ్రహ్మచర్యం మొదలగు వ్రత దీక్ష కలవారికి, యాగము చేయుచుండు వారికి, వారి సపిండులు మొదలగు వారు మృతి చెందినప్పుడు అశౌచముండదు. ఇంద్రస్థానమును పొందిన ఆ రాజు మొదలగు వారు బ్రహ్మస్వరూపులే.

*రాజ్ఞో మాహాత్మికే స్థానే సద్యశ్శౌచం విధీయతే,*
*ప్రజానాం పరిరక్షార్థమాసనం చాత్ర కారణమ్.94*

రాజు రాజ్యాధికారమను మహోన్నత స్థానమున ఉన్నందువలన అతనికి ఆ అశౌచమునుండి వెంటనే నివృత్తి కలుగుతుంది. పైగా ఆ మహారాజు న్యాయవిచార, క్షామాది

సమయములందు అన్నదానం. ఉపద్రవ సమయములందు శాంతి హోమాలు చేయవలసి యున్నందున అతనికి అశౌచమునుండి వెంటనే నివృత్తి కలుగుతుంది.

*డింబాహవహతానాం చ విద్యుతా పార్థివేన చ,*
*గోబ్రాహ్మణస్య చైవార్థే యస్య చేచ్ఛతి పార్థివః.95*

రాజులేని యుద్ధంలో చచ్చిన వానికి, పిడుగు పడి చచ్చిన వానికి, రాజుచే మరణ దండన శిక్ష పడ్డవానికి, సాధువులకు మేలు గోరి వధింప బడ్డ వారికి, రాజుకు ఎవరి అవసరముండునో వారి విషయాన వెంటనే అశౌచము తీరి పరిశుద్ధుడగును.

*సోమాగ్న్యర్కానిలేంద్రాణాం విత్తాప్పత్యోర్యమస్య చ,*
*అష్టానాం లోకపాలానాం వపుర్ధారయతే నృపః .96*

*లోకేశాదిష్ఠితో రాజా నాస్యాశౌచం విధియతే,*
*శౌచాశౌచం హి మర్త్యానాం లోకేశ ప్రభవాప్యయమ్.97*

రాజు చంద్రుడు, అగ్ని, సూర్యుడు, వాయువు, ఇంద్రుడు, కుబేరుడు వరుణుడు, యముడు, అను అష్టలోకపాలకుల అంశను ధరించుచున్నందు వలన అతనికి అశౌచము లేదు. మానవులకు శౌచాశౌచములు రాజు వలననే కలుగుచున్నవి. కావున వీటికి కారకుడగు రాజుకు అశౌచములేదు.

*ఉద్యతైరాహవే శస్త్రైః క్షత్రధర్మహతస్య చ,*
*సద్యస్సంతిష్ఠతే యజ్ఞ స్తథా శౌచ మితి స్థితిః.98*

రాజ ధర్మమైన యుద్ధంలో శస్త్రాలచే మరణం చెందిన వానికి, యజ్ఞఫలం లభిస్తుంది. కావున అతని మరణం వల్ల అశౌచముండదు.

*విప్రశ్శుధ్యత్యపస్స్పృష్ట్వా క్షత్రియోవాహనాయుధమ్,*
*వైశ్యః ప్రతోదం రశ్మీన్ వా యష్టిం శూద్రః కృతక్రియః.99*

బ్రాహ్మణుడు నీటిని స్పృశించి పరిశుద్ధుడగుచున్నాడు. రాజు వాహనములను ఆయుధాలను తాకి పునీతుడగుచున్నాడు. వైశ్యుడు మునికోలను, పగ్గాన్ని పట్టుకొన్నందు వల్ల, శూద్రుడు దండమును పట్టుకొని తనకప్పగించినపని పూర్తి చేసి పవిత్రుడగుచున్నాడు.

*ఏతద్వోఽ భిహితం శౌచం సపిండేషు ద్విజోత్తమాః,*
*అసపిండేషు సర్వేషు ప్రేతశుద్ధిం నిబోధత.100*

ఓ మునులారా ! మీకింతవరకు సపిండులు చనిపోయినప్పుడు కలుగు అశౌచము గురించి వివరించినాను. ఇక సపిండులుకానివారు చనిపోయినపుడు చేయ వలసిన ప్రేత శుద్ధిని మీకు వివరింతునని భృగు మహర్షి పలికెను.

*అసపిండం ద్విజం ప్రేతం విప్రో నిర్హృత్య బంధువత్,*
*విశుద్ధ్యతి త్రిరాత్రేణ మాతురాప్తాంశ్చ బాంధవాన్.101*

*యద్యన్నమత్తి తేషాం తు దశాహేనైవ శుద్ధ్యతి,*
*అనదన్నన్నమహ్నైవ న చేత్తస్మిన్ గృహే వసేత్.102*

బ్రాహ్మణుడు అసపిండుడు కాని బ్రాహ్మణశవమును బంధుశవం వలె ప్రేత సంస్కారం చేయవలెను. తల్లికి బంధువులైన వారికి కూడ తన బంధువుల వలె ప్రేత సంస్కారాన్ని చేయవలెను. తరువాత అతడు మూడు రాత్రులు అశౌచముతో నుండి శుద్ధుడు కావలెను. శవమునెత్తికొని పోవువాడు అశౌచుల అన్నము తిన్నచో వారి దాయాదులతో పాటు ఇతడు కూడ పది దినముల అశౌచము చేయవలెను. వారి ఇంటిలో ఉండి మృతాశౌచముకలవారి అన్నం తినకపోతే ఆ శవవాహకునకు మూడు దినములు మాత్రమే అశౌచముంటుంది. మృతుని ఇంటిలోనుండక వారి తిండి తినక శవముమోసికొని పోయిన వానికి ఒక్క పగలే అశౌచముంటుంది.

*అనుగమ్యేచ్ఛయా ప్రేతం జ్ఞాతిమజ్ఞాతిమేవ వా,*
*స్నాత్వా సచేలః స్పృష్ట్వాగ్నిం ఘృతం ప్రాశ్య విశుద్ధ్యతి.103*

జ్ఞాతిని లేక జ్ఞాతికాని వాని ప్రేతాన్ని ప్రేమతో వెంబడిస్తూ పోతే వెంటనే స్నానం చేసి అగ్నిని తాకి నేయి తాగి పరిశుద్ధుడౌతాడు.

*న విప్రం స్వేషు తిష్ఠత్సు మృతం శూద్రేణ నాయయేత్,*
*అస్వర్గ్యా హ్యాహుతిస్సా స్యాచ్ఛూద్రసంస్పర్శదూషితా.104*

బ్రాహ్మణుడు చనిపోతే అతని బంధువులు, కులం వారుండగా ఆశవాన్ని శూద్రులు మోయరాదు. అందువలన అతనికి స్వర్గం కలుగదు. బంధువులు లేనిచో ఇతరులు ఆశవాన్ని మోయవచ్చునని భావము.

*జ్ఞానం తపోగ్నిరాహారో మృన్మనోవార్యుపాంజనమ్,*
*వాయుః కర్మార్కకాలౌ చ శుద్ధేః కర్తౄణి దేహినామ్.105*

*సర్వేషామేవ శౌచానామర్థశౌచం పరం స్మృతమ్,*
*యోऽర్థే శుచిర్హి స శుచిర్న మృద్వారిశుచిశ్శుచిః.106*

*క్షాంత్యా శుద్ధ్యతి విద్వాంసో దానేనాకార్యకారిణః,*
*ప్రచ్ఛన్న పాపా జప్యేన తపసా వేదవిత్తమాః.107*

*మృత్తోయైశ్శుధ్ధ్యతే శోధ్యం నదీ వేగేన శుద్ధ్యతి,*
*రజసా స్త్రీ మనోదుష్టా సన్న్యాసేన ద్విజోత్తమః.108*

*అద్భిర్గాత్రాణి శుద్ధ్యంతి మనస్సత్యేన శుద్ధ్యతి,*
*విద్యాతపోభ్యాం భూతాత్మా బుద్ధిర్జ్ఞానేన శుద్ధ్యతి.109*

జ్ఞానం, తపస్సు, అగ్ని ఆచారం, మన్ను, మనస్సు, నీరు, పూత పూయుట, గాలి, సూర్యుడు, కాలం అనేవి ప్రాణులకు పరిశుద్ధిని కలిగిస్తాయి. అన్ని శౌచాలలో ద్రవ్య శౌచం చాల గొప్పదని చెప్పబడింది. పదార్థశౌచము కలవాడే పవిత్రుడనిపించుకొంటాడు. కాని మట్టి, నీటిచే శుచియైనవాడు అర్థశుచి వలె శ్రేష్ఠుడు కాడు. విద్వాంసులు ఓర్పువల్ల,

అకార్యాలు చేసేవారు దానం వల్ల, రహస్యంగా పాపాలు చేసినవారు మంత్రజపాలతో, వేదవేత్తలలో శ్రేష్ఠులు తపస్సు చేత పరిశుద్ధులౌతారు. పాత్రలు మట్టి చేత, నీటి చే పరిశుద్ధమౌతాయి. నది వేగంగా ప్రవహించుట వలన పరిశుద్ధమౌతుంది. చెడు భావన కల స్త్రీ బహిష్ఠురాలగుట వల్ల పరిశుద్ధురాలౌతుంది. బ్రాహ్మణుడు సన్యాసాన్ని స్వీకరించి పరిశుద్ధుడౌతాడు. చెమట మొదలగు వాటిచే అపరిశుద్ధంగా నున్న శరీరం నీటిచే పరిశుద్ధమౌతుంది. చెడు మనస్సు సత్యాన్ని పలుకుట వల్ల పవిత్రమౌతుంది. సూక్ష్మలింగ శరీరంతోనున్న జీవాత్మ బ్రహ్మవిద్య, తపస్సుల చేత పవిత్రమౌతుంది. బుద్ధి, జ్ఞానం వల్ల పరిశుద్ధినందుచున్నది.

*ఏష శౌచస్య వః ప్రోక్తః శారీరస్య వినిర్ణయః,*
*నానావిధానాం ద్రవ్యాణాం శుద్ధేశ్శృణుత నిర్ణయమ్.110*

ఓ మునులారా! మీకు ఇంతవరకు శరీరానికి సంబంధించిన శౌచాన్ని వివరించినాను. ఇక అనేక విధాలైన ద్రవ్యముల యొక్క శుద్ధిని వివరిస్తానని భృగుమహర్షి పలికెను.

*తైజసానాం మణీనాం చ సర్వస్యాశ్మమయస్య చ,*
*భస్మనాద్భిర్మృదా చైవ శుద్ధిరుక్తా మనీషిభిః.111*

*నిర్లేపం కాఞ్చనం భాండమద్భిరేవ విశుద్ధ్యతి,*
*అబ్జమశ్మమయం చైవ రాజతం చానుపస్కృతమ్.112*

*అపామగ్నేశ్చ సంయోగాద్ధేమ రూప్యం చ నిర్బభౌ,*
*తస్మాత్తయోస్స్వయోన్యైవ నిర్ణేకో గుణవ త్తరః.113*

*తామ్రాయఃకాంస్యరైత్యానాం త్రపుణస్సీసకస్య చ,*
*శౌచం యథార్హం కర్తవ్యం క్షారామ్లోదక వారిభిః.114*

*ద్రవ్యాణాం చైవ సర్వేషాం శుద్ధిరుత్ప్లవనం స్మృతం,*
*ప్రోక్షణం సంహతానాం చ దారవాణాం చ తక్షణమ్.115*

*మార్జనం యజ్ఞపాత్రాణాం పాణినా యజ్ఞకర్మణి,*
*చమసానాం గ్రహాణాం చ శుద్ధిః ప్రక్షాళనేన తు.116*

బంగారు మొదలగు వానికి, మణులకు, రాతి రూపమున ఉన్న సమస్త వస్తువులకు, మట్టి, బూడిద, నీరు వీటిచే శుద్ధి కలుగుతుంది. జిడ్డుదగలని బంగారు వస్తువులు, నీటిలో పుట్టిన శంఖాలు ముత్యాలు మొదలైనవి, రాతితో చేయబడ్డ వస్తువులు గీతలు పడని వెండి వస్తువులు నీటితోనే పరిశుద్ధమౌతాయి. నీరు, అగ్ని ఈ రెండిటి వల్ల వెండి, బంగారములు ప్రకాశిస్తాయి. కావున వెండి బంగారములను నీరు, అగ్నిచే పరిశుద్ధం చేయుట తగింది. రాగి, ఇనుము కంచు, ఇత్తడి, తుత్తినాగం, సీసం వీనితో చేసిన పాత్రలను వాటి వాటికి దగినట్లు పులుసు, మరలగాల్చుట, బూడిద, నీరు వీటిచే పరిశుద్ధం చేయవలెను. నేయి, నూనె మొదలగు వానిని కాకి కీటకములు మొదలైనవి ముట్టినప్పుడు రెండు దర్భలు

గీచి తీసివేసినచో పరిశుద్ధియౌతుంది. మెత్త, శయ్య మొదలగువానికి ఎంగిలంటినప్పుడు నీటిచే ప్రోక్షణ చేసిన శుద్ధి ఔతుంది. కొయ్య సామానులకు మిక్కిలి మురికి పట్టినప్పుడు మెల్లగా చెక్కినచో శుద్ధి యౌతుంది. చమసములనెడి యజ్ఞ పాత్రలు గ్రహాలు తప్ప మిగిలిన యజ్ఞపాత్రలను చేతితో తుడిస్తే పరిశుద్ధియౌతుంది. చమసములనేగ్రహపాత్రలను నీటితో కడిగినందువలననే పరిశుద్ధికలుగుచున్నది.

*చరూణాం స్రుక్స్రువాణాం చ శుద్ధిరుష్ణేన వారిణా,*
*స్ఫ్యశూర్పశకటానాం చ ముసలోలూఖలస్య చ.117*

*అద్భిస్తు ప్రోక్షణం శౌచం బహూనాం ధాన్యవాససాం,*
*ప్రక్షాళనేన త్వల్పానామద్భిశ్శౌచం విధీయతే.118*

*చేలవచ్చర్మణాం శుద్ధిర్వైదలానాం తథైవ చ,*
*శాకమూలఫలానాం చ ధాన్యవచ్ఛుద్ధిరిష్యతే.119*

*కౌశేయావికయోరూషైః కుతపానామరిష్టకైః,*
*శ్రీఫలైరంశుపట్టానాం క్షౌమాణాం గౌరసర్షపైః120*
*క్షౌమవచ్ఛంఖశృంగాణామస్థిదంతమయస్య చ,*
*శుద్ధిర్విజానతా కార్యా గోమూత్రేణోదకేన వా.121*

*ప్రోక్షణాత్తృణకాష్ఠం చ పలాలం చైవ శుద్ధ్యతి,*
*మార్జనోపాంజనై ర్వేశ్మ పునః పాకేన మృణ్మయం.122*

*మద్యైర్మూత్రైః పురీషైర్వా ష్ఠీవనైఃపూయశోణితైః,*
*సంస్పృష్టం నైవ శుద్ధ్యేత పునః పాకేన మృణ్మయమ్.123*

జిడ్డు గలిగిన చరువుస్రుక్ స్రువములను వేడి నీటితో పరిశుద్ధిచేయవలెను. జిడ్డు లేనిచో నీటితోనే పరిశుద్ధమౌతాయి. యూపం చేట, బండి, రోలు, రోకలి వీనిని నీటితో కడిగినచో పరిశుద్ధములౌతాయి. అధిక పరిమాణములో నున్న ధాన్య వస్త్రాలు అపరిశుద్ధమైనప్పుడు నీళ్ళు చల్లితే అవి పరిశుద్ధమౌతాయి. కాని తక్కువ పరిమాణంలో ఉన్నప్పుడు ధాన్యమును కడుగవలెను. వస్త్రాలను నీటిలో పిండవలెను. కృష్ణాజినము, పులితోలు మొదలగు చర్మాలను, వెదురు తడకలను తక్కువ పరిమాణంలో ఉన్న వస్త్రములను పరిశుద్ధిచేసినట్లు నీటితో కడుగవలెను. కూరగాయలు దుంపలు పండ్లు మొదలగువానిని ధాన్యమును శుద్ధి చేసినట్లు నీటితో ప్రోక్షణ చేయవలెను. పట్టు వస్త్రాలను, ఉన్నికంబళ్ళను చౌడు మన్నుతో, నేపాల దేశపు కంబళ్ళను వేప విత్తనములతో శాలువలను మారేడు పండ్లతో, తెల్ల పట్టును తెల్ల యావాలపొడితో శుద్ధి చేయవలెను శంఖం, దంతం, జింకకొమ్ము మొదలగు వాటిని తెల్లని పట్టును శుద్ధి చేసినట్లు తెల్లయావాల పొడి గోమూత్రము లేక నీటిలో కలిపి శుద్ధి చేయవలెను. తృణము, కట్టెలు, తరకలు జల ప్రోక్షణము చేతనే పరిశుద్ధి నొందును. ఇంటిని నీటితో కడుగుట అలుకుట మొదలగువాని వలన పరిశుద్ధీ చేయవచ్చును. మట్టి పాత్రలను మరల కాల్చి పరిశుద్ధము చేయవచ్చును.

కాని మద్యము, మూత్రము మలము, తుమ్ముట, చీము, రక్తము వీటిచేత అపరిశుద్ధమైన మట్టిపాత్ర మరల కాల్చినా పరిశుద్ధం కాదు. దానిని బయట పారవేయవలసిందే కాని పరిశుద్ధి చేయుటకు వీలులేదు.

*సంమార్జనోపాంజనేన సేకేనోల్లేఖనేన చ,*
*గవాం చ పరివాసేన భూమిశ్శుద్ధ్యతి పంచభిః.124*

*పక్షిజగ్ధం గవాఘ్రాతమవధూతమవక్షుతం,*
*దూషితం కేశకీటైశ్చ మృత్ప్రక్షేపేణ శుద్ధ్యతి.125*

*యావన్నాపైత్యమేధ్యాక్తాద్గంధో లేపశ్చ తత్కృతః,*
*తావన్మృద్వారి చాదేయం సర్వాసు ద్రవ్యశుద్ధిషు.126*

భూమి, ఊడ్చుట, అలుకుట, గోమూత్రము మొదలగునవి చల్లుట, పై మట్టిని తొలగించుట, ఆవులను కట్టివేయుట అను ఐదు పనుల వలన పరిశుద్ధమగుచున్నది. పక్షులు తిన్నది. ఆవులు వాసన చూచినది, తన్నినది, తుమ్మబడినది, వెంట్రుకలు పురుగులు పడినది అగు వస్తువు మట్టి చేత పరిశుద్ధమగుచున్నది. అమేధ్యము (మలము) తగిలిన చోట దాని వాసన పోవునంతవరకు మట్టి నీరుపోసిన కడిగి పరిశుద్ధముచేయవలెను.

*త్రీణి దేవాః పవిత్రాణి బ్రాహ్మణానామకల్పయన్,*
*అదృష్టమద్భిర్నిర్ణిక్తం యచ్చ వాచా ప్రశస్యతే.127*

*ఆపశ్శుద్ధా భూమిగతా వైతృష్ణ్యం యాసు గోర్భవేత్,*
*అవ్యాప్తా శ్చేదమేధ్యేన గంధవర్ణరసాన్వితాః.128*

*నిత్యం శుద్ధః కారుహస్తః పణ్యే యచ్చ ప్రసారితమ్,*
*బ్రహ్మచారిగతం భైక్షం నిత్యం మేధ్యమితి స్థితిః.129*

దోషం కనిపించని పదార్థం, నీటిచే కడుగబడిన పదార్థం, బ్రాహ్మణుడు పరిశుద్ధమైందని ప్రశంసించిన పదార్థం ఈ మూడు చాలా పవిత్రమైనవని దేవతలు చెప్పుతారు. నేలమీద పడని వర్షం, నీరు గోవుల దప్పిదీర్చేవి, అమేధ్యాది దూషితములు కానివి, సువాసన మంచి రంగు, మంచి రుచితో కూడుకున్న నీరు పవిత్రమైనది. దేవ బ్రాహ్మణులకై పూలమాలలు కట్టు మాలాకారుని హస్తం, అన్నం తప్ప అంగడిలో పరచబడియున్న వస్తువులు, బ్రహ్మచారి చేతిలోనున్న భిక్ష ఇవి ఎల్లప్పుడు పరిశుద్ధమైనవి.

*నిత్యమాస్యం శుచి స్త్రీణాం శకునిః ఫలపాతనే,*
*ప్రసవే చ శుచిర్వత్సః శ్వా మృగగ్రహణే శుచిః.130*

*శ్వభిర్హతస్య యన్మాంసం శుచి తన్మనురబ్రవీత్,*
*క్రవ్యాద్భిశ్చ హతస్యాన్యైశ్చండాలాద్యైశ్చ దస్యుభిః.131*

స్త్రీలముఖం, పక్షి నోటినుండి జారిన పండు, పాలు పితుకు నప్పుడు దూడముఖం, వేటయందు కుక్క ముఖం పరిశుద్ధమైనవి. కావున వేటాడు కుక్కలచే చంపబడ్డ జంతు మాంసము పరిశుద్ధమైనదని మనువు తెల్పెను. పచ్చిమాంసాన్ని తినుపులి మొదలగు వాటిచే

చంపబడ్డ జంతు మాంసం, మృగాలను చంపి జీవించే వేట కాండ్రచే చంపబడ్డ జంతు మాంసం కూడా పరిశుద్ధమైనది.

*ఊర్ధ్వం నాభేర్యాని ఖాని తాని మేధ్యాని సర్వశః,*
*యాన్యధస్తాన్యమేధ్యాని దేహాచ్చైవ మలాశ్చ్యుతాః.132*

బొడ్డుకు పై నున్న ఇంద్రియములన్ని పరిశుద్ధములైనవి. కాని బొడ్డు క్రిందనున్న ఇంద్రియములు అపరిశుద్ధమైనవి. దేహమునుండి వచ్చు చెమట మొదలగు మలములన్నియు అపరిశుద్ధమైనవి. కావున వాటిన తాకినచో నీటిచే కడుగుకొనవలెను.

*మక్షికా విప్రుషశ్ఛాయా గౌరశ్వ స్సూర్యరశ్మయః,*
*రజో భూర్వాయురగ్నిశ్చ సర్వే మేధ్యా వినిర్దిశేత్.133*

ఈగలు, వేదాధ్యయనము చేయు చున్నప్పుడు బ్రాహ్మణుని నోటినుండి వెడలిన నీటి తుంపరలు, నీడ, ఆవు, గుఱ్ఱం, సూర్య కిరణాలు, దుమ్ము, భూమి, వాయువు అగ్ని, ఇవన్నియు పవిత్రములైనవి.

*విణ్మూత్రోత్సర్గశుద్ధ్యర్థం మృద్వార్యాదేయమర్థవత్,*
*దైహికానాం మలానాం చ శుద్ధిషు ద్వాదశస్వపి.134*

*వసా శుక్రమసృఙ్మజ్జామూత్రవిట్కర్ణవిణ్ణఖాః,*
*శ్లేష్మాశ్రు దూషికా స్వేదో ద్వాదశైతే నృణాం మలాః.135*

*ఏకా లింగే గుదే తిస్రస్తథైకత్ర కరే దశ,*
*ఉభయోస్సప్త దాతవ్యా మృదం శుద్ధిమభీప్సతా.136*

*ఏతచ్ఛౌచం గృహస్థానాం ద్విగుణం బ్రహ్మచారిణామ్,*
*త్రిగుణం స్యాద్వనస్థానాం యతీనాం తు చతుర్గుణమ్.137*

*కృత్వా మూత్రం పురీషం వా ఖాన్యాచాంత ఉపస్పృశేత్,*
*వేదమధ్యేష్యమాణశ్చ అన్నమశ్నంశ్చసర్వదా.138*

మల మూత్రవిసర్జన స్థానములను శుద్ధిపరచుటకై అచ్చట ఉన్నమలము వాసన పోవునంతవరకు మన్ను, నీటితో పరిశుద్ధము చేయవలెను. అట్లే శారీరకమలములు పన్నెండు వాసనతో సహ పోవునంతవరకు మట్టితోను, నీటితోను శుద్ధి చేయవలెను. మూత్రపురీషముల శుద్ధి చేయుటకు మట్టి, నీళ్ళతో లింగమునొకసారి, పాయుస్థానమును మూడు పర్యాయములు, ఎడమ చేతిని పది పర్యాయములు తర్వాత రెండు చేతులను ఏడు మార్లు కడుగు కొనవలెను. ఇట్టి శౌచవిధి గృహస్థులకు చెప్పబడింది. బ్రహ్మచారులు దీనికి రెట్టించి శౌచమును చేసికొనవలెను. వానప్రస్థులు మూడు రెట్లు ఎక్కువగా, సన్యాసులు నాలుగురెట్లు ఎక్కువగా శౌచమును చేసికొనవలెను. మూత్రపురీషాలను విడిచినపుడు పై పద్ధతి ననుసరించి శుద్ధి చేసికొన వలెను. వేదాధ్యయనం చేయబోవునపుడు, అన్నం తినబోవునపుడు మూడు మార్లు ఆచమనం చేసి నీటితో ఇంద్రియాలను స్పృశింపవలెను.

*త్రిరాచామేదపః పూర్వం ద్విః ప్రమృజ్యాత్తతో ముఖమ్,*
*శారీరం శౌచమిచ్ఛన్ హి స్త్రీ శూద్రస్తు సకృత్సకృత్.139*

బ్రాహ్మణుడు శరీర శుద్ధిని కోరి మూడుమార్లు ఆచమనం చేసి తరువాత రెండు పర్యాయాలు ముఖాన్ని నీటిచే తుడుచుకొనవలెను. స్త్రీలు, శూద్రులు ఒకమారు ఆచనం చేసిన చాలును.

*శూద్రాణాం మాసికం కార్యం వపనం న్యాయవర్తినామ్,*
*వైశ్యవచ్ఛౌచకల్పశ్చ ద్విజోచ్ఛిష్టం చ భోజనమ్.140*

న్యాయంవముగానుండు శూద్రులు నెలకొకపర్యాయము క్షౌరము చేయించుకొనవలెను. మృతాశౌచజాతాశౌచములు వైశ్యునకున్నట్లుండును. ద్విజోచ్ఛిష్టమును భుజింపవలెను.

*నోచ్ఛిష్టం కుర్వతే ముఖ్యా విప్రుషోऽంగే పతంతి యాః,*
*న శ్మశ్రూణి గతాన్యాస్యం న దంతాంతరధిష్ఠితమ్ 141*

*స్పృశంతి బిందవః పాదౌ య ఆచామయతః పరాన్,*
*భౌమికైస్తే సమా జ్ఞేయా న తైరప్రయతో భవేత్ 142*

*ఉచ్ఛిష్టేన తు సంస్పృష్టో ద్రవ్య హస్తః కథంచన,*
*అనిధాయైవ తద్ద్రవ్యమాచాంతశ్శుచితామియాత్ 143*

*వాంతో విరిక్తః స్నాత్వా తు ఘృతప్రాశనమాచరేత్,*
*ఆచామే దేవ భుక్త్వాన్నం స్నానం మైథునినః స్మృతమ్ 144*

*సుప్త్వా క్షుత్వా చ భుక్త్వా చ నిష్ఠీవ్యోక్త్వానృతాని చ,*
*పీత్వాపోऽధ్యేష్యమాణశ్చ ఆచామేత్ప్రయతోऽపి సన్ 145*

వేదాధ్యయనం చేయుచున్నప్పుడు బ్రాహ్మణుని నోటిలోనుండి వచ్చి శరీరంపై బడ్డ తుంపరులకు నోటిలో చిక్కుకొన్న మీసములకు, పండ్ల సందులలో చిక్కుకొన్న మెతుకులకు ఎంగిలి లేదని పెద్దలందురు. ఆచమనం చేస్తున్నప్పుడు ఆ నీరు ఇతరుల కాళ్ళకు తగిలినప్పటికీ అవి భూమికి తగిలి వస్తున్నవి. కావున ఆ నీటిచే అతడు అపవిత్రుడు కాడు. చేతిలో ఒక వస్తువు నుంచుకొన్నప్పుడు పొరపాటున చేతికి ఎంగిలంటుకొన్నచో ఆ వస్తువును క్రింద పెట్టక చేయికడుగుకొని ఆచమనం చేసినచో పరిశుద్ధుడగును. వాంతి విరేచనమైనప్పుడు స్నానం చేసి నేతిని అచమనం చేయవలెను. అన్నం తిన్న తరువాత వాంతి విరేచనములైనచో ఆచమనం మాత్రం చేయవలెను. స్త్రీ సంగమం చేసినచో స్నానం చేయవలెను. నిద్ర, తుమ్ము, భోజనం తరువాత, ఉమ్మివేసిన తర్వాత, అబద్ధములాడిన తరువాత, నీరు తాగిన తరువాత, వేదమునధ్యయనము చేయబోవుచూ పరిశుద్ధుడైనను మరల ఆచమనం చేయవలెను .

*ఏష శౌచవిధిః కృత్స్నో ద్రవ్యశుద్ధిస్తథైవ చ,*
*ఉక్తో వస్సర్వవర్ణానాం స్త్రీణాం ధర్మాన్ని బోధత 146*

ఈ విధంగా సకల వర్ణములవారికి సంబంధించిన శౌచవిధానాన్ని, ద్రవ్య శుద్ధిని ఇంతవరకు వివరించినాను. ఇక స్త్రీ ధర్మాల గురించి మీకు వివరిస్తానని భృగు మహర్షి పలికెను.

*బాలయా వా యువత్యా వా వృద్ధయా వాఽపి యోషితా,*
*న స్వాతంత్ర్యేణ కర్తవ్యం కించిత్కార్యం గృహేష్వపి 147*

*బాల్యే పితుర్వశే తిష్ఠే త్పాణిగ్రాహస్య యౌవనే,*
*పుత్రాణాం భర్తరి ప్రేతే న భజేత్ స్త్రీ స్వతంత్రతామ్ 148*

*పిత్రా భర్త్రా సుత్రైర్వాపి నేచ్ఛే ద్విరహమాత్మనః,*
*ఏషాం హి విరహేణ స్త్రీ గర్హ్యే కుర్యాదుభే కులే 149*

స్త్రీ ధర్మములు :

బాలిక యైనను, యువతి యైనను, ముదుసలియైనను స్త్రీయైనను గృహ కార్యములను స్వతంత్రించి చేయకూడదు బాల్యమున తండ్రియొక్క అధీనమున, యౌవనము భర్తయొక్క అధీనమున, భర్త చనిపోయినపుడు పుత్రులయొక్క అధీనమున స్త్రీ ఉండవలెను. స్త్రీ ఎల్లప్పుడును స్వతంత్రముగా ఉండకూడదు. అనగా ఎవరి రక్షణ లేక ఒంటరిగా ఉండకూడదు. తండ్రిగాని, భర్తగాని, కొడుకులుగాని లేకుండ స్త్రీ ఒంటరిగా ఎప్పుడు కూడ ఉండకూడదు. ఒంటరిగా నున్న స్త్రీ భర్త వంశమును తల్లి వంశమును చెడగొట్టును.

*సదా ప్రహృష్టయా భావ్యం గృహకార్యేషు దక్షయా,*
*సుసంస్కృతోఽపస్కరయావ్యయే చాముక్తహస్తయా 150*

భార్య తన ఇంటి పనులు చేయుచున్నప్పుడు నేర్పరితనంతో, ఎల్లప్పుడు నవ్వు ముఖంతో, ఇంటిని వస్తువులను చక్కగ పెట్టుకొని, అధికంగా వ్యయము చేయక ఉండవలెను.

*యస్మై దద్యాత్పితా త్వేనాం భ్రాతా వాఽ నుమతే పితుః,*
*తం శుశ్రూషేత జీవంతం సంస్థితం చ న లంఘయేత్ 151*

*మంగళార్థం స్వస్త్యయనం యజ్ఞశ్చాసాం ప్రజాపతేః*
*ప్రయుజ్యతే వివాహేషు ప్రదానం స్వామ్యకారణమ్ 152*

*అనృతావృతుకాలే చ మంత్రసంస్కారకృత్పతిః,*
*సుఖస్య నిత్యం దాతేహ పరలోకే చ యోషితః 153*

*విశీలః కామవృత్తో వా గుణై ర్వా పరివర్జితః,*
*ఉపచర్యః స్త్రియా సాధ్వ్యా సతతం దేవవత్పతిః 154*

*నాస్తి స్త్రీణాం పృథగ్యజ్ఞో న వ్రతం నాప్యుపోషితమ్,*
*పతిం శుశ్రూషతే యేన తేన స్వర్గే మహీయతే 155*

## పంచమాధ్యాయం

*పాణిగ్రాహస్య సాధ్వీ స్త్రీ జీవతో వా మృతస్య వా,*
*పతిలోకమభీప్సంతీ నాచరేత్కించిదప్రియమ్ 156*

తండ్రి తననెవరికిచ్చి వివాహం చేయునో, తండ్రి యనుమతిపై సోదరుడైనను వివాహం చేయునో అతనిని తాను జీవించి ఉన్నంతవరకు సేవింపవలెనే కాని వ్యభిచారం సేయరాదు. వివాహ సమయాలలో మంగళమునకై చెప్పు స్వస్తి మంత్రాలు, ప్రజాపతినుద్దేశించి చేయుహోమం కంటె, వివాహం కంటె, ముందు చేయు వాగ్దానమే భర్తకు ఆమెపై అధికారమునిస్తున్నది. ఋతుకాలంలో బహిష్ఠుకాని సమయంలో భర్త ఆమెకు సుఖాన్ని కలిగిస్తున్నాడు. అట్లే పరలోకంలో అతడు ఆమెకు సుఖాన్ని కలిగిస్తున్నాడు. సదాచార శూన్యుడైనా ఇంకొక స్త్రీయందనురక్తుడైనా, సద్గుణములులేకపోయినా భర్తను భార్య దేవుని వలె పూజించాలి. స్త్రీకి భర్తృ శుశ్రూష తప్ప ఇంకొక యజ్ఞంలేదు. ఇంకొక వ్రతంగాని ఉపవాసంగాని లేదు. భర్తను చక్కగా సేవించు స్త్రీని స్వర్గలోకంలో అందరు గౌరవింతురు. భర్తృ పరాయణయైన స్త్రీ తన భర్త బ్రతికి యున్నా చనిపోయినా అతనికి ఎటువంటి అప్రియాన్ని చేయరాదు.

*కామం తు క్షపయేద్దేహం పుష్పమూలఫలై శ్శుభైః,*
*న తు నామాపి గృహ్ణీయాత్ పత్యౌ ప్రేతే పరస్య తు 157*

*ఆసీతామరణాత్ కాంతా నియతా బ్రహ్మచారిణీ*
*యో ధర్మ ఏకపత్నీనాం కాంక్షంతీ తమనుత్తమమ్ 158*

భర్త చనిపోయినచో పతివ్రతయగు భార్య కందమూల ఫలాలచేత జీవనం సాగించవలెను. పరపరుషుని ఏమాత్రం స్మరింపవద్దు. తాను చనిపోవు వరకు ఓపిక కలదై నియమం తోనుండి, బ్రహ్మచారిణియై పరపురుషుని కోరక ప్రవర్తించవలెను.

*అనేకాని సహస్రాణి కుమార బ్రహ్మచారిణాం,*
*దివం గతాని విప్రాణామకృత్వా కులసంతతిమ్ 159*

*మృతే భర్తరి సాధ్వీ స్త్రీ బ్రహ్మచర్యే వ్యవస్థితా,*
*స్వర్గం గచ్ఛత్యపుత్రాపి యథా తే బ్రహ్మచారిణః 160*

*అపత్యలోభాద్యాతు స్త్రీ భర్తారమతివర్తతే,*
*సేహ నిందామవాప్నోతి పతిలోకాచ్చ హీయతే 161*

బాల్యంలో బ్రహ్మచారులై వివాహం చేసికొనని వాలఖిల్యులు మొదలగు అనేక బ్రాహ్మణ వంశములు సంతతి లేకుండగనే పుణ్యలోకములను పొందినందువల్ల తనకు సంతతి కలుగలేదని బాధపడకూడదు. భర్త చనిపోయినచో పతివ్రతయైన స్త్రీ బ్రహ్మ చర్య వ్రతమవలంబించి పుత్రులు లేకున్నా వాలఖల్యాదులవలె స్వర్గలోకానికి చేరును. కాని కొడుకులపై నున్న ప్రేమతో పరపురుషునితో పోయినస్త్రీ ఇహలోకమున చెడ్డపేరును తెచ్చుకొంటుంది. పరలోకంలో పుణ్యానికి దూరమౌతుంది.

*నాన్యోత్పన్నా ప్రజా స్తీహ న చాప్యన్యపరిగ్రహే,*
*న ద్వితీయశ్చ సాధ్వీనాం క్వచిద్భర్తోపదిశ్యతే 162*

*పతిం హిత్వాపకృష్టం స్వముత్కృష్టం యా నిషేవతే,*
*నింద్యైవ సా భవేల్లోకే పరపూర్వేతి చోచ్యతే 163*

*వ్యభిచారాత్తు భర్తుః స్త్రీ లోకే ప్రాప్నోతి నింద్యతామ్,*
*సృగాలయోనిం ప్రాప్నోతి పాపరోగైశ్చ పీడ్యతే 164*

*పతిం యా నాభిచరతి మనోవాగ్దేహసంయతా,*
*సా భర్తృలోకమాప్నోతి సద్భిస్సాధ్వీతి చోచ్యతే 165*

*అనేన నారీవృత్తేన మనో వాగ్దేహసంయతా,*
*ఇహాగ్ర్యాం కీర్తిమాప్నోతి పతిలోకం పరత్ర చ 166*

స్త్రీకి పరపురుషుని వల్ల కలగిన సంతానం శాస్త్రసమ్మతంకాదు. ఇంకొక పురుషుని వివాహమాడుటకూడ తగనిది. ఇతరుని భార్యయందు కన్న సంతానము తన సంతతికానేరదు. అట్లే ఇంకొక పురుషుని వివాహమాడుటకూడ తగనిది. తన భర్త ధనహీనుడని ధన సంపన్నుడైన ఇంకొక పురుషుని పెండ్లి చేసికొన్నచో ఆమెకు ఇంతకు పూర్వమే వివాహమైనదని లోకులందరు నిందిస్తారు. పరపురుషునితో వ్యభిచారం చేసినందువల్ల స్త్రీ ఈ లోకంలో నిందకు గురియౌతున్నది. పర జన్మలో నక్కగా పుట్టి అనేక రోగాలచే పీడింపబడుతున్నది. తన మనో వాక్కాయములచే భర్తను మాత్రము కోరుకొను స్త్రీని పతివ్రత అని అంటారు. ఆ స్త్రీ మరణానంతరం భర్తృలోకాన్ని పొందుతున్నది. స్త్రీ ధర్మాలను నడుచుకొని మనో వాక్కాయాలతో భర్తను కోరు స్త్రీ ఇహలోకంలో గొప్పకీర్తిని పరలోకంలో భర్తృలోకాన్ని పొందుతుంది.

*ఏవం వృత్తాం సవర్ణాం స్త్రీం ద్విజాతిః పూర్వమారిణీమ్,*
*దాహేదగ్నిహోత్రేణ యజ్ఞ పాత్రైశ్చ ధర్మవిత్ 167*

*భార్యాయై పూర్వమారిణ్యై దత్వాగ్నీనంత్యకర్మణి,*
*పునర్దారక్రియాం కుర్యాత్పునరాధానమేవ చ 168*

ఈ విధముగా ధర్మముగానుండు సవర్ణయైన స్త్రీ భర్తకంటె ముందుగానే చచ్చినచో ఆమెను యాజ్ఞాగ్ని హోత్రముతో, యజ్ఞ పాత్రములతో దహింపవలెను. తనకంటె ముందు చనిపోయిన భార్యకు అంత్యకర్మ చేసి శ్రౌతస్మార్తాగ్నులను ఆధీనము చేసికొనుటకు పునర్వివాహాన్ని చేసికొనవలెను.

*అనేన విధినా నిత్యం పంచ యజ్ఞాన్న హాపయేత్,*
*ద్వితీయమాయుషో భాగం కృతదారో గృహే వసేత్ 169*

గృహస్థుడు ఈ విధంగా పంచమహాయజ్ఞాలను వదలక వివాహం చేసికొని ఆయుస్సులో రెండవ భాగాన్ని గడుపుచు (26 నుండి 50 సంవత్సరాల వరకు) ఇంటిలో ఉండవలెను.

**ఇతి మానవే ధర్మ శాస్త్రే భృగుప్రోక్తాయాం సంహితాయాం పంచమోధ్యాయః.**

భృగువు చెప్పిన మానవ ధర్మశాస్త్రమను సంహితయందు ఐదవ అధ్యాయము సమాప్తం.

## తృతీయాధ్యాయం

ఇంటికి వచ్చిన అతిథిని శాస్త్ర పద్ధతి ననుసరించి గౌరవించి అతనికి ఆసనాన్ని, కాళ్ళు చేతులు కడుగుకొనుటకు త్రాగుటకు నీరునిచ్చి తన శక్తి ననుసరించి అన్నాన్ని పెట్టవలెను. అతిథి సత్కారాన్ని చేయనివాడు శిలోంఛా వృత్తిచే (పొలమున రాలిన గింజలనేరి వాటితో) జీవిస్తున్నా, పంచాగ్ని మధ్యలో తపస్సుచేసినా వాటి ఫలితాన్ని మాత్రం పొందజాలడు. సజ్జనుల ఇంటిలో అతిథులు పండుకొనుటకు గడ్డిపోచలు, విశ్రాంతి తీసికొనుటకు స్థలము, త్రాగుటకు మంచినీరు, ప్రియమైన మాటలు ఎల్లప్పుడు లభిస్తాయి.

*ఏకరాత్రం తు నివసన్నతిథి ర్బ్రాహ్మణః స్మృతః,*
*అనిత్యం హి స్థితో యస్మాత్తస్మాదతిథిరుచ్యతే 102*

*నైకగ్రామీణమతిథిం విప్రం సాంగతికం తథా,*
*ఉపస్థితం గృహే విద్యాద్భార్యా యత్రాగ్నయోఽపి వా 103*

*ఉపాసతే యే గృహస్థాః పరపాకమబుద్ధయః,*
*తేన తే ప్రేత్య పశుతాం వ్రజంత్యన్నాదిదాయినామ్ 104*

*అప్రణోద్యోఽతిథిస్సాయం సూర్యోఢో గృహమేధినా,*
*కాలే ప్రాప్త స్త్వకాలే వా నాస్యానశ్నన్ గృహేవసేత్. 105*

*న వై స్వయం తదశ్నీయాదతిథిం యన్న భోజయేత్,*
*ధన్యం యశస్యమాయుష్యం స్వర్గ్యం చాతిథిపూజనమ్, 106*

ఒక దినం మాత్రమే ఉంటే, వానిని అతిథియంటారు. అతిథి అంటే నిత్యము స్థితి లేనివాడని యర్థం. ఒక ఊరులో ఎల్లప్పుడు ఉండువానిని, వింత మాటలతో కాలం పుచ్చేవాణ్ణి అతిథియని అనకూడదు. అతిథికి ఆదరసత్కారములు లభించునని ఎల్లప్పుడు తిరుగుచు ఇతరుల ఇంట భోజనం చేస్తూ కాలక్షేపం చేసే గృహస్థులు తరువాతి జన్మలో తనకు భోజనం పెట్టినవారి దగ్గర పశువులై పుట్టుతారు. సూర్యుడస్తమించిన తరువాత వచ్చిన అతిథి తిరిగి తన ఇంటికి చీకటిలో పోలేడు కావున అతనికి అతిథి సత్కారములు చేయవలెను. అట్లే భోజనసమయమునకు వచ్చినను, భోజనకాలమునతిక్రమించి వచ్చినను అతిథికి సత్కారము తప్పక చేయవలెను. అతిథికి పెట్టని పాలు, పెరుగు మొదలగు వస్తువులను గృహస్థు తినకూడదు. అతిథి పూజచేసినచో ధనము, కీర్తి, ఆయుస్సు, పరలోకమున స్వర్గ సుఖాలు లభిస్తాయి.

*ఆసనావసథౌ శయ్యా మనువ్రజ్యా ముపాసనమ్,*
*ఉత్తమేషూత్తమం కుర్యాద్ధీనే హీనం సమే సమమ్ 107*

*వైశ్యదేవేతు నిర్వృత్తే యద్యన్యోఽ తిథిరావ్రజేత్,*
*తస్యాప్యన్నం యథాశక్తి ప్రదద్యాన్న బలిం హరేత్. 108*

*న భోజనార్థం స్వే విప్రః కులగోత్రే నివేదయేత్,*
*భోజనార్థం హి తే శంసన్ వాంతాశీత్యుచ్యతే బుధైః 109*

ఆసనం, విశ్రమస్థానం, పాన్పు, వీడ్కోలు, శుశ్రూష ఇట్టి ఉపచారాలు అతిథి

యొక్క యోగ్యతననుసరించి చేయాలి. వైశ్వదేవయజ్ఞం చేసిన తరువాత ఇంకొక అతిథి ఇంటికి వచ్చినచో తన శక్తి కొద్ది అతనికి కూడ భోజనం పెట్టాలి. భోజనానికై వచ్చిన అతిథి తన కులగోత్రాలను చెప్పవలసిన పని లేదు. తన ఇంటికి వచ్చిన అతిథి యొక్క కుల గోత్రాలను అడిగితే అతనికి వాంతి చేసికొన్న అన్నమును పెట్టినవానితో సమానుడగునని పెద్దలంటూరు.

*న బ్రాహ్మణస్య త్వతిథిగృహే రాజన్య ఉచ్యతే,*
*వైశ్య శూద్రౌ సఖా చైవ జ్ఞాతయో గురు రేవ చ. 110*

*యది త్వతిథిధర్మేణ క్షత్రియో గృహ మావ్రజేత్,*
*భుక్తవత్సు చ విప్రేషు కామం తమపి భోజయేత్ 111*

*వైశ్యశూద్రవపి ప్రాప్తౌ కుటుంబేఽతిథిధర్మిణౌ,*
*భోజయేత్సహ భృత్యైస్తావాన్నృశంస్యం ప్రయోజయన్ 112*

*ఇతరానపి సఖ్యాదీన్ సంప్రీత్యా గృహ మాగతాన్,*
*సత్కృత్యాన్నం యథాశక్తి భోజయేదవిచారయన్ 113*

*సువాసినీః కుమారీశ్చ రోగిణో గర్భిణీః స్త్రియః,*
*అతిథిభ్యోఽగ్ర ఏవైతాన్ భోజయేదవిచారయన్ 114*

బ్రాహ్మణుని ఇంటికి రాజు మొదలగువారు అతిథిగా పోరాదు. అట్లే స్నేహితుడు, బంధువులు, తనతో సమానులు కావున వారు అతిథులు కాజాలరు. అదే విధంగా గురువు తనకంటె గొప్పవాడు, సదా గౌరవించతగినవాడు కావున అతడు కూడ అతిథి కాజాలడు. బ్రాహ్మణుని ఇంటికి క్షత్రియుడు అతిథిగా వస్తే బ్రాహ్మణ భోజనము తరువాత అతనికి భోజనము పెట్టవలెను. వైశ్యశూద్రులకు ఆ తరువాత భోజనము పెట్టవలెను. స్నేహితులు మొదలైనవారు తన ఇంటికి వచ్చినచో వారికి కూడ మర్యాదతో భోజనము పెట్టవలెను. అట్లే సువాసినులు, బాలికలు, రోగులు, గర్భిణీస్త్రీలకు అథితుల కంటె ముందుగానే భోజనము పెట్టవలెను.

*అదత్వా తు య ఏతేభ్యః పూర్వం భుఙ్క్తే విచక్షణః,*
*స భుంజానో న జానాతి శ్వగృధ్రైర్జగ్ధి మాత్మనః 115*

*భుక్తవత్స్వథ విప్రేషు స్వేషు భృత్యేషు చైవ హి,*
*భుంజీయాతాం తతః పశ్చాదవశిష్టం తు దంపతీ 116*

సువాసినులు, బాలికలు, అతిథులు మొదలుకొని సేవకులవరకు భోజనము పెట్టక తాను ముందే భోజనము చేసినచో అట్టి వాడు చనిపోయిన తరువాత అతని శరీరాన్ని కుక్కలు, గద్దలు తినును. అనగా అతనికి ప్రేతసంస్కారం చేసే వారెవ్వరు లేక అనాథశవంగా మిగులుతాడు. విప్రులు, అతిథులు, తన భృత్యులు మొదలగువారందరు భోజనం చేసిన తరువాత మిగిలిన శాకపాకాలను గృహయజమాని తన భార్యతో కలిసి భుజించాలి.

*దేవానృషీన్మనుష్యాంశ్చ పితౄన్ గృహ్యాశ్చ దేవతాః,*
*పూజయిత్వా తతః పశ్చాద్గృహస్థ శ్శేషభుగ్భవేత్ 117*

*అఘం స కేవలం భుఙ్క్తే యః పచత్యాత్మ కారణాత్,*
*యజ్ఞశిష్టాశనం హ్యేతత్సతామన్నం విధీయతే. 118*

దేవతలను, ఋషులను, మనుష్యులను, పితృదేవతలను, గృహమునందున్న దేవతలనందరిని భోజనాదులచే పూజించిన తరువాత మిగిలిన దానిని ఇంటి యజమాని తినవలెను. తన పొట్ట నింపుకొనుటకు మాత్రమే తినువాడు పాపాన్ని సంపాదించుకొన్నవాడౌతాడు. పంచయజ్ఞాలు చేసిన తరువాత మిగిలిన అన్నాన్ని భుజించుటయే ఉత్తమమని పెద్దలంటారు.

*రాజర్త్విక్స్నాతకగురూన్ ప్రియశ్వశురమాతులాన్*
*అర్హ యేన్మధుపర్కేణపరిసంవత్సరాత్పునః 119*

*రాజా చ శ్రోత్రియశ్చైవ యజ్ఞకర్మణ్యుపస్థితౌ,*
*మధుపర్కేణ సంపూజ్యౌ న త్వయజ్ఞ ఇతి స్థితిః 120*

రాజు, ఋత్విక్కు, స్నాతకవ్రతం చేసికొన్నవాడు, గురువు, మామగారు, మేనమామ, వీరు సంవత్సరము తరువాత తిరిగివచ్చినచో వారికి మధుపర్కము మొదలగువాటినిచ్చి సత్కరించాలి. రాజు, ఋత్విక్కు, వీరు తనుఇంటికి సంవత్సరము తరువాత యజ్ఞసమయుమందు, వివాహసమయుమున వచ్చినచో అప్పుడు మాత్రమే వీరిని మధుపర్కాదులచే పూజించాలి. తక్కినవారు యజ్ఞము చేయనపుడు వచ్చిననువారిని మధుపర్కాదులచే గౌరవించాలి.

*సాయం త్వన్నస్య సిద్ధస్య పత్న్యమంత్రం బలిం హరేత్,*
*వైశ్వదేవం హి నామైతత్సాయం ప్రాతర్విధీయతే 121*

సాయంకాలమున గృహపత్ని మంత్రరహితముగా భూతబలిని చేయాలి. ఇట్లు ఉదయం ఇంటియజమాని, సాయంకాలం యజమానురాలు ఈ వైశ్వదేవహోమము చేయవలెను.

*పితృయజ్ఞం తు నిర్వర్త్య విప్రశ్చంద్రక్షయేఽగ్నిమాన్,*
*పిండాన్వాహార్యకం శ్రాద్ధం కుర్యాద్మాసానుమాసికమ్ 122*

*పితౄణాం మాసికం శ్రాద్ధ మన్వాహార్యం విదుర్బుధాః,*
*తచ్చామిషేణ కర్తవ్యం ప్రశస్తేన ప్రయత్నతః 123*

అమావాస్యనాడు పితృయజ్ఞాన్ని (శ్రాద్ధము) చేసి తరువాత ప్రతినెల పిండాన్వాహార్యకమను శ్రాద్ధము చేయవలెను. పితృదేవతలకు ప్రతినెల పెట్టు శ్రాద్ధమును అన్వాహార్యక మంటారు. ఆ శ్రాద్ధమును ప్రశస్తమైన మాంసముతో చేయవలెను.

*తత్ర యే భోజనీయాస్స్యు ర్యే చ వర్జ్యా ద్విజోత్తమాః*
*యావంతశ్చైవ యైశ్చాన్నైస్తాన్ ప్రవక్ష్యామ్యశేషతః 124*

*ద్వౌ దైవే పితృకార్యే త్రీ నేకైక ముభయత్ర వా,*
*భోజయేత్సుసమృద్ధోఽపి న ప్రసజ్జేత విస్తరే 125*

*సత్క్రియాం దేశకాలౌ చ శౌచం బ్రాహ్మణ సంపదః,*
*పంచైతాన్విస్తరో హంతి తస్మాన్నే హేత విస్తరమ్. 126*

*ప్రథితా ప్రేతకృత్యైషా పిత్ర్యం నామ విధుక్షయే,*
*తస్మిన్ యుక్తస్యైతి నిత్యం ప్రేతకృత్యైవ లౌకికీ 127*

అన్వాహార్య శ్రాద్ధంలో భోజనమునకు నిమంత్రణ చేయదగిన వ్యక్తులు, అందు పెట్టే ఆహార వస్తువులివి .

శ్రాద్ధంలో విశ్వే దేవతాస్థానంలో ఇద్దరు బ్రాహ్మణులను, పితృదేవతా స్థానమున ముగ్గురు బ్రాహ్మణులను, లేక విశ్వే దేవతాస్థానమున ఒక బ్రాహ్మణుని, పితృదేవతాస్థానమున ఒక బ్రాహ్మణుని నిమంత్రింపవలెను. ఎంత ధనవంతుడైనను పై సంఖ్యకు మించిన బ్రాహ్మణులను శ్రాద్ధానికై నిమింత్రించకూడదు. శ్రాద్ధంలో అధిక సంఖ్యలో బ్రాహ్మణులను పిలిస్తే యజమాని చేసిన బ్రాహ్మణ సత్కారము దేశకాలాలు, కర్త, భోక్త, పరిచారకులు చేయు ఆచారము గుణవంతులగు బ్రాహ్మణులను సంపాదించుట అనునైదిటిని చెడగొట్టుతుంది. కావున బ్రాహ్మణులను పై సంఖ్యకంటె ఎక్కువమందిని భోక్తలుగా పిలువకూడదు. అమావాస్యయందు చేయబడు ఈ పితృకార్యము చాలా ప్రశస్తమైంది. ప్రతినెలలో చేయు ఈ పితృకార్యము సుపుత్రులు, ధనధాన్యము, మొదలగు శుభములను కలిగిస్తుంది.

*శ్రోత్రియాయైవ దేయాని హవ్యకవ్యాని దాతృభిః*
*అర్హత్తమాయ విప్రాయ తస్మై దత్తం మహాఫలమ్. 128*

*ఏకైక మపి విద్వాంసం దైవే పిత్ర్యేచ భోజయేత్,*
*పుష్కలం ఫలమాప్నోతి నామంత్రజ్ఞాన్ బహూనపి 129*

*దూరాదేవ పరీక్షేత బ్రాహ్మణం వేదపారగమ్,*
*తీర్థం తద్ధవ్యకవ్యానాం ప్రదానే సోఽతిథిః స్మృతః 130*

*సహస్రం హి సహస్రాణామనృచాం యత్ర భుంజతే,*
*ఏకస్తాన్ మంత్రవిత్ప్రీతః సర్వానర్హతి ధర్మతః 131*

*జ్ఞానోత్కృష్టాయ దేయాని కవ్యాని చ హవీంషి చ,*
*నహి హస్తావసృగ్దిగ్ధౌ రుధిరేణైవ శుద్ధ్యతః 132*

*యావతో గ్రసతే గ్రాసాన్ హవ్యకవ్యేష్వమంత్రవిత్,*
*తావతో గ్రసతే ప్రేత్య దీప్తశూలర్ష్ట్యయోగుడాన్. 133*

దేవతా ప్రీతికై ఇచ్చు హవ్యమును, పితృప్రీతికై ఇచ్చు కవ్యమును శ్రోత్రియుడు, మంచి యోగ్యత కలిగిన బ్రాహ్మణునకు మాత్రమియ్యవలెను. దైవ, పితృకార్యములందు

వేద వేదాంగతత్వమెరిగిన బ్రాహ్మణుని ఒక్కనినైనా పిలుచుకొని హవ్య, కవ్యముల నొసగవలెను. వేదము ఏమాత్రము చదువుకొనని బ్రాహ్మణులనెందరిని భోక్తలుగా పిలిచినను ఫలితముండదు. వేదాధ్యయనము చేసిన బ్రాహ్మణుని ముందుగనే పరీక్షించి అతనికే హవ్యకవ్యములనిచ్చుట శ్రేష్ఠమైంది. వేద వేత్తయగు ఒక బ్రాహ్మణుడు మాత్రం హవ్యకవ్యాలను పరిగ్రహిస్తే వేదహీనులగు పదిలక్షలమంది బ్రాహ్మణులకు భోజనము పెట్టినంత ఫలితాన్ని ఈయగలదు. జ్ఞానోత్కృష్టుడైన వానికే హవ్య కవ్యా లిచ్చుట శ్రేష్ఠము. నెత్తుటిచేత తడిసిన చేతులను నెత్తుటిచే కడుగు కొనలేం కదా. అట్లే శ్రాద్ధకార్యమున జ్ఞానోత్కృష్టుని ఆహ్వానించినచో తన వంశము పవిత్రమగును. వేద మంత్రములు నేర్వని భోక్త శ్రాద్ధంలో ఎన్ని ముద్దలు తినునో శ్రాద్ధకర్త దేహాంతమున నరకములో శూలర్ష్టులను మండుచున్న అన్ని ఇనుపగుండ్లను తినును.

*జ్ఞాననిష్ఠా ద్విజాః కేచిత్తపోనిష్ఠా స్తథాऽపరే,*
*తపస్స్వాధ్యాయనిష్ఠాశ్చ కర్మనిష్ఠాస్తథాऽపరే* 134

*జ్ఞాననిష్ఠేషు కవ్యాని ప్రతిష్ఠాప్యాని యత్నతః,*
*హవ్యాని తు యథాన్యాయం సర్వేష్వేవ చతుర్ష్వపి* 135

*అశ్రోత్రియః పితా యస్య పుత్రః స్యాద్వేదపారగః,*
*అశ్రోత్రియో వాపుత్రస్స్యా త్పితా స్యాద్వేదపారగః* 136

*జ్యాయాంసమనయోర్విద్యాద్యస్య స్యాచ్ఛ్రోత్రియః పితా,*
*మంత్రసంపూజనార్థం తు సత్కారమితరో ऽర్హతి.* 137

కొందరు బ్రాహ్మణులు ఆత్మజ్ఞానమందు నిష్ఠ కలిగి ఉంటారు. మరికొందరు తపస్సే తమ పరమావధి అని అనుకొంటారు. ఇంకను కొందరు తపస్సు, వేదాధ్యయనం రెండింటియందు నిష్ఠ కలిగియుంటారు. కొందరికి యజ్ఞయాగాది కర్మలయందు నిష్ఠ గలిగియుంటుంది. వీరిలో జ్ఞాననిష్ఠులైన బ్రాహ్మణులను శ్రాద్ధాది పితృకర్మలయందు తప్పక నియమించవలెను. దైవ కర్మలయందు యథాన్యాయంగా ఎవరినైనను నియమింపవచ్చును. కొన్ని సమయాలందు పుత్రుడు వేదవేదార్థవేత్తయై ఉండగా అతని తండ్రి వేదజ్ఞాన శూన్యుడు కావచ్చును. అట్లే తండ్రి చక్కని శ్రోత్రియుడై ప్రసిద్ధినొందిన అతని పుత్రుడు వేదములు చదువనివాడూ కావచ్చును. వీరిలో శ్రోత్రియుడైన తండ్రి గొప్పవాడు. వేదములను గౌరవించు సందర్భమున శ్రోత్రియుడైన పుత్రుడే శ్రేష్ఠుడిగా పరిగణించబడుతున్నాడు.

*న శ్రాద్ధే భోజయేన్మిత్రం ధనైః కార్యో ऽస్య సంగ్రహః*
*నారిం న మిత్రం యం విద్యాత్తం శ్రాద్ధే భోజయేద్ద్విజమ్* 138

*యస్య మిత్రప్రధానాని శ్రాద్ధాని చ హవీంషి చ,*
*తస్య ప్రేత్య ఫలం నాస్తి శ్రాద్ధేషు చ హవిష్షు చ.* 139

*యస్సంగతాని కురుతే మోహాచ్ఛ్రాద్ధేన మానవః,*
*స స్వర్గాచ్చ్యవతే లోకాచ్ఛ్రాద్ధమిత్రో ద్విజాధమః* 140

*యథేరిణే బీజముప్త్వా న వప్తా లభతే ఫలమ్,*
*తథా Z నృచే హవిర్దత్వా న దాతా లభతే ఫలమ్ 142*

*దాతృాన్ ప్రతిగ్రహీతృాంశ్చ కురుతే ఫల భాగినః*
*విదుషే దక్షిణాం దత్వా విధివత్ప్రేత్య చేహ చ 143*

*కామం శ్రాద్ధే Z ర్చయేన్మిత్రం నాభిరూపమపి త్వరిమ్,*
*ద్విషతా హి హవిర్భుక్తం భవతి ప్రేత్య నిష్ఫలమ్ 144*

శ్రాద్ధంలో మిత్రుని భోక్తగా పిలువకూడదు. భోక్త శత్రువు, మిత్రుడు కాక జ్ఞానవంతుడు మాత్రం కావలెను. దేవతా కార్యాలందు, పితృకార్యములందు స్నేహితులను భోక్తలుగా పిలుచుకొంటే కర్త ఆయా కార్యములు చేసినందువలన కలుగు ఫలితాన్ని పొందజాలడు. శ్రాద్ధంలో మిత్రులను భోక్తలుగా పిలుచుకున్నవాడు తాను చేసిన శ్రాద్ధ ఫలాన్ని పొందలేక స్వర్గభ్రష్టుడగుచున్నాడు. మిత్రుని భోక్తగా పిలుచుకొని అతనికిచ్చిన దక్షిణను పైశాచదక్షిణ అని అంటారు. ఆ శ్రాద్ధం మిత్రుని సంతృప్తి పరచుటకు చేసినందువలన గుడ్డెద్దు ఆయా ప్రాంతములందె తిరుగాడుచున్నందువల్ల వ్యర్థమైనట్లు వ్యర్థమగును. చవిటి భూమిలో విత్తనం చల్లితే ఎట్లు వ్యర్థమౌతుందో అట్లే శ్రాద్ధంలో వేదాధ్యయనం చేయని వానిని భోక్తగా పెట్టుకున్నందు వలన శ్రాద్ధం వ్యర్థమౌతుంది. శ్రాద్ధంలో వేదాధ్యయనం చేసినవానికి విధి పూర్వకంగా దక్షిణ ఇచ్చినందువలన దాత, దానము, స్వీకరించిన భోక్త ఇద్దరు ఫలితాన్ని పొందుతున్నారు. గుణవంతులు ఎచ్చటను దొరకని సమయంలో మంచి మిత్రుని శ్రాద్ధమున భోక్తగా నియమింపవచ్చును. కాని ఎట్టి పరిస్థితులలోనూ ఎంత సుగుణవంతుడైనను శత్రువును భోక్తగా నియమింపరాదు.

*యత్నేన భోజయేచ్ఛ్రాద్ధే బహ్వృచం వేదపారగమ్,*
*శాఖాంతగమథాధ్వర్యుం చంధోగం తు సమాప్తిగమ్ 145*

*ఏషామన్యతమో యస్య భుంజీత శ్రాద్ధమర్చితః,*
*పితృాణాం తస్య తృప్తిః స్యాచ్ఛాశ్వతీ సాప్తపౌరుషీ 146*

శ్రాద్ధమున ఋగ్వేదమును చక్కగా అధ్యయనము చేసిన వానిని కాని పరిపూర్ణముగా యజుర్వేదమునధ్యయమును చేసిన వానిని గాని సంపూర్ణముగా సామవేదమునధ్యయనము చేసినవానిని గాని భోక్తగా నియమించాలి. వీరిలో ఏ ఒక్కరికైనను శ్రాద్ధంలో భోజనం పెట్టితే అది శ్రాద్ధకర్తయొక్క ఏడు తరముల వారిని సంతృప్తి పరుస్తుంది.

*ఏష వై ప్రథమః కల్పః ప్రదానే హవ్యకవ్యయోః*
*అనుకల్పస్త్వయం జ్ఞేయః సదా సద్భిరనుష్ఠితః. 147*

*మాతామహం మాతులం చ స్వస్త్రీయం శ్వశురం గురుమ్,*
*దౌహిత్రం విట్పతిం బంధుమృత్విగ్యాజ్యౌ చ భోజయేత్ 148*

*న బ్రాహ్మణం పరీక్షేత దైవే కర్మణి ధర్మవిత్,*
*పిత్ర్యే కర్మణి తు ప్రాప్తే పరీక్షేత ప్రయత్నతః 149*

యే స్తేనపతితక్లీబా యే చ నాస్తికవృత్తయః,
జటిలం చానధీయానం దుర్బలం కితవం తథా,

తాన్ హవ్యకవ్యయోర్విప్రానవర్హాన్మను రబ్రవీత్ 150
జటిలం చానధీయానం దుర్బలం కితవం తథా,

యాజయంతి చ యే పూగాం స్తాంశ్చ శ్రాద్ధే న భోజయేత్ 151
చికిత్సకాన్ దేవలకాన్ మాంసవిక్రయిణ స్తథా,

విపణేన చ జీవంతో వర్జ్యాః స్యుర్హవ్యకవ్యయోః 152
ప్రేష్యో గ్రామస్య రాజ్ఞశ్చ కునఖీ శ్యావదంతకః,

ప్రతిరోద్ధా గురోశ్చైవ త్యక్తాగ్నిర్వార్ధుషి స్తథా 153
యక్ష్మీ చ పశుపాలశ్చ పరివేత్తా నిరాకృతిః

బ్రహ్మద్విట్ పరివిత్తిశ్చ గణాభ్యంతర ఏవ చ 154
కుశీలవోऽవకీర్ణీ చ వృషలీపతి రేవ చ,

పౌనర్భవశ్చ కాణశ్చ యస్య చోపపతిర్గృహే. 155
భృతకాధ్యాపకో యశ్చ భృతకాధ్యాపితస్తథా,

శూద్రశిష్యో గురుశ్చైవ వాగ్దుష్టః కుండగోళకౌ. 156
అకారణపరిత్యక్తా మాతాపిత్రోర్గురోస్తథా,

బ్రాహ్మైర్యానైశ్చ సంబంధై స్సంయోగం పతితైర్గతః.157

దేవతలకు పితృదేవతలకు సంబంధించిన హవ్యకవ్యములలో పై పద్ధతి తొలుత అనుసరింప దగినది. తరువాత చేయదగిన కార్యమిది :-

హవ్యకవ్యములందు జ్ఞానవంతులు ప్రత్యేకంగా దొరకనప్పుడు తల్లియొక్క తండ్రిని, మేనమామను, మేనల్లుని, పిల్లనిచ్చిన మామను, గురువును, తన కూతురు యొక్క పుత్రుని, అల్లుని, బంధువును, ఋత్విక్కును, శిష్యుని భోక్తగా పిలుచుకొనవచ్చును. ధర్మశాస్త్రాలనెరిగినవాడు దైవకార్యములందు బ్రాహ్మణుని కులగోత్రాదులను పరీక్షింపకూడదు. కాని పితృకార్యమందు మాత్రము భోక్తయగు బ్రాహ్మణుని కుల గోత్రాదులను తప్పక పరీక్షించవలెను. దొంగలు, పతితులు, నపుంసకులు, నాస్తికులు, వీరందరు హవ్యకవ్యములకు తగనివారని మనువు పేర్కొన్నాడు. అట్లే జడలు గలవానిని లేక బ్రహ్మచారిని వేదాధ్యయనం చేయనివానిని, దుర్బలుని, మోసగాడిని, అనేకమందిచే యాగము చేయించువానిని, హవ్య కవ్యాలకు పిలువరాదు. ఇంకను వైద్యులను జీతం తీసికొని గుడిపూజ చేయువారిని, మాంసము విక్రయించే బ్రాహ్మణులను, వర్తకము చేసే బ్రాహ్మణులను, జీతం తీసుకొని ఊరి పనులు, రాజుయొక్క పనిచేసేవారిని, పుచ్చుగోళ్ళుకలవానిని, నల్లని పండ్లున్న వానిని, గురువుయొక్క ఆజ్ఞకు విరుద్ధముగా నడుచుకొనే వానిని, అగ్ని హోత్రాలను వదలిపెట్టినవానిని, వడ్డి తీసికొని బ్రతుకుచున్న బ్రాహ్మణుని, క్షయరోగము కలవానిని, బ్రతుకు దెరువునకై పశువులు మేపువానిని, అన్నకంటె

ముందు వివాహము చేసుకున్నవానిని, వివాహానంతరము పంచమహాయజ్ఞాలు చేయనివానిని, బ్రాహ్మణాదులను ద్వేషించువాని, తమ్మునకు వివాహమైనను, వివాహము చేసికొనని వానిని, ఇతరుల ధనముచే బ్రదుకువానిని, నాట్యము చేయువానిని , బ్రహ్మచర్యము చెడగొట్టుకొన్నవానిని, శూద్రస్త్రీని వివాహము చేసుకొన్న బ్రాహ్మణుని, రెండవ వివాహం వల్ల జన్మించిన వానిని, మెల్లకన్ను కలవానిని, ఉపపతిని తన యింటిలో ఉంచుకొన్న వానిని, జీతము తీసికొని వేదము చెప్పువానిని, జీతమునిచ్చి చదువుకున్న వానిని, శూద్రుని శిష్యుని, శూద్రుని గురువును, కఠినంగా మాట్లాడేవానిని, కుండ, గోళకులను, తల్లిని, తండ్రిని, గురువును, కారణము లేక వదలిపెట్టినవానిని పతితులతో సంబంధం పెట్టుకున్న వానిని, హవ్యకవ్యాలకు పిలువరాదు.

*అగారదాహీ గరదః కుండాశీసోమవిక్రయీ,*
*సముద్రయాయీ వందీ చ తైలికః కూటకారకః.158*

*పిత్రా వివదమా నశ్చ కితవో మద్యపస్తథా,*
*పాపరోగ్యభిశ స్తశ్చ దాంభికో రసవిక్రయీ.159*

*ధనుశ్శరాణాం కర్తా చ యశ్చాగ్రేదిధిషూపతిః,*
*మిత్రధ్రు గ్ద్యూతవృత్తిశ్చ పుత్రాచార్యస్తథైవ చ.160*

*భ్రామరీ గండమాలీ చ శ్విత్ర్యథో పిశున స్తథా,*
*ఉన్మత్తోఽంధశ్చ వర్జ్యాః స్యుర్వేదనిందక ఏవ చ.161*

అట్లే ఇల్లు తగులబెట్టినవానిని, విషము పెట్టినవానిని, కుండ, గోళకుల అన్నము తిన్నవానిని, సోమలతను అమ్మినవానిని, సముద్ర ప్రయాణం చేసినవానిని, స్తోత్రాలు చేయువానిని, నూనె తీయువానిని, కూట సాక్ష్యాలు చెప్పువానిని, తండ్రితో కొట్లాడువానిని, జూదమాడువానిని, కల్లుత్రాగువానిని, చెడు రోగాలు కలవానిని, డాబుగా నుండువానిని,రసవస్తువుల నమ్మువానిని, ధనుర్బాణములు చేయువానిని చనిపోయిన సోదరుని భార్యను కామించువానిని, (దిధిషూపతి) మిత్రద్రోహిని, జూదమే వృత్తిగా కలవానిని, కొడుకు దగ్గర వేదాధ్యయనం చేసినవానిని, అపస్మార రోగము కలవానిని, గండమాల రోగం కలవానిని, బొల్లి అను రోగమున్నవానిని, లోభం కలవానిని పిచ్చి వానిని, గుడ్డి వానిని, వేదములనిందించువానిని హవ్యకవ్యాలకై పిలువకూడదు.

*హ స్తిగోశ్వోష్ట్రదమకో నక్షత్రైర్యశ్చ జీవతి,*
*పక్షిణాం పోషకో యశ్చ యుద్ధాచార్యస్తథైవ చ.162*

*స్రోతసాం భేదకో యశ్చ తేషాం చావరణే రతః,*
*గృహసంవేశకో దూతో వృక్షారోపక ఏవ చ.163*

*శ్వక్రీడీ శ్యేసజీవీ చ కన్యాదూషక ఏవ చ,*
*హింస్రో వృషలవృత్తిశ్చ గణానాం చైవ యాజకః.164*

*ఆచారహీనః క్లీబశ్చ నిత్యం యాచనక స్తథా,*
*కృషిజీవీ శ్లీపదీ చ సద్భిర్నిందిత ఏవ చ.165*

*ఔరభ్రికో మాహిషికః పరపూర్వాపతిస్తథా,*
*ప్రేతనిర్యాతకశ్చైవ వర్జనీయాః ప్రయత్నతః.166*

*ఏతాన్విగర్హితాచారా నపాఙ్క్త్యేయాన్ ద్విజాధమాన్,*
*ద్విజాతిప్రవరో విద్వానుభయత్ర వివర్జయేత్.167*

అదే విధముగా ఏనుగు ఎద్దు గుఱ్ఱం ఒంటెలను లొంగదీసుకొను వానిని, జోతిష్యం చెప్పి బ్రతుకువానిని, పక్షులను పెంచేవానిని, ఆయుధ విద్యలనుపదేశించేవానిని, చెఱువుల యొక్క ఆనకట్టలను తెంపే వానిని, అట్లే ఆ చెఱువులోనికి వచ్చు నీటికి అడ్డుకట్ట వేయువానిని, వాస్తు విద్య వలన బ్రతుకువానిని, రాజదూతను, వేతనం తీసుకొని వృక్షముల నాటువానిని, కుక్కలను, డేగలను పెంచి ఆడుకొనువానిని, కన్యలను చెడగొట్టు దుర్మార్గుని, హింసించువానిని, శూద్ర వృత్తిచే బ్రతుకువానిని, వినాయకుడు మొదలగు గణములను పూజించి బ్రదుకువానిని, ఆచారం లేనివానిని, నపుంసకుని, ప్రతిదినము యాచనచేసి జీవించువానిని, వ్యవసాయం చేయువానిని, బోదకాలు గలవానిని, సజ్జనులు నిందించువానిని, మేకలు, గేదెలచే బ్రదుకువానిని, విధవావివాహము చేసుకున్నవానిని, శవములమోయువానిని హవ్యకవ్యములకెప్పుడును పిలువకూడదు. వీరు ఆచార హీనులు, పంక్తిభోజనమునకు కూడా అనర్హులు. బ్రాహ్మణాధములు, కావున విజ్ఞానవంతుడగు బ్రాహ్మణుడు పైవారినెప్పుడును దేవకార్యములకు, పితృకార్యములకు పిలువకూడదు.

*బ్రాహ్మణస్త్వనధీయానస్తృణాగ్నిరివ శామ్యతి,*
*తస్మైహవ్యం న దాతవ్యం నహి భస్మని హూయతే. 168*

వేదాధ్యయనము చేయని బ్రాహ్మణుడు మండుచున్న గడ్డిపోచలవలె వెంటనే శమించును. అతని కొసగిన హవ్యకవ్యాలు బూడిదలో పోసిన ఆహుతుల వలె నిష్ఫలమగును.

*అపాఙ్క్త్యదానే యో దాతుర్భవత్యూర్ధ్వం ఫలోదయః*
*దైవే హవిషి పిత్ర్యే వా తత్ ప్రవక్ష్యామ్యశేషతః. 169*

*అవ్రతైర్య ద్విజైర్భుక్తం పరివేత్రాదిభిస్తథా,*
*అపాఙ్క్త్యేయైర్యదన్యైశ్చతద్వైరక్షాంసి భుజంతే. 170*

పంక్తియోగ్యుడు కానివానికి హవ్యకవ్యాలనిస్తే కలిగే ఫలితమెట్లుండో వివరిస్తాను.

వేదగ్రహణమునకై చేయవలసిన బ్రహ్మచర్య వ్రతాలన్ని అనుష్ఠింపనివారు, పరివేత్తలు, పంక్తి బాహ్యులు మొదలైనవారు తిన్న హవ్యకవ్యాలు రాక్షసులకు చెందుతాయి.

*దారాగ్నిహోత్రసంయోగం కురుతే యోఽగ్రజే స్థితే,*
*పరివేత్తాసవిజ్ఞేయః పరివిత్తి స్తు పూర్వజః 171*

*పరివిత్తిః పరివేత్తా యయా చ పరివిద్యతే,*
*సర్వే తే నరకం యాంతి దాతృయాజకపంచమాః 172*

అన్నకంటె ముందు వివాహం చేసుకున్నవానిని పరివేత్త అని అంటారు. ఆ

అన్నను పరివిత్తి అంటారు. అన్నకంటె ముందు వివాహము చేసుకున్న తమ్ముడు ఆతని అన్న తమ్ముని వివాహం చేసుకున్న స్త్రీ ఆ పిల్లనిచ్చినవాడు, ఆ వివాహం చేయించినవాడు వీరందరు నరకానికి పోతారు.

*భ్రాతుర్మృతస్య భార్యాయాం యోఽనురజ్యేత కామతః*
*ధర్మేణాపి నియుక్తాయాం సజ్ఞేయోదిధిషూపతిః 173*

సోదరుడు చనిపోయిన తరువాత అతని భార్యను కామించువానిని దిధిషూపతి అంటారు.

*పరదారేషు జాయేతే చ ద్వౌ సుతౌకుండగోళకౌ,*
*పత్యౌ జీవతి కుండః స్యాన్మృతే భర్తరి గోళకః 174*

*తౌ తు జాతౌ పరక్షేత్రే ప్రాణినౌ ప్రేత్య చేహ చ,*
*దత్తాని హవ్యకవ్యాని నాశయేతే ప్రదాయినామ్.175*

భర్త బ్రతికియుండగా ఇతరుల వల్ల పుట్టినవాడు కుండుడు. భర్త చనిపోయిన తరువాత ఇంకొక పురుషుని వలన పుట్టినవాడు గోళకుడు. ఇట్లు పరుని వలన పుట్టిన కుండ, గోళకుల కిచ్చిన హవ్య కవ్యాలు సైతం దాతయొుక్క పుణ్యాన్ని హరిస్తాయి.

*అపాఙ్క్త్యో యావతః పాఙ్క్త్యాన్ భుంజానా ననుపశ్యతి,*
*తావతాం న ఫలం తత్ర దాతా ప్రాప్నోతి బాలిశః 176.*

*వీక్ష్యాంధో నవతేః కాణ ః షష్టేః శ్విత్రీ శతస్య తు,*
*పాపరోగీ సహస్రస్య దాతు ర్నాశయతే ఫలమ్. 177*

*యావతస్సంస్పృశేదంగైర్బ్రాహ్మణాన్ శూద్రయాజకః*
*తావతాం న భవేద్దాతుః ఫలం దానస్య పౌర్తికమ్. 178*

పంక్తి బాహ్యుడు భోజనం చేస్తూ తన పంక్తిలో నున్న వారినెందరిని చూస్తాడో దాత వారికి భోజనం పెట్టిన ఫలితాన్ని కోల్పోతాడు. గుడ్డివానిని పంక్తిలో కూర్చొనబెట్టి భోజనం పెట్టినందువల్ల తొంబదిమందికి భోజనం పెట్టిన ఫలాన్ని కోల్పోతాడు. ఒంటి కంటి వానికి పంక్తిలో భోజనం పెట్టిన అరవైమందికి భోజనం పెట్టిన ఫలితాన్ని, తెల్ల కుష్ఠు కలవానికి పంక్తిలో భోజనం పెట్టితే నూరుగురికి భోజనం పెట్టిన ఫలితాన్ని, క్షయవ్యాధి పీడితునికి పంక్తిలో భోజనం పెట్టితే వేయిమందికి భోజనం పెట్టిన పుణ్యాన్ని పోగొట్టుకుంటాడు. కావున వీరికి ప్రత్యేకంగా భోజనం పెట్టవలెను. శూద్రులకు పురోహితుడైన వాడు తన పంక్తి యందు కూర్చున్న బ్రాహ్మణులనెందరిని తగులుతాడో కర్త అంతమంది బ్రాహ్మణులకు భోజనం పెట్టిన పలితాన్ని కోల్పోతాడు.

*వేదవిచ్చాపి విప్రోఽస్య లోభాత్కృత్వా ప్రతిగ్రహమ్.*
*వినాశం వ్రజతి క్షిప్రమామపాత్రమివాంభసి. 179.*

*సోమవిక్రయిణే విష్ఠా భిషజే పూయశోణితమ్,*
*నష్టం దేవలకే దత్తమప్రతిష్ఠం తు వార్ధుషౌ. 180*

## తృతీయాధ్యాయం

*యత్తు వాణిజకే దత్తం నేహ నాముత్ర తద్భవేత్,*
*భస్మనీవ హుతం హవ్యం తథా పౌనర్భవే ద్విజే 181*

వేదవేత్తయైన బ్రాహ్మణుడు సైతం అత్యాశవల్ల దానం స్వీకరిస్తే పచ్చికుండ నీటిలో పడి నశించినట్లు వెంటనే నశిస్తాడు. సోమలతను అమ్మినవానికి దానంచేస్తే దాత పంది ఔతాడు. వైద్యునకు దానం చేస్తే దాత చీమురక్తము తిను పురుగౌతాడు. పూజారికిచ్చిన దానం వల్ల ఫలితముండదు. అట్లే వడ్డీనిచ్చువానికి దానం చేస్తే అప్రతిష్ఠ కలుగుతుంది. వర్తకం చేయువానికి రెండవమారు పెండ్లి చేసుకున్న స్త్రీ యొక్క భర్తకు శ్రాద్ధంలో పెట్టిన భోజనం వల్ల ఇహపరలోకాలలో సుఖం లభించదు. పైగా అది బూడిదలో పోసిన ఆహుతి వలె నిష్ఫలమౌతుంది.

*ఇతరేషుత్వపాఙ్క్త్యేషు యథోద్దిష్టేష్వసాధుషు,*
*మేదో సృఙ్మాంసమజ్జాస్థి వదంత్యన్నం మనీషిణః 182*

దుష్టులు పంక్తి బాహ్యులైన ఇతరులకు పెట్టిన యన్నం వల్ల దాతకు మేధస్సు, రక్తమాంసములు, కొవ్వు, ఎముకలు పెట్టిన ఫలితం చేకూరుతుంది.

*అపాఙ్క్త్యోపహతా పఙ్క్తి : పావ్యతే యైర్ద్విజోత్తమైః*
*తాన్నిబోధత కార్త్స్న్యేన ద్విజాగ్ర్యాన్ పఙ్క్తిపావనాన్ 183.*

పంక్తి బాహ్యులవల్ల అపరిశుద్ధమైన బ్రాహ్మణ పంక్తిని పవిత్రం చేసే పంక్తి పావనులైన బ్రాహ్మణోత్తముల గూర్చి వివరిస్తాను.

*అగ్ర్యాస్సర్వేషువేదేషు సర్వప్రవచనేషు చ,*
*శ్రోత్రియాన్వయజాశ్చైవ విజ్ఞేయాః పఙ్క్తిపావనాః 184*

సమస్త వేదాలను, వేదాంగాలను చక్కగా అధ్యయనం చేసి అధ్యాపనం చేయుశ్రోత్రియ వంశములలో పుట్టినవారు పంక్తి పావనులౌతారు.

*త్రిణాచికేతః పంచాగ్ని స్త్రీసుపర్ణషడంగవిత్,*
*బ్రహ్మదేయాత్మసంతానో జ్యేష్ఠసామగ ఏవచ 185*

*వేదార్థవిత్ప్రవక్తా చబ్రహ్మచారీ సహస్రదః*
*శతాయుశ్చైవ విజ్ఞేయా బ్రాహ్మణాః పఙ్క్తిపావనాః 186*

అధ్వర్యు వేదభాగమైన త్రిణాచికేతవ్రతం తెలిసిన వాడు పంచమహా యజ్ఞాలొనర్చువాడు, ఋగ్వేద భాగమైన త్రిసుపర్ణము నెరిగినవాడు, శిక్షాది షడాంగాలనెరిగినవాడు, బ్రాహ్మ వివాహం చేసికొన్న స్త్రీ యొక్క పుత్రుడు, జ్యేష్ఠసామం గానంచేసే వాడు అనే ఆరుగురు పంక్తి పావనులు. అట్లే వేదార్థవేత్త, వేదార్థ ప్రవచనం చేసేవాడు, బ్రాహ్మచర్య వ్రతాన్ని అనుష్ఠించేవాడు, వేయి గోవులను దానం చేసినవాడు, శతాయుష్కుడైన శ్రోత్రియుడు వీరంతా పంక్తి పావనులు.

శ్రాద్ధ బ్రాహ్మణులు

*పూర్వేద్యు రపరేద్యుర్వా శ్రాద్ధకర్మణ్యుపస్థితే,*
*నిమంత్రయేత త్ర్యవరాన్ సమ్యగ్విప్రాన్ యథోదితాన్.187*

శ్రాద్ధానికి ఒకటి లేక రెండు దినాలముందు ముగ్గురికి తగ్గకుండా సద్బ్రాహ్మణులను నిమంత్రణ చేయవలెను.

*నిమంత్రితో ద్విజః పిత్ర్యే నియతాత్మా భవేత్సదా,*
*న చ ఛందాంస్యధీయీత యస్య శ్రాద్ధం చ తద్భవేత్.188*

*నిమంత్రితాన్ హి పితర ఉపతిష్ఠంతి తాన్ ద్విజాన్.*
*వాయువచ్చానుగచ్ఛంతి తథాసీనానుపాసతే.189*

*కేతితస్తు యథాన్యాయం హవ్యకవ్యే ద్విజోత్తమః,*
*కథంచిదప్యతిక్రామన్ పాపస్సూకరతాం వ్రజేత్.190*

*ఆమంత్రితస్తుయః శ్రాద్ధే వృషల్యా సహ మోదతే,*
*దాతుర్యద్దుష్కృతం కించిత్తత్సర్వం ప్రతిపద్యతే.191*

*అక్రోధనా శ్శౌచపరాస్సతతం బ్రహ్మచారిణః,*
*న్యస్తశస్త్రా మహాభాగాః పితరః పూర్వదేవతాః.192*

శ్రాద్ధమందు నియుక్తులైన బ్రాహ్మణులు, శ్రాద్ధకర్త శ్రాద్ధదినమున నిత్యం చేస్తున్న గాయత్రీ మంత్రం, తప్ప ఇతర వేద మంత్రాలను చదువరాదు. శాద్ధ దినాన నిమంత్రితులైన బ్రాహ్మణులను పితృదేవతలు ఎల్లప్పుడు అంటిపెట్టుకొని యుంటారు. అందువల్ల నిమంత్రితులాదినమున పరిశుద్ధులై ఉండవలెను. శ్రాద్ధం లో భోక్తగా ఉండుటకు ఒప్పుకొని ఏదో కారణం వల్ల భోక్తగా రాకపోయినచో మహాపాపాన్ని పొందును. శ్రాద్ధమున నిమంత్రితుడైన బ్రాహ్మణుడు ఆ దినమున స్త్రీ సంగమము చేసినచో శ్రాద్ధకర్త చేసిన పాపమునంతయు పొందును. పితృదేవతలు, పరమశాంతులు, ఆచారవంతులు ఎల్లప్పుడు వేదాధ్యయనం చేసేవారు, పరమశ్రేష్ఠులు కూడ. కావున శ్రాద్ధకర్త, శ్రాద్ధభోక్తలాదినమున పరమశాంతులై సదాచారాన్ని పాటిస్తూ ఉండాలి.

*యస్మా దుత్పత్తిరేతేషాం సర్వేషామప్యశేషతః,*
*యే చ యైరుపచర్యాస్స్యు ర్నియమైస్తాన్ని బోధత.193*

ఈ పితృ దేవతలు ఎవరి వల్ల పుట్టిరి? వారిని ఏ యే నియమాలతో సేవించాలి మొదలైన విషయములను తెలుపుమని ఋషులు భృగు మహర్షినడిగినారు.

*మనోర్హై రణ్యగర్భస్య యే మరీచ్యాదయః సుతాః,*
*తేషామృషీణాం సర్వేషాం పుత్రాః పితృగణాః స్మృతాః.194*

*విరాట్సుతా స్సోమసదః సాధ్యానాం పితరః స్మృతాః,*
*అగ్నిష్వాత్తాశ్చ దేవానాం మారీచా లోకవిశ్రుతాః.195*

*దైత్యదానవయక్షాణాం గంధర్వోరగరక్షసామ్,*
*సుపర్ణ కిన్నరాణాం చ స్మృతా బర్హి షదోऽత్రిజాః.196*

*సోమపా నామ విప్రాణాం క్షత్రాయాణాం హవిర్భుజః,*
*వైశ్యానా మాజ్యపా నామ శూద్రాణాం తు సుకాలినః.197*

హిరణ్య గర్భునికి మనువు పుత్రుడు. అతని పుత్రులు మరిచి మొదలైన మహర్షులు. వారి సంతానమే పితృగణం. విరాట్పుత్రులైన సోమసదులనేవారు సాధ్యులనే వారియొక్క పితృ గణం. అదే విధంగా అగ్ని ష్వాత్తులు అనే మరీచి మహర్షియొక్క పుత్రులు దేవతలకు పితృగణంగా ప్రసిద్ధి చెందినారు. అత్రి మహర్షి పుత్రులైన బర్హిషదులనేవారు దైత్య దానవ యక్షులకు గంధర్వులకు, సర్పములకు, రాక్షసులకు గరుడ, కిన్నరులకు పితరులు. బ్రాహ్మణులకు సోమపులనేవారు క్షత్రియులకు హవిర్భుజులు, వైశ్యులకు ఆజ్యపులు, శూద్రులకు సుకాలినులనే వారు పితరులు.

*సోమపాస్తు కవేః పుత్రా హవిష్మంతోऽంగిరస్సుతాః,*
*పుల స్త్యస్యాజ్యపాః పుత్రా వసిష్ఠస్య సుకాలినః198*

*అగ్ని దగ్ధానగ్నిదగ్ధాన్ కావ్యాన్ బర్హి షదస్తథా,*
*అగ్నిష్వాత్తాంశ్చ సౌమ్యాంశ్చ విప్రాణా మేవ నిర్దిశేత్.199*

*య ఏతే తు గణా ముఖ్యాః పితృణాం పరికీర్తితాః,*
*తేషామపీహ విజ్ఞేయం పుత్రపౌత్ర మనంతకమ్.200*

*ఋషిభ్యః పితరో జాతాః పితృభ్యో దేవమానవాః,*
*దేవేభ్యస్తు జగత్సర్వం చరం స్థాణ్వానుపూర్వశః.201*

వీరిలో సోమపులనేవారు శుక్రుని యొక్క పుత్రులు. హవిష్మంతులు అంగిరస మహర్షి యొక్క పుత్రులు. ఆజ్యపులు పులస్త్య మహర్షి య్యొ పుత్రులు. సుకాలినులనే పితరులు వసిష్ఠ మహర్షి యొక్క పుత్రులు. ఇంకా అగ్ని దగ్ధులు అనగ్ని దగ్ధులు, కావ్యులు (శుక్రపుత్రులు) బర్హిషదులు, అగ్నిష్వాత్తులు సౌమ్యులు వీరందరుకూడ బ్రాహ్మణుల యొక్క పితృ దేవతల సంతానమే. ప్రస్తుతమున్న పితృగణమంతా పైపితృదేవతల యొక్క సంతానమే. ఋషులవలన పితృదేవతలు పుట్టిరి. వారికి దేవ దానవులుద్భవించిరి. వారి వలన ఈ చరాచర సృష్టియంతా ఆవిర్భవించింది.

పార్వణ శ్రాద్ధనియమము :-

*రాజతై ర్భాజనై రేషా మథోవా రాజతాన్వితైః,*
*వార్యపి శ్రద్ధయా దత్తమక్షయాయోపకల్పతే.202*

*దేవకార్యాద్ద్విజాతీనాం పితృకార్యం విశిష్యతే,*
*దైవం హి పితృకార్యస్య పూర్వమాప్యాయనం స్మృతమ్.203*

*తేషా మారక్షభూతం తు పూర్వం దైవం నియోజయేత్,*
*రక్షాంసి హి విలుంపంతి శ్రాద్ధమారక్షవర్జితమ్.204*

*దైవాద్యంతం తదీహేత పిత్రాద్యంతం నతద్భవేత్,*
*పిత్రాద్యంతం త్వీహమానః క్షిప్రం నశ్యతి సాన్వయః.205*

శ్రాద్ధంలో భోక్తలు భోజనం చేయుటకు వెండి పళ్ళేరములు లేక వెండి పూసిన పాత్రలనుపయోగించాలి లేక శ్రద్ధతో ఇవ్వబడిన నీరైనను పితృదేవతలకు అక్షయ తృప్తినిస్తుంది. బ్రాహ్మణులకు దేవకార్యం కంటె పితృకార్యం చాలా ముఖ్యమైంది దేవకార్యం పితృకార్యం కంటే ముందున్నా పితృకార్యానికి అది అంగమని పేర్కొనబడింది. పితృ దేవతలను రక్షించుటకై తొలుత విశ్వే దేవరూప బ్రాహ్మణుని నియోగింపవలెను. రక్షణ రూపమైన విశ్వే దేవత లేనిచో పితృకార్యాన్ని రాక్షసులు నాశనం చేస్తారు. శ్రాద్ధమున పితరులకు ముందు విశ్వేదేవ స్వరూపుడైన బ్రాహ్మణుని చివర శ్రీమహావిష్ణు స్వరూపుడైన బ్రాహ్మణుని ఉంచవలెనే కాని దేవతాస్వరూపుడగు బ్రాహ్మణుని మధ్యన ఉంచి ఇటునటు పితృస్వరూపులైన బ్రాహ్మణులనుంచకూడదు. ఆ విధంగా శ్రాద్ధం చేస్తే శ్రాద్ధకర్త తనకుటుంబంతో సహా నశిస్తాడు.

*శుచిం దేశం వివిక్తం చ గోమయేనోపలేపయేత్,*
*దక్షిణాప్రవణం చైవ ప్రయత్నేనోపపాదయేత్.206*

శ్రాద్ధ బ్రాహ్మణుల పాద ప్రక్షాళనకై పరిశుద్ధమైన ప్రదేశాన్ని ఎన్నుకొని ఆవు పెండతో ఆ స్థలము నలుకవలెను. పాదప్రక్షాళనకు ఉపయోగించే ప్రదేశం దక్షిణ దిక్కుకు కొద్దిగా వంపుతో నుండాలి.

*అవకాశేషు చోక్షేషు నదీతీరేషు చైవ హి,*
*వివిక్తేషు చ తుష్యంతి దత్తేన పితరస్సదా.207*

పితృతర్పణాన్ని వస్తుతః పరిశుద్ధమైన అరణ్యాలలో గాని, నదీ తీరాలలోగాని, నిర్జన ప్రదేశాలలో గాని చేస్తే పితృ దేవతలెల్లప్పుడు సంతోషము పొందుతారు. 207

*ఆసనేషూపక్లుప్తేషు బర్హిష్మత్సు పృథక్పృథక్,*
*ఉపస్పృష్టోదకాన్ సమ్యగ్విప్రాంస్తానుపవేశయేత్.208*

*ఉపవేశ్య తు తాన్ విప్రానాసనేష్వజుగుప్సితాన్,*
*గంధమాల్యైస్సురభిభిరర్చయేద్దేవపూర్వకమ్.209*

*తేషాముదకమానీయ సపవిత్రాంస్తిలానపి,*
*అగ్నౌకుర్యాదనుజ్ఞాతో బ్రాహ్మణో బ్రాహ్మణైస్సహ.210*

శ్రాద్ధంలోనిమంత్రితులైన బ్రాహ్మణులు స్నానం చేసి పరిశుద్ధులై ఉండాలి. స్నానం చేసిన ఆ బ్రాహ్మణులను దర్భలు పరచి (ఉత్తరాగ్రాలుగా) ప్రత్యేకంగా కూర్చుండబెట్టవలెను. ఆ విధంగా వారిని కూర్చుండబెట్టి విశ్వేదేవతాస్వరూపుడైన బ్రాహ్మణునితో ప్రారంభించి గంధం, మాలలు, మొదలైన వాటితో వారిని పూజింపవలెను. తరువాత వారికి అర్ఘ్యోదకంతో పవిత్రమైన నువ్వులను సమర్పించి ఆ బ్రాహ్మణులయొక్క అనుజ్ఞను పొంది శ్రాద్ధకర్త అగ్ని యందు ఈ దేవతలకై హోమము చేయవలెను.

*అగ్నేస్సోమయమాభ్యాం స కృత్వాప్యాయనమాదితః,*
*హవిర్దానేన విధివత్పశ్చాత్సంతర్పయేత్పితౄన్.211*

*అగ్న్యభావే తు విప్రస్య పాణావేవోపపాదయేత్,*
*యో హ్యగ్నిస్స ద్విజో విప్రైర్మంత్రదర్శిభిరుచ్యతే. 212*

*అక్రోధనాన్ సుప్రసాదాన్ వదంత్యేతాన్ పురాతనాన్,*
*లోకస్యాప్యాయనే యుక్తాన్ శ్రాద్ధదేవాన్ ద్విజోత్తమాన్.213*

తొలుత అగ్నికి, సోమునకు, యమునకు శాస్త్ర ప్రకారంగా హవిస్సులు సమర్పించి తరువాత పితృదేవతలకు హవిస్సులనీయవలెను. బ్రహ్మచారి, స్నాతకుడు, భార్యారహితుడు ఈ ముగ్గురికి గార్హపత్యాగ్ని యుండదు. కావున వారు బ్రాహ్మణుని కుడిచేతిలోనే పై మూడాహుతులనివ్వవలెను. బ్రాహ్మణుడు అగ్ని హోత్ర స్వరూపుడని మంత్రతత్వవేత్తలగు బ్రాహ్మణులే పేర్కొనుచున్నారు. అట్లే శ్రాద్ధంలోనియుక్తులైన బ్రాహ్మణులు పరమశాంతులు, మిక్కిలి దయకలవారు, పెద్దవారు లోకానికి మేలు చేస్తారు. కావున వారి చేతిలో హోమం చేయవచ్చునని పెద్దలు చెప్పుతారు.

*అపసవ్యమగ్నౌ కృత్వా సర్వమావృత్య విక్రమమ్,*
*అపసవ్యేన హస్తేన నిర్వపేదుదకం భువి.214*

*త్రీంస్తు తస్మాద్ధవిశ్శేషాత్పిండాన్ కృత్వా సమాహితః,*
*ఔదకేనైవ విధినా నిర్వపేద్దక్షిణాముఖః.215*

*న్యుప్య పిండాంస్తతస్తాంస్తు ప్రయతో విధిపూర్వకమ్,*
*తేషు దర్భేషు తం హస్తం విమృజ్యాల్లేపభాగినామ్.216*

*ఆచమ్యోదక్పరావృత్య త్రిరాయమ్య శనైరసూన్,*
*షడృతూంశ్చ నమస్కుర్యా త్పితౄ నేవ చ మంత్రవత్.217*

*ఉదకం నినయేచ్ఛేషం శనైః పిండాంతికే పునః,*
*అవజిఘ్రేచ్చ తాన్ పిండాన్ యథా న్యుప్తాన్ సమాహితః.218*

*పిండేభ్యస్త్వల్పికాం మాత్రాం సమాదాయానుపూర్వశః,*
*తేనైవ విప్రానాసీనాన్ విధివత్పూర్వమాశయేత్.219*

అగ్నియందు చేయాల్సిన హోమానుష్ఠానక్రమమంతా దక్షిణ దిక్కులోనే చేయాలి. అట్లే కుడిచేతితో పిండప్రదాన స్థలంలో దర్భలు పరచినచోట నూవుల నీళ్ళు వదలవలెను. తర్వాత హోమం తర్వాత మిగిలిన అన్నంనుండి మూడు పిండాలు చేసి శ్రాద్ధకర్త శ్రద్ధతో దక్షిణాభిముఖుడై నూవుల నీళ్ళు వదలిన ప్రదేశంలో ఆ పిండాలను పెట్టాలి. ఈ విధంగా తమ తమ సూత్రోక్త ప్రకారాన పిండాలను పెట్టి దర్భల మొదళ్లలో తన చేతిని రాచి తన చేతి కంటుకొన్న మెతుకులను లేపభాక్కులగు పితరులకు ఒసగవలెను. తరువాత అతడు ఉత్తరాభిముఖుడై ఆచమనం చేసి మెల్లగా మూడు ప్రాణాయామాలను చేసి "వసంతాయనమస్తుభ్యం" మొదలైన మంత్రాలతో ఆరు ఋతువులకు నమస్కరించి

అటుపిమ్మట పితృ దేవతలకు నమస్కరించాలి. తరువాత పిండాలు పెట్టిన స్థలమందున్న నీటిలో కొంతభాగాన్ని తీసికొని మెల్లగా పిండాల దగ్గర వదలవలయును. తరువాత ఆ పిండాలను వరుసగా తీసికొని వాటిని వాసన చూచి ఆ పిండాలలోనుండి కొద్ది భాగాన్ని తీసికొని వరుసగా కూర్చున్న భోక్తలు తినునట్లు పెట్టవలెను.

*ధ్రియమాణే తు పితరి పూర్వేషామేవ నిర్వపేత్,*
*విప్రవద్వాఽపి తం శ్రాద్ధే స్వకం పితరమాశయేత్. 220*

*పితా యస్య తు వృత్తస్స్యాజ్జీవేచ్చాపి పితామహః,*
*పితుస్స నామ సంకీర్త్య కీర్త యేత్ప్రపితామహమ్. 221*

*పితామహో వా తచ్ఛ్రాద్ధం భుంజీతేత్యబ్రవీన్మనుః,*
*కామం వా సమనుజ్ఞాతః స్వయమేవ సమాచరేత్. 222*

*తేషాం దత్వా తు హస్తేషు సపవిత్రం తిలోదకమ్,*
*తత్పిండాగ్రం ప్రయచ్ఛేత స్వధైషామస్త్వితి బ్రువన్. 223*

తండ్రిబ్రతికి యున్నప్పుడు శ్రాద్ధము పెట్టవలసి వచ్చినచో తండ్రిని వదలి తక్కినవారికి శ్రాద్ధము పెట్టవలయును. పితృస్థానమున తన తండ్రిని కూర్చుండబెట్టి భోజనము పెట్టవలెను. అప్పుడు పిండం మాత్రం పితామహప్రపితామహులకే ఉండును. లేక తండ్రి చనిపోయి పితామహుడు (తాత) బ్రతికి ఉంటే తండ్రికి, ప్రపితామహునికి మాత్రమే పిండప్రదానం చేయాలి. లేక బ్రతికి యున్న పితామహుని (తాతను) పితామహుని స్థానముననుంచి అతనికే భోజనం పెట్టాలి. ఈ విధంగా పితృ,పితామహ, ప్రపితామహులనావాహన చేసి బ్రాహ్మణుల చేతిలో తిలలు, దర్భలు కల నీటిని పోసి అంతకుముందు పిండాల నుండి తీసిన భాగములను పిత్రేస్వధాస్తు, పితామహాయస్వధాస్తు, ప్రపితామహాయ స్వధాస్తు అని వరుసగా వారిచేతులలో పెట్టాలి.

*పాణిభ్యాం తూపసంగృహ్య స్వయమన్నస్య వర్ధితమ్,*
*విప్రాంతికే పితౄన్ ధ్యాయన్ శనకైరుపనిక్షిపేత్. 224*

*ఉభయో ర్హస్తయోర్ముక్తం యదన్న ముపనీయతే,*
*తద్విప్రలుంపంత్యసురా స్సహసా దుష్టచేతసః. 225*

*గుణాంశ్చ సూపశాకాద్యాన్ పయో దధి ఘృతం మధు,*
*విన్యసేత్ప్రయతః పూర్వం భూమావేవ సమాహితః. 226*

*భక్ష్యం భోజ్యం చ వివిధం మూలాని చ ఫలాని చ,*
*హృద్యాని చైవ మాంసాని పానాని సురభీణి చ. 227*

అన్న పాత్రను రెండు చేతులతో పట్టుకొని పితృ దేవతలను స్మరిస్తూ మెల్లగా భోక్తల సమీపంలో పెట్టవలెను. అన్న పాత్రను రెండు చేతులతో పట్టుకొనక బ్రాహ్మణుల సమీపానికి తెస్తే ఆ అన్నాన్ని దుష్టబుద్ధిగల రాక్షసులు వెంటనే హరిస్తారు. శ్రాద్ధకర్త పప్పు, కూరగాయలు, పెరుగు, పాలు, తేనె మొదలగువానిని శ్రద్ధాభక్తులతో అన్నం కంటె ముందే

*దండో హి సుమహత్తేజో దుర్ధరశ్చాకృతాత్మభిః,*
*ధర్మాద్విచలితం హంతి నృపమేవ సబాంధవమ్ 28*

*తతో దుర్గం చ రాష్ట్రం చ లోకం చ సచరాచరమ్,*
*అంతరిక్షగతాంశ్చై మునీన్ దేవాంశ్చ పీడయేత్ 29*

*సోఽసహాయేన మూఢేన లుబ్ధేనాకృతబుద్ధినా,*
*న శక్యో న్యాయతో నేతుం సక్తేన విషయేషు చ 30*

*శుచినా సత్యసంధేన యథా శాస్త్రానుసారిణా,*
*ప్రణేతుం శక్యతే దండస్సుసహాయేన ధీమతా 31*

ధర్మమనేది గొప్ప కాంతి వంటిది. దాన్ని సామాన్యులు మోయలేరు. అందువల్ల ధర్మంతప్పిన రాజును ఆ దండం బంధు మిత్రాదులతో సమూలంగా నాశనం చేస్తుంది. రాజును నాశనం చేసిన తర్వాత దుర్గాన్ని రాజ్యాన్ని, సమస్త ప్రాణులను, ఆకాశంలో తిరుగుతున్న దేవతలను, మునులనందర్నీ నాశనం చేస్తుంది. అందువల్ల రాజు, మంత్రులు మొదలైన వారి సహాయం తీసికొనక లోభి, మూఢుడు, విషయానురాగం కలవాడైతే ఆ దండాన్ని న్యాయంగా ఉపయోగించలేడు. కాని విజ్ఞానియైన రాజు లంచం మొదలైనవి తీసికొనకుండా పవిత్రుడై సత్య సంధుడై, శాస్త్రమర్యాదననుసరించి ప్రవర్తిస్తూ మంత్రులు మొదలైన వారి సహాయంతో ఈ దండాన్ని చక్కగా ప్రయోగిస్తాడు.

*స్వరాష్ట్రే న్యాయవృత్తస్స్యా ద్భృతదండశ్చ శత్రుషు,*
*సుహృత్స్వజిహ్మః స్నిగ్ధేషు బ్రాహ్మణేషు క్షమాన్వితః 32*

రాజు తన దేశ ప్రజలను న్యాయంగా చూచుకోవాలి. శత్రువుల వద్ద కఠినంగా వ్యవహరించాలి. స్నేహితుల దగ్గర కౌటిల్యం లేకుండా ఉండాలి. బ్రాహ్మణులు చేసిన దోషాలందు ఓర్పు కలిగి ఉండాలి.

*ఏవంవృతస్య నృపతేశ్శిలోంఛేనాపి జీవతః*
*విస్తీర్యతే యశో లోకే తైలబిందురివాంభసి 33*

*అతస్తు విపరీతస్య నృపతేరజితాత్మనః,*
*సంక్షిప్యతే యశో లోకే ఘృత బిందురివాంభసి 34*

రాజు ఈ విధంగా ఉంటే అతని దగ్గర సంపద లేకపోయినా, నీటిపై నూనెవలె అతనికీర్తి అంతటా వ్యాపిస్తుంది.

దీనికి విరుద్ధంగా ప్రవర్తిస్తే జితేంద్రియుడు కాని రాజు యొక్క కీర్తి నీటిలో పడ్డ నేతిబొట్టువలె అడుగంటుతుంది.

*స్వే స్వే ధర్మే నివిష్టానాం సర్వేషామనుపూర్వశః,*
*వర్ణానామాశ్రమాణాం చ రాజా సృష్టోఽభిరక్షితా 35*

తమ తమ ధర్మాలను అనుష్ఠించాలనే పట్టుదల ఉన్న బ్రాహ్మణాది చాతుర్వర్ణ్యాన్ని, బ్రహ్మచర్యాది నాలుగు ఆశ్రమాల్ని చక్కగా రక్షించుటకై బ్రహ్మదేవుడు రాజును సృష్టించినాడు.

*తేన యద్యత్సభృత్యేన కర్తవ్యం రక్షతా ప్రజాః,*
*తత్తద్వోఽ హం ప్రవక్ష్యామి యథావదనుపూర్వశః, 36*

తన ప్రజలను చక్కగారక్షించే రాజు తన భృత్యపరివార సమేతంగా చేయాల్సిన విధులనన్నింటినీ మీకు వివరించి చెప్తానని భృగు మహర్షి మునులతో పలికెను.

*బ్రాహ్మణాన్ పర్యుపాసీత ప్రాతరుత్థాయ పార్థివః,*
*త్రైవిద్యవృద్ధాన్ విదుషస్తిష్ఠేత్తేషాం చ శాసనే 37*

*వృద్ధాంశ్చ నిత్యం సేవేత విప్రాన్ వేదవిదశ్శుచీన్,*
*వృద్ధసేవీ హి సతతం రక్షోభిరపి పూజ్యతే 38*

*తేభ్యోఽ ధిగచ్ఛేద్వినయం వినీతాత్మాపి నిత్యశః,*
*వినీతాత్మా హి నృపతిర్న వినశ్యతి కర్హిచిత్ 39*

*బహవోఽ వినయాన్నష్టా రాజానస్సపరిచ్ఛదాః,*
*వనస్థా అపి రాజ్యాని వినయాత్ప్రతిపేదిరే 40*

*వేనో వినష్టోఽ వినయాన్నహుషశ్చైవ పార్థివః,*
*సుదాసో యావనశ్చైవ సుముఖో నిమిరేవ చ, 41*

*పృథస్తు వినయాద్రాజ్యం ప్రాప్తవాన్ మనురేవ చ,*
*కుబేరశ్చ ధనైశ్వర్యం బ్రాహ్మణ్యం చైవ గాధిజః 42*

రాజు ఉదయాన్నే లేచి ఋగ్యజుసామాలనే మూడు వేదాలను సాంగంగా అర్థతత్వసహితంగా చదువుకొన్న బ్రాహ్మణులను సేవిస్తూ వారి ఆజ్ఞలను పరిపాలించాలి. అట్లే వయస్సులోను తపస్సులోను తనకంటె పెద్దలైన వృద్ధులనెల్లప్పుడు సేవించాలి. వేదాలన్ని తెలిసిన పవిత్రులైన బ్రాహ్మణులను సేవించాలి. వృద్ధులను ఎల్లప్పుడు సేవించేరాజును రాక్షసులు సైతం గౌరవిస్తారు. తాను అర్థ శాస్త్రం మొదలగు వానిని నేర్చుకొన్నా, ఇతర విషయజ్ఞానమెంత ఉన్నా వినయవిధేయతలున్న మహారాజు వృద్ధుల దగ్గర నీతిని తెలిసికోవాలి. అట్టి రాజెప్పటికి నశింపడు. చాలామంది రాజులు వినయం లేక తమ పరివార సహితంగా నాశనమై పోయినారు. వినయ సంపద ఉన్న మహారాజులు అడవిలో ఉన్నప్పటికి తమ రాజ్యాన్ని తిరిగి పొందగలిగినారు. వేనుడు, నహుషుడు, యవనపుత్రుడైన సుదాసుడు, సుముఖుడు, నిమి, వీరందరు వినయ విధేయతలు లేక పేరు ప్రతిష్ఠలు గోల్పోయి నశించినారు. అట్లే వినయ విధేయతలున్న పృధు చక్రవర్తి, మనువు, పెద్దలయొక్క అనుగ్రహం వల్ల రాజ్యాన్ని పొందినారు. కుబేరుడు ధనాధిపతి ఐనాడు. గాధిపుత్రుడైన విశ్వామిత్రుడు బ్రహ్మర్షియైనాడు.

*త్రైవిద్యేభ్యస్త్రయీం విద్యాం దండనీతిం చ శాశ్వతీమ్,*
*ఆన్వీక్షికీం చాత్మవిద్యాం వార్తారంభాంశ్చ లోకతః 43*

వేదాలను చక్కగా అభ్యాసంచేసి వారివద్ద మూడు వేదాలను, నిత్యమైన అర్థశాస్త్రాన్ని, తర్కవిద్యను, అధ్యాత్మ విద్యను, లౌకికులగు పెద్దల దగ్గర కృషి వర్తకం మొదలైన వాటినన్నిటిని నేర్చుకోవాలి.

*ఇంద్రియాణాం జయే యోగం సమాతిష్ఠే ద్దివానిశమ్,*
*జితేంద్రియో హి శక్నోతి వశే స్థాపయితుం ప్రజాః 44*

*దశ కామసముత్థాని తథాష్టౌ క్రోధజాని చ,*
*వ్యసనాని దురంతాని ప్రయత్నేన వివర్జయేత్ 45*

*కామజేషు ప్రసక్తో హి వ్యసనేషు మహీపతిః,*
*వియుజ్యతేऽ ర్థధర్మాభ్యాం క్రోధజేష్వాత్మనైవ తు 46*

ఇంద్రియాల్ని జయించుటకు రాత్రింబగళ్లు కృషి చేయాలి. జితేంద్రియుడైన రాజే ప్రజలను తన అధీనంలో ఉంచుకోగలుగుతాడు. కామం వల్ల పుట్టే పది వ్యసనాలను, కోపం వలన పుట్టే ఎనిమిది వ్యసనాలను రాజు ప్రయత్న పూర్వకంగా వదలివేయాలి. కామం వలన పుట్టే వ్యసనాల వల్ల రాజు అర్థానికి, ధర్మానికి దూరమౌతాడు. కోపం వల్ల పుట్టే వ్యసనాల వల్ల తానే నాశన మౌతాడు.

*మృగయాక్షా దివాస్వప్నః పరివాదః స్త్రియో మదః,*
*తౌర్యత్రికం వృథాట్యా చ కామజో దశకో గణః 47*

*పైశున్యం సాహసం ద్రోహ ఈర్ష్యాऽ సూయార్థదూషణమ్,*
*వాగ్దండజం చ పారుష్యం క్రోధజోऽపి గణోऽష్టకః 48*

*ద్వయోరప్యేతయోర్మూలం యం సర్వే కవయో విదుః,*
*తం యత్నేన జయేల్లోభం తజ్జావేతావుభౌ గణౌ 49*

వేట, పాచికలాట, పగటి నిద్ర, పరనింద స్త్రీ సంభోగం, మధ్యం, నృత్త గీతావాద్యాలు, వ్యర్థ సంచారాలనే పది కామం వల్ల పుట్టిన వ్యసనాలు. కొండెములు చెప్పుట, ఇతరుల యొక్క మంచిగుణాలను సహింపక పోవుట, డబ్బు దొంగలించుట, ఇవ్వ దగిన వానిని ఇవ్వకపోవుట, పరుషంగా మాట్లాడుట పరుషమైన దండం ఇవన్నీ కోపం వలన గలిగే దుర్వ్యసనాలు. ఈ కామ క్రోధాలకు కారణమైన లోభగుణాన్ని, దానివల్లపుట్టిన రెండు రకాలైన వ్యసనాలను కష్టపడి యైనా వదలి పెట్టాలి.

*పానమక్షాః స్త్రియ శ్చైవ మృగయా చ యథాక్రమమ్,*
*ఏతత్కష్టతమం విద్యాచ్చతుష్కం కామజే గణే 50*

*దండస్య పాతనం చైవ వాక్పారుష్యార్థదూషణే,*
*క్రోధజేऽ పి గణే విద్యాత్కష్టమేతత్త్రికం సదా 51*

*సప్తకస్యాస్య వర్గస్య సర్వత్రైవానుషంగిణః,*
*పూర్వం పూర్వం గురుతరం విద్యాద్వ్యసనమాత్మవాన్ 52*

*వ్యసనస్య చ మృత్యోశ్చ వ్యసనం కష్టముచ్యతే,*
*వ్యసన్యధోऽ థో వ్రజతి స్వర్యాత్యవ్యసనీ మృతః 53*

మధ్యపానము, పాచికలాట, స్త్రీ సంభోగం, వేట ఈనాలుగు వ్యసనాలు కామంవల్ల పుట్టే వ్యసనాల్లో చాలా కష్టాన్ని కలిగించేవి. కొట్టుట, తిట్టుట, ధనాన్ని అపహరించుట, అనే

మూడు వ్యసనాలు కోపం వల్ల పుట్టే వ్యసనాల్లో చాలా కష్టాన్ని కలిగించేవి. కామం వల్ల కోపం వల్ల పుట్టిన సప్త వ్యసనాల్లో మొదటివి ఆ తర్వాతి వాటికంటె చెడ్డవి. మొదటి దాని కంటె రెండోది, రెండో దానికింటె మూడోది దానికంటె నాల్గోది ఈ విధంగా ఆరోదానికంటె ఏడోది కొంతవరకు మంచివి. వ్యసనం మరణం ఈ రెండింటిలో వ్యసనమే చాలా చెడ్డది. వ్యసనం కలవాడు నానాటికి క్షీణిస్తుంటాడు. వ్యసనం లేనివాడు చనిపోయినా ఊర్ధ్వ దిశకు పోతాడు. అనగా కీర్తి కలిగి ఉంటాడు.

*మౌలాన్ శాస్త్ర విదశ్శూరాన్ లబ్ధలక్షాన్ కులోద్భవాన్,*
*సచివాన్ సప్త చాష్టౌ వా ప్రకుర్వీత పరీక్షితాన్ 54*

*అపి యత్సుకరం కర్మ తదప్యేకేన దుష్కరమ్,*
*విశేషతోఽసహాయేన కింతు రాజ్యం మహోదయమ్ 55*

వంశపారంపర్యంగా వచ్చినవారు, చక్కని శాస్త్రజ్ఞానంకలవారు, శూరులు, ఆయుధవిద్య చక్కగా నేర్చినవారు, అరు ఏడు లేక ఎనమండుగురు మంత్రులను రాజు పరీక్షించి పెట్టుకొనవలెను. ఎంత తేలిక పనియైనా ఒక్కడే చేయుట చాలా కష్టమైంది. అందువల్ల అనేక పనులుండే రాజ్యాన్ని ఒక్కడే ఏలుట చాలా కష్టమైంది.

*తైస్సార్థం చింతయేన్నిత్యం సామాన్యం సంధివిగ్రహమ్*
*స్థానం సముదయం గుప్తిం లబ్ధ ప్రశమనాని చ 56*

*తేషాం స్వం స్వమభిప్రాయముపలభ్య పృథక్ పృథక్,*
*సమస్తానాం చ కార్యేషు విదధ్యాద్ధితమాత్మనః 57*

*సర్వేషాం తు విశిష్టేన బ్రాహ్మణేన విపశ్చితా,*
*మంత్రయేత్పరమం మంత్రం రాజా షాడ్గుణ్య సంయుతమ్ 58*

*నిత్యం తస్మిన్ సమాశ్వస్తః సర్వకార్యాణి నిక్షిపేత్,*
*తేన సార్థం వినిశ్చిత్య తతః కర్మ సమారభేత్ 59*

కావున రాజు మంత్రులతో సాధారణ విషయాలను, సంధి విగ్రహాలను, దండం, కోశం, పురం, రాష్ట్రం అనే నాల్గింటిని గూర్చిన వ్యవహారాన్ని, ధాన్యాదుల పుట్టుకను, వాటి సంరక్షణను, దొరికిన ధనం మొదలైన వాటిని సక్రమంగా వినియోగించడం మొదలైన వానిని గూర్చి ఆలోచించాలి. ఆ మంత్రులలో ఒక్కొక్కరి అభిప్రాయాన్ని వేరు వేరుగా తీసుకొని, మరల సమిష్టి అభిప్రాయాన్ని కూడ తెలిసికొని వాటిలో తనకు మేలు చేసే వాటిని చేయాలి. మంత్రులందరి లోను పండితుడు ధార్మికత్వం మొదలైన మంచి గుణాల్లో గొప్పవాడైన బ్రాహ్మణునితో యుద్ధం, సంధి మొదలైన ప్రధాన విషయాల గురించి ఆలోచించాలి. రాజు ఆ మంత్రిని నమ్మి అన్ని కార్యాలు చేయాలి. అతనితో మంతనాలు చేసి ఆ తర్వాత పనులు చేయాలి.

*అన్యానపి ప్రకుర్వీత శుచీన్ ప్రాజ్ఞానవస్థితాన్,*
*సమ్యగర్థసమాహర్తౄనమాత్యాన్ సుపరీక్షితాన్ 60*

*నిర్వర్తేతాస్య యావద్భి రితికర్తవ్యతా నృభిః*
*తావతోऽతంద్రితాన్ దక్షాన్ ప్రకుర్వీత విచక్షణాన్ 61*

డబ్బు విషయంలో పరిశుద్ధులు, మంచి తెలివికలవారు ధనాన్ని బాగా సంపాదించే వారు, ఐన వారిని పరీక్షించి ఇతర మంత్రులుగా చేసికొనవలెను. వారు ఉత్సహం కలిగి, సమర్థులై, ఆలోచనా పరులై ఉండవలెను. రాజు తన అవసరాలకు తగ్గట్లు వారి సంఖ్యను పెంచుకొన వచ్చును. (బహుశ : వీరు ఉపమంత్రులై ఉంటారు).

*తేషామర్థే నియుంజీత శూరాన్ దక్షాన్ కులోద్గతాన్,*
*శుచీనాకరకర్మాంతే భీరూనంతర్నివేశనే 62*

శూరులు, సమర్థులు, కులక్రమంగా వచ్చినవారు వీరిని అర్థ విషయంలో మంత్రులుగా ఉంచుకోవాలి. డబ్బును ఆశింపక శుచిగా ఉండేవారిని, బంగారు మొదలైనవి ఉత్పత్తియగు చోట, ధాన్యాదులను సమకూర్చేచోట, డబ్బుకు లొంగని వారిని భయపడే స్వభావమున్న వారిని అంతఃపురంలో నియమించాలి.

*దూతం చైవ ప్రకుర్వీత సర్వశాస్త్ర విశారదమ్,*
*ఇంగితాకార చేష్టజ్ఞం శుచిం దక్షం కులోద్గతమ్ 63*

*అనుర క్తశ్శుచిర్దక్షః స్మృతిమాన్ దేశకాలవిత్,*
*వపుష్మాన్ వీత భీర్వాగ్మీ దూతో రాజ్ఞః ప్రశస్యతే 64*

సమస్త శాస్త్రాలు తెలిసినవాడు, మాటలు చేష్టలు ఆకారములను ఇతరుల మనస్సు గుర్తించువాడు పరిశుద్ధుడు, సమర్థుడు ఇంకా కులక్రమంగా వచ్చిన వానిని దూతగా చేయాలి. జనులందనురాగమున్నవాడు, స్త్రీ ధనాదివిషయాలలో పరిశుద్ధుడు, సమర్థుడు,చక్కని జ్ఞాపక శక్తి కలవాడు, దేశకాలాలు తెలిసినవాడు, మంచి రూపం కలవాడు, భయంలేనివాడు, మాటల్లో నేర్పరియైనవానిని రాజదూతగా చేయాలి.

*అమాత్యే దండ ఆయత్తో దండే వైనయికీ క్రియా,*
*నృపతౌ కోశరాష్ట్రే చ దూతే సంధివిపర్యయౌ 65*

*దూత ఏవ హి సంధత్తే భినత్త్యేవ చ సంహతాన్,*
*దూత స్తత్కురుతే కర్మ భిద్యంతే యేన వా న వా 66*

*స విద్యాదస్యకృత్యేషు నిగూఢేంగిత చేష్టితైః,*
*ఆకారమింగితం చేష్టాం భృత్యేషు చ చికీర్షితమ్ 67*

అమాత్యునికి దండం అధీనమై యుంటుంది. దండానికి వినయం అధీనమై ఉంటుంది. రాజుకు ధనాగారం, రాజ్యం, దూతకు సంధియుద్ధాలు అధీనమై యుంటాయి. దూత రాజులిద్దరిని దగ్గరకు చేరుస్తాడు. విడదీస్తాడు. అందువల్ల సంధి విగ్రహాలను దూతనే చేస్తాడు. దూత ఇంకొక రాజు దగ్గరకు మారు వేషంతో పోయి శత్రువుల మనస్సును, ఆకారాన్ని, అతని భృత్యుల మనోగతాన్ని, చేష్టలను గుర్తింపగలుగుతాడు.

*బుద్ధ్వా చ సర్వం తత్త్వేన పరరాజచికీర్షితమ్,*
*తథా ప్రయత్నమాతిష్ఠేద్యథాత్మానం న పీడయేత్ 68*

ఈ విధంగా రాజు దూత ద్వారా శత్రు రాజుల చర్యలనన్నిటిని తెలిసికొని తనకు అపాయం కలుగని పద్ధతిలో నడచుకోవాలి. 68

*జాంగలం సస్యసంపన్నమార్యప్రాయమనావిలమ్,*
*రమ్యమానతసామంతం స్వాజీవ్యం దేశమావసేత్ 69*

రాజు తానుండే ప్రదేశం జలమయం తృణసమృద్ధంగా చూచుకోవాలి. అది బహుధాన్య సమృద్ధి కలిగి యుండాలి. ధార్మికులతో ఉండి రోగాది ఉపద్రవాలు లేకుండా ఉండాలి. వండ్ల చెట్లు, తీగలు, వుష్పాలున్న చెట్లతో అందంగా ఉండాలి. సామంతరాజులందరు వినయ విధేయతలతో నుండి తన రాజ్యాన్నాక్రమించుటకు వీలు కాకుండ దురంగా ఉండాలి. అట్లే జనులందరు సులభంగా జీవించేటట్లు ఉండాలి.

**రాజధాని :-**

*ధన్వ దుర్గం మహీదుర్గ మబ్దుర్గం వార్క్షమేవ వా,*
*నృదుర్గం గిరిదుర్గం వా సమాశ్రిత్య వసేత్పురమ్ 70*

*సర్వేణ తు ప్రయత్నేన గిరిదుర్గం సమాశ్రయేత్,*
*ఏషాం హి బాహుగుణ్యేన గిరిదుర్గం విశిష్యతే 71*

*త్రీణ్యాద్యాన్యాశ్రితా స్త్వేషాం మృగగర్తాశ్రయాఽప్సరాః,*
*త్రీణ్యుత్తరాణి క్రమశః ప్లవంగమనరామరాః 72*

*యథా దుర్గాశ్రితానేతాన్నోపహింసంతి శత్రవః,*
*తథారయో న హింసంతి నృపం దుర్గం సమాశ్రితమ్ 73*

*ఏకశ్శతం యోధయతి ప్రాకారస్థో ధనుర్ధరః,*
*శతం దశసహస్రాణి తస్మాద్దుర్గం విధీయతే 74*

*తత్ స్యాదాయుధసంపన్నం ధనధాన్యేన వాహనైః,*
*బ్రాహ్మణై శ్శిల్పిభిర్యంత్రై ర్యవసేనోదకేన చ 75*

రాజు నివసించు రాజధాని ఐదు యోజనాల వరకు నీరు లేని మరుదుర్గం కాని, చాలా విశాలమైన కోటగోడ ఉన్న మహీ దుర్గం కాని, కోడగ్గోడచుట్టులోతైన నీరున్న జలదుర్గంకాని, రాజ ధానికి చుట్టు అడవులున్న వనదుర్గంకాని చతురంగబలాలతో రక్షింపబడే మానవ దుర్గంకాని కోట గోడచుట్టు నాలుగు వైపుల కొండలున్న గిరి దుర్గంకాని కావాలి వీటిలో గిరి దుర్గం చాలా శ్రేష్ఠమైంది. ఈ దుర్గాలలో మరుదుర్గాన్ని మృగాలు, మహీ దుర్గాన్ని ఎలుకలు మొదలైనవి, జలదుర్గాన్ని కోతులు మొదలైనవి, మానవ దుర్గాన్ని మానవులు, గిరి దుర్గాన్ని దేవతలాశ్రయిస్తారు. ఈ మరు దుర్గాది దుర్గాల్లో ఉన్న మృగాలు మొదలైనవాటిని శత్రువులెట్లు హింసింపజాలరో అట్లే ఆ దుర్గాన్ని ఆశ్రయించుకొని ఉన్న రాజును కూడ శత్రువులు హింసింపజాలరు. దుర్గం యొక్క ప్రాకారం పైనున్న ధనుర్ధరుడొక్కడు వందమంది

శత్రువులతో తలపడుతాడు. అట్లే నూరుగురు ధనుర్ధరులు పదివేలమంది శత్రువులతో యుద్ధం చేయగలుగుతారు. కావున రాజుకు దుర్గం చాలా అవసరమైంది. అట్టి దుర్గంలో ఎల్లప్పుడు ఆయుధాలు ధనధాన్యాలు వాహనాలు ఆలోచన చెప్పు బ్రాహ్మణులు, శిల్పులు, యంత్రాలు, గడ్డి, నీరు వీటిలో సమృద్ధంగా ఉండాలి.

**రాజగృహం :-**

***తస్య మధ్యే సుపర్యాప్తం కారయేద్గృహ మాత్మనః,***
***గుప్తం సర్వర్తుకం శుభ్రం జలవృక్ష సమన్వితమ్ 76***

***తదధ్యాస్యోద్వహేద్భార్యాం సవర్ణాం లక్షణాన్వితామ్,***
***కులే మహతి సంభూతాం హృద్యాం రూపగుణాన్వితామ్ 77***

ఆ దుర్గం మధ్య భాగంలో సర్వసమృద్ధమైన రాజ గృహముండాలి. ఆ రాజ గృహం కూడ చుట్టు అగడ్త, కోటగోడలతో రక్షింపబడుతూ ఉండాలి. అట్లే ఆ రాజగృహం అన్ని ఋతువులలో పండు పండ్లు పుష్పాలు నడబావుల నీటి వసతికలదై శుభ్రంగా ఉండాలి. మహారాజు అటువంటి రాజగృహంలో ఉండి తనకులానికి చెందింది, చక్కని లక్షణాలు కలది, గొప్పకులంలో పుట్టింది, మంచి రూపం, గుణాలు కల కన్యను వివాహమాడాలి.

***పురోహితం చ కుర్వీత వృణుయాదేవ చర్త్విజః,***
***తేz స్య గృహ్యాణి కర్మాణి కుర్యుర్వైతానికాని చ 78***

***యజేత రాజా క్రతుభిర్వివిధైరాప్తదక్షిణైః***
***ధర్మార్థం చైవ విప్రేభ్యో దద్యాద్భోగాన్ ధనాని చ 79***

చక్కని పురోహితుణ్ణి నియమించుకొని ఋత్విక్కులను కూడ స్వీకరిస్తే వారంతా మహారాజుకు సంబంధించిన గృహ్య కర్మలను, యజ్ఞాలను నిర్వహిస్తూ ఉంటారు. రాజు యథేష్ట దక్షిణలిస్తూ అనేక యజ్ఞ యాగాలు నిర్వహిస్తూ ఉండాలి. ధర్మసిద్ధికై ఆ బ్రాహ్మణులకు విరివిగా ధనాన్ని, గృహాలు, భూమి ఆభరణాలు మొదలైన వాటిని దానం చేయాలి.

***సాంవత్సరికమాప్తైశ్చ రాష్ట్రా దాహర యేద్బలిమ్,***
***స్యాచ్చామ్నాయావరో లోకే వర్తేత పితృవన్నృషు, 80***

తనకు అత్యంతాప్తులైన మంత్రులు మొదలైన వారి ద్వారా ప్రతి సంవత్సరము తనకు రావలసిన పన్నును రాబట్టవలెను. రాజు తన ప్రజలనుండి పన్నులు తీసికొనుటలో శాస్త్రజ్ఞుడై, శాస్త్రమర్యాదననుసరించి పన్నులు తీసికొనుచు తన ప్రజలపై తండ్రివలె వాత్సల్యం కలిగి ఉండాలి.

***అధ్యక్షాన్ వివిధాన్ కుర్యాత్తత్ర తత్ర విపశ్చితః***
***తేz స్య సర్వాణ్యవేక్షేరన్నృణాం కార్యాణి కుర్వతామ్ 81***

ఏనుగులు, గుఱ్ఱాలు, రథాలు, కాల్బలం మొదలగు వాటిపై ఆయా విషయాలు చక్కగా తెలిసిన అధికారులను నియమించాలి. వారు ఆయాస్థలాల్లో పని చేస్తున్న జనుల కార్యకలాపాలను పర్యవేక్షిస్తూ ఉంటారు.

*ఆవృత్తానాం గురుకులాద్విప్రాణాం పూజకో భవేత్,*
*నృపాణామక్షయో హ్యేష నిధిర్బ్రాహ్మో ఒభిధీయతే 82*

గురుకులంలో చక్కగా విద్యాభ్యాసంచేసి తిరిగి వచ్చిన బ్రాహ్మణుని మహారాజు ఇంటపూజ చేయుటకై నియోగించాలి. ఈ పూజకుడు (పూజారి) రాజుకు తరగని నిధి అని అంటారు.

*న తం స్తేనా న చామిత్రా హరంతి న చ నశ్యతి,*
*తస్మాద్రాజ్ఞా నిధాతవ్యో బ్రాహ్మణేష్వక్షయో నిధిః 83*

సత్యసంధులు ధర్మ భీతికల బ్రాహ్మణుల దగ్గర రాజు తన ధన ధాన్య రూపమైననిధిని దాచిపెట్టాలి. బ్రాహ్మణుల దగ్గరనున్న నిధిని దొంగలెత్తుకొని పోరు. శత్రువులు అపహరింపరు. ఆ నిధి ఎప్పటికీ తరగదు.

*న స్కందతే న వ్యథతే న వినశ్యతి కర్హిచిత్,*
*వరిష్ఠమగ్నిహోత్రేభ్యో బ్రాహ్మణస్య ముఖే హుతమ్ 84*

*సమమబ్రాహ్మణే దానం ద్విగుణం బ్రాహ్మణ బ్రువే,*
*ప్రాధీతే శతసాహస్రమనంతం వేదపారగే. 85*
*పాత్రస్య హి విశేషేణ శ్రద్ధధానతయైవ చ,*
*అల్పం వా బహు వా ప్రేత్య దానస్యావాప్యతే ఫలమ్ 86*

*సమోత్తమాధమై రాజా త్వాహూతః పాలయన్ ప్రజాః,*
*న నివర్తేత సంగ్రామాత్ క్షాత్రధర్మమనుస్మరన్ 87*

*సంగ్రామేష్వనివర్తిత్వం ప్రజానాం చైవ పాలనమ్,*
*శుశ్రూషా బ్రాహ్మణానాం చ రాజ్ఞాం శ్రేయస్కరం పరమ్ 88*

అగ్నియందు వేల్చేహవిస్సు ఒకప్పుడు అగ్నియందు పడదు. జారిపోతుంది. నశించిపోతుంది కాని బ్రాహ్మణుని ముఖంలో వేల్చిన హవిస్సు (అతనికివ్వబడిన దానం) ఎన్నటికీ చెడిపోదు. బ్రహ్మణేతరునికీయబడ్డదానం సమానమైన ఫలితాన్నిస్తే ఆచార శూన్యుడైన బ్రాహ్మణునికిచ్చినదానం రెండు రెట్లు ఎక్కువ ఫలితాన్నిస్తుంది. అదే దానాన్ని వేదాధ్యయన సంపన్నునికిస్తే లక్షరెట్లు ఎక్కువ ఫలితాన్నిస్తుంది. వేదతత్వార్థ పరాయణునకిచ్చిన దానం అనంతమైన ఫలితాన్నిస్తుంది. దానం తీసికొనే బ్రాహ్మణుని యోగ్యత, దాతకు గల శ్రద్ధననుసరించి దానం యొక్క ఫలితం కలుతుంది. ప్రజాపాలకుడైన రాజు తనకంటె ఉత్తమడు, అధముడు, తనతో సమానుడైన రాజు యుద్ధానికి రమ్మని పిలిస్తే క్షత్రియ ధర్మాన్ననుసరించి యుద్ధరంగానికి వెళ్ళి వెనకకు తగ్గక యుద్ధాన్ని చేయాలి. వెనుదిరుగక యుద్ధం చేయడం, ప్రజా పరిపాలన, బ్రాహ్మణుల సేవించుట, అనేవి రాజుకు శ్రేయస్సును కలిగిస్తాయి.

*ఆహవేషు మిథోఽన్యోన్యం జిఘాంసంతో మహీక్షితః,*
*యుధ్యమానాః పరం శక్త్యా స్వర్గం యాంత్యపరాఙ్ముఖాః 89*

*న కూటైరాయుధైర్హన్యాద్యుధ్యమానో రణే రిపూన్,*
*న కర్ణిభి ర్నాపి దిగ్ధై ర్నాగ్నిజ్వలిత తేజసైః 90*

*న చ హన్యాత్ స్థలారూఢాన్ న క్లీబం న కృతాంజలిమ్,*
*నాముక్తకేశం నాసీనం న తవాస్మీతి వాదినమ్ 91*

*న సుప్తం న విసన్నాహం న నగ్నం న నిరాయుధమ్,*
*నాయుధ్యమానం పశ్యంతం నపరేణ సమాగతమ్ 92*

*నాయుధవ్యసనప్రాప్తం నార్తం నాతిపరిక్షతమ్,*
*న భీతం న పరావృత్తం సతాం ధర్మమనుస్మరన్ 93*

*యస్తు భీతః పరావృత్తః సంగ్రామే హన్యతే పరైః*
*భర్తుర్యద్దుష్కృతం కించిత్తత్సర్వం ప్రతిపద్యతే 94*

*యచ్చాస్య సుకృతం కించిదముత్రార్థముపార్జితమ్*
*భర్తా తత్సర్వమాదత్తే పరావృత్తహతస్య తు 95*

యుద్ధం చేస్తూ రణరంగంలో ఒకరినొకరు చంప జూచే రాజులు వెనుతిరుగక యుద్ధం చేస్తూ చనిపోతే స్వర్గాన్ని పొందుతారు. మోసపూరితంగా పైకి ఒక విధంగా లోపల ఒక విధంగా ఉండే ఆయుధాలతో, కర్ణమున్న ఆయుధాలతో, విషం పూసిన బాణాలతో, నిప్పుతో గాచిన బాణాలతో యుద్ధం చేస్తూ శత్రువులను చంపకూడదు. తాను రథం పై ఉన్నప్పుడు భూమి పై నున్న శత్రువును చంపవద్దు. నపుంసకుని చంపవద్దు. భయంతో శరణుజొచ్చిన వానినిచంపకూడదు. తలవిరియబోసికొన్నవానిని, కూర్చున్న వానిని, శరణన్న వానిని చంపకూడదు. అట్లే నిద్రిస్తున్న వానిని, యుద్ధప్రయత్నాలేవి చేయకుండ ఉన్నవానిని, నగ్నంగా ఉన్నవానిని, ఆయుధాలు లేని వానిని, యుద్ధం చేయనివానిని, యుద్ధం చూస్తున్నవానిని, ఇంకను ఇంకొకనితో యుద్ధం చేస్తున్న వానిని చంపకూడదు. ఆయుధాలు విరిగిపోయిన వానిని, ఆర్తి చెందిన వానిని మిక్కిలి దెబ్బలు తిన్నవానిని, భయపడ్డవానిని, భయంతో వెనకకు తిరిగిన వానిని సత్ క్షత్రియుల ధర్మాన్ని స్మరిస్తూ చంపకూడదు. యుద్ధంలో శత్రువులకు భయపడి పరుగెత్తు వానిని చంపిన వాడు తానుచేసిన పుణ్యాన్నంతా పోగొట్టుకొంటాడు.

*రథాశ్వం హస్తినం ఛత్రం ధనం ధాన్యం పశూన్ స్త్రియః*
*సర్వద్రవ్యాణి కుప్యం చ యో యజ్జయతి తస్య తత్ 96*

*రాజ్ఞశ్చ దద్యురుద్ధారమిత్యేషా వైదికీ శ్రుతిః,*
*రాజ్ఞా చ సర్వయోధేభ్యో దాతవ్యమపృథగ్జితమ్ 97*

రణ రంగంలో జయించినవాడు ఓడిపోయినవాని రథాలను, గుఱ్ఱాలను, ఏనుగులను ఛత్రాలను (అధికారాన్ని సూచించేవి) ధన ధాన్యాలను, పశువులను పరిచారికాస్త్రీలను ఇంకా ఇతర ద్రవ్యాలనన్నిటినీ పొందుతాడు. రాజు తన శత్రురాజులను జయించి సంపాదించిన దనధాన్యాదులనుండి ఉద్ధారాన్ని (విశిష్ట వస్తువులను) స్వీకరిస్తాడు.

రాజుకూడతాను జయించిన వస్తువులనుండి యుద్ధ వీరుల బల శక్తులకు తగ్గట్లు బహుమతులను పంచి పెట్టవలెను.

*ఏషోऽనుపస్కృతః ప్రోక్తో యోధధర్మస్సనాతనః,*
*అస్మాద్ధర్మాన్న చ్యవేత క్షత్రియో ఘ్నన్ రణే రిపూన్ 98*

*అలబ్ధం చైవ లిప్సేత లబ్ధం రక్షేత్ ప్రయత్నతః,*
*రక్షితం వర్ధయేచ్చైవ వృద్ధం పాత్రేషు నిక్షిపేత్ 99*

*ఏత చ్చతుర్విధం విద్యాత్పురుషార్థ ప్రయోజనం,*
*అస్య నిత్యమనుష్ఠానం సమ్యక్కుర్యాదతంద్రితః 100*

సనాతనమైన ఈ ధర్మం యుద్ధ వీరులకు సంబంధించింది. క్షత్రియుడు రణ రంగంలో శత్రువులను చంపుతున్నా యుద్ధ ధర్మాన్ని మాత్రం వదలకూడదు. రాజు తన దగ్గర లేని దానిని ఇతరుల దగ్గరినుండి కష్టపడి సంపాదించుకోవాలి. ఆ విధంగా సంపాదించుకొన్న ధనాన్ని కష్టపడి రక్షించుకోవాలి. కష్టపడి రక్షించుకొన్న ధనాన్ని అభివృద్ధి చేసికోవాలి. అభివృద్ధి యైన ధనాన్ని యోగ్యులైన వారి దగ్గర దాచిపెట్టిలి. ఈ నాలుగు విధాలు పురుషార్థానికి ప్రయోజనమని గుర్తించి దీని జాగ్రత్తగా ప్రతి దినం చేయాలి.

*అలబ్ధమిచ్ఛేద్దండేన లబ్ధం రక్షేదవేక్షయా,*
*రక్షితం వర్ధయే ద్వృద్ధ్యా వృద్ధం దానేన నిక్షిపేత్ 101*

తనకు లభించని దాన్ని యుద్ధం చేసియైనా సంపాదించుకోవాలి ఆ విధంగా సంపాదించుకొన్న దాన్ని జాగ్రత్తగా కాపాడుకోవాలి. జాగ్రత్తగా కాపాడిన ధనాన్ని వ్యాపారాదులచే పెంపొందింపజేయాలి. అభివృద్ధి చెందిన ధనాన్ని యోగ్యులకు దానం చేయాలి.

*నిత్యముద్యతదండః స్యాన్నిత్యం వివృతపౌరుషః,*
*నిత్యం సంవృతసంవార్యో నిత్యం ఛిద్రానుసార్యరేః 102*

*నిత్యముద్యతదండస్య కృత్స్నముద్విజతే జగత్,*
*తస్మాత్సర్వాణి భూతాని దండేనైవ ప్రసాధయేత్ 103*

రాజు ఎల్లప్పుడు దండధారియై తనసైన్యాలను అప్రమత్తంగా ఉంచి తన పరాక్రమం శత్రువులకు తెలియజేయాలి. తనలో ఉండు లోపాలనన్నిటిని కప్పిపుచ్చుకొని శత్రువుల యొక్క తప్పులనన్నిటిని తెలిసికోవాలి. ఎల్లప్పుడు జాగరూకుడై దండ ధారియై ఉన్నవానికి లోకమంతా భయపడ్తుంది. కావున సమస్త భూతాలను దండం చేతనే లొంగ దీసికోవాలి.

*అమాయయైవ వర్తేత న కథంచన మాయయా,*
*బుధ్యేతారిప్రయుక్తాం చ మాయాం నిత్యం స్వసంవృతః 104*

*నాస్య ఛిద్రం పరో విద్యాద్విద్యాచ్ఛిద్రం పరస్య తు,*
*గూహేత్కూర్మ ఇవాంగాని రక్షేద్వివరమాత్మనః, 105*

*బకవచ్చింతయే దర్థాన్ సింహవచ్చ పరాక్రమేత్,*
*వృకవ చ్చావలుంపేత శశవచ్చ వినిష్పతేత్ 106*

ఇతరులనెవ్వరిని మోసగించక ఋజుస్వభావంతో ఉండి తన లోపాలను కప్పి పుచ్చుకొని శత్రువులు తన లోపాలనన్నిటిని తెలుసుకోకుండ ప్రవర్తించాలి. అట్లే శత్రు రాజుల లోపాలను తెలిసికోవాలి. తాబేలు తన అవయవాలను దాచుకొన్నట్లు రాజుకూడ తన రాజ్య రహస్యాలను గోప్యంగా ఉంచుకొని ఇతరులకు తెలుపకుండా ప్రవర్తించాలి. కొంగ ఏవిధంగా చేపలను పట్టు కుంటుందో అట్లే శత్రు రాజుల ధన సంపదను వశం చేసుకోవాలి. యుద్ధంలో సింహంవలె పరాక్రమం చూపాలి. పశువుల కాపరి జాగ్రత్తగా పశువుల కాస్తున్నప్పటికీ తోడేలు ఆ పశువుల కాపరి ఏమరుపాటున ఉన్నప్పుడు ఎట్లు పశువును ఎత్తుకొని పోతుందో అట్లే శత్రువులు ఏమరుపాటున ఉన్నప్పుడు వారి దుర్గాలను స్వాధీనం చేసుకోవాలి. ఇంకా కుందేలును బలవంతులైన బోయలు పట్టుకొన్నా ఉపాయంతో ఎట్లు తప్పించుకుంటుందో అదేవిధంగా శత్రువులు తనను అపహరిస్తే తప్పుకొని పారిపోవాలి.

*ఏవం విజయమానస్య యేzస్య స్యుః పరిపంథినః,*
*తానానయేద్వశం సర్వాన్సామాదిభిరుపక్రమైః 107*

*యది తే తు న తిష్ఠేయురుపాయైః ప్రథమైస్త్రిభిః*
*దండేనైవ ప్రసహ్యైతాన్ శనకైర్వశమానయేత్ 108*

*సామాదీనాముపాయానాం చతుర్ణామపి పండితాః,*
*సామదండౌ ప్రశంసంతి నిత్యం రాష్ట్రాభివృద్ధయే 109*

ఈ విధంగా ప్రవర్తించే రాజు తన శత్రు రాజులను కూడ సామ దానాది చతుర్విధో పాయాలతో తనకు స్వాధీనం చేసికోవాలి. తన శత్రురాజులు సామ దాన, భేదాలనే మూడు పాయాలతో స్వాధీనం కాకపోతే దండోపాయాన్ని ప్రయోగించి బలాత్కారంగా వారిని తన వశం చేసి కోవాలి. సామ, దాన, భేద, దండోపాయాలనే నాలుగు ఉపాయాలలో రాజ్యాన్ని అభివృద్ధి చేయుటకు సామోపాయం, దండోపాయం ఎక్కువగా ఉపయోగిస్తాయని విద్వాంసులంటారు.

*యథోద్ధరతి నిర్దాతా కక్షం ధాన్యం చ రక్షతి,*
*తథా రక్షేన్నృపో రాష్ట్రం హన్యాచ్చ పరిపంథినః, 110*

*మోహాద్రాజా స్వరాష్ట్రం యః కర్శయత్యన వేక్షయా,*
*సోz చిరాద్భ్రశ్యతే రాజ్యాజ్జీవితాచ్చ సబాంధవః 111*

*శరీరకర్శనాత్ ప్రాణాః క్షీయంతే ప్రాణినాం యథా,*
*తథా రాజ్ఞామపి ప్రాణాః క్షీయంతే రాష్ట్రకర్శనాత్ 112*

రైతు తన పొలంలో మొలిచిన కలుపును పీకి వేసి ధాన్యాన్ని కాపాడుకున్నట్లు రాజు శత్రువులను చంపి తన రాజ్యాన్ని కాపాడు కోవాలి. అజ్ఞానంచే దుష్టులెవ్వరో శిష్టులెవ్వరో తెలియక తన రాజ్యంలో ఉన్నవారినందరిని బాధపెట్టితే ఆ రాజు త్వరలోనే తన బంధువులతో

సహా రాజ్య భ్రష్టుడై చనిపోతాడు. ప్రాణులు ఆహారం తీసికొక పోయినందువల్ల కృశించిపోయినట్లే తన రాజ్యంలో ఉన్నవారిని బాధపెట్టి నందువల్ల వారి కోపతాపాదులచే రాజు ప్రాణాలు కూడ పోతాయి. కావున రాజు ప్రజలను బాధపెట్టకూడదు.

*రాష్ట్రస్య సంగ్రహే నిత్యం విధానమిద మాచరేత్,*
*సుసంగృహీతరాష్ట్రో హి పార్థివస్సుఖమేధతే, 113*

రాజు రాజ్యాన్ని సంరక్షించుటకు ఈ క్రింది పద్ధతులనాచరించాలి. ఈ విధంగా రాజ్యాన్ని రక్షిస్తే రాజుసుఖంగా ఉంటాడు.

*ద్వయోస్త్రయాణాం పంచానాం మధ్యే గుల్మమధిష్ఠితమ్*
*తథా గ్రామశతానాం చ కుర్యాద్రాష్ట్రస్య సంగ్రహమ్ 114*

*గ్రామస్యాధిపతిం కుర్యాద్దశ గ్రామపతిం తథా,*
*వింశతీశం శతేశం చ సహస్ర పతి మేవ చ 115*

రెండు, మూడు లేక ఐదూళ్ళ మధ్య కావలివారి గుంపు నేర్పరచాలి. అట్లే ప్రతి గ్రామమునకు గ్రామపతిని పదిగ్రామాలకు దశగ్రామ పతిని ఇరువై గ్రామాలకు వింశతీశుని నూరు గ్రామాలకు ఒక పర్యవేక్షణాధికారి చొప్పున ఏర్పరచి రాజ్యాన్ని వృద్ధి చేయాలి.

*గ్రామే దోషాన్ సముత్పన్నాన్ గ్రామికశ్శనకైః స్వయమ్,*
*శంసేద్గ్రామదశేశాయ దశేశో వింశతీశినే 116*

*వింశతీశస్తు తత్సర్వం శతేశాయ నివేదయేత్,*
*శంసేద్గ్రామశతేశస్తు సహస్రపతయే స్వయమ్ 117*

తాను తీర్చలేని గ్రామంలోని వివాదాలను గ్రామికుడు దశగ్రామేశునకు నివేదించాలి. దశగ్రామాధికారి తీర్చలేని గ్రామా వివాదాలను పింశతిగ్రామాధికారికి నివేదించాలి. వింశతిగ్రామాధాకారి పరిష్కరించలేని వివాదాలను శత గ్రామేశునకు నివేదించాలి. శతగ్రామ పతి సహస్ర గ్రామపతికి తానే నివేదించాలి.

*యాని రాజప్రదేయాని ప్రత్యహం గ్రామవాసిభిః,*
*అన్న పానేంధనాదీని గ్రామిక స్తాన్యవాప్నుయాత్ 118*

*దశీ కులం తు భుంజీత వింశీ పంచ కులాని చ,*
*గ్రామం గ్రామశతాధ్యక్షః సాహస్రాధిపతిః పురమ్ 119*

గ్రామాధికారి గ్రామంలో ప్రతి దినం రాజుకివ్వలసిన అన్నం, నీరు, వంట చెరకు మొదలైన వాటిని తన జీవికకై తానుంచుకోవచ్చు. దశగ్రామధిపతి కులాన్ని, (పన్నెండు నాగళ్ళు ఒక దినంతో దున్నే భూమి) వింశ గ్రామాధిపతి ఐదుకులాలను, శత గ్రామాధిపతి ఒక గ్రామాన్ని, సహస్రగ్రామాధిపతి ఒకపట్టణాన్ని తన జీవికకై స్వీకరింపవచ్చును.

*తేషాం గ్రామ్యాణి కార్యాణి పృథక్కార్యాణి చైవ హి,*
*రాజ్ఞోz న్యస్సచివ స్స్నిగ్ధస్తాని పశ్యే దతంద్రితః 120*

సప్తమాధ్యాయం

గ్రామాధిపతి చేసిన తీర్పులు తక్కిన తీర్పులు రాజుకు నివేదించనపుడు వాటిని రాజు నియోగించిన మంత్రి జాగ్రత్తగా ఆ వ్యవహారాలను, తక్కిన వ్యవహారాలను విచారించాలి.

*నగరే నగరే చైకం కుర్యాత్సర్వార్థచింతకమ్,*
*ఉచ్చైఃస్థానం ఘోరరూపం నక్షత్రాణామివ గ్రహమ్ 121*

ప్రతి నగరంలో ప్రజల యొక్క సమస్త కార్యాలను విచారించే నగరాధిపతిని నియమించాలి. ఆ నగరాధిపతి నక్షత్రాలనడుమ శుక్రగ్రహం వలె అన్నింటిలో శ్రేష్ఠుడు కావలెను.

*స తాననుపరిక్రామేత్సర్వానేవ సదా స్వయమ్,*
*తేషాం వృత్తం పరిణయేత్సమ్యగ్రాష్ట్రేషు తచ్చరైః 122*

ఆ నగరాధిపతి తనకు లోబడియున్న గ్రామాలకు స్వయంగా వెళ్ళి ఆ యాగ్రామాధిపతులు చేస్తున్న పనులేవో చారుల ద్వారా తెలిసికోవాలి.

*రాజ్ఞో హి రక్షాధికృతాః పరస్వాదాయినశ్శఠాః*
*భృత్యా భవంతి ప్రాయేణ తేభ్యో రక్షేదిమాః ప్రజాః 123*

*యే కార్యికేభ్యోఽర్థమేవ గృహ్ణీయుః పాపచేతసః,*
*తేషాం సర్వస్వమాదాయ రాజా కుర్యాత్ప్రవాసనమ్ 124*

రాజు నియమించిన రక్షక భటులు సాధారణంగా పరుల ధనాన్ని కొల్లగొడతారు. దుర్మార్గులు కూడ. అటువంటి వారి బారినుండి నగరాధిపతి ప్రజలను రక్షించాలి. తన దగ్గరకు పని పెట్టుకొని వచ్చిన వారి దగ్గరినుండి పాపబుద్ధిగల వారు లంచాలు కూడ తీసుకొంటారుకావున రాజు వారిని కనిపెట్టి వారి సర్వస్వాన్ని తీసికొని వారిని రాజ్య భ్రష్టులను చేయాలి.

*రాజా కర్మసు యుక్తానాం స్త్రీణాం ప్రేష్యజనస్య చ,*
*ప్రత్యహం కల్పయేద్వృత్తిం స్థానకర్మానురూపతః 125*

*పణో దేయోఽవకృష్టస్య షడుత్కృష్టస్య వేతనమ్,*
*షాణ్మాసిక స్తథాచ్ఛాదో ధాన్యద్రోణస్తు మాసికః 126*

రాజుకు సంబంధించిన పనులు చేసే స్త్రీలు, భృత్యులు మొదలగు వారికి వారి వారి పనికి తగ్గట్టుగా దినసరి వేతనమివ్వాలి. చాలా తక్కువ పనులు చేసే ఉద్యోగికి దినానికొక పణమివ్వాలి. అంతకంటె పెద్ద ఉద్యోగికి ప్రతి దినం ఆరుపణాలివ్వాలి అట్లే తక్కువ పనులు చేసే ఉద్యోగికి ఆరునెలల కొకసారి బట్టలు పెట్టాలి. నెలకు ఉండె ఉద్యోగికి ఆరునెలలకొకసారి బట్టలు పెట్టాలి. నెలకు కుండెడు ధ్యాన్యమివ్వాలి. అదే విధంగా పై తరగతి ఉద్యోగికి ఆరు నెలలకారు జతల బట్టలు, ఆరుకుండల ధాన్యమివ్వాలి.

*క్రయవిక్రయమధ్వానం భక్తం చ సపరివ్యయమ్,*
*యోగ క్షేమం చ సంప్రేక్ష్య వణిజో దాపయేత్కరాన్ 127*

*యథా ఫలేన యుజ్యేత రాజా కర్తా చ కర్మణామ్,*
*తథావేక్ష్య నృపో రాష్ట్రే కల్పయేత్సతతం కరాన్. 128*

*యథాల్పాల్పమదంత్యాదం వార్యోకో్య వత్సషట్పదాః,*
*తథాల్పాల్పో గృహీతవ్యో రాష్ట్రాద్రాజ్ఞాబ్దికః కరః. 129*

వస్తువును వర్తకుడు కొన్నవెల, అమ్మువెల అతడు దానినే ప్రాంతంలో కొన్నాడు, అతనికి ఆహార వ్యయమెంతైనది, ఇతరవ్యయాలేమున్నాయి అతని కనీసావసారాలు మొదలగునవన్నీ దృష్టిలో ఉంచుకొని రాజు వర్తకులపై పన్ను వేయాలి. ప్రజలు తాను చేసిన క్రయవిక్రయాదులపై పొందు లాభాన్ని, తన రాజ్యావసరాల్ని దృష్టిలో పెట్టకొని రాజు పన్ను విధించాలి. జలగలు, దూడలు, తేనెటీగలు ఏవిధంగా కొద్ది కొద్దిగా తీసికొంటాయో రాజు కూడ ప్రజలను ఇక్కట్ల పాలుచేయక కొద్దికొద్దిగ పన్ను తీసికోవాలి.

*పంచాశద్భాగ అదేయో రాజ్ఞా పశుహిరణ్యయో ః,*
*ధాన్యానామష్టమో భాగః షష్ఠో ద్వాదశ ఏవ వా 130*

*ఆదదీతాథ షడ్భాగం ద్రుమాంసమధుసర్పిషామ్,*
*గంధౌషధిరసానాం చపుష్పమూలఫలస్య చ 131*
*పత్రశాకతృణానాం చ చర్మణాం వైదళస్య చ,*
*మృణ్మయానాం చ భాండానాం సర్వస్యాశ్మమయస్య చ 132*

పశువులు, బంగారం వంటి క్రయవిక్రయాల్లోని లాభాల్లో రాజు నూటికి యాభై వంతు పన్నుగా తీసికోవచ్చు. ధాన్యాల క్రయవిక్రయాల్లోని లాభాల్లో ఆరవ భాగం, ఎనమిదో భాగం, పన్నెండో భాగం పన్ను తీసికోవాలి. చెట్లు, మాంసం, తేనె, నేయి, గంధం, ఓషధులు, రసం, పువ్వులు గడ్డలు, పండ్లు, ఆకులు, కూరగాయలు, చర్మపు వస్తువులు, వెదురు మట్టి కుండలు రాతి వస్తువులు వీటి లాభంలో రాజు ఆరవ వంతుపన్ను తీసికోవాలి.

*మ్రియమాణోఽప్యాదదీత న రాజా శ్రోత్రియాత్కరం,*
*న చ క్షుధాస్య సంసీదేచ్ఛ్రోత్రియో విషయే వసన్ 133*

ఎట్టి పరిస్థితిలోను శ్రోత్రియుని దగ్గర పన్ను తీసికోరాదు. ఆశ్రోత్రియుడు ఆకలితో నకనకలాడకుండునట్లు రాజు చూచుకోవాలి.

*యస్య రాజ్ఞస్తు విషయే శ్రోత్రియస్సీదతి క్షుధా,*
*తస్యాపి తత్క్షుధా రాష్ట్రమచిరేణైవ సీదతి. 134*

*శ్రుతవృత్తే విదిత్వాస్య వృత్తిం ధర్మ్యాం ప్రకల్పయేత్,*
*సంరక్షేత్సర్వతశ్చైనం పితా పుత్ర మివౌరసమ్ 135*

*సంరక్ష్యమాణో రాజ్ఞాయం కురుతే ధర్మ మన్వహమ్,*
*తేనాయుర్వర్ధతే రాజ్ఞో ద్రవిణం రాష్ట్రమేవ చ 136*

ఏ రాజ్యంలో శ్రోత్రియుడు ఆకలికి మాడి చస్తాడో ఆ రాజ్యంలోని ప్రజలు కూడా ఆకలితో బాధపడి మరణిస్తారు. అందువల్ల రాజు శ్రోత్రియునివేద పరిజ్ఞానాన్ని, అతని

నడవడిని, తెలిసికొని దాని కనుగుణంగా అతనికి న్యాయమైన వృత్తిని కల్పించాలి. రాజైనవాడు శ్రోత్రియుని తండ్రి కుమారుని రక్షించినట్లు రక్షించాలి. ఈ విధంగా రాజు కాపాడగా శ్రోత్రియుడు తన ధర్మాన్ని నిర్వహించుకొంటాడు. దాని వల్ల రాజుకు ఆయుస్సు, ధనం చివరకు రాజ్యం కూడ అభివృద్ధి చెందుతుంది.

*యత్కించిదపి వర్షస్య దాపయేత్కరసంజ్ఞితమ్,*
*వ్యవహారేణ జీవంతం రాజా రాష్ట్రే పృథగ్జనమ్ 137*

*కారుకాన్ శిల్పినశ్చైవ శూద్రాంశ్చాత్మోపజీవినః,*
*ఏకైకం కారయేత్కర్మ మాసిమాసి మహీపతిః 138*

*నోచ్ఛింద్యాదాత్మనో మూలం పరేషాం చాతితత్కృష్ణయా,*
*ఉచ్ఛిందన్ హ్యాత్మనో మూలమాత్మానం తాంశ్చ పీడయేత్ 139*

తన రాజ్యమందే కూరగాయలు మొదలైన చిన్న చిన్న వస్తువులమ్మి బ్రతికేవారి దగ్గర రాజు సంవత్సరానికొకసారి తక్కువ పన్నును తీసికొనవలెను. శిల్పకారులకంటె కొంత ఉన్నతులైన వంటలు చేయువారు, లోహకారులు మొదలగు శిల్పులు దేహపరిశ్రమచే జీవించువారి దగ్గర నెలనెలకొక దినం పని చేయించుకోవలెను. ప్రజలపై గల అత్యనురాగం చే పన్నులు వేయక తనమూలాన్ని చెడగొట్టుకోవద్దు. అట్లే అత్యాశకుపోయి వర్తకులు మొదలగువారి మూలాన్ని చెడగొట్టవద్దు. ఈ విధంగా పన్ను తీసికొననిచో ధనాగారంలో ధనం లేక తాను బాధకు గురియౌతాడు.

*తీక్ష్ణశ్చైవ మృదుశ్చ స్యాత్కార్యం వీక్ష్య మహీపతిః,*
*తీక్ష్ణశ్చైవ మృదుశ్చైవ రాజా భవతి సమ్మతః 140*

అవసరాన్ననుసరించి రాజు కఠినుడు కావలెను మెత్తని వాడూ కావలెను. అట్లున్నచో అతడు సర్వ జన సమ్మతుడౌతాడు.

*అమాత్యముఖ్యం ధర్మజ్ఞం ప్రాజ్ఞం దాంతం కులోద్గతమ్*
*స్థాపయేదాసనే తస్మిన్ ఖిన్నః కార్యేక్షణేనృణాం 141*
*ఏవం సర్వం విధాయేదమితికర్తవ్యమాత్మనః,*
*యుక్తశ్చైవాప్రమత్తశ్చ పరిరక్షేదిమాః ప్రజాః 142*

*విక్రోశంత్యో యస్య రాష్ట్రాద్ధ్రియంతే దస్యుభిః ప్రజాః,*
*సంపశ్యత స్సభృత్యస్య మృతస్స న తు జీవతి 143*

తాను స్వయంగా ప్రజాకార్యం చూడలేని సమయంలో ధర్మ మర్మాలు తెలిసినవాడు, జితేంద్రియుడు, ఉత్తమకులంలో పుట్టిన వాడు, అగు వానిని ముఖ్యమంత్రి పదవియందు నియమించి ప్రజా పరిపాలన చేయాలి. ఇట్లు రాజు చేయాల్సిన పనులనన్ని నిశ్చయించుకొని, పట్టుదల గలిగి ఏమరుపాటు లేక తన ప్రజలనందరిని రక్షించాలి. రాజు అతని భృత్యులు చూస్తుండగానే దుర్మార్గులు ప్రజలను బాధలుపెట్టినచో ఆ రోజు, అతని భృత్యులు చచ్చినవారితోనే సమానులు.

*క్షత్రియస్య పరో ధర్మః ప్రజానామేవ పాలనమ్,*
*నిర్దిష్టఫలభోక్తా హి రాజా ధర్మేణ యుజ్యతే 144*

ప్రజాపరిపాలనమే రాజు యొక్క ధర్మం. ధర్మ శాస్త్రాలలో చెప్పబడిన కార్య ఫలాలననుభవిస్తూ అతడు ధర్మవంతుడే ఔతాడు.

*ఉత్థాయ పశ్చిమే యామే కృతశౌచస్సమాహితః,*
*హుతాగ్నిర్బ్రాహ్మణాంశ్చార్చ్య ప్రవిశేత్స శుభాం సభామ్ 145*

*తత్ర స్థితః ప్రజా స్సర్వాః ప్రతినంద్య విసర్జయేత్,*
*విసృజ్య చ ప్రజాస్సర్వా మంత్రయేత్సహ మంత్రిభిః 146*

*గిరిపృష్ఠం సమారుహ్య ప్రాసాదం వా రహో గతః,*
*అరణ్యే నిశ్శలాకే వా మంత్రయేదవిభావితః 147*

*యస్య మంత్రం న జానంతి సమాగమ్య పృథగ్జనాః,*
*స కృత్స్నాం పృథివీం భుఙ్క్తే కోశహీనోఽ పి పార్థివః, 148*

*జడమూకాంధబధిరాం తైర్యగ్యోనాన్ వయోధికాన్,*
*స్త్రీమ్లేచ్ఛవ్యాధితవ్యంగాన్మంత్రకాలేఽ పసారయేత్ 149*

*భిందంత్యవమతా మంత్రం తైర్యగ్యోనా స్తథైవ చ,*
*స్త్రియ శ్చైవ విశేషేణ తస్మాత్తత్రాదృతో భవేత్ 150*

రాజు ఉదయాననే లేచి స్నానాదికాలు పూర్తి చేసికొని శుచియై, జాగరూకతతో నిత్యహోమాలు పూర్తిచేసి బ్రాహ్మణులను గౌరవించి సభకు వెళ్ళవలెను. ఆ సభకు తన దర్శనార్థం వచ్చిన ప్రజలందరిని సత్కరించి వారిని పంపి తన మంత్రులతో చేయదగిన కార్యాలగురించి చింతించవలెను సర్వత శిఖరాల్నెక్కి కాని, మేడ పైనుండి కాని, రహస్య స్థలంలోనే ఉండికాని, అరణ్యమున ఉండికాని, రహస్య భేదనంచేసే వారి కంట బడక పనులు చేయు ఉపాయం, ద్రవ్య సంపాదన, దేశకాలములననుసరించి చేయాల్సిన పనులు, తన కష్టాలను తొలగించుకొనే పద్ధతి కార్యనుకూలత అను వాటిని గూర్చి మంత్రులతో ఆలోచన చేయాలి. ఏ రాజు చేయు మంతనాలను ఇతరులెవ్వరెరుగరో ఆరాజు దగ్గర ధన సంపదలేకున్నా భూమండలమునంతా అతడు ఏలుతాడు. జడులు, మూగవారు, గుడ్డివారు, చెవిటివారు, పశుపక్ష్యాది జంతువులు, వయస్సులో మరీ పెద్దవారు, స్త్రీలు, మ్లేచ్ఛులు, రోగులు, అంగహీనులు వీరెవ్వరు లేని సమయంలో మంత్రాలోచన చేయాలి. చిలుకలు మొదలగు పక్షులు, అవమానింపబడ్డ స్త్రీలు ప్రధానంగా రహస్యాన్ని బయట పెడ్తారు కాబట్టి వీరి దగ్గర చాలా జాగ్రత్తగా ఉండాలి.

*మధ్యందినేఽ ర్ధరాత్రే వా విశ్రాంతో విగతక్లమః,*
*చింతయేద్ధర్మకామార్థాన్ సార్ధం తైరేక ఏవ వా 151*

*పరస్పర విరుద్ధానాం తేషాం చ సముపార్జనమ్,*
*కన్యానాం సంప్రదానం చ కుమారాణాం చ రక్షణమ్ 152*

*దూతసంప్రేషణం చైవ కార్య శేషం తదైవ చ,*
*అంతఃపుర ప్రచారం చ ప్రణిధీనాం చ చేష్టితమ్ 153*

*కృత్స్నం చాష్టవిధం కర్మ పంచవర్గం చ తత్వతః,*
*అనురాగాపరాగౌ చ ప్రచారం మండలస్య చ 154*

*మధ్యమస్య ప్రచారం చ విజగీషోశ్చ చేష్టితమ్,*
*ఉదాసీన ప్రచారం చ శత్రోశ్చైవ ప్రయత్నతః 155*

మధ్యాహ్నంలో లేక మధ్య రాత్రిపూట విశ్రాంతి తీసికొని అలసట తీర్చుకొని మంత్రులతో కలసి,లేక ఒంటరిగా ధర్మార్థకామాల గురించి రాజు ఆలోచించుకోవాలి. పరస్పర విరుద్ధమైన దర్మార్థకామాలను సంపాదించుకొను పద్ధతి, స్వకార్యసిద్ధికై తనకుమార్తెల నితరుల కిచ్చుట, రాజకుమారులకు విద్యలు నేర్పి రక్షించుట, దూతనుపంపించుట, సగం చేసిన పనిని పూర్తి చేయుట, అంతః పురస్త్రీల చేష్టలను గుర్తించుట, తన రాజ్యంలో శత్రు గూఢాచారులున్న సంగతి, శత్రు రాజ్యంలో తన గూఢాచారులు చేయు పని, కప్పములు తీసికొనుట, భృత్యులకు జీతాలిచ్చుట, మంత్రులు మొదలగు వారికి ఉత్తరువులిచ్చుట, జనుల ఋణాదులకు సంబంధించిన దండుగ తీసికొనుట, వివాదాల విచారించుట, ఓడినవారి దగ్గరినుండి అపరాధం తీసికొనుట, పాపపు పనుల ప్రాయశ్చిత్తమనే అష్టవిధకర్మలను, ఆచరించాలి. అట్లే మారు వేషంలో తిరిగే వాండ్లు, ఉదాసీనులు, గృహపతులు, వైదికులు, తాపసులు వీరి వీషాలతో తిరుగు ఐదు విధములుగా నున్న గూఢచారులను విచారించాలి. తనవారు మంత్రులయనురాగాన్ని, విరక్తిని గుర్తించి మీద చెప్పబోవు రాజమండల ప్రచారాన్ని విచారించాలి. తన పక్షంలో శత్రుపక్షంలో చేరక మధ్యనున్న వారి చర్యను, జయశీలియగువాని చర్య, ఉదాసీనుని ప్రవర్తన, శత్రువుయొక్క ప్రయాత్నాలు జాగ్రత్తగా గమనించాలి.

*ఏతాః ప్రకృతయో మూలం మండలస్య సమాసతః,*
*అష్టౌ చాన్యాఃసమాఖ్యాతా ద్వాదశైవ తు తాః స్మృతాః 156*

*అమాత్యరాష్ట్ర దుర్గార్థదండాఖ్యాః పంచ చాపరాః,*
*ప్రత్యేకం కథితా హ్యేతాస్సంక్షేపేణ ద్విసప్తతిః 157*

*అనంతరమరిం విద్యాదరి సేవినమేవ చ,*
*అరేరనంతరం మిత్రముదాసీనం తయోః పరమ్ 158*

మధ్యమ, విజిగీషు, ఉదాసీన, శత్రువులనే నలుగురు ప్రకృతులు, రాజ్యానికి కారణభూతులు ఇంకా మిత్రుడు, అరిమిత్రుడు, మిత్ర మిత్రుడు, అరిమిత్రమిత్రుడు అనే నలుగురు ప్రకృతులు పార్ష్ణిగ్రాహుడు, ఆక్రందుడు పార్ష్ణిగ్రహసారుడు, ఆక్రందాసారుడు అను నలుగురు కలిస్తే మొత్తం పన్నెండుగురు ప్రకృతులు అమాత్య, రాష్ట్ర, దుర్గ అర్ధ, దండాలనే ప్రకృతులు . పై పన్నెండు ప్రకృతుల కున్నందువలన మొత్తం అరువై ప్రకృతులు వీరితో మూల ప్రకృతులు పన్నెండుగురిని కలిపితే మొత్తం డెబ్బై రెండు ప్రకృతులు. అటు పిమ్మట అరిని, అరిసేవిని, అరిమిత్రుని, ఉదాసీనుని గుర్తించవలెను.

*తాన్ సర్వానభిసంధధ్యా త్సామాదిభి రుపక్రమైః*
*వ్యస్తైశ్చైవ సమస్తైశ్చ పౌరుషేణ నయేన చ 159*

*సంధిం చ విగ్రహం చైవ యానమాసనమేవ చ,*
*ద్వైధీభావం సంశ్రయం చ షడ్గుణాంశ్చింతయేత్సదా 160*

*ఆసనం చైవ యానం చ సంధిం విగ్రహమేవ చ,*
*కార్యం వీక్ష్య ప్రయుంజీత ద్వైధం సంశ్రయమేవ చ, 161*

ఆ రాజుల నందరిని సామాదానాద్యుపాయములచే వేరు వేరుగా కాని కలిసికట్టుగా కాని వశపరచుకొనవలెను. లేనిచో ఉభయుల ప్రయోజనాలు ఆలోచించి రాజులతో సంధిని, యుద్ధము, యుద్ధయాత్ర, ముట్టడి, శత్రువులను వేరు పరచుట, శత్రు బాధకోర్వలేక ఆ రాజునాశ్రయించుట అను ఆరు ఉత్తమగుణాలగూర్చి ఆలోచించాలి. అట్లే తన అభివృద్ధిని, శత్రువుల క్షీణదశలనాలోచించి రాజులను ముట్టడిని యుద్ధ యాత్ర సంధిని, యుద్ధాన్ని ద్వైధం, సంశ్రయం కార్యం అనే వాటిని ఏ వేళకు ఏది తగిందో దానినే ప్రయోగించాలి.

*సంధిం తు ద్వివిధం విద్యాద్రాజా విగ్రహమేవ చ,*
*ఉభే యానాసనే చైవ ద్వివిధస్సంశ్రయః స్మృతః 162*

సంధి, విగ్రహం, యానం ఆసనం ద్వైధీ భావం, సంశ్రయం అనే ఆరిటిలో ప్రతి ఒక్కటి రెండు విధాలుగా ఉన్నది.

*సమానయానకర్మా చ విపరీత స్తథైవ చ,*
*తదా త్వాయతిసంయుక్తః సందిర్జ్ఞేయో ద్విలక్షణః 163*

*స్వయం కృతశ్చ కార్యార్థమకాలే కాల ఏవ వా,*
*మిత్రస్య చైవాపకృతే ద్వివిధో విగ్రహః స్మృతః 164*

*ఏకాకినశ్చాత్యయికే కార్యే ప్రాప్తే యదృచ్ఛయా,*
*సంహతస్యచ మిత్రేణ ద్వివిధం యానముచ్యతే 165*

*క్షీణస్య చైవ క్రమశో దైవాత్పూర్వకృతేన వా,*
*మిత్రస్య చానురోధేన ద్వివిధం స్మృతమాసనమ్ 166*

సంధి సమాన యానకర్మ అని అసమానయానకర్మ అని రెండు విధాలుగాఉన్నది. కాలమునగాని అకాలమున గాని తన కార్యానికై చేయునది, మిత్రుని సహాయానికై చేయునది అని యుద్ధం కూడ రెండు రకాలు. శత్రువుకు అనుకొనక కష్టం కలిగినప్పుడు తానొక్కడుగాని, తన స్నేహితుని సహాయం తీసికొనిగాని దండెత్తుట రెండు విధాలు. దురదృష్టం వల్లనో పూర్వ జన్మ పాపం వల్లనో తన సైన్యం క్షీణిస్తే దానిని పెంచుకొనుటకు తాను గాని, తన స్నేహితుని సహాయాన్నిగాని తీసికొని చేయుముట్టడి (ఆసనము) రెండు విధాలు.

*బలస్య స్వామినశ్చైవ స్థితిః కార్యార్థసిద్ధయే,*
*ద్వివిధం కీర్త్యతే ద్వైధం షాడ్గుణ్యగుణ వేదిభిః, 167*

## సప్తమాధ్యాయం

*అర్థసంపాదనార్థం చ పీడ్యమానస్య శత్రుభిః,*
*సాధుషు వ్యపదేశార్థం ద్వివిధః సంశ్రయః స్మృతః 168*

తన సైన్యాన్ని సేనాధిపతి యొక్క ఆధిపత్యంలో శత్రువు పైకి పంపుట, లేక ఆ సైన్యాన్ని తన దుర్గ రక్షణకై నియోగించుట అని ద్వైధీభావం రెండు విధాలు. శత్రువు తనను బాధిస్తున్నందువల్ల ప్రస్తుతం శత్రుబాధ తొలుగుటకై లేక రాబోవు శత్రు బాధ తొలుగుటకై బలవంతుని ఆశ్రయించుట అని సంశ్రయం రెండువిధాలు.

*యదావగచ్ఛేదాయత్యా మాధిక్యం ధ్రువ మాత్మనః,*
*తదాత్వే చాల్పికాం పీడాం తదా సంధిం సమాశ్రయేత్ 169*

*యదా ప్రహృష్టా మన్యేత సర్వాస్తు ప్రకృతీర్భృశమ్,*
*అత్యుచ్ఛ్రితం తథాత్మానం తదా కుర్వీత విగ్రహమ్ 170*

*యదా మన్యేత భావేన హృష్టం పుష్టం బలం స్వకమ్,*
*పరస్య విపరీతం చ తదా యాయాద్రిపుం ప్రతి 171*

*యదా తు స్యాత్పరిక్షీణో వాహనేన బలేన చ,*
*తదాసీతాప్రయత్నేన శనకైస్సాంత్వయన్నరీన్ 172*
*మన్యేతారిం యదా రాజా సర్వథా బలవత్తరమ్,*
*తదా ద్విధా బలం కృత్వా సాధయేత్కార్యమాత్మనః 173*

*యదా పరబలానాం తు గమనీయతమో భవేత్*
*తదా తు సంశ్రయేత్క్షిప్రం ధార్మికం బలినం నృపమ్ 174*

రాజు తనకు తరువాతి కాలంలో లాభం జరుగుతుందని నిశ్చయించినపుడు తనకు స్వల్ప నష్టం కలిగినా శత్రురాజుతో సంధి చేసికొనవలెను. తాను తన సైన్యం మంచి బలంతో నున్నట్లు తాను ఆర్థికంగా పుష్టిచెందినట్లు తలిస్తే అప్పుడు శత్రువులపైకి యుద్ధానికి పోవచ్చును. అట్లే తన బలం సంతోషంగా సమృద్ధంగా ఉన్నట్లు శత్రుసేన బాధలతో దుఃఖిస్తున్న విషయాన్ని స్పష్టంగా తెలిసికొన్న రాజు శత్రువుపై యుద్ధానికి పోవాలి. తన సైన్యం కష్టాల పాలై తక్కువ సంఖ్యలో ఉన్నప్పుడు బలవంతుడైన శత్రువును మంచి మాటలతో , లొంగదీసికొని అతనితో స్నేహం చేయాలి. తన శత్రువు తనకంటె బలవంతుడన్న విషయం తెలిసి అతడు సామదానాదులకు లొంగడనే విషయం తెలిస్తే తన సైన్యాన్ని రెండుగా విభజించి ఒక భాగము దుర్గరక్షణ చేయవలెనని, రెండో భాగం తాను, లేక సేనాధిపతి అధ్యక్షతన యుద్ధం చేయునట్లు చేసి తన పనిని సాధించుకోవలెను. రాజు తాను, తన మంత్రులు మొదలైన వారు చేసిన తప్పుల వల్ల శత్రువులకు బందీకావలసిన పరిస్థితి ఏర్పడితే అప్పుడు ధార్మికుడు విజ్ఞుడు ఐన ఆరాజు బలవంతుడైన శత్రురాజుతో సంధిచేసి కోవాలి.

*నిగ్రహం ప్రకృతీనాం చ కుర్యాద్యోऽ రి బలస్య చ,*
*ఉప సేవేత తం నిత్యం సర్వయత్నైర్గురుం యథా 175*

*యది తత్రాపి సంపశ్యేద్దోషం సంశ్రయకారితమ్,*
*సుయుద్ధమేవ తత్రాపి నిర్విశంకస్సమాచరేత్ 176*

*సర్వోపాయైస్తథా కుర్యాన్నీతిజ్ఞః పృథివీపతిః,*
*యథా స్యాభ్యధికా న స్యుర్మిత్రోదాసీనశత్రవః 177*

తన పరివారజనాన్ని, శత్రు సైన్యాన్ని అరికట్టగలిగిన వాడు బలవంతుడు. అట్టి రాజును గురువును సేవించినట్లు సేవించవలెనేకాని విరోధం పెట్టుకొనరాదు. కాని ఆ రాజును ఆశ్రయించి నందువల్ల ఫలితం లేకపోతే అప్పుడు తెగించి అతనితో యుద్ధాన్నే చేయాలి. రాజనీతి తెలిసిన రాజు తన మిత్రులు, శత్రువులు, మధ్యస్థులు తనకంటె మించి పోకుండ సమస్తోపాయాలతో ప్రయత్నించవలెను.

*ఆయతిం సర్వకార్యాణాం తదాత్వం చ విచారయేత్,*
*అతీతానాం చ సర్వేషాం గుణదోషౌ చ తత్త్వతః 178*

*ఆయత్యాం గుణదోషజ్ఞ స్తదాత్వే క్షిప్రనిశ్చయః,*
*అతీతే కార్య శేషజ్ఞశ్శత్రుభిర్నాభిభూయతే 179*

ఎంతటి చిన్న కార్యాన్నైనను చేయుటవల్ల కలుగు లాభనష్టములను రాజు చక్కగా విచారించవలెను. అట్లే పూర్వం చేసిన పనుల వల్ల కలిగిన లాభ నష్టాలను కూడ చక్కగా విచారించవలెను. చేయబోవు పనుల యొక్క లాభనష్టాలు తెలిసినవాడు, అప్పుడు చేయు పనులందు గట్టి పట్టుదలకలవాడు, పూర్వం చేసిన పనుల నుంచి చెడులు గుర్తించిన రాజు శత్రువులకెన్నడును లొంగడు.

*యథైనం నాభిసందధ్యుర్మిత్రోదాసీనశత్రవః,*
*తథా సర్వం సంవిదధ్యా దేష సామాసికో నయః 180*

మిత్రుడు, మధ్యస్థుడు, శత్రువు వీరెవ్వరు తనను భాధించనట్లు చూచుకొనుట రాజుయొక్క సాధరణ ధర్మం .

*యదా తు యానమాతిష్ఠే దరిరాష్ట్రం ప్రతి ప్రభుః,*
*తదాZనేన విధానేన యాయాదరిపురం శనైః 181*

రాజు శత్రురాజ్యముల మీద దండెత్తు నప్పుడు ఈక్రింది పద్ధతుల ద్వారా శత్రు పట్టణం పైకి పోవలెను.

*మార్గశీర్షే శుభే మాసి యాయాద్యాత్రాం మహీపతిః,*
*ఫాల్గుణం వాZథ చైత్రం వా మాసౌ ప్రతి యథాబలమ్ 182*

*అన్యేష్వపి తు కాలేషు యదా పశ్యేద్ధ్రువం జయమ్,*
*తదా యాయాద్విగృహ్యైవ వ్యసనే చోత్థితే రిపోః 183*

చతురంగ బలసమేతుడైన రాజు తనబలాన్ని శత్రువులబలాలను అంచనా వేసికొని శుభమైన మాసమందు గాని, మార్గశీర్షమాసము ఫాల్గుణ మాసము లేక చైత్ర మాసము

వీటియందు ఏ మాసంలో నైన యుద్ధానికి బయలు దేరవచ్చును పైన చెప్పబడిన నెలలు కాక తనకు తప్పక జయం కలుగుతుందని నమ్మకమున్నప్పుడు శత్రువు కష్టాల పాలైనపుడు తప్పక యుద్ధానికి పోవచ్చును.

*కృత్వా విధానం మూలే తు యాత్రికం చ యథావిధి,*
*ఉపగృహ్యాస్పదం చైవ చారాన్ సమ్యగ్విధాయ చ 184*

*సంశోధ్య త్రివిధం మార్గం షడ్విధం చ బలం స్వకమ్,*
*సాంపరాయికకల్పేన యాయాదరిపురం శనైః 185*

తనకు మూల బలాన్ని ఏర్పరచుకొని దానిని ముఖ్యులైన సేనా పతులకింద దుర్గ సంరక్షణకై ఉంచి దండయాత్రకు కావలసిన ఆయుధాలు మొదలగు వాటిని శాస్త్రపద్ధతిన చేర్చుకొని, తాను శత్రురాజ్యమున ఉండవలసిన స్థలమును, శత్రువుల యొక్క బలమును గూఢచారుల వల్ల తెలిసికొని, శత్రువు పైకి దండయాత్రకు బయలు దేరవలయును. అప్పుడు పొదలతో నిండినవి, అడవులతో నిండినవి, నీటితోనున్నవి అనే మూడు మార్గాలను చక్కగా జేసికొని, హస్తి, అశ్వ, రథ పదాతి, సేనా, పరివారాలనే ఆరుబలాలను పెంచుకొని యుద్ధానికి తగిన పద్ధతిలో శత్రువుయొక్క పట్టణం పై దండెత్తవలెను.

*శత్రుసేవిని మిత్రే చ గూఢే యుక్తతరో భవేత్,*
*గతప్రత్యాగతే చైవ స హి కష్టతరో రిపుః 186*

*దండవ్యూహేన తన్మార్గం యాయాత్తు శకటేన వా,*
*వరాహమకరాభ్యాం వా సూచ్యా వా గరుడేన వా 187*

*యతశ్చ భయమాశంకే త్తతో విస్తారయేద్బలమ్,*
*పద్మేన చైవ వ్యూహేన నివిశేత సదా స్వయమ్ 188*

*సేనాపతిబలాధ్యక్షౌ సర్వదిక్షు నివేశయేత్,*
*యతశ్చ భయమాశంకేత్ ప్రాచీం తాం కల్పయేద్దిశం 189*

శత్రువును సేవస్తున్న మిత్రునియందును, తన దగ్గర పని చేసే శత్రువు దగ్గర కొంతకాలమునుండి మరల తన దగ్గరకు వచ్చినవానియందును, జాగ్రత్తగా ఉండాలి. వారిద్దరు గొప్ప శత్రువులే ఔతారు.

శత్రువుల పట్టణాన్ని దండవ్యూహం, శకట వ్యూహం వరాహవ్యూహం, మకర వ్యూహం సూచీవ్యూహం గరుడవ్యూహం వంటి వ్యూహాల్ని పన్ని ముట్టడించాలి.

దండవ్యూహమనగా మొదట బలాధ్యక్షుడు, మధ్యలో రాజు వెనక సేనాధిపతి రెండు వైపుల ఏనుగలు, గుఱ్ఱాలు, పదాతి దళముంటుంది. ఇది దండమువలె పొడవుగా ఉంటుంది.

శకటవ్యూహంలో ముందు సూదివలెనుండి వెనుక వెడల్పుగా సేన ఉంటుంది. రాజుకు వెనక నుండి భయముంటుందనుకున్నప్పుడే ఈ వ్యూహం మంచిది.

వరాహ వ్యూహంలో ముందు వెనుక సన్నగా నుండి మధ్యలో ప్రధానమైన బలగమంతా ఉంటుంది.

గరుడవ్యూహం కూడ ఇంచుమించుగా ఇట్లే ఉంటుంది.

మకరవ్యూహం ముందు వెనక వెడల్పుగానుండి మధ్య భాగం సన్నగా ఉంటుంది.

సూచీ వ్యూహం చీమలబారులవలె సన్నగా ఉండి అవసరమైనచోట మాత్రం ఎక్కువ మంది శూరులనుంచుతారు.

చుట్టు పద్మాకారంలో సైన్యముండి దాని కర్ణిక ఉండుచోట (మధ్య భాగంలో) రాజు ఉండేది పద్మవ్యూహం, రాజుకు భయం ఏ ప్రక్కనుండి ఉంటుందని భావిస్తాడో ఆ వైపు సైన్యాన్ని పంపాలి. సేనాపతి బలాధ్యక్షులను అన్ని వైపుల ఉంచాలి. ఏదిక్కున భయమెక్కువ ఉంటుందని భావిస్తారో దానినే ప్రధానమైన దిశగా భావించాలి.

*గుల్మాంశ్చ స్థాపయే దాప్తాన్ కృతసంజ్ఞాన్ సమంతతః,*
*స్థానే యుద్ధే చ కుశలానభీరూనవికారిణః 190*

*సంహతాన్ యోధయేదల్పాన్ కామం విస్తారయేద్బహూన్,*
*సూచ్యా వజ్రేణ చైవైతాన్ వ్యూహేన వ్యూహ్య యోధయేత్ 191*

మంచికీర్తి ప్రతిష్ఠలు కలవాడు, మిక్కిలి ఆప్తులు, సమర్థులు, భయంలేనివారు, అందమైన వారైన యోధులను తమ సైన్యంనుండి వేరు చేసి శత్రు పక్షాన్ని ఆటంక పరచుటకు శత్రుసైన్యం యొక్క చేష్టలు తెలిసికొనుటకు నియమించాలి. యుద్ధ నైపుణ్యమంతగా లేని అల్పులను ఒక దగ్గరగా చేర్చియుద్ధం చేయాలి. వీరిలో చాలా మందిని చేర్చి బాగా విస్తరింప జేయాలి. రాజు తాను పైన చెప్పిన సూచీ వ్యూహం వజ్రవ్యూహాలను పన్ని యుద్ధం చేయాలి.

*స్యందనాశ్వైస్సమే యుధ్యేదనూపే నౌద్విపై స్తథా,*
*వృక్ష గుల్మావృతే చాపైరసిచర్మాయుధైః స్థలే 192*

*కురుక్షేత్రాంశ్చ మత్స్యాంశ్చ పంచాలాన్ శూరసేనజాన్,*
*దీర్ఘాన్ లఘూంశ్చైవ నరానగ్రానీకేషు యోధయేత్ 193*

*ప్రహర్షయేద్బలం వ్యూహ్య తాంశ్చ సమ్యక్పరీక్షయేత్,*
*చేష్టాశ్చైవ విజానీయదరీన్ యోధయతామపి 194*

బయలు నందు (సమ ప్రదేశంలో, రథాశ్వాలతో యుద్ధంచేయాలి. చెట్లు పొదలు నిండిన ప్రదేశంలో ధనుర్ధారులు ఖడ్గాలు, కత్తులు మొదలైన ఆయుధాలు ధరించిన వారితో యుద్ధం చేయించాలి. కురుక్షేత్రం, మత్స్య దేశం, పాంచాల దేశం, శూరసేన దేశంలో పుట్టి గొప్ప శరీరం బలంకలవారిని సైన్యానికి ముందు భాగంలో నిలపాలి. వ్యూహాన్ని పన్ని నప్పటికీ తన సైన్యానికి ఉత్సాహం కలిగిస్తున్నా శత్రుసైనికుల చేష్టలను జాగ్రత్తగా గమనిస్తూ ఉండాలి.

*ఉపరుధ్యారి మాసీత రాష్ట్రం చాస్యోపపీడయేత్,*
*దూషయేచ్చాస్య సతతం యవసాన్నోదకేంధనమ్ 195*

*ఛింధ్యాచ్చైవ తటాకాని ప్రాకారపరిఖా స్తథా,*
*సమవస్కందయేచ్చైనం రాత్రౌవిత్రాసయేత్తథా 196*

*ఉపజప్యానుపజపేద్బుధ్యేతైవ చ తత్కృతమ్,*
*యుక్తే చ దైవే యుద్ధ్యేత జయప్రేప్సురపేతభీః 197*

*సామ్నా దానేన భేదేన సమస్తైరథవా పృథక్,*
*విజేతుం ప్రయతేతారీన్న యుద్ధేన కదాచన 198*

*అనిత్యో విజయో యస్మాద్దృశ్యతే యుద్ధ్యమానయోః,*
*పరాజయశ్చ సంగ్రామే తస్మాద్యుద్ధం వివర్జయేత్ 199*

*త్రయాణామప్యుపాయానాం పూర్వోక్తానామసంభవే,*
*తథా యుద్ధ్యేత సంపన్నో విజయేత రిపూన్ యథా 200*

శత్రు రాజు దుర్గంలో ఉన్నా లేకున్నా అతని పట్టణాన్ని ముట్టడించాలి సాధారణంగా మొదలు దుర్గం పట్టణాన్ని ముట్టడించాలి సాధారణంగా దుర్గంలో బయటినుండి ఆహార వస్తువులు రాకుండా చేసి దుర్గంలో ఉన్న ఆహార వస్తువులను నాశనం చేయాలి. శత్రు రాజుకు సంబంధించిన చెరువులను తెంపెయ్యాలి. కోటగోడలను కూల్చి వేయాలి. కందకాలను పూడ్చివేయాలి. ఈ విధంగా శత్రువును శక్తి హీనుణ్ణి చేయాలి. రాత్రిపూట భేరి మొదలైన వాద్యాలతో పట్టణ ప్రజలను భయపెట్టాలి. రాజ్యమిస్తానని ఆశ చూపి నీచబుద్ధి గలవారిని లోబరుచుకోవాలి. అట్లే వారి చేష్టలను గమనించాలి. జయాన్ని కోరే రాజు భయాన్ని వదిలి పెట్టి సమయం చూచుకొని యుద్ధం చేయాలి వీలైనంతవరకు సామోపాయంతోనో, దానోపాయంతోనో భేదోపాయంతోనో ప్రయత్నం చేయాలి లేక అన్నీ కలిపి ప్రయత్నం చేయాలి యుద్ధాన్ని వీలైనంత తక్కువగా ప్రయోగించాలి. లేక ఎప్పుడు ప్రయోగింపవద్దు. యుద్ధం చేస్తే విజయం ఎవరికి లభిస్తుందో చెప్పలేము. అట్లే అపజయం కూడ ఎవరికి లభిస్తుందో కూడ చెప్పలేము కావున శత్రువుతో యుద్ధం చేయరాదు సామం మొదలైన మూడు ఉపాయాలతో శత్రువు లొంగిరానప్పుడు బలవంతుడైన రాజు తన శత్రువులతో తలపడి విజయం లభించునంతవరకు యుద్ధం చేయాలి.

*జిత్వా సంపూజయేద్దేవాన్ బ్రాహ్మణాం శ్చైవ ధార్మికాన్,*
*ప్రదద్యాత్పరిహారాంశ్చ ఖ్యాపయేదభయాని చ. 201*

*సర్వేషాం తు విదిత్వైషాం సమాసేన చికీర్షితం,*
*స్థాపయేత్తత్ర తద్వంశ్యం కుర్యాచ్చ సమయక్రియామ్ 202*

*ప్రమాణాని చ కుర్వీత తేషాం ధర్మ్యాన్ యథోదితాన్,*
*రత్నైశ్చ పూజయేదేనం ప్రధానపురుషైస్సహ 203*

అట్లు శత్రువులను జయించిన తరువాత దేవతలను, బ్రాహ్మణులను, ధార్మికులను, పూజించి ఆ దేశవాసులకు పరిహారాలను అభయమును ఇవ్వవలెను. ఆ శత్రువు యొక్క మంత్రులు మొదలైన వారి అభిప్రాయాలను తీసికొని తన శత్రు రాజ

సింహాసనంపై ఆ వంశానికే చెందిన వానిని కూర్చుండబెట్టి హితోపదేశం చేయాలి. శాస్త్రంలోచెప్ప బడ్డ ఆ దేశపుటాచారాలను తాను కూడ ప్రమాణంగా తీసుకోవాలి. తరువాత నూతనంగా సింహాసనమెక్కిన రాజును మంత్రులు మొదలగు వారితో కలిసి రత్నాలంకారాలతో గౌరవించాలి.

*ఆదానమప్రియకరం దానం చ ప్రియకారకమ్,*
*అభీప్సితానామర్థానాం కాలే యుక్తం ప్రశస్యతే 204*

*సర్వం కర్మేదమాయత్తం విధానే దైవమానుషే,*
*తయోర్దైవమచింత్యం తు మానుషే విద్యతే క్రియా 205*

ఇతరులకిష్టమైన వాటిని స్వీకరించుట ప్రియాన్ని కలిగించదు. అట్లే తనకిష్టమైన వాటిని ఇతరులిస్తే సంతోషం కలుగుతుంది. అందువల్ల సమయానుకూలంగా ప్రవర్తించుట మంచిది. మానవుడు చేసే ప్రతి పని దైవానికి మనుష్యునకు అధీనమైంది. ఈ దైవమానుషాల్లో దైవమెట్లుందో తెలియదు. కాబట్టి దాన్ని గురించి ఆలోచించలేము. మానుషమైన క్రియమాత్రం తప్పక చేయతగింది.

*సహ వాపి వ్రజేద్యుక్త స్సంధిం కృత్వా ప్రయత్నతః,*
*మిత్రం హిరణ్యం భూమి వా సంపశ్యం స్త్రివిధం ఫలమ్. 206*

ఆ శత్రు రాజు సంధికి ఇష్టపడితే సంధి చేసికొని రావలెను ఆ సంధివలన క్రొత్త స్నేహితులను సంపాదించుకోవచ్చును. ఇంకా ధనం, భూమి అనే వాటిని కూడ సంపాదించుకొనవచ్చును.

*పార్ష్ణిగ్రాహం చ సంప్రేక్ష్యతథా క్రందం చ మండలే,*
*మిత్రాదథాప్యమిత్రాద్వా యాత్రాఫలమవాప్నుయాత్ 207*

*హిరణ్య భూమిసంప్రాప్త్యా పార్థివో న తథైధతే,*
*యథా మిత్రం ధ్రువం లబ్ధ్వా కృశమప్యాయతిక్షయమ్ 208*

*ధర్మజ్ఞం చ కృతజ్ఞం చ తుష్టప్రకృతిమేవ చ,*
*అనురక్తం స్థిరారంభం లఘుమిత్రం ప్రశస్యతే 209*

*ప్రాజ్ఞం కులీనం శూరం చ దక్షం దాతార మేవ చ,*
*కృతజ్ఞం ధృతిమంతం చ కష్టమాహురరిం బుధాః 210*

*ఆర్యతా పురుషజ్ఞానం శౌర్యం కరుణ వేదితా,*
*స్థౌలలక్ష్యం చ సతతముదాసీనగుణోదయః 211*

యుద్ధానికి పోవు రాజు వెనుక, ప్రక్కలనున్న రాజు దేశములనాక్రమిస్తాడు. అతనిని పార్ష్ణిగ్రాహి అంటారు. వాని వెంటనున్న రాజు ఆక్రందుడు. రాజుకు వీరు స్నేహితులైనా కాకపోయినా వారి సహాయాన్ని తీసికొని యే యుద్ధానికి పోవలెను. వారిచ్చు యుద్ధయాత్రా ఫలాన్ని తీసికొనవలెను. లేనిచో వారు చేయు కుట్ర కితడు లోబడును. కావున వారితో తప్పక స్నేహం చేయవలెను. రాజు బలహీనుడైనా అభివృద్ధికై వచ్చే స్నేహితుడు దొరకితే

అంతులేని ధనాన్ని భూమిని సంపాదించిన దానికంటె ఎక్కువ ఫలితాన్ని పొందుతాడు. ధర్మా ధర్మములు తెలిసినవాడు, కృతజ్ఞుడు, సంతోషం పొందువాడు, ప్రేమకల వాడు, నిలకడగా పని చేయు మిత్రుడు అల్పుడైనా చాలా గొప్పవాడు. అట్టి మిత్రుని కష్టపడి సంపాదించుకోవాలి. అట్లే గొప్ప విద్వాంసుడు మంచి కులంలో పుట్టిన వాడు, సమర్థుడు, దానము చేసే స్వభావం కలవాడు, కృతజ్ఞుడు, కష్టసుఖాలలో ఒకే విధంగా ఉండే శత్రువును జయించుట కష్టమంటారు. కావున అట్టి శత్రువుతో సంధి చేసి కొనుట తగినది. మంచి తనం, మనుష్య స్వభావాన్ని తెలిసికొనే శక్తి, శౌర్యం, దయకలిగి ఉండుట, అధికంగా దానము చేసే స్వభావం ఇవన్ని మధ్యవర్తి యగు వానికుండాల్సిన లక్షణాలు. ఇటువంటి మధ్యవర్తియైన రాజు లభిస్తే అతని సహాయంతో శత్రువుతో యుద్ధం చేయవచ్చును.

*క్షేమ్యాం సస్యప్రదాం నిత్యం పశువృద్ధికరీమపి,*
*పరిత్యజేన్నృపో భూమి మాత్మార్థమవిచారయన్ః 212*

*అపదర్థం ధనం రక్షే ద్దారాన్ రక్షేద్ధనైరపి,*
*ఆత్మానం సతతం రక్షేద్దారై రపి ధనైరపి, 213*

క్షేమం వంటి మంచి గుణాలనిచ్చేది సస్యాలనిచ్చేది, పశువృద్ధిని కలిగించేది ఐన రాజ్యాన్నైనా తనప్రాణాలను రక్షించుటకొరకు వదలి పెట్ట వలెను. ఆపదలను పోగొట్టుకొనుటకు ధనాన్ని కాపాడుకోవాలి. భార్యను ధనం కంటె మిన్నగా కాపాడుకోవాలి. తనను, భార్యకంటె ధనం కంటె మిన్నగా రక్షించుకోవాలి.

*సహ సర్వాస్సముత్పన్నాః ప్రసమీక్ష్యాపదో భృశమ్,*
*సంయుక్తాంశ్చ వియుక్తాంశ్చ సర్వోపాయన్ సృజేద్బుధః 214*

*ఉపేతారముపేయం చ సర్వోపాయాంశ్చ కృత్స్నశః,*
*ఏతత్త్రయం సమాశ్రిత్య ప్రయతేతార్థ సిద్ధయే 215*

రాజు తనకు ఆపదలన్ని ఒకేసారి సంభవించినా చింతించక వాటినన్నిటిని తొలగించుకొనుటకు లేక వేరు వేరుగా తొలగించుకొనుటకు ఉపాయాలను పన్నాలి. కష్ట సుఖాలను పొందువాడు (తాను) పొంద తగిన కష్టసుఖాలు, ఉపాయాలు అను మూడింటిని ఆశ్రయించి శక్తి కొలది కార్య సిద్ధికై ప్రయత్నంచేయాలి.

*ఏవం సర్వమిదం రాజా సహ సమ్మంత్ర్య మంత్రిభిః,*
*వ్యాయమ్యాప్లుత్య మధ్యాహ్నే భోక్తుమంతఃపురం విశేత్ 216*

*తత్రాత్మభూతైః కాలజ్ఞైరహార్యైః పరిచారకైః,*
*సుపరీక్షితమాన్నాద్య మద్యాన్మంత్రైర్విషాపహైః 217*

*విషఘ్నైరగ దైశ్చాస్య సర్వద్రవ్యాణి యోజయేత్,*
*విషఘ్నాని చ రత్నాని నియతో ధారయేత్సదా 218*

*పరీక్షితాః స్త్రియ శ్చైనం వ్యజనోదక ధూపనైః,*
*వేషాభరణ సంశుద్ధాః స్పృశేయుస్సుసమాహితాః 219*

*ఏవం ప్రయత్నం కుర్వీత యానశయ్యాసనాశనే,*
*స్నానే ప్రసాధనే చైవ సర్వాలంకారకేషు చ 220*

ఈ విధంగా రాజు మంత్రులతో అన్ని విషయాల గూర్చి విచారించి తరువాత కొంత వ్యాయామం కూడ చేసి మధ్యాహ్న సమయంలో భోజనం చేయుటకై అంతఃపురంలో తనతో సమానులు, భోజన కాలం తెలిసిన వారు, ఇతరుల మాటలు వినని వంటవాండ్రు వండిన వంటను చక్కగా పరీక్షించి విషాన్ని పోగొట్టు మంత్రాలచే మంత్రించిన తరువాత తినలెను. రాజు తన భోజనంలో విషాన్ని పోగొట్టే ఔషధాలను చేర్చవలెను. అట్లే ఎల్లప్పుడు తన శరీరంపై విషాన్ని విరిచే గుణం కల రత్నాలను ధరించాలి. రాజుకు గాలి వీచు స్త్రీలు, మంచినీరు ఇచ్చుస్త్రీలు, ధూపం చేయు స్త్రీలను గూఢచారులు పరీక్షించిన తరువాతనేకాని వారు రాజును అలంకరింపవలెను. ఇదేవిధంగా రాజు యొక్క వాహనాలు, పాన్పులు, ఆసనం, భోజనం మొదలైన సకల వస్తువులను పరీక్షించిన తర్వాతనే రాజునకియ్యవలెను.

*భుక్తవాన్ విహరేచ్చైవ స్త్రీభి రంతఃపురే సహ,*
*విహృత్య తు యథాకాలం పునః కార్యాణి చింతయేత్ 221*

*అలంకృతశ్చ సంపశ్యేదాయుధీయం పునర్జనమ్,*
*వాహనాని చ సర్వాణి శస్త్రాణ్యాభరణాని చ 222*

*సంధ్యాం చోపాస్య శృణుయాదంతర్వేశ్మని శస్త్రభృత్,*
*రహస్యాఖ్యాయినాం చైవ ప్రణిధీనాం చ చేష్టితమ్ 223*

*గత్వా కక్షాంతరం త్వన్యత్సమనుజ్ఞాప్య తం జనమ్,*
*ప్రవిశేద్భోజనార్థం చ స్త్రీవృతోZ ంతఃపురం పునః 224*

*తత్ర భుక్త్వా పునః కించిత్తూర్యఘోషైః ప్రహర్షితః*
*సంవిశేత్తు యథాకాలముత్తి ష్ఠేచ్చ గతక్లమః 225*

రాజు మధ్యాహ్నమున భోజనము చేసిన తరువాత అంతః పురంలో కొంతసేపు అంతఃపుర స్త్రీలతో కలిసి విహరించి తరువాత మరల రాజ కార్యములగురించి ఆలోచింపవలెను. రాజు తన్ను అలంకరించుకొన్న తరువాత యోధులను, సకల వాహనములను శస్త్రా భరణములను పరీక్షించవలెను. సాయంకాలమున సంధ్యా వందనము చేసి శస్త్రముల ధరించి అంతః పురంలో చారులు చెప్పే రహస్య విషయాలను వినవలెను. తనతో మాటాడు గూఢచారులను బయటకు పంపి, ఇంకొక వైపునకు పోయిస్త్రీలతో కలసి రాత్రి భోజనానికై మరల అంతఃపురానికి పోవలెను. అచ్చట భోజనం చేసి, గీత వాద్యాలచే కొంత కాలం గడిపి నిద్రాకాలానికి నిద్రపోవలెను. ఈ విధంగా శ్రమ దీర్చుకొని వేకువ జాముననే నిద్ర లేవవలెను.

*ఏతద్విధానమాతిష్ఠేదరోగః పృథివీపతిః,*
*అస్వస్థస్సర్వ మేతత్తు భృత్యేషు వినియోజయేత్ 226*

ఆరోగ్య వంతుడైన రాజు ఈ విధానాన్నంతా ఆచరింపవలెను. తాను అస్వస్థుడైనప్పుడు ఈ విధంగా రాజకార్యాలు చూచుకొనుటకు తన ప్రధాన భృత్యు లగు మంత్రులనియోగింపవలెను.

**ఇతి మానవే ధర్మశాస్త్రే భృగుప్రోక్తాయాం సంహితాయాం రాజధర్మో నామ సప్త మోzధ్యాయః**

భృగు మహర్షి చెప్పిన మానవ ధర్మశాస్త్రమనుసంహిత యందు రాజ ధర్మమను ఏడవ అధ్యాయము సమాప్తము.

## అష్టమాధ్యాయం :

*వ్యవహారాన్ దిదృక్షుస్తు బ్రాహ్మణైస్సహ పార్థివః,*
*మంత్రజ్ఞైర్మంత్రిభిశ్చైవ వినీతః ప్రవిశేత్సభామ్, 1*

రాజవ్యవహారాలను చూచుటకు రాజు ఆలోచనా పరులైన మంత్రులతో, బ్రాహ్మణులతో కలిసి వినయంతో రాజ సభను ప్రవేశించాలి.

*తత్రాసీనః స్థితో వాzపి పాణిముద్యమ్య దక్షిణమ్,*
*వినీత వేషాభరణః పశ్యేత్కార్యాణి కార్యిణామ్ 2*

*ప్రత్యహం దేశదృష్టైశ్చ శాస్త్రదృష్టైశ్చ హేతుభిః,*
*అష్టాదశసు మార్గేషు నిబద్ధాని పృథక్పృథక్ 3*

ఆ రాజ సభలో వినయాన్ని సూచించే వేషాన్ని ఆభరణాలను ధరించి కుడిచేతి నెత్తి రాజకార్యాలనన్నిటిని నిర్వహించవలెను. లౌకికాలైన విషయాలను ప్రతి దినం విచారించాలి.

*తేషామాద్యమృణాదానం నిక్షేపో స్వామివిక్రయః*
*సంభూయ చ సముత్థానం దత్తస్యానపకర్మ చ 4*

*వేతనస్యైవ చాదానం సంవిదశ్చ వ్యతిక్రమః,*
*క్రయవిక్రయానుశయో వివాదః స్వామిపాలయోః 5*

*సీమావివాదధర్మశ్చ పారుష్యే దండవాచికే*
*స్తేయం చ సాహసం చైవ స్త్రీసంగ్రహణమేవ చ 6*

*స్త్రీపుంధర్మో విభాగశ్చ ద్యూతమాహ్వాయ ఏవ చ,*
*పదాన్యష్టాదశైతాని వ్యవహారస్థితావిహ 7*

*ఏషు స్థానేషు భూయిష్ఠం వివాదం చరతాం నృణామ్,*
*ధర్మం శాశ్వతమాశ్రిత్య కుర్యాత్కార్యవినిర్ణయమ్ 8*

అప్పుతీసుకొనుట, ధనం దాచుట ఇతరుల వస్తువులనమ్ముట ఉమ్మడిగ వ్యాపారం చేయుట, ఇచ్చిన దాన్ని తిరిగి తీసికొనుట (వేతనం ఇవ్వకుండుట) ఒడంబడిక నతిక్రమించుట, క్రయవిక్రయాల్లో వివాదం, స్వామి, సేవకుల మధ్య వివాదం, భూమి

ఎల్లలు, ఊరి యెల్లలు మొదలగు వాటిగురించిన వివాదం, తిట్టుట, కొట్టుట, ధనమపహరించుట, దోపిడి చేయుట, వ్యభిచారం, స్త్రీ పురుషుల వివాదం, ఆస్తి పంపకం, జూదం, పందెం అను పద్ధెనిమిది విషయాలలో ప్రజలు తగవులు పెట్టుకొనుచున్నారు. వాటినన్నిటిని న్యాయ శాస్త్రాన్ననుసరించి తీర్పు చెప్పాలి.

*యదా స్వయం న కుర్యాత్తు నృపతిః కార్యదర్శనమ్,*
*తదా నియుంజ్యాద్విద్వాంసం బ్రాహ్మణం కార్యదర్శనే 9*

*సోఽస్య కార్యాణి సంపశ్యేత్సభ్యైరేవ త్రిభిర్వృతః*
*సభామేవ ప్రవిశ్యాగ్ర్యామాసీనః స్థిత ఏవ వా 10*

ఎప్పుడైన ప్రజల వివాదాలను తాను స్వయంగా తీర్చలేకపోతే ఆ వివాద పరిష్కారానికి చక్కగా చదువుకొన్న బ్రాహ్మణుని రాజు తాను చేయవలసిన పనికి నియోగింపవలెను. ఆ బ్రాహ్మణుడు తనకు తోడుగా ముగ్గురు లేక ఎక్కువ సభ్యులను తీసికొని సభాభవనంలో కూర్చొని, లేక నిలబడియైన ప్రజల వివాదాలకు పరిష్కారం చెప్పాలి.

*యస్మిన్ దేశే నిషీదంతి విప్రా వేదవిదస్త్రయః,*
*రాజ్ఞా చాధికృతో విద్వాన్ బ్రహ్మణస్తాం సభాం విదుః 11*

*ధర్మో విద్ధ స్త్వధర్మేణ సభాం యత్రోపతిష్ఠతే,*
*శల్యం చాస్య న కృంతంతి విద్ధా స్తత్ర సభాసదః 12*

వేదం వేదతత్వం తెలిసిన ముగ్గురు బ్రాహ్మణులతో పాటు రాజు నియమించిన విద్వాంసుడైన బ్రాహ్మణుడున్న స్థలమును రాజసభ అని అంటారు. ధర్మం అధర్మం చే కొట్టు వడి తీర్మానానికై సభకు వస్తే అచ్చటి సభ్యులు అధర్మ పీడితులైతే వారు ఆ అధర్మాన్ని తీర్చలేరు.

*సభాం వా న ప్రవేష్టవ్యం వక్తవ్యం వా సమంజసమ్,*
*అబ్రువన్ విబ్రువన్ వాపి నరో భవతి కిల్బిషీ 13*

*యత్ర ధర్మో హ్యధర్మేణ సత్యం యత్రానృతేన చ,*
*హన్యతే ప్రేక్షమాణానాం హతాస్తత్ర సభాసదః 14*

*ధర్మ ఏవ హతో హంతి ధర్మో రక్షతి రక్షితః,*
*తస్మాద్ధర్మో న హంతవ్యో మా నో ధర్మో హతోఽ వధీత్ 15*

పలు విషయాలలో వివాదాలు వస్తే వీలైనంత వరకు రాజ సభకు రాకుండ తమలో తామే పరిష్కరించుకోవాలి. రాజ సభకు వచ్చినపుడు అచ్చటి సదస్యులడిగిన ప్రశ్నలకు సరియైన సమాధానాలు చెప్పాలి. కాని రాజసభలో నున్న సభ్యులడిగిన ప్రశ్నలకు అసలే సమాధానములీయకున్నా, తప్పుడు సమాధానమిచ్చినా అతడు పాపియౌతాడు. ధర్మం అధర్మల చేత, సత్యం అబద్ధం చేత కప్పబడినచో ఆ రాజ సభలోనున్న సదస్యులు మోసగించబడుతారు. ధర్మాన్ని చెడగొట్టినచో అది మనలను నాశనం చేస్తుంది. అట్లే ధర్మాన్ని రక్షిస్తే అది మనలను రక్షిస్తుంది అందువలన ధర్మాన్ని ఎప్పుడు చెడగొట్టవద్దు. ధర్మాన్ని చెడగొట్టి మనలను చెడగొట్టుకొనకూడదు.

వృషో హి భగవాన్ ధర్మ స్తస్య యః కురుతే హ్యలమ్,
వృషలం తం విదుర్దేవాస్తస్మాద్ధర్మం న లోపయేత్ 16

ఏక ఏవ సుహృద్ధర్మో నిధనే ఽ ప్యనుయాతి యః,
శరీరేణ సమం నాశం సర్వమన్యద్ధి గచ్ఛతి 17

పాదో ధర్మస్య కర్తారం పాదస్సాక్షిణమృచ్ఛతి,
పాద స్సభాసద స్సర్వాన్ పాదో రాజాన మృచ్ఛతి, 18

రాజా భవత్యనేనాస్తు ముచ్యంతే చ సభాసదః,
ఏనో గచ్ఛతి కర్తారం నిందార్హో యత్ర నింద్యతే 19

జాతిమాత్రోపజీవీ వా కామం స్యాద్బ్రాహ్మణబ్రువః,
ధర్మ ప్రవక్తా నృపతే ర్నతు శూద్రః కథంచన. 20

యస్య శూద్రస్తు కురుతే రాజ్ఞో ధర్మవివేచనమ్,
తస్య సీదతి తద్రాష్ట్రం పంకే గౌరివ పశ్యతః 21
యద్రాష్ట్రం శూద్రభూయిష్ఠం నా స్తికాక్రాంతమద్విజమ్,
వినశ్యత్యాశు తత్కృత్స్నం దుర్భిక్షవ్యాధిపీడితమ్ 22

పూజ్యమైన ధర్మం కోర్కెలను వర్షిస్తుంది. అటువంటి ధర్మాన్ని నిషేధించువాడే వృషలుడు కావున ఎప్పుడు కూడ ధర్మలోపాన్ని కలుగనీయవద్దు.. ధర్మం మాత్రమే స్నేహితునివలె తాను చనిపోయినప్పటికీ వెంట వస్తుంది. తక్కినవన్నీ మన శరీరంతోపాటు నశిస్తున్నవి. అధర్మం చేసినచో దానిలో నాలుగవ భాగం పాపం అధర్మాన్ని చేసిన వ్యక్తిని చేరుతుంది మరొక నాలుగోభాగం పాపం తప్పుడు సాక్ష్యం చెప్పిన వానిని చేరుతుంది. ఇంకొక నాలుగోభాగం పాపం ఆ సభలోనున్న సదస్యులను చేరుతుంది. మిగిలిన నాలుగో భాగం పాపం రాజుకు చెందుతుంది కాబట్టి అధర్మ కార్యాలు చేసేవాడే కాదు తక్కినవారు కూడ అధర్మ విషయం జాగ్రత్తగా ఉండాలి ఏ సభలో అధర్మం చేసిన వాణ్ణి గుర్తించి అతడికి శిక్ష విధిస్తారో ఆ సభలో ఆ ధర్మంవల్ల కలిగే పాపం రాజుకు కాని అచ్చట ఉండే సభ్యులకు కాని చెందక కేవలం అధర్మాన్నిచేసిన వ్యక్తికి మాత్రమే చెందుతుంది. రాజు యొక్క సభలో రాజుకు ధర్మ విషయంలో సలహా లిచ్చుటకు బ్రాహ్మణుడు ధర్మశాస్త్రాలన్నీ తెలియకున్నా ఉండాలి. ఒకవేళ మంచి బ్రాహ్మణుడు దొరకని చో తప్పుడు మార్గంలో పోతూ తన జాతి ధర్మాన్ని వదిలి పెట్టిన బ్రాహ్మణునైనా నియోగించాలి కాని శూద్రుని ఆ పదవిలో ఎప్పుడు ఉంచరాదు. శూద్రుడు రాజసభలో ఉండి ధర్మా ధర్మ నిర్ణయం చేస్తుంటే ఆ రాజ్యం బురదలో కూరుకొని పోయిన ఆవు వలె నశిస్తుంది. బ్రాహ్మణులు లేకుండ అధిక శూద్రులు, అధిక నాస్తికులు కల రాజ్యం దుర్భిక్షాలు, రోగాలు మొదలైె న వాటి వల్ల త్వరగా నశించిపోతుంది.

ధర్మాసనమధిష్ఠాయ సంవీతాంగ స్సమాహితః,
ప్రణమ్య లోకపాలేభ్యః కార్యదర్శనమారభేత్. 23

*అర్థానర్థావుభౌ బుద్ధ్వా ధర్మాధర్మౌ చ కేవలౌ,*
*వర్ణక్రమేణ సర్వాణి పశ్యేత్కార్యాణి కార్యిణామ్ 24*

*బాహ్యైర్విభావయేల్లింగైర్భావమంతర్గతం నృణామ్,*
*స్వరవర్ణేంగితాకారైశ్చక్షుషా చేష్టితేన చ 25*

*ఆకారై రింగితైర్గత్యా చేష్టయా భాషితేన చ,*
*నేత్రవక్త్రవికారైశ్చ గృహ్యతేऽంతర్గతం మనః 26*

రాజు రాజసభలో ధర్మాధర్మ వినిర్ణయం చేసేటప్పుడు తనవంటినంతా బట్టలతో కప్పుకొని, ధర్మాసనంపై కూర్చొని, లోకపాలకులకందరికి నమస్కరించి ధర్మ నిర్ణయం చేయాలి. ఆ సమయంలో ప్రజారక్షణం ప్రజానాశనం వంటి ఐహిక ప్రయోజనాన్ని, ధర్మాధర్మాలను గుర్తించి బ్రాహ్మ, క్షత్రియ, వైశ్య శూద్రుల వివాదాలను వర్ణక్రమాన్ని అనుసరించి పరిష్కరించాలి. వివాద పరిష్కారార్థం వచ్చిన వారి యొక్క గొంతు చప్పుడు, అతని ముఖ వర్ణం, అభిప్రాయం ఆకారం చూపులు, నడకలు మొదలైన బాహ్య చిహ్నాల వల్ల అతని అంతరంగాన్ని గుర్తించాలి. ఆకారం, మనోభిప్రాయం, నడకలో తొట్రుపాటు, మొదలైన చేష్టలు, మాటలు, చూపు, ముఖవికారం వీటిచే తప్పు చేసిన వాని మనోభావాన్ని గుర్తింపవచ్చు కావున వీటిని తొలుత గమనించాలి.

*బాలదాయాదికం రిక్థం తావద్రాజానుపాలయేత్,*
*యావత్స స్యాత్సమావృత్తో యావచ్చాతీత శైశవః 27*

దిక్కులేని పిల్లవాని సొత్తును అతని దాయాదులు అపహరింపజూస్తే రాజు అతని సొత్తును రక్షించి అతడు చదువునంతా పూర్తి చేసి కొన్న తర్వాత లేనిచో అతడు యౌవనవంతుడైన తరువాత అతని సొత్తును తిరిగి అతనికిచ్చివేయాలి.

*వశాపుత్రాసు చైవం స్యాద్రక్షణం నిష్కులాసు చ,*
*పతివ్రతాసు చస్త్రీషు విధవా స్వాతురాసు చ 28*

*జీవంతీనాం తు తాసాం యే తద్ధరేయుః స్వబాంధవాః,*
*తాఞ్ఛిష్యాచ్చౌరదండేన ధార్మికః పృథివీపతిః, 29*

జీవన భృతి తీసికొన్న స్త్రీలు, సంతానము లేని స్త్రీలు, పతివ్రతలు, విధవలు, రోగిష్ఠులు, వీరి సొత్తును, వారి బంధువులు అపహరించుటకు వీలుంది. కావున ఆపని చేసినవారిని ధార్మికుడైన రాజు దొంగకు విధించే శిక్షను విధించి ఆ స్త్రీలసొత్తును అనాధ బాలుర సొత్తును వలె కాపాడవలెను.

*ప్రణష్టస్వామికం రిక్థం రాజా త్ర్యబ్దం నిధాపయేత్;*
*అర్వాక్ త్ర్యబ్దాద్ధరేత్స్వామీ పరేణ నృపతిర్హరేత్ 30*

*మమేదమితి యో బ్రూయాత్సోऽనుయోజ్యో యథావిధి,*
*సంవాద్య రూపసంఖ్యాదీన్ స్వామీ తద్ద్రవ్యమర్హతి 31*

అష్టమాధ్యాయం

*అవేదయానో నష్టస్య దేశం కాలం చ తత్త్వతః,*
*వర్ణం రూపం ప్రమాణం చ తత్సమం దండ మర్హతి 32*

*ఆదదీతా థ షడ్భాగం ప్రణష్టాధిగతాన్నృపః,*
*దశమం ద్వాదశం వాపి సతాం ధర్మ మనుస్మరన్ 33*

*ప్రణష్టాధిగతం ద్రవ్యం తిష్ఠేద్యుక్తైరధిష్ఠితమ్,*
*యాంస్తత్ర చోరాన్ గృహ్ణీయా త్తాన్ రాజేభేన ఘాతయేత్ 34*

దిక్కులేని సొత్తు గురించి, ఆసొత్తు ఎవ్వరిదో తెలుపుమని ప్రకటించి మూడు సంవత్సరాల వరకా సొత్తు తనది అని తెలుపుకొనువాడు లేనిచో దానిని తాను గైకొన వలెను. ఈ మూడు సంవత్సారాలలో ఎవరైనా వచ్చి ఈ సొత్తు నాదని చెప్పినచో ఆ సొమ్ము యొక్క రూపము. సంఖ్యమొదలైనవాటిని అడిగి సరియైన సమాధానాలిస్తే అతనికాసొమ్మును ఇచ్చి వేయవలెను. కాని సరియైన సమాధానాలు చెప్పలేనివానికి తాను అడిగిన సొత్తుతో సమానమైన సొమ్మును దండుగగా తీసికొనవలెను. ఆ విధంగా పోయిన ద్రవ్యం తిరిగి దొరికినపుడు ఇన్ని సంవత్సరాలు కాపాడినందులకై రాజు ఆ సొత్తులో ఆరవ అంశాన్ని లేక పదవ భాగాన్ని లేక పన్నెండవ భాగానైనా తీసికొనవచ్చును. దొంగ లెత్తుకొనిపోయిన ద్రవ్యం రాజపురుషులకు దొరికితే రాజు ఆ సొత్తును జాగ్రత్తగా రక్షించాలి. పైగా దొంగలను తన ఏనుగుచే త్రొక్కించి కఠినంగా దండిచాలి.

*మమాయ మితి యో బ్రూయాన్నిధిం సత్యేన మానవః*
*తస్యాదదీత షడ్భాగం రాజా ద్వాదశ మేవ వా. 35*

*అనృతం తు వదన్ దండ్యస్స్వ విత్తస్యాంశమష్టమమ్*
*తస్యైవ వా నిధానస్య సంఖ్యాయాల్పీయసీం కళామ్ 36*

దొంగతనం చేసిన వస్తువు నాదేయని సత్యం చెస్తే రాజు దానిలో ఆరవ భాగాన్ని లేక పన్నెండవ భాగాన్ని తీసికొని మిగిలిన నిధిని స్వంత దారునకిచ్చివేయాలి. అబద్ధమాడితే తాను అబద్ధమాడిన ధనంలో ఎనిమిదవ భాగాన్ని లేక దానిలో కొంత భాగాన్ని దండుగ తీసికొనవలెను.

*విద్వాంస్తు బ్రాహ్మణో దృష్ట్వా పూర్వోపనిహితం నిధిమ్,*
*అశేషతోz ప్యాదదీత సర్వస్యాధిపతిర్హి సః 37*

బ్రాహ్మణుడు సొత్తు పోగొట్టుకొని రాజు ద్వారా తిరిగి పొందితే తాను పోగొట్టుకొన్న సొత్తులో ఏ భాగాన్ని రాజుకీయక మొత్తం ధనం పొందుటకతడర్హుడు.

*యం తు పశ్యేన్నిధిం రాజా పురాణం నిహితం క్షితౌ,*
*తస్మాద్ద్విజేభ్యోదత్వార్థమర్థం కోశే ప్రవేశేత్ 38*

*నిధీనాం తు పురాణానాం ధాతూనా మేవ చ క్షితౌ,*
*అర్ధభాగ్రక్షణాద్రాజా భూమేరధిపతిర్హి సః, 39*

*దాతవ్యం సర్వవర్ణేభ్యో రాజ్ఞా చోరైర్హృతం ధనమ్,*
*రాజా తదుపయుంజానశ్చోరస్యాప్నోతి కిల్బిషమ్.40*

సొంతగాడు లేనినిధి రాజుకు దొరికితే దానిలో సగభాగాన్ని బ్రాహ్మణులకు పంచిపెట్టి మిగిలిన సగాన్ని తానే తీసికొనవచ్చును. రాజు భూమికంత ప్రభువుకావున రాజుకు దొరికిన నిధికి స్వంతదారుడెవరు లేనిచో, భూమిలో దొరుకు బంగారం మొదలగు లోహాలకన్నిటియొక్క అర్థ భాగమును అతడు పొందుతాడు. దొంగలెత్తుకొని పోయిన సొత్తును రాజు యజమానికి కప్పగించవలెను. ఆ విధంగా వారి వారి కప్పగించక తానే తీసికొంటే రాజుకూడ దొంగతనం చేసినట్లౌతాడు.

*జాతిజానపదాన్ ధర్మాన్ శ్రేణీధర్మాంశ్చ ధర్మవిత్,*
*సమీక్ష్య కులధర్మాంశ్చ స్వధర్మం ప్రతిపాదయేత్41*

*స్వాని కర్మాణి కుర్వాణా దూరే సంతోఽపి మానవాః,*
*ప్రియా భవంతి లోకస్య స్వే స్వే కర్మణ్యవస్థితాః.42*

ధర్మాలన్ని తెలిసిన రాజు బ్రాహ్మణాది జాతులు, వైశ్యులు, జానపదులు, ఆయాకులాలకు సంబంధించిన ధర్మాలనన్నిటిని తెలిసికొని వివాదపరిష్కారం చేయవలెను. సజ్జనులు దూరంలో నున్నప్పటికీ తమ తమ కుల ధర్మాలను చక్కగా నిర్వర్తిస్తూ ఉంటే అందరికి ప్రియులై ఉంటారు.

*నోత్పాదయేత్స్వయం కార్యం రాజా నాప్యస్యపూరుషః,*
*న చ ప్రాపితమన్యేన గ్రసేదర్థం కథంచన.43*

*యథా నయత్యసృక్పాతైర్మృగస్య మృగయుః పదమ్,*
*నయేత్తథానుమానేన ధర్మస్య నృపతిః పదమ్.44*

*సత్యమర్థం చ సంపశ్యేదాత్మానమథ సాక్షిణః,*
*దేశం రూపం చ కాలం చ వ్యవహారవిధౌ స్థితః.45*

రాజు కాని రాజసేవకుడు కాని తమంతట తాము వివాదాలను సృష్టింపరాదు. అట్లే ధనాది లోభం వల్ల ఇతరులు చెప్పిన వాటిని పెడచెవిని పెట్టకూడదు. వేటకాడు తాను వేటాడిన మృగాన్ని దానిరక్తపు మరకలచే గుర్తించినట్లు రాజు అనుమానప్రమాణం చేత ధర్మతత్వాన్ని తెలిసికొనవలెను. వ్యవహారాన్ని పరిష్కరించే రాజు సరియైన సాక్షులెవరో, దేశకాలాలెట్టివో తెలిసికొనుచు సత్యమైన విషయాన్ని కనిపెట్టవలెను.

*సద్భిరాచరితం యత్స్యాద్ధార్మికైశ్చ ద్విజాతిభిః,*
*తద్దేశకులజాతీనా మవిరుద్ధం ప్రకల్పయేత్.46*

ధర్మశాస్త్రజ్ఞులగు బ్రాహ్మణులు, సజ్జనులు వివాదాలనెట్లు పరిష్కరించినారో ఆ తీరున దేశం, కాలం జాతి, వీనికి విరుద్ధము కాకుండ రాజు వివాదాలను పరిష్కరింపవలెను.

*అధమర్ణార్థసిద్ధ్యర్థముత్తమర్ణేన చోదితః,*
*దాపయేద్ధనిక స్యార్థమధమర్ణాద్విభావితమ్.47*

*యైర్యైరుపాయైరర్థం స్వం ప్రాప్నుయాదుత్తమర్ణికః,*
*తైస్తైరుపాయై స్సంగృహ్య దాపయే దధమర్ణికమ్.48*

## అష్టమాధ్యాయం

తనదగ్గర తీసికొన్న అప్పుగురించి రాజు దగ్గర ఫిర్యాదుచేసినచో అప్పుతీసికొన్నప్పుడు రాసిన పత్రం మొదలైన వాటిని పరీక్షించి ఈ విధంగా ఆ ధనాన్ని రాబట్టి అప్పిచ్చిన వానికి ఇప్పించవలెను. ఈ చెప్పబోవు పద్ధతులతో అప్పును రాబట్టి అప్పిచ్చిన వానికా ధనాన్ని రాజు ఇప్పించవలెను.

*ధర్మేణ వ్యవహారేణ ఛలేనాచరితేన చ,*
*ప్రయుక్తం సాధయేదర్థం పంచమేన బలేన చ.49*

*యః స్వయం సాధయేదర్థముత్తమర్ణోz ధమర్ణికాత్,*
*న స రాజ్ఞాz భియోక్తవ్యః స్వకం సంసాధయన్ ధనమ్.50*

*అర్థేz పవ్యయమానం తు కరణేన విభావితమ్,*
*దాపయేద్ధనికస్యార్థం దండలేశం చ శక్తితః.51*

*అపహ్నవేz ధమర్ణస్య దేహీత్యుక్తస్య సంసది,*
*అభియోక్తా దిశేద్దేశ్యం కరణం వాzన్యదుద్దిశేత్.52*

*అదేశ్యం యశ్చ దిశతి నిర్దిశ్యాపహ్నుతే చ యః,*
*యశ్చాధరోత్తరానర్థాన్ విగీతాన్నావబుధ్యతే53*

*అపదిశ్యాపదేశ్యం చ పునర్యస్త్వపధావతి,*
*సమ్యక్ ప్రణిహితం చార్థం పృష్టస్సన్నాభినందతి.54*

*అసంభావ్యే సాక్షిభిశ్చ దేశే సంభాషతే మిథః,*
*నిరుచ్యమానం ప్రశ్నం చ నేచ్ఛేద్యశ్చాపి నిష్పతేత్.55*

*బ్రూహీత్యుక్తశ్చ న బ్రూయాదుక్తం చ న విభావయేత్,*
*న చ పూ ర్వాపరం విద్యాత్తస్మాదర్థాత్సహీయతే,56*

*సాక్షిణస్సంతి మేత్యుక్త్వా దిశేత్యుక్తో దిశేన్న యః,*
*ధర్మస్థః కారణై రేతై ర్హీనం తమపి నిర్దిశేత్57*

ధర్మం చేత మంచి మాటలు చెప్పించి వ్యవహారంచేత, మోసం చేతగాని, పశువులు మొదలగువానిని తీసికొని అప్పు తీర్చిన తరువాతనే ఇత్తుమని గాని, బలాత్కారంగా గాని తీసికొన్న అప్పును తిరిగి ఇప్పించవలెను. తనంతతానుగా ఏదేని పద్ధతిలో అప్పువసూలు చేసి కొన గలిగినప్పుడు విషయాన్ని రాజు వరకు తీసికొని వెళ్ళరాదు. అప్పుతీసికొని ఎగగొట్టువాని విషయమై పత్రము మొదలగు వాటి ద్వారా అప్పును నిర్ధారించుకొని రాజు ఆ ధనాన్ని అప్పిచ్చిన వానికి ఇప్పించవలెను. పై గా రాజ సమయమును వ్యర్థం చేసినందు వల్ల అప్పుతీసికొన్నవానికి దండుగ సహితము వేయవలెను. అప్పు ఇచ్చి తనకా ధనాన్ని తిరిగి ఇవ్వలేదని రాజసభలో చెప్పు అభియోక్త, అభియోగము వేసిన వాడు తాను ఆ అప్పును ఎచ్చట ఇచ్చెనో, సాక్షి, పత్రం మొదలైనవాటిని సభకు తెలుపాలి. అప్పు ఇవ్వక ఇచ్చినట్లు చెప్పువాడు, ఒక సారి అప్పు ఇచ్చి నట్లు చెప్పినదానిని కప్పి పుచ్చువాడు, ముందొక్క మాట తరువాత ఇంకొక మాట చెప్పి అభియోగాన్ని తారుమారుచేయువాడు ఒక విధముగా

తొలుత చెప్పి తరువాత ఇంకొక విధంగా చెప్పువాడు, తొలుత చెప్పిన దానిపై సభాసదులు అడిగినప్పుడు మౌనముగా ఉండువాడు సాక్షులతో రహస్యంగా ఇట్లు మాట్లాడాలి అని చెప్పిన వాడు (తప్పుడు సాక్ష్యమిప్పించువాడు) తీర్పు చెప్పువాడు అడిగిన ప్రశ్నకు బదులుచెప్పనివాడు, తాను చెప్పిన దానిని నిరూపించలేనివాడు, సాక్షులను సభలో ప్రవేశపెట్టలేని వాడు, వీరినందరిని తీర్పు చెప్పువాడు శిక్షార్హులుగా భావింపవలెను.

*అభియోక్తా న చేద్బ్రూయాద్వధ్యో దండ్యశ్చ ధర్మతః,*
*నచేత్రిపక్షాత్ ప్రబ్రూయాద్ధర్మం ప్రతి పరాజితః.58*

అభియోగం చేసిన వాడు సభలో తనవాదాన్ని నిరూపించుకొనలేకోతే అతనిని రాజు దండిచాలి. అట్లే అభియోగం చేసినవాడు రాజు, ప్రతిపక్షం, తాను అను త్రిపక్షాల మధ్య తాను వేసిన అభియోగాన్ని నిరూపించుకొనలెకపోతే ఆ అభియోగం ఓడినట్లౌతుంది.

*యో యావన్నిహ్నువీతార్థం మిథ్యా యావతి వా వదేత్,*
*తౌ నృపేణ హ్యధర్మజ్ఞౌ దాప్యౌ తద్ద్విగుణం దమమ్59*

అప్పిచ్చినవాడు రాజ సన్నిధిలో తానెక్కువ అప్పిచ్చినట్లు అబద్ధమాడినా, అప్పు తీసికొన్న వాడు అసత్యమాడినా వీరిద్దరకు అప్పు ఇచ్చిన ధనానికి రెండింతలు ధనాన్ని దండుగగా రాజు విధించాలి.

*పృష్టోऽ పవ్యయమానస్తు కృతావస్థో ధనైషిణా,*
*త్ర్యవరైస్సాక్షిభి ర్భావ్యో నృపబ్రాహ్మణసన్నిధౌ.60*

ధనాన్నాశించి తాను అప్పిచ్చినట్లు చెప్పినప్పుడు అతడు రాజ భటులచే పిలవబడి అడిగి సభలో రాజు బ్రాహ్మణులముందు ముగ్గురికి తక్కువకాని సాక్షులను చూపించాలి.

*యాదృశా ధనిభిః కార్యా వ్యవహారేషు సాక్షిణః,*
*తాదృశాన్ సంప్రవక్ష్యామి యథా వాచ్యమృతం చ తైః.61*

అప్పిచ్చినవారు అప్పిచ్చువ్యవహారంలో ఎటువంటి సాక్షులను పెట్టుకొనవలెనో వారిని గురించి వివరింతునని భృగుమహర్షి పలికెను.

*గృహిణః పుత్రిణో మౌలాః క్షత్రవిట్శూద్రయోనయః,*
*అర్థ్యుక్తాః సాక్ష్యమర్హంతి న యే కేచి దనాపది.62*

*ఆప్తాస్సర్వేషు వర్ణేషు కార్యాః కార్యేషు సాక్షిణః,*
*సర్వధర్మవిదో లుబ్ధా విపరీతాంస్తు వర్జయేత్.63*

ఆలు బిడ్డలు కలవారు, స్వదేశానికి చెందిన క్షత్రియులు మొదలగు ఉత్తములు సాధారణంగా అప్పుల విషయంలో సాక్షులుగా ఉండవచ్చును. అన్ని కులాల విషయంలోను ఆప్తులు, సమస్త ధర్మములు తెలిసినవారు, లుబ్ధత్వం లేనివారు, ఐన సాక్షులను పెట్టుకొనవలెను. తక్కినవారు సాక్షులుగా పనికిరారు.

*నార్థసంబంధినో నాప్తా న సహాయా న వైరిణః,*
*న దృష్టదోషాః కర్తవ్యా న వ్యాధ్యార్తా న దూషితాః.64*

*న సాక్షీ నృపతిః కార్యో న కారుకకుశీలవౌ,*
*న శ్రోత్రియో న లింగస్థో న సంగేభ్యో వినిర్గతః.65*

*నాధ్యధీనో న వక్తవ్యో న దస్యుర్న వికర్మకృత్,*
*న వృద్ధో న శిశుర్నైకో నాంత్యో న వికలేంద్రియః.66*

*నార్తో న మత్తో నోన్మత్తో న క్షుత్తృష్ణోపపీడితః,*
*న శ్రమార్తో న కామార్తో న క్రుద్ధో నాపి తస్కరః.67*

తనతో అర్థసంబంధంలేనివారు, ఆప్తులుకాని వారు, సహాయులు, విరోధులు తప్పుచేసినవారు, రోగార్తులు, మహాపాపములు చేసినవారు సాక్షులుగా నుండతగరు. రాజును సాక్షిగా తీసికొనకూడదు. వంటవాండ్లు, సంగీతం పాడువారు, శ్రోత్రియుడు, బ్రహ్మచారి, సన్యాసి వీరిని సాక్షులుగా పెట్టుకొనకూడదు. అట్లే వేదాధ్యయనం చేయువానిని, వృద్ధుని, శిశువును, ఒంటరిగానుండు వానిని, చాండాలుని, మనశ్చాంచల్యం కలవానిని సాక్షిగా పెట్టుకొనకూడదు. ఇంకను తన బంధువుల మరణాదులవల్ల బాధలలో నున్న వానిని, మద్యపానం చేసిన వానిని, పిచ్చివానిని, ఆకలి దప్పికలతోనున్న వానిని, శ్రమార్తుని, కామార్తుని, కోపంతోనున్న వానిని, దొంగను సాక్షులుగా నుంచుకోకూడదు.

*స్త్రీణాం సాక్ష్యం స్త్రియః కుర్యుర్ద్విజానాం సదృశా ద్విజాః,*
*శుద్రాశ్చ సంత శ్శూద్రాణా మంత్యానా మంత్యయోనయః.68*

***అనుభావీతు యః కశ్చిత్కుర్యాత్సాక్ష్యం వివాదినామ్,***
***అంతర్వేశ్మన్యరణ్యే వా శరీరస్యాపి చాత్యయే.69.***

***స్త్రియాఽప్యసంభవే కార్యం బాలేన స్థవిరేణ వా,***
***శిష్యేణ బంధునా వాఽపిదాసేన భృతకేన వా.70***

***బాలవృద్ధాతురాణాం చ సాక్ష్యేషు వదతాం మృషా,***
***జానీయాదస్థిరాం వాచముత్సిక్తమనసాం తథా.71***

స్త్రీల వ్యవహారాల్లో స్త్రీలే సాక్షులుగా ఉండవలెను. బ్రాహ్మణుల వ్యవహారంలో తోటి బ్రాహ్మణులనే సాక్షులుగానుంచుకొనవలెను. అట్లే ఏ కులాల వారు ఆకులాల వారినే సాక్షులుగా పెట్టుకొనుట మంచిది. ఇంటిలోపల, అరణ్యంలో, మరణసమయంలో వాదప్రతివాదాల సమయంలో కన్నులారచూచినవాడు సాక్షికావచ్చును. ఆయా కులాలవారే అప్పుడు సాక్షికావలెనను నియమములేదు. ఇంటిలోపల జరుగు వాదప్రతివాదాలకు స్త్రీలు కూడ సాక్షులుకావచ్చును. వారు లేనప్పుడు, కూలివాడు ఎవరైనను కన్నులార జూచినవారు సాక్షులు కావచ్చును. బాలురు వృద్ధులు, రోగంతో ఉన్నవారు, అబద్ధం చెప్పువారు తత్తర పడుమనస్సు కల్గవారు సాక్ష్యమిచ్చునప్పుడు వారి సాక్ష్యంలోని నిజాన్ని వారి ప్రవర్తన, ముఖకవళికలు మొదలైన వాటి ద్వారా గుర్తించవలెను.

*సాహసేషు చ సర్వేషు స్తేయసంగ్రహణేషు చ,*
*వాగ్దండయోశ్చ పారుష్యే న పరీక్షేత సాక్షిణః.72*

ఇల్లు తగలబెట్టుట, దారిదోపిడి చేయుటవంటి సాహసకార్యాలందు. దొంగ తనం, పర స్త్రీలనుంచుకొనుట, తిట్టుట, కొట్టుట వీనియందు సాక్షులను విచారింపవలసిన పనిలేదు.

*బహుత్వం పరిగృహ్ణీయా త్సాక్షిద్వైధే నరాధిపః,*
*సమేషు తు గుణోత్కృష్టాన్ గుణిద్వైధే ద్విజోత్తమాన్.73*

*సమక్షదర్శనాత్సాక్ష్యం శ్రవణాచ్చైవ సిద్ధ్యతి,*
*తత్ర సత్యం బ్రువన్ సాక్షీ ధర్మార్థాభ్యాం న హీయతే.74*

*సాక్షీ దృష్టశ్రుతాదన్యద్విబ్రువన్నార్యసంసది,*
*అవాఙ్నరకమభ్యేతి ప్రేత్య స్వర్గాచ్చ హీయతే.75*

*యత్రానిబద్ధోऽ పీక్షేత శృణుయాద్వాపి కించన,*
*పృష్టస్తత్రాపి తద్బ్రూయా ద్యథాదృష్టం యథాశ్రుతమ్.76*

*ఏకో లుబ్ధస్తు సాక్షీ స్యాద్బహ్వ్యః శుచ్యోऽపి న స్త్రియః,*
*స్త్రీబుద్ధేరస్థిరత్వాత్తు దోషైశ్చాన్యేऽపి యే వృతాః77*

సాక్షులు వేరు వేరుగా చెప్పినప్పుడు ఎక్కువ మంది చెప్పిన దానిని గ్రహించాలి. సాక్షులందరు ఒకే విధమైన సాక్ష్యాన్నిచ్చినప్పుడు గుణవంతుడు చెప్పిన సాక్ష్యాన్ని గ్రహించాలి. అందరుగుణవంతులేఐతేద్విజోత్తముని సాక్ష్యాన్ని వాటిలోమిన్నగా తీసికోవాలి. సాక్షి తన కంటితో చూచిన దానిని, చెవులతో విన్న దానిని సాక్ష్యంగా చెప్పవచ్చును. సాక్షి అబద్ధం చెప్పకపోతే ధర్మార్థాలకు దూరం కాడు. సాక్షి సజ్జనులున్న సభయందు అబద్ధాలు చెప్పితే చనిపోయిన తరువాత స్వర్గదూరుడై తలక్రిందులుగా నరకానికి పోతాడు. తన్ను సాక్షిగా పిలువక పోయినా తాను ఆ దుష్కార్యాన్ని కన్నులారా చూచినచో లేక తాను ఆ వృత్తాంతాన్ని స్వయంగా విన్నచో తాను చూచిన దానిని తాను విన్న దానిని పూర్తిగా సభలో నివేదించవలెను. సాక్షులలో స్త్రీకంటె పురుషుడు గొప్పవాడు. లోభంలేని పురుషుడొక్కడైనా పవిత్రులైన అనేక స్త్రీలకంటె గొప్పవాడు. కారణమేమనగా స్త్రీ బుద్ధి స్థిరమైంది కాదు అట్లే వారు అనేక దోషములున్న వారు కాబట్టి పురుషుని సాక్ష్యము చాలా గొప్పది.

*స్వభావేనైవ యద్బ్రూయుస్తద్గ్రాహ్యం వ్యావహారికమ్,*
*అతో యదన్యద్విబ్రూయుర్ధర్మార్థం తదపార్థకమ్.78*

సాక్షులు స్వభావసిద్ధంగా భయం మొగమాటం లేక చెప్పిన సాక్ష్యాన్ని మాత్రమే గ్రహించాలి. దానికి విరుద్ధంగా చెప్పిన దాన్ని గ్రహించవద్దు.

*సభాంతస్సాక్షిణః ప్రాప్తానర్థిప్రత్యర్థిసన్నిధౌ,*
*ప్రాడ్వివాకోऽనుయుంజీత విధినా తేన సాంత్వయన్.79*

ధర్మజ్ఞుడైన ప్రాడ్వివాకుడు (న్యాయ నిర్ణేత) సభలోకి వచ్చి అర్థి ప్రత్యర్థుల దగ్గర సాక్షులతో మంచి మాటలు పల్కుచు ఇట్లు పలుకవలెను.

*యద్ద్వయోరనయోర్వేత్థ కార్యే ఽస్మిన్ చేష్టితం మిథః,*
*తద్బ్రూత సర్వం సత్యేన యుష్మాకం హ్యత్ర సాక్షితా.80*

*సత్యం సాక్ష్యే బ్రువన్ సాక్షీ లోకానాప్నోతి పుష్కలాన్,*
*ఇహచానుత్తమాం కీర్తిం వాగేషా బ్రహ్మపూజితా.81*

*సాక్ష్యే ఽనృతం వదన్ పాశైర్బధ్యతే వారుణైర్భృశమ్,*
*వివశశ్శతమాజాతీ స్తస్మాత్సాక్ష్యం వదేదృతమ్.82*

*సత్యేన పూయతే సాక్షీ ధర్మస్సత్యేన వర్ధతే,*
*తస్మాత్సత్యం హి వక్తవ్యం సర్వవర్ణేషు సాక్షిభిః.83*

*ఆత్మైవ హ్యాత్మనస్సాక్షీ గతిరాత్మా తథాఽఽత్మనః,*
*మాఽవమంస్థాః స్వమాత్మానం నృణాం సాక్షిణముత్తమమ్.84*

*మన్యంతే వై పాపకృతో న కశ్చిత్పశ్యతీతి నః,*
*తాంస్తు దేవాః ప్రపశ్యంతి స్వస్యైవాంతరపూరుషః.85*

*ద్యౌర్భూమిరాపో హృదయం చంద్రార్కాగ్నియమానిలాః,*
*రాత్రిస్సంధ్యే చ ధర్మశ్చ వృత్తజ్ఞాస్సర్వదేహినామ్,86*

ఈ కార్యంలో వాదిప్రతివాదులు చేసిన కార్యం మీకు తెలిసిన దానిని తెలిసినట్లు మీరు చెప్పండి. మిమ్ములను వాదిప్రతివాదులిద్దరు సాక్షులుగా కోరినారు. కావున నిజమైన సాక్ష్యం చెప్పవలెను. సాక్షి సత్యమైన విషయాన్ని చెప్తే ఉత్కృష్టమైన లోకాలకు పోతాడు. ఈ లోకంలో కూడ గొప్పనైన కీర్తి పొందుతాడు. సత్యమైన మాటను బ్రహ్మదేవుడు కూడ గౌరవిస్తాడు. కావున సత్యాన్ని పలుకుమని చెప్పవలెను. అట్లే అబద్ధపు సాక్ష్యం చెప్తే వరుణపాశాలచే కట్టబడి జలోదర రోగ పీడితుడై నూరు జన్మలు బాధలు పొందుతాడు. కావున సత్యాన్నే పలుకవలెను. సత్యమైన సాక్ష్యం చెప్పినందువల్ల అతడు పవిత్రుడౌతాడు. సత్యవచనం వలన ధర్మం అభివృద్ధి చెందుతుంది. అందువల్ల అన్ని కులాల వారుసాక్ష్యం పలుకునపుడు సత్యాన్నే పలుకవలెను. తాను చేసిన పుణ్య పాపాలకు ఆత్మయేసాక్షి. దీనికి ఆత్మయే దిక్కు. తాము చేసిన కార్యాలకు సాక్షియైన అంతరాత్మను ఎప్పుడు కూడ అవమానించవద్దు. పాప కార్యాలు చేసేవారు తాము చేయు పాప కార్యాలను ఎవ్వరు చూస్తూ లేరని అనుకొంటారు కాని ఆ పాప కార్యాలను దేవతలు, అంతరాత్మ గమనిస్తూనే ఉంటాయి. మనం చేసే పుణ్యాఽపుణ్య కర్మలను భూమ్యాకాశాలు, నీరు. హృదయం, చంద్రుడు, సూర్యుడు, అగ్ని, యముడు, వాయువు. రాత్రి, ఉభయసంధ్యలు, ధర్మ దేవత వీరందరు చూస్తూనే ఉన్నారు.

*దేవబ్రాహ్మణసాన్నిధ్యే సాక్ష్యం పృచ్ఛేదృతం ద్విజాన్,*
*ఉదఙ్ముఖాన్ ప్రాఙ్ముఖాన్వా పూర్వాహ్ణే వై శుచిశ్శుచీన్ 87*

శుచియైన ధర్మ పరీక్షకుడు దేవబ్రాహ్మణుల సమీపంలో శుచియైన సాక్షులను తూర్పు లేక ఉత్తర దిక్కునకు ముఖం పెట్టించి ప్రొద్దటి పూటనే విచారింపవలెను.

*బ్రూహీతి బ్రాహ్మణం పృచ్ఛేత్సత్యం బ్రూహీతి పార్థివమ్,*
*గోబీజకాంచనైర్వైశ్యం శూద్రం సర్వైస్తు పాతకైః.88*

*బ్రహ్మఘ్నో యే స్మృతా లోకా యే చ స్త్రీబాలఘాతినః,*
*మిత్రద్రుహః కృతఘ్నస్య తే తే స్యుర్ర్బువతో మృషా.89*

*జన్మప్రభృతి యత్కించిత్పుణ్యం భద్ర త్వయా కృతమ్,*
*తత్తే సర్వం శునో గచ్ఛేద్యది బ్రూయా స్త్వమన్యథా.90*

*ఏకోzహమస్మీత్యాత్మానం యత్త్వం కల్యాణ మన్య సే,*
*నిత్యం స్థిత స్తే హృద్యేష పుణ్యపాపేక్షితా మునిః.91*

*యమో వైవస్వతో దేవోయస్తవైష హృది స్థితః,*
*తేన చేదవివాదస్తే మా గంగాం మా కురూన్ గమః 92*

*నగ్నో ముండః కపాలేన భిక్షార్థీ క్షుత్పిపాసితః,*
*అంధశ్శత్రుకులం గచ్ఛేద్యస్సాక్ష్య మనృతం వదేత్ 93*

*అవాక్ఛిరాస్తమస్యంధే కిల్బిషీ నరకం వ్రజేత్,*
*యః ప్రశ్నం వితథం బ్రూయాత్పృష్టస్సన్ ధర్మ నిశ్చయమ్ 94*

*అంధో మత్స్యానివాశ్నాతి స నరః కంటకైస్సహ,*
*యో భాషతేzర్థ వైకల్య మప్రత్యక్షం సభాం గతః 95*

సాక్షులు సాక్ష్యం చెప్పునప్పుడు సాక్షి బ్రాహ్మణుడైనచో అతనిని ధర్మపరీక్షకుడు
క్ష్యము చెప్పుమని మాత్రమడుగవలెను. క్షత్రియుని సత్యము చెప్పుమని అడుగవలెను.
ైశ్యని నీవబద్ధమాడితే ఆవులు మొదలగువాటిని అపహరించిన పాపము లభిస్తుందని
ావలెను. ఇక సాక్షి శూద్రుడైనచో నీకు సమస్త పాపాలు సంభవిస్తాయి. కావున సత్యం
ుకుమని అనవలెను. బ్రహ్మహత్య చేసినవాడు, స్త్రీ బాల హత్యలు చేసినవాడు, మిత్ర
హి, కృతఘ్నుడు పొందు లోకాలు నీకు అబద్ధం చెప్పటవల్ల కలుగుతాయి. అట్లే నీవు
ద్ధపు సాక్ష్యం చెప్తే పుట్టినప్పటినుండి నీవు చేసిన పుణ్యాలన్నీ నీవు పెంచిన కుక్కకు
క్రమిస్తాయని చెప్పవలెను. ఓ పుణ్యాత్ముడా నేనొక్కణ్ణే ఉన్నానని అనుకుంటున్నావు
ి నీ శరీరంలో నీ పుణ్య పాపాలను గమనిస్తున్న పరమాత్మ కూడ ఉన్నాడన్న విషయాన్ని
ువ వద్దని చెప్పవలెను. నీ హృదయంలో ఎల్లప్పుడు యమ ధర్మరాజుండి నీవుచేయు
్యాలన్నీ గమనిస్తున్నాడుకావున అతనితోధర్మాచరణ విషయంలో నీకు వివాదం లేనిచో
ానదిలోమునుగవలసిన అవసరంలేదు కురుక్షేత్రానికి పోనవసరం లేదు. అందువలన
్యన్నే పల్కుము. అబద్ధమైన సాక్ష్యం చెప్పువాడు దిగంబరుడు, ముండుడై, గ్రుడ్డివాడై,
ులంలో భిక్షకై శత్రువుల ఇండ్లకు పోవును. అతడు మరణానంతరం తలక్రిందులుగా
కానికి పోవును. ఇంకా అతడు గుడ్డివానివలె ముండ్లతోనున్న చేపలు తినును.

*యస్య విద్వాన్ హి వదతః క్షత్రజ్ఞో నాభిశంకతే,*
*తస్మాన్న దేవాః శ్రేయాంసం లోకేzన్యం పురుషం విదుః 96*

# అష్టమాధ్యాయం

*యావతో బాంధవాన్ యస్మిన్ హంతి సాక్ష్యేz నృతం పదన్,*
*తావతస్సంఖ్యయా తస్మిన్ శృణు సౌమ్యానుపూర్వశః 97*

సభలో సాక్ష్యం పలుకుతున్నప్పుడు అంతరాత్మ అబద్ధమాడుచున్నట్లు శంకించని వాడు చాలా గొప్పవాడని దేవతలు పలుకుతారు. తాను అబద్ధపు సాక్ష్యం పలికేవాడు ఎందరిని చంపుచున్నాడను విషయాన్ని మీకు వివరిస్తానని భృగు మహర్షి పలికెను.

*పంచ పశ్వనృతే హంతి దశ హంతి గవానృతే,*
*శతమశ్వానృతే హంతి సహస్రం పురుషానృతే, 98*

*హంతి జాతా నజాతాంశ్చ హిరణ్యార్థే నృతం వదన్,*
*సర్వం భూమ్యనృతే హంతి మాస్మ భూమ్యనృతం వదీః.99*

*అప్సు భూమివదిత్యాహుః స్త్రీణాం భోగే చ మైథునే,*
*అబ్జేషు చైవ రత్నేషు సర్వేష్వశ్మమయేషు చ.100*

పశువులకు సంబంధించిన వివాదంలో అబద్ధమాడితే ఐదుగురిని చంపిన పాపాన్ననుభవిస్తాడు, ఆవుకు సంబంధిచింన వివాదంలో అబద్ధపు సాక్ష్యంచేస్తే పది మందిని చంపిన పాపాన్ని అనుభవిస్తాడు. గుఱ్ఱం గురించి అబద్ధమాడితే నూరుగురిని చంపిన పాపాన్ని పురుషునికి సంబంధించి అబద్ధపు సాక్ష్యం చెప్తె వేయిమందిని చంపిన పాపానికి గురియౌతాడు. బంగారము గురించి అబద్ధపు సాక్ష్యం చెస్తే పుట్టినవారిని పుట్టబోవు వారిని చంపిన పాపానికి గురియౌతాడు. భూమి విషయమై అబద్ధమాడితే సర్వ ప్రాణి హింసా ఫలితం లభిస్తుంది. కావున భూమి విషయమై అబద్ధమాడరాదు. గంటలు, బావులు మొదలగు నీటి విషయంలో స్త్రీ సంభోగంలో శంఖాలు, ముత్యాలు, వజ్ర వైడూర్యాది సకల రత్న విషయంలోను అబద్ధపు సాక్ష్యం చెప్తే భూమి విషయంలో అబద్ధం చెప్పినట్లు సర్వప్రాణి హింస చేసిన ఫలితం లభిస్తుంది.

*ఏతాన్ దోషా నవేక్ష్య త్వం సర్వాననృతభాషణే,*
*యథాశ్రుతం యథాదృష్టం సర్వమేవాంజసా వద.101*

అబద్ధం చెప్పడంలో ఇన్ని దోషాలున్నాయి కాబట్టి నీవు చూచిన దానిని నీవు విన్నా దానిని వెంటనే చెప్పుమని న్యాయం నిర్ణయించే ప్రాడ్వివాకుడు పలుకవలెను.

*గోరక్షకాన్వాణిజికాం స్తథా కారుకుశీలవాన్,*
*ప్రేష్యాన్ వార్ధుషికాంశ్చైవ విప్రాన్ శూద్రవదాచరేత్.102*

ఆవులమేపుకొనుచు, వర్తకం చేస్తూ, వంట చేస్తూ, శిల్పులుగా, సేవకులుగా ఉంటూ వడ్డీ తీసికొంటూ బ్రతికే బ్రాహ్మణులను శూద్రులను అడిగినట్లే ధర్మాధికారి ప్రశ్న వేయాలి.

*తద్వదన్ ధర్మతో zర్థేషు జానన్నప్యన్యథా నరః,*
*న స్వర్గాచ్చ్యవతే లోకాద్దైవీం వాచం వదంతి తామ్.103*

ఈ క్రింది సమయాల్లో సాక్షి సభలో అబద్ధమాడినప్పటికీ స్వర్గం నుండి భ్రంశం చెందడు. పైగా అతని మాట దేవతలమాటగా గౌరవాన్ని పొందుతుంది.

*శుద్రవిట్ క్షత్ర విప్రాణాం యత్రర్తోక్తౌ భవేద్వథః,*
*తత్ర వక్తవ్యమనృతం తద్ధి సత్యాద్విశిష్యతే.104*

*వాగ్దైవత్యైశ్చ చరుభిర్యజేరంస్తే సరస్వతీమ్,*
*అనృతస్యైనసస్తస్య కుర్వాణా నిష్కృతిం పరామ్.105*

*కూశ్మాండైర్వాపి జుహుయాద్ఘృతమగ్నౌ యథావిధి,*
*ఉదిత్యృచా వా వారుణ్యా తృచేనాబ్దేవతేన వా.106*

తాను సత్యం పలికితే మరణదండన పడుతుందని నిర్ణయించుకున్న సందర్భంలో సత్యమాడరాదు. అప్పుడు పల్కిన అసత్యం నిజం కంటె చాలా గొప్పది. అట్లు అబద్ధమాడినవారు అసత్య దోష పరిహారార్థం సరస్వతీ దేవతాకమైన మంత్రాలతో సరస్వతీ దేవి గురించి హోమం చేయాలి. యజుర్వేదానికి సంబంధించిన కూష్మాండ మంత్రాలచేత, ఉదుత్తమమను వరుణదేవతాకమైన ఋక్కుతోనూ, జల దేవతాకమైన అపోహిష్ఠామయోభువః అనే మంత్రంతో అగ్నియందాజ్యముతో హోమం చేయాలి.

*త్రిపక్షాదబ్రువన్ సాక్ష్యమృణాదిషు నరోz గదః,*
*తదృణం ప్రాప్నుయాత్సర్వం దశ బంధం చ సర్వతః.107*

*యస్య దృశ్యేత సప్తాహాదుక్తవాక్యస్య సాక్షిణః;*
*రోగోzగ్నిర్జ్ఞా తిమరణమృణం దాప్యో దమం చ సః.108*

*అసాక్షికేషు త్వర్థేషు మిథో వివదమానయోః,*
*అవిందంత్సర్వతస్సత్యం శపథేనాపి లంభయేత్.109*

*మహర్షిభిశ్చ దేవైశ్చ కార్యార్థం శపథాః కృతాః,*
*వసిష్ఠశ్చాపి శపథం శేపే పైజవనే నృపే.110*

*న వృథాశపథం కుర్యాత్స్వల్పేzవ్యర్థే నరో బుధః,*
*వృథా హి శపథం కుర్వన్ ప్రేత్య చేహ చ నశ్యతి.111*

*కామినీషు వివాహేషు గవాం భక్ష్యేతథేంధనే,*
*బ్రాహ్మణాభ్యుపపత్తౌ చ శపథే నాస్తి పాతకమ్.112*

రోగం లేని తన సాక్షిని మూడు వారాలలో సదస్సులో ప్రవేశ పెట్టలేనిచో అప్పుతీసికొన్న వాడా అప్పునంతయు తిరిగి ఇవ్వాలి. ఇంకా రాజుకు తాను తీసికొన్న అప్పులో పదవ వంతును దండుగగా చెల్లించాలి. అప్పు తీసికొన్నవివాదంలో సాక్ష్యం చెప్పిన ఏడు దినాల్లో సాక్షియొక్క ఇల్లు తగలబడిపోవుట, అతనికి జ్వరం వచ్చుట, అతని జ్ఞాతుల మరణం వంటివి సంభవిస్తే ఆ సాక్షి తప్పుడు సాక్ష్యమిచ్చినందు వలననే ఇటువంటివి సంభవించినవని భావించి అప్పుతీసికొన్నవానిచే అప్పునిప్పించాలి. రాజుకూడ కొంత భాగాన్ని దండుగగా తీసికొనవచ్చు. సాక్షి లేని సందర్భంలో వాది ప్రతివాదులిద్దరు వాద ప్రతి వాదాలకు

దిగినప్పుడు వారి వారి మాటల వల్ల సత్యమేదో తెలియని సమయంలో ప్రమాణం చేయించి వారి ధనాన్ని వారికిప్పించవలెను. పూర్వం మహర్షులు, దేవతలు సత్యాన్ని నిరూపించటానికి శపథం చేసినారు. వసిష్ఠుడు తన నూరుగురు పుత్రులను చంపినాడని విశ్వామిత్రుడారోపించగా తన పరిశుద్ధిని తెలుపుటకై పిజవనుని కొడుకైన సుదాముడనే రాజు దగ్గర వసిష్ఠుడు పూర్వం శపథం చేసినాడు. చిన్న చిన్న విషయాలపై అనవసరంగా శపథం చేయకూడదు. వ్యర్థంగా శపథం చేయువాడు ఇహలోకంలో పరలోకంలో కూడ నశిస్తాడు. స్త్రీల విషయంలో, వివాహ విషయంలో, ఆవులకు కావలసిన గడ్డి మొదలగు వాటికై, అగ్నిహోత్రానికి కావలసిన ఇంధనాలకై, బ్రాహ్మణుని రక్షించుటకై అబద్ధపు ప్రమాణం చేసినా దోషమంటదు.

*సత్యేన శాపయేద్విప్రం క్షత్రియం వాహనాయుధైః,*
*గోబీజకాంచనైర్వైశ్యం శూద్రం సర్వైస్తు పాతకైః.113*

*అగ్నింవాహా రయేదేనమప్సు చైనం నిమజ్జయేత్,*
*పుత్రదారస్య వాప్యేనం శిరాంసి స్పర్శయేత్పృథక్.114*

*యమిద్ధో న దహత్యగ్ని రాపో నోన్మజ్జయంతి చ,*
*న చార్తిమృచ్ఛతి క్షిప్రం స జ్ఞేయశ్శపథే శుచిః.115*

*వత్సస్య హ్యభిశ స్తస్య పురా భ్రాత్రా యవీయసా,*
*నాగ్నిర్దదాహ రోమాపి సత్యేన జగతః స్పశః.116*

ప్రమాణం చేయవలసిన సమయంలో బాహ్మణుని " సత్యంగా పలుకుమని", క్షత్రియునితో "నేనబద్ధమాడితే నా వాహనాయుధాలన్నీ నశిస్తాయని, వైశ్యునితో" "నా గో, ధన ధాన్యాలు నశిస్తాయని", శూద్రునితో "నాకు సమస్త పాత కాలంటుకుంటాయని" శపథం చేయించాలి. బాగుగా కాలిన ఇనుప గుండును ఏడు రాగి ఆకులపై నుంచి ప్రమాణం చేయించాలి. లేకపోయినచో నీటిలోముంచి ప్రమాణం చేయించాలి. అదీకానిచో భార్యాపుత్రుల తలలపై విడివిడిగా చేతులు పెట్టించి ప్రమాణం చేయించాలి. ఆ సమయంలోఅగ్ని దహింపకపోతే, నీటిలో ముంచినా ఎక్కువ బాధ కలుగకపోతే, తనవారికి రోగాదులు రాకపోతే, ఆ శపథం సరియైందని తెలిసికోవచ్చును. పూర్వం వత్సుడనే మహర్షిని అతని సవతి తమ్ముడు "నీవు బ్రాహ్మణుడవు కావని" నిందింపగా వత్స మహర్షి అగ్ని ప్రవేశం చేసినాడు. ఐనా అతనినా అగ్ని దహింప లేక పోయింది. ఇట్లు ప్రమాణాలతో మానవుల మాటలలో ఉన్న సత్యాసత్యాలను తెలిసికొనవచ్చును.

*యస్మిన్ యస్మిన్ వివాదే తే కౌటసాక్ష్యం కృతం భవేత్,*
*తత్తత్కార్యం నివర్తేత కృతం చాప్యకృతం భవేత్.117*

*లోభాన్మోహాద్భయా న్మైత్రా త్కామాత్క్రోధా త్తథైవ చ,*
*అజ్ఞానాద్బాలభావాచ్చ సాక్ష్యం వితథముచ్యతే.118*

*ఏషామన్యతమే స్థానే యస్సాక్ష్య మనృతం వదేత్.*
*తస్య దండవిశేషాం స్తు ప్రవక్ష్యామ్యనుపూర్వశః.119*

వివాదములందు కూట సాక్ష్యం చెప్పితే ఆ విచారం పూర్తి కానిచో చెప్పిన సాక్ష్యాన్ని వదలి వేసి మళ్ళీ ఆ వివాదాన్ని విచారించాలి. లోభంవల్ల, అజ్ఞానం వల్ల, బాలభావంవల్ల జనులు తప్పుడు సాక్ష్యాన్ని పలుకవచ్చును. పై వాటిలో ఒక్కొక్క దానికి వేయాల్సిన శిక్షలను మీకువివరిస్తానని మహర్షులతో భృగుమహర్షి పలికినాడు.

*లోభాత్సహస్రం దండ్యస్తు మోహాత్పూర్వంతు సాహసమ్,*
*భయాద్వౌ మధ్యమౌ దండౌ మైత్రాత్పూర్వం చతుర్గుణమ్.120*

*కామా ద్దశగుణం పూర్వం క్రోధాత్తు త్రిగుణం పరం ।*
*అజ్ఞానాత్ ద్వే శతే పూర్ణే బాలిశ్యాచ్ఛతమేవతు ॥121*

లోభంవల్ల తప్పుడు సాక్ష్యం చెప్పిన వానికి వేయి రెట్లు దండన విధించాలి. మోహం వల్ల చెప్పిన అబద్ధపు సాక్ష్యాన్ని ప్రథమ సాహసం, భయంవల్ల చేసిన దానికి మధ్యమసాహసం, మైత్రి వల్లచెప్పిన అబద్ధపు సాక్ష్యానికి ప్రథమ సాహసానికి నాలుగురెట్లు దండన విధించాలి. అట్లే కామం వల్ల చేస్తే పది రెట్లు ప్రథమ సాహసాన్ని, క్రోధంవల్ల మూడింతలు ప్రథమ సాహసాన్ని మూర్ఖతవల్ల చేస్తే నూరురెట్లెక్కువ ప్రథమసాహసాన్ని దండనగా విధించాలి.

*ఏతనాహుః కౌటసాక్ష్యే ప్రోక్తాన్ దండాన్ మనీషిభిః,*
*ధర్మస్యావ్యభిచారార్థ మధర్మ నియమాయ చ 122*

ధర్మం లోపించక, అధర్మం నడవకుండ ఉండుటకై అబద్ధపు సాక్ష్యాములు చెప్పిన వారికి పై దండనలను పెద్దలు విధించినారు.

*కౌటసాక్ష్యం తు కుర్వాణాంస్త్రీన్వర్ణాన్ ధార్మికో నృపః,*
*ప్రవాసయేద్దండయిత్వా బ్రాహ్మణం తు వివాసయేత్ 123*

*దశ స్థానాని దండస్య మనుస్వాయంభువోఽబ్రవీత్,*
*త్రిషు వర్ణేషు యాని స్యురక్షతో బ్రాహ్మణో వ్రజేత్ 124*

*ఉపస్థ ముదరం జివ్హా హస్తే పాదే చ పంచమమ్,*
*చక్షుర్నాసా చ కర్ణౌ చ ధనం దేహ స్తథైవ చ. 125*

ధార్మికుడైన రాజు కూటసాక్ష్యం చెప్పే స్త్రీలకు దండుగ వేసి దేశబహిష్కార శిక్షను విధించాలి. అట్లే కూటసాక్ష్యం చెప్పే బ్రాహ్మణులకు దేశబహిష్కార శిక్షను మాత్రం వేయాలి. క్షత్రియాదులకు శరీర శిక్ష విధించేటప్పుడు పదిస్థానాలందు మాత్రమే కొట్టవలెనని మనువు చెప్పినాడు. బ్రాహ్మణునికి మాత్రం దేశబహిష్కారమే శిక్షగాని శరీరశిక్ష మాత్రం విధించకూడదు. ఉపస్థ, కడుపు, నాలుక, చేతులు, కాళ్ళు, కన్ను, ముక్కు, చెవి, ధనము, దేహము లనునవి పదిస్థానములు.

*అనుబంధం పరిజ్ఞాయ దేశకాలౌ చ తత్త్వతః,*
*సారాపరాధౌ చాలోక్య దండం దండ్యేషు పాతయేత్ 126*

*అధర్మదండనం లోకే యశోఘ్నం కీర్తినాశనమ్,*
*అస్వర్గ్యం చ పరత్రాపి తస్మాత్తత్పరివర్జయేత్ 127*

*అదండ్యాన్ దండయన్రాజా దండ్యాం శ్చై వాప్యదండయన్,*
*అయశో మహదాప్నోతి నరకం చైవ గచ్ఛతి 128*

*వాగ్దండం ప్రథమం కుర్యాద్ధిగ్దండం తదనంతరమ్,*
*తృతీయం ధనదండం తు వధదండమతః పరమ్ 129*

*వధేనాపి యదా త్వేతాన్ని గ్రహీతుం న శక్నుయాత్*
*తదైషు సర్వమ ప్యేతత్ ప్రయుంజీత చతుష్టయమ్ 130*

మాటిమాటికి బుద్ధిపూర్వంగాను అపరాధము చేయుట, దేశకాలాలు, అపరాధం చేసిన వాని బలం, ఆతడు చేసిన అపరాధతీవ్రతను, గుర్తించి తప్పులు చేసినవారిని దండించవలెను. అన్యాయంగా దండిస్తే ఇహ,పర లోకములందుకీర్తినశిస్తుంది. వారికి స్వర్గ సుఖం సైతం నశిస్తుంది. కావున తప్పు చేసినట్లు భావించి అన్యాయంగా దండించకూడదు. దండింప తగని వారిని దండిస్తూ దండనకు యోగ్యులైన వారిని దండింపక వదలిపెట్టు రాజు ఇహమున చెడ్డ పేరును పొందుచు పరమున నరకానికి పోవును. సాధారణంగా తప్పు చేసిన వానికి నీవు చేసిన పని మంచిదికాదు, దీనిని మళ్ళీ చేయవద్దని బెదిరిస్తూ వాగ్దండము చేయవలెను. అటు పిమ్మట ధిగ్దండము (ఛీకొట్టుట) చేయవలెను. అప్పటికి తప్పు చేస్తే కొరడాతో కొట్టుట, అంగముఛేదించుట వంటి శరీర దండమును విధించవలెను. శారీరక దండము చేసినను మాటిమాటికి తప్పులు చేసినచో వాగ్దండాది దండములనన్నిటవిని కలిపి విధించవచ్చును.

*లోక సంవ్యవహారార్థం యాస్సంజ్ఞాః ప్రథితా భువి*
*తామ్రరూప్య సువర్ణానాం తాః ప్రవక్ష్యామ్యశేషతః 131*

నాణెములు: రాగి, వెండి, బంగారు నాణెములకు ఏయే పేర్లు లోకమున ప్రసిద్ధి చెందినవో వాటినన్నిటిని మీకు తెల్పెదను.

*జాలాంతరగతే భానౌ యత్సూక్ష్మం దృశ్యతే రజః,*
*ప్రథమం తత్ ప్రమాణానాం త్రసరేణుం ప్రచక్షతే 132*

*త్రసరేణవోऽ ష్టావిజ్ఞేయా లిక్షైకా పరిమాణతః,*
*తా రాజసర్షప స్తిస్ర స్తే త్రయో గౌరసర్షపః 133*

*సర్షపాష్షడ్యవో మధ్యస్త్రియవం త్వేకకృష్ణలమ్,*
*పంచకృష్ణలకో మాషస్తే సువర్ణస్తు షోడశ 134*

*పలం సువర్ణాశ్చత్వారః పలాని ధరణం దశ,*
*ద్వే కృష్ణలే సమధృతే విజ్ఞేయో రౌప్య మాషకః 135*

*తే షోడశ స్యాద్ధరణం పురాణ శ్చైవ రాజతః,*
*కార్షాపణస్తు విజ్ఞేయస్తామ్రికః కర్షకః పణః 136*

*ధరణాని దశ జ్ఞేయః శతమానస్తు రాజతః,*
*చతుస్సౌవర్ణికో నిష్కో విజ్ఞేయస్తు ప్రమాణతః 137*

*పణానాం ద్వే శతే సార్ధే ప్రథమస్సాహసః స్మృతః,*
*మధ్యమ పంచ విజ్ఞేయః సహస్రం త్వేవ చోత్తమః 138*

ఇంటిలోనికి సూర్యకిరణాలు ప్రసరిస్తున్నప్పుడు దానిలో కనిపించు సూక్ష్మమైన దుమ్మును త్రసరేణుఅని అంటారు. అది పరిమాణాల్లోకెల్ల మొదట ఎన్నతగింది. ఎనిమిది త్రసరేణువులు కలిసినచో దానిని లిక్ష అనిఅంటారు. లిక్షలు మూడు కలిసినచో ఒక రాజ సర్షపము (పెద్ద ఆవగింజ). రాజసర్షపములు మూడు కలిస్తే ఒక గౌరసర్షపము. ఆరు గౌరసర్షపములు కలిస్తే సామాన్యమైన ఒక యవము. మూడు యవములు ఒకగురిగింజ. పది గురిగింజలు ఒక మాసము, పదునారు మాసాలు ఒక సువర్ణం. నాలుగు సువర్ణములు ఒక పలము. నాలుగు పలములు ఒక ధరణం. ఇక రెండు గురిగింజలు వెండి మాసము. పదహారు వెండిమాసములు ఒక ధరణము, దీనికే పురాణమని పేరు. ఇది వెండితో చేయబడింది. రాగితో చేయబడిన కర్షక పణాన్నే కార్షాపణమని కూడ అంటారు. కార్షికం రెండుపలాలుంటాయి. పది రాజత ధరణాలు రాజతశతమానమనబడును. నాలుగు సువర్ణాలు నిష్కమౌతుంది. రెండువందల యాభై పణాలు ప్రథమసాహసమని , ఐదువందల పణాలు మధ్యమసాహసమని, వేయి పణాలు ఉత్తమ సాహసమని పిలుస్తారు. పణం అనగా రూక .

*ఋణే దేయే ప్రతిజ్ఞాతే పంచకం శతమర్హతి,*
*అపహ్నవే తద్ద్విగుణం తన్మనోరనుశాసనమ్ 139*

తానుఅప్పివ్వవలసిన విషయాన్ని అప్పు తీసికున్నవాడు ఒప్పుకున్న సందర్భంలో నూటికైదు పణములు దండుగ చెల్లింపవలెను. లేక తానప్పుతీసికున్నప్పటికి తీసికొనలేదని అబద్ధమాడినచో నూటికి పదిపణముల దండుగ విధించవలెను.

*వసిష్ఠవిహితాం వృద్ధిం సృజేద్వి త్తవివర్ధినీమ్*
*అశీతిభాగం గృహ్ణీయా న్మాసాద్వార్ధుషికఃశతే 140*

*ద్వికం శతం వా గృహ్ణీయా త్సతాం ధర్మమనుస్మరన్,*
*ద్వికం శతం వా గృహ్ణానో న భవత్యర్థకిల్బిషీ, 141*

*ద్వికం త్రికం చతుష్కం చ పంచకం చ శతం సమమ్,*
*మాసస్య వృద్ధిం గృహ్ణీయాద్వర్ణానామనుపూర్వశః 142*

వడ్డీ :

వడ్డీ వ్యాపారము చేయువాడు వసిష్ఠమహర్షి ఏర్పరచినపద్ధతిలో వడ్డీని తీసికొని తన ధనాన్ని పెంపొందించుకొనవలెను. సాధారణంగా వడ్డీ నెలకొకమారు తీసికొనవలెను. అది నూటికి పణము మొదలగు వాటిలో ఎనభైవంతు అనగా నెలకు ఒకటింబావు వడ్డీ తీసికొనవలెను. ఒక్కొక్కప్పుడు నూటికి రెండు చొప్పున్న వడ్డీ కూడ తీసికొన వచ్చును. నూటికి రెండు చొప్పున వడ్డీ తీసికొనువాడు అధిక వడ్డీ తీసికొన్నప్పటికీ పాపికానేరడు. ఒక్కొక్కప్పుడు బ్రాహ్మణ క్షత్రియ, వైశ్య, శూద్రులనుండి వరుసగా నూటికి రెండు, మూడు, నాలుగు, ఐదు కూడ తీసికొనవచ్చును.

న త్వేవాధౌ సోపకారే కౌసీదీం వృద్ధిమాప్నుయాత్,
న చాధేః కాలసంరోధాన్నిసర్గోస్తి న విక్రయః 143

న భోక్తవ్యో బలాదాధిర్భుంజానో వృద్ధిముత్సృజేత్,
మూల్యేన తోషయేచ్చైనమాధి స్తేనోऽ న్యథా భవేత్. 144

ఆధిశ్చోపనిధిశ్చోభౌ న కాలాత్యయమర్హతః,
అవహార్యౌ భవేతాం తౌ దీర్ఘ కాలమవస్థితౌ 145

సంప్రీత్యా భుజ్యమానాని న నశ్యంతి కదాచన,
ధేనురుష్ట్రో వహన్నశ్వో యశ్చ దమ్యః ప్రయుజ్యతే 146

యత్కించిద్దశవర్షాణి సన్నిధౌ ప్రేక్షతే ధనీ
భుజ్యమానం పరైస్తూష్ణీం న స తల్లబ్ధుమర్హతి 147

అజడశ్చేదపోగండో విషయే చాస్య భుజ్యతే,
భగ్నం తద్వ్యవహారేణ భోక్తా తద్ద్రవ్యమర్హతి 148

ఆధిస్సీమా బాలధనం నిక్షేపోపనిధిః స్త్రియః,
రాజస్వం శ్రోత్రియస్వం చ న భోగేన ప్రణశ్యతి 149

యస్స్వామినాననుజ్ఞాతమాధిం భుఙ్క్తే విచక్షణః,
తేనార్థవృద్ధిర్మోక్తవ్యా తస్య భోగస్య నిష్కృతిః 150

భూమి, గోవులు మొదలగు వాటిని తాకట్టు పెట్టుకొని ధనాన్ని అప్పు ఇచ్చినచో ఆ ధనంపై వడ్డీ తీసికొనరాదు. ఆ వస్తువులను చాలా కాలముంచినా వాటిని ఇంకొకరికిచ్చుటగాని అమ్ముటగాని చేయకూడదు. తన దగ్గర కుదువపెట్టబడ్డ సొమ్ములను బలవంతంగా అనుభవించరాదు. అట్లనుభవిస్తున్నప్పుడు వడ్డీ తీసికొనరాదు. కుదువబెట్టిన సొమ్మును తాను అనుభవిస్తున్నప్పుడు చెడిపోయినచో ఆ వస్తువుయొక్క విలువను స్వంతదారునకివ్వవలెను. లేనిచో ఆతడు దొంగ అనబడుతాడు. సాధారణంగా కుదువబెట్టిన వస్తువులను కొంతకాలమే ఉంచుకొనవలెను. అవి చాలా కాలమున్నా తిరిగి యజమానికి వాటిని ఇచ్చి వేయవలసిందే. అనుభవనిమిత్తమివ్వబడిన ఆవు, గుఱ్ఱం, ఆబోతు మొదలగునవెన్నడూ అనుభవించేవానికి స్వంతం కాజాలవు. తాకట్టు పెట్టిన వస్తువును యజమాని, దగ్గరలో ఉండికూడ పది సంవత్సరాల వరకు విడిపించుకొనలేకపోతే యజమాని తన వస్తువుపై అధికారాన్ని కోల్పోతున్నాడు ఆ యజమాని వెఱ్ఱివాడు, పదునారేండ్ల వయస్సుకు తక్కువ ఉన్నవాడు కాకపోతే, తన సొమ్మును తాకట్టు పెట్టుకున్న వాడు అనుభవిస్తున్నా విడిపించుకొనక పోయినచో అది తాకట్టు పెట్టుకొన్నవాని స్వంతమౌతుంది. కాని కుదువ బెట్టిన సొత్తు, బాలుర సొత్తు, లెక్కపెట్టి ఇచ్చిన సొత్తు, లెక్క పెట్టక ఇచ్చిన సొత్తు, సేవికలు, రాజధనం, శ్రోత్రియుని ధనం, ఇతరులకు తాకట్టు పెట్టి ఎన్ని సంవత్సరాలైనను మరల అడిగినప్పుడు ఇచ్చివేయవలెను. యజమాని యొక్క అనుజ్ఞ లేక తన దగ్గర తాకట్టు పెట్టబడ్డ వస్తువులననుభవించేవాడు ప్రాయశ్చిత్తంగా సగము వడ్డీని

వదులుకొ వలెను. యజమాని అనుజ్ఞలేక తానే స్వయంగా వాటిని అనుభవిస్తే తా
చేసిన పాపకర్మకు ప్రాయశ్చిత్తంగా వడ్డీనేమాత్రం తీసికోరాదు.

*కుసీదవృద్ధి ర్ద్వైగుణ్యం నాత్యేతి సకృదాహృతా,*
*ధాన్యే సదే లవే వాహ్యే నాతిక్రమతి పంచతామ్ 151*

*కృతానుసారాదధికా వ్యతిరిక్తా న సిధ్యతి,*
*కుసీదపథమాహుస్తం పంచకం శతమర్హతి. 152*

*నాతిసాంవత్సరీం వృద్ధిం న చాదృష్టాం పునర్హరేత్,*
*చక్రవృద్ధిః కాలవృద్ధిః కారితా కాయికా చ యా 153*

ధనాన్ని వడ్డీకి తీసికొంటే దాని పై వడ్డి రెండింతల కంటె మించగూడదు. ధాన్యము
పండ్లు కాయలు ఎడ్లు మొదలైనవి ఐదురెట్ల కంటె మించరాదు. నెలకింతయని నిర్ణయించి
వడ్డి ఐదురెట్లకంటె మించ కూడదు. నెలకో, రెండు నెలలకో, మూడునెలలకో, సంవత్సరానికో
వడ్డీని లెక్కకట్టి తీసికొనవలెను. సంత్సరం దాటి లెక్కకట్టి వడ్డీని తీసికొనరాదు. శాస్త్రంలో
చెప్పిన దానికంటె ఎక్కువ వడ్డీని తీసికొనరాదు. వడ్డి చక్రవృద్ధి కాల వృద్ధి, కారిత, కాయి
అని నాలుగు విధాలుగా ఉంటుంది. చక్రవృద్ధియనగా వడ్డీ పై వడ్డీ కట్టుట. నెలకిం
దినమున కింతయని నూటికి రెండింటికంటెక్కువగా వడ్డీకట్టుట కాలవృద్ధి
అప్పుతీసికొన్నవాడు అప్పు ఇచ్చినవాని బాధసహింపక వడ్డీ రేటును పెంచుట కారిత వృద్ధి
వడ్డీకి బదులుగా దేహశ్రమచేయునట్లు ఒప్పందం చేసికొనుట కాయవృద్ధి.

*ఋణం దాతు మశక్తో యః కర్తుమిచ్ఛేత్పునః క్రియామ్,*
*స దత్వా నిర్జితాం వృద్ధిం కరణం పరివర్తయేత్ 154*

*అదర్శయిత్వా తత్రైవ హిరణ్యం పరివర్తయేత్,*
*యావతీ సంభవేద్వృద్ధిస్తావతీం దాతుమర్హతి 155*

అప్పును తీసికొన్నవాడు తీసుకొన్న అప్పును తగు సమయంలో తీర్చలేని పక్షంలో
అప్పునిచ్చినవాడు తనకు రావలసిన వడ్డిని తీసికొని, అప్పు పత్రాన్ని తిరిగి
వ్రాయించుకొనవలెను. అప్పు తీసికొన్నవాడా సమయంలో వడ్డీని కూడ కట్టలేకపోతే ఋణ
దాత తనకు రావలసిన వడ్డీని కలిపి మళ్ళీ పత్రం వ్రాయించుకొవాలి.

*చక్రవృద్ధిం సమారూఢో దేశ కాలవ్యవస్థితః,*
*అతిక్రామన్ దేశకాలౌ న తత్ఫలమవాప్నుయాత్ 156*

ఈ వస్తువును ఇంత దూరము తీసికొని (మోసికొని) పోయినచో ఇంత
ధనమునియ్యవలెనను దేశ వ్యవస్థను, ఇంతకాలము పని చేస్తే ఇంతధనమివ్వ వలెనని
ఒప్పందం చేసికొని ఆ ఒప్పందాన్ని తప్పితే ఒప్పందానికి తగినంత ధనమివ్వవలసిన అవసరం
లేదు.

*సముద్రయానకుశలా దేశకాలార్థదర్శినః,*
*స్థాపయంతి తు యాం వృద్ధిం సా తత్రాధిగమం ప్రతి 157*

# అష్టమాధ్యాయం

ఎల్లప్పుడు సముద్రమార్గంలో బోవువారు, ఎల్లప్పుడు భూమార్గంలో బోవువారు, ఇంత బరువును, ఇంతకాలం ఇంత దూరం వరకు తీసికొని పోతే ఇంతకూలి తీసికొనదగునని తెలిసిన వర్తకులే కూలిని నిర్ణయింపగలరు. ఆ విషయంలో వారే ప్రమాణం.

*యో యస్య ప్రతిభూస్తిష్ఠేద్దర్శనాయేహ మానవః,*
*అదర్శయన్ స తం తస్య ప్రయచ్ఛేత్స్వ ధనాదృణమ్ 158*

*ప్రాతిభావ్యం వృథాదానమాంక్షికం సౌరికం చ యత్,*
*దండశుల్కావశేషం చ న పుత్రో దాతుమర్హతి. 159*

*దర్శనప్రాతిభావ్యే తు విధిస్స్యాత్పూర్వచోదితః,*
*దానప్రతిభువి ప్రేతే దాయాదానపి దాపయేత్ 160*

అప్పిచ్చు సమయంలో ఎవడైతే మధ్యవర్తిగా ఉంటాడో అప్పుతీసికొన్నవారు అప్పును సకాలంలో చెల్లించక కనిపించకపోయినా ఆ మధ్యవర్తే అప్పు ధనాన్ని ఇచ్చుకోవలెను. మధ్యవర్తిగా ఉండి ఒప్పుకొన్న ధనానికి, పందెం మొదలైన వాటిలో ఇత్తునని ఒప్పుకున్న ధనానికి, జూదం మద్యానికై ఇవ్వవలసిన ధనానికి, సుంకం ఓలి నిమిత్తం ఇవ్వవలసిన ధనానికి, పుత్రుడు బాధ్యుడు కాడు. మద్యం విషయంలో తండ్రి మధ్యవర్తియైతే దానికి పుత్రుడు బాధ్యుడు కాడు. కాని తండ్రి చనిపోయినప్పుడు పుత్రుడు బాధ్యతవహింపవలసియుంటుంది.

*అదాతరి పునర్దాతా విజ్ఞాత ప్రకృతావృణమ్,*
*పశ్చాత్ప్రతిభువి ప్రేతే పరీప్సేత్కేనహేతునా. 161*

*నిరాదిష్టధనశ్చేత్తు ప్రతిభూః స్యాదలంధనః,*
*స్వధనాదేవ తద్దద్యాన్నిరాదిష్ట ఇతి స్థితిః 162*

అప్పుపడినవాడు లేక మధ్యస్థుడు అప్పు చెల్లించకపోతే ఈ లోగా మధ్యస్థుడుకూడ చనిపోతే అతని పుత్రుడా ధనాన్ని చెల్లించాలి.

*మత్తోన్మత్తార్తాద్యధీనైర్బాలేన స్థవిరేణ వా,*
*అసంబంధకృతశ్చైవ వ్యవహారో న సిద్ధ్యతి 163*

*సత్యా న భాషా భవతి యద్యపి స్యాత్ ప్రతిష్ఠితా,*
*బహిశ్చేద్భాష్యతే ధర్మాన్నియతాద్వ్యావహారికాత్ 164*

మత్తుడు, ఉన్మత్తుడు, రోగి, బాలుడు, వృద్ధుడు వీరితోను, సంబంధం లేనివారితోను చేయబడిన వ్యవహారం చెల్లదు. నియతమైన వాడుకకంటె, వ్యవహార సంబంధమైన ధర్మంకంటె భిన్నంగా పత్రం వ్రాసి కొంటే అది చెల్లనేరదు. మోసంతో చేయు విక్రయం, దానం, ప్రతి గ్రహాదుల్లో ఎచ్చటనైన మోసం కనబడితే ఆ వ్యవహారం చెల్లబోదు.

*యోగాధమనవిక్రీతం యోగదాన ప్రతి గ్రహమ్,*
*యత్ర వాప్యుపధిం పశ్యే త్తత్సర్వం వినివర్తయేత్ 165*

*గ్రహీతా యది నష్టః స్యాత్కుటుంబార్థే కృతో వ్యయః,*
*దాతవ్యం బాంధవై స్తత్స్యాత్ ప్రవిభక్తైరపి స్వతః, 166*

*కుటుంబార్థేऽ ధ్యధీనో ऽ పి వ్యవహారం యమాచరేత్,*
*స్వదేశే వా విదేశే వా తం జ్యాయాన్న విచాలయేత్ 167*

*బలాద్దత్తం బలాద్భుక్తం బలద్యచ్చాపిలేఖితమ్,*
*సర్వానేతాన్ బలకృతానకృతాన్మనురబ్రవీత్ 168*

అప్పు తీసి కొన్నవాడు ఆ ధనాన్ని తనకుటుంబ సభ్యులకై వ్యయం చేస్తే అప్పు తీసికొన్నవాడు చనిపోయిన సమయంలో ఆ కుటుంబ సభ్యులు విడిపోయినా, కలసి ఉన్నా అందరు ఆ అప్పును చెల్లించాలి. యజమాని స్వదేశంలోనే ఇంకొక చోట ఉన్నప్పుడు లేదా విదేశంలో ఉన్నప్పుడు ఆ యజమాని కుటుంబానికై సేవకుడు అప్పుచేస్తే అప్పును యజమానే తీర్చాలి. బలవంతంగా దానం చేయబడింది. బలవంతంగా అనుభవింపబడింది. బలవంతంగా వ్రాయించుకొన్నది మొదలైనవన్ని కూడ చెల్లబోవు.

*త్రయః పరార్థే క్లిశ్యంతి సాక్షిణః ప్రతిభూః కులమ్,*
*చత్వారస్తూపచీయంతే విప్ర ఆఢ్యో వణిక్ నృపః 169*

సాక్షులు, జామీనిచ్చినవాడు, ధర్మార్థవ్యవహారాలు చూచు అధికారి ఈ ముగ్గురు ఇతరుల గురించి కష్టపడుతారు. అట్లే బ్రాహ్మణుడు, ( ధనఫలమునిచ్చిన) ఋణ ద్రవ్యమిచ్చే ధనికుడు, విక్రయించు వైశ్యుడు, వ్యవహారాన్ని పరిష్కరించు రాజు ఈ నలుగురు ధనాన్ని సంపాదించుకుంటారు.

*అనాదేయం నాదదీత పరిక్షీణోऽపి పార్థివః,*
*న చాదేయం సమృద్ధోऽపి సూక్ష్మమప్యర్థముత్సృజేత్ 170*

*అనాదేయస్య చాదానాదాదేయస్య చ వర్జనాత్,*
*దౌర్బల్యం ఖ్యాప్యతే రాజ్ఞః స ప్రేత్యేహ చ నశ్యతి 171*

రాజు దగ్గర ధనం లేకున్నా తాను తీసికో కూడని ధనాన్ని ఎప్పుడు తీసికొన వద్దు. అట్లే తాను ధనవంతుడైనా తాను తీసికొనవలసిన ధనాన్ని ఎప్పుడు వదులుకోరాదు. రాజు తాను తీసికొనకూడని ధనాన్ని తీసికొని, తీసికొన వలసిన ధనాన్ని వదులుకుంటే అది అతని దౌర్బల్యాన్ని చూపిస్తుంది. అట్టిరాజు ఇహలోకంలో కీర్తిని కొల్పోతాడు. పై లోకంలో సుఖాన్ని పొందలేడు.

*స్వాదానాద్వర్ణ సంసర్గాద్దుర్బలానాం చ రక్షణాత్,*
*బలం సంజాయతే రాజ్ఞః స ప్రేత్యేహ చ వర్ధతే 172*

*తస్మాద్యమ ఇవ స్వామీ స్వయం హిత్వా ప్రియాప్రియే,*
*వర్తేత యామ్యయా వృత్త్యా జితక్రోధో జతేంద్రియః 173*

*యస్త్వధర్మేణ కార్యాణి మోహాత్కుర్యాన్నరాధిపః*
*అచిరాత్తం దురాత్మానం వశే కుర్వంతి శత్రవః 174*

# అష్టమాధ్యాయం

*కామక్రోధౌ తు సంయమ్య యోఽర్థాన్ ధర్మేణ పశ్యతి,*
*ప్రజా స్తమనువర్తంతే సముద్రమివ సింధవః, 175*

తన ధనాన్ని తనకు తిరిగి ఇప్పించుటవల్ల, వర్ణసంకరం కానీయనందువల్ల, దుర్బలులను రక్షించుటవల్ల, రాజు సమర్థుడని పేరుపొందుతున్నాడు. ఆ విధంగా చేసిన రాజుకు ఇహపరసౌఖ్యాలు కలుగుతాయి. అందువల్ల రాజైనవాడు యమధర్మరాజువలె తన ఇష్టానిష్టాలను తానే త్యజించి తనకోపాన్నణచుకొని, జితేంద్రియుడై సమబుద్ధికలిగియుండాలి. లోభాదులవల్ల అధర్మకార్యాలు చేసే రాజును, శత్రువులు వశపరచుకొంటారు. కామక్రోధములను నియమించుకొని ధర్మంగా రాజకార్యాలను నిర్వహించు రాజును సముద్రాన్ని నదులు ఆశ్రయించి నట్లు ప్రజలెల్లప్పుడు ఆశ్రయించుకొనియుంటారు.

*యస్సాధయంతం ఛందేన వేదయేద్ధనికం నృపే,*
*న రాజ్ఞా తచ్చతుర్భాగం దాప్యస్తస్య చ తద్ధనమ్ 176*

*కర్మణాపి సమం కుర్యా ద్ధనికాయాధమర్ణికః*
*సమోఽపకృష్టజాతిస్తు దద్యాచ్ఛ్రేయాంస్తు తచ్ఛనైః 177*

అప్పు తీసికొని వడ్డీని వసూలు చేస్తున్నా రాజు దగ్గర ఫిర్యాదు చేస్తే అప్పు తీసుకున్నవాని దగ్గరినుండి ఆధనాన్నంతా ఇప్పించి ఇంకొక నాలుగవ వంతు ధనాన్ని రాజు దండుగగా స్వీకరించాలి. అప్పు తీసికున్నవాడు తాను తీసుకొన్న అప్పును తిరిగి చెల్లించలేనిచో అప్పిచ్చిన వాని ఇంటిలో సేవకుడుగా పనిచేసియైన అప్పును తీర్చుకొనవలెను. సేవకావృత్తి చేయలేని వాడు మెల్ల మెల్లగా ఆ అప్పును తీర్చుకోవలెను.

*అనేన విధినా రాజా మిథో వివదతాం నృణామ్,*
*సాక్షి ప్రత్యయసిద్ధాని కార్యాణి సమతాం నయేత్. 178*

అప్పు విషయమై ఒకరితో నొకరు వివాదం పెట్టుకుంటున్నప్పుడు రాజు ఈ విధంగా సాక్షులు మొదలగువారిని విచారించి వారి వివాదాలను తొలగిస్తూ కార్యాలను చక్కబెట్టాలి

*కులజే వృత్తసంపన్నే ధర్మజ్ఞే సత్యవాదిని,*
*మహాపక్షే ధనిన్యార్యే నిక్షేపం నిక్షిపేద్బుధః 179*

*యో యథా నిక్షిపేద్ధస్తే యమర్థం యస్య మానవః,*
*స తథైవ గ్రహీతవ్యో యథా దాయస్తథా గ్రహః 180*

*యో నిక్షేపం యాచ్యమానో నిక్షేప్తుర్న ప్రయచ్ఛతి,*
*సయాచ్యః ప్రాడ్వివాకేన తన్నిక్షేప్తురసన్నిధౌ. 181*

సత్కులంలో పుట్టిన వాడు, సదాచార సంపన్నుడు, ధర్మమెరిగినవాడు, సత్యాన్ని పలికేవాడు, గొప్పకుటుంబం కలిగి, కపటం లేని ధనవంతుని ఇంట ధనాన్ని గాని వస్తువులను గాని దాచిపెట్టవలెను. తన దగ్గర దాచి పెట్టిన దాన్ని అతడు యజమానికి యథాతథంగా అప్పగించాలి. తాను దాచిన దానిని ఎన్నిమార్లడిగానా దాచిపెట్టుకున్నవాడు ఇవ్వనిరాకరిస్తే

న్యాయాధికారి ధనం మొదలైన వాటిని దాచినవాడు లేనప్పుడు దాచిపెట్టుకున్నవాణ్ణి ఇట్ల ప్రశ్నవేయాలి.

*సాక్ష్యభావే ప్రణిధిభిర్వయోరూప సమన్వితైః,*
*అపదేశైశ్చ సన్న్యస్య హిరణ్యం తస్య తత్త్వతః 182*

*న యది ప్రతిపద్యేత యథాన్యస్తం యథాకృతమ్,*
*న తత్ర విద్యతే కించిద్యత్పరైరభియుజ్యతే 183*

*తేషాం న దద్యాద్యది తు తద్ధిరణ్యం యథావిధి,*
*ఉభౌ నిగృహ్య దాప్య స్స్యాదితి ధర్మస్య ధారణా 184*

*నిక్షేపోపనిధీ నిత్యం న దేయౌ ప్రత్యనంతరే,*
*నశ్యతో వినిపాతే తాపనిపాతే త్వనాశినౌ 185*

*స్వయమేవ తు యో దద్యాన్మృతస్య ప్రత్యనంతరే,*
*న స రాజ్ఞా నియోక్తవ్యో న నిక్షేప్తుశ్చ బంధుభిః 186*

*అచ్ఛలేనైన చాన్విచ్ఛేత్తమర్థం ప్రీతి పూర్వకమ్,*
*విచార్య తస్య వా వృత్తం సామ్నైవ పరిశోధయేత్ 187*

*నిక్షేపేష్వేషు సర్వేషు విధిస్స్యాత్పరిసాధనే,*
*సముద్రే నాప్నుయాత్కించిద్యది తస్మాన్న సంహరేత్ 188*

ధనం మొదలైనవాటిని దాచినట్లు సాక్షులు లేకపోతే తన సేవకులతో కొంతధనం అతని వద్ద దాచిపెట్టి తిరిగి ఇమ్మని అడిగించినప్పుడు ఆధనాన్ని ఇస్తే ఫిర్యాదు చేసినవానిదే తప్పని నిర్ణయించాలి. లేక తన సేవకులకా ధనాన్ని ఇవ్వకపోతే తన సేవకులు దాచిపెట్టిన ధనాన్ని, ఇంతకుముందు దాచి పెట్టినధనాన్ని రెంటిని తీసికొని మొదటి వాని ధనాన్ని అతనికిచ్చి ధనం దాచిపెట్టుకొన్నవానిని శిక్షించాలి. తన దగ్గర దాచిపెట్టిన సొత్తును దాచి పెట్టిన వానికి మాత్రమే ఇవ్వాలి. అతని బంధువులకు గాని పుత్రులకు గాని ఇవ్వకూడదు. ఆ విధంగా బంధుపుత్రులకిస్తే ఆ సొత్తు నశించి పోవచ్చు. కావున వాటిని ఇతరులకివ్వరాదు. ధనం మొదలైనవి దాచినవాడుచనిపోతే వాటిని చనిపోయినవాని కొడుకులు మొదలైనవారికి తాను స్వయంగా అందచేయాలి. ఆ సమయంలో ధనం దాచుకొన్న వానిపై అతని పుత్రులు గాని, బంధువులు గాని రాజు దగ్గర అభియోగం చేయకూడదు. ఒకవేళ బంధువులతనిపై తమకు తక్కువ ధనం ఇచ్చినాడని అభియోగం చేస్తే అతణ్ణి మంచి మాటలతో గాని అతని నడకవల్లగాని ఆ విషయాన్ని తెలిసికొని మంచిమాటలతో దగ్గర దాచిపెట్ట బడ్డ వస్తువునంతా అప్పగించేటట్లు చేయాలి. నిక్షేపాల విషయంలో ఈ విధంగా వాటిని సాధించాలి. అట్లే ముద్రలు చెడిపోయిన ధనమంతా యజమానికి అప్పగిస్తే ధనం దాచిపెట్టుకొన్న వానిపై ఎట్టి అభియోగం పెట్టవద్దు.

*చౌరైర్హృతం జలేనోఢమగ్నినా దగ్ధ మేవ వా,*
*న దద్యాద్యది తస్మాత్స న సంహరతి కించన 189*

నిక్షేపాన్ని దొంగలెత్తుకొని పోయినా నీటిలో కొట్టుకొని పోయినా, అగ్ని దగ్ధమై, నిక్షేపందాచుకొన్నవాడు దానిలోనుండి ఏ మాత్రం ధనం దొంగతనం చేయకపో దాచినవానికేమి చెల్లింపనక్కరలేదు.

*నిక్షేపస్యాపహర్తారమనిక్షేప్తారమేవ చ,*
*సర్వైరుపాయైరన్విచ్ఛేచ్ఛపథైశ్చైవ వైదికైః 190*

*యో నిక్షేపం నార్పయతి యశ్చానిక్షిప్య యాచతే,*
*తావుభౌ చౌరవచ్ఛాస్యౌ దాప్యౌ వా తత్సమం దమమ్ 191*

*నిక్షేపస్యాపహర్తారం తత్సమం దాపయేద్దమమ్,*
*తథోపనిధిహర్తారమవిశేషేణ పార్థివః, 192*

తన దగ్గర దాచిన ధనాన్నపహరించిన వానిని దాచకుండగనే దాచినట్లు అబద్ధ చెప్పే వానిని రాజు ప్రమాణం మొదలైన అనేక విధాలైన ఉపాయాలతో తెలిసికొనవలెన వారి తప్పును పూర్తిగా గ్రహించిన తరువాత వారిని దొంగను శిక్షించినట్లు శిక్షించాలి పై వారు చెప్పిన నిక్షేప ధనానికి సమానంగా దండుగ విధించాలి. మొదటిసారి మాత్రమే నిక్షేపాన్ హరిస్తే, దండుగ మాత్రం విధించాలి.

*ఉపధాభిశ్చ యః కశ్చిత్పరద్రవ్యం హరేన్నరః,*
*ససహాయస్స హంతవ్యః ప్రకాశం వివిధైర్వధైః 193*

ఏదోపేరు చెప్పి లంచం తీసికొనువానిని అతని పరివారాన్ని కఠినంగా బహిరంగంగా శిక్షించాలి

*నిక్షేపో యః కృతో యేన యావాంశ్చ కులసన్నిధౌ*
*తావానేవస విజ్ఞేయో విబ్రువన్ దండమర్హతి 194*

*మిథో దాయః కృతో యేన గృహీతో మిథ ఏవ వా,*
*మిథ ఏవ ప్రదాతవ్యో యథా దాయ స్తథా గ్రహః 195*

ఎంతటి పరిమాణమున్న నిక్షేపాన్ని సాక్షుల ముందు ఇస్తే నిక్షేపాన్నుంచుకొన్నవాడ సైతం ఆ సాక్షుల ముందరనే అదే పరిమాణమున్న నిక్షేపాన్ని తిరిగి అప్పగించాలి. రహస్యంగ నిక్షేపాన్ని దాచిపెట్టినచో నిక్షేపాన్ని తన దగ్గర నుంచుకొన్న వాడా నిక్షేపాన్ని రహస్యంగాన తిరిగి ఇచ్చివేయాలి.

*నిక్షిప్తస్య ధనస్యైవం ప్రీత్యోపనిహితస్యచ,*
*రాజా వినిర్ణయం కుర్యాదక్షిణ్వ న్న్యాసధారిణమ్, 196*

ఈ విధంగా ముద్రవేసికాని, వేయకకాని దాచిపెట్టిన నిక్షేపం గురించి వివాదమేర్పడితే రాజు నిక్షేపాన్ని తన దగ్గర ఉంచుకొన్నవానిని నొప్పింపక యజమానికి దానినిఇప్పించాలి.

*విక్రీణీతే పరస్య స్వం యో స్వామీ స్వామ్యసమ్మతః,*
*న తం నయేత సాక్ష్యం తు స్తేనమస్తేనమానినమ్ 197*

*అవహార్యో భవేచ్చైవ సాన్వయః షట్ శతం దమమ్*
*నిరన్వయోzనపసరః ప్రాప్తస్స్యా చ్చౌరకిల్బిషమ్ 198*

*అస్వామినా కృతో యస్తు దాయో విక్రయ ఏవ వా,*
*అకృతస్స తు విజ్ఞేయో వ్యవహారే యథాస్థితిః 199*

*సంభోగో దృశ్యతే యత్ర న దృశ్యేతాగమః క్వచిత్,*
*ఆగమః కారణం తత్ర న సంభోగ ఇతి స్థితిః. 200*

తనదే ఆ వస్తువని నమ్మబలికి ఇతరుల వస్తువుల నమ్మువాడు తనను దొంగగా భావించడు. అట్టి దొంగను సాక్ష్యం లేకుండ శిక్షింపవచ్చును ఇట్లు ఇతరుల వస్తువులనమ్ముకొనేవానికి సంసారమున్న పక్షంలో మొదటి పర్యాయం దయతలచి ఆరువందల రూకలను దండుగగా విధించాలి. అమ్మిన వానికి సంసారలంపటము లేనిచో దొంగకు విధించే శిక్షను విధించాలి. అట్లే యజమానిగాని వాడు ఇతరుల వస్తువులనమ్మినచో ఆ వ్యవహారం జరుగనట్లే భావించవలెను. క్రయవిక్రయపత్రాలేవి లేకుండ అనుభవిస్తూ ఉంటే ఆనాటి క్రయవిక్రయములు జరుగనట్లే భావింపవలెను.

*విక్రయాద్యో ధనం కేచిద్గృహ్ణీయాత్కులసన్నిధౌ,*
*క్రయేణ స విశుద్ధం హి న్యాయతో లభతే ధనమ్ 201*

కమీషన్:-

ఇతరుల వస్తువులను అమ్మి, అమ్మిన దానిలో కొంత భాగమును ఇతర వర్తకుల సమీపంలోనే ఉంచి, తరువాత అమ్మిన వెలను యజమానికిచ్చినచో అతడు పరిశుద్ధుడగును. తనకు న్యాయముగా రావలసిన ధనాన్ని మాత్రం తీసికోవచ్చును.

*అథ మూలమనాహార్య ప్రకాశక్రయశోధితః,*
*అదండ్యో ముచ్యతే రాజ్ఞా నాష్టికో లభతే ధనమ్.202*

ఒక వస్తువును బహిరంగప్రదేశములందమ్మి వాడు విదేశాలకు పోయినా చనిపోయినా యజమాని కొన్న వానిపై రాజు దగ్గరకు వివాదానికి వెళ్ళ వీలులేదు. కానిచో మూల్యమిచ్చి తన వస్తువును తాను తీసికొనవచ్చును.

*నాన్యదన్యేన సంసృష్టరూపం విక్రయమర్హతి,*
*న చాసారం న చ న్యూనం న దూరేణ తిరోహితమ్.203*

కల్తీచేయుట:-

ఒక వస్తువును మరియొక వస్తువుతో కలిపి అమ్ముటకు వీలులేదు. అట్లే పనికి రాని వస్తువును, తూనికలో తక్కువచేసి దూరంలో ఉన్న వస్తువును రంగు మార్చి అమ్మరాదు. ఈ విధంగా అమ్మితే ఇతరుల వస్తువులను అమ్మితే విధించుదండననే విధింపవలెను.

*అన్యాం చేద్దర్శయిత్వాzన్యా వోఢుః కన్యా ప్రదీయతే,*
*ఉభే త ఏక శుల్కేన వహేదిత్యబ్రవీన్మనుః.204*

కన్యాశుల్కమును తీసికొని కన్యనిచ్చువాడు ఒక కన్యను చూపి ఇంకొక కన్యనిచ్చి వివాహంచేస్తే, మొదటి కన్యకూడ అతనికే చెందుతుందని మనువు పల్కెను.

*నోన్మత్తాయా న కుష్ఠిన్యా న చ యా స్పృష్టమేథునా,*
*పూర్వం దోషానభిఖ్యాప్య ప్రదాతా దండమర్హతి.205*

తన కూతురు ఉన్మాదినియైనచో, కుష్ఠురోగము కలదైతే, పరపురుషునితో పోతే, ఆ విషయాలను చెప్పక దొంగ పెండ్లి చేయువాడు దండనయోగ్యుడు.

*ఋత్విగ్యది వృతో యజ్ఞే స్వకర్మ పరిహాపయేత్,*
*తస్య కర్మానురూపేణ దేయోz ంశ స్సహ కర్తృభిః.206*

*దక్షిణాసు చదత్తాసు స్వకర్మ పరిహాపయన్,*
*కృత్స్నమేవ లభేతాంశ మన్యేనేవ చ కారయేత్.207*

*యస్మిన్ కర్మణీ యాస్తుస్యురుక్తాః ప్రత్యంగదక్షిణాః,*
*స ఏవ తా ఆదదీత భజేరన్ సర్వ ఏవవా.208*

*రథం హరేత చాధ్వర్యుర్బ్రహ్మాధానే చ వాజినమ్,*
*హోతా వా zపి హరేదశ్వ ముద్గాతా చాప్యనః క్రయే.209*

*సర్వేషామర్ధినో ముఖ్యాస్తదర్ధే నార్ధినో z పరే,*
*తృతీయిన స్తృతీయాంశా శ్చతుర్థాంశాశ్చ పాదినః.210*

*సంభూయ స్వాని కర్మాణి కుర్వద్భిరిహ మానవైః,*
*అనేన విధియోగేన కర్తవ్యాంశప్రకల్పనా.211*

యజ్ఞమునందొక ఋత్విక్కును వరించిన తరువాత ఆరోగ్యాదికారణముల వల్ల అతడు యజ్ఞమధ్యంలోనే యాగం పూర్తి చేయక వదిలిపెడ్తే అతడు చేసిన పనికి తగ్గట్టు తక్కిన ఋత్విక్కులతో కలిసి సంభావన నీయవలెను. దక్షిణనిచ్చిన తరువాత ఆరోగ్యదికారణాలవల్ల తాను చేయవలసిన కర్మను వదిలిపెడ్తే అతని దక్షిణను అతనికే వదలి మిగిలిన కర్మను ఇతరునిచే చేయించుకోవలెను. ఆధానాది కర్మలలో ప్రతి అంగానికి దక్షిణ ఇవ్వవలసినచోట ఆ దక్షిణ ఆ అంగ కార్యాన్ని నిర్వహించు వానికా లేక సమస్త కార్యాలను నిర్వహించువానికా అన్న సందేహం కలిగితే ఆధానమందు అధ్వర్యువునకు రథమును, బ్రహ్మకు మంచి అశ్వాన్ని, హోతకు సాధారణాశ్వాన్ని, ఉద్గాతకు సోమక్రయాన్ని మోయు బండిని ఇవ్వవలెనని చెప్పబడినందువల్ల ఆయా వ్యక్తులు ఆయా దక్షిణలు తీసికొనవలెను. కొన్ని యాగాల్లో ప్రధానులైన హోత, అధ్యుర్యువు, బ్రహ్మ, ఉద్గాతలకు సగభాగం, మైత్రావరుణ, ప్రతిప్రస్థాతృ, బ్రహ్మణాచ్ఛాంసి ప్రస్తోతలకు పై భాగం లో సగభాగం, అచ్ఛావాకుడు, నేష్ట, అగ్నీధ్రుడు, ప్రతిహర్త అనువారికి మొదటివారి భాగంలో మూడవ వంతు గ్రామస్తుత్తు, ఉన్నేత, పోత, సుబ్రహ్మణ్యులకు మొదటి వారి భాగంలో నాలుగవ భాగాన్ని ఇవ్వాలి. ఇట్లు ఎవ్వరి భాగం వారికివ్వాలి. అట్లే చాలామంది కలిసి చేసే పనులలో కూడ యజ్ఞ దక్షిణను ఋత్విక్కులు పంచుకొన్నట్లే పంచుకోవలెను.

*ధర్మార్థం యేన దత్తం స్యాత్క స్మైచిద్యాచతే ధనమ్,*
*పశ్చాచ్చ న తథా తత్స్యాన్న దేయం తస్య తద్భవేత్.212*

*యది సంసాధయేత్తత్తు దర్పాల్లోభేన వా పునః,*
*రాజ్ఞా దాప్యస్సువర్ణం స్యాత్తస్య స్తేయస్య నిష్కృతిః.213*

ధర్మకార్యాలలో ఒకరు యాచించినప్పుడు ఇత్తునని నలుగురి ముందు సమ్మతించినప్పటికీ, దానాన్ని స్వీకరించేవాడు దుర్మార్గుడైనచో ఒప్పుకొన్న దానాన్ని ఈయనవసరంలేదు. లేక దానాన్ని బలాత్కారంగా స్వీకరించినవాడు లోభంతోగాని, దర్పంతోగాని ప్రవర్తిస్తే వాడు దొంగవలె బలాత్కారంగా ధనం తీసికొన్నందువల్ల రాజతన్ని దొంగను శిక్షించినట్లు శిక్షించాలి. ఒక సువర్ణము దండుగను విధించాలి.

*దత్తస్యైషోదితా ధర్మ్యా యథావ దనపక్రియా,*
*అత ఊర్ధ్వం ప్రవక్ష్యామి వేతనస్యానపక్రియామ్.214*

ఇంతవరకు ధనం ఇచ్చునట్లు ఒప్పుకొని ఇవ్వని సమయములగురించి చెప్పబడింది. ఇక వేతనము మొదలగువానిని ఇవ్వని సందర్భాలను వివరింతునని భృగు మహర్షి పలికెను.

*భృతో నార్తో న కుర్యాద్యో దర్పాత్కర్మ యథోదితమ్,*
*న దండ్యః కృష్ణలాన్యష్టౌ న దేయం చాస్య వేతనమ్.215*

*ఆర్తస్తు కుర్యాత్స్వస్థస్సన్ యథాభాషితమాదితః,*
*న దీర్ఘస్యాపి కాలస్య తల్లభేతైవ వేతనమ్.216*

*యథోక్తమార్తస్సుస్థో వా యస్తత్కర్మ న కారయేత్,*
*న తస్య వేతనం దేయ మల్పోనస్యాపి కర్మణః.217*

సేవకుడొక పని నొప్పుకొని అహంకారం చేత చెప్పిన పని చేయనిచో రాజు వానికి ఎనిమిది సువర్ణకృష్ణలములు అపరాధంవేయవచ్చును. యజమాని సేవకునకు ఒప్పుకొన్న కూలి ఇవ్వనవసరములేదు. ఒకవేళ ఆ సేవకుడు రోగ బాధితుడై చేయలేక పోతే రోగము తగ్గినతరువాత ఆ పని పూర్తి చేసి కూలి మొత్తం తీసికొనవచ్చును. కాని రోగం తగ్గినా ఒప్పుకొన్న పని పూర్తి చేయకపోతే పని కొద్దిగనే మిగిలి ఉన్నా అతనికి కూలి ఇయ్యనక్కరలేదు..

*ఏష ధర్మోz ఖిలేనోక్తో వేతనాదానకర్మణః,*
*అత ఊర్ధ్వం ప్రవక్ష్యామి ధర్మం సమయ భేదినామ్.218*

కూలినాలి చేయువారి విషయంలో అనుసరించాల్సిన న్యాయమిది. ఇక పని ఒప్పుకొని చేయని వారి విషయంలో అనుష్ఠించాల్సిన పద్ధతులను మీకు తెలుపుతున్నానని భృగువు పలికెను.

*యో గ్రామదేశసంఘానాం కృత్వా సత్యేన సంవిదమ్,*
*విసంవదేన్నరో లోభాత్తం రాష్ట్రాద్విప్రవాసయేత్.219*

*నిగృహ్యా దాపయేచ్చైనం సమయవ్యభిచారిణమ్,*
*చతుస్సువర్ణాన్ షణ్ణిష్కాన్ శతమానం చ రాజతమ్.220*

గ్రామవాసులు, దేశవాసులు ఒక సంఘంలో ఉన్నవారు ఒక ఒప్పందం చేసికొన్న తర్వాత వారిలో ఒకడు లోభాది కారణాల వల్ల చేయలేకపోతే అతనిని దేశభ్రష్టుని చేయాలి. ఈ విధంగా మాట దప్పినవానిని పట్టుకొని నాలుగు సువర్ణాలు గాని ఆరునిష్కాలు గాని వంద రాజతములు గాని అపరాధాన్ని విధించాలి.

*ఏతద్దండవిధిం కుర్యాద్ధార్మికః పృథివీపతిః,*
*గ్రామజాతిసమూహేషు సమయవ్యభిచారిణామ్.221*

ధార్మికుడైన రాజు గ్రామం, జాతి సంఘాలు మొదలగుచోట్ల చేసికొన్న ఒప్పందాన్ని తప్పినచో పై దండన విధించాలి.

*క్రీత్వా విక్రీయ వా కించి ద్యస్యేహానుశయో భవేత్,*
*సోఽ న్తర్దశాహాత్తద్ద్రవ్యం దద్యాచ్చైవాదదీత వా.222*

*పరేణ తు దశాహస్య న దద్యాన్నాపి దాపయేత్,*
*ఆదదానో దదచ్చైవ రాజ్ఞా దండ్యశ్శతాని షట్.223*

అమ్మినవాడు, కొన్న వాడు ఆ వస్తువును పది దినాలలో వెనుకకు తీసికోవచ్చును ఇవ్వవచ్చును. తరువాత మాత్రం కుదరదు. పది రోజుల తరువాత నిర్బంధం చేసి వెనుకకిచ్చినవానిని, పదినాళ్ళ తరువాత నిర్బంధపెట్టి వెనకకు తీసికొన్న వానిని రాజు ఆరు వందల రూకలవరకు దండింపవచ్చును.

*యస్తు దోషవతీం కన్యా మనాఖ్యాయ ప్రయచ్ఛతి,*
*తస్య కుర్యాన్నృపో దండం స్వయం షణ్ణవతిం పణాన్.224*

*అకన్యేతి తు యః కన్యాం బ్రూయా ద్ద్వేషేణ మానవః,*
*స శతం ప్రాప్నుయాద్దండం తస్యా దోష మదర్శయన్.225*

*పాణిగ్రహణికా మంత్రాః కన్యాస్వేవ ప్రతిష్ఠితాః,*
*నాకన్యాసు క్వచిన్నౄణాం లుప్తధర్మక్రియా హి తాః.226*

*పాణిగ్రహణికా మంత్రా నియతం దారలక్షణమ్,*
*తేషాం నిష్ఠా తు విజ్ఞేయా విద్వద్భిస్సప్తమే పదే.227*

ఉన్మాదం, కుష్ఠురోగం మొదలైన దోషాలు ఉన్న స్త్రీని కన్యాశుల్కం తీసికొని ఇచ్చిన వానిని రాజు తొంభై ఆరు రూకలవరకు దండింపవచ్చును. పెండ్లి కావలసిన స్త్రీ పైన, ఆమె బంధువులపైన ఉన్నకోపంతో ఆస్త్రీ పరపురుషునితో పోయిందని అబద్ధములు చెప్పువానిని రాజు నూరు రూకలవరకు దండము వేయవచ్చును.

పాణిగ్రహణం చేసే మంత్రాలన్నీ కన్యలకు మాత్రం సంబంధించినవి. కన్యలు కాని స్త్రీలు ధర్మ క్రియాహీనలు కావున వారికి పాణిగ్రహణమంత్రాలు వర్తించవు. పాణిగ్రహణ

మంత్రాలవల్ల స్త్రీ భార్యగా మారుతున్నది. ఆ మంత్రాలలో కూడ సప్తపదికి సంబంధించిన మంత్రాలు చాలా ప్రధానమైనవి అందువల్ల సప్త పది మంత్రాల వల్ల స్త్రీ భార్య యౌతున్నది.

*యస్మిన్ యస్మిన్ కృతే కార్యేయ స్యేహానుశయో భవేత్,*
*తమనేన విధానేన ధర్మ్యే పథి నివేశయేత్.228*

కేవలం క్రయ విక్రయములే కాక ఇతర కార్యాలందు సైతము క్రయ విక్రయాల్లో వలె పది దినాలలో తిరిగి ఇవ్వవచ్చును. తిరిగి వెనుకకు తీసికొనవచ్చును. ఈ ధర్మ మార్గాన తన ప్రజలుండునట్లు రాజు శాసింపవలెను.

*పశుషు స్వామినాం చైవ పాలానాం చ వ్యతిక్రమే,*
*వివాదం సంప్రవక్ష్యామి యథావద్ధర్మతత్త్వతః.229*

పశువును పాలించు వారికి, వాటి యొక్క యజమానులకు మధ్య వివాదాలు చెలరేగినచో వాటిని పరిష్కరించు పద్ధతి ఇది.

*దివా వక్తవ్యతా పాలే రాత్రౌ స్వామిని తద్గృహే,*
*యోగక్షేమేz న్యథా చేత్తు పాలో వక్తవ్యతామియాత్.230*

*గోపః క్షీరభృతో యస్తు స దుహ్యాద్దశతో పరామ్,*
*గోస్వామ్యనుమతే భృత్యః సా స్యాత్పాలే z భృతే భృతిః,231*

*నష్టం వినష్టం కృమిభిః శ్వహతం విషమే మృతమ్,*
*హీనం పురుషకారేణ ప్రదద్యాత్పాల ఏవ తు.232*

*విఘుష్య తు హృతం చోరైర్న పాలో దాతు మర్హతి,*
*యది దేశే చ కాలే చ స్వామినః స్వస్య శసంతి.233*

*కర్ణౌ చర్మ చ వాలాంశ్చ వస్తి స్నాయుం చ రోచనామ్,*
*పశుషు స్వామినాం దద్యాన్మృతేష్వంగాని దర్శయేత్.234*
*అజావికే తు సంరుద్ధే వృకైః పాలే త్వనాయతి,*
*యాం ప్రసహ్య వృకో హన్యాత్పాలే తత్కిల్బిషం భవేత్.235*

*తాసాం చేదవరుద్ధానాం చరంతీనాం మిథో వనే,*
*యాముత్ప్లుత్య వృకో హన్యాన్న పాల స్తత్ర కిల్బిషీ.236*

పశువు యోగక్షేమాలు విచారించుట పగటిపూట పశుపాలకులపైన, రాత్రిపూట పశువులయజమానిపై ఆధారపడియున్నది. ఆ విధంగా కాకుండా రాత్రిపూటకూడ పశువుల కాపరి అధీనంలో పశువులుంటే వాటి భాధ్యతను చూడవలసిన వాడు పశువుల కాపరియే. గోపాలుడగు భృత్యునికి జీతమీయకపోతే పశువుల యజమాని పది ఆవుల పాలను తీసికొని ఒక మంచి యావు పాలను అతనికి కూలిగా ఈయవలెను. పశువులు కంటికి కనపడక పోయినా, పురుగులు, కుక్కలు కరిచినా, మిట్ట పల్లాలో పడి చనిపోయినా, ఆపశువులకు గోపాలకుడే బాధ్యత వహించి తెచ్చి ఇవ్వవలెను. పశువుల పాలకుడు పశువులను కాయుచున్న సమయంలో దొంగలు దొమ్మిచేసి పశువులనపహరిస్తే వెంటనే దగ్గరలోనున్న

యజమానికి చెప్పవలెను. అట్లు చేసినచో గోపాలునిపై బాధ్యత ఉండక అతడు దొంగలెత్తుకొని పోయిన పశువుల నివ్వవలసిన పనిలేదు. పశువు తానే చనిపోతే దాని చెవులను, చర్మాన్ని , తోకను, గోరోచనమును యజమానికి చూపి వాటినతనికి ఇచ్చివేయవలెను. మేకలు గొఱ్ఱెలు మొదలైన వాటిని తోడేల్ళు చుట్టు ముట్టినప్పుడు గొల్లవాడు వాటిని రక్షించకపోతే వాటి బాధ్యత గొల్లవాడే వహించాలి. మేకలు, గొఱ్ఱెలు, మేస్తున్నప్పుడు వాటిలో తప్పిపోయిన దాన్ని తోడేలు చంపితే దాని పరిహారాన్ని గొల్లవాడు ఇవ్వవలసిన పనిలేదు.

*ధనుశ్శతం పరీహారో గ్రామస్య స్యాత్సమంతతః,*
*శమ్యాపాతాస్త్రయో వాఽపి త్రిగుణో నగరస్య తు.237*

*తత్రాపరివృతం ధాన్యం విహింస్యుః పశవో యది,*
*న తత్ర ప్రణయేద్దండం నృపతిః పశురక్షిణామ్.238*

*వృతిం తత్ర ప్రకుర్వీత యాముష్ట్రో న విలోకయేత్,*
*ఛిద్రం చ వారయేత్సర్వం శ్వసూకరముఖానుగమ్.239*

*పథి క్షేత్రే పరివృతే గ్రామాంతీయేఽథవా పునః,*
*స పాలశ్శతదండార్హో విపాలా న్వారయేత్పశూన్.240*

*క్షేత్రేష్వన్యేషు తు పశుస్సపాదం పణమర్హతి,*
*సర్వత్ర తు సదో దేయః క్షేత్రికస్యేతి ధారణా.241*

గ్రామం చుట్టు నూరు ధనువులంత భూమినిగాని, (ధనువనగా నాలుగుమూరలు) ఒక కఱ్ఱను మూడు మార్లు విసిరితే ఎంత దూరముపోతుందో అంత భూమిని గాని పశువులమేతకు బీడుగా వదలవలెను. పట్టణంలో ఐతే గ్రామానికి మూడు రెట్లెక్కువ బీడు భూమిని వదలిపెట్టాలి. ఆ బీడు భూమిలో పడ్డ ధాన్యాన్ని పశువులు తింటె రాజు దాన్ని తప్పుగా పరిగణించి శిక్షింపగూడదు. ఆ బీడు భూమిలో ధాన్యం వేస్తే దాని చుట్టు ఒంటె తలయెత్తి చూచినా కనిపించనంతా ఎత్తు కంచె వేయవలెను. అట్లే దానిలో కుక్కలు, పందులు లోనికి దూరకుండ సందులనన్నిటిని మూయవలెను. తోవలోను, గ్రామసమీపంలోనున్న కంచెవేసిన చేనిలో పశువులుపడితే పశువుల కాపరికి నూరు రూకల వరకు దండన విధింపవచ్చును. పశువుల కాపరి దగ్గర లేకపోతే గోవులను పొలం యజమాని బయటకు పంపించి వేయాలి ఊరికిగాని, త్రోవకుగాని దూరంగా ఉన్న చేలలో పశువులు పడితే పశువుల కాపరికి ఒకటింపావు రూకను దండన విధించాలి. అచ్చట పసులు తిన్న పంటను పొలం యజమానికి పశువుల కాపరిగాని పశువుల యజమాని గాని ఇచ్చుకోవలెను.

*అనిర్దశాహం గాంసూతాం వృషాన్ దేవపశూంస్తథా,*
*సపాలాన్వా విపాలా న్వా న దండ్యాన్మనురబ్రవీత్.242*

*క్షేత్రియస్యాత్యయే దండో భాగాద్దశగుణో భవేత్,*
*తతోఽర్ధదండో భృత్యానామజ్ఞానాత్ క్షేత్రికస్య తు.243*

ఈని పది దినములు కూడ దాటని ఆవులను, ఆబోతులను, దేవుని పేరుమీద వదిలి పెట్టిన పశువులను, పశువుల కాపరియున్నా లేకున్నా తన చేనిలో పడినందుకు వాటిని దండింపగూడదు. పొలము దున్నిన వాని స్వంత పశువులే చేనిలోపడ్డప్పుడు, సమయం దప్పి విత్తనాలు చల్లినప్పుడు, రాజుకు రావలసిన దానికంటె పది రేట్లెక్కువ దండన విధించవలెను. రైతునకు గాని అతని భృత్యులకు గాని తెలియక ఈ అపరాధం జరిగితే పైదానిలో సగము అనగా ఐదురెట్లెక్కువ దండన విధించాలి.

*ఏతద్విధానమాతిష్ఠేద్ధార్మికః పృథివీపతిః,*
*స్వామినాం చ పశూనాం చ పాలానాం చ వ్యతిక్రమే.244*

ధార్మికుడైన రాజు పశుపాలకులు, పశువుల యజమానులు చేసిన తప్పునకు ఈ పద్ధతి ననుసరించాలి.

*సీమాం ప్రతి సముత్పన్నే వివాదే గ్రామయో ర్ద్వయోః,*
*జ్యేష్ఠే మాసి నయేత్సీమాం సుప్రకాశేషు సేతుషు.245*

ఎల్లలు:-

రెండు గ్రామల మధ్య ఎల్లల గూర్చి వివాదం చెలరేగితే జ్యేష్ఠ మాసంలో గడ్డి అంతా ఎండిపోతుంది కావున ఎల్లల గురుతులు కనిపిస్తాయి కాబట్టి అప్పుడు ఎల్లల నిర్ధారణ చేయడం తగింది.

*సీమావృక్షాంశ్చ కుర్వీత న్యగ్రోధాశ్వత్థకింశుకాన్,*
*శాల్మలీన్ సాలతాలాంశ్చ క్షీరిణ శ్చైవ పాదపాన్.246*

*గుల్మాన్ వేణూంశ్చ వివిధాఞ్చమీవల్లీస్థలాని చ,*
*శరాన్ కుబ్జకగుల్మాంశ్చ తథా సీమా న నశ్యతి.247*

*తటాకాన్యుదపానాని వాప్యః ప్రస్రవణాని చ,*
*సీమాసంధిషు కార్యాణి దేవతాయతనాని చ.248*

*ఉపచ్ఛన్నాని చాన్యాని సీమాలింగాని కారయేత్,*
*సీమాజ్ఞానే నృణాం వీక్ష్య నిత్యం లోకే విపర్యయమ్.249*

గ్రామాల మధ్య ఎల్లలు తేలికగా తెలియుటకై మర్రి, రావి, మోదుగ, బూరుగు, మద్ది, తాటి చెట్లను పాలుగారు అత్తిమొదలగు చెట్లను నాటాలి. ఇంకా పొదలు, వెదుళ్ళు, జమ్మి, తీగలు, ఊటి చెట్లు మొదలైన ముండ్ల పొదలను ఎల్లలలో నాటితే అవి ఎన్నడు నశించిపోవు. అట్లే గ్రామాలమధ్య చెరువులు, బావులు, దిగుడు బావులు, నీరుపోవు దారులు, దేవాలయాలు నిర్మించుటవల్ల అనేకులు ఆ ప్రాంతాలందు తిరుగుతారు. అందువల్ల ఎల్లలను తేలికగా గుర్తు పట్టవచ్చును. ఎల్లలు గుర్తించుటలో మానవులకు భ్రమ ఏర్పడవచ్చు కావున పైన చెప్పిన గుర్తులు కాక గోప్యములైన ఈ క్రింది గురుతులను కూడ పెట్టవలెను.

*అశ్మనో ऽస్థీని గోవాలాంస్తుషాన్ భస్మ ऽకపాలికాః,*
*కరీషమిష్టకాంగారాంశ్చర్కరా వాలుకాస్తథా.250*

*యాని చైవం ప్రకారాణి కాలాద్భూమిర్న భక్షయేత్,*
*తాని సంధిషు సీమాయా మప్రకాశాని కారయేత్.251*

రాళ్ళు, ఎముకలు, ఆవులతోకలు, పొట్టు, బూడిద, కపాలాలు, పిడకలు, కాల్చిన ఇటుకలు, బొగ్గులు, గులక రాళ్ళు, ఇసుక మొదలైన వాటిని కుండలలో పోసి పాతి పెట్టితే అవి ఎన్నడూ నశించిపోవు. కాబట్టి గ్రామసీమలను తేలికగా గుర్తింపవచ్చు.

*ఏతైర్లింగైర్నయేత్సీమాం రాజా వివదమానయోః,*
*పూర్వభుక్త్యా చ సతతముదకస్యాగమేన చ.252*

*యది సంశయ ఏవ స్యాల్లింగానా మపి దర్శనే,*
*సాక్షిప్రత్యయ ఏవ స్యాత్సీమావాదవినిర్ణయః.253*

రెండు గ్రామాల మధ్య ఎల్లలకై వివాదమగుచున్నప్పుడు పైన చెప్పిన గురుతులననుసరించి రాజు సరిహద్దులను గుర్తించాలి. ఐనా సరిహద్దు వివాదం చెలరేగితే పూర్వానుభవాన్ని, రెండు గ్రామలమధ్య ఉన్న కాలువలు మొదలైన వాటి ద్వారా గ్రామ సరిహద్దులను నిర్ణయించాలి. కనిపించకుండ ఉన్న బొగ్గుల కుండ మొదలైనవి, స్పష్టంగా కనిపించే చెట్లనుకూడ సమ్మతింపక వివాదం పెట్టుకుంటే రాజు సాక్షుల మాటను ప్రమాణంగా తీసికొని సరిహద్దుల మధ్య వివాదాన్ని పరిష్కరించాలి.

*గ్రామీయకకులానాం చ సమక్షం సీమ్ని సాక్షిణః,*
*ప్రష్టవ్యాస్సీమలింగాని తయోశ్చైవ వివాదినోః.254*

*తే పృష్టాస్తు యథా బ్రూయుస్సమస్తాస్సీమ్ని నిశ్చయమ్,*
*నిబధ్నీయాత్తథా సీమాం సర్వాంస్తాంశ్చైవ నామతః.255*

*శిరోభిస్తే గృహీత్వోర్వీం స్రగ్విణో రక్తవాససః,*
*సుకృతైశ్శాపితాః స్వైస్స్వైర్నయేయుస్తే సమంజసమ్.256*

*యథోక్తేన నయంతస్తే పూయంతే సత్యసాక్షిణః,*
*విపరీతం నయంతస్తు దాప్యాః స్యుర్ద్విశతం దమమ్.257*

గ్రామంలోని జనులు గ్రామద్వయంలోని వాది ప్రతివాదులు వీరి సమక్షంలో సరిహద్దు గుర్తులనుగురించి సాక్షులనడుగాలి. అప్పుడు సాక్షులందరు ఏకాభిప్రాయంతో తెల్పుసరిహద్దుల్ని సరిహద్దు పత్రంపై సాక్షులుగా వచ్చిన వారి సంతకాలు తీసికొని నిర్ణయించాలి. ఆ సాక్షులంతా ఎఱ్ఱబట్టలు ధరించి పూలమాలలు మెడలో వేసికొని నెత్తిమీద మన్ను పట్టుకొని, మేమబద్ధమాడితే మా పుణ్యం నశించాలి. అంటూ ప్రమాణం చేసి సరిహద్దులను నిర్ణయించాలి. సత్యమైన సాక్ష్యం చెప్పిన వారు పుణ్యవంతులౌతారు. లేక తప్పుడు సాక్ష్యం చెప్తే వారికి రాజు ఒక్కొక్కరికి రెండు వందల రూకలు దండన విధించవలెను.

*సాక్ష్యభావే తు చత్వారస్సామంతగ్రామవాసినః,*
*సీమావినిర్ణయం కుర్యుః ప్రయతా రాజసన్నిధౌ.258*

రెండు గ్రామలమధ్య సరిహద్దులను నిర్ణయించే సాక్షులు లేనప్పుడు ఆ గ్రామాల చుట్ట ముట్టు గ్రామాలకు చెందిన నలుగురిని రాజు తన సమక్షానికి పిలిచి వారి సాక్ష్యాలననుసరించి సరిహద్దునిర్ణయాన్ని చేయాలి.

*సామంతానామభావే తు మౌలానాం సీమ్ని సాక్షిణామ్,*
*ఇమానప్యనుయుంజీత పురుషాన్వనగోచరాన్.259*

*వ్యాధాఞ్ఛాకునికాన్ గోపాన్ కైవర్తాన్మూలఖానకాన్,*
*వ్యాలగ్రాహా నుంఛవృత్తీనన్యాంశ్చ వనచారిణః.260*

సరిహద్దుకై వివాదపడుచున్న గ్రామాల చుట్టు ముట్టు గ్రామాలకు చెందిన పెద్ద మనుష్యులు లేనప్పుడు గ్రామనిర్మాణకాలానికి చెందిన మూలపురుషులను, వారు దొరకనప్పుడు, వనచరులను సాక్ష్యమడుగవలెను. వేటకాండ్రు, పక్షులను పట్టి బ్రతికేవారు, గొల్లలు, బెస్తలు, గడ్డలు తవ్వి బ్రతికే వారు, పాముల వాండ్లు, బిచ్చగాండ్రు, ఇంకా మిగిలిన అడవి మనుష్యులను సాక్షులుగా పిలిపించాలి .

*తే పృష్టాస్తు యథా బ్రూయు స్సీమాసంధిము లక్షణమ్,*
*తత్తథా స్థాపయేద్రాజా ధర్మేణ గ్రామయోర్ద్వయోః.261*

*క్షేత్రకూపతటాకానామారామస్య గృహస్య చ,*
*సామంతప్రత్యయో జ్ఞేయస్సీమాసేతువినిర్ణయః.262*

*సామంతాశ్చేన్మృషా బ్రూయాస్సేతౌ వివదతాం నృణాం,*
*సర్వే పృథక్పృథగ్దండ్యా రాజ్ఞా మధ్యమసాహసమ్.263*

ఆ బోయలు మొదలైన వారు కపటం లేని వారు కావున వారు చెప్పినట్లు రెండుగ్రామాల మధ్య ఎల్లలను నిర్ణయించాలి ఒక గ్రామంలో చేలు, బావులు, సరస్సులు, ఇండ్లు, వీటి ఎల్లల గురించి వివాదం సంభవిస్తే చుట్టు పట్టు గ్రామాలలో ఉన్నపెద్దలు చెప్పినట్లు నడుచుకోవాలి. ఐతే చుట్టు పట్టు గ్రామాల్లో ఉన్నపెద్దలు కూడ అబద్ధమాడుతున్నట్లు తెలితే వారికి ఒక్కొక్కరికి మధ్యమసాహసాన్ని (ఐదువందల రూకలు దండంగా విధించాలి.

*గృహం తటాకమారామం క్షేత్రం వా భీషయా హరన్,*
*శతాని పంచ దండ్యస్స్యాదజ్ఞానాద్ద్విశతో దమః.264*

*సీమాయా మవిషహ్యాయాం స్వయం రాజైవ ధర్మవిత్,*
*ప్రదిశేద్భూమి మేతేషా ముపకారాదితి స్థితిః.265*

ఇండ్లు, చెరువు, కుంటలు తోటలు, పొలము వీటిని బెదిరించి తీసికొన్న వానికి ఐదువందల రూకలను దండనగా విధించాలి. ఒక వేళ తెలియక తీసికొన్నవానికి రెండువందల రూకలను దండంగా విధించాలి. గ్రామముల మధ్య ఎల్లలను నిర్ణయించుటకు తగిన సాక్ష్యం గాని సాక్షులు గాని ఎవ్వరు లేనప్పుడు ధర్మజ్ఞుడైన రాజు ఆయాగ్రామాలకు మేలు జరుగునట్లు తానే ఎల్లలను విధించాలి.

# అష్టమాధ్యాయం

*ఏషో ऽఖిలేనాభిహితో ధర్మస్సీమావినిర్ణయే,*
*అత ఊర్ధ్వం ప్రవక్ష్యామి వాక్పారుష్యవినిర్ణయమ్, 266*

ఇంతవరకు గ్రామముల మధ్య ఎల్లలను నిర్ణయించుటలో అనుసరించవలసిన పద్ధతిని వివరించినాను. ఇక పరుషంగా మాట్లాడితే (తిడ్తే) అనుసరిచంవలసిన పద్ధతులను మీకు వివరిస్తానని భృగు మహర్షి మునులతో పిలికినాడు.

*శతం బ్రాహ్మణమాక్రుశ్య క్షత్రియోదండమర్హతి,*
*వైశ్యోऽప్యర్ధశతం ద్వే వా శూద్రస్తు వధమర్హతి, 267*

*పంచాశద్బ్రాహ్మణో దండ్యః క్షత్రియస్యాభిశంసనే*
*వైశ్యే స్యాదర్ధపంచాశచ్ఛూద్రే ద్వాదశకో దమః 268*

*సమవర్ణే ద్విజాతీనాం ద్వాదశైవ వ్యతిక్రమే,*
*వాదేష్వవచనీయేషు తదేవ ద్విగుణం భవేత్. 269*

*ఏకజాతిర్ద్విజాతీంస్తు వాచా దారుణయా క్షిపన్,*
*జిహ్వాయా ప్రాప్నుయాచ్ఛేదం జఘన్యప్రభవో హి సః 270*

*నామజాతి గ్రహం త్వేషామభిద్రోహేణ కుర్వతః*
*నిక్షేప్యోऽయోమయశ్శంకుర్జ్వలన్నాస్యే దశాంగుళః 271*

*ధర్మోపదేశం దర్పేణ విప్రాణామస్య కుర్వతః*
*తప్తమాసేచయేత్తైలం వక్త్రే శ్రోత్రే చ పార్థివః 272*

*శ్రుతం దేశంచ జాతిం చ కర్మ శారీరమేవ చ,*
*వితథేన బ్రువన్ గర్వాద్దాప్యః స్యాద్ద్విశతం దమమ్. 273*

*కాణం వా ऽ ప్యథవా ఖంజమన్యం వాऽ పి తథావిధమ్,*
*తథ్యేనాపి బ్రువన్ దాప్యో దండం కార్షాపణావరమ్ 274*

*మాతరం పితరం జాయాం భ్రాతరం తనయం గురుమ్*
*ఆక్షారయంచ్ఛతం దాప్యః పంథానం చాదదద్గురోః 275*

*బ్రాహ్మణక్షత్రియాభ్యాం తు దండః కార్యో విజానతా,*
*బ్రాహ్మణే సాహసః పూర్వః క్షత్రియే త్వేవ మధ్యమః 276*

*విట్ ఛూద్రయోరేవమేవ స్వజాతిం ప్రతి తత్త్వతః*
*ఛేదవర్జం ప్రణయనం దండస్యేతి వినిశ్చయః 277*

బ్రాహ్మణుని క్షత్రియుడు తిడ్తే వందరూకల దండాని కర్హుడౌతాడు. వైశ్యునికి యాభై రూకల దండమువిధింపవచ్చు శూద్రునికి పన్నెండు రూకల వరకు దండన వేయవచ్చు. బ్రాహ్మణులు మొదలైన వారు తమలో తాము తిట్టుకుంటే పన్నెండు రూకల దండన విధించాలి. ఐతే చెప్పలేని మాటల్లో ఆయా జాతివారుగాని ఒక జాతిని ఇంకొకజాతిగాని తిట్తే పైన చెప్పిన దండనకంటె రెండు రెట్లెక్కువ దండన విధించాలి. పైగా శూద్రుడు బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులను అనరాని మాటలతో దూషిస్తే అతని నాలుక కోయవలెను.

ఊరు కులము చెప్తూ తిట్టితే ఆ విధంగా తిట్టిన వాని నాలుకను మండుచున్న పది అంగుళాల కఱ్ఱుతో కాల్చవలెను. ఇంకా గర్వంతో ఉన్నత జాతికి ధర్మాన్ని ఉపదేశిస్తుంటే రాజువాడినోట్లో చెవిలో మండుచున్న నూనెను పోయించాలి. అనవసరముగా దేశ, జాతి కర్మాదులనుపల్కుచు తిట్టు ద్విజులకు( బ్రాహ్మణాదులకు) రెండువందల రూకలను దండనగా విధింపవలెను. ఒంటికంటి వాడు కుంటివాడు, గ్రుడ్డివాడు మొదలగువారిని గర్వముచే వారి శరీర లోపాన్ని ఎత్తి చూపుచూ తిట్టు వానికి ఒక కార్షాపణమునకు (రెండు పలములకు) తగ్గకుండా దండన విధించాలి. తల్లిని, తండ్రిని, భార్యను, సోదరుని, గురువును తిట్టేవానికి గురువుకు త్రోవ ఇవ్వక అడ్డంగానిలుచున్న శిష్యునకు నూరు రూకలవరకు దండన వేయవచ్చును. బ్రాహ్మణ క్షత్రియులు ఒకరినొకరునీచంగా తిట్టుకుంటే క్షత్రియుని తిట్టిన బ్రాహ్మణునికి ప్రథమ సాహసం (రెండు వందల యాభై రూకలు) బ్రాహ్మణుని తిట్టిన క్షత్రియునికి మధ్యమసాహసము (ఐదువందల రూకలు) దండన విధించాలి. వైశ్య శూద్రులిట్లే ఒకరి నొకరు నీచంగా తిట్టుకుంటే వైశ్యునికి ప్రథమ సాహసం, శూద్రునికి మధ్య మసాహసం దండనగా రాజు విధించాలి. నాలుక కోయుట తప్పించి ఈ విధంగా బ్రాహ్మణాదులను రాజు శిక్షించాలి.

*ఏష దండవిధిః ప్రోక్తో వాక్పారుష్యస్య తత్త్వతః*
***అత ఊర్ధ్వం ప్రవక్ష్యామి దండపారుష్యనిర్ణయమ్. 278***

ఇంతవరకు ఒకరి నొకరు తిట్టుకొంటే విధించవలసిన శిక్ష గురించి చెప్పడం జరిగింది. ఇక పరుషంగా ఒకరి నొకరు కొట్టుకుంటే విధింపవలసిన దండన గురించి వివరిస్తానని భృగుమహర్షి పలికెను.

***యేన కేన చిదంగేన హింస్యాచ్ఛ్రేష్ఠమంత్యజః***
***ఛేత్తవ్యం తత్తదేవాస్య తన్మనోరనుశాసనమ్ 279***

***పాణిముద్యమ్య దండం వా పాణిచ్ఛేదనమర్హతి,***
***పాదేన ప్రహరన్ కోపాత్పాదచ్ఛేదనమర్హతి, 280***

శూద్రుడు తనకంటె పెద్దవారైన బ్రాహ్మణాదులను ఏ అంగముతో హింసించునో (అనగా కాలితో తన్నుట, చేతితో కొట్టుట) అప్పుడతని ఆ యంగమును కాలులేక చేతిని ఛేదింపవలెనని మనువు తెల్పెను.

*సహాసనమభిప్రేప్సురుత్కృష్టస్యావకృష్టజః*
*కట్యాం కృతాంకో నిర్వాస్య ః స్ఫిచం వాz స్యావకర్తయేత్. 281*

***అవనిష్ఠీవతో దర్పాద్ద్వావోష్ఠౌ ఛేదయేన్నృపః***
***అవమూత్రయతో మేఢ్ర మవశర్ధయతో గుదమ్, 282***

***కేశేషు గృహ్ణతో హస్తౌ ఛేదయేదవిచారయన్.***
***పాదయోర్దాఢికాయాం చ గ్రీవాయాం వృషణేషు చ. 283***

***త్వగ్భేదకశ్శతం దండ్యో లోహితస్య చ దర్శకః***
***మాంసభేత్తా తు షణ్ణిష్కాన్ ప్రవాస్యస్త్వస్థిభేదకః284***

ఉన్నత వంశంవానితో సమానంగా అధమ వంశం వాడు కూర్చుంటే అతని నడుముపై వాత బెట్టి అతనినక్కడనుండి తరుమవలెను. లేక అతని పిరుదునైనా కోయవలెను. గర్వంతో బ్రాహ్మణుని తిట్టి అతని ముఖంపై ఉమ్మి వేయు వాని రెండు పెదవులనురాజుకోయించవలెను. బ్రాహ్మణునిపై మూత్రవిసర్జన చేసి అవమానపరచువాని మేఢ్రమును కత్తిరించునట్లు ఆజ్ఞనీయవలెను.అట్లే గర్వంతో బ్రాహ్మణునిపైఅపాన వాయువునొసగు వానిని శిక్షింపవలెను. బ్రాహ్మణుని వెంట్రుకలు పట్టుకొని లాగిన శూద్రుని చేతులను ఆ శూద్రుని వల్ల బ్రాహ్మణునికి నొప్పి కలిగిందా లేదా అని విచారించక నరికి వేయవలెను. అట్లే బ్రాహ్మణుని పాదాలు, గడ్డం, మెడ, వృషణాలు పట్టుకొని లాగిన వాని చేతులను నరికి వేయవలెను. బ్రాహ్మణుని తోలునకు బాధకలిగించు స్వజాతి వానికి నూరు రూకలు దండన విధింపవలెను. రక్తముగార్చిన వానికి కూడ అట్లే దండన విధింపవలెను. మాంసాన్నిచీల్చిన వానికి ఆరు నిష్కాలు దండన విధించాలి. ఎముకలు విరిచిన వానిని దేశంనుండి వెళ్ళగొట్టవలెను.

*వనస్పతీనాం సర్వేషాముపభోగో యథా యథా,*
*తథా తథా దమః కార్యో హింసాయామితి ధారణా.285*

పుష్పఫలాదులను ఇచ్చు చెట్లను కొట్టి వేస్తే ఆ చెట్ల వల్ల ప్రయోజనమే విధంగా ఉంటుందో అదే విధంగా తర తమ భేదంతో శిక్ష విధించాలి. అనగా ఫల వృక్షములనునరికితే ఎక్కువ దండన, తీగలు పొదలు మొదలైన పూలచెట్లు కొయువానికి కొద్దిగా తక్కువ దండన, గడ్డి మొదలైనవి కోసిన వానికి ఇంకా తక్కువ దండన విధించాలి.

*మనుష్యాణాం పశూనాం చ దుఃఖాయ ప్రహృతే సతి,*
*యథా యథా మహద్దుఃఖం దండం కుర్యాత్తథా తథా.286*

*అంగావపీడనాయాం చ వ్రణశోణితయోస్తథా,*
*సముత్థానవ్యయం దాప్యః సర్వదండమథాపి వా. 287*

మనుష్యులకు, పశువులకు బాధ కలిగేటట్లు కొట్టితే, కొట్టిన వానికి కూడ అంతకంటె ఎక్కువ దుఃఖము కలిగేటట్లు దండన విధింపవలెను. పశువులను మనుష్యులను కొట్టి బాధించినప్పుడు, గాయాలు పడి రక్తం కారేటట్లు కొట్టినప్పుడు వైద్యానికగు ఖర్చునంతయు కొట్టిన వాడే భరించవలెను. లేనిచో రాజు ఆ ధనాన్నంతయు దండనగా విధించి బాధితునకివ్వవలెను.

*ద్రవ్యాణి హింస్యాద్యో యస్య జ్ఞానతోऽజ్ఞానతోऽపి వా,*
*స తస్యోత్పాదయేత్తుష్టిం రాజ్ఞో దద్యాచ్చ తత్సమం. 288*

*చర్మచార్మిక భాండేషు కాష్ఠలోష్టమయేషు చ,*
*మూల్యాత్పంచగుణో దండః పుష్పమూలఫలేషు చ 289*

తెలిసి తెలియక బంగారు సొమ్ములు, రాగి పాత్రలు మొదలగు వానిని పోగొట్టి బాధ కలిగిస్తే క్రొత్త వాటిని చేయించి యజమానికిచ్చి అతనికి సంతోషంకలిగించాలి. అట్లే ఆ వస్తువు వెలకు సమానమైన దండనకూడ రాజుకు చెల్లించాలి. ఇతరులకు సంబంధించిన

చర్మాలు, చర్మ పాత్రలు, కఱ్ఱ, మన్ను వీటితో చేయబడిన పాత్రలను పోగొట్టినచో పోగొట్టినవాడు యజమానికి ఆవస్తువు యొక్క వెల కంటె ఐదు రెట్లుక్కువ ధనమిస్తూ పుష్పమూల ఫలాదులచే సంతోషపెట్టవలెను.

*యానస్య చైవ యాతుశ్చ యానస్వామిన ఏవ చ,*
*దశాతివర్తనాన్యాహు శ్శేషే దండో విధీయతే 290*

*ఛిన్న నాస్యే భగ్నయుగే తిర్యక్ ప్రతిముఖాగతే,*
*అక్షభంగే చ యానస్య చక్రభంగే తథైవ చ 291*

*ఛేదనే చైవ యంత్రాణాం యోక్త్రరశ్మ్యో స్తథైవ చ,*
*ఆక్రంథే చాప్యపైహీతి న దండం మనురబ్రవీత్ 292*

*యత్రాపవర్తతే యుగ్మం వైగుణ్యాత్ప్రాజకస్య తు,*
*తత్ర స్వామీ భవేద్దండ్యో హింసాయాం ద్విశతం దమమ్ 293*

*ప్రాజకశ్చేద్భవేదాప్తః ప్రాజకో దండమర్హతి,*
*యుగ్యస్థాః ప్రాజకేనాప్తే సర్వే దండ్యా శ్శతం శతమ్ 294*

*ప చేత్తు పథి సంరుద్ధః పశుభిర్వా రథేన వా,*
*ప్రమాపయేత్ ప్రాణభృత స్తత్ర దండోऽవిచారితః 295*

*మనుష్య మారణే క్షిప్రం చౌరవత్కల్బిషం భవేత్,*
*ప్రాణభృత్సు మహత్స్వర్ధం గోగజోష్ట్రహయాదిషు 296*

రథం మొదలైన వాటికి, వాటిని తోలు సారథికి ఆ రథాదుల యజమానికి ఈ క్రింది పది సందర్భములలో దండన లేదు కాని తక్కిన సందర్భాల్లో దండన విధింపవలెను. అవి ముకుత్రాడు తెగిపోవుట, కాడివిరుగుట, చక్రము విరిగినపుడు, ఎడ్ల మెడతాడు తెగినప్పుడు, సెలకోలమునికోల మొదలగునవి విరిగినప్పుడు, తప్పుకొమ్మని సారథి అరచుచున్నప్పుడు రథాదుల వలన ప్రాణ నష్టంగాని, ద్రవ్య నష్టంగాని జరిగితే ఇందు రథసారథి తప్పులేదు. కావున రథ సారథికిగాని, రథయజమానికిగాని దండము విధించకూడదు. సారథియొక్క అజాగ్రత్తవల్ల ఇరుసు అడ్డంగా దిరిగి విరిగి పోతే సరియైన శిక్షణ లేని సారథిని పెట్టుకొన్నందువలన రథయజమానికి రెండువందల రూకలవరకు దండనవిధింపవచ్చును. సారథి సమర్థుడైనచో ఆ దండనను యజమానికాక సారథియే భరించవలెను. సారథి సమర్థుడుకాకపోతే అట్టి రథము నెక్కినవారు ఒక్కొక్కరు నూరేసి రూకలు దండన కట్టాలి. తన రథానికి పశువులుగాని ఇంకొక రథంగాని అడ్డం వచ్చినప్పుడు తన రథాన్ని ఆపుకోలేక ఎదుట నున్న ప్రాణులకు హింస కలిగిస్తే ఆ సారథిని విచారించక దండన విధించాలి. ఆ సారథివల్ల మనుస్యులకు హింస జరిగితే దొంగకు శిక్ష విధించినట్లు వేయిరూకలు దండన విధించాలి. ఆవులు, ఏనుగులు, ఒంటెలు, గుఱ్ఱాలు మొదలైన వాటికి ఆపద కలిగితే చోరదండంలో సగం అనగా ఐదువందల రూకలు దండన విధించాలి.

*క్షుద్రకాణాం పశూనాం తు హింసాయాం ద్విశతో దమః,*
*పంచాశత్తు భవేద్దండః శుభేషు మృగపక్షిషు 297*

అష్టమాధ్యాయం

*గర్దభాజావికానాం తు దండస్స్యాత్పంచమాషికః,*
*మాషకస్తు భవేద్దండః శ్వసూకరనిపాతనే. 298*

సాధారణ పశువులకు ఆపద కలిగితే రెండువందల రూకలవరకు, జింకలు, హంసలు, మొదలైన సాధు పశు పక్షులకు హింస జరిగితే యాభై రూకలు దండన విధించాలి. గాడిద, మేక, గొఱ్ఱె వీటికిఆపద జరిగితే ఐదు వెండి మాడలు, కుక్క, పంది, చనిపోతే ఒక వెండి మాడను దండుగగా విధించాలి .

*భార్యా పుత్రశ్చ దాసశ్చ శిష్యో భ్రాతా చ సోదరః,*
*ప్రాప్తాపరాధాస్తాడ్యాః స్యు రజ్వ్వా వేణుదళేన వా 299*

*పృష్ఠతస్తు శరీరస్య నోత్తమాంగే కథంచన,*
*అతోఽన్యథా తు ప్రహరన్ ప్రాప్తః స్యాచ్చౌరకిల్బిషమ్ 300*

భార్య, పుత్రుడు సేవకుడు, శిష్యుడు, సోదరుడు వీరిలో ఎవ్వరైనా నేరం చేస్తే వీరిని తాడుతోనైనా, బెత్తంతో నైనా కొట్టాలి అప్పుడు శరీరం యొక్క వెనుకవైపే కొట్టాలి గాని ఎట్టి పరిస్థితిలోను శిరస్సుపై కొట్టరాదు. ఆ విధంగా ఎక్కడ బడితే అక్కడ కొట్టితే కొట్టిన వానికి రాజు చోర దండన (వేయిరూకల దండన) విధించాలి.

*ఏషోఽఖిలేనాభిహితో దండపారుష్య నిర్ణయః,*
*స్తేనస్యాతః ప్రవక్ష్యామి విధిం దండవినిర్ణయే 301*

ఓ మునులారా మీకింతవరకు కొట్టినవానికి విధించవలసిన దండమును వివరించినాను. ఇక దొంగను శిక్షించవలసిన విధానాన్ని మీకు వివరిస్తానని భృగు మహర్షి చెప్పెను.

*పరమం యత్నమాతిష్ఠేత్ స్తేనానాం నిగ్రహే నృపః,*
*స్తేనానాం నిగ్రహాదస్య యశో రాష్ట్రం చ వర్ధతే 302*

*అభయస్య హి యో దాతా స పూజ్యస్సతతం నృపః,*
*సత్రం హి వర్ధతే తస్య సదైవాభయదక్షిణం 303*

రాజు దొంగలను పట్టుటలో చాలా మెలకువతో ఉండాలి. దొంగలను అరికట్టి నప్పుడే రాజుకు కీర్తి, రాజ్యమూ అభివృద్ధి చెందుతాయి. ప్రజలకు దొంగలనుండి రక్షణ కల్పించి అభయమిచ్చు రాజు ఎల్లప్పుడు పూజలనందుకొంటాడు. రాజు చేయు రాజ్య రూపమైన యాగంలో ప్రజలకభయమిచ్చుట అనేది బ్రాహ్మణులకు ఇచ్చు దక్షిణవలె చాలా ప్రధానమైంది.

*సర్వతో ధర్మషడ్భాగో రాజ్ఞో భవతిరక్షతః,*
*అధర్మాదపి షడ్భాగో భవత్యస్య హ్యరక్షతః 304*

*యదధీతే యద్యజతే యద్దదాతి యదర్చతి,*
*తస్య షడ్భాగభాగ్రాజా సమ్యగ్భవతి రక్షణాత్ 305*

ప్రజలను రక్షించే రాజుకు తన ప్రజలు చేయు పుణ్య కార్యాల్లో ఆరవ భాగం

ఫలితం లభిస్తుంది. అట్లే తన ప్రజలను సక్రమంగా రక్షణ చేయని ప్రభువుకు ప్రజలు చే
పాపాల్లో ఆరవ భాగం పాపం లభిస్తుంది. ప్రజలను దొంగలు మొదలైన దుష్టులనుండికాపా
రక్షించిన ప్రభువుకు ప్రజలు చేయు వేదాధ్యయనంలో, ప్రజలు చేయు యాగాల్లో, వా
చేసే దానాల్లో, వారు చేసే దేవతార్చనాదులలో ఆరవ భాగం ఫలితం లభిస్తుంది.

*రక్షన్ ధర్మేణ భూతాని రాజా వధ్యాంశ్చ ఘాతయన్,*
*యజతేऽ హరహర్యజ్ఞైస్సహస్ర శతదక్షిణైః 306*

*యో రక్షన్ బలిమాద త్తే కరం శుల్కం చ పార్థివః,*
*ప్రతిభాగం చ దండం చ స సద్యో నరకం వ్రజేత్ 307*

*అరక్షితారం రాజానం బలిషడ్భాగహారిణమ్,*
*తమాహుః సర్వలోకస్య సమగ్రమలహారకమ్, 308*

*అనపేక్షితమర్యాదం నాస్తికం విప్రలుంపకమ్,*
*అరక్షితారమత్తారం నృపం విద్యాదధోగతిమ్ 309*

రాజు తన ప్రజలను ధర్మంగా పరిపాలిస్తూ దుష్టులను సంహరిస్తూ ఉంటే ప్ర
దినం యజ్ఞయాగాదులు చేస్తూ వాటిలో అనేక లక్షల దక్షిణలిస్తున్న ఫలితాన్ని పొదుతాడు
అదే విధంగా ప్రజలు న్యాయంగా పరిపాలన సేయక వారి దగ్గరినుండి కప్పము, సుంకమ
మొదలైన వాటిని తీసికొంటే అతడు వెంటనే నరకాన్ని పొందుతాడు ప్రజలను చక్కగ
కాపాడక తనకు రావలసిన ఆరవ భాగమైన సుంకాన్ని తీసికొను రాజు తన ప్రజలందర
చేసిన పాపాలన్ని పొందునని పెద్దలంటారు, నీతి శాస్త్రమర్యాదనతిక్రమించినవాడు
నాస్తికుడు, బ్రాహ్మణులను బాధపెట్టేవాడు, ప్రజలను రక్షించినవాడు పైగా ప్రజలను బాధ
పెట్టు రాజు అధోగతికి తప్పక పోవును.

*అధార్మికం త్రిభిర్న్యాయైర్నిగృహ్ణీయాత్ప్రయత్నతః*
*నిరోధనేన బంధేన వివిధేన వధేన చ, 310*

*నిగ్రహేణ హి పాపానాం సాధూనాం సంగ్రహేణ చ,*
*ద్విజాతయ ఇవేజ్యాభిః పూయంతే సతతం నృపాః 311*

*క్షంతవ్యం ప్రభుణా నిత్యం క్షిపతాం కారిణాం నృణామ్,*
*బాలవృద్ధాతురాణాం చ కుర్వతా హితమాత్మనః 312*

*యః క్షిప్తో మర్షయత్యార్తైస్తేన స్వర్గే మహీయతే,*
*యస్త్వైశ్వర్యాన్న క్షమతే నరకం తేన గచ్ఛతి 313*

అధార్మికులైన దొంగలు మొదలైన వారిని దండంకంటె భిన్నమైన చెరలో ఉంచుట,
సంకెళ్ళు వేయుట, కాళ్ళు చేతులు నరకుట అనే మూడు ఉపాయాలతో ప్రయత్నపూర్వకంగా
అరికట్టాలి. పాపులైన దొంగలు మొదలైన వారిని అరికట్టి సాధుపురుషులను రక్షించినందువల్ల,
యజ్ఞయాగాదులు చేసిన బ్రాహ్మణులు గౌరవం పొందినట్లు రాజులు గౌరవాన్ని
పొందుతున్నారు. తన మేలు కోరే రాజు తన దగ్గరికి వివాద పరిష్కారార్థం వచ్చి బాధపడ్డవారు,

బాలురు, వృద్ధులు, రోగులు తన నాక్షేపించి తిట్టినట్లైతే ఓపికతో వారిని క్షమింపవలెను. తన తీర్పువలన బాధపడ్డ వారొక వేళ తనను తిట్టినా, వారి తిట్లను ఓర్పుతో సహించుకొనే రాజు మరణానంతరము స్వర్గమునకు పోవును. ఆ విధంగా ఓర్చుకోలేని రాజు మరణానంతరం నరకానికి పోవును.

*రాజా స్తేనేన గంతవ్యో ముక్త కేశేన ధావతా,*
*ఆచక్షాణేన తత్ స్తేయమేవంకర్మాస్మి శాధి మామ్ 314*

*స్కంధేనాదాయ ముసలం లగుడం వాపి ఖాదిరమ్,*
*శక్తిం చోభయత స్తీక్ష్ణామాయసం దండమేవ వా 315*

*శాసనాద్వా విమోక్షాద్వా స్తేనః స్తేయాద్విముచ్యతే,*
*అశాసిత్వా తు తం రాజా స్తేనస్యాప్నోతి కిల్బిషమ్ 316*

దొంగతనం చేసినవాడు తల విరియబోసికొని పరుగెత్తుతూ, తాను చేసిన దొంగతనాన్ని గాని, ఇనుపకట్టినుగాని భుజం పై పెట్టుకొని రాజు దగ్గరికి పోయి తన దొంగతనాన్ని వివరించి నన్ను శిక్షింపుమని విన్నవించినప్పుడారాజు ఆ దొంగను అతడు భుజముపై మోసికొని తెచ్చిన ఆయుధంతో కొట్టి నా ప్రాణాలు తీయకపోయినా ఆ దొంగచేసిన పాపం నశిస్తుంది. లేక రాజాచోరుని శిక్షింపక వదిలి పెడ్తే ఆ దొంగ చేసిన పాపం రాజుకు చెందుతుంది.

*అన్నాదే భ్రూణహా మార్ష్టి పత్యౌ భార్యాపచారిణీ,*
*గురౌ శిష్యశ్చ యాజ్యశ్చ స్తేనో రాజని కిల్బిషమ్ 317*

*రాజనిర్ధూత దండాస్తు కృత్వా పాపాని మానవాః,*
*నిర్మలాః స్వర్గమాయాంతి సంతస్సుకృతినో యథా 318*

శిక్షింపవలసిన దొంగను వదిలి పెట్టితే బ్రహ్మ హత్య, భ్రూణహత్యలు చేసిన వానింట అన్నము తిన్న పాపాన్ని, భార్య వ్యభిచారము చేస్తున్నా ఊరక చూస్తూ ఉండే భర్త పొందే పాపాన్ని, శిష్యుడు తాను చేసిన అపచారాలవల్ల గురువుకు ఇచ్చు పాపాన్ని, శాస్త్రవిధిని మీరి యాగము చేసినందువల్లకలుగే పాపాన్ని రాజు పొందుతాడు. ఆ రాజు దొంగతనం వంటి తప్పులు చేసిన వారిని శిక్షించి, వారి పాపాలనన్నిటిని పోగొట్టి వారిని పుణ్యాత్ములను చేసి స్వర్గానికి పంపుతున్నాడు.

*యస్తు రజ్జుం ఘటం కూపాద్ధరేద్భింద్యాచ్చ యః ప్రపామ్,*
*స దండం ప్రాప్నుయాన్మాషం తచ్చ తస్మిన్ సమాహరేత్ 319*

*ధాన్యం దశభ్యః కుంభే భ్యో హరతోఽభ్యధికం వధః,*
*శేషేఽప్యేకాధశ గుణం దాప్యస్తస్య చ తద్ధనమ్ 320*

బాటసారులు తమ దప్పి తీర్చుకొనుటకై అమర్చిన తాడును బొక్కెనను హరించువానికి, చలివేంద్రమును కూలగొట్టినవానికి రాజు బంగారు మాడను దండముగా విధింపవలెను. మరియు వారిచేతనే చేద్రాడు, బొక్కెనలను తెప్పించవలెను లేక చలి

వేంద్రమును తిరిగి నిర్మించునట్లు చేయించవలెను. పదికుండలకంటె (రెండు వందలపలములు ఒక ద్రోణము, ఇరువై ద్రోణములు ఒకకుండ) ఎక్కువ ధాన్యాన్ని అపహరించిన వానికి, మరణమే దండనం అంతకంటె తక్కువ ధాన్యాన్ని దొంగిలిస్తే వారి వారి దొంగతనాన్ననుసరించి పదకొండు రెట్లెక్కువ ధాన్యాన్ని దండుగగా విధించాలి. ఇంకను అపహరించిన ధాన్యాన్ని యజమానికి అప్పగించునట్లు చేయాలి.

*తథా ధరిమమేయానాం శతాదభ్యధికే వధః,*
*సువర్ణరజతాదీనాముత్తమానాం చ వాససామ్ 321*

*పంచాశతస్త్వభ్యధికే హస్తచ్ఛేదనమిష్యతే,*
*శేషేత్వేకాదశగుణం మూల్యాద్దండం ప్రకల్పయేత్ 322*

*పురుషాణాం కులీనానాం నారీణాం చ విశేషతః*
*ముఖ్యానాం చైవ రత్నానాం హరణే వధమర్హతి 323*

అట్లే తూచదగిన బంగారు, వెండి, పట్టు మొదలైన వాటిని వందఫలాల కంటె ఎక్కువ దొంగతనం చేస్తే దేశ కాలాదులు, యజమాని, దొంగ పరిస్థితి మొదలగు వాటిననుసరించి కొట్టుట, అంగచ్ఛేదం, మరణం వంటి శిక్షలు విధించాలి. ఐదువందల పలములకంటె ఎక్కువ వెండి బంగారు పట్టు వస్త్రాలు మొదలగువాటిని దొంగిలిస్తే ఆ దొంగ చేతులు కొట్టివేయాలి. అంతకంటె తక్కువ ధొంగతనం చేస్తే దొంగిలించిన వస్తువు మూలానికి పదకొండు రెట్లు ఎక్కువ దండన విధించాలి. అట్లే ఉన్నత వంశంలో పుట్టిన వారిని, స్త్రీలను, వజ్రవైడూర్యాది రత్నాలను అపహరిస్తే అతనికి మరణదండన విధించాలి.

*మహాపశూనాం హరణే శస్త్రాణామౌషధస్య చ,*
*కాలమాసాద్య కార్యం చ దండం రాజా ప్రకల్పయేత్ 324*

*గోషు బ్రాహ్మణ సంస్థాసు చురికాయాశ్చ భేదనే,*
*పశూనాం హరణే చైవ సద్యః కార్యోऽర్ధపాదికః 325*

ఏనుగులు, ఒంటెలు ఆవులు గేదెలు వంటి పెద్దపశువులను, శస్త్రములను, ఔషధములను దొంగిలిస్తే కాలము ప్రయోజనం వంటివానిని గమనించి రాజు, శిక్షించాలి, బ్రాహ్మణులను, ఆవులను, బరువులమోయుటకై ముకుతాడు వేసిన పశువులను, యజ్ఞయాగాదులకు నిర్దేశింపబడ్డ పశువులను అపహరిస్తే వెంటనే అతని సగం కాలు తీసివేయాలి .

*సూత్ర కార్పస కిణ్వానాం గోమయస్య గుడస్య చ,*
*దధ్నః క్షీరస్య తక్రస్య పానీయస్య తృణస్య చ 326*

*వేణు వైదలభాండానాం లవణానాం తథైవ చ,*
*మృణ్మయానాం చ హరణే మృదో భస్మన ఏవ చ. 327*

*మత్స్యానాం పక్షిణాం చైవ తైలస్య చ ఘృతస్య చ,*
*మాంసస్య మధునశ్చైవ యచ్చాన్యత్పశుసంభవమ్ 328*

*అన్యేషాం చైవమాదీనాం మద్యానామోదనస్య చ,*
*పక్వాన్నానాం చ సర్వేషాం తన్మూల్యాద్ద్విగుణో దమః 329.*

కంబళి దారాలు మొదలైనవి, దూది, గంజాయి,గోమయములైన పాలు పెరుగునేయివంటివి మంచినీరు, గడ్డి వెదురు పేముతో అల్లిన బుట్టలు, ఉప్పు, మట్టి పాత్రలు, మట్టి, బూడిద చేపలు, పక్షులు, నూనె, నేయి, మాంసం, తేనె పశువులకు సంబంధించిన కొమ్ములు, గిట్టలు వంటివి, మద్యం, పక్వాన్నం, పిండివంటలు మొదలైన వాటిని దొంగిలిస్తే వాటి మూల్యానికి రెండింతలు దండన విధించాలి.

*పుష్పేషు హరితే ధాన్యే గుల్మవల్లీనగేషు చ,*
*అన్యేష్వపరిపూతేషు దండస్స్యాత్పంచకృష్ణలాః 330*

*పరిపూతేషు ధాన్యేషు శాక మూలఫలేషు చ,*
*నిరన్వయే శతం దండస్సాన్వయేఽర్ధశతం దమః 331*

పువ్వులు, చేనులోనున్న ఆకు పచ్చ ధాన్యము, పొదలు, తీగలు, చెట్లు మొదలైనవి, పరిపక్వమునకు రాని తక్కిన ధాన్యాలను దొంగతనం చేస్తే అతనికి ఐదు బంగారు కృష్ణలములు లేక వెండి రూకను దండుగగా విధించాలి. తూర్పారబట్టిన ధాన్యాలు, కూరగాయలు, దుంపలు, పండ్లు, మొదలైనవానిని దొంగిలించినవాడు కుటుంబంలేక ఒంటరివాడైతే అతనికి వంద రూకలు, కుటుంబమున్నవాడైతే అతనికి యాభైరూకలు దండమును విధించాలి.

*స్యాత్సాహసం త్వన్వయవత్ ప్రసభం కర్మ యత్కృతమ్,*
*నిరన్వయం భవేత్ స్తేయం హృత్వాఽ పవ్యయతే చ యత్ 332*

*యస్త్వేతాన్యుపక్లుప్తాని ద్రవ్యాణి స్తేనయేన్నరః,*
*తమాద్యం దండయేద్రాజా యశ్చాగ్నిం చోరయేద్గృహాత్. 333*

*యేన యేన యథాంగేన స్తేనో నృషు విచేష్టతే,*
*తత్తదేవ హరేత్తస్య ప్రత్యాదేశాయ పార్థివః, 334*

యజమాని ఎదుటనే బెదిరించి బలవంతంగా చేయు దోపిడిని సాహసమని అంటారు. యజమానికి తెలియకుండా ఎత్తుకొనిపోయి ఇష్టమొచ్చినట్లు ఖర్చుపెట్టే దానిని దొంగతనమని అంటారు. పైన పేర్కొన్న వస్తువులను, వైదికమైన త్రేతాగ్నిని, గార్హపత్యాగ్నిని దొంగతనం చేస్తే అతనికి ప్రథమ సాహసదండాన్ని విధించాలి. ప్రథమ సాహసమంటే రెండువందల యాభైరూకలు. దొంగ తనయొక్క ఏయే అవయవములను (చేతులు కాళ్ళు) ఉపయోగించి దొంగతనం చేస్తున్నాడో తిరిగి ఆయా అవయవాలతో దొంగతనం చేయకుండా రాజు ఆయా అవయవాలను ఛేదించాలి.

*పితాచార్య స్సుహృన్మాతా భార్యా పుత్రః పురోహితః,*
*నాదండ్యో నామ రాజ్ఞో ఽస్తి యస్స్వధర్మే న తిష్ఠతి 335*

*కార్షాపణం భవేద్దండ్యో యత్రాన్యః ప్రాకృతో జనః,*
*తత్రరాజా భవేద్దండ్యస్సహస్రమితి ధారణా 336*

*అష్టాపాద్యం తు శూద్రస్య స్తేయే భవతి కిల్బిషం*
*షోడశైవ తు వైశ్యస్య ద్వాత్రింశత్ క్షత్రియస్య చ 337*

*బ్రాహ్మణస్య చతుష్షష్టిః పూర్ణం వాపి శతం భవేత్,*
*ద్విగుణా వా చతుష్షష్టి స్తద్దోషగుణవిద్ధి సః 338*

తమ తమ ధర్మములనుష్ఠింపని తండ్రి, ఆచార్యుడు, స్నేహితుడు, తల్లి, భార్య, పుత్రుడు, పురోహితులను సైతము రాజు దండింపవచ్చును. సాధారణ జనానికి ఒక కార్షపణం శిక్షవిధించతగిన తప్పునే రాజు చేస్తే అతడు తనకు వేయిపణముల దండనను విధించుకోవాలి. (తనకుతానే శిక్ష విధించుకొనుట) ఏ దొంతనం చేస్తే సాధారణమైన మానవునికి ఎంత శిక్ష సాధారణంగా విధించబడుతుందో తాను చేసిన దొంగతనాన్ని తానే చెప్పుకొన్న శూద్రునికి ఆ శిక్ష ఎనిమిదిరెట్లు ఉంటుంది. అదే వైశ్యుడైతే పదహారు రెట్లెక్కువ శిక్ష ఉంటుంది. క్షత్రియునికి ముప్ఫై రెండు రెట్లు బ్రాహ్మణునికైతే అరువైనాల్గు లేక నూరు రెట్లు ఎక్కువ శిక్ష ఉంటుంది. అంటే పశ్చాత్తాపంలో శిక్ష ఎక్కువ రెట్లు ఉంటుంది. అట్లే సాధారణ పౌరునికంటె తెలిసిన వానికి, విజ్ఞాన వంతునికి ఎక్కువ శిక్ష ఉంటుంది.

*వానస్పత్యం మూలఫలం దార్వగ్న్యర్థం తథైవ చ,*
*తృణం చ గోభ్యో గ్రాసార్థమస్తేయం మనుర బ్రవీత్ 339*

యాగానికై ఉపయోగ పడే ఫలాలను, కంద మూలాలను సమిధలను దొంగిలించరాదు. అట్లే ఆవులు తినే గడ్డిని కూడ దొంగిలించకూడదని మనువు పలికినాడు.

*యో దత్తాదాయినో హస్తాల్లిప్సేత బ్రాహ్మణో ధనమ్,*
*యజనాధ్యాపనేనాపి యథా స్తేనస్తథైవ సః 340*

*ద్విజోఽధ్వగః క్షీణవృత్తిర్ద్వావిక్షూ ద్వే చ మూలకే,*
*ఆదదానః పరక్షేత్రాన్న దండం దాతుమర్హతి 341*

పరధనాన్ని అపహరించే వాని దగ్గర యజ్ఞయాగాదులు చేయించి, వేదాన్ని చెప్పి ధనాన్ని తీసికుంటే అదీ దొంగతనమే ఔతుంది. అందువల్ల ఆ ధనాన్ని తీసికొన్న బ్రాహ్మణుని దొంగను దండించినట్లే దండించాలి. బాటసారి యైన బ్రాహ్మణుడు ఆహారములేక పక్కనున్న పొలంలో నుండి రెండు చెరుకుగడలను గాని, రెండు చిఱుగడ దుంపలను కాని తీసికొంటే అతడు తన ప్రాణాలను నిలుపుకొనుటకు ఇతరుల పొలంనుండి దొంగతనం చేసినందువల్ల అతనిని శిక్షింపకూడదు.

*అసందితానాం సందాతా సందితానాం చ మోక్షకః,*
*దాసాశ్వరథహర్తా చ ప్రాప్త స్స్యాచ్చౌరకిల్బిషమ్ 342*

స్వేచ్ఛగా తిరుగుతున్న ఇతరుల పశువులను తనంతట తాను కట్టి వేస్తే కొట్టంలో కట్టి వేయబడి ఉన్న పశువులను వదలి పెడ్తే, సేవకులను, గుఱ్ఱాలను రథాలను, అపహరిస్తే, వారిని దొంగను శిక్షించినట్లు శిక్షించాలి.

*అనేన విధినా రాజా కుర్వాణః స్తేననిగ్రహమ్,*
*యశోzస్మిన్ ప్రాప్నుయాల్లోకే ప్రేత్య చానుత్తమం సుఖమ్ 343*

ఈ విధంగా రాజు దొంగలను అరికట్టినందువల్ల లోకంలో కీర్తిని పైలోకంలో సుఖాన్ని పొందుతాడు.

*ఐంద్రం స్థానమభిప్రేప్సుర్యశశ్చాక్షయమవ్యయమ్,*
*నోపేక్షేత క్షణమపి రాజా సాహసికం నరమ్ 344*

దారి దోపిడివంటి సాహస కార్యాలు చేసేవాణ్ణి పట్టుకొని వెంటనే శిక్షిస్తే ఆ రాజు ఈ లోకంలో అంతులేని కీర్తిని మరణించిన తరువాత స్వర్గలోకాన్ని పొందుతాడు.

*వాగ్దుష్టాత్తస్కరాచ్చైవ దండేనైవ చ హింసతః,*
*సాహసస్య నరః కర్తా విజ్ఞేయః పాపకృత్తమః 345*

*సాహసే వర్తమానం తు యో మర్షయతి పార్థివః,*
*స వినాశం ప్రజత్యాశు విద్వేషం చాధిగచ్ఛతి 346*

*సమిత్రకారణాద్రాజా విపులాద్వా ధనాగమాత్,*
*సముత్సృజేత్సాహసికాన్ సర్వభూతభయావహాన్ 347*

తిట్టుట, సొమ్ము దొంగిలించుట, కొట్టుట అను నేరాలు చేసిన వానికంటె దారి దోపిడి, ఇల్లు తగుల బెట్టుట వంటి సాహస కార్యాలు చేయువాడు మిక్కిలి పాపాత్ముడు. పై సాహస కృత్యములుచేయువానిని క్షమించే రాజును ప్రజలందరు ద్వేషింతురు. పైగా అతడు త్వరగా నాశనం పొందును. తన స్నేహితుల మాటననుసరించియో, చాలా డబ్బు వస్తుందన్న ఆశతోనో, అందరికి భయం కలిగించే సాహసికులను ఎప్పుడూ వదలరాదు.

*శస్త్రం ద్విజాతిభిర్గ్రాహ్యం ధర్మో యత్రోపరుధ్యతే*
*ద్విజాతీనాం చ వర్ణానాం విప్లవే కాలకారితే 348*

*ఆత్మనశ్చ పరిత్రాణే దక్షిణానాం చ సంగరే,*
*స్త్రీవిప్రాభ్యుపపత్తౌ చ ఘ్నన్ ధర్మేణ న దుష్యతి. 349*

*గురుం వా బాలవృద్ధౌ వా బ్రాహ్మణం వా బహుశ్రుతమ్,*
*ఆతతాయినమాయాంతంహన్యాదేవావిచారయన్ 350*

*నాతతాయివధే దోషో హంతుర్భవతి కశ్చన,*
*ప్రకాశం వాzప్రకాశం వామన్యుస్తం మన్యుమృచ్ఛతి 351*

సాహసికులు మొదలగు దుర్మార్గులవలన ధర్మకార్యాలు చేయుటకు వీలుకాని సమయంలో, రాజ్యం అరాజకమై ఉన్నప్పుడు, తనకు ప్రాణహాని జరుగుతుందని భయపడినప్పుడు దక్షిణ, ధనం, ఆవులు మొదలైనవాటిని అపహరించుటకై శత్రురాజులు దండెత్తి వచ్చినప్పుడు, స్త్రీలకు, బ్రాహ్మణులకు ఆపద కలిగినప్పుడు ద్విజాతులు శస్త్రాన్ని ధరించి పాపులను చంపితే వారికి పాపం కలుగదు. గురువు, బాలుడు, వృద్ధుడు, బాగుగా చదువుకొన్న బ్రాహ్మణుడు వీరిని చంపుటకై వచ్చు క్రూరున్ని విచారించక చంపవలెను.

ఇతరులను చంపుటకై వచ్చే క్రూరుని రహస్యంగా కాని అందరిముందుకాని చంపినచో ఆ చంపినవానికి పాపమంటదు.

*పరదారాభిమర్శేషు ప్రవృత్తాన్నౄన్మహీపతిః,*
*ఉద్వేజనకరైర్దండైశ్చిహ్నయిత్వా ప్రవాసయేత్ 352*

*తత్సముత్థో హి లోకస్య జాయతే వర్ణ సంకరః,*
*యేన మూలహరో ధర్మః సర్వనాశాయ కల్పతే 353*

*పరస్య పత్న్యా పురుషః సంభాషాం యోజయన్రహః,*
*పూర్వమాక్షారితో దోషైః ప్రాప్నుయాత్పూర్వసాహసమ్ 354*

ఇతరుల భార్యలను ఎత్తుకొని పోవు దుష్టుని, రాజు చెవులు, ముక్కు కోయుట వంటి దండనలతో గుర్తు పెట్టి తన రాజ్యం నుండి వెళ్ళగొట్టాలి. లేనిచో వర్ణ సంకరమేర్పడుతుంది. దాని వల్ల ధర్మమంతా నశించి లోకమంతా చెడుతుంది. అట్లే ఇంతకు ముందే పరస్త్రీలతో చెడు సాహసముచేయువాడనే దోషమున్న పురుషుడు రహస్యంగా పరస్త్రీతో మాట్లాడుతూ ఉంటే అతనికి ప్రథమ సాహసదండాన్ని (రెండువందల యాభైరూకలు) రాజు విధించాలి.

*యస్త్వ నాక్షారితః పూర్వమభిభాషేత కారణాత్,*
*న దోషం ప్రాప్నుయాత్కించిన్న హి తస్య వ్యతిక్రమః 355*

*పరస్త్రియం యోఽభివదేత్తీర్థేఽరణ్యే వనేఽపి వా,*
*నదీనాం వాపి సంభేదే సంగ్రహణమాప్నుయాత్ 356*

తనపై ఎటువంటి అపవాదం లేని పురుషుడు ఏదో ఒక కారణం వల్ల ఇతర స్త్రీతో నలుగురిలో మాట్లాడితే అతనికి ఎటువంటి దోషమంటదు. పుణ్య తీర్థములందో, అరణ్యములందో, తోటలలోనో, నదీ సంగమప్రాంతమందు గాని పరస్త్రీతో కారణముండి మాట్లాడినప్పటికీ అతనికి పర స్త్రీ గమనాభిలాష కలదని నిశ్చయించి సంగ్రహణమను దండాన్ని (వేయి రూకలు) వేయవలెను.

*ఉపచార క్రియా కేళిః స్పర్శో భూషణవాససామ్,*
*సహ ఖట్వాసనం చైవ సర్వం సంగ్రహణం స్మృతమ్ 357*

*స్త్రియం స్పృశేదదేశే యః స్పృష్టో వా మర్షయేత్తయా,*
*పరస్పరస్యానుమతే సర్వం సంగ్రహణం స్మృతమ్ 358*

పూల దండలు, గంధం మొదలైన వాటిని పంపుట మొదలైన ఉపచారాలు చేయుట, వేళాకోళం చేయుట, కౌగిలించుకొనుట మొదలైనవి. సొమ్ములు, బట్టలు తాకుట, ఒకే మంచంమీద కూర్చుండుట మొదలగునవి సంగ్రహణమునకు ( పరస్త్రీని కోరుటకు ) గుర్తులని అంటారు. స్త్రీని తాకరాని ప్రాంతములలో ముట్టుకొన్నా అప్పుడా స్త్రీ కూడా ఏమి యనక ఊరకున్నా ఆ స్త్రీ పురుషులిద్దరి మధ్య సంగమాభిలాష ఉన్న దని గుర్తించవలెను. అప్పుడు వారిద్దరు దోషులే.

*అబ్రాహ్మణస్సంగ్రహణే ప్రాణాంతం దండమర్హతి,*
*చతుర్ణామపి వర్ణానాం దారా రక్ష్యతమాస్సదా 359*

బ్రాహ్మణేతరుడు పర స్త్రీని కామిస్తే అతనికి మరణాన్ని శిక్షగా విధించాలి. అందువల్ల సమస్త కులాలవారు తమతమ భార్యలను జాగ్రత్తగా రక్షించుకోవలెను.

*భిక్షుకా పందినశ్చైవ దీక్షితాః కారవస్తథా,*
*సంభాషణం సహ స్త్రీభిః కుర్యురప్రతివారితాః 360*

బిచ్చగాండ్రు, స్తుతిపాఠకులు, యజ్ఞదీక్షవహించినవారు, వంటలు మొదలగు పనులు చేయువారు పరస్త్రీలతో మాటాడినచో అనుమానపడకూడదు.

*న సంభాషాం పరస్త్రీభిః ప్రతిషిద్ధస్సమాచరేత్,*
*నిషిద్ధో భాషమాణస్తు సువర్ణం దండమర్హతి, 361*

*నైష చారణదారేషు విధిర్నాత్మోపజీవిషు,*
*సజ్జయంతి హి తే నారీర్నిగూఢాశ్చారయంతి చ 362*

*కించిదేవ తు దాప్యస్స్యాత్సంభాషాం తాభిరాచరన్,*
*ప్రైష్యాసు చైకభక్తాసు రహః ప్రవ్రజితాసు చ 363*

యజమానిని వారించినా వినక భృత్యుడు పరస్త్రీలోలతో ముచ్చట పెట్టకూడదు. అట్లు చేస్తే అతనికి ఒక బంగారు నాణెమును దండముగా విధింపవచ్చును. కాని నటులు, గాయకులు, తమ భార్యల వలననే బ్రదుకువారు ఐన వారియొక్క భార్యలతో మాట్లాడినచో తప్పులేదు. కాని ఆ స్త్రీలతో సైతం రహస్యంగా మాట్లాడితే తప్పెఔతుంది. కావున వారికి కొద్దిగా దండన విధింప వచ్చును. అట్లే బానిస స్త్రీలతోను, నియమంలేని బౌద్ధ సన్యాసినులతోను, బ్రహ్మచారిణులతోను, రహస్యంగా మాట్లాడితే వారికి తక్కువ దండన విధించాలి.

*యో కామాం దూషయేత్కన్యాం న సద్యో వధమర్హతి,*
*సకామాం దూషయంస్తుల్యో న వధం ప్రాప్నుయాన్నరః 364*

*కన్యాం భజంతీముత్కృష్టం న కించిదపి దాపయేత్,*
*జఘన్యం సేవమానాం తు సంయతాం వాసయేత్ గృహే 365*

*ఉత్తమాం సేవమానస్తు జఘన్యో వధమర్హతి,*
*శుల్కం దద్యాత్సేవమానః సమామిచ్ఛేత్పితా యది 366*

*అభిషహ్య తు యః కన్యాం కుర్యాద్దర్పేణ మానవః,*
*తస్యాశు కర్త్యే అంగుళ్యా దండం చార్హతి షట్ శతమ్ 367*

*సకామాం దూషయంస్తుల్యో నాంగుళిచ్ఛేదమప్నుయాత్,*
*ద్విశతం తు దమం దాప్యః ప్రసంగవినివృత్తయే 368*

*కన్యైవ కన్యాం యా కుర్యా త్తస్యాస్స్యా ద్విశతో దమః,*
*శుల్కం చ ద్విగుణం దద్యాచ్ఛిఫాశ్చైవాప్నుయాద్దశ. 369*

*యా తు కన్యాం ప్రకుర్యాత్ స్త్రీ సా సద్యో మౌండ్యమర్హతి,*
*అంగుళ్యో రేవ వా ఛేదం ఖరేణోద్వహనం తథా 370*

కోరికలేని కన్యను బలవంతంగా చెరిచిన వానికి మరణ దండన విధించాలి కాని కన్య తాను కూడ ఇష్టపడితే అచ్చట తప్పు ఇద్దరిది కావున పురుషుడికి శిక్షవేయనక్కరలేదు. తన కంటె ఉత్తమ జాతికి చెందిన పురుషుని వలచి పోయిన కన్యను శిక్షించకూడదు. కాని తన కంటె తక్కువ జాతి పురుషుని వలచిపోయిన కన్యను కామమంత పోవునట్లు ఇంటిలోనే నిర్బంధించాలి. ఉత్తమజాతికి చెందిన స్త్రీని వలచిపోయిన వానిని శిక్షించాలి. లేక తనజాతికి చెందిన కన్యను వలచి పోయినచో ఆ కన్య యొక్క తండ్రి సమ్మతిని తీసికొని వివాహం చేసికొన వచ్చును. అందు వలన అతడు దండనయోగ్యుడు కాజాలడు. కన్య యోనిలోకి బలాత్కారంగా వేళ్లను జొప్పించి ఆ కన్యకు బాధ కలిగించే పురుషుడు సమాన జాతివాడైనా దండన యోగ్యుడగుచున్నాడు. కాని తనను ప్రేమించు కన్య యోనిలో వేళ్ళు పెట్టి ఆ స్త్రీని బాధ పెట్టిన పురుషునికి పై పురుషుని వలెగాక తక్కువ దండన విధించాలి. కన్య వేరొక కన్య యోనిలో వేళ్ళు పెట్టి చెరుపు చేస్తే ఆ కన్యకు రెండువందల రూకల దండనతో పాటు మట్టి ఊడతో పది దెబ్బలు కొట్టవలెను. కన్యక మర్మాంగంలో వేళ్ళు పెట్టి బాధ కలిగించిన స్త్రీ యొక్క తలను కొరిగించి, ఆమె రెండు వేళ్ళను ఖండిచి గాడిదపై నెక్కించి ఊరేగించాలి.

*భర్తారం లంఘయేద్యా తు స్త్రీ జాతిగుణదర్పితా,*
*తాం శ్వభిః ఖాదయే ద్రాజా సంస్థానే బహుసంస్థితే 371*

*పుమాంసం దాహయేత్పాపం శయనే తప్త అయసే,*
*అభ్యాదధ్యుశ్చ కాష్ఠాని తత్ర దహ్యేత పాపకృత్ 372*

*సంవత్సరాభిశ స్తస్య దుష్టస్య ద్విగుణో దమః,*
*వ్రాత్యయా సహ సంవాసే చాండాల్యా తావదేవ తు 373*

తన తండ్రి యొక్క ఐశ్వర్యం, కులం మొదలైన వానిని చూచుకొని గర్వపడుతూ భర్తను లెక్కసేయక పర పురుష గమనం చేసే స్త్రీని రాజు తన సభలో అందరు చూస్తుండగానే కుక్కలచే కరిపింపవలెను. ఆపాప కార్యాన్ని చేసిన పురుషుని భగ భగ మండుచున్న ఇనప శయ్యపై పరుండబెట్టి అతడు తగలబడిపోవునంతవరకు రాజు చూడవలెను. పర స్త్రీని పొంది దానిచే భ్రష్టుడై ఒక సంవత్సరం వరకు దండన పొందని పురుషునకు ఇంతకుముందు చెప్పిన దండన కంటె రెట్టింపు దండన విధించవలెను. కర్మ భ్రష్టుడైన వ్రాత్యునితో సంగమనం చేస్తే చండాల స్త్రీని పొందినట్లు దండించాలి.

*శూద్రో గుప్తమగుప్తం వా ద్వైజాతం వర్ణమావసన్,*
*అగుప్తమంగసర్వ స్వైర్గుప్తం సర్వేణ హీయతే 374*

*వైశ్యస్సర్వస్వదండస్స్యాత్సంవత్సర నిరోధతః,*
*సహస్రం క్షత్రియో దండ్యో మౌండ్యం మూత్రేణ చార్హతి 375*

*బ్రాహ్మణీం యద్యగుప్తాం తు గచ్ఛేతాం వైశ్య పార్థివౌ,*
*వైశ్యం పంచ శతం కుర్యాత్క్షత్రియం తు సహస్రిణమ్ 376*

*ఉభావపి తు తావేవ బ్రాహ్మణ్యా గుప్తయా సహ,*
*విప్లుతౌ శూద్ర వద్దండ్యౌదగ్ధవ్యౌ వా కటాగ్నినా 377*

శూద్రుడు పెండ్లికాని ఉన్నత జాతి స్త్రీతో సంగమిస్తే లింగచ్ఛేదము చేయవలెను. పెండ్లియైన ఉన్నత వర్ణమునకు చెందిన స్త్రీతో రమించినచో అతని అంగాన్ని నరికి వేసి అతని ధనాన్నంతా రాజు తీసికొనవలెను. వైశ్యుడు పెండ్లియైన ఉన్నత జాతిస్త్రీతో రమిస్తే అతని సంపదనంతా రాజు తీసికొనవలెను. అట్లే క్షత్రియుడు చేసినచో వేయి రూకలదండాన్ని, విధించి తలగొరిగించవలెను. పెండ్లిగాని బ్రాహ్మణస్త్రీతో వైశ్యుడు కాని క్షత్రియుడు కాని పోయినచో వైశ్యునికి ఐదు వందల రూకల దండనను, క్షత్రియునకు వేయి రూకల దండనను విధించవలెను. ఈ వైశ్య క్షత్రియులు వివాహితయైన బ్రాహ్మణ స్త్రీతో పోయినచో శూద్రుని దండించినట్లు మండుచున్న ఇనుపశయ్య పై పండబెట్టి తగుల బెట్టవలెను.

*సహస్రం బ్రాహ్మణో దండ్యో గుప్తాం విప్రాం బలాద్వ్రజన్,*
*శతాని పంచ దండ్యస్స్యాదిచ్ఛంత్యా సహ సంగతః 378*

*మౌండ్యం ప్రాణాంతికో దండో బ్రాహ్మణస్య విధీయతే,*
*ఇతరేషాం తు వర్ణానాం దండః ప్రాణాంతికో భవేత్ 379*
*న జాతు బ్రాహ్మణం హన్యాత్సర్వపాపేష్వపి స్థితమ్,*
*రాష్ట్రాదేనం బహిః కుర్యాత్సమగ్రధనమక్షతమ్. 380*

వివాహితయైన స్త్రీతో బలవంతంగా రమించిన బ్రాహ్మణునకు వేయిరూకల దండన విధించవలెను. ఆ స్త్రీ తాను ఇష్టపడి ఇంకొక బ్రాహ్మణునితో పోతే అతనికి ఐదువందల రూకల దండన విధించాలి. అట్లే బ్రాహ్మణునకు ప్రాణాంతిక దండం (మండుచున్న ఇనుప శయ్యపై పండ బెట్టి ప్రాణములు తీయుట) శిరోముండనమే. ఇతర జాతుల వారికి ప్రాణాంతిక దండము విధింపవచ్చును. బ్రాహ్మణుడెన్ని పాపాలు చేసినా ప్రాణ దండమును మాత్రము విధించకూడదు. అవసరమైనచో అతనిని పుత్ర ధనములతో సహ రాజ్యమునుండి వెళ్ళ గొట్టవలెను.

*న బ్రాహ్మణ వధాద్భూయానధర్మో విద్యతే భువి,*
*తస్మాదస్య వధం రాజా మనసాపి న చింతయేత్ 381*

బ్రాహ్మణుని చంపుటకంటె అధర్మమెచ్చటకనిపించదు. అందువల్ల రాజు బ్రాహ్మణ వధాన్ని మనసులో సైతము ఆలోచించకూడదు.

*వైశ్యశ్చేత్క్షత్రియాం గుప్తాం వైశ్యాం వా క్షత్రియోవ్రజేత్,*
*యో బ్రాహ్మణ్యామగుప్తాయాం తావుభౌ దండమర్హతః 382*

వివాహిత యైన క్షత్రియ స్త్రీని వైశ్యుడు గాని వివాహితయైన వైశ్యస్త్రీని క్షత్రియుడుగాని పొందినచో వివాహితగాని బ్రాహ్మణ స్త్రీని పొందిన వైశ్య క్షత్రియులకు

దండం విధించినట్లు వైశ్యునకు ఐదువందల రూకలు, క్షత్రియునకు వేయి రూకలు దండన విధించవలెను.

*సహస్రం బ్రాహ్మణో దండం దాప్యో గుప్తే తు తే వ్రజన్,*
*శూద్రాయాం క్షత్రియవిశోః సాహస్రో వై భవేద్దమః 383*

*క్షత్రియాయామగుప్తాయాం వైశ్యే పంచశతం దమః,*
*మూత్రేణ మౌండ్యమిచ్ఛేత్తు క్షత్రియో దండ మేవ వా, 384*

*అగుప్తే క్షత్రియా వైశ్యే శూద్రాం వా బ్రాహ్మణో వ్రజన్,*
*శతాని పంచ దండ్యస్స్యాత్సహస్రంత్వంత్యజస్త్రియం 385*

వివాహితలైన క్షత్రియ స్త్రీలను పొందినచో బ్రాహ్మణునకు వేయిరూకలు, వివాహితయైన శూద్ర స్త్రీని పొందిన వైశ్య క్షత్రియులకు వేయి రూకలు దండన విధించవలెను. అవివాహిత యైన క్షత్రియ స్త్రీతో వైశ్యుడు పోతే అతనికి ఐదు వందల రూకలు దండన విధించవలెను. అట్లే అవివాహితయైన వైశ్య స్త్రీని పొందిన క్షత్రియునకు ఐదు వందల రూకల దండంతో పాటు శిరోముండనం చేయించాలి. అవివాహితలైన క్షత్రియ వైశ్య శూద్ర స్త్రీలలో ఏ స్రీతో నైనా బ్రాహ్మణుడు కలిసినచో ఆ బ్రాహ్మణునికి ఐదువందల రూకల దండమువిధించాలి. చండాల కాంతతో వ్యభిచారం చేస్తే అతనికి వేయి రూకల దండం విధించాలి.

*యస్య స్తేనః పురే నాస్తి నాన్యస్త్రీగో న దుష్టవాక్,*
*న సాహసిక దండఘ్నో న రాజా శక్రలోకభాక్ 386*

*ఏతేషాం నిగ్రహో రాజ్ఞః పంచానాం విషయే స్వకే,*
*సామ్రాజ్యకృత్సజాత్యేషు లోకే చైవ యశస్కరః 387*

ఏ రాజ్యంలో దొంగ కాని, అన్య కాంతా గమనం చేసే వాడు గాని, పరుషంగా మాట్లాడేవాడు కాని, సాహసికుడు, దండ పారుష్యం చేయువాడు కాని లేకపోతే ఆ రాజు స్వర్గాన్ని పొందుతాడు. ఈ ఐదుగురు తన రాజ్యంలో లేకుండా చేసిన రాజు తోటి రాజులలో చక్రవర్తియై కీర్తిమంతుడౌతున్నాడు.

*ఋత్విజం యస్త్యజేద్యాజ్యో యాజ్యం చర్త్విక్ త్యజేద్యది,*
*శక్తం కర్మణ్యదుష్టం చ తయోర్దండ శ్శతం శతమ్ 388*

*న మాతా న పితా న స్త్రీ న పుత్రస్త్యాగమర్హతి,*
*త్యజన్న పతితా నేతా న్రాజ్ఞా దండ్యశ్శతాని షట్ 389*

యాజ్యుడు మహాపాతకాదిపాపాలు లేని ఋత్విక్కును వదలినా, ఋత్విక్కు ఏదోషంలేని యాజ్యుని వదలినా వారిద్దరకు నూరేసి రూకలు దండము విధించాలి. ఏ దోషంలేని తల్లిని, తండ్రిని, భార్యను పుత్రుని వదలితే ఆరువందల రూకలు దండం విధించాలి.

*ఆశ్రమేషు ద్విజాతీనాం కార్యే వివదతాం మిథః,*
*న విబ్రూయాన్నృపో ధర్మం చికీర్షన్ హితమాత్మనః 390*

*యథార్హమేతానభ్యర్చ్య బ్రాహ్మణైస్సహ పార్థివః,*
*సాంత్వేన ప్రశమయ్యాదౌ స్వధర్మం ప్రతిపాదయేత్ 391*

బ్రాహ్మణులు తమ ఆశ్రమాచార ధర్మాలగురించి వివాదం పెట్టుకొనుచున్నప్పుడు రాజు వారి మధ్యకు పోయి ఇది సరియైనది. ఇది సరికాదని తీర్మానముచేయరాదు. అప్పుడు ఆ బ్రాహ్మణులను ఇతర బ్రాహ్మణులతో కలిపి గౌరవించి వారిని మంచి మాటలతో శాంతపరచి తరువాత వారి ధర్మమును వారికి బోధింపవలెను.

*ప్రాతి వేశ్యానువేశ్యౌ చ కల్యాణే వింశతిర్ద్విజే,*
*అర్హా వభోజయన్ విప్రో దండమర్హతి మాషకమ్ 392*

*శ్రోత్రియః శ్రోత్రియం సాధుం భూతికృత్యేష్వభోజయన్,*
*తదన్నం ద్విగుణం దాప్యో హిరణ్యం చైవ మాషకమ్ 393*

పెండ్లి మొదలగు కల్యాణ సమయములందు ఇరువై మందిని భోజనానికి పిలిచినా తన పక్కింటివారిని, వారియొక్క పక్కింటి వారిని భోజనానికి పిలువవలెను. లేనిచో ఆ బ్రాహ్మణునకు ఒక వెండి రూక అపరాధం విధించాలి. శ్రోత్రియుడైన బ్రాహ్మణుడు తన ఇంట జరుగు శుభకార్యములందు శ్రోత్రియుడు సాధుపురుషుడగు తన పక్కింటివానిని అతని పక్కింటి వానిని భోజనానికి పిలువక పోతే వారికి పెట్టు భోజనమునకు రెండు రెట్లెక్కువ అన్నము పెట్టాలి. అట్లే రాజు ఇంటి యజమానికి ఒక బంగారు మాడను అపరాధంగా విధించవలెను.

*అంధో జడః పీఠసర్పీ సప్తత్యా స్థవిరశ్చ యః,*
*శ్రోత్రియేషూపకుర్వంశ్చ న దాప్యాః కేనచిత్కరమ్ 394*

*శ్రోత్రియం వ్యాధితార్తౌ చ బాలవృద్ధావకించనమ్,*
*మహాకులీన మార్యం చ రాజా సంపూజయే త్సదా 395*

గుడ్డివాడు, జడుడు, కుంటివాడు, డెబ్బై యేండ్లు నిండినవాడు, శ్రోత్రియులకు ధన ధాన్యాదికములనిచ్చి ఉపకారము చేయువాడు వీరి దగ్గరి నుండి రాజు పన్నును తీసికొనరాదు. శ్రోత్రియుని, రోగిని, బాధపడుతున్నవానిని, బాలుని, వృద్ధుని, దరిద్రుని, గొప్పకులములో పుట్టిన వానిని, పూజ్యుడగువానిని రాజు ఎల్లప్పుడు గౌరవింపవలెను.

*శాల్మ లీఫలకే శ్లక్ష్ణే నేనిజ్యాన్నేజకశ్శనైః*
*న చ వాసాంసి వాసోభిర్ని ర్హరేన్న చ వాసయేత్ 396*

*తంతువాయో దశపలం దద్యాదేకపలాధికమ్,*
*అతోఽన్యథా వర్తమానో దాప్యో ద్వాదశకం దమమ్ 397*

చాకలివాడు మిట్ట పల్లములు లేని బూరుగు పలక మొదలగు వానిపై మెల్లగా బట్టలుతుకవలెను. ఒకరి బట్టలతో వేరొకరి బట్టలు తీసికొని పోరాదు. అట్లే అట్లే ఒకరి

బట్టలు మరొకరికి కట్టుకొనుటకివ్వరాదు. లేనిచో అతడు దండనమునకర్హుడు. సాలెవాడు పదిపలములనూలు తీసికొని పదకొండు ఫలముల బట్టనీయవలెను. లేనిచో వానికి పన్నెండు రూకలు దండన విధించాలి.

*శుల్కస్థానేషు కుశలాస్సర్వపణ్య విచక్షణాః,*
*కుర్యురర్ఘం యథాపణ్యం తతో వింశం నృపో హరేత్ 398*

*రాజ్ఞః ప్రఖ్యాతభాండాని ప్రతిషిద్ధాని యాని చ*
*తాని నిర్హరతో లోభాత్సర్వహారం హరేన్నృపః, 399*

సమస్త వర్తకములందు నేర్పరులైన వర్తక శ్రేష్ఠులు సుంకము నిర్ణయిస్తారు. ఆ వస్తువుల నా వెలకమ్మగా వచ్చిన లాభం పై రాజునకు సంబంధించి విక్రయింపదగిన ఏనుగులు, గుఱ్ఱాలు మొదలగునవి ఇతర దేశాలకు తీసికొని పోకుండ నిషిద్ధమైన వస్తువులను ఆశవల్ల ఇతర దేశములకు తీసికొని పోవు వర్తకుల సర్వస్వాన్ని రాజు హరింపవలెను.

*శుల్కస్థానం పరిహరన్నకాలే క్రయవిక్రయీ,*
*మిథ్యావాదీ చ సంఖ్యానే దాప్యోఽ ష్టగుణ మత్యయమ్ 400*

సుంకము వేయు స్థలమునుండి సరుకులను తప్పించి అకాలమున క్రయవిక్రయములు చేయుచు సుంకము తక్కువగా పడవలెనని అబద్ధములాడు వర్తకుని వస్తువులపై రాజు ఎనిమిది రెట్లు దండన విధించాలి.

*ఆగమం నిర్గమం స్థానం తథా వృద్ధిక్షయావుభౌ,*
*విచార్య సర్వపణ్యానాం కారయేత్ క్రయవిక్రయౌ 401*

*పంచరాత్రే పంచరాత్రే పక్షే పక్షేఽథవా గతే*
*కుర్వీత చైషాం ప్రత్యక్షమర్ఘ సంస్థాపనం నృపః 402*

*తులామానం ప్రతీమానం సర్వం చ స్యాత్సురక్షితమ్*
*షట్సు షట్సు చ మాసేషు పునరేవ పరీక్షయేత్ 403*

వస్తువు లెక్కడినుండి వచ్చుచున్నవో, ఎంత దూరము పోవుచున్నవో, దానివలన దారి బత్తెము మొదలగు వాటి కెంత ఖర్చగుచున్నది. ఎంతలాభము రావచ్చును అనుసమస్త విషయములను విచారించి వస్తువులను కొనువారికి వర్తకులకు నష్టము కలుగకుండునట్లు క్రయ విక్రయములు జరుగునట్లు రాజు చూడవలెను. ఐదు దినములకొకసారి లేక పక్షం రోజులకైనా వస్తువుల యొక్క విలువలు చక్కగా దెలిసిన వర్తకుల సమక్షంలో రాజు మూల్య నిర్ణయం చేయాలి. తూనిక రాళ్ళు, కొలతకు ఉపయోగించు వస్తువులు చక్కగా ఉన్నవో లేదో అన్న విషయాన్ని రాజు ఆరు నెలలకొక సారి పరీక్షించాలి.

*పణం యానం తరే దాప్యం పౌరుషోఽర్ధపణం తరే,*
*పాదం పశుశ్చ యోషిచ్చ పాదార్ధం రిక్తకః పుమాన్ 404*

*భాండపూర్ణాని యానాని తార్యం దాప్యాని సారతః,*
*రిక్తభాండాని యత్కించిత్పుమాంసశ్చాపరిచ్ఛదాః 405*

*దీర్ఘాధ్వని యథాదేశం యథాకాలం తరో భవేత్,*
*నదీతీరేషు తద్విద్యాత్సముద్రే నాస్తి లక్షణమ్ 406*

బరువులేని బండ్లను ఓడపై ఈ ఒడ్డునుండి ఆ ఒడ్డునకు చేర్చితే ఓడ యాజమానికి ఒక పణమివ్వాలి. అదే బరువుతో నున్న మనిషిని దాటిస్తే అర్థపణమివ్వాలి. పశువులను, స్త్రీలను నది దాటిస్తే పావురూక ఇవ్వాలి. అదే ఏ వస్తువులు లేని మనిషిని దాటిస్తే పావురూకలో సగభాగమివ్వాలి. సరుకులతో నున్న బండ్లు మొదలైన వాటిని దాటిస్తే వాటి వాటి బరువులకు తగ్గట్లు ఇవ్వాలి. లోపల ఏ వస్తువులు లేని భాండములు మొదలైన వాటిని, దరిద్రులను నది దాటిస్తే ఎంతో కొంత ఇవ్వాలి. పడవలో చాలా దూరంపోతే వారి ప్రయాణానికి తగ్గట్లు, కాలాన్ని కూడ (ఆటుపోట్లు వచ్చు సమయాన్ని) దృష్టిలో ఉంచుకొని ఓడల్లో ప్రయాణం చేయువాడు ఇవ్వలసిన ధనాన్ని నిర్ణయించాలి. సముద్ర ప్రయాణమందరికి సంబంధించింది కాదు కాబట్టి సముద్ర ప్రయాణం చేయాల్సినవారు చెల్లించాల్సిన ధనం నిర్ణయించబడలేదు.

*గర్భిణీ తు ద్విమాసాది స్తథా ప్రవ్రజితో మునిః,*
*బ్రాహ్మణా లింగినశ్చైవ న దాప్యాస్తారికం తరే.407*

*యన్నావికించిద్దాశానాం విశీర్యేతాపరాధతః,*
*తద్దాశైరేవ దాతవ్యం సమాగమ్య స్వతోऽంశతః.408*

*ఏష నౌయాయినాముక్తో వ్యవహారస్య నిర్ణయః,*
*దాశాపరాధతస్తోయే దైవికే నా స్తి నిగ్రహః.409*

రెండు నెలలు నిండిన గర్భిణీస్త్రీ, సన్యాసి, వానప్రస్థుడు బ్రాహ్మణులు, బ్రహ్మచారులు వీరిని ఉచితంగా నదిని దాటించాలి. నావికుల అజాగ్రత్త వల్ల నౌకా ప్రయాణీకులకు నష్టం కలిగితే ఆ నష్టాన్ని నావికులే భరించాలి. కాని దైవం వల్ల సంభవించిన తుఫాను మొదలగు కారణాలవల్ల ప్రయాణీకులకు నష్టం వాటిల్లితే దాన్ని మాత్రం నావికులు భరించుకోనవసరంలేదు.

*వాణిజ్యం కారయేద్వైశ్యం కుసీదం కృషిమేవ చ,*
*పశూనాం రక్షణం చైవ దాస్యం శూద్రం ద్విజన్మనామ్.410*

*క్షత్రియం చైవ వైశ్యంచ బ్రాహ్మణో వృత్తికర్శితౌ,*
*బిభృయాదానృశంస్యేన స్వాని కర్మాణి కారయన్.411*

*దాస్యం తు కారయన్ లోభాద్బ్రాహ్మణాస్సంస్కృతాన్ ద్విజాన్,*
*అనిచ్ఛతః ప్రాభవత్యాద్రాజ్ఞా దండ్య శ్శతాని షట్412*

*శుద్రం తు కారయేద్దాస్యం క్రీతమక్రీత మేవ వా,*
*దాస్యాయైవ హి సృష్టోऽసౌ బ్రాహ్మణస్య స్వయంభువా.413*

*న స్వామినా నిస్పృష్టోऽపి శూద్రో దాస్యాద్విముచ్యతే,*
*నిసర్గజం హి తత్తస్య క స్తస్మాత్తదపోహతి.414*

వైశ్యుడు వర్తకం, వడ్డీ జీవనం, సేద్యం, పశురక్షణ, చేయవచ్చు. శూద్రుడు

ద్విజశుశ్రూష మాత్రం చేయాలి. క్షత్రియ వైశ్యులొక వేళ తమ వృత్తిని చేయలేక బ్రాహ్మణుని దగ్గరకు వస్తే బ్రాహ్మణుడు వారికి ఆశ్రయమిచ్చి, వారితో వారి కులవృత్తియైన రక్షణ వర్తకాదులనుచేయిస్తూ తాత్కాలికంగా వారి భారాన్ని వహించాలి. బ్రాహ్మణుడు తనకున్న రాజకీయ ప్రాబల్యంవల్ల ఉపనయనాది సంస్కారాలను పొందిన ద్విజులచే బలవంతంగా దాస్యం చేయిస్తూ ఉంటే రాజు ఆ బ్రాహ్మణునికి ఆరువందల రూకల దండమును విధించాలి. శూద్రుని వృత్తి దాస్యం చేయుటయే కాబట్టి శూద్రునితో ఎట్లైనను బ్రాహ్మణుడు దాస్యం చేయించుకోవచ్చు. అతని యజమాని దాస్యం చేయవద్దని పంపినా శూద్రుడు దాస్యం చేయక తప్పదు.

*ధ్వజాహృతో భక్తదాసో గృహజః క్రీతదత్రిమౌ,*
*పైత్రికో దండదాసశ్చ సప్తైతే దాసయోనయః.415*

యుద్ధంలో జయింపబడ్డవాడు, బత్తెంపై ఆశతో దాస్యం చేసేవాడు, దాసీపుత్రుడు, ధనమిచ్చికొనబడ్డవాడు, అట్లే ఇతరులచే ఇవ్వబడిన వాడు, వంశ పరంపరగా వచ్చినవాడు, దండం చెల్లించలేక దాసుడైనాడు. ఈ ఏడుగురు దాసులు .

*భార్యాపుత్రశ్చ దాసశ్చ త్రయ ఏవాధనాః స్మృతాః,*
*యత్తే సమధిగచ్ఛంతి యస్య తే తస్య తద్ధనమ్.416*

*విస్రబ్ధం బ్రాహ్మణశ్శూద్రాద్ద్రవ్యోపాదానమాచరేత్,*
*న హి తస్యాస్తి కించిత్స్వం భర్తృహార్యధనో హి సః.417*

*వైశ్యశూద్రౌ ప్రయత్నేన స్వాని కర్మాణి కారయేత్,*
*తౌ హి చ్యుతౌ స్వకర్మభ్యః క్షోభయేతా మిదం జగత్.418*

తన భార్య, పుత్రుడు, దాసుడు ఈ ముగ్గురు ధనహీనులని అంటారు. వారు ముగ్గురు సంపాదించినదంతా యజమానికే చెందుతుంది. ఎట్టి సందేహం పెట్టుకోక బ్రాహ్మణుడు తన దగ్గర పనిచేయు సేవకుని ధనాన్ని అంతా వాడుకోవచ్చు. ఆ సేవకునికి స్వతంత్రంగా ధనమేది ఉండదు. అతడు సంపాదించినదంతా యజమానికే దక్కుతుంది కావున యజమాని ఆ ధనాన్ని తీసికొనవచ్చు. వైశ్యుడు శూద్రుడు తమ తమ వృత్తులను వదలుకొంటే ప్రపంచమే కష్టంలో పడుతుంది. అందువల్లవారు తమ వృత్తులను తప్పక నిర్వహించాలి.

*అహన్యహన్యవేక్షేత కర్మాంతాన్ వాహనాని చ,*
*ఆయవ్యయౌ చ నియతా వాకరాన్ కోశమేవ చ.419*

రాజు ప్రతిదినం ఆయా అధికారులకు అప్పగించిన పనులను ఎన్ని వాహనాలున్నవి? ఎన్ని నష్టమైనవను విషయాన్ని ఆదాయ వ్యయాలను, రత్నాదులు పుట్టిన స్థలాలను, భాండాగారాన్ని స్వయంగా పరీక్షించాలి. వీటిపై అధికారులన్నారని ఏ మరుపాటున ఉండకూడదు.

*ఏవం సర్వా నిమాన్రాజా వ్యవహారాన్ సమాపయన్,*

*వ్యపోహ్యా కిల్బిషం సర్వం ప్రాప్నోతి పరమాం గతిమ్.420*

రాజు ఈ విధంగా సమస్త వ్యవహారాలను చక్కగా నిర్ణయిస్తూ ఉంటే అతనికి ఎటువంటి పాపమంటదు. పైగా ఉత్తమలోకాలను పొందుతాడు.

ఇతి మానవే ధర్మశాస్త్రే భృగు ప్రోక్తాయాం సంహితాయాం అష్టమోऽధ్యాయః

భృగు మహర్షి చెప్పిన మానవ ధర్మ శాస్త్రమనే సంహితలో ఎనిమిదవ అధ్యాయం సమాప్తం.



## నవమాధ్యాయం

*పురుషస్య స్త్రియాశ్చైవ ధర్మ్యే వర్త్మని తిష్ఠతోః,*

*సంయోగే విప్రయోగే చ ధర్మాన్ వక్ష్యామి శాశ్వతాన్ 1*

ధర్మమార్గంలో నున్న స్త్రీలు పురుషులు వియోగంలో ఉన్నప్పుడు కలిసియున్నపుడు ఆచరించాల్సిన ధర్మాలను ఇక మీకు వివరిస్తున్నానని భృగుమహర్షి పలికెను.

*అస్వతంత్రాః స్త్రియః కార్యాః పురుషై స్స్వైర్దివానిశం,*

*విషయేషు చ సజ్జంత్యస్సంస్థాప్యా ఆత్మనో వశే 2*

*పితా రక్షతి కౌమారే భర్తా రక్షతి యౌవనే,*

*రక్షంతి స్థావిరే పుత్రా న స్త్రీ స్వాతంత్ర్యమర్హతి 3*

*కాలేऽ దాతా పితా వాచ్యో వాచ్యశ్చాశ్చానుపయన్ పతిః,*

*మృతే భర్తరి పుత్రస్తు వాచ్యో మాతురరక్షితా 4*

*సూక్ష్మేభ్యోऽపి ప్రసంగేభ్యః స్త్రియో రక్ష్యా విశేషతః,*

*ద్వయోర్హి కులయో శ్శోకమావహేయురరక్షితాః 5*

*ఇమం హి సర్వవర్ణానాం పశ్యంతో ధర్మముత్తమమ్,*

*యతంతే రక్షితుం భార్యాం భర్తారో దుర్బలా అపి 6*

పురుషులు తమ స్త్రీలనెల్లప్పుడు తమ అధీనంలోనే ఉంచుకోవలెను. ఆ స్త్రీలు అనేక విషయములపై ఆసక్తిచూపుతు స్వతంత్రంగా ప్రవర్తిస్తుంటే ఊరుకోక పురుషులు తమ వశంలో ఉంచుకోవాలి. స్త్రీని బాల్యంలో తండ్రి రక్షిస్తాడు. యౌవనంలో భర్త రక్షిస్తాడు. ముసలి తనంలో కొడుకు రక్షిస్తాడు. ఈ విధంగా స్త్రీలు ఎప్పుడు ఒకరి దగ్గర ఉండడమే మంచిది కాని ఒంటరిగా ఎప్పుడు ఉండకూడదు. యుక్తవయస్సులో తన కూతురుకు పెండ్లి చేయకపోతే తండ్రిని నిందిస్తారు. భార్యతో కలిసిమెలిసి ఉండకపోతే భర్తను తిడ్తారు. తండ్రి చనిపోయిన తరువాత తల్లిని చక్కగా చూచుకొనకపోతే లోకులు కొడుకును తిడ్తారు. అతి సూక్ష్మమే ఐనా దుష్టులస్నేహం నుండి స్త్రీని జాగ్రత్తగా చూచుకోవాలి. దుష్టులనుండి

తమ స్త్రీలను రక్షించుకొనకపోతే అటు తమ కులం, ఇటు మామగారి కులం రెండిటికి అపకీర్తి కలుగుతుంది. ఇది సమస్తకులములవారు అనుష్ఠించాల్సిన ఉత్తమ ధర్మం. కాబట్టి దుర్బలులైనా తమ స్త్రీలను జాగ్రత్తగా రక్షించుకోవాలి.

స్వాం ప్రసూతిం చరిత్రం చ కులమాత్మాన మేవ చ,
స్వం చ ధర్మం ప్రయత్నేన జాయాం రక్షన్ హి రక్షతి 7

పతిర్భార్యాం సంప్రవిశ్య గర్భో భూత్వేహ జాయతే
జాయాయా స్తద్ధి జాయాత్వం యదస్యాం జాయతే పునః 8
యాదృశం భజతే హి స్త్రీ సుతం సూతే తథావిధమ్,
తస్మాత్ ప్రజా విశుద్ధ్యర్థం స్త్రియం రక్షేత్ ప్రయత్నతః 9

న కశ్చిద్యోషితశ్శక్తః ప్రసహ్యా పరిరక్షితుమ్,
ఏ తైరుపాయయోగైస్తు శక్యాస్తాః పరిరక్షితుమ్ 10

భార్యను వ్యభిచారం చేయకుండా కాపాడుకున్నందువల్ల తన సంతతిని, తమ శిష్టాచారాన్ని తన పెద్దలవంశాన్ని తనను, తన ధర్మాన్ని కాపాడుకొనగలుగుతాడు. భర్తయే భార్యగర్భంలో ప్రవేశించి తిరిగి జన్మనెత్తుచున్నాడు. భర్త తన భార్యయందు జన్మిస్తునందువల్ల ఆమెను 'జాయ' అని పిలుస్తున్నారు. స్త్రీ ఎటువంటి పురుషునితో పోవునో అట్టి సంతానమునే పొందుతున్నది. అందువల్ల తన సంతానమును పరిశుద్ధంగా ఉంచుకొనుటకు భార్యను జాగ్రత్తగా రక్షించుకోవలెను. స్త్రీలను బలవంతంగా ఎవ్వరు కాపాడలేరు, కాని ఈ ఉపాయాలవల్ల వారిని రక్షించుటకు వీలౌతుంది.

అర్థస్య సంగ్రహే చైనాం వ్యయే చైవ నియోజయేత్
శౌచే ధర్మేऽ న్నపక్త్యాం చ పారిణాహ్యస్య చేక్షణే 11

తాను సంపాదించిన ధనాన్ని కాపాడుట, ఖర్చు చేయుట, ఇంటిలోని వస్తువుల కాపాడుట వంటి కార్యములందు స్త్రీని నియోగించాలి.

అరక్షితా గృహే రుద్ధాః పురుషైరాప్తకారిభిః,
ఆత్మానమాత్మనా యాస్తు రక్షేయుస్తాస్సురక్షితాః 12

పానం దుర్జనసంసర్గః పత్యా చ విరహోऽటనమ్,
స్వప్నోऽన్య గేహవాసశ్చ నారీసందూషణాని షట్ 13

నైతా రూపం పరీక్షంతే నాసాం వయసి సంస్థితిః,
సురూపం వా విరూపం వా పుమానిత్యేవ భుంజతే 14

పౌంశ్చల్యాచ్చలచిత్తాచ్చ నైస్నేహ్యాచ్చ స్వభావతః,
రక్షితా యత్నతోऽపీహ భర్తృష్వేతా వికుర్వతే 15

ఏవం స్వభావం జ్ఞాత్వాऽసాం ప్రజాపతినిసర్గజమ్,
పరమం యత్నమాతిష్ఠేత్ పురుషో రక్షణం ప్రతి 16

# నవమాధ్యాయం

స్త్రీలను కావలిపెట్టి ఎప్పుడు వారిని కాపాడలేము. తమను తాము కాపాడుకొనే స్త్రీలే సురక్షితంగా ఉంటారు. మద్యపానం దుర్మార్గులతో కలిసి ఉండుట, భర్తకు దూరంగా ఉండుట అనేవి స్త్రీలను చెడగొడ్తాయి. చెడుబుద్ధికలిగిన స్త్రీలు వయస్సు మంచి రూపం కలిగిన పురుషుడు కావలెనని భావించక అతడెట్లున్నా పురుషుడైతే చాలునన్న భావనతో దుష్టసాంగత్యం చేస్తారు. చెడుబుద్ధి కలిగిన స్త్రీలకు చంచలమైన మనస్తత్వమున్నందువల్ల భర్తపై సద్భావన లేనందువల్ల, భర్త ఎంత జాగ్రత్త గా చూచుకొన్నా వారు అతని పై చెడు భావనతో చెడిపోవుచున్నారు. ఈ విధంగా స్వభావసిద్ధమైన స్త్రీలయొక్కస్వభావాన్ని గుర్తించి పురుషుడు వారిని రక్షించుటకై చాలా కష్టపడవలెను.

*శయ్యాసనమలంకారం కామం క్రోధమనార్జవమ్,*
*ద్రోహభావం కుచర్యాం చ స్త్రీభ్యో మనురకల్పయత్ 17*

శయ్య, ఆసనము, అలంకారాలు కోరుకొనుట కామ క్రోధాలు, కపట స్వభావం, ద్రోహం చేయవలెనను భావన, చెడు నడవడి అనేవి వారికి చాలా సహజమైనవి.

*నాస్తి స్త్రీణాం క్రియా మంత్రైరితి ధర్మో వ్యవస్థితః,*
*నిరింద్రియా హ్యమంత్రాశ్చ స్త్రియోz నృతమితి స్థితిః 18*

*తథా చ శ్రుతయో బహ్వ్యో నిగీతా నిగమేష్వపి,*
*స్వాలక్షణ్యపరీక్షార్థం తాసాం శృణత నిష్కృతీః 19*

స్త్రీలకు జాతకర్మనామకర్మాది క్రియలు మంత్రరహితంగా చేయబడుతాయి. మంత్ర సంస్కారం లేనందువల్ల వారు పాప స్వభావంతో అబద్ధంవలె అశుభరూపంతో ఉంటారని అందురు. వేదములు కూడ అదేవిధంగా చెప్తున్నాయి కావున వారి విషయాన్ని పరిష్కరించుటకు ఈ ప్రాయశ్చిత్తాలు చేయవలెను.

*యన్మే మాతా ప్రలులుభే విచరంత్యపతివ్రతా,*
*తన్మే రేతః పితా వృంక్తా మిత్యస్యైతన్నిదర్శనం 20*

ఒక మంత్రంలో ఒక స్త్రీ చేయు మానసిక వ్యభిచారం తెలిసిన ఆమె పుత్రుడిట్లనుచున్నాడు. మాతల్లి వ్యభిచారిణియై పరపురుషుల కోరింది. ఆ విధంగా పరపురుషుని సదా మనస్సులో కోరుటచే దుష్టమైన ఆమె రజస్సును మా తండ్రి శోధించుగాక అని ఉంది.

*ధ్యాయత్యనిష్టం యత్కించిత్పాణిగ్రాహస్య చేతసా,*
*తస్యైష వ్యభిచారస్య నిహ్నవస్సమ్యగుచ్యతే 21*

*యాదృగ్గుణేన భర్త్రా స్త్రీ సంయుజ్యేత యథావిధి,*
*తాదృగ్గుణా సా భవతి సముద్రేణేవ నిమ్నగా 22*

*అక్షమాలా వసిష్ఠేన సంయుక్తాz ధమయోనిజా,*
*సారంగీ మందపాలేన జగామాభ్యర్హణీయతామ్ 23*

*ఏతాశ్చాన్యాశ్చ లోకే ऽ స్మిన్నపకృష్ట ప్రసూతయః,*
*ఉత్కర్షం యోషితః ప్రాప్తాః స్వైస్స్వైర్భర్తృ గుణైశ్శుభైః 24*

స్త్రీ తన మనస్సులో భర్తకు ఏమైన చెరుపుచేయదలిస్తే అటువంటి వ్యభిచార దోషానికి ఈ మంత్రం ప్రాయశ్చిత్తమని మన్వాదులన్నారు. కాని ఈ మంత్రంలో మాతా అనుట వలన ఇది పుత్రునికి సంబంధించిందే కాని తల్లికి సంబంధించినది కాదు. అన్న విషయం గుర్తుంచుకోవాలి. స్త్రీ తన భర్త గుణాన్ని అనుసరించి నది సముద్రంతో నున్నట్లు అతనితో కలిసి ఉంటుంది. పూర్వకాలం చండాల స్త్రీ యైన అక్షమాల (అరుంధతి) వసిష్ఠుని పెండ్లాడి భర్తవలె సద్గుణసంపన్నయైనది. అట్లే సారంగి యనే స్త్రీ మందుపాలుడనే మహర్షిని ప్రేమించి జనులందరిలో కీర్తిపొందింది. వీరే కాక ఇంకా తక్కువకులంలో పుట్టిన స్త్రీలు కూడ తమ తమ భర్తలగుణాల ననుసరించి కీర్తిపొందినారు.

*ఏషోదితా లోకయాత్రా నిత్యం స్త్రీపుంసయోశ్శుభా,*
*ప్రేత్యేహ చ సుఖోదర్కాన్ ప్రజాధర్మాన్నిబోధత 25*

ఇంతవరకు స్త్రీ పురుషులకు సంబంధించిన లోక మర్యాద చెప్పబడింది. ఇక ఇహపరలోకాలలో శుభాన్ని కలిగించే సంతతి ధర్మాలు చెప్పబడుతాయి.

*ప్రజనార్థం మహాభాగాః పూజార్హా గృహదీప్తయః,*
*స్త్రియః శ్రియశ్చ గేహేషు న విశేషో ऽ స్తి కశ్చన 26*

*ఉత్పాదనమపత్యస్య జాతస్య పరిపాలనం,*
*ప్రత్యహం లోక యాత్రాయాః ప్రత్యక్షం స్త్రీ నిబంధనం 27*

*అపత్యం ధర్మకార్యాణి శుశ్రూషా రతిరుత్తమా,*
*దారాధీనస్తథా స్వర్గః పితృాణామాత్మనశ్చ హ 28*

సంతతిపొందుటకు కారణమైన స్త్రీలు మిక్కిలి గౌరవించతగినవారు. వారు ఇంటికి కాంతులవంటివారు. ఇంటిలో స్త్రీలేకపోయినా సంపదలు లేకపోయినా ఆ ఇంటికి శోభ ఉండదు. కావున స్త్రీని గౌరవించాలి. సంతతినికనుట, పుట్టిన పిల్లలనుపెంచుట భర్త కీర్తిప్రతిష్ఠలు వీటన్నిటికి భార్యయే ప్రత్యక్ష కారణమౌతుంది. సంతతి ధర్మకర్మానుష్ఠానము, పతి శుశ్రూష, పతిపై మిక్కిలి అనురాగం, తనకు పితృదేవతలకు స్వర్గం కలుగుట ఇవన్నియు భార్యాధీనమైనవి.

*పతిం యా నాభిచరతి మనో వాగ్దేహసంయతా,*
*సా భర్తృలోకానాప్నోతి సద్భిః సాధ్వీతి చోచ్యతే 29*

*వ్యభిచారాత్తు భర్తుః స్త్రీ లోకే ప్రాప్నోతి నింద్యతామ్,*
*సృగాలయోనిం చాప్నోతి పాపరోగైశ్చ పీడ్యతే 30*

మనోవాగ్దేహములతో భర్తను ఎల్లప్పుడు సేవించు స్త్రీ భర్తృలోకములను పొందుతుంది. ఆమెను సాధ్వి అని కూడ పిలుస్తారు. పరపురుషునితో సంగమించినందు

వలన స్త్రీకి చెడుకీర్తి లభిస్తుంది. కుష్ఠ మొదలగు చెడువ్యాధులతో పీడింపబడుతూ చనిపోయిన తర్వాత నక్కగా పుడుతుంది.

*పుత్రం ప్రత్యుదితం సద్భిః పూర్వజైశ్చ మహర్షిభిః*
*విశ్వజన్యమిమం పుణ్యముపన్యాసం నిబోధత 31*

*భర్తుః పుత్రం విజానంతి శ్రుతి ద్వైధం తు భర్తరి,*
*ఆహురుత్పాదకం కేచిదపరే క్షేత్రిణం విదుః 32*

సజ్జనులైన ప్రాచీనమహర్షులు పుత్రుని గురించి సర్వజనహితమైన అభిప్రాయమునిట్లు వెల్లడించిరి. భర్తకు పుత్రుడు కలుగునని చెప్పుతారు. కాని భర్త పుత్రుని పుట్టించువాడని కొందరనగా పుత్రునివల్లనే తండ్రి పుత్రవంతుడగుచున్నాడని కొందరంటున్నారు. ఇట్లే వేదం కూడ రెండు విధాలుగా చెప్పున్నది.

*క్షేత్రభూతా స్మృతా నారీ బీజభూతః స్మృతః పుమాన్,*
*క్షేత్ర బీజసమాయోగాత్సంభవస్సర్వదేహినాం 33*

*విశిష్టం కుత్రచిద్బీజం స్త్రీయోని స్త్వేవ కుత్రచిత్,*
*ఉభయం తు సమం యత్ర సా ప్రసూతిః ప్రశస్యతే 34*

*బీజస్య చైవ యోన్యాశ్చ బీజముత్కృష్టముచ్యతే,*
*సర్వభూత ప్రసూతిర్హి బీజలక్షణలక్షితా 35*

*యాదృశం తూప్యతే బీజం క్షేత్రే కాలోపపాదితే,*
*తాదృగ్రోహతి తత్తస్మిన్ బీజం స్వైర్వ్యంజితం గుణైః 36*

*ఇయం భూమిర్హి భూతానాం శాశ్వతీ యోని రుచ్యతే,*
*న చ యోనిగుణాన్ కాంశ్చిద్బీజం పుష్యతి పుష్టిషు 37*

*భూమావప్యేక కేదారే కాలోప్తాని కృషీవలైః,*
*నానారూపాణి జాయంతే బీజానీహ స్వభావతః 38*

*వ్రీహయశ్శాలయో ముద్గాస్తిలా మాషా స్తథా యవాః,*
*యథా బీజం ప్రరోహంతి లశునానీక్షవ స్తథా 39*

*అన్యదుప్తం జాతమన్యదిత్యేతన్నోపపద్యతే,*
*ఉప్యతే యద్ధి యద్బీజం తత్తదేవ ప్రరోహతి 40*

స్త్రీని క్షేత్రమని అంటారు. పురుషుడు బీజమువంటివాడు. క్షేత్రము బీజము రెండు కలిస్తేనే సమస్త ప్రాణులు పుట్టునని చెప్పబడింది. కొన్ని చోట్ల బీజమే ప్రధానమౌతున్నది. ఉదాహరణకు వ్యాసుడు, బుధుడు, ఋష్యశృంగుడు మొదలైన వారు వారి తల్లులవలెకాక తండ్రులవలె ప్రసిద్ధులైరి. మరి కొన్ని చోట్ల క్షేత్రమే ప్రధానమగుచున్నది. పాండురాజు ధృత రాష్ట్రాదులు వ్యాసాదులవలననే పుట్టినా అక్కడ బీజానికి గల ప్రాధాన్యం కంటె క్షేత్రానికే ప్రాధాన్యముంది. బీజమునకు క్షేత్రమునకు సమానమైన ప్రాధాన్యంగల

సంతతి చాలా శ్రేష్ఠమైనదని అంటారు. బీజము, యోని ఈ రెంటిలో సమస్త జీవరాసి సృష్టికి కారణమైన బీజమే శ్రేష్ఠమైనదని అంటారు. ఆయాకాలాన్ని అనుసరించిక్షేత్రములో (పొలము) ఎట్టి బీజాన్ని (విత్తనాన్ని) వేస్తే ఆయా బీజలక్షణాలున్న సస్యం అభివృద్ధి చెందుతుంది. ఈ భూమి ఒక్కటే అన్నిప్రాణులకు (సస్యాలకు) కారణమైన క్షేత్రంగా చెప్పబడుతూ ఉంది. అచ్చట బీజమే ప్రధానంగా ఉంటుంది. క్షేత్రగుణం వాటిలో ఉండదు. వరి, పెసలు, మొదలైనవి ఒకే చేనిలో వేస్తే అన్ని విధములైన మొక్కలు మొలుచుచున్నవే కాని భూమి గుణములు కనిపించవు. విత్తొకటివేసిన చెట్టొకటి మొలచుట అనునది ఎన్నడును సంభవించదు. చేనులో ఎట్టి బీజాన్ని వేస్తే అట్టిబీజమే మొలుస్తున్నది.

*తత్ ప్రాజ్ఞేన వినీతేన జ్ఞానవిజ్ఞానవేదినా,*
*ఆయుష్కామేన వప్తవ్యం న జాతు పరయోషితి 41*

*అత్ర గాథా వాయుగీతాః కీర్తయంతి పురావిదః,*
*యథాబీజం న వప్తవ్యం పుంసా పరపరిగ్రహే 42*

*నశ్యతీషుర్యథా విద్ధః ఖే విద్ధమనువిద్ధ్యతః,*
*తథా నశ్యతి వై క్షిప్రం బీజం పరపరిగ్రహే 43*

*పృథోరపీమాం పృథివీం భార్యాం పూర్వవిదో విదుః,*
*స్థాణుచ్ఛేదస్య కేదారమాహుశ్శాల్యవతో మృగమ్ 44*

*ఏతావానేవ పురుషో యజ్జాయాzzత్మా ప్రజేతి హ,*
*విప్రాః ప్రాహు స్తథా చైతద్యో భర్తా సా స్మృతాంగనా 45*

అందువల్ల శిష్టాచారసంపన్నుడు వేదవేదాంగజ్ఞానంకలవాడు, ఆయు ష్కాముడైన వాడు పరస్త్రీయందుతన బీజమునుంచవద్దు. ఈవిషయంలో వాయువు గానంచేసిన గాథలను పెద్దలు పాడుతారు. ఒకడు బాణం వేసినచోట మరియొకడు వేస్తే ఏవిధంగా నిష్ఫలమౌతుందో అట్లే పరక్షేత్రమున వేయబడిన బీజము కూడ వ్యర్థమగుచున్నది. పూర్వీకులు ఈ భూమి పృథుచక్రవర్తియొక్క భార్యయని అంటారు. చెట్లు చేమలు తీసి తొలుత పంటను పండించిన వానిదే భూమి అని అంటారు. మొదట బాణం వేసిచంపినవానిదే మృగమని అన్నట్లే మొదట పెండ్లిచేసికొన్నవాడే భర్తఔతాడు. తరువాత చేరిన వారు భర్తృపదవాచ్యులుగారు. తానొక్కడే పురుషుడుకాడు తాను, తన భార్య, తన పుత్రుడు ముగ్గురు కలిసిననే పురుషుడగునని, అందువలన తానే భర్త తానే భార్య యగునని వేదవేత్తలందురు. కావున అట్టి భార్యయందు ఇతరునిచేత పుట్టింపబడినా ఆతని పుత్రుడే అగుచున్నాడు.

*న నిష్క్రియవిసర్గాభ్యాం భర్తుర్భార్యా విముచ్యతే,*
*ఏవం ధర్మం విజానీమః ప్రాక్ ప్రజాపతినిర్మితమ్ 46*

*సకృదంశో నిపతతి సకృత్కన్యా ప్రదీయతే,*
*సకృదాహ దదానీతి త్రీణ్యేతాని సతాం సకృత్ 47*

*యథా గో ऽ శ్వోష్ట్రదాసీషు మహిష్యజావికాసు చ,*
*నోత్పాదకః ప్రజాభాగీ తథైవాన్యాంగనాస్వపి 48*

*యే క్షేత్రిణో బీజవంతః పరక్షేత్రప్రవాపినః,*
*తే వై సస్యస్య జాతస్య న లభంతే ఫలం క్వచిత్ 49*

*యదన్యగోషు వృషభో వత్సానాం జనయేచ్ఛతం,*
*గోమినా మేవ తే వత్సా మోఘం స్కందిత మార్షభం 50*

భార్యనమ్ముకొన్నా, దానం చేసినా భార్యభర్తలు విడిపోరు. తండ్రి తన కుమారుల కొకేమారు తన ధనాదులను పంచిపెడ్తాడు. అట్లే కన్యాదానాన్ని ఒకే సారి చేస్తాడు. ధనం వంటి వాటి దానాన్ని కూడ ఒకే సారి చేయాలి కాని ఒకే వస్తువును మాటిమాటికి దానం చేయకూడదు. దానమిస్తానని ఒకే సారి అంటారు. ఈ మూడిటిని సజ్జనులొకేసారి చేయుదురు. ఆవులు, ఒంటెలు, బఱ్ఱెలు, మేకలు, గొఱ్ఱెలు, దాసీస్త్రీలువీరియందు కలుగుసంతానం యజమానికి చెందినట్లే పరస్త్రీలయందుకన్నసంతానం కూడా భర్తకే దక్కుతుందికాని తక్కినవారికి చెందదు. తనకు పొలంలేక తమ దగ్గరున్న విత్తనాన్ని ఇతరుల పొలంలో చల్లితే ఆ పొలంలో మొలచిన సస్యాన్ని అతడు పొందలేడుకదా. ఆబోతు ఇతరుల ఆవులందు ఎంత సంతానాన్ని కన్నా, ఆపశువులన్నీ ఆవులున్నవాడికే చెందుతాయి కాని ఆ సంతతికి ఆబోతుకు సంబంధం ఉండదు కదా. దానికి తన వీర్యం తగ్గించుకొనుటే ఫలితంగా కనిపిస్తుంది.

*తథైనాక్షేత్రిణో బీజం పరక్షేత్ర ప్రవాపిణః*
*కుర్వంతి క్షేత్రిణామర్థం నబీజీ లభతే ఫలం ॥ 51*
*ఫలం త్వనభిసంధాయ క్షేత్రిణాం బీజినాం తథా,*
*ప్రత్యక్షం క్షేత్రిణామర్థో బీజాద్యోనిర్గరీయసీ 52*

ఆదే విధంగా తనకు స్వంతంగా పొలంలేక ఇతరులు పొలంలో బీజాన్ని వెదజల్లితే పొలం యజమానే ఫలితం పొంది బీజాన్ని చల్లిన వానికి ఫలితం దక్కనట్లే ఇతరుల భార్యలందు తన బీజాన్ని ఉంచి సంతానాన్ని కన్నా అది ఆ స్త్రీ భర్తకే చెందుతుంది కాని బీజముంచినవానిది కాదు. క్షేత్రస్వాములు, బీజం కలవారు ఒక ఒప్పందం చేసికొనకపోయినా సంతతి మాత్రం క్షేత్రస్వామిదేఔతుంది తప్ప బీజస్వామిది కాదు ఎందుకంటే బీజం కంటె యోనియే ప్రధానమైంది కదా.

*క్రియాऽభ్యుపగమాత్వేతద్బీజార్థం యత్ప్రదీయతే,*
*తస్యేహ భాగినౌ దృష్టౌ బీజీ క్షేత్రిక ఏవ చ 53*

*ఓఘవాతాహృతం బీజం యస్య క్షేత్రే ప్రరోహతి,*
*క్షేత్రికస్యైవ తద్బీజం న వప్తా లభతే ఫలం 54*

ఈమెకు సంతానం కలిగితే అది మనకిద్దరికి సంబంధించిందౌతుందని నియమం చేసికొని విత్తనం వేస్తే, అప్పుడా సంతానమునకు బీజవంతుడు, క్షేత్రస్వామి ఇద్దరు

యజమానులగుచున్నారు, గాలికి, ప్రవహానికి కొట్టుకొచ్చిన బీజం ఏ క్షేత్రంలో మొలుస్తుందో ఆ పంట భూస్వామిదే ఐనట్లు తెలియక పరభార్యయందు కన్న సంతానం ఆమె భర్తకే చెందుతుంది కాని బీజస్వామికి చెందదు.

ఏష ధర్మో గవాశ్వస్య దాస్యు ష్ట్రా జావికస్య చ,
విహంగమహిషీణాం చ విజ్ఞేయః ప్రసవం ప్రతి 55

ఈ ధర్మం ఆవులు, గుఱ్ఱాలు, ఒంటెలు, మేకలు, గొఱ్ఱెలు, దాసీజనం వీరికి కలిగిన సంతానానికి సంబధించింది.

*ఏతద్వస్సారఫల్గుత్వం బీజయోన్యోః ప్రకీర్తితం,*
*అతః పరం ప్రవక్ష్యామి యోషితాం ధర్మమాపది 56*

ఇంతవరకు బీజము, యోని ఈ రెండిటిలో ప్రధానమైన దాని వివరణ చేయబడింది. ఇక స్త్రీలకు సంతానం కలుగునప్పుడు అవలంబింపవలసిన ధర్మాలు వివరించబడుతాయి.

*భ్రాతుర్జ్యేష్ఠస్య భార్యా యా గురుపత్న్యనుజస్య సా,*
*యవీయసస్తు యా భార్యా స్నుషా జ్యేష్ఠస్య సాస్మృతా 57*

*జ్యేష్ఠో యవీయసో భార్యాం యవీయాన్వాగ్రజస్త్రియం,*
*పతితౌ భవతౌ గత్వా నియుక్తావప్యనాపది 58*

అన్నభార్య తమ్మునికి గురుపత్నితో సమానము. అట్లే తమ్ముని భార్య అన్నకు కోడలువంటిది. అన్న తమ్ముని భార్యను, తమ్ముడు అన్న భార్యను సంతానంలేని సమయంలో తప్ప అనుజ్ఞపొందివెళ్ళినప్పటికీ పాపాన్ని పొందుతున్నాడు.

*దేవరాద్వా సపిండాద్వా స్త్రియా సమ్యఙ్నియుక్తయా,*
*ప్రజేప్సితాధిగంతవ్యా సంతానస్య పరిక్షయే 59*

*విధవాయాం నియుక్తస్తు ఘృతాక్తో వాగ్యతో నిశి,*
*ఏకముత్పాదయేత్పుత్రం న ద్వితీయం కథంచన 60*

*ద్వితీయ మేకే ప్రజనం మన్యంతే స్త్రీషు తద్విదః,*
*అనిర్వృతం నియోగార్థం పశ్యంతో ధర్మత స్తయోః 61*

*విధవాయాం నియోగార్థే నిర్వృతే తు యథావిధి,*
*గురువచ్చ స్నుషావచ్చ వర్తేయాతాం పరస్పరమ్ 62*

స్త్రీ తనకు సంతానము లేనప్పుడు తనవంశంనిలుచుటకై పెద్దలచే అనుజ్ఞను పొంది మరది లేక సపిండీకులైనబంధువుల ద్వారా సంతానాన్ని పొందవచ్చును. తనకు సంతానము లేనప్పుడు పెద్దల అనుమతిని పొంది మరది మొదలగు వారిచే ఒకే పుత్రుని కనవలెను. మళ్ళీ పుత్రుని మాత్రం కనరాదు. ఆ సమయంలో మరదిలేక ఆమె బంధువు తన శరీరమునందంతట నేతిని పూసి కొని, మౌనముతో అన్నభార్య లేక బంధుస్త్రీతో

కలియవలెను, కాని కొందరు పెద్దలుఒంటి పుత్రుడు పుత్రుడు కాడని భావించి రెండవపుత్రుని కూడ పొందవలెనని అంటారు తరువాత ఆ స్త్రీ బావను తండ్రి వలె ఆ పురుషుడు మరదలిని కోడలివలె చూచుకొనవలెను.

*నియుక్తౌ యౌ విధిం హిత్వా వర్తేయాతాం తు కామతః,*
*తావుభౌ పతితౌ స్యాతాం స్నుషాగ గురుతల్పగౌ, 63*

మరదలు లేక వదినయందు నియుక్తలైన (సంతానార్థం అనుమతి పొందిన) బావ లేక మరది శరీరమునందంతట నేయి పూసికొనుట, మౌనముతోసంగమించుట మొదలైన విధులు వదిలిపెట్టినచో ఆ పురుషులిద్దరు, కోడలిని గురుపత్నిని చెరచిన పాపముపొందెదరు.

*నాన్యస్మిన్ విధవా నారీ నియోక్తవ్యా ద్విజాతిభిః,*
*అన్యస్మిన్హి నియుంజానా ధర్మం హన్యుస్సనాతనం 64*

*నోద్వాహికేషు మంత్రేషు నియోగః కీర్త్యతే క్వచిత్,*
*న వివాహ విధావుక్తం విధవా వేదనం పునః 65*

*అయం ద్విజైర్హి విద్వద్భిః పశుధర్మో విగర్హితః,*
*మనుష్యాణా మపి ప్రోక్తో వేనే రాజ్యం ప్రశాసతి 66*

*స మహీమఖిలాం భుంజన్రాజర్షి ప్రవరః పురా,*
*వర్ణానాం సంకరం చక్రే కామోపహత చేతనః 67*

*తతః ప్రభృతి యో మోహాత్ ప్రమీతపతికాం స్త్రియం,*
*నియోజయత్యపత్యార్థం తం విగర్హంతి సాధవః, 68*

సంతానము లేని విధవ దగ్గరకు బావ లేక మరది, వారి సపిండీకులు తప్ప సంతానము కలిగించుటకై ఇతరులనెవ్వరిని అనుమతించకూడదు. అట్లు చేస్తే సనాతన ధర్మాన్ని చెడగొట్టినట్లవుతుంది. వివాహమంత్రములందెచ్చట కూడ సంతానం లేని స్త్రీ పెద్దల అనుమతిచే సంతానం పొందవచ్చునని చెప్పబడలేదు. అట్లే విధవ పునర్వివాహము చేసికొనవచ్చునని కూడ ఎచ్చట కనిపించదు. వేనుడనురాజు ప్రవేశపెట్టిన ఈ పునర్వివాహమను పశుధర్మాన్ని విద్వాంసులైన బ్రాహ్మణులందరు నిందించిరి. కనుమతించినాడు.

ఆ వేనుడు కామముచే బుద్ధిచెడిపోయి తన రాజ్యమున వర్ణసంకరాని అప్పటినుండి భర్తచనిపోయిన స్త్రీ పుత్ర సంతానానికై నియోగధర్మాన్ని అనుష్ఠిస్తే పెద్దలు నిందింపమొదలు పెట్టిరి. (ఈ నియోగం కలియుగంలో నిషిద్ధమని భావం)

*యస్యా మ్రియేత కన్యా యా వాచా సత్యే కృతే పతిః,*
*తామనేన విధానేన నిజో విందేత దేవరః 69*

*యథావిధ్యధిగమ్యైనాం శుక్లవస్త్రాం శుచివ్రతాం,*
*మిథో భజేతాప్రసవాత్సకృత్సకృదృతావృతౌ 70*

ఒక కన్యకు పెండ్లివిషయంలో మాట ఒప్పందం జరిగిన తర్వాత ఆవరుడు చనిపోతే ఆమెను ఈ క్రింది పద్ధతి ప్రకారం ఆమె మరది వివాహం చేసుకోవచ్చు. ఆ స్త్రీకి వివాహమైనా తెల్లని వస్త్రాలు ధరించి, శుచియై ప్రతి ఋతువున ఒక్కసారి చొప్పున పుత్ర సంతానము కలుగువరకు అతనితో పోవలెను, (ఈ విధంగా నియమం విధింపబడినందువల్ల ఆ బిడ్డ చనిపోయినవాని పుత్రుడేఔతాడు)

*స దత్వా కస్యచిత్కన్యాం పునర్దద్యాద్విచక్షణః,*
*దత్వా పునః ప్రయచ్ఛన్ హి ప్రాప్నోతి పురుషానృతం 71*

ఒకసారి తనకూతురిని ఒకరికిత్తునని మాటఇచ్చి తరువాత ఇంకొకరికాకన్య నివ్వరాదు. ఆ విధముగా చేసినచో ఆ కన్య యొక్క తండ్రి పురుషానృతమనే దోషాన్ని పొందును.

*విధివత్ప్రతిగృహ్యాపి త్యజేత్కన్యాం విగర్హితాం,*
*వ్యాధితాం విప్రదుష్టాం వా ఛద్మనా చోపపాదితాం 72*

*యస్తు దోషవతీం కన్యా మనాఖ్యాయోపపాదయేత్,*
*తస్య తద్వితథం కుర్యాత్కన్యాదాతుర్దురాత్మనః 73*

వైధవ్యలక్షణాలు కలది, రోగిష్ఠి, దుర్లక్షణాలు కలది, మోసముతో పెండ్లిచేయ బడింది, ఐన కన్యను శాస్త్రపద్ధతిలో వివాహం చేసికొన్నా వదిలిపెట్టాలి. తన కూతురుకు ఉన్న రోగాలు మొదలైన దోషాలను చెప్పకుండావివాహం చేస్తే ఆ స్త్రీని కన్యాదాతకు తిరిగి ఇచ్చివేయవచ్చును.

*విధాయ వృత్తిం భార్యాయాః ప్రవసేత్కార్యవాన్నరః,*
*అవృత్తికర్శితా హి స్త్రీ ప్రదుష్యేత్ స్థితిమత్యపి 74*

*విధాయ ప్రోషితే వృత్తిం జీవేన్నియమమాస్థితా,*
*ప్రోషితే త్వవిధాయైవ జీవేచ్ఛిల్పైరగర్హితైః 75*

తనకు ఇతర ప్రదేశములందు పనులేవైనా ఉంటే తన భార్యకు కూడు గుడ్డవంటి వసతులేర్పరచిపోవలెను. లేనిచో ఆ స్త్రీ చెడి పోవచ్చును. తన భర్త తనకు కూడు గుడ్డ వంటి వసతులేర్పరచి దేశాంతరమునకు పోయినప్పుడుడాస్త్రీ నియమనిష్ఠలతో జీవించవలెను. భర్త తనకెట్టి వసతి కల్పింపక దేశాంతరానికిపోతే, వంటచేయుట నూలువడకుట వంటి మంచి వృత్తులతో కాలక్షేపం చేయాలి.

*ప్రోషితో ధర్మకార్యార్థం ప్రతీక్ష్యోZ ష్టౌ నరస్సమాః*
*విద్యార్థం షడ్యశోర్థం వా కామార్థం త్రీంస్తు వత్సరాన్ 76*

*సంవత్సరం ప్రతీక్షేత ద్విషంతీం యోషితం పతిః,*
*ఊర్ధ్వం సంవత్సరాత్త్వేనాం దాయం హృత్వా న సంవసేత్ 77*

*అతిక్రామేత్ప్రమత్తం యా మత్తం రాగార్తమేవ వా,*
*సా త్రీన్ మాసాన్ పరిత్యాజ్యా విభూషణ పరిచ్ఛదా 78*

గురువు ఆజ్ఞ నెరవేర్చుట వంటి ధర్మకార్యనిర్వహణకై తన భర్త దేశాంతరం పోతే తన భర్త రాక గురించి ఎనిమిది సంవత్సరాలవరకు ఎదురు చూడాలి. విద్యకై లేక కీర్తి సంపాదనకై పోతే ఆరు సంవత్సరాలు, కామంతో పోతే అతనికై మూడు సంవత్సరాల వరకు ఎదురు చూడాలి. భర్తను ద్వేషించే భార్యను భర్త ఒక సంవత్సరం వరకు ఎదురు చూడాలి. సంవత్సరం తరువాత కూడ భర్తను ద్వేషిస్తూ ఉంటే తాను వివాహ సమయంలో ఇచ్చిన వస్త్రాభరణాలను తీసికొని పంపించివేయాలి. తన భర్తకు జూదం మొదలైన దుర్వ్యసనాలు, మద్యపానంవంటి అలవాట్లు, రోగం ఉన్నవని అతనిని అవమాన పరుస్తూ ఉంటే ఆభరణాలు, వస్త్రాలు మొదలైనవి తీసికొని మూడు నెలల వరకు వదిలి వేయాలి.

*ఉన్మత్తం పతితం క్లీబమబీజం పాపరోగిణం,*
*న త్యాగోఽస్తి ద్విషంత్యాశ్చ న చ దాయాపవర్తనం 79*

కాని భర్త పిచ్చివాడైతే, పతితుడు, నపుంసకుడు, ఇంద్రియ రహితుడు, కుష్ఠు మొదలైన రోగాలున్నవాడైతే ఆ భర్తను భార్య ద్వేషిస్తున్నా భర్త ఆమెను వదలరాదు. అట్లే ఆమె వస్త్రాభరణాలు తీసికొనరాదు.

*మద్యపా సాధువృత్తా చ ప్రతికూలా చ యా భవేత్,*
*వ్యాధితా వాఽధివేత్తవ్యా హింస్రార్థఘ్నీ చ సర్వదా 80*

*వంధ్యాష్టమే ఽధివేద్యాబ్దే దశమే తు మృతప్రజా,*
*ఏకాదశే స్త్రీజననీ సద్య స్త్వప్రియవాదినీ 81*

*యా రోగిణీ స్యాత్తు హితా సంపన్నా చైవ శీలతః,*
*సానుజ్ఞాప్యాధివేత్తవ్యా నావమాన్యా చకర్హి చిత్ 82*

*అధివిన్నా తు యా నారీ నిర్గచ్ఛేద్రోషితా గృహాత్,*
*సా సద్యస్సన్నిరోద్ధవ్యా త్యాజ్యా వా కులసన్నిధౌ 83*

మద్యపానం చేసేది, దుష్ట స్వభావం కలది, భర్తకు ప్రతికూలంగా నడుచుకునేది, రోగిష్ఠి, సేవకులను బాధించేది, విపరీతంగా ఖర్చు చేసేది అగు భార్యను వదిలి ఇంకొక స్త్రీని వివాహం చేసికోవచ్చును. సంతానం కలుగకపోతే ఎనిమిది సంవత్సరాలు పుట్టిన బిడ్డలు చస్తూ ఉంటే పది సంవత్సరాలు, ఆడ పిల్లలే కంటూ ఉంటే పదకొండు సంవత్సరాలు చూచి పునర్వివాహం చేసికోవాలి. ఎప్పుడు నిష్ఠురాలాడే స్త్రీని వెంటనే వదలి ఇంకొక స్త్రీని వివాహం చేసికోవాలి. తన భార్య రోగిష్ఠియైనా అనుకూలవతి, పతివ్రత ఐతే భర్త ఆమె అనుమతి తీసికొని పునర్వివాహం చేసికోవాలి. ఆమెను ఎప్పుడూ అవమాన పరచకూడదు. భర్త ఇంకొక వివాహం చేసికొన్నాడని కోపంతో ఇల్లు వదిలిపోయే భార్యను వెంటనే ఆమెకోపం తగ్గేంత వరకు నిర్బంధించాలి. లేకపోతే ఆమెను తల్లిదండ్రుల దగ్గర వదలిపెట్టాలి.

*ప్రతిషిద్ధాపిచేద్యా తు మద్యమభ్యుదయేష్వపి,*
*ప్రేక్షాసమాజం గచ్ఛేద్వా సా దండ్యా కృష్ణలాని షట్ 84*

వివాహాది శుభకార్యాలందు క్షత్రియస్త్రీ మొదలగు స్త్రీలను ఎంత నివారించినా,

మద్యపానం చేయు స్త్రీకి, నాట్యశాల మొదలగు స్థలములకు పోవు స్త్రీకి ఆరు బంగా
కృష్ణలను నాణెములను దండనగా విధించాలి.

*యది స్వాశ్చాపరాశ్చైవ విందేరన్ యోషితో ద్విజాః,*
*తాసాం వర్ణక్రమేణ స్యాజ్జ్యేష్ఠ్యం పూజా చ వేశ్మ చ 85*

ద్విజులు తమజాతిస్త్రీలను, అసవర్ణస్త్రీలను కూడ వివాహం చేసికొంటే ఆ స్త్రీలక పెత్తనం, గౌరవం, గృహం మొదలైనవి వర్ణక్రమాన్ని అనుసరించి వస్తాయి.

*భర్తుశ్శరీర శుశ్రూషాం ధర్మ కార్యం చ నైత్యకం,*
*స్వా చైవ కుర్యాత్సర్వేషాం నాన్యజాతిః కథంచన 86*

*యస్తుత త్కారయేన్మోహాత్సజాత్యా స్థితయాZ న్యయా,*
*యథా బ్రాహ్మణచాండాలః పూర్వదృష్టస్తథైవ సః 87*

అన్ని జాతులవారికి తన జాతికి చెందిన స్త్రీయే భర్తృశుశ్రుష, ధర్మకార్యాలు నిత్యకర్మచేయుటకు అర్హురాలు, ఇతరజాతి స్త్రీకి ఆ అధికారం లేదు. సజాతీయయైన స్త్రీ తనకుండగా వర్ణాంతరానికి చెందిన స్త్రీతో భర్తృశుశ్రుష వంటి కార్యములు చేయించుకొనువాడు బ్రాహ్మణ చండాలుడి తో (బ్రాహ్మణ స్త్రీకి శూద్రునికి పుట్టినవాడు) సమానుడని అంటారు.

*ఉత్కృష్టాయాభిరూపాయ వరాయ సదృశాయ చ,*
*అప్రాప్తామపి తాం తస్మై కన్యాం దద్యాద్యథావిధి 88*

*కామమామరణాత్తిష్ఠేద్గృహే కన్యర్తు మత్యపి*
*న చైవైనాం ప్రయచ్ఛేత్తు గుణహీనాయ కర్హిచిత్ 89*

ఉన్నత కులంలో పుట్టిననాడు, మంచి రూపంకలవాడు, తనకులానికి చెందిన వరుడు లభిస్తే వివాహవయసులేకపోయినా తన కూతురునిచ్చి శాస్త్రపద్ధతిలో వివాహం చేయాలి. తన కుమార్తెను గుణహీనుడైన వరునికిచ్చుటకంటే చనిపోవువరకు తన ఇంటిలోనే ఉంచుకొనుటమేలు. (అంటే తన కుమార్తెను మంచి వరుని చూచి వివాహం చేయాలి కాని ఎవరికి పడితే వారికి ఇవ్వకూడదు).

*త్రీణి వర్షాణ్యుదీక్షేత కుమార్యృతుమతీ సతీ,*
*ఊర్ధ్వం తు కాలాదేతస్మాద్విందేత సదృశం పతిమ్ 90*

*అదీయమానా భర్తారమధిగచ్ఛేద్యది స్వయమ్,*
*నైనః కించిదవాప్నోతి న చ యం సాధిగచ్ఛతి 91*

*అలంకారం నాదదీత పిత్ర్యం కన్యా స్వయంవరా,*
*మాతృకం భ్రాతృదత్తం వా స్తేనా స్యాద్యది తం హరేత్ 92*

ఋతుమతియైన స్త్రీకి మూడు సంవత్సరాలలో చక్కని వరుని వెదికి పెండ్లిచేయాలి. మూడు సంత్సరాలు దాటితే సాధారణగుణములుకల వరునికిచ్చి పెండ్లిచేయాలి. తన

తండ్రి తనకువివాహం చేయకపోతే తనంతట తాను తనకు యోగ్యుడైనవానిని వివాహం చేసికొంటే పెద్దవారిని ధిక్కరించినారను పాపము స్త్రీకి గాని పురుషునికి కాని కలుగదు. ఆవిధంగా తాను స్వయంగా వివాహం చేసికొనే స్త్రీ తన తండ్రి, తల్లి, సోదరులకు చెందిన ఆభరణాలదులు పొందుటకర్హురాలు కాదు.

*పిత్రే న దద్యాచ్ఛుల్కం తు కన్యామృతుమతీం హరన్,*
*స హి స్వామ్యాదతిక్రామే దృతూనాం ప్రతిరోధనాత్ 93*

ఋతుమతియైన కన్యను వివాహం చేసికొనువాడు ఆ కన్యతండ్రికి కన్యాశుల్కమీయవలసిన అవసరంలేదు ఋతుమతి యగువరకు తన కుమార్తెకు వివాహం చేయకుండ ఉంచినందువల్ల ఆ తండ్రి, తండ్రి యొక్క అధికారాలనన్నిటిని కోల్పోవుచున్నాడు.

*త్రింశద్వర్షో వహేత్కన్యాం హృద్యాం ద్వాదశ వార్షికీమ్,*
*త్ర్యష్ట వర్షోఽష్ట వర్షాం వా ధర్మే సీదతి సత్వరః 94*

*దేవదత్తాం పతిర్భార్యాం విందతే నేచ్ఛయాత్మనః,*
*తాం సాధ్వీం బిభృయాన్నిత్యం దేవానాం ప్రియమాచరన్ 95*

ముప్పై సంవత్సరాల వరుడు పన్నెండేళ్ళ కన్యను వివాహం చేసికొనవచ్చు అట్లే ఇరువైనాలుగేళ్ళ వాడు ఎనిమిదేళ్ళ కన్యను వివాహంచేసికోవచ్చును. దేవతలిచ్చిన స్త్రీని తనకిష్టం లేకపోయినా వివాహం చేసికొని దేవతలకు సంతోషం కలిగించుటకు ఆమెను ఎల్లప్పుడు పోషింపవలెను.

*ప్రజనార్థం స్త్రియః సృష్టాస్సంతానార్థం చ మానవాః,*
*తస్మాత్సాధారణో ధర్మః శ్రుతౌ పత్న్యా సహోదితః 96*

స్త్రీ పురుషుల ప్రధాన ధర్మం సంతానాన్ని కనుట, తక్కిన ధర్మాలన్నీ దీని తరువాతివే.

*కన్యాయాం దత్తశుల్కాయాం మ్రియేత యది శుల్కదః,*
*దేవరాయ ప్రదాతవ్యా యది కన్యానుమన్యతే 97*

కన్యానిశ్చయం జరిగి, కన్యాశుల్కం కూడ తీసికొన్నతరువాత ఆ వరుడు వివాహం కంటెముందే చనిపోతే ఆ కన్యను ఆవరుని తమ్మునికిచ్చి వివాహం చేయాలి.

*అదదీత న శూద్రోఽపి శుల్కం దుహీతరం దదన్,*
*శుల్కం హి గృహ్ణన్ కురుతే ఛన్నం దుహితృవిక్రయమ్ 98*

శూద్రుడైనా తన కుమార్తెకు వివాహం చేసేటప్పుడు కన్యాశుల్కం తీసుకోకూడదు. ఆ విధంగా కన్యాశుల్కం తీసుకొనేవాడు తన కన్యను అమ్ముకొన్నవానితో సమానుడు.

*ఏతత్తు న పరే చక్రుర్నాపరే జాతు సాధవః,*
*యదన్యస్య ప్రతిజ్ఞాయ పునరన్యస్య దీయతే 99*

*నానుశుశ్రుమ జాత్వేతత్పూర్వేష్వపి హి జన్మసు,*
*శుల్క సంజ్ఞేన మూల్యేన ఛన్నం దుహితృ విక్రయమ్ 100*

కన్యానిశ్చయం జరిగిన తరువాత ఆ కన్యను ఇతరులకిచ్చినట్లు ఇంతవరకు వినలేదు. కావున కన్యానిశ్చయం జరిగిన కన్యను ఆ వరునికే ఇచ్చి పెండ్లి చేయాలి అట్లే కన్యాశుల్కము తీసి కొని పెద్దలెవరు వివాహం చేసినట్లు ఇంతవరకు వినలేదు.

*అన్యోన్యస్యావ్యభీచారో భవేదామరణాంతికః,*
*ఏష ధర్మస్సమాసేన జ్ఞేయః స్త్రీ పుంసయోః పరః 101*

*తథా నిత్యం యతేయాతాం స్త్రీ పుంసౌ తు కృతక్రియౌ,*
*యథా నాభిచరేతాం తౌ వియుక్తావితరేతరమ్ 102*

స్త్రీ పురుషులిద్దరు జీవితమున్నంతవరకు అన్యోన్యంగా కలిసి మెలసి ఉండాలి. స్త్రీ పురుషులు పెండ్లిచేసికొని ఒకరినొకరు ఎడబాయకుండకలసి మెలసి ఉండాలి.

*ఏష స్త్రీపుంసయోరుక్తో ధర్మో వో రతిసంహితం,*
*ఆపద్యపత్యప్రాప్తిశ్చ దాయభాగం నిబోధత 103*

ఇంతవరకు స్త్రీ పురుషులధర్మాలు చెప్పబడ్డాయి. ఇక సంతానం లేనప్పుడు అనుసరించాల్సిన పద్ధతి దాయ భాగాన్ని గురించి వివరించబడుతుంది. 103

*ఊర్ధ్వం పితుశ్చ మాతుశ్చ సమేత్య భ్రాతరస్సమమ్,*
*భజేరన్ పైతృకం రిక్థ మనీశా స్తే హి జీవతోః 104*

తల్లిదండ్రులు బ్రతికి ఉన్నంతవరకు అన్నదమ్ములు వారి ధనాన్ని అనుభవించాల్సిందే తప్ప పంచుకోకూడదు.

*జ్యేష్ఠ ఏవ తు గృహ్ణీయా త్పిత్ర్యం ధన మశేషతః,*
*శేషాస్త ముపజీవేయుర్యథైవ పితరం తథా 105*

*జ్యేష్ఠేన జాతమాత్రేణ పుత్రీ భవతి మానవః,*
*పితౄణామనృణశ్చైవ స తస్మాత్సర్వమర్హతి 106*

*యస్మిన్నృణం సన్నయతి యేన చానంత్యమశ్నుతే,*
*స ఏవ ధర్మజః పుత్రః కామజానితరాన్విదుః 107*

*పితేవ పాలయేత్పుత్రాన్ జ్యేష్ఠో భ్రాతౄన్ యవీయసః,*
*పుత్రవచ్చాపి వర్తేరన్ జ్యేష్ఠే భ్రాతరి ధర్మతః 108*

*జ్యేష్ఠః కులం వర్ధయతి వినాశయతి వా పునః,*
*జ్యేష్ఠః పూజ్యతమో లోకే జ్యేష్ఠః సద్భిరగర్హితః 109*

*యో జ్యేష్ఠో జ్యేష్ఠవృత్తి స్స్యాత్ మాతేవ స పితేవ సః,*
*అజ్యేష్ఠవృత్తిర్యస్తు స్యాత్స సంపూజ్యస్తు బంధువత్ 110*

# నవమాధ్యాయం

సాధారణంగా తండ్రి సంపాదించిన దానికి పెద్దకొడుకే అధికారి. అతడుతమ్ములనందరిని తండ్రి రక్షించినట్లు రక్షించాలి. జ్యేష్ఠుడు పుట్టగానే అతడు (పుట్టబోవుతమ్ములవల్ల) పుత్రవంతుడు అగును. పితృఋణమును కూడవెంటనే తీర్చుకొనును కావున ఆ జ్యేష్ఠుడే తండ్రి ఆస్తికంతా అధికారి అగును. జ్యేష్ఠపుత్రుడొక్కడే ధర్మపుత్రుడు. తక్కిన పుత్రులందరు కామంవల్ల పుట్టినవారే. జ్యేష్ఠుడు తనతమ్ములందరిని తన తండ్రిచూచినట్లు చూచుకొవాలి. అదేవిధంగా తమ్ములు తమ అన్నను తమ తండ్రిని చూచినట్లే చూచుకొవాలి, జ్యేష్ఠుడు ధర్మిష్ఠుడైతే, అతని వంశం అభివృద్ధి చెందుతుంది. లేకపోతే అదినాశనమౌతుంది. అందువల్ల జ్యేష్ఠుడు సర్వదా గౌరవించతగినవాడు. జ్యేష్ఠుడు పెద్దమనసుతో ఉంటే అతడు తల్లివలె తండ్రి వలె గౌరవానికి పాత్రుడౌతాడు. అట్లే పెద్ద మనసుతో తన సోదరులను చూచుకోకపోతే అతడు బంధువులవలె గౌరవాన్ని పొందుతాడు.

*ఏవం సహ వసేయుర్వా పృథగ్వా ధర్మ కామ్యయా,*
*పృథగ్వివర్ధతే ధర్మస్తస్మాద్ధర్మ్యా పృథక్ క్రియా 111*

ఈ విధంగా సోదరులందరు కలసి ఉండవచ్చు లేక వేరు వేరుగా ఉండవచ్చును. వారు వేరువేరుగా పంచమహాయజ్ఞముల వంటి గార్హస్థ్యధర్మాలను విడివిడిగానే చేయాలి.

**ధాయభాగం :-**

*జ్యేష్ఠస్య వింశ ఉద్ధారః సర్వద్రవ్యాచ్చ యద్వరమ్,*
*తతోఽర్ధం మధ్యమస్య స్యాత్తురీయం తు యవీయసః 112*

*జ్యేష్ఠశ్చైవ కనిష్ఠశ్చ సంహరేతాం యథోదితమ్*
*యేఽన్యే జ్యేష్ఠ కనిష్ఠాభ్యాం తేషాం స్యాఽన్మధ్యమం ధనమ్ 113*

*సర్వేషాం ధనజాతానామాదదీతాగ్ర్యమగ్రజః,*
*యచ్చ సాతిశయం కించి ద్దశతశ్చాప్నుయాద్వరమ్ 114*

తల్లి దండ్రులకు సంబంధించిన సమస్తద్రవ్యాలలో మంచి దాన్ని ఇరువైపాళ్ళు పెద్దకొడుకుకు ఇవ్వాలి. రెండవవాడికి పెద్దవాడి భాగంలో సగం ఇవ్వాలి. మూడవవాడికి అందులోను సగం (నాల్గవ వంతు) ఇవ్వాలి. తండ్రికి ముగ్గురు కంటే ఎక్కువ మంది పుత్రులుంటే పెద్దవానికి, చిన్నవానికి ఇంతకుముందు పేర్కొన్నట్లు 20వ వంతు 80 వ వంతు పాలునిచ్చి తక్కినవారికి మిగిలిన ధనమునీయవలెను.

*ఉద్ధారో న దశస్వస్తి సంపన్నానాం స్వకర్మసు,*
*యత్కించిదేవ దేయం తు జ్యాయసే మానవర్ధనం 115*

ఉద్ధారము నిచ్చు ఆచారం (అనగా జ్యేష్ఠునికిచ్చు పదవభాగము) తమ తమ కర్మలయందు సుసంపన్నులైన వారిమధ్యలేదు. కాని వారుకూడ పెద్దవానిపైగల గౌరవభావంతో ఇంటిలోనున్న ఒక ప్రధాన వస్తువునుమాత్రమివ్వాలి.

*ఏవం సముద్ధృతోఽద్ధారే సమానంశాన్ ప్రకల్పయేత్,*
*ఉద్ధారేఽనుద్ధృతే త్వేషామియం స్యాదంశకల్పనా 116*

*ఏకాధికం హరేజ్యేష్ఠః పుత్రోऽ ధ్యర్ధం తతోऽనుజః,*
*అంశమంశం యవీయాంస ఇతి ధర్మో వ్యవస్థితః 117*

*స్వేభ్యోంశేభ్యస్తు కన్యాభ్యః ప్రదద్యుర్భ్రాతరః పృథక్,*
*స్వాత్స్వాదంశాచ్చతుర్భాగం పతితాః స్యురదిత్సవః 118*

జ్యేష్ఠునికి ఉద్ధారాన్నిస్తే మిగిలిన తండ్రి ఆస్తిని అన్నదమ్ములు సమానంగా పంచుకోవాలి. లేకపోతే ఈ పద్ధతిలో తండ్రి ఆస్తిని అన్నదమ్ములు పంచుకోవాలి. జ్యేష్ఠపుత్రుడు రెండు భాగాలు, రెండవవాడు ఒకటిన్నర పాళ్ళు, తక్కినవారంతా ఒక్కొక్క పాలు తీసుకోవాలి. ఈ విధంగా తండ్రి ఆస్తిని పంచుకొన్న అన్నదమ్ములు తమతమ పాళ్ళనుండి పెండ్లికాని ఆడ పిల్లలకు వేరువేరుగా నాల్గవపాలు ఇవ్వాలి. లేనిచో వారు పతితులౌతారు.

*అజావికం సైకశఫం న జాతు విషమం భజేత్,*
*అజావికం తు విషమం జ్యేష్ఠ స్యైవ విధీయతే 119*

మేకలు గొఱ్ఱెలవంటి ఒంటి గిట్టల మృగాలు బేసిగా ఉండి పంపకంలో మిగిలిపోతే దాన్ని జ్యేష్ఠపుత్రునికే వదలిపెట్టాలి.

*యవీయాన్ జ్యేష్ఠ భార్యాయాం పుత్రముత్పాదయేద్యది,*
*సమస్తత్ర విభాగస్స్యాదితి ధర్మో వ్యవస్థితః 120*

*ఉపసర్జనం ప్రధానస్య ధర్మతో నోపపద్యతే,*
*పితా ప్రధానం ప్రజనే తస్మాద్ధర్మేణ తం భజేత్ 121*

చిన్నవాడు బంధువుల సమ్మతితో అన్నభార్యయందు పుత్రుని కంటే ఆ పిల్లవానికి అతని పినతండ్రులతో సమానంగా భాగం వస్తుంది. అటువంటి పుత్రునికి తనతండ్రికి ధర్మతః వచ్చు ఉద్ధారము లభించదు. క్షేత్రియైన తండ్రి ప్రధానుడు కావున ఈ క్షేత్రజునికి ఇంతకుముందు చెప్పినట్లు సమానమైన భాగం లభిస్తుంది.

*పుత్రః కనిష్ఠో జ్యేష్ఠాయాం కనిష్ఠాయాం చ పూర్వజః,*
*కథం తత్ర విభాగస్స్యాదితి చేత్సంశయో భవేత్ 122*

*ఏకం వృషభముద్ధారం సంహరేత స పూర్వజః,*
*తతోऽపరే జ్యేష్ఠవృషాస్తదూనానాం స్వమాతృతః 123*

ఒకనికి ఇద్దరు సజాతీయలైన భార్యలున్నప్పుడు చిన్నదాని కొడుకు జ్యేష్ఠుడుగాపుట్టి పెద్ద భార్యకొడుకు కనిష్ఠుడైతే తండ్రి ఆస్తిని ఈ పద్ధతిలో పంచాలి. మొదటి భార్యకొడుకు ఒక వృషభమును ఉద్ధారముగా తీసికొనవలెను. తక్కిన భార్యల పుత్రులు తమతమ తల్లుల ననుసరించి చిన్నవాడు ఒకటి అంత కంటే పెద్ద భార్యపుత్రుడు రెండు అంతకంటె పెద్దభార్యపుత్రుడు మూడు వృషభములు ఈ విధంగా పశువులను పంచుకోవాలి.

*జ్యేష్ఠస్తు జాతో జ్యేష్ఠాయాం హరేద్వృషభషోడశాః,*
*తతః స్వమాతృత శ్శేషా భజేరన్నితి ధారణా 124*

## నవమాధ్యాయం

మొదటి భార్యకుపుట్టిన జ్యేష్ఠ (తక్కిన భార్యల పుత్రులకంటె) పుత్రునికి పదహారు ఎద్దుల నివ్వవలెను. మిగిలిన వాటిని తక్కిన వారు పంచుకొనవలెను.

*సదృశ స్త్రీషు జాతానాం పుత్రాణామవిశేషతః,*
*నమాతృతో జ్యైష్ఠ్యమస్తి జన్మతో జ్యైష్ఠ్యముచ్యతే 125*

*జన్మజ్యేష్ఠేన చాహ్వానం సుబ్రహ్మణ్యాస్వపి స్మృతమ్,*
*యమయోశ్చైవ గర్భేషు జన్మతో జ్యేష్ఠతా స్మృతా 126*

ఒకే జాతికి చెందిన భార్యలు ఇద్దరు లేక ముగ్గురుంటే వారి పుత్రులలో తల్లులను అనుసరించి జ్యేష్ఠత్వం రాదు వయస్సునే ప్రధానంగా తీసికోవాలి. సుబ్రహ్మణ్యమనే మంత్రం జ్యోతిష్టోమయాగం లో ఇంద్రుణ్ణి పిలుసున్నది. అందు తండ్రిని ప్రధమంగా పుట్టిన పుత్రుడే ఆహ్వానిస్తాడు. కవలపిల్లలో సైతం ముందు జన్మించినవాడే జ్యేష్ఠుడని నిర్ణయింపబడింది. ఈ విధంగా వయస్సును బట్టియే జ్యేష్ఠుడుని నిర్ణయించాలి గాని అతని తల్లిపెద్దతనాన్ని అనుసరించి మాత్రం నిర్ణయింపకూడదు.

*అపుత్రోఽ నేన విధినా సుతాం కుర్వీత పుత్రికామ్,*
*యదపత్యం భవేదస్యాం తన్మమ స్యాత్స్వధాకరమ్ 127*

*అనేన తు విధానేన పురా చక్రేఽ థ పుత్రికాః,*
*వివృద్ధ్యర్థం స్వవంశస్య స్వయం దక్షః ప్రజాపతిః 128*

*దదౌ స దశ ధర్మాయ కశ్యపాయ త్రయోదశ,*
*సోమాయరాజ్ఞే సత్కృత్య ప్రీతాత్మా సప్తవింశతిమ్ 129*

*యథైవాత్మా తథా పుత్రః పుత్రేణ దుహితా సమా,*
*తస్యామాత్మని తిష్ఠంత్యాం కథమన్యో ధనం హరేత్ 130*

*మాతుస్తు యౌతకం యత్స్యాత్కుమారీభాగ ఏవ సః,*
*దౌహిత్ర ఏవ చ హరేదపుత్రస్యాఖిలం ధనమ్ 131*

*దౌహిత్రో హ్యఖిలం రిక్థ మపుత్రస్య పితుర్హ రేత్,*
*స ఏవ దద్యాద్ద్వౌ పిండౌ పిత్రే మాతామహాయ చ 132*

*పౌత్రదౌహిత్రయోర్లోకే న విశేషోఽస్తి ధర్మతః,*
*తయోర్హి మాతాపితరౌ సంభూతౌ తస్య దేహతః 133*

పుత్రులులేనివాడు తన పుత్రికకు వివాహముచేయునప్పుడు ఈమెకు పుట్టుబాలుడు (మనుమడు) మాకు పితృకార్యములు చేయునని ఒడంబడికను చేసికొనవలెను. పూర్వం దక్షప్రజాపతి తనవంశాభివృద్ధికై ఇదేవిధంగా ఒప్పందం చేసికొన్నాడు. ఆ ఒప్పందముతోనే అతడు తన పదిమంది పుత్రికలను ధర్మునికి, పదముగ్గురిని కశ్యపప్రజాపతికి, ఇరువైఏడుగురిని చంద్రునకు భార్యలుగా ఇచ్చినాడు. అందువల్ల పుత్రులులేనివాడు దౌహిత్రుని తమ పితృకార్యాదులకై నియోగించాలి. తాను తన పుత్రుడు ఇద్దరు సమానమైనట్లే పుత్రుడు పుత్రిక ఇద్దరు కూడ సమానులే. కనుక తాను పుత్రికా

రూపమున ఉండగా పుత్రులు లేని తన ఆస్తికి పుత్రికయే వారసురాలగుచున్నది. తల్లిచనిపోతే ఆమెయొక్క మాతృధనమంతా పెండ్లికాని ఆమె పుత్రికలకే చెందుతుంది. అట్లే తనకుపుత్రులు లేకపోతే తన ఆస్తికి దౌహిత్రుడేవారసుడౌతాడు. ఆ దౌహిత్రుడు పుత్రులులేని మాతామహుని (తాతగారి) ఆస్తికి, తండ్రి ఆస్తికి కూడ వారసుడగుచున్నాడు. అతడే తండ్రికి మాతామహునికి కూడ పిండప్రదానము చేయును. పౌత్రుడు (కొడుకుకొడుకు) దౌహిత్రుడు, కూతురు కొడుకు ఈ ఇద్దరి తల్లి, తండ్రులు ఒక్కరి వల్లనేపుట్టినందువల్ల వీరిద్దరికి న్యాయంగా తేడాలేదు.

*పుత్రికాయాం కృతాయాం తు యది పుత్రోऽనుజాయతే,*
*సమస్తత్ర విభాగస్స్యాజ్జ్యేష్ఠతా నాస్తి హి స్త్రియాః 134*

*అపుత్రాయాం మృతాయాం తు పుత్రికాయాః కథంచన,*
*ధనం తత్పుత్రికాభర్తా హరేతైవావిచారయన్ 135*

*అకృతా వా కృతా వాపి యం విందేత్సదృశాత్సుతమ్,*
*పౌత్రీ మాతామహస్తేన దద్యాత్పిండం హరేద్ధనమ్ 136*

పుత్రులు లేనందువల్ల తన పుత్రికు పుట్టువాడు తనశ్రాద్ధ కార్యాలు చేస్తాడని ఒప్పందం చేసికొన్న తర్వాత అతనికి పుత్రుడు కలిగితే ఆ ఇద్దరు సమానంగా ఆస్తిని పంచుకుంటారు. ఆ పుత్రునికి తన జ్యేష్ఠ భాగంగా ఉద్ధారం మాత్రంరాదు. పుత్రులు లేని వాడు తన దౌహిత్రునిగా చేసికొందుననని ఒప్పందముచేసికొన్న తర్వాత కొంత కాలమునకతని కూతురు మరణిస్తే అల్లుడే అతని ఆస్తికి వారసుడౌతాడు. మాతామహుడు (తాత) తన తండ్రితో పెండ్లిలో తన తండ్రికి పుట్టబోవు వాడే తనకు శ్రాద్ధకర్తకాగలడని ఒప్పందం చేసికొన్నా, చేసికోక పోయినా ఈ దౌహిత్రుడే మాతామహునికి పిండంపెట్టి అతని ఆస్తి తీసికొంటాడు.

*పుత్రేణ లోకాన్ జయతి పౌత్రేణానంత్యమశ్నుతే,*
*అథ పుత్రస్య పౌత్రేణ బ్రధ్నస్యాప్నోతి విష్టపమ్, 137*

*పున్నామ్నో నరకాద్యస్మాత్త్రాయతే పితరం సుతః,*
*తస్మాత్పుత్ర ఇతి ప్రోక్తః స్వయమేవ స్వయంభువా 138*

*పౌత్రదౌహిత్రయోర్లోకే విశేషో నోపపద్యతే,*
*దౌహిత్రోऽపి హ్యముత్రైనం సంతారయతి పౌత్రవత్ 139*
*మాతుః ప్రథమతః పిండం నిర్వపేత్పుత్రికాసుతః,*
*ద్వితీయం తు పితుస్తస్యా స్తృతీయం తత్పితుః పితుః 140*

లోకంలో మానవుడు తనకు పుత్రులున్నందువల్ల స్వర్గాన్ని పొందినట్లు భావిస్తాడు. అతనికి మనుమలు కలిగితే ఆ స్వర్గంలో అతడు చాలా కాలముంటాడు. ముని మనుమలు కలిగితే, సూర్య లోకాన్ని చేరుతాడు. తండ్రిని పుత్ అనే నరకం నుండి రక్షిస్తాడు. కావున పుత్రుడని అతన్ని పిలిచినారు. పౌత్రునికి, దౌహిత్రునికి మధ్య భేదమేమిలేదు. దౌహిత్రుడు కూడ పౌత్రుని వలె పుత్ అనే నరకం నుండి రక్షిస్తాడు. దౌహిత్రుడు తొలిపిండాన్ని తల్లికి

పెట్టాలి. రెండవ పిండాన్ని తల్లి తండ్రికి పెట్టాలి. మూడవ పిండాన్ని తల్లితాతకు ( తండ్రి తండ్రి ) పెట్టాలి.

*ఉపపన్నో గుణైస్సర్వైః పుత్రో యస్య తు దత్రిమః,*
*న హరేతైవ తద్రిక్థం సంప్రాప్తోzప్యన్యగోత్రతః 141*

*గోత్రరిక్థే జనయితుర్న హరేద్దత్రిమః క్వచిత్,*
*గోత్రరిక్థానుగః పిండో వ్యపైతి దదతః స్వధా 142*

ఒక సందర్భంలో తనకు పుత్రసంతానం కాని పుత్రికా సంతానం కాని, కాకపోతే ఇంకొక గోత్రం నుండి దత్తతకు తెచ్చుకున్న పుత్రుడు సద్గుణ సంపన్నుడైతే అతనికి తన ఆస్తి అంతా వస్తుంది. ఆ విధంగా దత్తతకు పోయినచో అతనికి పెంచుకున్న తండ్రి ఆస్తే కాని తన స్వంత తండ్రి ఆస్తి లభించదు. అట్లే తన స్వంత తండ్రికి శ్రాద్ధాదికములను సైతము అతడు చేయకూడదు.

*అనియుక్తాసుతశ్చైవ పుత్రిణ్యాప్తశ్చ దేవరాత్,*
*ఉభౌ తౌ నార్హతో భాగం జారజాతక కామజౌ 143*

*నియక్తాయామపి పుమా న్నార్యాం జాతోzవిధానతః,*
*నైవార్హః పైతృకం రిక్థం పతితోత్పాదితో హి సః 144*

*హరేత్తత్ర నియుక్తాయాం జాతః పుత్రో యథౌరసః,*
*క్షేత్రికస్య తు తద్బీజం ధర్మతః ప్రసవశ్చ సః, 145*

భర్త చనిపోయినందువల్ల పెద్దల అనుమతి లేక మరది వలన పుట్టిన వాడు, పెద్దల అనుమతి ఉన్నా మరదివల్ల పుట్టిన రెండో పుత్రుడు ఈ ఇద్దరు వారితండ్రి ఆస్తికి అర్హులు కారు. వారిని జారజాతుడు, కామ జాతుడు, అని అందురు. పెద్దల అనుమతి ఉన్నా ఆస్త్రీ యొక్క మరది శాస్త్రవిధానమున నేతిని తన శరీరమున పూసికొనక మౌనంగా లేక సంగమిస్తే పుట్టినవాడు పతితుని వలన పుట్టిన వాడు కావున అతనికి కూడ పైతృకమైన ధనం లభించదు. కాని అట్లు పెద్దల అనుమతి పొందిన స్త్రీకి ధర్మ మార్గమున జన్మించినకాడు మాత్రం ఔరసపుత్రునివలె తండ్రి ఆస్తిని పొందుతాడు.

*ధనం యో బిభృయా ద్భ్రాతుర్మృతస్య స్త్రియమేవ చ,*
*సోz పత్యం భ్రాతురుత్పాద్య దద్యాతస్యైవ తద్ధనమ్ 146*

*యా నియుక్తాన్యతః పుత్రం దేవరాద్వాz ప్యవాప్నుయాత్,*
*తం కామజమరిక్థీయం వృథోత్పన్నం ప్రచక్షతే 147*

సంతానం లేక భర్త చనిపోతే మరిది తన వదినను, ఆమె ఆస్తిని దన దగ్గరే ఉంచుకొని, ఆమెకునియోగధర్మంతో కొడుకును కని, అన్న ఆస్తిని తిరిగి వదినకివ్వవలెను. నియోగ ధర్మంతో వదినకు దేవర న్యాయంతో పుత్రుడు పుట్టినా ఆ మరది శాస్త్రమర్యాదనను సరించకపోతే ఆ పుత్రుని కామజుడని అంటారు. అతనికి తన తండ్రి ఆస్తి మాత్రం లభించదు.

*ఏతద్విధానం విజ్ఞేయం విభాగస్యైకయోనిషు,*
*బహ్వీషు చైకజాతానాం నానా స్త్రీషు విబోధత 148*

ఇంతవరకు చెప్పిన ఆస్తిపంపకము సవర్ణలైన భార్యలందు పుట్టిన పుత్రులకు సంబంధించింది. ఇక అనేక జాతుల స్త్రీలకు పుట్టిన సంతానమునకు ఆస్తిపంపకము ఈ విధంగా చేయాలి.

*బ్రాహ్మణస్యానుపూర్వ్యేణ చతస్రస్తు యది స్త్రియః,*
*తాసాం పుత్రేషు జాతేషు విభాగోऽ యం విధిః స్మృతః 149*

*కీనాశో గోవృషో యానమలంకారశ్చ వేశ్మ చ,*
*విప్రస్యోద్ధారికం దేయమేకాంశశ్చ ప్రధానతః 150*

*త్ర్యంశం దాయాద్ధరేద్విప్రో ద్వావంశౌ క్షత్రియాసుతః,*
*వైశ్యాజస్సార్ధమేవాంశమంశం శూద్రాసుతో హరేత్ 151*

బ్రాహ్మణుడు వరుసగా బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర స్త్రీలను వివాహం చేసికొంటే, వారికి కలిగిన సంతానానికి ఈ విధంగా ఆస్తిని పంచాలి. సేద్యగాడు ఆబోతు, గుఱ్ఱము, సొమ్ములు, ఇండ్లు, మొదలగు వాటిలో ప్రధానమైన ఒక భాగాన్ని బ్రాహ్మణ స్త్రీకి పుట్టిన పుత్రునికివ్వాలి. మిగిలిన దానిలో మూడు పాళ్ళు బ్రాహ్మణి పుత్రునికి, రెండు పాళ్ళు క్షత్రియ స్త్రీకి పుట్టిన కుమారునికి, ఒకటిన్నర పాళ్ళు వైశ్యా స్త్రీ పుత్రునికి, ఒక పాలు శూద్ర స్త్రీకి కలిగిన పుత్రునికి చెందుతుంది.

*సర్వం వా రిక్థజాతం తద్దశధా పరికల్ప్య చ,*
*ధర్మ్యం విభాగం కుర్వీత విధినాऽ నేన ధర్మవిత్ 152*

లేకపోయినచో ఆ ఆస్తినంతా పదిపాళ్ళు చేసి ఈ విధంగా పంచుకోవాలి.

*చతురోऽంశాన్ హరేద్విప్రస్త్రీనంశాన్ క్షత్రియాసుతః,*
*వైశ్యాపుత్రో హరేద్ద్వ్యంశ మంశం శూద్రాసుతో హరేత్ 153*

*యద్యపి స్యాత్తు సత్పుత్రో ప్యసత్పుత్రో పి వా భవేత్,*
*నాధికం దశమాదద్యాచ్ఛూద్రాపుత్రాయ ధర్మతః 154*

*బ్రాహ్మణక్షత్రియవిశాం శూద్రాపుత్రో న రిక్థభాక్,*
*యదేవాస్య పితా దద్యా త్తదేవాస్య ధనం భవేత్ 155*

బ్రాహ్మణీ పుత్రుడు నాలుగు భాగాలను, క్షత్రియా సుతుడు మూడు పాళ్ళను, వైశ్యాపుత్రుడు రెండు పాళ్ళను, శూద్రాపుత్రుడు ఒకపాలును పంచుకోవాలి. శూద్ర స్త్రీకి పుట్టినవాడు మంచివాడైనా చెడ్డవాడైనా అతనికి పదవ పాలుకంటె ఎక్కువ ఈయరాదు. బ్రాహ్మణ స్త్రీకి సంతానం లేకపోతే ఆ భాగాన్ని క్షత్రియుడు వైశ్యుడు కలసి పంచుకుంటాడు. అట్లే క్షత్రియుడు, వైశ్యుడు లేకపోతే ఆ ధనాన్ని బ్రాహ్మణ స్త్రీకి కలిగిన పుత్రుడు మాత్రమే తీసికోవాలి. శూద్ర స్త్రీ పుత్రునికి తండ్రి ఇచ్చిందే భాగమౌతుంది కాని అంతకుమించి ఆస్తిరాదు.

*సమవర్ణాసు యే జాతాః సర్వే పుత్రా ద్విజన్మనామ్,*
*ఉద్ధారం జ్యాయసే దత్త్వా భజేరన్నితరే సమమ్. 156*

*శూద్రస్య తు సవర్ణైవ నాఽన్యా భార్యా విధీయతే,*
*తస్యాం జాతాః సమాంశాస్స్యుర్యది పుత్రశతం భవేత్ 157*

*పుత్రాన్ ద్వాదశ యా నాహ నృాణాం స్వాయంభువో మనుః,*
*తేషాం షడ్బంధుదాయాదాష్షడదాయాద బాంధవాః 158*

*ఔరసః క్షేత్రజశ్చైవ దత్తః కృత్రిమ ఏవ చ,*
*గూఢోత్పన్నోఽపవిద్ధశ్చ దాయాదా బాంధవాశ్చ షట్ 159*

*కానీనశ్చ సహోఢశ్చ క్రీతః పౌనర్భవ స్తథా,*
*స్వయందత్తశ్చ శౌద్రశ్చ షడదాయాద బాంధవాః 160*

ఒకే కులానికి చెందిన స్త్రీలకు పుట్టిన పుత్రులలో పెద్దవానికి ఉద్ధారాన్ని ఇచ్చి మిగిలినదాన్ని తక్కిన పుత్రులు సమానంగా పంచుకోవాలి. శూద్రుడు అతని కులానికి చెందిన స్త్రీనే వివాహం చేసికోవాలి. ఆ స్త్రీకి వందమంది పుత్రులు కలిగినా వారికందరికి సమానంగా ఆస్తి పంచి ఇవ్వాలి. స్వాయంభువమనువు పేర్కొన్న ద్వాదశ పుత్రులలో ఆరుగురు ఆస్తికి అర్హులు. తక్కిన ఆరుగురు ఆస్తికి అర్హులు కారు. వారిలో ఔరసుడు, క్షేత్రజుడు, దత్తుడు, కృత్రిముడు, గూఢోత్పన్నుడు, అపవిద్ధుడను ఆరుగురు తండ్రి ఆస్తికి అర్హులు. కానీనుడు, సహోఢుడు, క్రీతుడు, పౌనర్భవుడు, స్వయందత్తుడు, శూద్రాసుతుడు తండ్రి ఆస్తికి అర్హత లేనివారు. వీరు కేవలం బంధువులు మాత్రమే.

*యాదృశం ఫలమాప్నోతి కుప్లవైస్సంతరన్ జలమ్,*
*తాదృశం ఫలమాప్నోతి కుపుత్రైస్సంతరం స్తమః 161*

*యద్యేకరిక్థినౌ స్యాతా మౌరసక్షేత్రజౌ సుతౌ,*
*యస్య యత్పైతృకం రిక్థం స తద్గృహ్ణీత నేతరః 162*

చెడిపోయిన పడవనెక్కి నదిని దాటదలచుకొన్నచో ఎట్టి ఫలితము లభించునో కుపుత్రుని వలనను అట్టి ఫలితమే లభించును. పార లౌకిక దుఃఖమును దాటలేడు. ఒకనికి నియోగము వలన కొడుకు పుట్టిన తరువాత అనగా క్షేత్రజ పుత్రుని తరువాత ఔరసపుత్రుడు కలిగితే వారిద్దరు తమ తమ తండ్రులకు సంబంధించిన ఆస్తినే అనుభవించవలెను. క్షేత్రజసుతుడు క్షేత్ర సంబంధియైన తండ్రి ఆస్తికి అర్హుడుకాడు.

*ఏక ఏవౌరసః పుత్రః పిత్ర్యస్య వసునః ప్రభుః,*
*శేషాణామానృశంస్యార్థం ప్రదద్యాత్తు ప్రజీవనమ్ 163*

*షష్ఠం తు క్షేత్రజస్యాంశం ప్రదద్యాత్పైతృకాద్ధనాత్,*
*ఔరసో విభజన్ దాయం పిత్ర్యం పంచమమేవ వా 164*

*ఔరసక్షేత్రజౌ పుత్రౌ పితృరిక్థస్య భాగినౌ,*
*దశాపరే తు క్రమశో గోత్రరిక్థాంశభాగినః 165*

ఔరసపుత్రుడు మాత్రమే తండ్రియొక్క ఆస్తిని అనుభవించును. తక్కిన పుత్రులు బ్రతుకుటకై వారికి కొంత ధనమును మాత్రమివ్వవలెను. ఔరసపుత్రుడు గుణవంతుడైనచో క్షేత్రజ పుత్రునికి తన భాగమునుండి ఆరవ అంశమునివ్వవలెను లేనిచో ఐదవ భాగమైనను ఇవ్వవచ్చును. ఈ విధముగా ఔరస క్షేత్రజ పుత్రులు తండ్రియొక్క ఆస్తిని పంచుకొందురు. తక్కిన పదిమంది వరుసగా గోత్ర ధనమును పంచుకొందురు.

**ద్వాదశపుత్రులు :-**

*స్వే క్షేత్రే సంస్కృతాయాం తు స్వయముత్పాదయేద్ధి యమ్,*
*తమౌరసం విజానీయాత్పుత్రం ప్రథమకల్పితమ్ 166*

*యస్తల్పజః ప్రమీతస్య క్లీబస్య వ్యాధితస్య వా,*
*స్వధర్మేణ నియుక్తాయాం స సుతః క్షేత్రజః స్మృతః 167*

*మాతా పితా వా దద్యాతాం యమద్భిః పుత్రమాపది,*
*సదృశం ప్రీతిసంయుక్తం స జ్ఞేయో దత్త్రిమస్సుతః 168*

*సదృశం తు ప్రకుర్యాద్యం గుణదోషవిచక్షణమ్;*
*పుత్రం పుత్రగుణైర్యుక్తం స విజ్ఞేయశ్చ కృత్రిమః 169*

తన భార్యయందు తనకు పుట్టిన వానిని ఔరసపుత్రుడని అంటారు. మృతుడు, నపుంసకుడు, ధీర్ఘవ్యాధిగ్రస్తుడగు వానికి సంతానం లేనందువల్ల వంశం నాశనం కాకూడదని పెద్దలు నిర్ణయించి మరదిని నేయి పూసికొనుటవంటి నియమంతో వదిన దగ్గరకు పంపినందువలన కలిగినవాడు క్షేత్రజ పుత్రుడు. తల్లిగాని తండ్రిగాని లేక ఇద్దరుగాని, సంతానం లేనివానికి తమ పుత్రుని ఉదక ధారా పూర్వకముగా దానం చేస్తే ఆ పుత్రుడు దత్తుడనబడును. పుత్రుని యొక్క గుణాలున్నవాడు చక్కగా చదువుకున్నవాడు సజాతీయుడైనవానిని తనకు పుత్రులు లేనందువలన దత్తత (పుత్రుడుగా) చేసికొన్నందు వలన అతడు కృత్రిమ పుత్రుడౌతాడు.

*ఉత్పద్యతే గృహే యస్య న చ జ్ఞాయేత కస్య సః,*
*స గృహే గూఢ ఉత్పన్న స్తస్య స్యాద్యస్య తల్పజః 170*

*మాతాపితృభ్యాముత్సృష్టం తయోరన్యతరేణ వా,*
*యం పుత్రం పరిగృహ్ణీయాదపవిద్ధస్స ఉచ్యతే 171*

ఇంట్లో భార్య ఉన్నా సజాతీయుడైనా ఎవరికి పుట్టిన పుత్రుడన్న విషయము తెలియక గూఢముగా పుట్టిన వానిని గూఢోత్పన్నుడని అంటారు. తల్లిదండ్రులిద్దరుగాని వారిద్దరిలో ఒక్కరుగాని ఏదో కారణము వల్ల విడిచిపెడ్తే దొరికిన పుత్రుని అపవిద్ధుడని అంటారు.

*పితృవేశ్మని కన్యా తు యం పుత్రం జనయేద్రహః,*
*తం కానీనం వదేన్నామ్నా వోఢుః కన్యాసముద్భవమ్ 172*

*యా గర్భిణీ సంస్క్రియతే జ్ఞాతాZ జ్ఞాతాపి వా సతీ,*
*వోఢుస్సగర్భో భవతి సహోఢ ఇతి చోచ్యతే 173*

*క్రీణీయాద్యస్త్వ పత్యార్థం మాతాపిత్రోర్యమంతికాత్,*
*సక్రీతకస్సుత స్తస్య సదృశోZ సదృశోZ పివా 174*
*యా పత్యా వా పరిత్యక్తా విధవా వా స్వయేచ్ఛయా,*
*ఉత్పాదయేత్పునర్భూత్వా స పౌనర్భవ ఉచ్యతే 175*

తండ్రి ఇంటిలో తాను కన్యగా ఉన్నప్పుడే రహస్యంగా కన్నపిల్లవానిని కానీనుడని అంటారు. గర్భవతియైన స్త్రీని గర్భవతియని తెలియక వివాహము చేసికొన్న తర్వాత పుట్టిన పుత్రుడు సహోఢజుడు. తమకు పుత్రులు లేనందువలన వేరొక తల్లిదండ్రులకు ధనమునిచ్చి పుత్రునిగా కొనుక్కొన్నవాడు క్రీతుడు. భర్త తనను విడిచిన తరువాతగాని, భర్త చనిపోయిన తరువాతగాని ఇంకొకరిని వివాహము చేసికొన్న తరువాత రెండవ భర్తకు పుట్టినవాడు పౌనర్భవుడు.

*సా చేదక్షత యోనిస్స్యాద్గత ప్రత్యాగతాపి వా,*
*పౌనర్భవేన భర్త్రా సా పునస్సంస్కారమర్హతి. 176*

మొదటి వివాహము తరువాత భర్త సుఖమును పొందక లేక చిన్నతనముననే వివాహమైనందువలన అతనిని వదలి రెండవ వాడికి భార్యగా పోయి, రోగాదులవల్ల భర్త సుఖమును పొందక మరల మొదటి భర్త దగ్గరకే వచ్చినప్పుడు అతడు మంత్రములతో ఆమెను సంస్కరింపవలెను.

*మాతాపితృవిహీనో యస్త్యక్తో వా స్యాదకారణాత్,*
*ఆత్మానం స్పర్శయేద్యస్మై స్వయందత్తస్తు స స్మృతః 177*
*యం బ్రాహ్మణస్తు శూద్రాయాం కామాదుత్పదయేత్సుతమ్,*
*స పారయన్నేవ శవస్తస్మాత్పారశవః స్మృతః 178*

ఎటువంటి కారణాలు లేక తలిదండ్రులు వదిలిపెట్టగా ఎక్కడనో పెరిగి తనకు జ్ఞానము వచ్చిన తరువాత ఒకరింటజేరి వారిని తలిదండ్రులుగా భావించినచో అతడు స్వయందత్తుడు. బ్రాహ్మణుడు మోహంవల్ల శూద్ర స్త్రీని చేరి అనుభవించి పుత్రుని కంటే ఆ శిశువును అందరు అసహ్యిస్తారు. కావున అతడు బ్రతికి యున్నా శవము వంటివాడు. కావున ఆ పుత్రుని పారశవుడని అందురు.

*దాస్యాం వా దాసదాస్యాం వా యశ్శూద్రస్య సుతో భవేత్,*
*సోZ నుజ్ఞాతో హరేదంశమితి ధర్మో వ్యవస్థితః 179*

దాసియందు కాని దాసునియొక్క దాసికి గాని శూద్రుని వల్ల పుట్టిన పుత్రుడు, అతడు వివాహము చేసికొన్న స్త్రీ కన్న పుత్రులతో సమానముగా ఆస్తిని పంచుకొనును. కావున అతనిని సమాన భాగి అని అందురు.

*క్షేత్రజాదీన్ సుతానేతానేకాదశ యథోదితాన్,*
*పుత్రప్రతినిధీనాహుః క్రియాలోపాన్మనీషిణః. 180*
*య ఏతేZ భిహితాః పుత్రాః ప్రసంగాదన్యబీజజాః,*
*యస్య తే బీజతో జాతాస్తస్య తే నేతరస్య తు 181*
*భ్రాతౄణా మేకజాతానా మేకశ్చే త్పుత్రవాన్భవేత్,*
*సర్వాంస్తాం స్తేన పుత్రేణ పుత్రిణో మను రబ్రవీత్ 182*

*సర్వాసా మేకపత్నీ నామేకా చేత్పుత్రిణీ భవేత్*
*సర్వాస్తా స్తేన పుత్రేణ ప్రాహ పుత్రవతీర్మనుః 183*

క్షేత్రజులు మొదలైన పదుకొండు మంది పుత్రులు ఇంచుమించుగ ఔరసపుత్రునకు ప్రతినిధులని అంటారు. క్షేత్రజుడు మొదలగు పుత్రులు ఎవరి బీజము వలన పుట్టినారో వారికే పుత్రులగుదురు కావున ఔరసపుత్రుడు, ఔరస పుత్రిక యుండగా క్షేత్రజుడు మొదలైన పుత్రులయొక్క అవసరం లేదు. అన్నదమ్ములలో ఒకరికి మాత్రమే పుత్రసంతానమున్నచో ఆ పుత్రుడు తన పిన తండ్రులు పెద తండ్రులందరికి శ్రాద్ధ కర్మ చేయు అర్హత కలవాడు. వారి ఆస్తికంతయు ఇతడే అధికారి కాగలడు. అట్లే ఒకనికి ఇద్దరు ముగ్గురు భార్యలున్నను వారికెవ్వరికిని పుత్ర సంతానము లేక ఒక స్త్రీకి మాత్రం స్త్రీ సంతానమున్నచో ఆ కుమార్తె వల్ల వీరందరు సంతానవతులగుచున్నారు. ఆమెకు పుట్టు మగ సంతానం వీరందరికి శ్రాద్ధాది కర్మలు చేయుటకు అర్హమైనది.

*శ్రేయసశ్శేయసోऽలాభే పాపీయాన్రిక్థమర్హతి,*
*బహవశ్చేత్తు సదృశాః సర్వే రిక్థస్య భాగినః 184*
*న భ్రాతరో న పితరః పుత్రా రిక్థహరాఃపితుః,*
*పితా హరేదపుత్రస్య రిక్థం భ్రాతర ఏవ చ 185*

పన్నెండుగురు పుత్రులలో వెనకటివాని కంటె అతనికి ముందువాడు, అతనికి ముందువాడు అను పద్ధతిలో అందరికంటె ముందువాడైన ఔరసుడు శ్రేష్ఠుడు. ఇట్లు శ్రేష్ఠపుత్రులు లభింపకపోతే తరువాతి పుత్రుడు తండ్రి ఆస్తికి వారసుడగుచున్నాడు. ముందటివారున్నచో ఆస్తిలో భాగము వారిదే. అతడు తక్కినవారిని పోషించాలి. పౌనర్భవుడు మొదలైన పుత్రులందరు సమానంగా ఉంటే వారంతా తండ్రి ఆస్తిని పంచుకోవలెను. తన సోదరులుగాని తన తండ్రి సోదరులుగాని తన ఆస్తికర్హులు కారు. కాని ఔరసపుత్రుడు గాని, భార్యగాని, పుత్రిక గాని లేని వాని ఆస్తిని అతని తండ్రి గాని, సోదరులు గాని పంచుకొనవచ్చును.

*త్రయాణా ముదకం కార్యం త్రిషు పిండః ప్రవర్తతే*
*చతుర్థస్సంప్రదాతైషాం పంచమో నోపద్యతే 186*
*అనంతరస్సపిండాద్యస్తస్య తస్య ధనం భవేత్,*
*అత ఊర్ధ్వం సకుల్యస్స్యాదాచార్యశ్శిష్య ఏవ వా 187*

*సర్వేషా మప్యభావే తు బ్రాహ్మణా రిక్థభాగినః,*
*త్రైవిద్యాశ్శుచయో దాంతా స్తథా ధర్మో న హీయతే 188*

తర్పణము తండ్రి, తాత, ముత్తాత అనువారికి చేయాలి. అట్లే పిండప్రధానం కూడ వారికే చేయాలి. నాలుగవ వాడు ఈ పిండములు, తర్పణములు పెట్టువాడు. ఐదవ వానికీ విషయమున సంబంధము లేదు. సపిండులలో ఎవనికి దగ్గరి సంబంధముందో వాడే ఆ సపిండుని ఆస్తికి వారసుడు. ఔరసులు లేనప్పుడు కూతురు. ఆమె కొడుకు, అధికారులు. పుత్రులు లేనప్పుడు భార్య ఆ తరువాత కూతురు, తండ్రి, తల్లి, వారు లేనప్పుడు తోడబుట్టినవాడు, వాడు లేకపోతే వాని కుమారుడు, అతనికి సన్నిహిత

దాయాదులు ఆస్తికర్హులు. వారెవ్వరు కూడ లేకపోతే సమానోదకుడు ఆచార్యుడు, శిష్యుడు క్రమముగ అర్హులు. వారు కూడ ఎవ్వరు లేకపోతే ఆ ఆస్తియంతా మూడు వేదాలనధ్యయనం చేసినవారు, శుచిగా ఉండువారు, నియమనిష్ఠ కల బ్రాహ్మణులకు చెందుతుంది.

*అహార్యం బ్రాహ్మణద్రవ్యం రాజ్ఞా నిత్యమితి స్థితిః,*
*ఇతరేషాం తు వర్ణానాం సర్వాభావే హరేన్నృపః 189*

బ్రాహ్మణుల యొక్క ధనాన్ని రాజెప్పుడు తీసికోకూడదు. తక్కిన వర్ణములకు చెందివారి ధనమును అనుభవింపవలసిన వారెవ్వరూ లేకపోతే రాజే గ్రహింపవలెను.

*సంస్థితస్యానపత్యస్య సగోత్రాత్పుత్రమాహరేత్,*
*తత్ర యద్రిక్థజాతం స్యాత్తత్తస్మిన్ ప్రతిపాదయేత్ 190*

సంతానం లేక చనిపోయిన వాని భార్య సగోత్రుడైన వానినుండి పెద్దల అనుమతితో వారి పుత్రుని దత్తత తీసికొని తన ఆస్తినంతా అతనికిచ్చివేయవలెను.

*ద్వౌ తు యౌ వివదేయాతాం ద్వాభ్యాం జాతౌ స్త్రియా ధనే,*
*తయోర్యద్యస్య పిత్ర్యం స్యాత్తత్స గృహ్ణీత నేతరః 191*

ఒక స్త్రీ వివాహము చేసికొని సంతానాన్ని కన్న తరువాత ఆమె భర్త గతించినందువల్ల ఆ భర్తయొక్క సంపదను తీసికొని మరియొకనిని వివాహమాడింది. అతనివల్ల పుత్రుడు పుట్టిన తరువాత ఆ భర్త కూడ చనిపోతే అతని ఆస్తిని కూడ తీసికొన్నది. ఆ తర్వాత ఆస్తికొరకు ఆ ఇద్దరు పుత్రులు వివాదపడుతుంటే వారు వారి వారి తండ్రుల ఆస్తికే తప్ప ఇతరుల ఆస్తికి వారసులు కాజాలరు.

*జనన్యాం సంస్థితాయాం తు సమం సర్వే సహోదరాః*
*భజేరన్మాతృకం రిక్థం భగిన్యశ్చ సనాభయః 192*

తల్లి చనిపోతే తల్లి ఆస్తికి ఆమె పుత్రులు, పెండ్లికాని పుత్రికలు, పెండ్లియైన కూతురు యొక్క కుమారులు, తండ్రి ఆస్తికి వలె అర్హులు. ఆమె కూతుళ్ళకు కూడ అమ్మమ్మ గారి ఆస్తినుండి మర్యాదకు దగినట్లు కొంత ధనాన్ని ఇవ్వాలి.

*యస్తాసాం స్యుర్దుహితరస్తాసామపి యథార్హతః,*
*మాతామహ్యా ధనాత్కించిత్ప్రదేయం ప్రీతి పూర్వకమ్ 193*

*అధ్యగ్న్యధ్యావాహనికం దత్తం చ ప్రీతికర్మణి,*
*భ్రాతృమాతృపితృప్రాప్తం షడ్విధం స్త్రీధనం స్మృతమ్ 194*

*అన్వాధేయం చ యద్దత్తం పత్యా ప్రీతేన చైవ యత్,*
*పత్యౌ జీవతి వృత్తాయాః ప్రజాయా స్తద్ధనం భవేత్ 195*

*బ్రాహ్మదైవార్షగాంధర్వ ప్రాజాపత్యేషు యద్వసు,*
*అప్రజాయామతీతాయం భర్తురేవ తదిష్యతే 196*

స్త్రీ ధనమారు విధములుగా ఉంటుంది. అధ్యగ్ని, ఆవాహనికం, భర్తృదత్తం,

తలి, సోదరులు, తండ్రి ఇచ్చింది, అని ఆరు విధాలు. వివాహానంతరం భర్త సంతోషంతో ఇచ్చిన ధనం భర్త బ్రతికి ఉన్నప్పుడే భార్య మరణిస్తే ఆ ధనమంతా స్త్రీ ధనమౌతుంది. బ్రాహ్మ, దేవ, అర్ష, గాంధర్వ, ప్రాజాపత్య వివాహాలైదింటిలోపల స్త్రీకి ఇంతకు ముందు చెప్పినట్లు అధ్యగ్ని మొదలగు ధనం లభిస్తే, ఆమె సంతతి లేక చనిపోయినప్పుడు ఆ స్త్రీ ధనమంతా భర్తకే చేరుతుంది.

*యత్త్వస్యాస్స్యాద్ధనం దత్తం వివాహేష్వాసురాదిషు,*
*అప్రజాయామతీతాయం మాతాపిత్రోస్తదిష్యతే 197*

*స్త్రియాం తు యద్భ వేద్విత్తం పిత్రా దత్తం కథంచన,*
*బ్రాహ్మణీ తద్ధరేత్కన్యా తదపత్యస్య వా భవేత్ 198*

ఆసురాది వివాహాల్లో స్త్రీకి పైన చెప్పినట్లు అధ్యగ్ని మొదలగు ఆరు పద్ధతులలో లభించిన ధనం ఆమె సంతానం లేకుండా చనిపోతే ఆమె తల్లిదండ్రులకు మాత్రమే చెందుతుంది. బ్రాహ్మణుని యొక్క ఇతర జాతి స్త్రీలు సంతానం లేక చనిపోతే ఆ స్త్రీ ధనం బ్రాహ్మణ జాతి స్త్రీకి గాని ఆమె కుమారునికి గాని చెందుతుంది.

*న నిర్హారం స్త్రియః కుర్యుః కుటుంబాద్బహుమధ్యగాత్,*
*స్వకాదపి చ విత్తాద్ధి స్వస్య భర్తురనాజ్ఞయా 199*

*పత్యౌ జీవతి యః స్త్రీభిరలంకారో ధృతో భవేత్,*
*న తం భజేరన్ దాయాదా భజమానాః పతంతి తే 200*

పెద్ద కుటుంబంలో ఉన్న స్త్రీలు ఆ కుటుంబానికి చెందిన సాధారణ ధనం నుండిగాని, తన భర్త యొక్క ఆజ్ఞలేనిదే తన ధనం నుండి గాని సొమ్ములు మొదలగువానికై ప్రత్యేకంగా ధనం తీసిపెట్టుకోవద్దు. భర్త బ్రతికి యుండగా ధరించిన సొమ్ములను భర్త చనిపోయిన తరువాత దాయాదులు పంచుకోకూడదు.

*అనంశౌ క్లీబపతితౌ జాత్యంధబధిరౌ తథా,*
*ఉన్మత్తజడమూకాశ్చ యే చ కేచిన్నిరింద్రియా : 201*

*సర్వేషామపితు న్యాయం దాతుం శక్త్యా మనీషిణా*
*గ్రాసాచ్ఛాదనమత్యంతం పతితో హ్యదదద్భవేత్ 202*

నపుంసకుడు, పతితుడు, పుట్టు గుడ్డి, చెవిటి, పిచ్చివాడు, జడుడు, మూగవాడు వీరందరు తండ్రి ఆస్తికి అర్హులు కారు. పైన చెప్పివారందరికి ఆ ధనమును గైకొన్నవాడు వారు బ్రదికి యున్నంతకాలం తన శక్తికొలది తిండి వస్త్రములు మొదలైనవి ఇచ్చి పోషించాలి. లేనిచో వాడు పాపియగును.

*యద్యర్థితా తు దారై స్స్యాత్క్లీబాదీనాం కథంచన,*
*తేషా ముత్పన్న తంతూనా మపత్యం దాయమర్హ తి 203*

*యత్కించిత్పితరి ప్రేతే ధనం జ్యేష్ఠోఽధిగచ్ఛతి*
*భాగో యవీయసాం తత్ర యది విద్యానుపాలితః 204*

## నవమాధ్యాయం

*అవిద్యానాం తు సర్వేషామీహాత శ్చేద్ధనం భవేత్,*
*సమస్తత్ర విభాగస్స్యాదపిత్ర్య ఇతి ధారణా 205*

నపుంసకుడు మొదలైనవారు పెండ్లి చేసుకొంటే నపుంసకుని క్షేత్రజుడైన పుత్రునికి తక్కినవారి ఔరసపుత్రులకు పితృ ధనమున భాగముంటుంది. తండ్రి చనిపోయినప్పుడు తండ్రి ఆస్తిని పెద్దవాడు పొందితే విద్యాది సుగుణములున్న తమ్ములకా ఆస్తిని పంచి ఇవ్వాలి. విద్యా శూన్యులగు తమ్ములందరికి తన ఇష్టము వచ్చినట్లు పెద్దవాడు తండ్రి ఆస్తిని ఇవ్వాలి. అన్నదమ్ములందరు ఏదో ఒక వృత్తినవలంభించి ధనం సంపాదిస్తే దాన్ని అందరు సమానంగా పంచుకోవాలి.

*విద్యాధనం తు యద్యస్య తత్తస్యైవ ధనం భవేత్,*
*మైత్రమౌద్వాహికం చైవ మాధుపర్కిక మేవ చ 206*

*భ్రాతౄణాం యస్తు నేహేత ధనం శక్తః స్వకర్మణా,*
*న నిర్భాజ్యః స్వకాదంశాత్కించిద్దత్వోపజీవనమ్. 207*

ఎవరు సంపాదించిన విద్యా ధనము వారి దగ్గరనే ఉంటుంది. మరియు స్నేహం, వివాహం, మధుపర్కపూజ వీటిచే లభించిన ధనాన్ని మాత్రం సోదరులు పంచుకోకూడదు. అన్నదమ్ములలో ఒకడు తనశక్తిపై ధనము సంపాదించగల్గినను పంపకము చేసుకొనుటకు ఇష్టపడకపోతే వానికి కొంత ధనాన్ని జీవికకై ఇచ్చి వేరుగా ఉంచవలెను. దానివల్ల వాని పుత్రులు తరువాత వివాదానికి రారు.

*అనుపఘ్నన్ పితృద్రవ్యం శ్రమేణ యదుపార్జితమ్*
*స్వయమీహిత లబ్ధం తన్నాకామో దాతు మర్హతి 208*

*పైతృకం తు పితా ద్రవ్యమనవాప్తం యదాప్నుయాత్,*
*న తత్పుత్రైర్భజేత్సార్ధమకామః స్వయమార్జితమ్ 209*

*విభక్తాస్సహ జీవంతో విభజేరన్ పునర్యది,*
*సమస్తత్ర విభాగ స్స్యాజ్జ్యేష్ఠ్యం తత్ర న విద్యతే 210*

తండ్రి సంపాదించిన ద్రవ్యాన్ని చెడగొట్టక స్వశక్తిచే దాన్ని పెంచితే ఆ పెంచిన ధనాన్ని సోదరులకిచ్చుటకు అతడు ఇష్టపడకపోతే వారతనిని అడుగుటకు వీలులేదు. తమ పితృ ధనాన్ని తమ తండ్రి అసమర్థతతో పెంపు చేయక వదలి పెట్టే అతని పుత్రుడు దాన్ని సాధింపవచ్చు. ఇంకా తండ్రి తాను సంపాదించిన ద్రవ్యాన్ని తనకిష్టం వచ్చివారికిచ్చుకోవచ్చు. కొడుకులకు దాన్ని పంచి ఇవ్వనక్కర లేదు. కాని తన పిత్రార్జితాన్ని మాత్రం తనపుత్రులకివ్వాలి. అన్నదమ్ములు తమ తండ్రి ఆస్తిని పంచుకొన్న తరువాత కొంత కాలం కలిసి ఉండి మళ్ళీ ఆస్తి పంచుకోవాలని అనుకున్నప్పుడు ఆ ఆస్తిని వారు సమానంగా పంచుకోవాలి. కాని దానిలో నుండి పెద్దవాడికి ఉద్ధారమీయవలసిన అవసరం లేదు.

*ఏషాం జ్యేష్ఠః కనిష్ఠో వా హీయేతాంశప్రదానతః,*
*మ్రియేతాన్యతరో వాపి తస్య భాగో న లుప్యతే 211*

*సోదర్యా విభజేరంస్తం సమేత్య సహితాస్సమమ్,*
*భ్రాతరో యే చ సంసృష్ట్యా భగిన్యశ్చ సనాభయః 212*

న్నదమ్ములలో ఎవడైనా ఆస్తి పంపకము చేసుకొంటున్నప్పుడు ఒకడు సన్యాసం రణాలతో పక్క కెళ్లగినా, చనిపోయినా అతని భాగం మాత్రం లోపించదు. న్ని అన్నదమ్ములు, అక్క చెల్లెండ్లు అందరు సమానంగా పంచుకోవాలి.

*యో జ్యేష్ఠో వినికుర్వీత లోభాద్భ్రాతౄన్ యవీయసః,*
*సోఽజ్యేష్ఠ స్స్యాదభాగశ్చ నియంతవ్యశ్చ రాజభిః 213*

*సర్వ ఏవ వికర్మస్థా నార్హంతి భ్రాతరో ధనమ్,*
*న చాదత్వా కనిష్ఠేభ్యో జ్యేష్ఠః కుర్వీత యౌతకమ్ 214*

్యష్ఠుడు ఆస్తి పంపకంలో ఆశవల్ల తనకంటె చిన్నవారికి అన్యాయం చేస్తే అతనికి ము లభించదు. పైగా రాజదండనకు అర్హుడౌతాడు. అట్లే భ్రష్టులు కాకున్నా ాదం, వేశ్యాసంగమం మొదలైన దుర్వ్యసనాలతో ధనాన్ని పాడు చేస్తూ ఉంటే ఆస్తిలో భాగమివ్వాల్సిన అవసరం లేదు.

*భ్రాతౄణామవిభక్తానాం యద్యుత్థానం భవేత్సహ,*
*న పుత్రభాగం విషమం పితా దద్యాత్కథంచన 215*

*ఊర్ధ్వం విభాగాజ్జాతస్తు పిత్ర్య మేవ హరేద్ధనమ్,*
*సంసృష్టా స్తేన వా యే స్యుర్విభజేత న తైస్సహ 216*

ోదరులంతా తండ్రితో కలిసి ఉన్నప్పుడు సంపాదించిన ధనాన్ని తండ్రి సమానంగా పంచిఇవ్వాలే తప్ప అధికంగా సంపాదించిన పుత్రునికి ఎక్కువ, ంపాదించినవానికి తక్కువ ఇవ్వకూడదు. తండ్రి బ్రతికి ఉండగానే పుత్రులు ుకొంటే తరువాత పుట్టిన పుత్రునికి వదలిన భాగం మాత్రమే వస్తుంది. లేక కి ఉండగానే ఆస్తిని పంచుకొని, ఆ తర్వాత కొందరు పుత్రులు పుడ్తే తండ్రితో వారందరు సమానంగా పంచుకోవాలి.

*అనపత్యస్య పుత్రస్య మాతా దాయమవాప్నుయాత్,*
*మాతర్యపి చ వృత్తాయాం పితుర్మాతా హరేద్ధనమ్ 217*

ంతతి లేక పుత్రుడు మరణించినపుడు అతనికి చెందవలసిన తండ్రిఆస్తి తల్లికి ది. ఆ తల్లి కూడా చనిపోతే ఆ ఆస్తి ఆ తండ్రి తల్లికి చెందుతుంది.

*ఋణే ధనే చ సర్వస్మిన్ ప్రవిభక్తే యథావిధి*
*పశ్చాద్దృశ్యేత యత్కించి త్తత్సర్వం సమతాం నయేత్ 218*

అన్నదమ్ములు తండ్రి ఆస్తిని పంచుకుంటున్నప్పుడు తొలుత అప్పులన్ని దీర్చిమిగిలిన ానంగా పంచుకోవాలి. దానిలో జ్యేష్ఠునికి ఉద్ధారమివ్వవలసిన పనిలేదు.

*వస్త్రం పత్ర మలంకారం కృతాన్నముదకం స్త్రియః,*
*యోగక్షేమం ప్రచారం చ నవిభాజ్యం ప్రచక్షతే 219*

వస్త్రములు, వాహనములు, సొమ్ములు, వండిన అన్నం, నీరు, స్త్రీలు, మంత్రి పురోహితులు మొదలగువారు, పశువులుపోవుదారి వీటినన్నిటిని పంచుకొనక ఎవరికి అనుభవంలో ఉంటే వారికే వదిలివేయాలి.

*అయముక్తో విభాగో వః పుత్రాణాం చ క్రియావిధిః,*
*క్రమశః క్షేత్రజాదీనాం ద్యూతధర్మం నిబోధత 220*

ఇంతవరకు ఔరసపుత్రుడు క్షేత్రజుడు మొదలగు పుత్రులు తండ్రి ఆస్తిని పంచుకొనువిధానమునంతయు తెలిపితిని.ఇక ద్యూత ధర్మాన్ని వివరిస్తాననిభృగుమహర్షి పలికెను.

*ద్యూతం సమాహ్వాయం చైవ రాజా రాష్ట్రాన్నివారయేత్*
*రాజాంతః కరణావేతౌ ద్వౌ దోషౌ పృథివీక్షితామ్ 221*

*ప్రకాశమేతత్తాస్కర్యం యద్దేవనసమాహ్వాయౌ,*
*తయోర్నిత్యం ప్రతీఘాతే నృపతిర్యత్నవాన్ భవేత్ 222*

*అప్రాణిభిర్యత్క్రియతే తల్లోకేద్యూతముచ్యతే,*
*ప్రాణిభిః క్రియతే యస్తు స విజ్ఞేయస్సమాహ్వాయః 223*

ద్యూతం, సమాహ్వాయం అనే రెండు దోషాలు రాజులకు రాజ్యనాశాన్ని కలిగిస్తాయి. కావున రాజు ఈ రెండు దోషాలు తనరాజ్యంలో లేకుండా చేయాలి. ద్యూత, సమాహ్వాయం ఈ రెండు ప్రత్యక్షంగా చేసే దొంగతనం వంటివి. అందువల్ల రాజు వాటిని కష్టపడియైనా నివారించాలి. ప్రాణంలేని పాచికలు మొదలైన వాటితో ఆడేదాన్ని జూదమంటే ప్రాణమున్న కోళ్ళు, మేకలు మొదలైన వాటితో ఆడేదాన్ని సమాహ్వాయమని అంటారు.

*ద్యూతం సమాహ్వాయం చైవ యః కుర్యాత్కారయేత వా,*
*తాన్ సర్వాన్ ఘాతయేద్రాజా శూద్రాంశ్చ ద్విజలింగినః 224*

*కితవాన్ కుశీలవాన్ క్రూరాన్పాషండస్థాంశ్చ మానవాన్,*
*వికర్మస్థాండికాంశ్చ క్షిప్రం నిర్వాసయేత్పురాత్ 225*

రాజు జూదం, సమాహ్వానం వీటిని ఆడేవారిని ఆడించేవారిని కఠినంగా శిక్షించాలి. అట్లే బ్రాహ్మణాదివేషాల్లో ఉండే శూద్రులను సైతం శిక్షించాలి. జూదం మొదలైన వాటిని చూచేవారిని, నర్తకగాయకులను, దుష్టులైన వేదవిరోధులను శ్రుతిస్మృతులకు చెందిన బాహ్యవ్రతం ఆచరించేవారిని, ఆపదలేకపోయినా ఇతరవర్ణధర్మాలచే బ్రతికే వారిని వెంటనే తన దేశం నుండి పంపించి వేయాలి.

*ఏతే రాష్ట్రే వర్తమానా రాజ్ఞః ప్రచ్ఛన్నతస్కరాః,*
*వికర్మక్రియయా నిత్యం బాధంతే భద్రికాః ప్రజాః 226*

వీరంతా రాజ్యంలో మారువేషంలో ఉంటున్న దొంగలే. వీరు మోసాలతో ప్రతి దినం మంచి వారిని బాధపెడ్తూ ఉంటారు.

*ద్యూతమేతత్పురాకల్పే దృష్టం వైర కరం మహత్,*
*తస్మాద్ద్యూతం న సేవేత హాస్యార్థమపి బుద్ధిమాన్ 227*

*ప్రచ్ఛన్నం వా ప్రకాశం వా తన్ని షేవేత యో నరః,*
*తస్య దండవికల్పస్స్యాద్యథేష్టం నృపతే స్తథా 228*

*క్షత్రవిట్ శూద్రయోనిస్తు దండం దాతుమశక్నువన్,*
*ఆనృణ్యం కర్మణా గచ్ఛేద్విప్రో దద్యాచ్ఛనైశ్శనైః 229*

*స్త్రీ బాలోన్మత్తవృద్ధానాం దరిద్రాణాం చ రోగిణామ్,*
*శిఫావిదలరజ్జ్వాద్యైర్విదధ్యా న్నృపతి ర్దమమ్ 230*

పూర్వకాలంలో జూదం వైరాలను కల్గించినట్లు చెప్తారు. అందువల్ల జూదాన్ని నవ్వులాటకైన సేవించరాదు. దీన్ని రహస్యంగా గాని ప్రత్యక్షంగాగాని సేవిస్తూ ఉన్నవానిని రాజు తన ఇష్టం వచ్చినట్లు దండించాలి. క్షత్రియాదులు జూదమాడి దండన ఇవ్వకపోతే వారు పనిచేసియైనా దండుగకట్టాలి. బ్రాహ్మణుడీ పని చేస్తే దండుగనుమెల్లగా నైనా కట్టాలి స్త్రీలు, బాలురు, ఉన్మత్తులు, వృద్ధులు, దరిద్రులు, రోగులు ఈ జూదమాడుతూ ఉంటే రాజుమట్టి ఊడలు, వెదురుబెత్తం, తాడు మొదలైనవాటితో దండించాలి.

*యే నియుక్తాస్తు కార్యేషు హన్యుః కార్యాణి కార్యిణామ్,*
*ధనోష్మణా పచ్యమానాంస్తాన్నిస్స్వాన్ కారయేన్నృపః. 231*

*కూటాసనక ర్తృాంశ్చ ప్రకృతీనాం చ దూషకాన్,*
*స్త్రీ బాలబ్రాహ్మణఘ్నాంశ్చ హన్యాద్ద్విట్ సేవినస్తథా 232*

*తీరితం చానుశిష్టం చ యత్ర క్వచన యద్భవేత్,*
*కృతం తద్ధర్మతో విద్యాన్న తద్భూయో నివర్తయేత్ 233*

*అమాత్యాః ప్రాడ్వివాకో వా యత్కుర్యుః కార్యమన్యథా,*
*తత్స్వయం నృపతిః కుర్యాత్తాన్సహస్రం చ దండయేత్ 234*

ఈ వ్యవహారాలను చూడమని రాజు నియోగించిన వారు ఆ వివాదాలను చక్కబెట్టక చెడిపితే రాజు వారి సర్వస్వాన్నంతా హరించివేయాలి. తప్పు ఉత్తర్వులిచ్చువానిని, మంత్రులను అవమానపరుచు వానిని స్త్రీలను బాలురను, బ్రాహ్మణులను చంపేవారిని, శత్రువుల దగ్గర ఉండేవారిని రాజు చంపివేయాలి. ఒక కార్యం విచారించి రాజుతీర్పుఇస్తే దాన్ని ధర్మంగా ఇచ్చినట్లు భావించాలే తప్ప దాన్ని విమర్శించకూడదు. రాజు నియమించిన మంత్రులుగాని న్యాయాధికారులుగాని తగవులను చక్కగా పరిష్కరింపకపోతే ఆ తగవును రాజే స్వయంగా విచారించాలి. తప్పుగా పరిష్కరించిన ఉద్యోగులకు వేయి రూకలు దండము విధించాలి.

*బ్రహ్మహా చ సురాపశ్చ స్తేయీ చ గురుతల్పగః,*
*ఏతే సర్వే పృథగ్ జ్ఞేయా మహాపాతకినో నరాః 235*

*చతుర్ణామపి చైతేషాం ప్రాయశ్చిత్తమకుర్వతామ్,*
*శారీరం ధనసంయుక్తం దండం ధర్మ్యం ప్రకల్పయేత్ 236*

*గురుతల్పే భగః కార్యః సురాపానే సురాధ్వజః,*
*స్తేయే చ శ్వపదం కార్యం బ్రహ్మహన్యశిరాః పుమాన్ 237*

*అసంభోజ్యా హ్యసంయాజ్యా అసంపాఠ్యా వివాహినః,*
*చరేయుః పృథివీం దీనాః సర్వధర్మ బహిష్కృతాః 238*

*జ్ఞాతి సంబంధిభిస్త్వేతే త్యక్తవ్యాః కృతలక్షణాః,*
*నిర్దయా నిర్నమస్కారా స్తన్మనో రనుశాసనమ్ 239*

బ్రహ్మహత్య చేసినవాడు, కల్లుత్రాగువాడు, దొంగతనం చేసేవాడు, గురుభార్యతో సంబంధము పెట్టుకొనువాడు ఈ నలుగురిని ఒక్కొక్కరిని ప్రత్యేకంగా మహాపాతకులని అంటారు. ఈ నలుగురు మహాపాతకులు ప్రాయశ్చితం చేసికొననప్పుడు రాజుధన దండమును ఈ శరీరదండాన్ని కూడ విధించాలి. గురుభార్యా సంగమం చేసిన వాని ముఖంపై యోని ముద్రను, సురాపానం చేసివాని ముఖంపై సురాధ్వజాన్ని, దొంగయొక్క ముఖంపై కుక్కపాదాన్ని, బ్రహ్మహత్య చేసినవాడి ముఖంపై తలలేని పురుషుని మొండాన్ని వాతవేయాలి. వీరికి భోజనం పెట్టకూడదు. వీరిచే యాగంచేయించవద్దు. వీరు ధనం లేక బిచ్చమెత్తుకుంటూ దీనంగా తమ ధర్మములనన్నిటిని వదిలిపెట్టి తిరుగుతూ ఉండాలి. వీరిని జ్ఞాతులు, మేనమామ మొదలైన చుట్టాలందరూ వదిలిపెట్టాలి . వీరిపైన ఎవ్వరూ దయచూపవద్దు. వీరికి నమస్కారం.కూడ చేయవద్దని మనువు శాసించెను.

*ప్రాయశ్చిత్తం తు కుర్వాణా స్సర్వవర్ణా యథోదితమ్*
*నాంక్యా రాజ్ఞా లలాటే స్యుర్దాప్యాస్తూత్తమసాహసమ్ 240*

*ఆగస్సు బ్రాహ్మణస్యైవ కార్యో మధ్యమసాహసః,*
*వివాస్యో వా భవేద్రాష్ట్రాత్సద్రవ్య స్సపరిచ్ఛదః 241*

*ఇతరే కృతవంతస్తు పాన్యేతాన్య కామతః,*
*సర్వస్వహార మర్హంతి కామతస్తు ప్రవాసనమ్ 242*

మహాపాతకాలు చేసిన ఈ చాతుర్వర్ణాల వారు ప్రాయశ్చితం చేసికొంటే మహారాజు వీరిముఖాలపై గుర్తులు పెట్టక ఉత్తమసాహసం (వేయిరూకలు) దండం విధించాలి. కాని పైన చెప్పిన మహాపాతకం చేసిన సద్గుణుడైన బ్రాహ్మణునికి మధ్యమ సాహసం (ఐదు వందల రూకలు) దండనంగావిధించాలి. దుర్గుణాలున్న బ్రాహ్మణునికి వేయిరూకలు దండుగ విధించాలి. అట్లే ఆ బ్రాహ్మణుని అతని ధనధాన్యాలతో రాష్ట్రంనుండి వెళ్ళగొట్టాలి. ఇతరకులాలవారు ఈ పాపాలలో ఒక్కదాన్నైనా బుద్ధిపూర్వకంగా కాక చేస్తే రాజు వారిసర్వస్వాన్ని తీసికోవాలి. లేక వారాపాపాన్ని బుద్ధిపూర్వకంగాచేస్తే రాజువారి సర్వస్వాన్ని లాగుకొని దేశబహిష్కృతులను చేయాలి.

*నాదదీత నృపస్సాధుర్మహాపాతకినో ధనమ్,*
*ఆదదానస్తు తల్లోభాత్తేన దోషేణ లిప్యతే 243*

*అప్సు ప్రవేశ్య తం దండం వరుణాయోపపాదయేత్,*
*శ్రుతవృత్తోపపన్నే వా బ్రాహ్మణే ప్రతిపాదయేత్ 244*

*ఈశో దండస్య వరుణో రాజ్ఞాం దండధరో హి సః,*
*ఈశస్సర్వస్య జగతో బ్రాహ్మణో వేదపారగః 245*

ధర్మాత్ముడైన రాజు మహాపాపములు చేసినవారి అపరాధధనాన్ని స్వార్థానికై తీసికోకూడదు. ఆశతో వారి అపరాధ ధనాన్ని తనకై తీసికొంటే తానే మహాపాతకి ఔతాడు.మహాపాతకులకు దండంగావిధించబడినధనాన్ని రాజు తీసికొని నీటిలోవరుణదేవునికి సమర్పించాలి. లేకపోతేచక్కగా వేదశాస్త్రాలను అధ్యయనం చేసిన బ్రాహ్మణునికైనా ఆ ధనాన్ని సమర్పించాలి. మహాపాతకము చేసిన వారి దండధనానికి వరుణుడే అధికారి. ఆ వరుణుడు రాజులకు కూడ ప్రభువే. అట్లే సమస్తవేద శాస్త్రాధ్యయనం చేసిన బ్రాహ్మణుడు సమస్తజనులకు ప్రభువు.

*యత్ర వర్జయతే రాజా పాపకృద్భ్యో ధనాగమమ్,*
*తత్ర కాలేన జాయంతే మానవా దీర్ఘజీవినః 246*

*నిష్పద్యంతే చ సస్యాని యథోప్తాని విశాం పృథక్,*
*బాలాశ్చ న ప్రమీయంతే వికృతం న చ జాయతే 247*

రాజు మహాపాతకులను శిక్షించి తీసికొన్న దండధనాన్ని వరుణునికి గాని, బ్రాహ్మణునికిగాని వదిలిపెట్టే ఆ రాజ్యంలో జనులు సకాలంలో పుట్టి దీర్ఘాయుష్మంతులై బ్రతుకుతారు. అట్లే వేసిన పంటలు చక్కగా పండుతాయి. బాల్యమరణాలుండవు ఇంకా వికృతమైన కార్యాలేవి జరుగవు.

*బ్రాహ్మణాన్ బాధమానం తు కామాదవరవర్ణజమ్,*
*హన్యాచ్చిత్రై ర్వధోపాయై రుద్వేజనకరై ర్నృపః 248*

*యావానవధ్యస్య వధే తావాన్వధ్యస్య మోక్షణే,*
*అధర్మో నృపతే ర్దృష్టో ధర్మస్తు వినియచ్ఛతః 249*

బుద్ధి పూర్వకంగాబ్రాహ్మణులను బాధపెట్టేవానిని రాజు భయంకరమైన వధోపాయాలచే కఠినంగా దండించాలి. వధించతగిన వానిని వధిస్తే ఎంతపాపమో, వధించుటకు తగిన వాణ్ణి చంపకపోతే అంతేపాపము. కావున రాజు ధర్మాన్ని తప్పక అనుష్ఠించాలి.

*ఉదితోZయం విస్తరశో మిథో వివదమానయోః,*
*అష్టాదశసు మార్గేషు వ్యవహారస్య నిర్ణయః. 250*

*ఏవం ధర్మ్యాణి కార్యాణి సమ్యక్కుర్వన్మహీపతిః,*
*దేశానలబ్ధాన్ లిప్సేత లబ్ధాంశ్చ పరిపాలయేత్ 251*

అప్పుతీసికొనుటమొదలైనకార్యాల్లోతగవులాడేవారిగురించి తగవును రాజు ఎట్లు పరిష్కరించాలో వివరంగా చెప్పబడింది. ఈ విధంగా రాజు న్యాయందప్పక తగవులను

పరిష్కరిస్తూ ప్రజల మన్ననలపొంది, క్రొత్త క్రొత్త రాజ్యాలు జయిస్తూ, జయించిన రాజ్యాన్ని చక్కగా పరిపాలించాలి.

*సమ్యఙ్నివిష్టదేశస్తు కృతదుర్గశ్చ శాస్త్రతః,*
*కంటకోద్ధరణే నిత్యమాతిష్ఠేద్యత్నముత్తమమ్ 252*

*రక్షణాదార్యవృత్తానాం కంటకానాం చ శోధనాత్,*
*నరేంద్రా స్త్రిదివం యాంతి ప్రజాపాలనతత్పరాః 253*

*అశాసంస్తస్కరాన్ యస్తు బలిం గృహ్ణాతి పార్థివః,*
*తస్య ప్రక్షుభ్యతే రాష్ట్రం స్వర్గాచ్చ పరిహీయతే 254*

*నిర్భయంతు భవేద్యస్య రాష్ట్రం బాహుబలాశ్రితమ్,*
*తస్య తద్వర్ధతే నిత్యం సిచ్యమాన ఇవ ద్రుమః 255*

రాజు దుర్గాన్నేర్పరచుకొని చక్కగా పట్టణంలో ఉంటూ దొంగలు, దోపిడికాండ్రువంటి కంటకములనేరి వేయుటకు ప్రతిదినము ప్రయత్నం చేస్తూ ఉండాలి సజ్జనులను రక్షిస్తూ దుష్టులను శిక్షిస్తూ ఉన్నందువలన రాజులు కీర్తిప్రతిష్ఠలు పొందుతున్నారు. దొంగలను అణచక ప్రజలదగ్గర నుండి పన్ను తీసుకొంటే అతని రాజ్యం నాశనమౌతుంది. చెడ్డ పేరు వస్తుంది. రాజు దుష్టులనుండి అభయాన్ని కల్పిస్తే అతని రాజ్యం ప్రతిదినం నీళ్ళుపోస్తు ఉంటే ఎదుగుచెట్టువలె దినదినాభివృద్ధి చెందుతూ ఉంటుంది.

*ద్వివిధాంస్తస్కరాన్ విద్యాత్పర ద్రవ్యాపహారకాన్,*
*ప్రకాశాంశ్చా ప్రకాశాంశ్చ చార చక్షుర్మహీపతిః 256*

*ప్రకాశవంచకాస్తేషాం నానాపణ్యోపజీవినః,*
*ప్రచ్ఛన్నవంచకాస్త్వేతే యే స్తేనాటవికాదయః 257*

సాధారణంగా ఇతరుల ద్రవ్యాన్ని అపహరించే దొంగలు రెండు రకాలుగా కనిపిస్తారు. ఒకరు దాక్కొని రాత్రిపూట దొంగతనాలు చేస్తే మరికొందరు పట్టపగలే బాహాటంగా నలుగురి ముందు దొంగతనం చేస్తు ఉంటారు. రాజు ఈ రెండు తెగల దొంగల్ని గూఢచారుల ద్వారా ఎప్పటికప్పుడు గమనిస్తూ ఉండాలి. వీరిలో తప్పుడు తూనికలు మొదలైనవాటిచే బ్రతికేవారు. ప్రకాశ వంచకులు లేక పగటి దొంగలు, దొంగలు, ఆటవికులు మొదలైనవారు రహస్యంగా ఉండి దొంగతనం చేస్తారు కావున ప్రచ్ఛన్న వంచకులులేక రాత్రి దొంగలు.

*ఉత్కోచకాశ్చోపధికా వంచకాః కితవా స్తథా,*
*మంగళాదేశవృత్తాశ్చ భద్రాశ్చేక్షణికైస్సహ 258*

*అసమ్యక్కారిణశ్చైవ మహామాత్రాశ్చికిత్సకాః*
*శిల్పోపచారయుక్తాశ్చ నిపుణాః పణ్యయోషితః 259*

*ఏవమాదీన్ విజానీయాత్ ప్రకాశాన్ లోకకంటకాన్,*
*నిగూఢచారిణశ్చాన్యాననార్యానార్యలింగినః 260*

*తాన్విదిత్వా సుచరితైర్గూఢైస్తత్కర్మకారిభిః,*
*చారైశ్చానేకసంస్థానైః ప్రోత్సాద్య వశమానయేత్ 261*

లంచగొండులు, భయపెట్టి ఇతరుల సొమ్ము దోచుకొనే వారు, బంగారునగలు తీసికొని గిల్టునగలతో మోసంచేసేవారు, మంచి వేషంతో మోసగించువారు, హస్తరేఖలు చూచిబ్రతికేవారు, తప్పుడు పనులు చేయువారు,చక్కగా నేర్వని గజశాస్త్రం అశ్వశాస్త్రం మొదలైనవాటిచే బ్రతుకువారు, వైద్యులు మొదలైనవారు ప్రజలకు దుఃఖాన్ని కలిగిస్తారుకావున వీరినందరిని యోగ్యులైన గూఢచారుల ద్వారా గుర్తించి రాజు వారిని శిక్షించవలెను.

*తేషాం దోషా నభిఖ్యాప్య స్వే స్వే కర్మణి తత్త్వతః,*
*కుర్వీత శాసనం రాజా సమ్యక్ సారాపరాధతః 262*

*న హి దండాదృతే శక్యః కర్తుం పాపవినిగ్రహః,*
*స్తేనానాం పాపాబుద్ధీనాం నిభృతం చరతాం క్షితౌ 263*

ఆయా దొంగలు చేసిన దొంగతనాల్ని రాజు ప్రజలకందరికి తెలియబరచి, వారు చేసిన దొంగతనాలకు తగ్గట్లుగా వారిని శిక్షింపవలెను. పాపబుద్ధితో భూమిపై తిరుగుచున్న అ దొంగలను శిక్షింపక వారు చేయు చెడు పనులను అరికట్టలేము. కావున వీరిని తప్పక శిక్షింపవలెను.

*సభాప్రపాపూపశాలా వేశమద్యాన్న విక్రయాః,*
*చతుష్పథాశ్చైత్యవృక్షా స్సమాజాః ప్రేక్షణాని చ 264*

*జీర్ణోద్యానాన్యరణ్యాని కారుకావేశనాని చ,*
*శూన్యాని చాప్యగారాణి వనాన్యుపవనాని చ 265*

*ఏవం విధాన్నృపో దేశాన్ గుల్మైః స్థావరజంగమైః*
*తస్కర ప్రతిషేధార్థం చారైశ్చాప్యనుచారయేత్ 266*

జనులందరు సాధారణంగా చేరు రచ్చబండలు, చలిపందిళ్ళు, మిఠాయి అంగళ్ళు, భోగంవారి ఇండ్లు మద్యమును అన్నమును అమ్మ స్థలములు నాలుగు తోవలు కలియు చోట్లు, మంచినీడనిచ్చుచెట్లు, జనులు గుమిగూడు చోట్లు, పాడుపడ్డ తోటలు, అడవులు, శిల్పకారులు పని చేసే ఇండ్లు, పాడుపడ్డ ఇండ్లు, ఉద్యానవనాలు, మొదలగుచోట స్థిరంగాను, ఆ స్థలములపై దృష్టివేసి గూఢచారులనుంచి దొంగలనరికట్టుటకై రాజు ప్రయత్నించవలెను.

*తత్సహాయై రనుగతైర్నానాకర్మ ప్రవేదిభిః,*
*విద్యాదుత్సాదయేచ్చైవ నిపుణైః పూర్వతస్కరైః 267*

*భక్ష్యభోజ్యోపదేశైశ్చ బ్రాహ్మణానాం చ దర్శనైః,*
*శౌర్యకర్మాపదేశైశ్చ కుర్యుస్తేషాం సమాగమమ్ 268*

*యే తత్ర నోపసర్పేయుర్మూల ప్రణిహితాశ్చయే,*
*తాన్ ప్రసహ్య నృపో హన్యాత్సమిత్రజ్ఞాతి బాంధవాన్ 269*

## నవమాధ్యాయం

పాత దొంగలు వారి తోడ్పాటుతో దొంగతనంలోని అనేక మెళుకువలు తెలుసుకొని ప్రవర్తించువారినందరిని చారులచే కనిపెట్టి దండింపవలెను. ఆ దొంగలను భక్ష్య భోజ్యములనిప్పింతుమను వ్యాజమున, బ్రాహ్మణులను చూడవచ్చునని, సాహసపు పనులు చేయవచ్చునని చెప్పి చారుల ద్వారా పట్టుకోవలెను. ఈ విధంగా నేర్పుతో పిలిచినా వారు కూడ గూఢచారులను అనుమానించి చెప్పినచోటికి రాకపోతే అట్టి దొంగలుండు స్థావరాలను గుర్తించి వారిని వారి మిత్రులు, జ్ఞాతులు, బాంధవులందరితో కలిపి పట్టుకొని చంపివేయవలెను.

*న హోఢేన వినా చౌరం ఘాతయేద్ధార్మికో నృపః,*
*సహోఢం సోపకరణం ఘాతయేదవిచారయన్ 270*

*గ్రామేష్వపి చ యే కేచిచ్చౌరాణాం భక్త దాయకాః,*
*భాండావకాశదాశ్చైవ సర్వాం స్తానపి ఘాతయేత్ 271*

ధార్మికుడైన రాజు పట్టుబడ్డ దొంగ దగ్గర దొంగిలించిన వస్తువులేమి లేకపోతే శిక్షింపరాదు. ఆ దొంగ దగ్గర దొంగిలించిన వస్తువులు, దానికి సంబంధించిన ఉపకరణాలు దొరికితే అతనిని విచారించకుండ శిక్షించాలి. గ్రామాలలో ఈ దొంగలకు అన్నంపెట్టే వారిని, పనిముట్లు, ఆశ్రయమిచ్చేవారినందరిని దొంగతనానికి సహాయం చేస్తున్నందువలన తప్పక సంహరింపవలెను.

*రాష్ట్రేషు రక్షాధికృతాన్ సామంతాం శ్చైవ చోదితాన్,*
*అభ్యాఘాతేషు మధ్యస్థాఞ్ఛి ష్యాచ్చౌరానివ ద్రుతమ్ 272*

*యశ్చాపి ధర్మసమయాత్ ప్రచ్యుతో ధర్మజీవనః,*
*దండేనైవ తమప్యో షేత్స్వకాద్ధర్మాద్ధి విచ్యుతమ్ 273*

*గ్రామఘాతే హితాభంగే పథి మోషాభిదర్శనే,*
*శక్తితో నాభిధావంతో నిర్వాస్యాః సపరిచ్ఛదాః 274*

రాజ్యంలో రక్షించుటకై ఏర్పరచిన అధికారులు రాజ్యంయొక్క సరిహద్దుల్లో ఉండునట్లు నియమింపబడ్డవారు దుష్ట స్వభావంతో దొంగలకు సహాయం చేస్తూ మధ్యస్థులై ఉంటే, వారిని కూడ దొంగలను శిక్షించినట్లే శిక్షించాలి. ధర్మజీవనం గడప వలసినవాడు ధర్మాన్ని తప్పి ప్రవర్తిస్తూ ఉంటే రాజు దండించాలి. దొంగలు మొదలైన వారు ఊరుకొల్లగొడుతుండగా, చెరువు కట్టలు తెగగొడుతున్నప్పుడు, తనతో దొంగలు కనిపించగా వారినరికట్టుటకు తమ శక్తిమేర ప్రయత్నించని వారిని కూడ వారి పరివారసమేతంగా దేశంనుండి వెళ్ళగొట్టాలి.

*రాజ్ఞః కోశాపహర్తౄంశ్చ ప్రతికూలేషు చ స్థితాన్,*
*ఘాతయేద్వివిధైర్దండైరరీణాం చోపజాపకాన్ 275*

*సంధిం ఛిత్వా తు యే చౌర్యం రాత్రౌ కుర్వంతి తస్కరాః,*
*తేషాం ఛిత్వా నృపో హస్తౌ తీక్ష్ణశూలే నివేశయేత్ 276*

*అంగులీ గ్రంథిభేదస్య ఛేదయేత్ప్రథమే గ్రహే,*
*ద్వితీయే హస్తచరణౌ తృతీయే వధమర్హతి 277*

రాజుయొక్క కోశాగారం నుండి ధనం దొంగిలించినవారిని, రాజుయొక్క ఆజ్ఞ తప్పువానిని, శత్రు రాజునకు రాజునకు మధ్య భేదము పుట్టించువారిని నేరానికి తగ్గట్లు చేతులు కాళ్ళు నరకుట, నాలుక తెగగోయుట అనే రెండు విధాలైన దండములచే దండింపవలెను. కన్నం వేసి దొంగతనాలు చేయువారిని, ఒకరి సొత్తునపహరించువారిని రాజు రెండు చేతులు నరికి, వాడియైన శూలముపై కూర్చుండబెట్టే మరణ దండనను విధించాలి. మొదటిసారి చిల్లర దొంగతనం చేసేవానికి వేళ్ళు నరకవలెను. రెండవసారికూడ చిల్లర దొంగతనానికి పాల్పడితే కాళ్ళు చేతులు నరకాలి. అయినా మూడవసారి కూడ చిల్లర దొంగతనానికి పాల్పడితే మరణదండన విధించాలి.

*అగ్నిదాన్ భక్తదాంశ్చైవ తథా శస్త్రావకాశదాన్,*
*సన్నిధాతౄంశ్చ మోషస్య హన్యాచ్చోరమివేశ్వర: 278*

దొంగతనం చేసేవారని తెలిసి, వారికి అగ్నిని , అన్నాన్ని, ఆయుధాలను, వసతి ఇచ్చేవారిని, దొంగసొమ్ము దాచిపెట్టేవారిని, రాజు దొంగలను దండించినట్లు దండించాలి.

*తటాక భేదకం హన్యాదప్సు శుద్ధవధేన వా,*
*తద్వాపి ప్రతిసంస్కర్యాద్దాప్యస్తూత్తమసాహసమ్ 279*

*కోష్ఠాగారాయుధార దేవతాగార భేదకాన్,*
*హస్త్యశ్వరథహర్తౄంశ్చ హన్యాదేవావిచారయన్ 280*

చెరువులు గట్లు తెంపేవాణ్ణినీళ్ళలో వేసిగాని మామూలుగా, కాని వధించాలి. అతడొకవేళ కట్ట కట్టి ఇస్తే అతనికి ఉత్తమ సాహసాన్ని (వేయిరూకలను) దండనగా విధించాలి. కోశాగారాన్ని, ఆయుధాగారాన్ని, దేవాలయాన్ని పడగొట్టువానికి, ఏనుగ, గుఱ్ఱం, రథం వీటిని దొంగతనం చేసేవానికి వెంటనే మరణదండన విధించాలి.

*యస్తు పూర్వనివిష్టస్య తటాకస్యోదకం హరేత్,*
*ఆగమం వాప్యపాం భింద్యాత్స దాప్య: పూర్వసాహసమ్ 281*

*సముత్సృజేద్రాజమార్గే యస్త్వమేధ్యమనాపది,*
*స ద్వౌ కార్షాపణౌ దద్యాదమేధ్యం చాశు శోధయేత్ 282*

*అపద్గతోఽథవా వృద్ధో గర్భిణీ బాల ఏవ వా,*
*పరిభాషణమర్హంతి తచ్చ శోధ్యమితి స్థితి: 283*

ఇతరులు తవ్వించిన చెరువులోని నీటిని తన స్వార్థానికై వాడుకొనేవానికి, బావులు, దిగుడు బావుల నుండి వచ్చే నీటికి అడ్డకట్టవేసి తనవైపు మరల్చుకొను వానికి ప్రథమ సాహసాన్ని ( రెండువందల యాభై రూకలు ) దండన విధించాలి. రోగి కానివాడు రాజమార్గంలో మల విసర్జన చేస్తే వానిచే ఆ మలాన్ని ఎత్తించి, రెండు కార్షాపణములు దండుగ విధించాలి. రోగి, వృద్ధుడు, గర్భిణీ స్త్రీ, బాలుడు, ఇట్టిపనిని చేస్తే వారిని మందలించి ఆ మలమును వారిచే ఎత్తించి శుభ్రంచేయించాలి.

*చికిత్సకానాం సర్వేషాం మిథ్యా ప్రచరతాం దమః.*
*అమానుషేషు ప్రథమో మానుషేషు తుమధ్యమః 284*

*సంక్రమధ్వజయష్టీనాం ప్రతిమానాం చ భేదకః,*
*ప్రతికుర్యాచ్చ తత్సర్వం పంచ దద్యాచ్ఛతాని చ 285*

వైద్యులు సరియైన మందివ్వక పశువులకు హాని కలిగిస్తే ప్రథమ సాహసం (రెండువందల యాభై రూకలు) మానవులకు హాని కలిగిస్తే మధ్యమ సాహసం ( ఐదువందల రూకలు) దండుగగా విధించాలి. జనులు చిన్న చిన్న కాలువలు దాటుటకై ఉపయోగించు సంక్రమమనే కొయ్య పలుకను, రాజద్వారాదులందున్న ధ్వజస్తంభాన్ని, దేవతా ప్రతిమను నాశనం చేస్తే, వారికి ఐదువందల రూకలను దండుగ వేసి మరల కొత్త వాటిని చేసి ఇచ్చునట్లు శాసనం చేయవలెను.

*అదూషితానాం ద్రవ్యాణాం దూషణే భేదనే తథా,*
*మణీనామపవేధే చ దండః ప్రథమసాహసః 286*

*సమైర్హి విషమం యస్తు చరేద్వై మూల్యతోఽపి వా,*
*న ప్రాప్ను యాద్దమం పూర్వం నరో మధ్యమమేవ వా 287*

మంచి వస్తువులను పాడు చేసినప్పుడు, వజ్రము మొదలైన వాటిని పగుల గొట్టినప్పుడు, మణులు మొదలైన వాటిని తప్పుగా తొలిచి పాడు చేసినా, ఆ నేరస్థునికి రెండువందల యాభై రూకలు దండము విధించి యజమానికి కొత్త వస్తువునిప్పింపవలెను. అట్లే ఒకే ధర ఇచ్చిన వారిలో ఒకరికి మంచి వస్తువును, ఇంకొకరికి చెడు వస్తువునిచ్చినా, ఒకే విధమైన వస్తువుకు ఒకరి దగ్గర ఒక వెల, ఇంకొకరి దగ్గర ఇంకొక వెల తీసికొన్నా వారికి ఆయా సందర్భముననుసరించి ప్రథమ సాహసము, మధ్యమ సాహసము దండము విధించవలెను.

*బంధనాని చ సర్వాణి రాజా మార్గే నివేశయేత్;*
*దుఃఖితా యత్ర దృశ్యేరన్వికృతాః పాపకారిణః 288*

చెరసాలలను త్రోవలోనే నిర్మించి ఉంచినందువలన తప్పు చేసిన పాపాత్ములు ఆ చెరసాలలో పడి దారిన పోవుచున్నవారు తమను చూచుచున్నారే యని అవమానంతో బాధపడి తిరిగి పాప కార్యం చేయరు.

*ప్రాకారస్య చ భేత్తారం పరిఖాణాం చ పూరకమ్,*
*ద్వారాణాం చైవ భక్తారం క్షిప్రమేవ ప్రవాసయేత్ 289*

*అభిచారేషు సర్వేషు కర్తవ్యో ద్విశతో దమః,*
*మూలకర్మణి చానాప్తైః కృత్యాసు వివిధాసు చ 290*

రాజ ప్రాకారాన్ని గాని, దుర్గ ప్రాకారాన్ని గాని పడగొట్టు వానిని, అగడ్తలను పూడ్చివేయు వానిని, ఆ ప్రాకారముల ద్వారములు విరుగగొట్టు వానిని వేగమే దేశము నుండి వెళ్ళగొట్టవలెను. అభిచార హెూమములు చేసినప్పుడు, మూలనిఖన, పద

పాంసుగ్రహణమను వివిధములైన కృత్య కర్మములందు మనిషి చనిపోయినప్పుడు వీటిని చేసిన వానికి రెండువందల రూకలు దండుగ విధింపవలెను. ఒకవేళ ఈ అభిచారాదులవల్ల మనిషి చనిపోతే మరణమే దండనము.

*అబీజవిక్రయీ చైవ బీజోత్కృష్టం తథైవ చ,*
*మర్యాదాభేదకశ్చైవ వికృతం ప్రాప్నుయాద్వధమ్ 291*

*సర్వకంటక పాపిష్ఠం హేమకారం తు పార్థివః,*
*ప్రవర్తమానమన్యాయేచ్ఛేదయేల్లవశః క్షురైః 292*

మొలకలెత్తని విత్తనములనమ్మువానికి మంచి చెడు విత్తనములు రెండు కలిపి అమ్మువానికి, రెండు గ్రామాల మధ్య ఉన్న ఎల్లలను చెడగొట్టు వానికి మరణమే దండనము. తన్నుడు తూనికతో తూచుట ఒఱుపు రాతిపై గీచి తక్కువవన్నె వస్తువని చెప్పుట, బంగారు దొంగిలించుట వంటి పాపపు పనులు చేయు కమసాలి వానిని నేరమునకు దగినట్లు శరీరాన్ని ముక్కలు ముక్కలు చేయాలి.

*సీతాద్రవ్యాపహరణే వస్త్రాణామౌషధస్య చ,*
*కాలమాసాద్య కార్యం చ రాజా దండం ప్రకల్పయేత్ 293*

భూమిని దున్నుటకు కావలసిన పనిముట్లను, వస్త్రములను, మందులను దొంగిలించినప్పుడు, వాటి వాటి ఉపయోగాన్ననుసరించి రాజు ఆ దొంగను దండించవలెను.

*స్వామ్యమాత్యౌ పురం రాష్ట్రం కోశదండౌ సుహృత్తథా,*
*సప్త ప్రకృతయో హ్యేతాః సప్తాంగం రాజ్యముచ్యతే 294*

*సప్తానాం ప్రకృతీనాం తు రాజ్యస్యాసాం యథా క్రమమ్,*
*పూర్వం పూర్వం గురుతరం జానీయద్వ్యసనం మహత్ 295*

*సప్తాంగా స్యేహ రాజ్యస్య విష్టబ్ధస్య త్రిదండవత్,*
*అన్యోన్య గుణవైశేష్యాన్న కించిదతిరిచ్యతే 296*

*తేషు తేషు తు కృత్యేషు తత్తదంగం విశిష్యతే,*
*యేన యత్సాధ్యతే కార్యం తత్తస్మిన్ శ్రేష్ఠముచ్యతే 297*

రాజు, మంత్రి, పురము, రాజ్యము, కోశం, చతురంగ బలం స్నేహితుడు అనే ఈ ఏడు ప్రకృతులను సప్తాంగమని అందురు. ఈ సప్తాంగములలో చివరి వాటికంటె ముందు ముందున్నవి చాలా బాధ్యత కలవి. వాటికి కష్టము కలిగినచో తరువాతి వాటికి కూడ ముప్పు వాటిల్లినట్లే. స్నేహితునికంటె సైన్యం ముఖ్యం. సైన్యం కంటె కోశాగారం ప్రధానమైంది. దానికంటె రాజ్యం ప్రధానమైంది. ఈ విధంగా రాజు అన్నిటికంటె ప్రధానమైనవాడు. రాజుకు ఆపద సంభవిస్తే తక్కిన అంగాలకు కూడ ఆపద సంభవించినట్లే. ఐనప్పటికీ రాజ్య ప్రక్రియయందు ఈ సప్తాంగములన్నీ సన్యాసికి త్రిదండములవలె ముఖ్యమైనవే. ఒకదానికొకటి కలిసి ఉండవలసినవే. ఆయా కార్యములందు ఆయా అంగము ప్రధానమై ఉండును. ఒక అంగము నిర్వర్తించు కార్యాన్ని మరియొక అంగము చేయలేదు. కావున అంగాలన్నీ ప్రధానములే అని భావించాలి.

*చారేణోత్సాహయోగేన క్రియయైన చ కర్మణామ్,*
*స్వశక్తిం పరశక్తిం చ నిత్యం విద్యాన్మహీపతిః 298*

*పీడనాని చ సర్వాణి వ్యసనాని తథైవ చ,*
*ఆరభేత తతః కార్యం సంచిత్య గురులాఘవమ్ 299*

*ఆరభేతైవ కర్మాణి శ్రాంతః శ్రాంతః పునః పునః,*
*కర్మాణ్యారభమాణం హి పురుషం శ్రీర్నిషేవతే 300*

రాజు గూఢచారుల చేతను, సైన్యమునకుత్సాహము కలిగించుటవల్ల జనులకుపయోగించుకార్యములు చేయుటవల్ల ఏర్పడ్డ తనశక్తిని, శత్రువుల శక్తిని ఎల్లప్పుడు తెలిసికోవలెను. కామక్రోధాదులవల్ల కలుగు మారణాద్యుపద్రవాల్ని, తనరాజ్యంలో శత్రు రాజ్యాలలో కలుగు కష్టాల్ని, వాటిలోనున్న గురు లాఘవాల్ని తెలిసికొని శత్రువుతో యుద్ధానికి గాని సంధికి గాని సమాయత్తం కావాలి. రాజు తనయొక్క రాజ్యాభివృద్ధికి, శత్రు రాజ్యాల నాశనానికి కారణమైన కార్యాలు ప్రారంభించి ఆ కార్యాలవల్ల తనకు కష్టాలు కలిగినా విసుగుపడక మరల మరల ఆరంభించుచుండువానిని రాజ్యలక్ష్మి ఎల్లప్పుడు సేవించుచుండును.

*కృతం త్రేతాయుగం చైవ ద్వాపరం కలిరేవ చ,*
*రాజ్ఞో వృత్తాని సర్వాణి రాజా హి యుగముచ్యతే 301*

*కలిః ప్రసుప్తో భవతి సజాగ్రద్ద్వాపరం యుగమ్,*
*కర్మస్వభ్యుద్యత స్త్రేతా విచరంస్తు కృతం యుగమ్. 302*

రాజుయొక్క చర్యలే కృత త్రేత, ద్వావర, కలియుగాలు కావున రాజే యుగమనబడును. రాజు నిద్ర పోతున్నప్పుడు కలియుగమౌతుంది. అతడు వేచియున్నప్పుడు ద్వాపర యుగమౌతుంది. ఆ రాజు రాజకార్యాలలో నిమగ్నుడై ఉన్న సమయమే త్రేతాయుగం. అతడు శాస్త్ర ప్రకారంగా రాజ కార్యాలు నిర్వర్తిస్తున్న సమయమే కృతయుగము కావున రాజు యుగ స్వరూపుడు.

*ఇంద్రస్యార్కస్య వాయోశ్చ యమస్య వరుణస్య చ,*
*చంద్రస్యాగ్నేః పృథివ్యాశ్చ తేజో వృత్తం నృపశ్చరేత్. 303*

*వార్షికాంశ్చతురో మాసాన్ యథేంద్రోభిప్రవర్షతి,*
*తథాభివర్షేత్స్వం రాష్ట్రం కామైరింద్రవ్రతం చరన్ 304*

రాజు ఇంద్ర, సూర్య, వాయు, యమ, వరుణ, చంద్ర, అగ్ని, భూ దేవతల తేజస్సునకు తగిన నడవడి కలిగి ఉంటాడు. కావున శత్రువులను తన తేజస్సుతో జయించాలి. మిత్రులను ప్రేమతో లాలించాలి. ఇంద్రుడు నాలుగు నెలల వరకు వర్షించినట్లు రాజు కూడ తన దేశ ప్రజలను వారి కోరికలు తీర్చి సంతోష పెట్టాలి. ఇది ఇంద్రవ్రతము.

*అష్టౌ మాసాన్ యథాదిత్యస్తోయం హరతి రశ్మిభిః,*
*తథా హరేత్కరం రాష్ట్రాన్నిత్యమర్క వ్రతం హి తత్ 305*

సూర్యుడు తన కిరణాలతో ఎనిమిది నెలల వరకు నీటిని పీల్చుచున్నట్లు సూర్యవ్రతం చేసే రాజు తన ప్రజలనుండి ఎల్లప్పుడు పన్ను తీసుకొంటూ ఉంటాడు.

*ప్రవిశ్య సర్వభూతాని యథా చరతి మారుతః,*
***తథా చారైః ప్రవేష్టవ్యం వ్రతమేతద్ధి మారుతమ్ 306***

వాయువు సమస్త జీవులందు ప్రవేశించి ఏ విధంగా ఉంటాడో వాయువ్రతాన్ని అనుష్ఠించు రాజు చారుల ద్వారా పరుల యొక్క, తన యొక్క రాజ్య వృత్తాంతం తెలిసికొనుటకు లోన ప్రవేశింపవలెను.

*యథా యమః ప్రియద్వేష్యౌ ప్రాప్తే కాలే నియచ్ఛతి,*
***తథా రాజ్ఞా నియంతవ్యాః ప్రజాస్తద్ధి యమవ్రతమ్ 307***

యముడు కాలం సమీపించినపుడు ప్రేమద్వేషములను సమంగా ఎట్లు నియమిస్తాడో అట్లే యమవ్రతాన్ని అనుష్ఠించే రాజు ప్రజలను సమానంగా శిక్షించాలి.307

*వరుణేన యథా పాశైర్బద్ధ ఏవాభిదృశ్యతే,*
***తథా పాపాన్నిగృహ్ణీయాద్వ్రతమేతద్ధి వారుణమ్ 308***

వరుణుడు పాపాలను చేసే వారిని ఎట్లు వరుణ పాశాలతో కట్టివేసి శిక్షిస్తాడో అట్లే వరుణవ్రతం చేసే రాజుకూడ పాపం చేసే ప్రజలను శిక్షిస్తాడు.

*పరిపూర్ణం యథా చంద్రం దృష్ట్వా హృష్యంతి మానవా :,*
***తథా ప్రకృతయో యస్మిన్ స చాంద్రవ్రతికో నృపః 309***

సంపూర్ణ చంద్రుని చూచి ప్రజలు సంతోషపడుతున్నట్లు చంద్రవ్రతం చేసే రాజును చూచి మంత్రులు ప్రజలు మొదలైనవారు సంతోషపడుతూ ఉంటారు.

*ప్రతాపయుక్తస్తేజస్వీ నిత్యం స్యాత్పాపకర్మను,*
***దుష్టసామంతహింస్రశ్చ తదాగ్నేయవ్రతం స్మృతమ్ 310***

రాజు ఆగ్నేయ వ్రతాన్ని ఆచరిస్తూ పాపకారులను శిక్షించుటలో మిక్కిలి కఠినుడై చురుకు గలిగి ప్రతికూలురైన మంత్రులను హింసించేవాడై ఉండాలి.310

*యథా సర్వాణి భూతాని ధరా ధారయతే సమమ్,*
***తథా సర్వాణి భూతాని బిభ్రతః పార్థివం వ్రతమ్ 311***

భూమి సమస్త జీవులను భరించుచున్నట్లే ధరావ్రతాన్ని నిర్వహించే రాజు కూడ సమస్తజీవులను సమానంగా భరించాలి.

*ఏతైరుపాయైరన్యైశ్చ యుక్తో నిత్యమతంద్రితః,*
*స్తేనాన్రాజా నిగృహ్ణీయాత్స్వరాష్ట్రే పర ఏవచ 312*

ఈ ఉపాయాలు, ఇంకా తక్కిన ఉపాయాలతో రాజు ప్రతి దినం జాగరూకుడై తన రాష్ట్రంలోను, పర రాష్ట్రంలోను ఉన్న దొంగలను అరికట్టాలి.312

*పరామప్యాపదం ప్రాప్తో బ్రాహ్మణా న్న ప్రకోపయేత్,*
*తే హ్యేనం కుపితా హన్యుస్సద్యస్సబలవాహనమ్ 313*

*యైః కృత స్సర్వభక్షోऽగ్ని రపేయశ్చ మహోదధిః,*
*క్షయీ చాప్యాయితస్సోమః కో న నశ్యేత్రకోప్య తాన్ 314*

*లోకానన్యాన్సృజేయుర్యే లోకపాలాంశ్చ కోపితాః*
*దేవాన్ కుర్యురదేవాంశ్చ కః క్షిణ్వంస్తాంత్సమృధ్నుయాత్ 315*

రాజుకు ఎంత కష్టం వచ్చినా బ్రాహ్మణులపై మాత్రం కోపపడవద్దు. బ్రాహ్మణులే కోపిస్తే సైన్యం, వాహనాలతో ఉన్న రాజును శపించి రూపుమాపగలరు. బ్రాహ్మణులు కోపంతో అగ్నిని సర్వభక్షునిగా శపించిరి. సముద్రంలోని నీరు త్రాగుటకు వీలు లేకుండ చేసిరి. చంద్రుని క్షయ రోగిగా చేసి తిరిగి అతనిని బాగు చేసినారు. అట్టి బ్రాహ్మణులకు కోపము కలిగించి సుఖంగా ఎవరుంటారు. ఇంకా వారికి కోపం వస్తే స్వర్గాది లోకాల్ని, ఇంద్రాది దిక్పాలకులను సైతం సృష్టించగలుగుతారు. అట్లే దేవతలను శపించి మానవులుగా చేయగలుగుతారు. అట్టి బ్రాహ్నణులకు కోపం తెప్పించి ఎవ్వరు మనగలుగుతారు.

*యానుపాశ్రిత్య తిష్ఠంతి లోకా దేవాశ్చ సర్వదా,*
*బ్రహ్మచైవధనం యేషాం కో హింస్యాత్తాన్ జిజీవిషుః 316*

*అవిద్వాంశ్చైవ విద్వాంశ్చ బ్రాహ్మణో దైవతం మహత్,*
*ప్రణీతశ్చాప్రణీతశ్చ యథాగ్నిర్దైవతం మహత్ 317*

*శ్మశానేష్వపి తేజస్వీపావకో నైవ దుష్యతి,*
*హూయమానశ్చ యజ్ఞేషు భూయ ఏవాభివర్ధతే 318*

*ఏవం యద్యప్యనిష్టేషు వర్తంతే సర్వకర్మస్వను,*
*సర్వదా బ్రహ్మణాః పూజ్యాః పరమం దైవతం హి తత్ 319*

భూమ్యాదిలోకాలు, దేవతలు యజ్ఞయాగాదులు చేయు బ్రాహ్మణులనాశ్రయించి యున్నారు. వేదమే ధనంగా కల బ్రాహ్మణులను ఎవడు హింసిస్తాడు? సంస్కరింపబడ్డా, సంస్కరింపబడకపోయినా అగ్ని ఏ విధంగా గొప్ప దైవంగా ఆరాధింపబడుతున్నదో అట్లే విద్వాంసుడైనా విద్వాంసుడు కాకపోయినా బ్రాహ్మణుడు ఆరాధింపబడుతూ ఉంటాడు. శ్మశానంలోని శవాన్ని తగలపెట్టే అగ్ని అపరిశుద్ధం కాక యజ్ఞయాగాదు లందుపయోపడు తున్నట్లే బ్రాహ్మణుడు నీచకార్యాల్లో పాల్గొన్నా అతడు పవిత్రుడే అగుచున్నాడు.

*క్షత్రస్యాతి ప్రవృత్తస్య బ్రాహ్మణాన్ ప్రతి సర్వశః,*
*బ్రహ్మైవ సన్నియంతృ స్యాత్క్షత్రం హి బ్రహ్మసంభవమ్ 320*

బ్రాహ్మణులగురించి విపరీతంగా ప్రవర్తించిన క్షత్రియుని కూడ బ్రాహ్మణుడే శాపాదులద్వారా నియంత్రించు చున్నాడు. క్షత్రియుడు కూడ బ్రహ్మదేవుని బాహువు నుండి పుట్టినందువల్ల బ్రాహ్మణుని గౌరవించవలెను.

*అద్భ్యోగ్నిర్బ్రహ్మతః క్షత్రమశ్మనో లోహముత్థితమ్,*
*తేషాం సర్వత్రగం తేజః స్వాసు యోనిషు శామ్యతి 321*

*నా బ్రహ్మ క్షత్రమృధ్నోతి నాక్షత్రం బ్రహ్మ వర్ధతే,*
*బ్రహ్మ క్షత్రం చ సంపృక్తమిహ చాముత్ర వర్ధతే 322*

నీటినుండి అగ్ని, బ్రాహ్మణునినుండి క్షత్రియుడు, రాతినుండి సమస్త లోహములు పుట్టినవి. అగ్ని మొదలైన వాటి తేజస్సు వాటియొక్క ఉత్పత్తి కారణమగు నీరు మొదలగు వాటి యందు శమించుచున్నది. అందువల్ల క్షత్రియ తేజస్సు సైతం క్షత్రియోత్పత్తికి కారణమైన బ్రాహ్మణునియందు శమించుచున్నది. శాంతిక పౌష్టికాది వ్యవహారాలను పరీక్షించే బ్రాహ్మణుడు లేనిచో రాజు అభివృద్ధిలోనికి రానేరడు. బ్రాహ్మణుడు, క్షత్రియుడు ఇద్దరు కలిసి ఉంటే ఇహపరములందు ఇద్దరూ అభివృద్ధి చెందుతారు.

*దత్వా ధనం తు విప్రేభ్యస్సర్వం దండసముత్థితమ్*
*పుత్రే రాజ్యం సమాసృజ్య కుర్వీత ప్రాయణం రణే 323*

*ఏవం చరన్ సదా యుక్తో రాజధర్మేషు పార్థివః,*
*హితేషు చైవ లోకస్య సర్వాన్ భృత్యాన్నియోజయేత్ 324*

రాజు ముసలివాడైనప్పుడు, రాజ్యాన్ని నిర్వహింపలేనప్పుడు పాపి ద్రవ్యము కాని ద్రవ్యాన్ని బ్రాహ్మణులకు దానం చేసి రాజ్యాన్ని తన పుత్రునకప్పగించి యుద్ధమున చనిపోయినచో అతడు స్వర్గమునకు పోవును కావున యుద్ధమునకై పోవలెను. యుద్ధము లేనిచో ప్రాయోపవేశమునైన చేయవలెను. ఈ విధంగా రాజ ధర్మాలనన్నిటిని అనుష్ఠించు రాజు ప్రజలకు మేలు జరుగుటకై ఆయా కార్యములందు సేవకులను నియోగింపవలెను.

*ఏషోఽఖిలః కర్మ విధిరుక్తో రాజ్ఞస్సనాతనః,*
*ఇమం కర్మవిధం విద్యాత్ క్రమశో వైశ్యశూద్రయోః 325*

ఇంతవరకు రాజు అనుష్ఠించవలసిన ధర్మమంతా వివరించబడింది. ఇక వైశ్యశూద్రులు ఆచరించలసిన ధర్మమీవిధంగా వివరింపబడుతూంది.

**వైశ్య ధర్మాలు :-**

*వైశ్యస్తు కృతసంస్కారః కృత్వా దారపరిగ్రహమ్,*
*వార్తాయాం నిత్యయుక్తస్స్యాత్పశూనాం చైవ రక్షణే 326*

*ప్రజాపతిర్హి వైశ్యాయ సృష్ట్వా పరిదదే పశూన్,*
*బ్రాహ్మణాయ చ రాజ్ఞే చ సర్వాః పరిదదే ప్రజాః 327*

*న చ వైశ్యస్య కామస్స్యాన్న రక్షేయం పశూనితి,*
*వైశ్యే చేచ్ఛతి నాన్యేన రక్షితవ్యాః కథంచన 328*

*మణిముక్తా ప్రవాళానాం లోహానాం తాంతవస్యచ,*
*గంధానాం చ రసానాం చ విద్యా దర్ఘబలాబలమ్ 329*

*బీజానాముప్తివిచ్చ స్యాత్ క్షేత్రదోషగుణస్య చ,*
*మానయోగం చ జానీయాత్తులాయోగాంశ్చ సర్వశః, 330*

వైశ్యుడు ఉపనయన సంస్కారం చేసికొని, వివాహం కూడ చేసికొని సేద్యం మొదలైన పనులలో పశు సంరక్షణలో నిమగ్నుడై ఉండాలి. బ్రహ్మదేవుడు ఆవులను సృష్టించి వైశ్యునికి అప్పగించాడు. అట్లే ప్రజలను సృష్టించి బ్రాహ్మణునికి, క్షత్రియునికిచ్చినాడు. వైశ్యుడు పశువులను రక్షించనని ఎప్పుడు కూడ పలుకకూడదు. అందువల్ల వైశ్యుడు పశు రక్షణ చేస్తుండగా ఇంకెవ్వరు పశువులను రక్షించుటకు పూనుకొనకూడదు. ఇంకను వైశ్యుడు మణులు, ముత్యాలు, పగడాలు, వెండి, బంగారు వంటి లోహాలు, బట్టలు, సుగంధ ద్రవ్యాలు, లవణాది రసాలు వీటియొక్క విలువల హెచ్చుతగ్గులను సమయానుకూలంగా గుర్తించాలి. విత్తనాలు నాటు పద్ధతిని, పొలముల యొక్క మంచి చెడులను, వస్తువులను కొలిచే కొల మానాన్ని, తూనికలకు సంబంధించిన తులామానాన్ని గుర్తించగలిగియుండాలి.

*సారాసారం చ భాండానాం దేశానాం చ గుణాగుణాన్,*
*లాభాలాభం చ పణ్యానాం పశూనాం పరివర్ధనమ్ 331*

*భృత్యానాం చ భృతిం విద్యాద్భాషాశ్చ వివిధా నృణామ్,*
*ద్రవ్యాణాం స్థానయోగాంశ్చ క్రయవిక్రయమేవ చ 332*

*ధర్మేణ చ ద్రవ్యవృద్ధావాతిష్ఠే ద్యత్నముత్తమమ్,*
*దద్యాచ్చ సర్వభూతానామన్నమేవ ప్రయత్నతః 333*

ఇంకా వస్తువుల మంచి చెడ్డల్ని, ఏ దేశంలో ఏ వస్తువు అమ్మితే లాభం ఎక్కువ వస్తుంది. ఏ దేశంలో అమ్మితే నష్టం వస్తుంది మొదలైన వాటిని గోపోషణ పద్ధతిని అతడు తెలిసియుండాలి. భృత్యులకెవ్వరికెంత జీతమివ్వాలి అనేదాన్ని, అనేక విధమైన భాషలను, వస్తువులను నిలుచేయు పద్ధతిని, వస్తువుల క్రయ విక్రయాదులను అతడు బాగా తెలిసి ఉండాలి. ఇంకా ధర్మ మార్గంలో ద్రవ్యాన్ని అభివృద్ధి పరిచే మార్గం బాగా తెలిసినవాడై ఉండాలి. సమస్త జీవులకు ఆహారాన్ని కూడ తానే సమకూర్చగల్గినవాడై ఉండాలి.

*విప్రాణాం వేదవిదుషాం గృహస్థానాం యశస్వినామ్,*
*శుశ్రూషైవ తు శూద్రస్య ధర్మో వై శ్రేయసః పరః 334*

*శుచిరుత్కృష్టశుశ్రూషుర్ మృదువాగనహంకృతిః*
*బ్రాహ్మణాద్యాశ్రయో నిత్యముత్కృష్టాం జాతి మశ్నుతే 335*

శూద్రుడు వేదవేత్తలు, గృహస్థులు, స్వకర్మానుష్ఠానం ద్వారా కీర్తి పొందిన బ్రాహ్మణులకు సేవ చేయవలెను. ఆ పనియే అతనికి స్వర్గమోక్షములను రెండింటిని కలిగించుచున్నది. ఉత్కృష్టులైన బ్రాహ్మణ శుశ్రూష చేసే శూద్రుడు బయట వెలుపల పరిశుద్ధుడై, పరుషంగా మాట్లాడక, అహంకారం లేకుండా ఉంటే మరణానంతరం తనకంటె ఉత్కృష్టమైన జాతిలో పుడుతాడు.

*ఏషోఽనాపది వర్ణానాముక్తః కర్మ విధిశ్శుభః*
*ఆపద్యపి హి యస్తేషాం క్రమశ స్తన్నిబోధత 336*

ఇంతవరకు సాధారణంగా బ్రాహ్మణాది నాలుగు కులాలవారు చేయాల్సిన ధర్మ విధానం గురించి చెప్పబడింది. ఆపదలప్పుడు వారు అనుష్ఠించాల్సిన ధర్మవిధానమును ఇక మీకు తెలుపుతానని భృగుమహర్షి పలికెను.

**ఇతి మానవే ధర్మ శాస్త్రే భృగుప్రోక్తాయాం సంహితాయాం నవమోzధ్యాయః**

భృగుమహర్షి చెప్పిన మానవధర్మశాస్త్రమనే సంహితలో తొమ్మిదవ అధ్యాయం సమాప్తం.

## దశమాధ్యాయం

*అధీయిరం స్త్రయో వర్ణాః స్వకర్మస్థా ద్విజాతయః,*
*ప్రబ్రూయాద్బ్రాహ్మణ స్త్వేషాం నేతరావితి నిశ్చయః 1*

*సర్వేషాం బ్రాహ్మణో విద్యాద్వృత్త్యుపాయాన్ యథావిధి,*
*ప్రబ్రూయాదితరేభ్యశ్చ స్వయం చైవ తథా భవేత్ 2*

బ్రాహ్మణుడు మొదలైన ద్విజాతులందరు స్వకర్మను అనుష్ఠిస్తూనే వేదాధ్యయనాన్ని చేయాలి. కాని వీరికి బ్రాహ్మణుడే వేదాన్ని చెప్పాలి కాని తక్కిన క్షత్రియ వైశ్యులు వేదాధ్యాపనాన్ని చేయకూడదు. బ్రాహ్మణుడు అన్ని జాతుల జీవనోపాయాన్ని తెలిసికొని తానందరికి స్వయంగా ఆచరిస్తూ ఉపదేశం చేయాలి.

*వైశేష్యాత్ప్రకృతిశ్రైష్ఠ్యా న్నియమస్య చ ధారణాత్,*
*సంస్కారస్య విశేషాచ్చ వర్ణానాం బ్రాహ్మణః ప్రభుః 3*

*బ్రాహ్మణః క్షత్రియో వైశ్యస్త్రయో వర్ణా ద్విజాతయః,*
*చతుర్థ ఏక జాతిస్తు శూద్రో నాస్తి తు పంచమః 4*

జాతి విశేషంవల్ల, బ్రహ్మదేవుని ఉత్తమాంగాన్నుండి పుట్టినందువల్ల, నియమములనన్నిటినీ అనుష్ఠించుట వల్ల తక్కిన కులాల వారికందరికి బ్రాహ్మణుడు ప్రభువగుచున్నాడు. బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులను మూడు కులాలవారు ద్విజాతికి చెందినవారు. శూద్రుడు చతుర్థజాతివాడు. ఈ నాలుగు జాతులు తప్ప ఐదవ జాతి అనేది లేదు.

*సర్వవర్ణేషు తుల్యాసు పత్నీష్వక్షతయోనిసు,*
*ఆనులోమ్యేన సంభూతా జాత్యా జ్ఞేయా స్త ఏవ తే 5*

*స్త్రీష్వనంతరజాతాసు ద్విజైరుత్పాదితాన్ సుతాన్,*
*సదృశానేవ తానాహుర్మాతృదోషవిగర్హితాన్ 6*

*అనంతరాసు జాతానాం విధిరేష స్సనాతనః,*
*ద్వ్యేకాంతరాసు జాతానాం ధర్మ్యం విద్యాదిమం విధిం 7*

బ్రాహ్మణుడు మొదలైన నాలుగు కులాలవారు వ్యభిచార దోషం లేని అదే కులానికి చెందిన కన్యను శాస్త్ర విధి చొప్పున వివాహం చేసికొని ఆ స్త్రీల యందు కన్న

సంతానం తల్లిదండ్రుల జాతిగలిగి సజాతీయులగుచున్నారు. ద్విజులు తమజాతికంటె తక్కువ స్త్రీని పెండ్లి చేసికొని ఆమెయందు కన్న సంతానాన్ని మాతృ దోషంఉన్నా సజాతీయులతో సమానంగానే పరిగణింతురు. ఇది తమ జాతికి తరువాతి జాతి స్త్రీలకు పుట్టిన సంతానానికి సంబంధించింది. అంటే బ్రాహ్మణునకు క్షత్రియ స్త్రీ వల్ల, క్షత్రియునికి వైశ్య స్త్రీ వల్ల, వైశ్యునికి శూద్ర స్త్రీ వల్ల పుట్టిన సంతానానికి సంబంధించినది. ఇక తమ జాతికి రెండవ జాతిదైన స్త్రీకి పుట్టిన వారికి సంబంధించిన విధి చెప్పబడుతున్నది.

*బ్రాహ్మణా ద్వైశ్యకన్యాయా మంబష్ఠో నామ జాయతే,*
*నిషాదః శూద్రకన్యాయాం యః పారశవ ఉచ్యతే 8*

*క్షత్రియా చ్ఛూద్రకన్యాయాం క్రూరాచారవిహారవాన్,*
*క్షత్రశూద్రవపు ర్జంతు రుగ్రో నామ ప్రజాయతే 9*

బ్రాహ్మణునికి వైశ్యకన్యయందు పుట్టినవాడు అంబష్ఠుడు. అదే బ్రాహ్మణునికి శూద్ర కన్యయందు పుట్టినవాడు పారశవుడు లేక నిషాదుడు. క్షత్రియునికి శూద్ర స్త్రీ యందు పుట్టినవాడు ఉగ్రుడనబడును. అతడు క్రూరకర్మలు, క్రూరచేష్టలు కలిగి క్షత్రియ శూద్ర స్వభావము కలిగియుండును.

*విప్రస్య త్రిషు వర్ణేషు నృపతే ర్వర్ణయోర్ద్వయోః,*
*వైశ్యస్య వర్ణే చైకస్మిన్ షడేతేఽపశదాఃస్మృతాః, 10*

*క్షత్రియాద్విప్రకన్యాయాం సూతో భవతి జాతితః,*
*వైశ్యాన్మాగధవైదేహౌ రాజవిప్రాంగనాసుతౌ 11*

*శూద్రాదాయోగవః క్షత్తా చండాలశ్చాధమో నృణామ్,*
*వైశ్యరాజన్య విప్రాసు జాయంతే వర్ణసంకరాః 12*

విప్రునికి తక్కిన మూడు వర్ణములకు చెందిన స్త్రీలకు, క్షత్రియునికి తక్కిన రెండు వర్ణముల స్త్రీలకు, వైశ్యునికి శూద్ర స్త్రీ యందు పుట్టిన కుమారులు సవర్ణజాతి పుత్రులకంటె తక్కువవారు. క్షత్రియునికి బ్రాహ్మణ స్త్రీ యందు పుట్టినవాడు సూతుడు, వైశ్యునకు క్షత్రియ బ్రాహ్మణ స్త్రీల యందు పుట్టిన వారు మాగధ వైదేహులు. శూద్రునివల్ల వైశ్య,క్షత్రియ, బ్రాహ్మణ స్త్రీల యందు పుట్టినవారు ఆయోగవుడు, క్షత్త, చండాలుడు అనువారు.

*ఏకాంతరే త్వానులోమ్యాదంబష్ఠోగ్రౌ యథా స్మృతౌ,*
*క్షత్తృవైదేహకౌ తద్వత్ ప్రాతిలోమ్యేఽపి జన్మని 13*

*పుత్రా యేఽనంతరస్త్రీజాః క్రమేణోక్తా ద్విజన్మనామ్,*
*తాననంతరనామ్నస్తు మాతృదోషాత్ప్రచక్షతే 14*

ఒకటివిడిచి ఒక అంతరం కల స్త్రీలకు అనులోమమున పుట్టిన ( బ్రాహ్మణునికి వైశ్య స్త్రీయందు, క్షత్రియునికి శూద్ర స్త్రీ యందు ) అంబష్ఠ ఉగ్రులు ఏ విధంగా స్పర్శార్హులో అట్లే ప్రతిలోమంలో పుట్టిన ( శూద్రునికి క్షత్రియ స్త్రీయందు, వైశ్యునికి బ్రాహ్మణ స్త్రీయందు జన్మించిన ) క్షత్తుడు, వైదేహకుడు కూడ స్పర్శార్హులే. ద్విజులకు తమ తరువాతి జాతులలో

అనులోమ ప్రకారముగా పుట్టిన సంతానాన్ని వారి తల్లిజాతిని బట్టి హీనజాతులుగా ఎంచుదురు.

**సంకీర్ణ జాతులు :**

*బ్రాహ్మణాదుగ్రకన్యాయామావృతో నామ జాయతే,*
*ఆభీరోzంబష్ఠకన్యాయామాzయోగవ్యాం తు ధిగ్వణః 15*

బ్రాహ్మణునికి ఉగ్ర కన్యయందు పుట్టినవాడు ఆవృతుడు. అట్లే బ్రాహ్మణునికి అంబష్ఠకన్యయందు పుట్టిన వానిని ఆభీరుడని అందురు.

*ఆయోగవశ్చ క్షత్తా చ చండాలశ్చాధమో నృణామ్,*
*ప్రాతిలోమ్యేన జాయంతే శూద్రాదవసదాస్త్రయః 16*

*వైశ్యాన్మాగధవైదేహౌ క్షత్రియాత్సూత ఏవ తు,*
*ప్రతీప మేతే జాయంతే పరే వ్యపసదాస్త్రయః 17*

ప్రాతిలోమ్యమున శూద్రునికి పుట్టిన ఆయోగవుడు, క్షత్త, చండాలుడు ఈ ముగ్గురు శూద్రుని కంటె తక్కువవారు. వైశ్యునికి ప్రతిలోమమున పుట్టిన మాగధవైదేహులు, క్షత్రియునికి ప్రతిలోమంగా పుట్టిన సూతుడు వీరు ముగ్గురు కూడ శూద్రుని కంటె తక్కువవారే.

*జాతో నిషాదాచ్ఛూద్రాయాం జాత్యా భవతి పుల్కసః,*
*శూద్రాజ్జాతో నిషాద్యాం తు సవై కుక్కటకః స్మృతః 18*

*క్షత్తుర్జాత స్తథోగ్రాయాం శ్వపాక ఇతి కీర్త్యతే,*
*వైదేహ కేన త్వంబష్ఠ్యా ముత్పన్నో వేణ ఉచ్యతే 19*

నిషాద జాతి పురుషునికి శూద్ర స్త్రీయందు పుట్టిన వానిని పుల్కసుడంటారు. అట్లే శూద్రునికి విషాద స్త్రీయందు పుట్టిన వానిని కుక్కుటకుడంటారు. క్షత్తకు ఉగ్ర స్త్రీయందు పుట్టిన వానిని శ్వపాకుడంటారు. వైదేహకుని వలన అంబష్ఠుని యందు పుట్టి వానిని వేణుడని పిలుస్తారు.

*ద్విజాతయస్సవర్ణాసు జనయంత్యవ్రతాంస్తు యాన్*
*తాన్ సావిత్రీ పరిభ్రష్టాన్ వ్రాత్యానితి వినిర్దిశేత్ 20*

*వ్రాత్యాత్తు జాయతే విప్రాత్పాపాత్మా భూర్జకంటకః,*
*ఆవంత్యవాటధానౌ చ పుష్పధశ్శైఖ ఏవ చ 21*

*ఝుల్లో మల్లశ్చ రాజన్యాద్వ్రాత్యాన్నిచ్ఛివి రేవ చ,*
*నటశ్చ కరణశ్చైవ ఖసో ద్రవిడ ఏవ చ 22*

*వైశ్యాత్తు జాయతే వ్రాత్యాత్సుధన్వాచార్య ఏవ చ,*
*కారూశశ్చ విజన్మా చ మైత్రస్సాత్వత ఏవ చ 23*

బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకు సవర్ణ స్త్రీల యందు జన్మించినా ఉపనయన సంస్కారం లేక గాయత్రీ మంత్రహీనులైన వారిని వ్రాత్యులని అంటారు. ఆ వ్రాత్య

పురుషునికి సవర్ణ స్త్రీలయందు పుట్టిన వానిని భూర్జకంటకుడంటారు. వానిని ఆయా దేశాలను బట్టి ఆవంత్యుడు, వాటధానుడు, పుష్పధుడు, శైఖుడని పిలుస్తారు. వ్రాత్యుడైన క్షత్రియునికి సవర్ణ స్త్రీయందు పుట్టిన వారిని ఝుల్ల, మల్ల, నిచ్ఛివి, నట, కరణ, ఖస, ద్రవిడులని ఆయా దేశాలననుసరించి పిలుస్తారు. వ్రాత్యుడైన వైశ్యునికి తనజాతి స్త్రీయందు పుట్టిన వారిని ఆయా దేశాలననుసరించి సుధన్వాచార్యుడు, కారూశుడు, విజన్ముడు, మైత్రుడు, సాత్వతుడు అని పిలుస్తారు.

*వ్యభిచారేణ వర్ణానామవేద్యా వేదనేన చ,*
*స్వకర్మణాం చ త్యాగేన జాయంతే వర్ణ సంకరాః 24*

*సంకీర్ణయోనయో యే తు ప్రతిలోమానులోమజాః,*
*అన్యోన్య వ్యతిషిక్తాశ్చ తాన్ ప్రవక్ష్యామ్య శేషతః 25*

బ్రాహ్మణులు మొదలైనవారు తెలిసి, తెలియక చేసిన వ్యభిచారం వలన పుట్టి స్వజాతి కర్మలను వదిలిపెట్టినందువలన వర్ణసంకరులేర్పడుచున్నారు. ప్రతిలోమానులోమాల వల్ల పుట్టిన సంకరజాతులనిప్పుడు విస్తారంగా తెలుపుతాను.

*సూతో వైదేహకశ్చైవ చండాలశ్చ నరాధమః,*
*మాగధః క్షత్తృజాతిశ్చ తథా యోగవ ఏవ చ 26*

*ఏతే షట్ సదృశాన్వర్ణాన్ జనయంతి స్వయోనిషు,*
*మాతృజాత్యాం ప్రసూయంతే ప్రవరాసు చ యోనిషు 27*

సూతుడు, వైదేహకుడు, చండాలుడు, మాగధుడు, క్షత్త, అయోగవుడను ఆరుగురు తమ స్వజాతి స్త్రీలయందు స్వజాతి సంతానాన్ని పొందుచున్నారు.

*యథా త్రయాణాం వర్ణానాం ద్వయోరాత్మాస్య జాయతే,*
*ఆనంతర్యాత్స్వయోన్యాం తు తథా బాహ్యేష్వపి క్రమాత్ 28*

*తే చాపి బాహ్యాన్ సుబహూంస్తతో వ్యధికదూషితాన్*
*పరస్పరస్య దారేషు జనయంతి విగర్హి తాన్ 29*

*యథైవ శూద్రో బ్రాహ్మణ్యాం బాహ్యం జంతుం ప్రసూయతే,*
*తథా బాహ్యతరం బాహ్యాశ్చాతుర్వర్ణ్యే ప్రసూయతే 30*

*ప్రతికూలం వర్తమానా బాహ్యా బాహ్యతరాన్ పునః,*
*హీనా హీనాన్ ప్రసూయంతే వర్ణాన్ పంచదశైవ తు 31*

బ్రాహ్మణునకు తన స్వజాతి స్త్రీ యందు, క్షత్రియ వైశ్య స్త్రీలలో పుట్టిన పురుషులు ద్విజాతులగుచున్నట్లే, ప్రతిలోమము వల్ల పుట్టినవారు సైతం ద్విజాతులగుచున్నారు. ఈ విధంగా అనులోమ ప్రతిలోమాల పుట్టిన వారు తమకు సజాతీయులైన స్త్రీలయందు కడుహీనులలను పుట్టించుచున్నారు. ఎట్లనగా శూద్రుడు బ్రాహ్మణ స్త్రీయందు తనకంటె హీనుడు కర్మబాహ్యుడైన చండాలుని ఎట్లు పుట్టిస్తున్నాడో, అట్లే కర్మ బాహ్యుడైన చండాలుడు చాతుర్వర్ణాలకు చెందిన స్త్రీలయందు తనకంటె బాహ్యులైన వారిని పుట్టించుచున్నాడు.

బ్రాహ్మణాది నాలుగు వర్ణములలో బాహ్యులైన ఆయోగవ, క్షత్తృ, చాండాలురు ముగ్గురు తమజాతి స్త్రీ యందు చాతుర్వర్ణాలకు చెందిన స్త్రీలందు తమకంటె హీనులైన పదునైదుగురిని పుట్టిస్తున్నారు. అట్లే అనులోమజులకంటె హీనులైన మాగధ వైదేహ సూతులు కూడ తమ జాతి స్త్రీలు, ఇతర చతుర్వర్ణాలకు చెందిన స్త్రీలయందు హీనులైన పదిహేను మందిని పుట్టిస్తున్నారు.

*ప్రసాధనోపచారజ్ఞ మదాసం దాసజీవనమ్,*
*సైరింధ్రం వాగురావృత్తిం సూతే దస్యురయోగవే 32*

*మైత్రేయకం తు వైదేహో మాధూకం సంప్రసూయతే,*
*నౄన్ ప్రశంసత్యజస్రం యో ఘంటాతాడోఽరుణోదయే 33*

*నిషాదో మార్గవం సూతే దాసం నౌకర్మజీవనమ్,*
*కైవర్తమితి యం ప్రాహురార్యావర్తనివాసినః 34*

*మృతవస్త్రభృత్స్వనార్యాసు గర్హితాన్నాశనాసు చ,*
*భవంత్యాయోగవీష్వేతే జాతి హీనాః పృథక్ త్రయః 35*

దస్యునకు అయోగవి స్త్రీయందు పుట్టినవానిని సైరంధ్రుడని అంటారు. అతడు తల దువ్వుట, కాళ్ళు పిసుకుట, వలలు మొదలగు వాటిచే జీవిస్తాడు. వైదేహునకు ఆ యోగవ స్త్రీయందు పుట్టినవాడు మైత్రేయకుడు. అతడు తియ్యగా మాట్లాడుచూ, ప్రతి ఉదయం రాజుయొక్క అంతఃపురం ముందు గంటనువాయిస్తూ అందరిని పొగుడుతూ బ్రతుకుతూ ఉంటాడు. నిషాదకన్యకు ఆయోగవి యందు పుట్టినవాడు దాసుడనుపేరు గల మార్గవుడు. అతడు నౌకలను నడిపిబ్రదుకుతున్నందువలన ఆర్యావర్తంలో ఉన్నవారతనిని కైవర్తుడనిపిలుస్తారు. సైరింధ్ర మైత్రేయ, మార్గవులనే ఈ ముగ్గురు పీనుగులమీది బట్టలుకట్టు కొని, ఎంగిలి అన్నం తింటూ ఆయోగవులకంటే భిన్నంగా జాతిహీనులై బ్రతుకుతున్నారు.

*కారావరో నిషాదాత్తు చర్మకారః ప్రసూయతే,*
*వైదేహ సైరింధ్రభేధౌ బహిర్గ్రామప్రతిశ్రయౌ 36*

*చండాలాత్పాండుసోపాక స్త్వక్సారవ్యవహారవాన్,*
*ఆహిండికో నిషాదేన వైదేహ్యామేవ జాయతే 37*

*చండాలేన తు సోపాకో మూలవ్యసనవృత్తిమాన్,*
*పుల్కస్యాం జాయతే పాపస్సదా సజ్జనగర్హితః 38*

*నిషాదస్త్రీ తు చండాలాత్పుత్రమంత్యావసాయినం,*
*శ్మశానగోచరం సూతే బాహ్యానామపి గర్హితం 39*

నిషాదునివల్ల వైదేహస్త్రీయందు పుట్టినవాడు కారావరుడులేక చర్మకారుడు. వైదేహసైరింధ్రులను వారిని గ్రామానికి వెలుపల ఉంచాలి. చండాలునికి వైధేహస్త్రీయందు పుట్టిన పాండుసోనాకుడనువాడు (మేదరివాడు) వెదుళ్ళతో పని చేసిజీవిస్తాడు. నిషాదునివల్ల

వైదేహస్త్రీయందు పుట్టిన వాడు ఆహిండుకుడు ఇతడు చెరసాలయొక్క బయటనుండి కావలిగాయుచుండును. చండాలునికి పుల్కసయందు పుట్టినవాడు సోపాకుడు. (తలవరి) ఇతడెల్లప్పుడు రాజుయొక్క అజ్ఞననుసరించి శిరచ్ఛేదములు చేయుటయే ప్రధాన వృత్తిగా పెట్టుకొన్నవాడు. ఇతడు చాలా పాపాత్ముడు కావున సజ్జనులు ఎప్పుడూ ఇతనిని నిందిస్తూ ఉంటారు. చండాలునకు నిషాదస్త్రీకి పుట్టినవాడు అంత్యావసాయి. ఇతడు స్మశానంలో ఉంటూ శవాలకు కావలికాస్తాడు. ఇతడు బాహ్యులందరికంటే తక్కువవాడు.

*సంకరే జాతయస్త్వేతాః పితృమాతృ ప్రదర్శితాః,*
*ప్రచ్ఛన్నా వా ప్రకాశా వా వేదితవ్యాః స్వకర్మభిః 40*

ఇంతవరకు చెప్పబడిన జాతులన్నీ తల్లిదండ్రుల వ్యభిచార దోషంవల్ల పుట్టిన సంకరజాతులే వీరిని వారివారి కర్మలవల్లనే గుర్తింపవలసియుంటుంది.

*నజాతిజానంతరజాష్షట్ సుతా ద్విజధర్మిణః,*
*శూద్రాణాం తు సధర్మాణస్సర్వేఽపధ్వంసజాః స్మృతాః 41*

*తపోబీజప్రభావైస్తు తే గచ్ఛంతి యుగే యుగే,*
*ఉత్కర్షం చాపకర్షం చ మనుష్యేష్విహ జన్మతః 42*

బ్రాహ్మణక్షత్రియవైశ్యులకు సమానజాతి స్త్రీలయందు (శూద్రస్త్రీ తప్ప) తరువాతి జాతి స్త్రీలయందు అనులోమంవల్ల పుట్టిన వారు ఆరుగురు బ్రాహ్మణధర్మమైన ఉపనయనం మొదలైన కర్మలకు అర్హులై ఉంటారు. కాని బ్రాహ్మణాదులవల్లనే జన్మించినా ప్రతిలోమంవల్ల పుట్టినవారు మాత్రం శూద్రతుల్యులు. వారికి ఉపనయన సంస్కారార్హతలేదు. బ్రాహ్మణాది సజాతి వ్యక్తులు, అనులోమంవల్ల పుట్టిన అనంతరజాతివారు తపః ప్రభావంచే క్షేత్ర ప్రభావంచే విశ్వామిత్రాదులవలె బీజప్రభావంచే వ్యాసాదులవలె గొప్పదనాన్ని తక్కువ దనాన్ని సైతం పొందుతారు.

*శనకైస్తు క్రియాలోపాదిమా క్షత్రియజాతయః,*
*వృషలత్వం గతా లోకే బ్రాహ్మణాదర్శనేన చ 43*

*పౌండ్రకాశ్చౌడ్రద్రవిడాః కాంభోజా యవనాశ్శకాః,*
*పారదాః పహ్లవాశ్చీనాః కిరాతా దరదాః ఖశాః 44*

*ముఖ బాహూరుపజ్జానాం యా లోకే జాతయో బహిః,*
*మ్లేచ్ఛవాచశ్చార్యవాచస్సర్వే తే దస్యవః స్మృతాః 45*

ఈ క్షత్రియ జీతులన్నీ ఉపనయనాదులకు దూరమైనందువల్ల , యజన అధ్యయనాదిక్రియలను బ్రాహ్మణులనుండి తెలిసికొనక క్రమంగా శూద్రులైరి. పౌండ్రుకులు, ఓఢ్రులు, ద్రవిడులు, కాంభోజులు, యవనులు, శకులు, పారదులు, పహ్లవులు, చీనులు, కిరాతులు,దరదులు, ఖశులు ఆవిధముగా క్రమంగా శూద్రులైనారు. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులలో ఉపనయనాది సంస్కారములేక ఏజాతులు వెలివేయబడ్డాయో ఆజాతులవారు మ్లేచ్ఛ భాష మాట్లాడినా, ఆర్యభాష మాట్లాడినా వారందరిని దస్యులని పిలిచేవారు.

యే ద్విజానామపశదా యే చాపధ్వంసజాః స్మృతాః,
తే నిందితైర్వర్తయేయుర్ ద్విజానామేవ కర్మభిః 46

ద్విజాతులలో అపశదులు, అపధ్వంసజులైన వారందరు ద్విజాతులకుపయోగించ ఈ ఈ కర్మలు చేయుచు బ్రతికేవారు.

సూతానా మశ్వ సారథ్యమంబష్ఠానాం చికిత్సనమ్,
వైదేహకానాం స్త్రీకార్యం మాగధానాం వణిక్ పథః 47

మత్స్యఘాతో నిషాదానాం త్వ ష్టిస్త్వాయోగవస్య చ,
మేదాంధ్రచుంచుమద్గూనా మారణ్యా పశుహింసనమ్ 48

క్షత్త్రుగ్రపుల్కసానాం తు బిలౌకో వధబంధనమ్,
ధిగ్వణానాం చర్మకార్యం వేణానాం భాండవాదనమ్ 49

చైత్య ద్రుమశ్మశానేషు శైలేషూపవనేషు చ,
వసేయురేతే విజ్ఞానా వర్తయంతః స్వకర్మభిః 50

సూతులు గుఱ్ఱములను కట్టి సారథులుగా ఉండుట, అంబష్టులు వైద్య చేయుట, వైదేహులు అంతఃపురంలో ఉండుట, మాగధులు తిరుగుతూ వర్తకం చేయు నిషాదులు చేపలు పట్టుట, ఆయోగవులు వడ్రంగి పని చేయుట, మేదులు, ఆంధ్రుల చుంచులు, మద్గులు వీరు అడవిమృగములను హింసించి బ్రతుకుట, క్షత్తలు, ఉగ్రుల పుక్కసులు వీరు కలుగులలో నుండు ఉడుములు మొదలగువానిని వెలికి తీసి చంపు పట్టుట, ధిగ్వణులు తోళ్ళపని, వేణులు మద్దెల తప్పెటలు మ్రోగించుట మొదలైన వృత్తుల ఊళ్ళ సమీపంలో ఉండే చెట్ల కింద, శ్మశానాల్లో, పర్వతాలు, అడవులు, వీటి దగ్గర జీవిస ఉంటారు.

అపపాత్రాశ్చ కర్తవ్యా ధనమేషాం శ్వగర్దభమ్ 51
వాసాంసీ మృతచేలాని భిన్నభాండేషు భోజనమ్,
కార్ష్ణాయసమలంకారః పరివ్రజ్యా చ నిత్యశః 52

న తై స్సమయమన్విచ్ఛేత్పురుషో ధర్మమాచరన్,
వ్యవహారో మిథస్తేషాం వివాహస్సదృశైస్సహ 53

అన్నమేషాం పరాధీనం దేయం స్యాద్భిన్నభాజనే,
రాత్రౌ న విచరేయుస్తే గ్రామేషు నగరేషు చ 54

దివా చరేయుః కార్యార్థం చిహ్నితా రాజశాసనైః,
అబాంధవం శవం చైవ నిర్హరేయురితి స్థితిః 55

వధ్యాంశ్చ హన్యుస్సతతం యథా శాస్త్రం నృపాజ్ఞయా,
వధ్యవాసాంసి గృహ్ణీయుశ్శయ్యాశ్చాభరణాని చ 56

వర్ణా పేతమవిజ్ఞాతం నరం కలుషయోనిజమ్,
ఆర్యరూపమివానార్యం కర్మభిః స్వైర్విభావయేత్ 57

చండాలురు, శ్వపచులు వీరు ఊరివెలుపల నివసించాలి. వీరికి తినుటకు కాని, వండుకోవటానికి గాని పాత్రలు లేవు. కుక్కలు గాడిదలే వీరి ధనము,శవాలపై నున్న వస్త్రాలు వీరి బట్టలు, పగిలిపోయిన కుండల్లో వీరుతింటారు. ఇనుముతో చేసిన అలంకారాలే వీరికి అలంకారాలు. వీరెల్లప్పుడు దేశద్రిమ్మరులైఉంటారు. ధర్మము నాచరించు సమయాన వారితో కలిసి వ్యవహారం చేయరాదు. వీరు ఇచ్చిపుచ్చుకోవడం, పెండ్లిండ్లు తమలోతామే చేసికోవాలి. వీరికి అన్నాన్ని స్వయంగా పెట్టవద్దు. వీరు రాత్రులలో గ్రామాల్లో పట్టణాల్లో తిరుగకూడదు. రాజశాసనాన్ని తీసికొని వీరు పగటిపూట మాత్రమే గ్రామాల్లో గాని పట్టణాల్లోగాని తిరుగాలి. వీరి శవాలను గతిలేని శవాలవలె ఊరిబయట పారవేయాలి. దొంగతనం వంటి తప్పుడు పనులు చేసి మరణ దండనకు అర్హమైన వీరిని రాజు యొక్క ఆజ్ఞననుసరించి న్యాయమైన రీతిలోనే చంపాలి. ఇంకా వారి బట్టలు, ఆభరణాలు, పడుకొనేశయ్యలు మొదలైన వాటిని అధికారులు తీసికోవాలి.

*అనార్యతా నిష్ఠురతా క్రూరతా నిష్క్రియాత్మతా,*
*పురుషం వ్యంజయంతీహ లోకే కలుషయోనిజమ్ 58*

సంకరజాతి యందు జన్మించి అతని వర్ణమేదో తెలియకుండ ఆర్య రూపంలో తిరుగుతున్న అనార్యుడగు వానిని వాని యొక్క ఈ ప్రవర్తనలననుసరించి గుర్తించాలి.

*పిత్ర్యం వా భజతే శీలం మాతుర్వోభయమేవ వా,*
*న కథంచన దుర్యోనిః ప్రకృతిం స్వాం నియచ్ఛతి 59*

*కులే ముఖ్యేపి జాతస్య యస్య స్యాద్యోనిసంకరః,*
*సంశ్రయత్యేవ తచ్ఛీలం నరోఽల్పమపి వా బహు 60*

*యత్ర త్వేతే పరిధ్వంసాజ్జాయంతే వర్ణదూషకాః,*
*రాష్ట్రికైస్సహ తద్రాష్ట్రం క్షిప్రమేవ వినశ్యతి 61*

*బ్రాహ్మణార్థే గవార్థే వా దేహత్యాగోఽనుపస్కృతః,*
*స్త్రీబాలాభ్యుపపత్తౌ చ బాహ్యానాం సిద్ధికారణమ్ 62*

ఈ సంకరజాతివాడు తండ్రి వలెనో, తల్లివలెనో, లేక ఇద్దరివలెనో సంచరించుచు తన పుట్టుకను ఏదోవిధంగా కప్పిపుచ్చుకోవటానికి ప్రయత్నించినా కప్పి పుచ్చుకోజాలడు. గొప్ప కులంలో పుట్టినా వర్ణసంకరంజరిగితే ఆ మానవుడు కొద్దో గొప్పో తండ్రి గుణాన్ని తప్పక పొందుతాడు. ఎచ్చట వ్యభిచారం దోషంవల్ల ఈ వర్ణసంకరులు పుట్టుతారో,వారివల్ల రాజ్యమంతా వెంటనే నశిస్తుంది. అందువల్ల ఆరాజ్యంలోని బ్రాహ్మణులు, గోవులు, బాలురు, స్త్రీలను కాపాడుటకై ఇతరమైన కోరికలేవి లేక తమ దేహత్యాగాన్ని చేసేవారు. స్వర్గాది పుణ్యలోకములను తప్పక పొందుతారు.

*అహింసా సత్యమస్తేయం శౌచమింద్రియనిగ్రహః,*
*ఏతం సామాసికం ధర్మం చాతుర్వర్ణ్యేఽబ్రవీన్మనుః 63*

అహింసనాచరించుట, సత్యంపలుకుట, దొంగతనం చేయకుండుట, శుచిగా ఉండుట, ఇంద్రియాలను నిగ్రహించుకొనుట అనే అన్నికులాలవారికి ఉండవలసిన ధర్మాలు.

*శూద్రాయాం బ్రాహ్మణాజ్జాతః శ్రేయసా చేత్ప్రజాయతే,
అశ్రేయాన్ శ్రేయసీం జాతి గచ్ఛత్యాసప్తమాద్యుగాత్ 64*

*శూద్రో బ్రాహ్మణతామేతి బ్రాహ్మణశ్చైతి శూద్రతామ్,
క్షత్రియాజ్జాతమేవం తు విద్యా ద్వైశ్యాత్తథైవ చ, 65*

బ్రాహ్మణునికి శూద్ర స్త్రీ యందుపుట్టిన సంతతి స్త్రీయైతే ఆ స్త్రీని బ్రాహ్మణుడే వివాహం చేసికొని స్త్రీనేకంటే, ఈ విధంగా ఏడవ జన్మలో పారశవుడు బ్రాహ్మణుత్వాన్ని పొందుతాడు. ఈవిధంగా శూద్రుడు (పారవశుడు) బ్రాహ్మణుడు కావచ్చును. లేక బ్రాహ్మణుడు శూద్రస్త్రీని పెండ్లిచేసికొని తరువాత ఆ సంతతిని శూద్రసంతతినే చేయవచ్చు. ఇట్లే క్షత్రియుని నుండి వైశ్య ఇతర వర్ణాల స్త్రీలయందు పుట్టినవారు క్షత్రియులు వైశ్యులు కావచ్చును. కాలేకపోవచ్చును.

*అనార్యాయాం సముత్పన్నో బ్రాహ్మణాత్తు యదృచ్ఛయా,
బ్రాహ్మణ్యామప్యనార్యాత్తు శ్రేయస్త్వం క్వేతి చేద్భవేత్ 66*

*జాతో నార్యామనార్యాయామార్యాదార్యో భవేద్గుణైః
జాతో ప్యనార్యాదార్యాయామనార్య ఇతి నిశ్చయః 67*

*తావుభావప్యసంస్కార్యా వితి ధర్మో వ్యవస్థితః,
వైగుణ్యాజ్జన్మనః పూర్వ ఉత్తరః ప్రతిలోమతః 68*

*సుబీజం చైవ సుక్షేత్రే జాతం సంపద్యతే యథా
తథార్యాజ్జాత ఆర్యాయాం సర్వం సంస్కార మర్హతి 69*

బ్రాహ్మణునివలన శూద్రస్త్రీయందు పుట్టినవాడు, బ్రాహ్మణస్త్రీయందు శూద్రునివలన జన్మించినవాడు ఇద్దరిలో ఎవరు శ్రేష్ఠుడన్నచో ఆర్యునివలన అనార్యస్త్రీయందు పుట్టినవాడు ఆనార్యుడౌతాడు. అట్లే ఆనార్యపురుషునివలన ఆర్యస్త్రీయందు పుట్టినవాడు అనార్యుడౌతాడు. ఈ ఇద్దరు కూడ ఉపనయనాది సంస్కారములకర్హులుకారు. మొదటివాడు శూద్రురాలికి పుట్టినందువల్ల, రెండవవాడు ప్రతిలోమమునపుట్టినందువల్ల ఉపనయనసంస్కారానర్హులు. మంచిపొలంలో వేసిన మంచివిత్తనమేవిధంగా చక్కగా మొలుస్తున్నదో అట్లే ఆర్యునకు ఆర్యస్త్రీయందు పుట్టినవానికి సమస్తసంస్కారములు లభిస్తాయి.

*బీజమేకే ప్రశంసంతి క్షేత్ర మన్యే మనీషిణః,
బీజక్షేత్రే తథైవాన్యే తత్రేయం తు వ్యవస్థితిః 70*

*అక్షేత్రే బీజముత్సృష్టమంతరైవ వినశ్యతి,
అబీజకమపి క్షేత్రం కేవలం స్థండిలం భవేత్ 71*

కొందరు బీజమే ప్రధానమైందని దాన్ని పొగుడుతారు. మరికొందరు క్షేత్రమే ప్రధానమంటారు. ఇంకా కొందరు బీజక్షేత్రాలు రెండు కలిసి ప్రధానమైనవని చెప్తారు. చౌడుభూములో వేసినవిత్తనం మధ్యలోనే నశిస్తున్నది కనుక క్షేత్రం బీజం రెండు ప్రధానమైనవే.

*యస్మాద్బీజప్రభావేణ తిర్యగ్జా ఋషయోఽ భవన్,*
*పూజితాశ్చ ప్రశస్తాశ్చ తస్మాస్మాద్బీజం ప్రశస్యతే 72*

*అనార్యమార్యకర్మాణ మార్యం చానార్యకర్మిణమ్,*
*సంప్రధార్యాఽబ్రవీద్ధాతా న సమౌ నాసమావితి 73*

మృగమందు పుట్టినా బీజప్రభావం వల్ల కొందరు ఋషులై పూజాదికమును పొందినవారు కావున బీజమే ప్రధానమంటారు. కొందరు ద్విజధర్మమునునుష్ఠించుశూద్రుని, శూద్రధర్మమునునుష్ఠించుద్విజుని చూచి వీరు బ్రాహ్మణసములుకారు. శూద్రసములు కాకపోరు అని బ్రహ్మదేవుడు తెలిపెను.

*బ్రాహ్మణా బ్రహ్మయోనిస్థా యే స్వకర్మణ్యవస్థితాః,*
*తే సమ్యగుపజీవేయుః షట్కర్మాణి యథాక్రమమ్ 74*

*అధ్యాపనం చాధ్యయనం యజనం యాజనం తథా,*
*దానం ప్రతిగ్రహశ్చైవ షట్కర్మాణ్యగ్రజన్మనః 75*

*షణ్ణాం తు కర్మణామస్య త్రీణి కర్మాణి జీవికాః,*
*యాజనాధ్యాపనే చైవ విశుద్ధాచ్చ ప్రతిగ్రహః 76*

*త్రయో ధర్మా నివర్తంతే బ్రాహ్మణాత్ క్షత్రియం ప్రతి,*
*అధ్యాపనం యాజనం చ తృతీయశ్చ ప్రతిగ్రహః 77*

*వైశ్యం ప్రతి తథైవైతే నివర్తేరన్నితి స్థితిః,*
*న తౌ ప్రతిహితాన్ ధర్మాన్ మనురాహ ప్రజాపతిః 78*

బ్రాహ్మణులు తమ తమ కర్మానుష్ఠానమున శ్రద్ధవహించి అధ్యయన. అధ్యాపన, యజన, యాజన, దాన, ప్రతిగ్రహములనే షట్కర్మనిరతులైఉండాలి. ఈ షట్కర్మలలో అధ్యాపనం యాజనము, ప్రతిగ్రహమనే మూడు అతనికి జీవికలై ఉపయోగపడుతున్నాయి, బ్రాహ్మణునికి వైశ్య క్షత్రియులకు భేదమిచ్చటనే ఉన్నది. క్షత్రియవైశ్యులకు పై మూడు ధర్మాలు లేక అధ్యయన, యజన, దానములనే మూడు ధర్మాలు మాత్రమున్నాయి.

*శస్త్రాస్త్రభృత్త్వం క్షత్రస్య వణిక్పశుకృషిర్విశః,*
*ఆజీవనార్థం ధర్మస్తు దానమధ్యయనం యజః 79*

క్షత్రియుడు శస్త్రాస్త్రములు ధరించి, వైశ్యుడు కృషివాణిజ్యములతో బ్రతుకుచున్నాడు. అధ్యయన, యజన, దానాలు వీరి ఆత్మకు ఉపవయోగించేవి.

*వేదాభ్యాసో బ్రాహ్మణస్య క్షత్రియస్య చ రక్షణమ్,*
*వార్తా కర్మైవ వైశ్యస్య విశిష్టాని స్వకర్మను 80*

బ్రాహ్మణుడు వేదాభ్యాసాన్ని, క్షత్రియుడు ప్రజారక్షణాన్ని వైశ్యుడు వర్తకమును చేయాలి. ఇదివీరికి ప్రధానధర్మాలు.

ఆపద్ధర్మాలు :-

అజీవంస్తు యథోక్తేన బ్రాహ్మణః స్వేన కర్మణా,
జీవేత్ క్షత్రియధర్మేణ స హ్యస్య ప్రత్యనంతరః 81

ఉభాభ్యామప్యజీవం స్తు కథం స్యాదితి చేద్భవేత్
కృషిగోరక్షమాస్థాయ జీవేద్వైశ్యస్య జీవికామ్ 82

బ్రాహ్మణుడు తనకై నిర్దేశించిన కర్మలననుష్ఠిస్తూ వాటివల్ల తన జీవయాత్రసాగకపోతే క్షత్రియధర్మాలైన నగరగ్రామరక్షణ వంటి వానిని చేయవచ్చును, అతడు బ్రాహ్మణక్షత్రియవృత్తుల వల్ల కూడ బ్రతుకలేకపోతే వైశ్యుని వృత్తియైన కృషి, గోరక్షణంమొదలైన ధర్మాలనవలంబిస్తూ బ్రతకవచ్చు.

వైశ్యవృత్త్యాపి జీవంస్తు బ్రాహ్మణః క్షత్రియోऽ పివా,
హింసాప్రాయాం పరాధీనాం కృషీం యత్నేన వర్జయేత్ 83

కృషీం సాధ్వీతి మన్యంతే సా వృత్తిస్సద్విగర్హితా,
భూమిం భూమి శయాంశ్చైవ హంతి కాష్ఠమయోముఖమ్ 84

బ్రాహ్మణుడు లేక క్షత్రియుడు వైశ్యవృత్తితో బ్రతుకుతూ హింసకు కారణమైన ఎడ్లు మొదలగు వానిపై ఆధారపడియుండు వ్యవసాయమును మాత్రం చేయవద్దు. కొందరు వ్యవసాయం చాలా గొప్పదని అంటారు. కాని సజ్జనులు మాత్రం దానిని అసహ్యించుకొంటున్నారు. ఈ వ్యవసాయం వల్లభూమిని దున్నేందుకు ఉపయోగించేసాధనాలు భూమిని భూమిలో ఉండే అనేక ప్రాణులను చంపుతున్నాయి.

ఇదం తు వృత్తివైకల్యాత్త్యజతో ధర్మనైపుణమ్,
విట్పణ్యముద్ధృతోద్ధారం విక్రేయం విత్తవర్ధనమ్ 85

సర్వాన్ రసానపోహేత కృతాన్నం చ తిలైస్సహ,
అశ్మనో లవణం చైవ పశవో యే చ మానుషాః 86

సర్వం చ తాంతవం రక్తం శాణక్షౌమావికాని చ,
అపిచేత్స్యురరక్తాని ఫలమూలే తథౌషధీః 87

అపశ్శస్త్రం విషం మాంసం సోమం గంధాంశ్చ సర్వశః,
క్షీరం క్షౌద్రం దధి ఘృతం తైలం మధు గుడం కుశాన్ 88

ఆరణ్యాంశ్చ పశూన్ సర్వాన్ దంష్ట్రిణశ్చ వయాంసి చ,
మద్యం నీలిం చ లాక్షాం చ సర్వాంశ్చైకశఫాంస్తథా 89

బ్రాహ్మణక్షత్రియులు తమకు సరియైన వృత్తి దొరకనప్పుడు ధర్మమెకలిగి ధనమునభివృద్ధి చేసే వస్తువులనమ్మాలి. కాని తెల్లావాలు, నూవులు, నూవుల పొడి కలిపిన అన్నం, పాషాణములు, ఉప్పు, జంతువులు, రంగువేసిన బట్టలు, గోగునార, అగసినారతో తయారు చేయబడ్డబట్టలు, కంబళ్ళు, పండ్లు, దుంపలు, ఔషధులు, నీరు, శస్త్రములు, విషం, మాంసం, సోమలత, సుగంధద్రవ్యాలు పాలు, తేనే, పెరుగు, నెయ్యి, నూనె, బెల్లం.

దర్భలు, అడవుల్లోతిరిగే పశువులు, మద్యం, నీలి, లక్క, ఒంటిగిట్టగల గుఱ్ఱంవంటి జంతువులను మాత్రం అమ్మకూడదు.

*కామముత్పాద్య కృష్యాం తు స్వయమేవ కృషీవలః,*
*విక్రీణీత తిలాన్ శూద్రాన్ ధర్మార్థ మచిరస్థితాన్ 90*

*భోజనాభ్యంజనాద్దానాద్యదన్యత్కురుతే తిలైః,*
*కృమిభూతః శ్వవిష్ఠాయాం పితృభిస్సహ మజ్జతి 91*

రైతుతానే ఇంకొకపంటతో కలిపి నూవులను పండించి లాభానికై వాటిని దాచిపెట్టకఅమ్మాలి. భోజనం, తలంటు, (అభ్యంజనం) దానం వీనికంటెఇతర కార్యక్రమాలకు నువ్వులనుపయోగించువాడు కుక్క అమేధ్యంలో పురుగై పుట్టి తన పితృదేవతలతో కలిసిఉంటాడు.

*సద్యః పతతి మాంసేన లాక్షయా లవణేన చ,*
*త్ర్యహేణ శూద్రోభవతి బ్రాహ్మణః క్షీరవిక్రయాత్ 92*

మాంసము, లక్క, ఉప్పు, వీటినమ్మినవాడు వెంటనే భ్రష్టుడుగును. పాలనమ్మితే మూడుదినాల్లో శూద్రుడగును.

*ఇతరేషాం తు పణ్యానాం విక్రయాదిహ కామతః,*
*బ్రాహ్మణస్సప్తరాత్రేణ వైశ్యభావం నియచ్ఛతి, 93*

బ్రాహ్మణుడు ఇప్పుడుచెప్పిననాటికి తక్కిన వస్తువులను బుద్ధిపూర్వకంగా అమ్మితే ఏడురాత్రులలోవైశ్యుడగుచున్నాడు.

*రసా రసైర్నిమాతవ్యా న త్వేవ లవణం రసైః;*
*కృతాన్నం చాకృతాన్నేన తిలా ధాన్యేన తత్సమాః 94*

బెల్లం మొదలగు రసద్రవ్యాల్ని నెయ్యి మొదలగు రసద్రవ్యాలతో మార్చవచ్చుగాని ఉప్పును మాత్రం దేనితోను మార్చితీసికోరాదు. వండిన అన్నాన్ని బియ్యంతో మార్చితీసికోచ్చు. నువ్వులను వాటితో సమానమైన ధాన్యాలతో మార్చితీసికోవచ్చు.

*జీవేదేతేన రాజన్యస్సర్వేణాప్యనయం గతః,*
*నత్వేవ జ్యాయసీం వృత్తిమభిమన్యేత కర్హిచిత్ 95*

*యో లోభాదధమో జాత్యా జీవేదుత్కృష్టకర్మభిః,*
*తం రాజా నిర్ధనం కృత్వా క్షిప్రమేవ ప్రవాసయేత్ 96*

*వరం స్వధర్మో విగుణో న పారాక్యః స్వనుష్ఠితః,*
*పరధర్మేణ జీవన్ హి సద్యః పతతి జాతితః 97*

రాజు ఆపత్కాలంతో బ్రాహ్మణునివిషయంలో నిషిద్ధమైన వస్తువులనమ్మియైనా బ్రతుకవచ్చుగాని బ్రాహ్మణవృత్తితో మాత్రమెప్పుడు జీవించరాదు. క్షత్రియ, వైశ్య, శూద్రులు, ఆశతో పై జాతివారి కర్మలననుష్ఠిస్తూ బ్రతుకుతుంటే రాజువారిని కనిపెట్టి వారి ధనమంతా లాగుకొని రాజ్యమునుండి వెళ్ళగొట్టాలి. తన ధర్మం మంచిదికాకపోయినా తప్పులేదుకాని

ఇతరుల ధర్మాన్ని మాత్రం ఎప్పుడు అనుష్ఠింపకూడదు. పరధర్మాన్ని అనుష్ఠిస్తే వెంటనే అతడు భ్రష్టుడౌతాడు.

*వైశ్యో జీవన్స్వధర్మేణ శూద్రవృత్త్యాపి వర్తయేత్,*
*అనాచరన్నకార్యాణి నివర్తేత చ శక్తిమాన్, 98*

వైశ్యుడు స్వధర్మతో జీవించలేకపోతే అకార్యాలు చేయకుండా శూద్రధర్మంతో బ్రతికి, తిరిగి తాను కొంత శక్తివంతుడైన తరువాత ఆధర్మాన్ని వదలి పెట్టవలెను.

*అశక్నువంస్తు శుశ్రూషాం శూద్రః కర్తుం ద్విజన్మనామ్,*
*పుత్రదారాత్యయం ప్రాప్తో జీవేత్కారుక కర్మభిః 99*

*యైః కర్మభిః ప్రచరితైశ్శుశ్రూష్యంతే ద్విజాతయః,*
*తాని కారుక కర్మాణి శిల్పాని వివిధాని చ 100*

ద్విజులకు శూశ్రూషాదులను చేయలేని శూద్రుడు అతని భార్యపుత్రులు ఆకలితో బాధపడుతున్నప్పుడు వైశ్య ధర్మమైన భక్ష్యాదులను చేసి అమ్మి జీవించవచ్చును. లేక ద్విజశుశ్రూషకు ఉపయోగించే వడ్రంగం మొదలైన శిల్పములతో జీవనం సాగింపవచ్చును.

*వైశ్యవృత్తి మనాతిష్ఠన్ బ్రాహ్మణః స్వే పథి స్థితః,*
*అవృత్తికర్షితస్సీదన్నిమం ధర్మం సమాచరేత్ 101*

బ్రాహ్మణుడు ఆపత్కాలంలో స్వధర్మంతో పాటు క్షత్రియవైశ్యధర్మాలననుష్ఠిస్తూ జీవించవచ్చు. ఆవిధంగా బ్రతుకలేకపోతే ఈ ధర్మములనతడనుష్ఠింపవచ్చును.

*సర్వతః ప్రతిగృహ్ణీయాద్బ్రాహ్మణ స్త్వనయం గతః,*
*పవిత్రం దుష్యతీత్యేతద్ధర్మతో నోపపద్యతే 102*

*నాధ్యాపనాద్యాజనాద్వా గర్హి తాద్వా ప్రతిగ్రహాత్,*
*దోషో భవతి విప్రాణాం జ్వలనాంబుసమా హి తే 103*

*జీవితాత్యయమాపన్నో యోఽన్నమత్తి యతస్తతః*
*ఆకాశమివ పంకేన స స పాపేన లిప్యతే 104*

*ఆజీగర్తస్సుతం హంతుముపాసర్పద్బుభుక్షితః,*
*న చాలిప్యత పాపేన క్షుత్ప్రతీకారమాచరన్ 105*

*శ్వమాంసమిచ్ఛన్నార్తోఽత్తుం ధర్మాధర్మ విచక్షణః,*
*ప్రాణానాం పరిరక్షార్థం వామదేవో న లిప్తవాన్ 106*

*భరద్వాజః క్షుధార్తస్తు సపుత్రో విజనే వనే,*
*బహ్వీర్గాః ప్రతిజగ్రాహ వృథో స్తక్ణో మహాతపాః 107*

*క్షుధార్తశ్చాత్తుమభ్యాగాద్విశ్వామిత్రః శ్వజాఘనీమ్,*
*చండాలహస్తాదాదాయ ధర్మాధర్మ విచక్షణః 108*

*ప్రతిగ్రహాద్యాజనాద్వా తథైవాధ్యాపనాదపి,*
*ప్రతిగ్రహః ప్రత్యవరః ప్రేత్య విప్రస్య గర్హితః 109*

దశమాధ్యాయం

*యాజనాధ్యాపనే నిత్యం క్రియేతే సంస్కృతాత్మనాం*

*ప్రతిగ్రహస్తు క్రియతే శూద్రాదప్యంత్యజన్మనః 110*

బ్రాహ్మణుడాపదలో నున్నప్పుడునిందిత మైనకర్మ చేస్తున్నవారి దగ్గరకూడ దానం స్వీకరించవచ్చు. పవిత్రమైన గంగాజలం ఎక్కడకూడ అపవిత్రం కాదుకదా. పాపాత్ములకు వేదాధ్యాపనం చేసినా, వారిచే యాగం చేయించినా, వారి దగ్గర దానం తీసికున్నా బ్రాహ్మణులకు దోషమంటదు. బ్రాహ్మణుడు ఆకలితోఅలమటించిపోతున్నప్పుడు శూద్రునికంటె తక్కువ జాతివాని ఇంటసైతము భోజనం చేయవచ్చును, ఆకాశనికి బురద అంటనట్లు అతనికి పాపమంటదు. పూర్వకాలంలో అజీగర్తుడనే ముని ఆకలితో తనకుమారుడైన శునశ్శేపుని యజ్ఞపశువుగా తానే అమ్మి యజ్ఞమున నూరు గోవులు దొరుకుతాయన్న ఆశతో తనే అతనిని చంపుటకు పూనుకొనెను. ఆకలి వల్ల అతడాపాపాన్ని చేసినందువల్ల అతనికాపాప మంటలేదు. అట్లే వామదేవ మహర్షి ఆకలితో బాధనడుచు ధర్మాధర్మములు చూడక ప్రాణముల రక్షించుకొనుటకు కుక్కమాంసమును సహితము తినగోరినా అతనికి పాపం అంటలేదు. అదే విధంగా భారద్వాజ మహర్షి ఆకలివల్ల బాధపడుచు పృథువనే వడ్రంగి దగ్గర అనేకమైన ఆవులను దానంగా తీసికొన్నాడు. ఇంకా విశ్వామిత్ర మహర్షి ఆకలితో బాధపడుచు ధర్మా ధర్మ విచక్షణ లేక చండాలుని చేతిలో నున్న కుక్క యొక్క పొత్తి కడుపు మాంసాన్ని తీసికొని తినబోయెను. దానం తీసికొనుట, యాగం చేయించుట, వేదాధ్యాపనము చేయించుట అనే మూడు వృత్తులలో చెడ్డవారి దగ్గరి నుండి దానం స్వీకరించడం ఏమాత్రం తగనిది. యాగం చేయించటమైనా, వేదమును చెప్పుటయైనా సంస్కార వంతులనుండి చేయవచ్చు అంతకంటె తక్కువవాని నుండి కూడచేయవచ్చు. అందువల్ల దానం స్వీకరించడం పై రెండిటి కంటె తక్కువైంది.

*జపహోమైరపైత్యేనో యాజనాధ్యాపనైః కృతమ్,*

*ప్రతిగ్రహనిమిత్తం తు త్యాగేన తపసైవ చ 111*

యాజనం అధ్యాపనాల వల్ల కలిగిన పాపాన్ని జపహెూమాలతో తగ్గించవచ్చు. కాని ప్రతి గ్రహం వల్ల కలిగిన పాపం ఆధనాన్నంతా దానం చేసి ప్రాయశ్చిత్తం చేసికొంటేనే నశిస్తుంది.

*శిలోంఛామప్యాదదీత విప్రో జీవన్ యత స్తతః,*

*ప్రతిగ్రహాచ్ఛిలః శ్రేయాం స్తతో ప్యుంఛః ప్రశస్యతే 112*

*సీదద్భిః కుప్యమిచ్ఛద్భి ర్ధనే వా పృథివీపతిః,*

*యాచ్యస్స్యా త్స్నాతకై ర్విప్రై రదిత్సం స్త్యాగమర్హతి 113*

*అకృతం చకృతాత్ క్షేత్రా ద్గౌరజావిక మేవ చ,*

*హిరణ్యం ధాన్య మన్నం చ పూర్వం పూర్వమదోషవత్ 114*

బ్రాహ్మణుడు శిలోంఛ వృత్తిచే జీవించవలెను. అవి దొరకితే అసత్ప్రతిగ్రహం చేయరాదు. అసత్ప్రతిగ్రహంకంటె శిలావృత్తి దానికంటె ఉంఛవృత్తి ఒకదాని కంటె ఒకటి శ్రేష్ఠమైనవి. బాధపడుచు యాగాదులకులయోగించే ధన ధాన్యాలను ఇమ్మని

రాజునడుగవచ్చును. రాజు శ్రోత్రియుడు, యోగ్యుడైన ఆ బ్రాహ్మణునికి దానం చేయకపోతే అతనిని లబ్ధుడని నిర్ణయించివదిలిపెట్టాలి. దున్ని పండియున్న పొలం కంటె దున్నక ఉన్న పొలం దానం తీసికొనుటకు తగినది. అక్కడ కొంతైనా స్వకష్టార్జితముంటుంది. ఆ పోలం కంటె ఆవులు, మేకలు, గొఱ్ఱెలు, బంగారం, ధాన్యం, అన్నం మంచివి. వీటిలో తరువాతి వస్తువుల కంటె ముందు ముందు చెప్పబడ్డవస్తువులు శ్రేష్ఠమైనవి.

*సప్త విత్తాగమా ధర్మ్యా దాయో లాభః క్రయో జయః*
*ప్రయోగః కర్మ యోగశ్చ సత్ప్రతిగ్రహ ఏవ చ 115*

*విద్యా శిల్పం భృతిస్సేవా గోరక్షం విపణిః కృషిః,*
*ధృతి ర్భైక్ష్యం కుసీదం చ దశ జీవన హేతవః 116*

ధర్మము తప్పకుండ వంశపారంపర్యంగా లభించింది, ధర్మంగా అమ్ముకున్నవాటిలో దొరికిన లాభం, కొన్నవస్తువు, జయించిన ధనం, వడ్డీకిచ్చుట, వర్తకము, కృషి మొదలగునవి. సత్ప్రతిగ్రహము లను ఏడు ధర్మప్రకారముగా ధనం సంపాదించవలసిన రీతులు. ఇంకను అందరు బ్రతుకుటకు వేదేతర విద్య, శిల్పం, జీతం తీసికొనుట, ఇతరులసేవ, గోవులను రక్షించుట, అను పదిరీతులు లనువైనవి.

*బ్రాహ్మణః క్షత్రియో వాఽపి వృద్ధిం నైవ ప్రయోజయేత్,*
*కామం తు ఖలు ధర్మార్థం దద్యాత్పాపీయసేఽల్పికామ్ 117*

బ్రాహ్మణుడు కాని, క్షత్రియుడు కాని వడ్డీ పైన బ్రతుకరాదు. ఆ ధనం ధర్మకార్యాలకు ఉపయోగిస్తే తక్కువ వడ్డీని మాత్రం తీసికోవాలి.

*చతుర్థమాదదానోఽపి క్షత్రియో భాగమాపది,*
*ప్రజా రక్షన్ పరం శక్త్యా కిల్బిషాత్ ప్రతిముచ్యతే 118*

*స్వధర్మో విజయస్తస్య నాహవే స్యాత్పరాఙ్ముఖః,*
*శస్త్రేణ వైశ్యాన్ రక్షిత్వా ధర్మ్యమాహార యేద్బలిమ్ 119*

*ధాన్యేఽష్టమం విశాం శుల్కం వింశం కార్షావణావరమ్,*
*కర్మోపకరణా శ్శూద్రాః కారవః శిల్పిన స్తథా 120*

క్షత్రియుడాపద యందు ప్రజలనుండి నాలుగవపాలు పన్ను తీసికొన్నా ప్రజలను శ్రద్ధతో కాపాడితే అతనికాపాపమంటదు. ఆ రాజునకు యుద్ధమే స్వధర్మము. అతడాయుద్ధంలో పరాఙ్ముఖుడుకారాదు. వైశ్యులను తన బలంవల్ల దొంగలనుంచి రక్షించి వారి దగ్గరినుండి పన్నును తీసికోవాలి, ధాన్యమున ఎనిమిదవపాలును పన్నుగా తీసికొనవలెను. అట్లే వారు పొందే ధన లాభంలో ఇరవైయవభాగాన్ని పన్నుగా తీసికోవాలి. శూద్రులు, శిల్పులుమొదలగువారి దగ్గర పని మాత్రమే చేయించుకోవాలి. పన్ను తీసికోరాదు.

*శూద్రస్తు వృత్తి మాకాంక్షన్ క్షత్రమారాధయేద్యది,*
*ధనినం వాప్యుపారాధ్య వైశ్యం శూద్రో జిజీవిషేత్ 121*

*స్వర్గార్థ ముభయార్థం వావిప్రా నారాధయేత్తు సః,*
*జాతబ్రాహ్మణశబ్దస్య సాహ్యస్య కృతకృత్యతా 122*

*విప్ర సేవైవ శూద్రస్య విశిష్టం కర్మ కీర్త్యతే*
*యదతోఽన్యద్ధి కురుతే తద్భవత్యస్య నిష్ఫలమ్ 123*

*ప్రకల్ప్యా తస్య తైర్వృత్తిః స్వకుటుంబాద్యథార్హతః,*
*శక్తిం చావేక్ష్య దాక్ష్యం చ భృత్యానాం చ పరిగ్రహమ్ 124*

*ఉచ్ఛిష్ట మన్నం దాతవ్యం జీర్ణాని వసనాని చ,*
*పులాకాశ్చైవ ధాన్యానాం జీర్ణాశ్చైవ పరిచ్ఛదాః 125*

శూద్రుడు బ్రతుకు దెరువుకై క్షత్రియునైనా ధనవంతుడైన వైశ్యునైనా సేవించిబ్రతుకవచ్చును. అతడు స్వర్గాన్ని కోరినా, ఐహికసుఖాలు కోరినా, బ్రాహ్మణసేవచేయాలి. బ్రాహ్మణుని సేవించుటయే శూద్రుని ధర్మము. అందువల్ల శూద్రునికి అన్యవృత్తులకంటె బ్రాహ్మణ సేవయే ముఖ్యమైంది. బ్రాహ్మణసేవ కంటె ఇతరమైన పనులు చేస్తే అవన్నీ వ్యర్థమౌతాయి. ఆ బ్రాహ్మణుడు కూడ సేవకుడు చేస్తున్నపనిని అతని సామర్థ్యాన్ని, అతని కుటుంబాన్ని గమనించి తన ఇంటి నుండి వానికి అవసరమైన జీవికను ఏర్పాటుచేయాలి. ఆ శూద్రునికి తమ ఇంట మిగిలిపోయిన అన్నాన్ని పెట్టాలి. తమ బట్టలు ఇవ్వాలి. ధాన్యం ఇవ్వాలి.

*న శూద్రే పాతకం కించి న్న చ సంస్కారమర్హతి,*
*నాస్యాధికారో ధర్మే ఽస్తి న ధర్మాత్ ప్రతిషేధనమ్ 126*

*ధర్మేప్సవస్తు ధర్మజ్ఞా స్సతాం వృత్తమనుష్ఠితాః,*
*మంత్రవర్జ్యం న దుష్యంతి ప్రశంసాం ప్రాప్నువంతి చ, 127*

*యథా యథా హి సద్వృత్త మాతిష్ఠత్యనసూయకః,*
*తథా తథేమం చాముం చ లోకం ప్రాప్నోత్యనిందితః 128*

*శక్తేనాపి హి శూద్రేణ న కార్యో ధనసంచయః*
*శూద్రో హి ధనమాసాద్య బ్రాహ్మణానేవ బాధతే 129*

శూద్రుడు నిషిద్ధములైన వెల్లుల్లి మొదలైన వస్తువులు తిన్నా అతనికి పాపం పొందదు. అందువల్ల అతడు ప్రాయశ్చిత్తం చేసికోవలసిన అవసరంలేదు. అతనికి అగ్ని హోత్రాది ధర్మానుష్ఠానంలో అధికారమూ లేదు. అతడు ఫలానా ధర్మం ఆచరించకూడదనే నిషేధమూలేదు. ధర్మానుష్ఠానాన్ని కోరే స్వధర్మాన్ని తెలిసిన శూద్రులు, పెద్దలు చేసినట్టు మంత్రములు లేక అతిథి సత్కారాది విధులననుష్ఠింపుచు దోషవంతులు కాక కీర్తి పొందుచున్నారు. ఇతరులను దూషించక స్వధర్మాన్ని అనుష్ఠించే శూద్రుని జనులందరు పొగుడుట వల్ల ఇహ పరలోకాల్లో కీర్తి పొందుచున్నాడు. శక్తి ఉన్నా శూద్రుడు ధనము దాచిపెట్టపెట్టవద్దు. అట్లు అధిక ధనాన్ని సంపాదించి బ్రాహ్మణులనతడు బాధపెట్టున్నాడు.

ఏతే చతుర్ణాం వర్ణానామాపద్ధర్మాః ప్రకీర్తితాః,
యాన్ సమ్యగనుతిష్ఠంతో వ్రజంతి పరమాం గతిమ్ 130

ఇంతవరకు బ్రాహ్మణాది నాలుగు వర్ణాల వారనుష్ఠించాల్సిన ఆపద్ధర్మాలు కూడచెప్పబడ్డాయి. వీటినాచరించి వారందరు ఉత్తమ స్థితి పొందుచున్నారు.

ఏష ధర్మవిధిః కృత్స్నః శ్చాతుర్వర్ణ్యస్య కీర్తితః,
అతః పరం ప్రవక్ష్యామి ప్రాయశ్చిత్తవిధిం శుభమ్ 131

ఇంతవరకు బ్రాహ్మణాది నాలుగు వర్ణాలవారనుష్ఠించాల్సిన ధర్మాల గురించి చెప్పడం జరిగింది. ఇక ప్రాయశ్చిత్త విధి వివరింపబడుతుంది.

ఇతి మానవే ధర్మశాస్త్రే భృగుప్రోక్తాయాం సంహితాయాం దశమోऽధ్యాయః
భృగు మహర్షి చెప్పిన మానవ ధర్మశాస్త్రమనే సంహితలో పదవ అధ్యాయం సమాప్తం.

## ఏకాదశాధ్యాయం

సాంతానికం యక్ష్యమాణమధ్వగం సర్వవేదసం।
గుర్వర్థం పితృమాత్రర్థం స్వాధ్యాయార్థ్యుపతాపినః 1

నవైతాన్ స్నాతకాన్ విద్యాద్బ్రాహ్మణాన్ ధర్మభిక్షుకాన్,
నిస్స్వేభ్యో దేయ మేతేభ్యో దానం విద్యావిశేషతః 2

ఇతేభ్యో హి ద్విజాగ్ర్యేభ్యో దేయమన్నం సదక్షిణం,
ఇతరేభ్యో బహిర్వేది కృతాన్నం దేయముచ్యతే 3

వివాహం చెసికొనవలెననుకొనువాడు,యాగాలు చేయగోరువాడు, బాటసారి, సర్వస్వమంతా విశ్వజిద్యాగలో దానం చేసినవాడు, గురువుగురించి, తల్లి దండ్రులగురించి ధనం కోరేవాడు, వేదాధ్యయనకాలంలో తనకు కావలసినవస్తువులు కోరువాడు, రోగి, ఈవిద్యావంతులకు తప్పక దానం చేయాలి. ఈ బ్రాహ్మణులకు యజ్ఞవేదిలోపల దక్షిణతో అన్నము పెట్టవలెను. తక్కినవారికి యజ్ఞవేది వెలుపల అన్నం పెట్టాలి. ధనము నెచ్చటనైనా దానం చేయవచ్చు.

సర్వరత్నాని రాజా తు యథార్హం ప్రతిపాదయేత్,
బ్రాహ్మణాన్ వేదవిదుషో యజ్ఞార్థం చైవ దక్షిణామ్ 4

రాజు వేదవేత్తలైన బ్రాహ్మణులకు యాగదక్షిణలను, వారివారి అర్హతననుసరించి సమస్త రత్నాలను దానం చేయాలి.

కృతదారోऽపరాన్ దారాన్ భిక్షిత్వా యోऽధిగచ్ఛతి,
రతిమాత్రఫలం తస్య ద్రవ్యదాతు స్తు సంతతిః 5

ధనాని తు యథాశక్తి విప్రేషు ప్రతిపాదయేత్,
వేదవిత్సు వివిక్తేషు ప్రేత్య స్వర్గం సమశ్నుతే 6

# ఏకాదశాధ్యాయం

పెండ్లి చేసికొన్న బ్రాహ్మణుడు ఇతరుల భార్యల యాచనచేస్తే అతనికి రతి సుఖం మాత్రం కలుగుతుంది కావున అతనికి దానం చేయరాదు. వేదవేదాంగసంపన్నులైై బ్రాహ్మణోత్తములకు యధా శక్తి దానం చేసినవాడు చనిపోయిన తరువాత స్వర్గాన్ని పొందుతాడు.

*యస్య త్రైవార్షికం భక్తం పర్యాప్తం భృత్య్య వృత్తయే,*
*అధికం వాపి విద్యేత స సోమం పాతు మర్హతి 7*

*అతః స్వల్పీయసి ద్రవ్యే యస్సోమం పిబతి ద్విజః,*
*స పీతసోమపూర్వోఽపి న తస్యాప్నోతి తత్ఫలమ్ 8*

*శక్తః పరజనే దాతా స్వజనే దుఃఖజీవిని,*
*మధ్వాపాతో విషాస్వాదః స ధర్మః ప్రతిరూపకః 9*

*భృత్యానాముపరోధేన యత్కరోత్యౌర్ధ్వ దైహికమ్,*
*తద్భవత్యసుఖోదర్కం జీవతశ్చ మృతస్య చ 10*

*(వృద్ధౌ చ మాతాపితరౌ సాధ్వీ భార్యా శిశుః సుతః,*
*అప్యకార్యశతం కృత్వా భర్తవ్యా మను రబ్రవీత్.)*

తనకు, తనసేవకవర్గానికి మూడు సంవత్సరాలకు సరిపడినంత లేక అంతకు మిక్కిలి భోజన పదార్థమున్న చో ఆ ద్విజుడు సోమయాగం చేయవలెను. అంతకంటె తక్కువ ధనముండి సోమయాగం చేసిన బ్రాహ్మణుడు మాత్రం సోమయాగఫలాన్ని పొందలేడు. తన తల్లిదండ్రులు మొదలైన పరివారం బాధలు పడుతున్నా పట్టించుకోక ఇతరులకు దానం చేసేవాడు చేసేది ధర్మకార్యం కాదు అది తొలుత తేనెవలెనుండిచివరకు విషమునాస్వాదించినట్లు తొలుత కీర్తిని కలిగించినా చివరికది పాపాన్ని కలిగిస్తుంది. అట్లే ఆలు బిడ్డలు మొదలగువారిని పోషించక వారిని దుఃఖ పెట్టుతూ పరలోకలో పుణ్యం కలుగుతుందని చేసే దానాలన్ని దాత బ్రతికియున్నా చనిపోయినా అతనికి కష్టాలనే కలిగిస్తాయి. వృద్ధులైన తల్లిదండ్రులు పతివ్రతయైన భార్య, శిశువుగా ఉన్న సుతుడు వీరినందరిని చేయ కూడని పనులెన్నైనా చేసి పోషించాలి.

*యజ్ఞశ్చేత్ ప్రతిరుద్ధస్స్యా దేకేనాంగేన యజ్వనః,*
*బ్రాహ్మణస్య విశేషేణ ధార్మికే సతి రాజని 11*

*యో వైశ్యః స్యాద్బహుపశు ర్హీ నక్రతురసోమపః,*
*కుటుంబాత్తస్య తద్ద్రవ్య మాహరే ద్యజ్ఞసిద్ధయే 12*

*ఆహరేత్త్రీణి వా ద్వే వా కామం శూద్రస్య వేశ్మనః,*
*న హి శూద్రస్య యజ్ఞేషు కశ్చిదస్తి పరిగ్రహః 13*

*యోఽనాహితాగ్ని శ్శతగు రయజ్వా చ సహస్రగుః,*
*తయోరపి కుటుంబాభ్యా మాహరేదవిచారయన్ 14*

*ఆదాననిత్యాచ్చాదాతు రాహరేదప్రయచ్ఛతః,*
*తథా యశోऽస్య ప్రథతే ధర్మశ్చైవ ప్రవర్ధతే 15*

ధార్మికుడైన రాజు పరిపాలన చేస్తుంటే ఒక బ్రాహ్మణుడు చేస్తున్న యజ్ఞంలో ఒక అంగం అసంపూర్ణమై యజ్ఞానికి అంతరాయం కలిగినపుడు అనేక పశువులు ఉన్నా క్రతువులు సోమయాగము చేయక ఉన్న వైశ్యుని నుండి యజ్ఞ పరిపూర్తి కొరకు ధనాన్ని తెచ్చుకొనవలెను. అట్లే యజ్ఞానికి కావలసిన రెండు లేక మూడు అంగాలు లోపిస్తే శూద్రుని ఇంటి నుండైన ధనాన్ని ద్రవ్యాన్ని తెచ్చి దాన్ని పూర్తి చేయవచ్చు కాని శూద్రుని దగ్గరదానం మాత్రం తీసికోరాదు. అదేవిధంగా నూరు ఆవులుండి ఆహితాగ్ని కానివాడు వేయి ఆవులుండి యాగములు చేయని బ్రాహ్మణుల ఇంటి నుండి విచారించ కుండా ధన ద్రవ్యాలను తెచ్చి అసంపూర్ణంగా ఉన్న యజ్ఞాన్ని పూర్తి చేయాలి. ఎల్లప్పుడు ఇతరుల నుండి దానం తీసికొంటూ ఇతరుల యజ్ఞ పరిపూర్తికై ఏమి ఇవ్వని బ్రాహ్మణుని నుండి బలవంతంగానైనా ధనం తీసికొని వచ్చి యజ్ఞాన్ని పూర్తి చేస్తే ఆ విధంగా చేసినవానికి కీర్తి కలుగుతుంది. ధర్మకార్యం పూర్తిఔతుంది.

*తథైవ సప్తమే భక్తే భక్తాని షడనశ్నతా,*
*అశ్వస్తనవిధానేన హర్తవ్యం హీనకర్మణః 16*

*ఖలాత్ క్షేత్రా దగారాద్వా యతో వాऽప్యుపలభ్యతే,*
*ఆఖ్యాతవ్యం తు తత్తస్మై పృచ్ఛతే యది పృచ్ఛతి 17*

అదేవిధంగా మూడురోజులు నియతంగా ఉపవాసంచేసి నాల్గవరోజు తప్పని సరిగా పారణ చేయాలి. కావున ఆపారణకై ధనం లేకపోతే కావలసిన ధనాన్ని హీనకర్ముని ఇంటి నుండి దొంగతనం చేసియైనా పూర్తిచేయవచ్చు. ఆ దొంగ తనం చేసిన ధనధాన్యాలు కళ్ళంలో నుండిగాని, పొలంలోనుండిగాని, ఇంటినుండిగాని మరింకే ప్రదేశంనుండిగాని హీనకర్ముని దగ్గరి నుండి తెస్తే అతడీవిషయాన్ని అడిగితే నిర్భయంగా చెప్పవచ్చు.

*బ్రాహ్మణస్వం న హర్తవ్యం క్షత్రియేణ కదాచన,*
*దస్యునిష్క్రియయో స్తు స్వమజీవన్ హర్తు మర్హతి 18*

*యో సాధుభ్యోऽర్థమాదాయ సాధుభ్య స్సంప్రయచ్ఛతి,*
*స కృత్వాప్లవ మాత్మానం సంతారయతి తా వుభౌ 19*

క్షత్రియుడు బ్రాహ్మణుని ధనాన్ని ఎప్పుడూ అపహరింపకూడదు. అతడు కష్ట దశలో ఉన్నప్పుడు మాత్రం దస్యులు, విహితకార్యాలు చేయని వారి ధనాన్ని అపహరింపవచ్చు. అసాధు పురుషుల ధనాన్ని బలవంతంగా తీసికొని మంచివారికి పంచిపెట్తే తాను, అసాధుపురుషులు, సాధుపురుషులు అందరూ బాగుపడతారు.

*యద్ధనం యజ్ఞశీలానాం దేవస్వం తద్విదుర్బుధాః,*
*అయజ్వానాం తుయద్విత్త మాసురస్వం తదుచ్యతే 20*

*న తస్మిన్ ధారయే ద్దండంధార్మికః పృథివీపతిః,*
*క్షత్రియస్య హి బాలిశ్యాద్బ్రాహ్మణ స్సీదతి క్షుధా. 21*

*తస్య భృత్యజనం జ్ఞాత్వా స్వకుటుంబా న్మహీపతిః,*
*శ్రుతశీలే చ విజ్ఞాయ వృత్తిం ధర్మ్యాం ప్రకల్పయేత్ 22*

*కల్పయిత్వాస్య వృత్తిం చ రక్షే దేనం సమంతతః,*
*రాజా హి ధర్మషడ్భాగం తస్మాత్ప్రాప్నోతి రక్షితాత్ 23*

యజ్ఞం చేసేవారి ధనం దేవతల ధనమని యజ్ఞం చేయక ఉండేవారి ధనం రాక్షస ధనమని పెద్దలు చెప్పుతారు. బ్రాహ్మణుడు యజ్ఞాన్ని పూర్తి చేయుటకుకై పైన చెప్పినవారి దగ్గర ధనాన్నిగాని, ద్రవ్యాన్నిగాని, బలాత్కారంగా తీసికొన్నా, రాజతనిని మాత్రం శిక్షించకూడదు. బ్రాహ్మణుడు ధనహీనుడగుటకు రాజేకారణం. అందువల్ల రాజు శ్రోత్రియుడు, సజ్జనుడైన ఆ బ్రాహ్మణుని చదువు సంధ్యలు, ప్రవర్తన మొదలగునవి తెలిసికొని ఆ బ్రాహ్మణునింటనుండ సేవకులు భార్యా పుత్రులు జీవించునట్లు తన ఇంటి నుండి ధన ధాన్యాల్ని అతని ఇంటికి పంపించాలి. ఇట్లు సద్బ్రాహ్మణునికి జీవికను కల్పించి శత్రు,చోరులవల్ల అతనికి అపాయం కలుగకుండ రక్షించాలి. ఆవిధంగా సద్బ్రాహ్మణులను రక్షించినందువల్లనే రాజు ఆరవ భాగం పన్ను పొందటానికి అర్హుడౌతున్నాడు.

*న యజ్ఞార్థం ధనం శూద్రాద్విప్రో భిక్షేత కర్హి చిత్,*
*యజమానో హి భిక్షిత్వా చండాలః ప్రేత్య జాయతే 24*

*యజ్ఞార్థమర్థం భిక్షిత్వా యో న సర్వం ప్రయచ్ఛతి,*
*స యాతి భాసతాం విప్రః కాకతాం వా శతం సమాః 25*

*దేవస్వం బ్రాహ్మణస్వం వా లోభేనోపహినస్తి యః,*
*స పాపాత్మా పరే లోకే గృధ్రోచ్ఛిష్టేన జీవతి 26*

బ్రాహ్మణుడు యజ్ఞనిర్వహణకై శూద్రుని ఎప్పుడు కూడ యాచింపరాదు. ఆవిధంగా యాచన చేస్తే అతడు చనిపోయినతరువాత చండాలుడౌతాడు. యజ్ఞమునకై ధనద్రవ్యాలను యాచించి ఆధనద్రవ్యాలనన్ని ఆయజ్ఞానికై వినియోగించకపోతే ఆ పాపాత్ముడు చనిపోయిన తరువాత నూరేండ్లు కాకిగానో, గ్రద్దగానో పుట్టాడు. ఆశకు లోనై దేవాలయానికి చెందిన ధనాన్నో, బ్రాహ్మణునికి చెందిన ధనాన్నో అపహరించు పాపాత్ముడు జన్మాంతరమున గద్దలు తినగా మిగిలిన ఆహారంతిని బ్రతుకుతాడు.

*ఇష్టిం వైశ్వానరీం నిత్యం నిర్వపేదబ్దపర్యయే,*
*క్లృప్తానాం పశుసోమానాం నిష్కృత్యర్థమసంభవే 27*

*ఆపత్కల్పేన యో ధర్మం కురుతే నాపది ద్విజః,*
*స నాప్నోతి ఫలం తస్య పరత్రేతి విచారితమ్ 28*

ఒక సంవత్సరం పశుసోమయాగాలు చేయకపోతే ఆ దోషపరిహారానికై తన దగ్గర ధనం లేనప్పుడు శూద్రాదుల నుండైనా ధనం తీసికొని వైశ్వానరేష్టిని చేయాలి. ఆపద కలిగినప్పుడు విధించిన ధర్మాన్ని ఆపదలు లేనప్పుడు అనుష్ఠించిన బ్రాహ్మణుడు ఆ యజ్ఞాది కార్యఫలాన్ని అనుభవించలేడు.

*విశ్వైశ్చ దేవైస్సాధ్యైశ్చ బ్రాహ్మణైశ్చ మహర్షిభిః*
*ఆపత్సు మరణాద్భీతైర్విధేః ప్రతినిధిః కృతః 29*

*ప్రభుః ప్రథమకల్పస్య యోఽనుకల్పేన వర్తతే,*
*న సాంపరాయికం తస్య దుర్మతేర్విద్యతే ఫలమ్ 30*

విశ్వేదేవతలు, సాధ్యులు, బ్రాహ్మణులు, మహర్షులకు రోగంవంటి కష్టాలు వస్తే మరణానికి భయపడి సోమయాగాది ముఖ్యయాగాలు చేయలేని సమయంలో దానికి బదులు వైశ్వానరం మొదలగు ఇష్టులను చేయాలి.ప్రధానమైన యాగం చేయగలిగి కూడ దానికి ప్రతినిధులైన వైశ్వానరాదియాగాలు చేసేవాడికి దోషపరిహారరూపమైన ఫలితం పొందలేడు.

*న బ్రాహ్మణోఽవేదయేత కించిద్రాజని ధర్మవిత్,*
*స్వవీర్యేణైవ తాఞ్ఛిష్యాన్మానవానపకారిణః. 31*

*స్వవీర్యాద్రాజవీర్యాచ్చ స్వవీర్యం బలవత్తరమ్,*
*తస్మాత్స్వేనైవ వీర్యేణనిగృహ్ణీయాదరీన్ ద్విజః 32*

*శ్రుతీరథర్వాంగిరసీః కుర్యాదిత్యవిచారయన్,*
*వాక్ శస్త్రం వై బ్రాహ్మణస్య తేన హన్యాదరీన్ ద్విజః 33*

రాజు చక్కగా పరిపాలిస్తున్నప్పుడు ధర్మములన్ని తెలిసిన బ్రాహ్మణుడు తనకు జరిగిన అన్యాయాలను చెప్పక అభిచారహోమాదులు మొదలగు స్వశక్తి చేతనే వారిని శిక్షించాలి. కాని తన విరోధులను చంపుట మాత్రం తగదు. బ్రాహ్మణ బలం, రాజుబలం ఈ రెండింటిలో బ్రాహ్మణ బలమే చాలా మిన్న కాబట్టి బ్రాహ్మణుడు బ్రహ్మతేజస్సుచేతనే తనకు కీడు చేసిన వానిని శిక్షించాలి. తనకు కీడు చేసిన వారిని అధర్వవేదమున అంగీరస ఋషి తెల్పిన అభిచార మంత్రములచే నిగ్రహించాలి. బ్రాహ్మణునికి అతని వాక్కే శస్త్రమువంటిది.

*క్షత్రియో బాహువీర్యేణ తరేదాపదమాత్మనః,*
*ధనేన వైశ్యశూద్రౌ తు జపహోమైర్ద్విజోత్తమః, 34*

క్షత్రియుడు తనకు కలిగిన ఆపదను తనపరాక్రమంతో దాటాలి. వైశ్యుడు శూద్రుడు ధనంతో కష్టాలనెదుర్కోవాలి. బ్రాహ్మణుడైతే జపహోమాదులతో తనకష్టాలనెదుర్కోవాలి.

*విధాతా శాసితా వక్తా మైత్రో బ్రాహ్మణ ఉచ్యతే,*
*తస్మై వా కుశలం బ్రూయాన్న శుష్కాం గిరమీరయేత్ 35*

శాస్త్రవిహితకర్మలననుష్ఠించేవాడు, పుత్రశిష్యాదులను శాసించేవాడు, ప్రాయశ్చిత్తాది ధర్మాలను చెప్పేవాడు, అందరితో స్నేహంగా ఉండేవాడే బ్రాహ్మణుడు. అతడు కనిపిస్తే అతనిక్షేమాన్ని అడగాలే తప్ప శుష్కవచనాలు మాట్లాడగూడదు.

*న వై కన్యా న యువతిర్నాల్పవిద్యో న బాలిశః,*
*హోతా స్యాదగ్నిహోత్రస్య నార్తో నాసంస్కృత స్తథా 36*

*నరకే హి పతంత్యేతే జుహ్వంతస్స చ యస్య తత్,*
*తస్మాద్వైతానకుశలో హోతా స్యాద్వేదపారగః 37*

*ప్రాజాపత్యమదత్వాశ్వమగ్న్యా ధేయస్య దక్షిణామ్,*
*అనాహితాగ్నిర్భవతి బ్రాహ్మణో విభవేసతి 38*

*పుణ్యాన్యన్యాని కుర్వీత శ్రద్ధధానో జితేంద్రియః,*
*న త్వల్పదక్షిణైర్యజ్ఞైర్యజేతేహ కథంచన 39*

*ఇంద్రియాణి యశః స్వర్గమాయుః కీర్తిం ప్రజాః పశూన్,*
*హంత్యల్పదక్షిణో యజ్ఞ స్తస్మాన్నాల్పధనో యజేత్ 40*

కన్య, యువతి, తక్కువ చదువుకలవాడు, మూర్ఖుడు, రోగబాధితుడు, ఉపనయన సంస్కారము జరుగనివాడు వీరందరు యజ్ఞ యాగములు చేయుటకనర్హులు. వీరు యజ్ఞయాగాదులు చేస్తే నరకంతో పడుతారు. కావున వేదములు చదువుకొని శ్రౌతకర్మలలో నేర్పరియైన బ్రాహ్మణుడు మాత్రమే యాగంచేయాలి. బాగా ధనమున్న బ్రాహ్మణుడు అగ్న్యాధేయం చేసేటప్పుడు ప్రజాపతి దేవతాకమైన ప్రాజాపత్యాశ్వాన్ని దక్షిణగా ఇవ్వకపోతే అతడు అనాహితాగ్నితో సమానుడై అగ్న్యాధేయ ఫలాన్ని పొందజాలడు. శ్రద్ధ కలవాడు, జితేంద్రియుడు ఐన బ్రాహ్మణుడు యజ్ఞం కంటె ఇతరమైన తీర్థయాత్రల వంటి పుణ్యకార్యాలు చేయాలి. అతడు యజ్ఞం చేస్తే వేదవిహిత దక్షిణలకంటె తక్కువ దక్షిణనియ్యరాదు. యజ్ఞం చేసి తక్కువ దక్షిణనిస్తే ఇంద్రియాల్ని, కీర్తిని, స్వర్గాన్ని, ఆయుస్సును, సంతానాన్ని, పశువులను, నశింపచేస్తుంది. కావున తక్కువ ధనమున్నవాడు యాగం చేయుట మంచిదికాదు.

*అగ్నిహోత్ర్యపవిధ్యాగ్నీన్ బ్రాహ్మణః కామకారతః,*
*చాంద్రాయణం చరేన్మానం వీరహత్యాసమం హి తత్ 41*

*యే శూద్రాదధిగమ్యార్థమగ్నిహోత్రముపాసతే,*
*ఋత్విజస్తే హి శూద్రాణాం బ్రహ్మవాదిమ గర్హితాః 42*

*తేషాం సతతమజ్ఞానాం వృషలాగ్న్యుప సేవినామ్,*
*పదా మస్తకమాక్రమ్య దాతా దుర్గాణి సంతరేత్ 43*

నిత్యాగ్నిహోత్రియైనవాడు సాయం ప్రాతః కాలాల్లో అగ్నిని ఉపాసించకపోతే అది వీరుడైన పుత్రుని చంపిన దానితో సమానం కాబట్టి ఒక నెల వరకు చాంద్రాయణ వ్రతాన్ని ఆచరించాలి. శూద్రుల దగ్గర ధనాన్ని యాచించి అగ్నిహోత్రాన్ని ఉపాసించే వాడు శూద్రులకు పురోహితుడౌతాడే కాని వేద వాదుల నిందకు పాత్రుడై తానాచరించిన అగ్న్యాధాన ఫలితాన్ని మాత్రం పొందలేడు. ఆ విధంగా శూద్రుల దగ్గరినుండి ధనం తీసికొని అగ్నినుపాసిస్తే ఆ మూర్ఖుని శిరస్సు పై పాదముంచి ధన దాత నరకం దాటుతాడు కాని యాగం చేసినవానికి ఫలితం లభించదు.

*అకుర్వన్విహితం కర్మ నిదితం చ సమాచరన్,*
*ప్రసక్త శ్చేంద్రియార్థేషు ప్రాయశ్చిత్తీయతే నరః 44*

అకామతః కృతే పాపే ప్రాయశ్చిత్తం విదుర్బుధాః,
కామకారకృతేऽప్యాహురేకే శ్రుతినిదర్శనాత్ 45

అకామతః కృతం పాపం వేదాభ్యాసేన శుద్ధ్యతి,
కామతస్తు కృతం మోహాత్ప్రాయశ్చిత్తైః పృథగ్విధైః 46

శాస్త్ర విహితాలైన సంధ్యావందనాది కర్మలు చేయక శాస్త్రనిషిద్ధమైన హింసాది కార్యక్రమాలు చేస్తూ, ఇంద్రియలోలుడైన వాడు ప్రాయశ్చిత్తం చేసికోవాలి. తెలియక తప్పు చేసినప్పుడే ప్రాయశ్చిత్తం చేసికొనవలెనని కొందరంటే వేద నిదర్శనము చూపి తెలిసి తప్పు చేసినను ప్రాయశ్చిత్తం చేసికోవచ్చునని కొందరంటున్నారు. తెలియక చేసిన తప్పును ద్విజుడు వేదాభ్యాసం వల్ల సరిదిద్దుకోవచ్చునని తెలిసి చేసిన తప్పుకు అనేక విధములైన ప్రాయశ్చిత్తాలు ఆచరించవలెనని చెప్పున్నారు.

ప్రాయశ్చిత్తీయతాం ప్రాప్య దైవాత్పూర్వకృతేన వా,
న సంసర్గం వ్రజేత్సద్భిః ప్రాయశ్చిత్తేऽకృతే ద్విజః 47

ఇహ దుశ్చరితైః కేచిత్కే చిత్పూర్వకృతై స్తథా,
ప్రాప్నువంతి దురాత్మానో నరా రూపవిపర్యయమ్ 48

సువర్ణచోరః కౌనఖ్యం సురాపః పూతవక్త్రతామ్,
ధాన్య చోరోऽంగహీనత్వ మాతిరైక్యం తు మిశ్రకః 49

పిశునః పౌతినాసిక్యం సూచకః పూతికక్త్రతాం

ధాన్యచోరో ంగహీనత్వమాతిరేక్యం తు మిశ్రకః 50

అన్నహర్తాऽऽమయావిత్వం మౌక్యం వాగపహారకః,
వస్త్రాపహారకః శ్వైత్ర్యం పంగుతామశ్వహారకః 51

ఏవం కర్మ విశేషేణ జాయంతే సద్విగర్హితాః,
జడమూకాంధబధిరా వికృతాకృతయస్తథా 52

దురదృష్టవశాత్తుననో, పూర్వ కర్మ దోషం వల్లనో ప్రాయశ్చిత్తం చేసికొనవలసి యుండగా ఆ ప్రాయశ్చిత్తం చేసికొనక సజ్జనులతో కలువరాదు. ఈ జన్మమున చేసిన పాపాలతో పూర్వ జన్మంలో చేసిన పాపాలతో కొందరు కుష్ఠ రోగాదులచే వికృత రూపును పొందుతున్నారు. బంగారమును దొంగిలించు వానికి గోళ్ళు చెడిపోవును. మద్యపానము చేయువాని పండ్లు నల్లగా మారిపోతాయి. బ్రాహ్మణులను చంపినవాడు క్షయ రోగాన్ని పొందుతాడు. గురుభార్యతో వ్యభిచారం చేసినచో చర్మమంతా చెడిపోవును. లోభికి ముక్కు ఎప్పుడు దుర్వాసనతో ఉండును. చేయని నేరాలు మోపువాడు దుర్వాసన కల ముఖం కలిగి ఉంటాడు. ధాన్యాన్ని దొంగిలించినవాడు అంగహీనుడౌతాడు. ఇతరుల బట్టలు దొంగిలించువాడు తెల్ల కుష్ఠుతో బాధ చెందును. గుఱ్ఱము నెత్తుకొని పోయినవాడు కుంటివాడగును. ఈ విధంగా జడులు, మూగవారు, గుడ్డివారు, చెవిటివారు తాము చేసిన పాపాల వల్ల వికృతాకారులై సజ్జనులు నిందించుచుండగా బాధపడుతూ ఉంటారు.

*చరితవ్యమతో నిత్యం ప్రాయశ్చిత్తం విశుద్ధయే,*
*నింద్యైర్హి లక్షణైర్యుక్తా జాయంతే నిష్కృతైనసః 53*

జన్మాంతరమున చేసిన పాపాలకు ప్రాయశ్చిత్తం చేసికోకపోతే కురూపులై పుడ్తారు. కావున మరు జన్మంలోనైనా ఇటువంటి రూపం రాకుండా ఉండటానికి ప్రాయశ్చిత్త చేసికోవాలి.

*బ్రహ్మహత్యా సురాపానం స్తేయం గుర్వంగనాగమః,*
*మహాంతి పాతకాన్యాహుస్సంసర్గశ్చాపి తైస్సహ 54*

*అనృతం చ సముత్కర్షే రాజగామి చ పైశునమ్,*
*గురోశ్చాలీక నిర్బంధః సమాని బ్రహ్మహత్యయా 55*

*బ్రహ్మోజ్ఝతా వేదనిందా కౌటసాక్ష్యం సుహృద్వధః,*
*గర్హి తానద్యయోర్జగ్ధిస్సురాపానసమాని షట్ 56*

*నిక్షేపస్యాపహరణం నరాశ్వరజతస్య చ,*
*భూమివజ్రమణీనాం చ రుక్మస్తేయసమం స్మృతమ్ 57*

*రేతస్సేకః స్వయోనీషు కుమారీష్వంత్యజాసు చ,*
*సఖ్యుః పుత్రస్యచ స్త్రీషు గురుతల్పసమం విదుః 58*

బ్రహ్మ హత్య, సురాపానం, దొంగతనం, గురువు భార్యతో వ్యభిచరించుట, ఈ పాపాలు చేసిన వారితో కలసి ఉండడం వీటిని ఐదు మహాపాతకములని అంటారు. గొప్పవాని ముందు తానూ గొప్పవాడినని అబద్ధాలాడుట, రాజు దగ్గర ఇతరులపై కొండెములు చెప్పుట, గురువు పై నింద మోపుట ఈ మూడు బ్రహ్మహత్యతో సమానమైనవి. వేదములు చదువకపోవుట, వాటిని నిందించుట, కూట సాక్ష్యములు చెప్పుట, స్నేహితులను చంపుట, నిషిద్ధమైన పదార్థాలను భక్షించుట, భక్షింప దగని వస్తువుల తినుట అనే ఆరు సురాపానంతో సమానమైనవి. దాచిపెట్టిన ధనాన్ని అపహరించుట, వెండి, గుఱ్ఱములు, మానవులు, భూమి వజ్రములు, మణులు మొదలైనవి అపహరించుట బంగారాన్ని అపహరించిన దానితో సమానం. తోడ పుట్టినది, కన్య, చండాల స్త్రీ, స్నేహితుని భార్య, కోడలు వీరితో సంభోగము చేయుట గురుభార్యతో సంభోగించుట వంటిది.

*గోవధోఽయాజ్య సంయాజ్య పారదార్యాత్మ విక్రయాః,*
*గురుమాతృపితృత్యాగః స్వాధ్యాయాగ్న్యోః సుతస్య చ 59*

*పరవిత్తితానుజేఽనూఢే పరివేదనమేవ చ,*
*తయోర్దానం చ కన్యాయా స్తయో రేవ చ యాజనమ్ 60*

*కన్యాయా దూషణం చైవ వార్ధుష్యం వ్రతలోపనమ్,*
*తటాకారామదారాణామపత్యస్య చ విక్రయః 61*

*వ్రాత్యతా బాంధవత్యాగో భృత్యాధ్యాపనమేవ చ,*
*భృత్యా చాధ్యయనాదానమపణ్యానాం చ విక్రయః 62*

*సర్వాకరేష్వధీకారో మహాయంత్రప్రవర్తనమ్,*
*హింసౌషధీనాం స్త్ర్యాజీవోఽభిచారో మూలకర్మ చ 63*

*ఇంధనార్థమశుష్కాణాం ద్రుమాణామవపాతనమ్,*
*ఆత్మార్థం చ క్రియారంభో నిందితాన్నాదనం తథా 64*

*అనాహితాగ్నితా స్తేయ మృణానా మనపక్రియా,*
*అసచ్ఛాస్త్రాధిగమనం కౌశీలవ్యస్య చ క్రియా 65*

*ధాన్యకుప్యపశు స్తేయం మద్యపస్త్రీనిషేవణమ్,*
*స్త్రీశూద్రవిట్ క్షత్రవధో నాస్తిక్యం చోపపాతకమ్ 66*

గోవధ, జాతిదుష్టులచే కర్మదుష్టులచేయాగం చేయించుట, ఇతరుని భార్యతో వ్యభిచారం చేయుట, తన్నుతాను విక్రయించుకొనుట, గురువును తల్లిదండ్రులను పోషించకపోవుట. వేదాధ్యయనాన్ని స్మార్తాగ్నిని పుత్రుని వదిలి పెట్టుట, చిన్నవాడు అన్న కంటే ముందు పెండ్లిచేసికొనుట, తమ్ముడు పెండ్లిచేసికొన్న తరువాత అన్న పెండ్లిచేసికొనుట వీరిద్దరికి కన్యనిచ్చుట, వారిద్దరిచే యాగం చేయించుట, కన్యను చెరచుట, వడ్డీచే బ్రతుకుట, బ్రహ్మచర్యవ్రతాన్ని పోగొట్టుకొనుట, చెరువులు, ఉద్యానవనాలు, భార్యాపుత్రుల నమ్ముకొనుట, సకాలమునకు ఉపనయనం చేయకపోవుట, పినతండ్రి మొదలగు పెద్దలననుసరింపకపోవుట, జీతం తీసికొని వేదం చెప్పుట, అట్లే వేదం చదువుట, అమ్మతగనివస్తువు నమ్ముట, గనులపై అధికారం, గొప్ప ఆనకట్టలు కట్టుట, ఓషధులను భస్మం చేయుట, తన భార్యవల్ల బ్రతుకుట, అభిచారహోమములచే నేరము చేయనివారిని చంపుట, మంత్రములు ఓషధులచే ఇతరులనువశపరుచుకొనుట, వంటచెఱకుకై పచ్చని చెట్లను నరుకుట, దేవతానివేదనచేయక ఆహారంతీసికొనుట, నిషిద్ధపదార్థముల భుజించుట, చేతనైనను అగ్న్యాధానం చేయకుండుట, దొంగతనం చేయుట, నృత్యగీతవాద్యముల నభ్యసించుట, ధాన్యం, లోహాలు, పశువులు, వీనిని దొంగిలించుట, సురాపానంచేసే స్త్రీని పొందుట, స్త్రీలను, శూద్రులనుక్షత్రియులను సంహరించుట, నాస్తిక్యము ఇవన్నియు ఉపపాతకములు .

*బ్రాహ్మణస్య రుజః కృత్వా ఘ్రాతిర ఘ్రేయమద్యయోః,*
*జైహ్మ్యం చ మైథునం పుంసి జాతి భ్రంశకరం స్మృతమ్ 67*

బ్రాహ్మణుని కొట్టుట, కంపుఉన్నవస్తువులను మద్యమును వాసనచూచుట, మోసం, పురుషుడు పురుషునితో మైథునం చేయుట ఇవన్ని జాతిభ్రంశాన్ని కలిగిస్తాయి.

*ఖరాశ్వోష్ట్రమృగేభానామజావిక వధస్తథా,*
*సంకరీకరణం జ్ఞేయం మీనాహిమహిషస్య చ. 68*

గాడిద, గుఱ్ఱం, ఒంటె, మృగం, జింక, ఏనుగు, గొఱ్ఱె, మేక, చేపలు, సర్పం, గేదె వీనిని చంపుటను సంకరీకరణమందురు.

*నిందితేభ్యో ధనాదానం వాణిజ్యం శూద్రసేవనమ్,*
*అపాత్రీకరణం జ్ఞేయమసత్యస్య చ భాషణమ్ 69*

## ఏకాదశాధ్యాయం

నిందితుల దగ్గరినుండి దానం తీసికొనుట, వర్తకం, శూద్రుని కొలువు, అబద్ధమాడుట వీటిని అపాత్రీకరణమందురు.

*క్రిమికీటవయోహత్యా మద్యానుగతభోజనమ్,*
*ఫలైధఃకుసుమస్తేయమధైర్యం చ మలావహమ్ 70*

క్రీములు, కీటకాలు, పక్షులు వీనిని చంపుట, మద్యంతో కలిపి తెచ్చిన ఆహారం, పండ్లు, పూవులు, కట్టెలుదొంగిలించుట, అధైర్యం అనేవి మలమును కలిగిస్తాయి.

*ఏతాన్యేనాంసి సర్వాణి యథోక్తాని పృథక్పృథక్,*
*యైర్యైర్వ్రతైరపోహ్యంతే తాని సమ్యఙ్నిబోధత. 71*

ఈ చెప్పబడ్డ బ్రహ్మహత్యాదిపాపాలు ఏయే ప్రాయశ్చిత్తాలవల్ల తీరుతాయో వివరించబడుతుంది.

ప్రాయశ్చిత్తాలు :-

*బ్రహ్మహా ద్వాదశసమాః కుటీం కృత్వా వనే వసేత్,*
*భైక్షాశ్యాత్మ విశుద్ధ్యర్థం కృత్వా శవశిరోధ్వజమ్ 72*

*లక్ష్యం శస్త్రభృతాం వా స్యాద్విదుషామిచ్ఛయాత్మనః*
*ప్రాశ్యేదాత్మానమగ్నౌ వా సమిద్ధే త్రిరవాక్ఛిరాః 73*

*యజేత వాఽశ్వమేధేన స్వర్జితా గోసవనేన వా,*
*అభిజిద్విశ్వజిద్భ్యాం వా త్రివృతాగ్నిష్టుతాపి వా 74*

*జపన్ వాన్యతమం వేదం యోజనానాం శతం వ్రజేత్,*
*బ్రహ్మహత్యాపనోదాయ మితభుఙ్నియతేంద్రియః 75*

*సర్వస్వం వేదవిదుషే బ్రాహ్మణాయోపపాదయేత్,*
*ధనం వా జీవనాయాలం గృహం వా సపరిచ్ఛదమ్ 76*

*హవిష్యభుగ్వానుసరేత్ ప్రతిస్రోతస్సరస్వతీమ్,*
*జపేద్వా నియతాహార స్త్రి ర్వై వేదస్య సంహితామ్ 77*

*కృతవాపనో నివసేద్గ్రామాంతే గోవ్రజేఽపి వా,*
*ఆశ్రమే వృక్షమూలే వా గోబ్రాహ్మణ హితే రతః 78*

*బ్రాహ్మణార్థే గవార్థే వా సద్యః ప్రాణాన్ పరిత్యజేత్,*
*ముచ్యతే బ్రహ్మహత్యాయా గోప్తా గోర్బ్రాహ్మణస్య చ 79*

*త్రివారం ప్రతిరోద్ధా వా సర్వస్వమవజిత్య వా,*
*విప్రస్య తన్నిమిత్తే వా ప్రాణాలాభే విముచ్యతే 80*

బ్రహ్మహత్య చేసినవాడు పన్నెండు సంవత్సరాలు అడవిలోగుడిసెవేసికొని తలపుఱ్ఱెను చేతిలో పట్టుకొని దానిలో బిచ్చమెత్తుకుంటూ పన్నెండు సంవత్సరాలు తిరగాలి. బుద్ధిపూర్వకంగా బ్రహ్మహత్యచేస్తే బాణములకు గురియై చావాలి, లేక మండుతున్న

అగ్నిలో మూడుసార్లు తలక్రిందులుగా దూకాలి. అశ్వమేధయాగంతో కాని, సర్జిత్తు, గోసవనం, అభిజిత్తు, విశ్వజిత్తు త్రివృదగ్నిష్టోమయాగం వీటిలో ఏదైనా యాగాన్ని చేయాలి. బ్రహ్మహత్యాపాపాన్ని పోగోట్టుకొనుటకు మితంగా తింటూ, నియతేంద్రియుడై ఏదో ఒకవేదం చదువుతూ నూరు యోజనాలు నడవాలి. శ్రోత్రియుడు వేదవేత్తయైన బ్రాహ్మణునకు తన సర్వస్వం దానం చేయాలి. కాకపోతే ధనధాన్యపశుసమృద్ధిగల ఇంటినైనా దానం చేయాలి. నియతాహారం కలవాడై హవిస్సును భుజిస్తూమూడువేదాలు చదువుతూ సరస్వతీనదివరకు నడచిపోవాలి. తలకొరిగించుకొని ఊరిచివరనైనా కొట్టంలోనైనా ఆశ్రమంలోని చెట్టుక్రిందనైనా గోబ్రాహ్మణులసేవచేస్తూ పన్నెండు సంవత్సరాలు నివసించాలి. ద్వాదశవార్షిక వ్రతంతో బాధలలో ఉన్న బ్రాహ్మణుని గాని ఆవునుగాని రక్షించుటకై తనప్రాణాలు వదలాలి. ఈ విధంగా ఆవులను బ్రాహ్మణుల రక్షించేవాడు బ్రహ్మహత్యాపాతకంనుండి దూరమౌతాడు. దొంగలు మొదలైనవారు బ్రాహ్మణధనాన్నిదొంగిలిస్తే వారిని అడ్డుకొని జయించినా, ఆ కొట్లాటలో ప్రాణాలను కొల్పోయినా అతడు బ్రహ్మహత్యకు దూరమౌతాడు.

*ఏవం దృఢవ్రతో నిత్యం బ్రహ్మచారీ సమాహితః,*
*సమాప్తే ద్వాదశే వర్షే బ్రహ్మహత్యాం వ్యపోహతి 81*

ఈ విధంగా దృఢవ్రతుడై, బ్రహ్మచారిగా నుండి పన్నెండు సంవత్సరాలు గడిపితే అతడు బ్రహ్మహత్యా పాపానికి దూరమౌతాడు.

*శిష్ట్వా వా భూమిదేవానాం నరదేవసమాగమే,*
*స్వమేనోఽవభృథస్నాతో హయమేధే విముచ్యతే 82*

*ధర్మస్య బ్రాహ్మణో మూలమగ్రం రాజన్య ఉచ్యతే,*
*తస్మాత్సమాగమే తేషామేనో విఖ్యాప్య శుద్ధ్యతి 83*

రాజు అశ్వమేధయాగము చేస్తున్నప్పుడు ఋత్విక్కులందరు ఉన్నప్పుడు వారిముందు బ్రహ్మహత్య చేసినవాడు తనపాపాన్ని వారందరికి తెలిపి అవభృథస్నానసమయంలో తాను కూడ స్నానం చేస్తే తన పాపాన్ని పోగొట్టుకొంటాడు. ధర్మానికి బ్రాహ్మణుడు మూలమైతే రాజు అగ్రస్థానం ఇట్టి రాజు బ్రాహ్మణుడు ఉన్నచోట తన పాపాన్ని చెప్పుకొని బ్రహ్మహత్యా పాపాన్ని పోగొట్టుకోవాలి.

*బ్రాహ్మణస్సంభవేనైవ దేవానామపి దైవతమ్,*
*ప్రమాణం చైవ లోకస్య బ్రహ్మ త్రైవ హి కారణమ్ 84*

*తేషాం వేదవిదో బ్రూయుస్త్రయో ఽప్యేనఃసునిష్కృతిమ్,*
*సా తేషాం పావనాయ స్యాత్పవిత్రా విదుషాం హి వాక్ 85*

బ్రాహ్మణుడు పుట్టుకతోనే దేవతలకు కూడ పూజ్యుడగుచున్నాడు అతడేలోకకారణముగా కూడ ఉన్నాడు. వారిలో వేదజ్ఞులైన ముగ్గురు బ్రాహ్మణులైనను బ్రహ్మహత్యాపాపమును తొలగించుప్రాయశ్చిత్తము చెప్పెదరు. విద్వాంసుల వాక్కుచాలా పవిత్రమైనది. కావున విద్వత్పరిషత్తును పాపపరిహారార్థం అడుగాలి.

*అతోzన్యతమమాస్థాయ విధిం విప్రస్సమహితః,*
*బ్రహ్మహత్యాకృతం పాపం వ్యపోహత్యాత్మవత్తయా 86*

అందు వల్ల బ్రహ్మహత్య చేసినవాడు పై యుపాయాల్లో దేనినైనా జితేంద్రియుడై ఆశ్రయించి అపాపాన్ని పోగొట్టుకోవాలి.

*హత్వా గర్భమవిజ్ఞాతమేతదేవ వ్రతం చరేత్,*
*రాజన్యవైశ్యౌ చేజానావాత్రేయీమేవ చ స్త్రియమ్ 87*

*ఉక్త్వా చైవానృతం సాక్ష్యే ప్రతిరుధ్య గురుం తథా,*
*అపహృత్య చ నిక్షేపం కృత్వా చ స్త్రీసుహృద్వధమ్ 88*

స్త్రీ గర్భమును విచ్ఛిన్నం చేసినా, యాగం చేస్తున్న క్షత్రియునైనా, వైశ్యునైనా చంపినా ఋతుస్నాతయైన స్త్రీని చంపినా బ్రహ్మహత్యా ప్రాయశ్చిత్తాన్నే చేసికోవాలి. అట్లే తప్పుడు సాక్ష్యాలు పలికినా, గురువుపై నేరం మోపినా, నిధులను అపహరించినా, స్త్రీని స్నేహితుని చంపినా ఈ బ్రహ్మహత్యాప్రాయశ్చిత్తాన్నే చేసికోవాలి.

*ఇయం విశుద్ధిరుదితా ప్రమాప్యాకామతోద్విజమ్,*
*కామతో బ్రాహ్మణవధే నిష్కృతిర్న విధీయతే 89*

తెలియక బ్రాహ్మణ హత్య చేసిన వానికే ఇంతవరకు ప్రాయశ్చిత్తం చెప్పబడింది. తెలిసి తెలిసి బ్రాహ్మణహత్య చేస్తే ప్రాయశ్చిత్తమనేది కనిపించదు.

*సురాం పీత్వా ద్విజో మోహాదగ్నివర్ణాం సురాం పిబేత్,*
*తయా సకాయే నిర్దగే ముచ్యతే కిల్బిషాత్తతః 90*

*గోమూత్రమగ్నివర్ణం వా పిబేదుదకమేవ వా,*
*పయోఘృతం వా క్షరణాద్గోశకృద్రసమేవ వా.91*

*కణాన్వా భక్షయేదబ్దం పిణ్యాకం వా సకృన్నిశి,*
*సురాపానాపనుత్త్యర్థం వాలవాసా జటీ ధ్వజీ.92*

బ్రాహ్మణుడు మోహంతో కల్లు తాగితే ఎఱ్ఱగా కాచిన కల్లును అతని నోటిలోపోయాలి. ఆవిధంగా అతని శరీరం కాలితే అతడాపాపంనుండి విముక్తుడౌతున్నాడు. లేక ఆవుమూత్రాన్నైనా, ఆవుపాలనైనా, ఆవునేతినైనా, గోమయరసాన్నైనా సలసలకాచి చనిపోవునంతవరకు త్రాగాలి. కాకపోతే ఆవుతోక కుచ్చుతో కంబళినేయించుకొని వస్త్రంగా ధరిస్తూ జడలను ధరించి, కల్లుముంతను ముఖానికి కట్టుకొని నూవులగింజలనుగాని గానుగపిండినిగాని రాత్రి పూట మాత్రమే తింటే మద్యపాన దోషం పోతుంది.

*సురావై మలమన్నానాం పాప్మా చ మలముచ్యతే,*
*తస్మాద్బ్రాహ్మణరాజన్యే వైశ్యశ్చ న సురాం పిబేత్.93*

*గౌడీ పైష్టీ చ మాధ్వీ చ విజ్ఞేయా త్రివిధా సురా,*
*యథైవైకా తథా సర్వా న పాతవ్యా ద్విజోత్తమైః.94*

*యక్షరక్షఃపిశాచాన్నం మద్యం మాంసం సురాసవమ్,*

*తద్బ్రాహ్మణేన నాత్తవ్యం దేవానామశ్నతా హవిః.95*

*అమేధ్యే వాపతేన్మత్తో వైదికం వాప్యుదాహరేత్,*
*అకార్యమన్యత్కుర్యాద్వా బ్రాహ్మణో మదమోహతః.96*

*యస్య కాయగతం బ్రహ్మ మద్యేనాప్లావ్యతే సకృత్,*
*తస్య వ్యపైతి బ్రాహ్మణ్యం శూద్రత్వం చ స గచ్ఛతి.97*

మద్యం అన్నాలలో మలం వంటిది. ఆ మలం పాపాన్ని కలిగించేది కావున బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు మలమువంటి మద్యాన్ని తాగకూడదు. గౌడి, పైష్టి, మాధ్వి అని సురమూడు విధాలుగా ఉంటుంది. ఈ మూడు విధాలైన మద్యాలలో దేనినీ ద్విజులు త్రాగరాదు. ఈ మద్యాలు నిషిద్ధమాంసం, సుర, పులియ బెట్టి తయారు చేసిన ఆసవము ఇవన్ని యక్ష, రాక్షస, పిశాచులు తినేవి త్రాగేవి కావున దేవసంబంధమైన హవిస్సునుతినే బ్రాహ్మణుడు ఈ రాక్షసాన్నము తినరాదు. మద్యము త్రాగి మత్తుడైన బ్రాహ్మణుడు మైమరచి మలంలోనైనా పడిపోవచ్చు. వేదమంత్రాలు చదువుచూ ఉండవచ్చు. ఇంకా ఏవైన అకార్యములనన్నా చేయవచ్చును. బ్రాహ్మణశరీరంలో ఉన్న వేదవాక్యమొకసారి మద్యపానంచేతతడిస్తే అతని బ్రాహ్మణ్యం తొలగిపోతుంది. అందువల్ల మద్యపానం తగనిది.

*ఏషా విచిత్రాభిహితా సురాపానస్య నిష్కృతిః,*
*అత ఊర్ధ్వం ప్రవక్ష్యామి సువర్ణస్తేయనిష్కృతిమ్. 98*

ఇంతవరకు సురాపాన పాపానికి అనుష్ఠించాల్సిన ప్రాయశ్చిత్తాలు వివరింపబడ్డాయి. ఇక బంగారం దొంగతనం చేస్తే దానికి అనుష్టించాల్సిన ప్రాయశ్చిత్తాలు వివరింపబడుతాయి.

*సువర్ణస్తేయకృద్విప్రో రాజానమభిగమ్య తు,*
*స్వకర్మ ఖ్యాపయన్ బ్రూయాన్మా భవాననుశిస్త్వితి. 99*

*గృహీత్వాముసలం రాజా సకృద్ధన్యాత్తు తం స్వయమ్,*
*వధేన శుధ్యతి స్తేనో బ్రాహ్మణ స్తపసైవ తు.100*

*తపసాపనునుత్సుస్తు సువర్ణస్తేయజం మలమ్,*
*చీరవాసా ద్విజోఽరణ్యే చరేద్బ్రహ్మహణో వ్రతమ్.101*

ఇతరుల ఇండ్లలో బంగారాన్ని దొంగతనం చేసిన బ్రాహ్మణుడు రాజు దగ్గరకు పోయి, తాను చేసిన పాపపు పనిని ఆతని సభలో చెప్పుకొని తన్ను శిక్షింపమని వేడుకోవలెను. అప్పుడు రాజు ముసలమనే ఆయుధాన్ని తీసికొని అతనిని శిక్షించాలి. దొంగతనం చేసిన వాడు మృతుడై శుద్ధిని పొందుతాడు. అదే బ్రాహ్మణుడు దొంగతనం చేస్తే తపస్సు చేసి శుద్ధి పొందవచ్చును. బ్రాహ్మణుడు తపస్సుచేసి దొంగతనం చేసిన పాపాన్ని పోగొట్టుకొనదలచితే నారబట్టలు కట్టుకొని, అడవిలో పన్నెండు సంవత్సరాలు బ్రాహ్మహత్య చేసిన వాడు చేయు వ్రతాన్ని అనుష్ఠించాలి.

*ఏతైర్వ్రతైరపోహేత పాపం స్తేయకృతం ద్విజం,*
*గురుస్త్రీగమనీయం తు వ్రతైరేభిరపానుదేత్.102*

## ఏకాదశాధ్యాయం

బ్రాహ్మణుడీవ్రతాలను అనుష్ఠించి దొంగతనం చేసిన పాపాలను తొలగించుకోవాలి. గురుస్త్రీగమనం చేసినవాడు ఈ విధంగా ఆ పాపాన్ని తొలగించుకోవాలి.

*గురుతల్ప్యభిభాష్యైనస్తప్తే స్వప్యాదయోమయే,*
*సూర్మీం జ్వలంతీం స్వాశ్లిష్యేన్మృత్యునా స విశుద్ధ్యతి.103*

*స్వయం వా శిశ్నవృషణావుత్కృత్యాధాయ చాంజలౌ,*
*నైఋతీం దిశమాతిష్ఠేదానిపాతాదజిహ్మగః.104*

గురుభార్యతో సంగమమొనర్చినవాడు తాను చేసిన తప్పును రాజుతో చెప్పికొని బాగా కాగిన ఇనుపమంచంపై పడుకొని కాలిన ఇనుపస్త్రీ ప్రతిమను కౌగిలించుకొని చనిపోయి ఆ పాపాన్ని తొలగించుకోవాలి. లేదా తానే తన శిశ్నవృషణములను కోసికొని చేతి లో పట్టుకొని తాను చనిపోవునంతవరకు నైరుతిదిక్కు వైపు పోవలెను.

*ఖట్వాంగీ చీరవాసా వా శ్మశ్రులో విజనే వనే,*
*ప్రాజాపత్యం చరేత్కృచ్ఛ్రమబ్ధమేకం సమాహితః.105*

*చాంద్రాయణం వా త్రీన్ మాసానభ్యస్యేన్నియతేంద్రియః,*
*హవిష్యేణ యవాగ్వా వా గురుతల్పాపనుత్తయే.106*

తన భార్యఅని భ్రమించి గురుభార్యతో కూడిన వాడు తలపుఱ్ఱెను చేతిలో పట్టుకొని నారచీరలు కట్టుకొని, గడ్డం మీసం పెంచుకొని శ్రద్ధతో, నిర్జనవనంలో ఒక సంవత్సరం ప్రాజాపత్యవ్రతాన్ని ఆచరించాలి. లేక ఇంద్రియాలను నిగ్రహించుకొని మూడునెలలు చాంద్రాయణవ్రతం చేస్తు ఫలమూలాల నైనా నీవారాది ధాన్యాల కడుగునైనా ఆహారంగా తీసికోవాలి.

*ఏతైర్వ్రతైరపోహేయుర్మహాపాతకినో మలమ్,*
*ఉపపాతకినస్త్వేవమేభిర్నానావిధైర్వ్రతైః.107*

ఈ వ్రతాలననుష్ఠిస్తూ మహాపాతాలవల్ల కలిగిన పాపాన్ని పోగొట్టుకోవాలి. ఇక ఉపపాతకాలవల్ల కలిగే పాపాన్ని ఈ విధమైన ప్రాయశ్చిత్తాల ద్వారా తోలగించుకొవాలి.

*ఉపపాతకసంయుక్తో గోఘ్నో మాసం యవాన్ పిబేత్,*
*కృతవాసో వసేద్గోష్ఠే చర్మణా తేన సంవృతః.108*

*చతుర్థకాలమశ్నీయాదక్షారలవణం మితమ్,*
*గోమూత్రేణాచరేత్స్నానం ద్వౌ మాసౌ నియతేంద్రియః,109*

*దివానుగచ్ఛేద్గాస్తాస్తు తిష్ఠన్నూర్ధ్వం రజః పిబేత్,*
*శుశ్రూషిత్వా నమస్కృత్య రాత్రౌ వీరాసనం వసేత్.110*

*తిష్ఠంతీష్వనుతిష్ఠేత్తు వ్రజంతీష్వప్యనువ్రజేత్,*
*ఆసీనాసు తథాసీనో నియతో వీతమత్సరః.111*

*ఆతురామభిశస్తాం వా చౌరవ్యాఘ్రాదిభిర్భయైః,*
*పతితాం పంకలగ్నాం వా సర్వోపాయైర్విమోచయేత్.112*

*ఉష్ణే వర్షతి శీతే వా మారుతే వాతి వా భృశమ్,*
*న కుర్వీతాత్మనస్త్రాణం గోరకృత్వా తు శక్తితః.113*

*ఆత్మనో యది వాన్యేషాం గృహే క్షేత్రేऽథవా ఖలే,*
*భక్షయంతీం న కథయేత్పిబంతం చైవ వత్సకం.114*

*అనేన విధినా యస్తు గోఘ్నో గామనుగచ్ఛతి,*
*స గోహత్యాకృతం పాపం త్రిభిర్మాసైర్వ్యపోహతి.115*

గోహత్య అనే ఉపపాతకం చేసినవాడు ఒకనెలవరకు బియ్యపుగంజిని త్రాగి ఉండవలెను తరువాత క్షౌరం చేసికొని తాను చంపిన గోవుచర్మంతో శరీరాన్ని కప్పుకొని ఉప్పుకారంలేకనాల్గవకాలాన తింటూ మూడునెలలు ఆవులమందలోనే ఉండాలి. గోమూత్రంతో స్నానం చేస్తూ జితేంద్రియుడై ఉప్పుకారం లేక హవిష్యాన్ని రెండవదినం సాయంకాలం తింటూ రెండవ మూడవ నెలగడపాలి. ఈ మూడు నెలలు పగటిపూట ఉదయాన ఆవులను తోలుకొనిపోతూ నిలబడిఉండి ఆవులగిట్టల వల్లవచ్చిన దుమ్ముచే పవిత్రం కావాలి రాత్రియందాగోవులకు ఒళ్ళుగోకుటవంటి శుశ్రూషలతో గోడమొదలగువాని నానుకొనక వీరాసనం వేసి కొని కూర్చుండాలి ఇట్లు పరిశుద్ధుడై క్రోధంలేక ఆవులు నిలబడితే తాను నిలబడాలి. అవి నడుస్తూ ఉంటే వాటివెంట పోవాలి. కూర్చుంటే కూర్చోవాలి. ఆవులు రోగంతో ఉన్నా దొంగలు, పులులవాతబడ్డా, క్రిందబడ్డా, బురదలో పడ్డా వాటిని రక్షించాలి. ఎండ, వాన, చలి బాగా ఉన్నా ఆవులకు సంరక్షణ చేయక తాను రక్షణచేసికోకూడదు. అవి ఇతరుల ఇండ్లలో, పొలాల్లో మేస్తుంటే ఎవరికి చెప్పవద్దు. దూడ పాలుతాగుతున్నవిషయాన్ని ఎవరికి చెప్పకూడదు ఈ విధంగా గోహత్య చేసినవాడు మూడునెలలు గోశుశ్రూష చేస్తూ గోహత్యా పాపాన్ని పోగొట్టుకుంటాడు.

*వృషభైకాదశా గాశ్చ దద్యాత్సుచరితవ్రతః,*
*అవిద్యమానే సర్వస్వం వేదవిద్భ్యో నివేదయేత్.116*

ఈ విధంగా చక్కగా ప్రాయశ్చిత్తం చేసికోని పది ఆవులను ఒక ఆబోతును బ్రాహ్మణునకు దానం చేయాలి. అంతధనం లేకపాతే ఉన్నధనాన్ని బ్రాహ్మణులకు దానం చేయాలి.

*ఏతదేవ వ్రతం కుర్యురుపపాతకినో ద్విజాః,*
*అవకీర్ణివర్జ్యం శుద్ధ్యర్థం చాంద్రాయణమథాపి వా.117*

ఒక్క అవకీర్ణితప్ప తక్కిన ఉపపాతకాలు చేసిన వారంతా తమపాపం తొలగటానికి ఇదే ప్రాయశ్చిత్తం చేసికొవాలి. లేదా చాంద్రాయణవ్రతాన్ని ఆచరించాలి.

*అవకీర్ణీ తు కాణేన గర్దభేన చతుష్పథే,*
*పాకయజ్ఞవిధానేన యజేత నిర్ఋతిం నిశి.118*

*హుత్వాగ్నౌ విధివద్ధోమానంతతశ్చ సమేత్యృచా,*
*వాతేంద్రగురువహ్నీనాం జుహుయాత్సర్పిషాహుతీః.119*

*కామతో రేతస్సేకం వ్రతస్థస్య ద్విజన్మనః,*
*అతిక్రమం వ్రతస్యాహుర్ధర్మజ్ఞా బ్రహ్మవాదినః.120*

*మారుతం పురుహూతం చ గురుం పావక మేవ చ,*
*చతురో వ్రతినోఽభ్యేతి బ్రాహ్మం తేజోఽవకీర్ణినః.121*

*ఏతస్మిన్నేనసి ప్రాప్తే వసిత్వా గర్దభాజినమ్,*
*సప్తాగారాంశ్చరేద్భైక్షం స్వకర్మ పరికీర్తయన్.122*

*తేభ్యో లబ్ధేన భైక్షేణ వర్తయన్నేక కాలికం,*
*ఉపస్పృశం స్త్రీషవణం త్వబ్దేన స విశుద్ధ్యతి.123*

అవకీర్ణియైనవాడు కన్ను కాయగాచిన గాడిదయొుక్క వనతో నాలుగు త్రోవలకూడలిలో పాకయజ్ఞతంత్రంలో ఉన్నట్లు నిర్‌రుతిని గూర్చి రాత్రిపూట హోమంచేయాలి. ఇట్లు శాస్త్రప్రకారం హెూమంచేసి తరువాత 'సంమాసించన్తుమరుతః' అనే బుక్కుతో వాయువు, ఇంద్రుడు, బృహస్పతి, అగ్ని దేవతలకు నేతితో హోమం చేయాలి. అవకీర్ణియనగా బ్రహ్మచర్యవ్రతాన్ని పూని స్త్రీసంగమము చేయుద్విజుడు. అవకీర్ణి తాను చేసిన వేదాధ్యయన, నియమానుష్ఠానంవల్ల కలిగిన బ్రహ్మతేజస్సు అతనిని వదిలి వాయువు, ఇంద్రుడు, బృహస్పతి, అగ్ని అను దేవతలను పొందుతున్నది. అందువల్ల అవకీర్ణి తాను చేసిన వేదాధ్యయన నియమానుష్ఠానంవల్ల కలిగిన బ్రహ్మతేజస్సుపొందుట కాయాదేవతలగూర్చి ఆజ్యహోమం చేయాలి. ఈ అవకీర్ణిగర్దభ వపాహోమంచేసి,గర్దభచర్మాన్ని ధరించి నేనవకీర్ణినని చెప్పుకొనుచు ఏడిండ్లుతిరిగి బిచ్చమెత్తుకోవలెను. అట్లు లభించిన బిచ్చంతో ఒకే కాలం భోజనం చేస్తూ త్రిసంధ్యలలో స్నానం చేస్తూ సంవత్సరంగడిపితే అతడు పరిశుద్ధుడౌతాడు.

*జాతిభ్రంశకరం కర్మ కృత్వాన్యతమమిచ్ఛయా,*
*చరేత్సాంతపనం కృచ్ఛ్రం ప్రాజాపత్యమనిచ్ఛయా.124*

*సంకరాపాత్రకృత్యాసు మాసం శోధనమైందవమ్,*
*మలినీకరణీయేషు తప్తస్స్యాద్యావకైస్త్ర్యహమ్.125*

తాను బుద్ధిపూర్వకంగా జాతిభ్రంశాన్ని కలిగించు ఏదైనా పని చేస్తేసాంతపనమనే ప్రాయశ్చిత్తాన్ని చేసికోవాలి. అసంకల్పితంగా పాపం చేస్తే ప్రాజాపత్య కృచ్ఛ్రాన్ని చేయాలి. సంకరీకరణం, అపాత్రీకరణం అనే కర్మలకు ఒకనెలచాంద్రాయణవ్రతాన్ని చేయాలి. మలినీకరణాలను బుద్ధిపూర్వకంగా చేస్తే మూడు రాత్రులు కాగుతున్న బియ్యపుగంజి త్రాగాలి.

*తురీయో బ్రహ్మహత్యాయాః క్షత్రియస్య వధే స్మృతః,*
*వైశ్యేఽష్టమాంశో వృత్తస్థే శూద్రే జ్ఞేయస్తు షోడశః.126*

*అకామతస్తు రాజన్యం వినిపాత్య ద్విజోత్తమః,*
*వృషభైకసహస్రాగా దద్యాత్సుచరితవ్రతః.127*

*త్ర్యబ్దం చరేద్వానియతో జటీ బ్రహ్మహణో వ్రతమ్,*
*వసన్ దూరతరే గ్రామాద్వృక్షమూలనికేతనః.128*

బుద్ధిపూర్వకంగా క్షత్రియుణ్ణి చంపితే బ్రహ్మహత్యా ప్రాయశ్చిత్తంలో అంటే మూడు సంవత్సరాలు ప్రాయశ్చిత్తం ఆచరించాలి. బుద్ధిపూర్వకంగా వైశ్యుని చంపితే బ్రహ్మహత్యలో ఎనిమిదవ వంతు అనగా ఒకటిన్నర సంవత్సరం, శూద్రుని బుద్ధిపూర్వకంగా చంపితే పదహారవవంతు అనగా తొమ్మిది నెలలు ప్రాయశ్చిత్తం చేసికోవాలి. బ్రాహ్మణోత్తముడు తెలియక రాజును చంపితే వేయి ఆవులను ఒక ఆబోతును బ్రాహ్మణులకు దానమీయాలి. అట్లు కాకపోతే జితేంద్రియుడై జడలు దాల్చి ఊరివెలుపల చెట్టుక్రింద ఉంటూ మూడు సంవత్సరాలు బ్రహ్మహత్యావ్రతాన్ని ఆచరించాలి.

*ఏతదేవ చరేదబ్దం ప్రాయశ్చిత్తం ద్విజోత్తమః,*
*ప్రమాప్య వైశ్యం వృత్తస్థం దద్యాచ్చైకశతంగవామ్.129*

*ఏతదేవ వ్రతం కృత్స్నం షణ్మాసాచ్ఛూద్రహా చరేత్,*
*వృషభైకాదశా వాపి దద్యాద్విప్రాయ గాస్సితాః.130*

మంచి నడవడిగల వైశ్యుని బ్రాహ్మణుడు తెలియక చంపితే ఆరు నెలలు బ్రాహ్మహత్యా వ్రతాన్ని అనుష్ఠించి నూటొక్క ఆవులను దానం చేయాలి. ఇదే విధంగా తెలియక శూద్రుని చంపితే ఆరునెలలు బ్రహ్మహత్యా వ్రతాన్ని బ్రాహ్మణుడు చేయాలి పైగా పది ఆవులను ఒక ఆబోతును బ్రాహ్మణులకు దానం చేయాలి.

*మార్జారనకులౌ హత్వా చాషం మండూకమేవ చ,*
*శ్వగోధోలూకకాకాంశ్చ శూద్రహత్యావ్రతం చరేత్.131*

*పయఃపిబే త్త్రిరాత్రం వా యోజనం వాऽధ్వనో వ్రజేత్,*
*ఉపస్పృశేత్స్రవంత్యాం వా సూక్తం వాऽబ్దైవతం జపేత్.132*

*అభ్రిం కార్ష్ణాయసీం దద్యాత్సర్పం హత్వా ద్విజోత్తమః,*
*పలాలభారకం షండే సైసకం చైకమాషకమ్.133*

*ఘృతకుంభ ం కరాహేతు తిలద్రోణం తు తిత్తిరౌ,*
*శుకే ద్విహాయనం వత్సం క్రౌంచం హత్వా త్రిహాయనమ్.134*

*హత్వా హంసం బలాకాం చ బకం బర్హిణమేవ చ,*
*వానరం శ్యేనభాసౌ చ స్పర్శయేద్బ్రాహ్మణాయ గామ్.135*

*వాసో దద్యాద్ధయం హత్వా పంచ నీలాన్ వృషాన్ గజమ్,*
*అజమేషావనడ్వాహం ఖరం హత్వైకహాయనమ్.136*

బ్రాహ్మణుడు పిల్లి, ముంగిస, పాలపిట్ట, కప్ప, కుక్క ఉడుము, గూబ, కాకి వీని చంపినచో,శూద్రహత్యాప్రాయశ్చిత్తమునాచరించవలెను. బుద్ధిపూర్వకంగా వీటిని చంపినచో మూడు రాత్రులు పాలే ఆహారంగా తీసుకోవాలి, లేదా ప్రతి దినమొక యోజనం నడవాలి. కాకపోతే మూడు రోజులు నదిలో స్నానం చేయాలి. అదీ వీలుకాకపోతే జలదేవతాకమైన

ఆపోహిష్ఠామయోభువః అనే మంత్రాన్ని జపించాలి. అట్లే బ్రాహ్మణుడు పామును చంపితే వాడిమొనగల ఇనుపదండాన్ని బ్రాహ్మణునికి దానం చేయాలి. నపుంసకుని చంపితే గడ్డిమోపును, మాడెత్తు సీసపు పాత్రను దానంచేయాలి. పందిని చంపితేనేతితో నిండిన పాత్రను, తిత్తిరి పక్షిని చంపితే నాలుగు తూముల నూవులు, చిలుకను చంపినచో రెండు సంవత్సరాల దూడను, క్రౌంచపక్షిని చంపితే మూడు సంవత్సరాల దూడను, హంసను, బెగ్గురుపక్షిని, కొంగను, నెమలిని, కోతిని డేగను గద్దను, వీటిలో ఏ ఒక్కదానిని చంపితే గోదానాన్ని చేయాలి. గుఱ్ఱాన్ని చంపితే వస్త్రదానం చేయాలి. ఏనుగును చంపితే ఐదునల్లని ఎద్దులు దానం చేయాలి. మేకపోతును చంపితే వృషభాన్ని, గాడిదను చంపితే ఒక సంవత్సరం ఉన్న దూడను దానం చేయాలి.

*క్రవ్యాదాంస్తు మృగాన్ హత్వా ధేనుం దద్యాత్పయస్వినీమ్,*
*అక్రవ్యాదాన్వత్సతరీముష్ట్రం హత్వా తు కృష్ణలమ్.137*

*జీనకార్ముక బస్తావీన్ పృథగ్దద్యాద్విశుద్ధయే,*
*చతుర్ణామపి వర్ణానాం నారీర్హత్వాఽనవస్థితాః.138*

పచ్చి మాంసం తినే పులిమొదలైన వాటిని చంపితే పాడిగల ఆవును దానంచేయాలి. పచ్చి మాంసం తినని మృగాలను చంపితే పెద్ద దూడను, ఒంటెను చంపితే ఒక గురిగింజ ఎత్తు బంగారాన్ని, వ్యభిచారం చేసే బ్రాహ్మణ స్త్రీని చంపితే గుఱ్ఱం జీనును, అట్టి క్షత్రియ స్త్రీని చంపితే ధనుస్సును అట్టి వైశ్య స్త్రీని చంపితే మేకను, అటువంటి శూద్ర స్త్రీని చంపితే పొట్టేలును దానం చేయాలి. పై త్రిజాతి స్త్రీలను అనాలోచితంగా చంపితే ఆ బ్రాహ్మణుడు శూద్రహత్య చేసినప్పటి ప్రాయశ్చిత్తాన్ని చేసికోవాలి.

*దానేన వధనిర్ణేకం సర్పాదీనామశక్నువన్,*
*ఏకైకశశ్చరేత్కృచ్ఛ్రం ద్విజః పాపాపనుత్తయే.139*

సర్పాదులను చంపి దానం చేసి తత్ప్రాయశ్చిత్తం చేసికో లేకపోతే ఆ ప్రాయశ్చిత్తపరిహారార్థం ప్రాజాపత్య కృచ్ఛ్రాన్ని చేయాలి.

*అస్థిమతాం తు సత్త్వానాం సహస్రస్యప్రమాపణే,*
*పూర్ణే చానస్యనస్థ్నాం తు శూద్ర హత్యావ్రతం చరేత్.140*

*కించిదేవ తు విప్రాయ దద్యాదస్థిమతాం వధే,*
*అనస్థ్నాం చైవ హింసాయాం ప్రాణాయామేన శుధ్యతి. 141*

ఎముకలు గల తొండలవంటి వేయి జంతువుల్ని చంపినప్పుడు ఎముకలు లేని నల్లి వంటి ప్రాణులను బండెడన్ని చంపినప్పుడు శూద్రవధ ప్రాయశ్చిత్తాన్ని చేసికోవాలి. ఎముకలు గల జంతువులనుచంపి ప్రాయశ్చిత్తం చేసికొంటున్నప్పుడు బ్రాహ్మణునికి కొంత ద్రవ్యాన్ని దానం చేయాలి. అట్లే ఎముకలు లేని జంతువులను చంపినప్పుడు ప్రాణాయామం కూడ చేసి ప్రాయశ్చిత్తం చేసికోవాలి.

*ఫలదానాం తు వృక్షాణాం ఛేదనే జప్యమృక్శతమ్,*
*గుల్మవల్లీలతానాం చ పుష్పితానాం చ వీరుధామ్.142*

*అన్నాద్యజానాం సత్త్వానాం రసజానాం చ సర్వశః,*
*ఫలపుష్పోద్భవానాం చ ఘృతప్రాశో విశోధనమ్.143*

*కృష్ణజానామోషధీనాం జాతానాం చ స్వయం వనే,*
*వృథాలంభేऽనుగచ్ఛేద్గాం దినమేకం పయోవ్రతః.144*

ఫలములిచ్చు చెట్లను పొదలను,తీగలను, పూలచెట్లను పడగొడ్తే గాయత్రి మొదలైన నూరు మంత్రాల్ని జరిపించాలి. అన్నాదులందు పుట్టినవి. బెల్లం మొదలైన రసద్రవ్యాల్లో పుట్టిన, అత్తిమొదలైన కాయలు, ఇప్పమొదలైన పువ్వుల్లో పుట్టినవి ఐన పురుగులను చంపిన పాపము నేతిని ఆపోశనంగా తీసికొంటేపోతుంది. దున్నినందు వల్ల పుట్టిన సస్యాలను, తనంతట తానే మొలచిననివ్వరి ధాన్యం వంటి ధాన్యాలను నిష్ప్రయోజనంగా పీకితే పాలు మాత్రం ఆహారంగా తీసికొని ఆవువెంట దినమంతా ఉండాలి.

*ఏతైర్వ్రతైరపోహ్యం స్యాదేనో హింసాసముద్భవమ్,*
*జ్ఞానాజ్ఞానకృతం కృత్స్నం శృణుతానాద్యభక్షణే. 145*

ఈ పైన చెప్పిన వ్రతాలననుష్ఠించి తెలిసి తెలియక చేసిన ప్రాణహింస వల్ల కలిగిన పాపాన్ని పోగొట్టుకోవాలి. ఇక తిన తగని వస్తువులను భక్షిస్తే కలిగే పాపాన్ని పోగొట్టుకోవటానికి చేయాల్సిన వ్రతాలను వివరిస్తున్నాను.

**అభక్షణభక్షణప్రాయశ్చిత్తంః-**

*అజ్ఞానాద్వారుణీం పీత్వా సంస్కారేణైవ శుధ్యతి,*
*మతిపూర్వమనిర్దేశ్యం ప్రాణాంతికమితి స్థితిః.146*

*అపస్సురాభాజనస్థా మద్యభాండస్థితా స్తథా,*
*పంచరాత్రం పిబేత్పీత్వా శంఖపుష్పీశ్రితం పయః.147*

*స్పృష్ట్వా దత్వాచ మదిరాం విధివత్ప్రతిగృహ్య చ,*
*శూద్రోచ్ఛిష్టాశ్చ పీత్వాపః కుశవారి పిబేత్ర్యహమ్.148*

*బ్రాహ్మణస్తు సురాపస్య గంధమాఘ్రాయ సోమపః,*
*ప్రాణానప్సు త్రిరాయమ్య ఘృతం ప్రాశ్య విశుధ్యతి.149*

*అజ్ఞానాత్ప్రాశ్య విణ్మూత్రం సురాసంస్పృష్టమేవ చ,*
*పునస్సంస్కారమర్హంతి త్రయో వర్ణాద్విజాతయః.150*

*వపనం మేఖలా దండో భైక్షచర్యా వ్రతాని చ,*
*నివర్తంతే ద్విజాతీనాం పునస్సంస్కారకర్మణి.151*

*అభోజ్యానాం తు భుక్త్వాన్నం స్త్రీశూద్రోచ్ఛిష్టమేవ చ,*
*జగ్ధ్వా మాంసమభక్ష్యం చ సప్తరాత్రం యవాన్ పిబేత్.152*

తెలియక మద్యాన్ని బ్రాహ్మణుడు తాగితే మరల ఉపనయన సంస్కారం వల్ల

పరిశుద్ధుడౌతాడు. బుద్ధి పూర్వకంగా దాన్ని తాగితే ప్రాణత్యాగమే దానికి తగిన ప్రాయశ్చిత్తం. పైష్ఠియనేసురాపాత్రలోను, తదితర మద్య పాత్రలలోను ఉన్ననీటిని త్రాగినవాడు ఐదుదినాలు శంఖపుష్టి అనే ఓషధి చేర్చి కాచిన పాలను త్రాగాలి. మద్యాన్ని తాకినా, ఇతరులకిచ్చినా, మంత్ర పూర్వకంగా తీసికొన్నా, శూద్రుడు తాగగా మిగిలిన నీటిన తాగినా, మూడు దినాలు దర్భచేర్చికాగబెట్టిన నీటిని తాగాలి. సోమయాగం చేసిన బ్రాహ్మణుడు మద్యపానం చేసిన వాని ముఖగంధాన్ని వాసన చూస్తే నీటిమధ్య మూడు ప్రాణాయామాలు చేసి, నేతిని తాగినచో అతడు పరిశుద్ధుడౌతాడు. తెలియక మద్యం, సురల రసం కలిసిన అన్నాదులరసాన్ని త్రాగిన బ్రాహ్మణాది ద్విజాతులు ముగ్గురు పునరుపనయనం చేతనే పరిశుద్ధులౌతారు. క్షౌరం, మౌంజిని ధరించుట, దండం ధరించుట, భిక్షాటనం బ్రహ్మచారివ్రతం వీటిని రెండవ ఉపనయన, సమయంలో మళ్ళీ ఆచరించాల్సిన పనిలేదు. అభోజ్యులైన వారి అన్నం తిన్నా, స్త్రీలు, శూద్రులు తినగా మిగిలిన దాన్ని తిన్నా, తినకూడని జంతువుల మాంసాన్ని తిన్నా ఏడురాత్రులు కాగుతున్న యవలగంజిని త్రాగాలి.

*శుక్తాని చ కషాయాంశ్చ పీత్వామేధ్యాన్యపి ద్విజః,*
*తావద్భవత్యప్రయతో యావత్తన్న వ్రజత్యధః.153*

*విడ్వరాహఖరోష్ట్రాణాం గోమాయోః కపికాకయోః,*
*ప్రాశ్య మూత్రపురీషాణి ద్విజశ్చాంద్రాయణం చరేత్.154*

*శుష్కాణి భుక్త్వా మాంసాని భౌమాని కవకాని చ,*
*అజ్ఞానం చైవ సూనాస్థమేతదేవ వ్రతం చరేత్.155*

*క్రవ్యాదసూకరోష్ట్రాణాం కుక్కుటానాం చ భక్షణే,*
*నరకాకఖరాణాం చ తప్తకృచ్ఛ్రం విశోధనమ్.156*

*మాసికాన్నం తు యోऽశ్నీయా దసమావర్తకో ద్విజః,*
*స త్రీణ్యహా న్యుపవసేదేకాహం చోదకే వసేత్.157*

స్వభావంగా తియ్యగా ఉండి చాలా కాలమున్నందు వల్ల లేక నీరు పోసినందువల్ల పులిసే వస్తువులు, సలసల కాచిన నిషిద్ధాలు కాని కషాయాలు, ద్విజుడు తింటే అవి జీర్ణమయ్యే వరకు అతడు అపరిశుద్ధుడే. ఊరపంది, గాడిద, ఒంటె, నక్క, కోతి, కాకి వీటి మలమూత్రాలను ద్విజుడు తెలియక తిన్నా చాంద్రాయణ వ్రతాన్ని ఆచరించాలి. ఎండబెట్టిన మాంసాన్ని, భూమిలో మొలిచే గోంగూర వంటి ఆకులను, జింకమాంసాన్ని, తెలియని మాంసాన్ని, కటికవాని దగ్గరినుండి తెచ్చిన మాంసాన్ని తిన్నచో ద్విజుడు చాంద్రాయణవ్రతాన్ని ఆచరించాలి. మాంసం తినే జంతువులు, ఊరపంది, ఒంటె, కోడి, కాకి, గాడిద, వీని మాంసాన్ని బుద్ధి పూర్వకంగా తింటే తప్తకృచ్ఛ్రమనే ప్రాయశ్చిత్తాన్ని చేసికోవాలి. సమావర్తన వ్రతాన్ని ఆచరింపని బ్రహ్మచారి మాసిక శ్రాద్ధమునకు సంబంధించిన భోజనాన్ని తింటే మూడు దినాలుపవాసముండి ఒక దినం నీటిలోనే ఉండాలి.

*బ్రహ్మచారీ తు యోऽశ్నీయా న్మధు మాంసం కథంచన,*
*స కృత్వా ప్రాకృతం కృచ్ఛ్రం వ్రతశేషం సమాపయేత్.158*

*బిడాలకాకాఖూచ్ఛిష్టం జగ్ధ్వా శ్వనకులస్య చ,*
*కేశకీటావపన్నం చ పిబేద్బ్రహ్మ సువర్చలామ్.159*

*అభోజ్యమన్నం నాత్తవ్య మాత్మన శ్శుద్ధిమిచ్ఛతా,*
*అజ్ఞానభుక్తం తూత్తార్యం శోధ్యం వాప్యాశు శోధనైః.160*

బ్రహ్మచారి, మధు, మాంసాలను భుజిస్తే ప్రాజాపత్య కృచ్ఛ్రాన్ని ఆచరిం
బ్రహ్మచర్య వ్రతాన్ని పూర్తి చేయాలి. పిల్లి,కాకి, కోడి, ముంగిస, నీటి ఎంగిలి అన్నాని
వెంట్రుకలు, పురుగులు పడిన అన్నాన్ని, తింటే దర్భలు వేసి సలసల కాచిన నీటిని తాగాలి
పరిశుద్ధంగా ఉండాలని అనుకొనేవాడు తినరాని అన్నాన్ని తినకూడదు. అట్లు తెలియ
తింటే దాన్ని వాంతి చేసికోవాలి లేక ప్రాయశ్చిత్తం చేసికొని పాపపరిహారం చేసికోవాలి.

*ఏషోఽనాద్యాదనస్యోక్తో వ్రతానాం వివిధో విధిః,*
*స్తేయదోషాపహర్తౄణాం వ్రతానాం శ్రూయతాం విధిః.161*

ఇంతవరకు తినకూడని వస్తువులు తింటే చేసికోవాల్సిన ప్రాయశ్చిత్తాల
వివరింపబడ్డాయి. ఇక వివిధాలైన దొంగతనాలకు చేయాల్సిన ప్రాయశ్చిత్తాల
వివరింపబడుతాయి.

స్తేయప్రాయశ్చిత్తంః-

*ధాన్యాన్నధనచౌర్యాణి కృత్వా కామాద్ద్విజోత్తమః,*
*స్వజాతీయగృహాదేవ కృచ్ఛ్రాబ్దేన విశుద్ధ్యతి.162*

*మనుష్యాణాం తు హరణే స్త్రీణాం క్షేత్రగృహస్య చ,*
*కూపవాపీజలానాం చ శుద్ధిశ్చాంద్రాయణం స్మృతమ్.163*

*ద్రవ్యాణామల్పసారాణాం స్తేయం కృత్వాఽన్యవేశ్మతః,*
*చరేత్సాంతపనం కృచ్ఛ్రం తన్నిర్యాత్యాత్మశుద్ధయే.164*

*భక్ష్యభోజ్యాపహరణే యానశయ్యాసనస్యచ,*
*పుష్పమూలఫలానాం చ పంచగవ్యం విశోధనమ్.165*

బుద్ధిపూర్వకంగా ధాన్యాన్ని, అన్నాన్ని, ధనాన్ని ద్విజుడు తన జాతివాని ఇం
నుండి దొంగిలిస్తే ఒక సంవత్సరం వరకు ప్రాజాపత్య కృచ్ఛ్రాన్ని ఆచరించాలి. మనుష్యు
స్త్రీలు, పొలాలు, ఇండ్లు, బావి, దిగుడు బావినీటిని మెలమెల్లగా దొంగిలిస్తే చాంద్రాయ
వ్రతమే ఆచరించాలి. తక్కువ విలువ ఉన్న వస్తువులను దొంగతనం చేస్తే ఆ వస్తువుల
యజమానికప్పగించి ఆత్మశుద్ధికై సంతపనమనే కృచ్ఛ్రప్రాయశ్చిత్తాన్ని చేసికోవాలి. భక్ష
భోజ్యాలను దొంగతనం చేస్తే, రథాలు మొదలైన వాటిని, పాన్పులు, పీటలు,పుష్పా
గడ్డ వస్తువులు, పండ్లు వీటిలో దేన్ని అపహరించినా పంచగవ్యంతో పరిశుద్ధి చేసికోవా

*తృణకాష్ఠద్రుమాణాం చ శుష్కాన్నస్య గుడస్య చ,*
*చేలచర్మామిషాణాం చ త్రిరాత్రం స్యాదభోజనమ్.166*

*మణిముక్తాప్రవాళానా తామ్రస్య రజతస్య చ,*
*అయఃకాంస్యోపలానాం చ ద్వాదశాహం కణాన్నతా.167*

*కార్పాసకీటజోర్ణానాం ద్విశఫైకశఫస్య చ,*
*పక్షిగంధౌషధీనాం చ రజ్జ్వాశ్చైవ త్ర్యహం పయః.168*

గడ్డి, కట్టెలు, బియ్యం, బెల్లం, బట్టలు, తోళ్ళు, మాంసం వీటిలో దేన్ని దొంగతనం చేసినా మూడు రాత్రులవరకు ఉపవాసం చేయాలి. మణులు, ముత్యాలు, పగడాలు, రాగి, వెండి, ఇనుము, కంచు వీటిలో దేన్నైనా అపహరిస్తే అన్నిదినాలు బియ్యం నూకలు తినాలి. దూది, పట్టు బట్టలు, చీలినగిట్టలు, చీలని గిట్టలు కలజంతువులు, పక్షులు, సుగంధ ద్రవ్యాలు, ఓషధులు, తాళ్ళు వీనిలో దేనిని అపహరించినా ప్రాయశ్చిత్తంగా మూడు రోజులు పాలే ఆహారంగా తీసికొవాలి.

*ఏతైర్వ్రతైరపోహేత పాపం స్తేయకృతం ద్విజః,*
*అగమ్యాగమనీయం తు వ్రతై రేభిరపానుదేత్.169*

ఈ పద్ధతులననుసరించి నానావిధములైన దొంగతనాలవల్ల ఏర్పడు పాపాన్ని పోగొట్టుకోవాలి. ఇక పొందతగని స్త్రీని పొందిన కలుగు పాపాలకు ప్రాయశ్చిత్తాలు వివరిస్తాను.

*గురుతల్పవ్రతం కుర్యాద్రేతస్సిక్త్వా స్వయోనిషు,*
*సఖ్యుః పుత్రస్య చ స్త్రీషు కుమారీష్వంత్యజాసు చ.170*

*పైతృష్వసేయీం భగినీం స్వస్రీయాం మాతురేవ చ,*
*మాతుశ్చ భ్రాతు స్తనయాం గత్వా చాంద్రాయణం చరేత్.171*

తోడ పుట్టిన అక్కా చెల్లెండ్లు, స్నేహితుని భార్య, కోడలు, కన్యలు, శూద్ర స్త్రీలతో వ్యభిచారం చేసిన వాడు గురుతల్పగుడు చేయు ప్రాయశ్చిత్తాన్ని చేయాలి. మేనత్త కూతురు, చిన్నమ్మ, పెద్దమ్మ బిడ్డలు, మేనకోడలు, మేన మామ కూతురు వీరిని పొందితే చెల్లెలితో రంకులాడిన వానికి కలుగు పాపముంటుంది కావున చాంద్రాయణ వ్రతమాచరించాలి.

*న తాస్త్రిస్తు భార్యార్థే నోపయచ్ఛేత్తు బుద్ధిమాన్,*
*జ్ఞాతిత్వేనాను పేయాస్తాః పతతి హ్యుపయన్నధః.172*

*అమానుషీషు పురుష ఉదక్యాయామయోనిషు,*
*రేతస్సిక్త్వా జలే చైవ కృచ్ఛ్రం సాంతపనం చరేత్.173*

*మైథునం తు సమాసేవ్య పుంసి యోషితి వా ద్విజః,*
*గోయానేzప్సు దివా చైవ సవాసాస్స్నానమాచరేత్.174*

*చండాలాంత్యస్త్రియో గత్వా భుక్త్వా చ ప్రతిగృహ్య చ,*
*పతత్యజ్ఞానతో విప్రో జ్ఞానాత్సామ్యం తు గచ్ఛతి.175*

పైన జెప్పిన మేనత్త కూతురు. పినతల్లి, పెదతల్లి కూతురు, మేనమామ కూతురు వీరు దాయాదులు కావున వీరిని వివాహం చేసికొన్నచో అధోలోకాన్ని పొందుతాడు. ఆవు తప్ప తక్కిన జంతువులందు, రజస్వలయైన స్త్రీయందు, ఇతర స్థలాలలోను, నీటిలోను

పురుషుడు తన శుక్రాన్ని వదిలితే సాంతపనమనే కృచ్ఛ్రాన్ని ఆచరించాలి. బండ్లు మొదలగు స్థలాలలో, పగటిపూట, నీటి లోపల మైథునం చేసినవాడు తాను ధరించియున్న వస్త్రములతో స్నానము చేసి పరిశుద్ధుడు కావలెను. బ్రాహ్మణుడజ్ఞానంతో చండాల స్త్రీని, శూద్ర స్త్రీని పొంది, వారి అన్నాన్ని తిని, వారిచ్చింది తీసికొన్నచో అతడు పతితుడౌతాడు. అప్పుడతడు పతితునికి విధించిన ప్రాయశ్చిత్తము చేసికోవలెను. లేక బుద్ధిపూర్వకంగా వారితో పోతే సజాతి స్త్రీలతో పోయినప్పుడు చేసికొన్నట్లు చంద్రాయణవ్రతాన్ని ఆచరించాలి.

*విప్రదుష్టాం స్త్రియం భర్తా నిరుంధ్యాదేక వేశ్మని,*
*యత్పుంసః పరదారేషు తచ్చైనాం చారయేద్వ్రతమ్.176*

*సా చేత్పునః ప్రదుష్యేత్తు సదృశేనోపయంత్రితా,*
*కృచ్ఛ్రం చాంద్రాయణం చైవ తదస్యాః పావనం స్మృతమ్.177*

*యత్కరోత్యేకరాత్రేణ వృషలీసేవనాద్ద్విజః,*
*తద్భైక్షభుగ్జపన్నిత్యం త్రిభిర్వర్షైర్వ్యపోహతి.178*

వ్యభిచారం చేస్తున్న భార్యను ఒక ఇంట్లో ఉంచి బంధించాలి. ఆమెతో పరదారగమనం చేసినవాడు చేయు ప్రాయశ్చిత్తాన్ని చేయించాలి. ఆ విధంగా ప్రాయశ్చిత్తం చేసికొని కూడ తమ కులం వానితో వ్యభిచారం చేస్తే ఆ పాపపరిహారార్థమై చాంద్రాయణవ్రతాన్ని చేయించాలి. బ్రాహ్మడొక రాత్రి చండాల స్త్రీతో పోయి సంపాదించుకొన్న పాపాన్ని భిక్షాన్నముచే బ్రతుకుచు, గాయత్రి మంత్రాన్ని మూడు సంవత్సరాలు జపిస్తూ ఉన్నందువల్ల పోగొట్టుకొంటాడు.

*ఏషాం పాపకృతాముక్తా చతుర్ణామపి నిష్కృతిః,*
*పతితైస్సంప్రయుక్తానామిమాః శృణుత నిష్కృతీః.179*

*సంవత్సరేణ పతతి పతితేన సహాచరన్,*
*యాజనాధ్యాపనాద్యౌనాన్నతు యానాసనాశనాత్.180*

*యో యేన పతితేనైషాం సంసర్గం యాతి మానవః,*
*స తస్యైవ వ్రతం కుర్యాత్తత్సంసర్గవిశుద్ధయే.181*

ఇంతవరకు హింస, అభక్ష్య భక్షణం, దొంగతనం, అగమ్యా గమనం, అనే నాలుగు పాపాలకు ప్రాయశ్చిత్తాలు చెప్పబడ్డాయి. పతితులతో కలిసి తిరిగేవాడు చేయాల్సిన ప్రాయశ్చిత్తాలివి. ఒకే బండిలో, ఒకే ఆసనంలో కూర్చుండుట, ఒకే పంక్తిలో తినుట అనే దోషాలున్న వారితో కలిసి తిరిగినవాడు ఒక సంవత్సరంలోనే పతితుడౌతాడు. వేదాధ్యాపనం, పెండ్లి వీటి ద్వారా పతితులైన వారితో కలిసి తిరుగువాడు వెంటనే పతితుడౌతాడు. తానెట్టి పతితునితో కలిసి తిరిగితే ఆ పతితుడు చేయవలసిన ప్రాయశ్చిత్తాన్ని చేస్తే పాపదూరుడౌతాడు.

*పతితస్యోదకం కార్యం సపిండైర్బాంధవైస్సహ,*
*నిందితేఽహని సాయాహ్నే జ్ఞాత్యృత్విగ్గురుసన్నిధౌ.182*

*దాసీ ఘటమపాం పూర్ణం పర్యస్యేత్ప్రేతవత్పదా,*
*అహోరాత్రముపాసీరన్నశౌచం బాంధవైస్సహ.183*

*నివర్తేరంశ్చ తస్మాత్తు సంభాషణసహాసనే,*
*దాయాద్యస్య ప్రదానం చ యాత్రా చైవ హి లౌకికీ.184*

*జ్యేష్ఠతా చ నివర్తేత జ్యేష్ఠావాప్యం చ యద్ధనమ్,*
*జ్యేష్ఠాంశం ప్రాప్నుయాచ్చాస్య యవీయాన్ గుణతోZ ధికః.185*

పతితుడైవానికి అతని సపిండులు, బంధువులు, ఊరిబయట జ్ఞాతి, ఋత్విక్, గురువుల సమీపంలో శూన్య తిథియైన నవమి సాయంకాలాన ప్రేత కార్యాలు, ఉదక దానం, పిండప్రదానం వంటి కార్యాలు చేయాలి. దాసీ స్త్రీ పెట్టిన నీళ్ళ కుండను ప్రేతవలె దక్షిణాభిముఖంగా ఉంచి దానిలో ఉన్న నీళ్ళు కారిపోయేటట్లు కాలితో తన్నాలి. అతని సపిండులంతా ఒకే దినం అశౌచాన్ని పాటించాలి. సపిండాదులా పతితునితో మాట్లాడుట, ఒక ఆసనంపై కూర్చొనుట, అప్పిచ్చుట, శ్రాద్ధాదులందు నిమంత్రణ చెప్పుట వంటి లౌకిక వ్యవహారాల్ని చేయరాదు. అట్టి పతితుడు వయస్సులో పెద్దవాడైనా పెద్ద వానికిచ్చే గౌరవమర్యాదలు ఇవ్వవద్దు. అట్లే జ్యేష్ఠునికి ఇవ్వాల్సిన ఉద్ధరాంశాన్ని కూడ ఇవ్వనక్కరలేదు. పైగా ఇతని తమ్ముడు సుగుణవంతుడైతే అతనికే జ్యేష్ఠుని ఉద్ధరాంశాన్ని ఇవ్వాలి.

*ప్రాయశ్చిత్తే తు చరితే పూర్ణకుంభమపాం నవమ్,*
*తేనైవ సార్ధం ప్రాస్యేయుః స్నాత్వా పుణ్యే జలాశయే.186*

*స త్వప్సు తం ఘటం ప్రాస్య ప్రవిశ్య భవనం స్వకమ్,*
*సర్వాణి జ్ఞాతికార్యాణి యథాపూర్వం సమాచరేత్.187*

పతితుడు ప్రాయశ్చిత్తం చేసికొన్న తర్వాత అతని సమానోదక సపిండులు పతితునితో కలిసి పరిశుద్ధమైన నీటిలో స్నానం చేసి జలపూర్ణమైన కొత్త కుండను ఆ నీటిలో వేయవలెను. ఆ తరువాత అతడు తన ఇంటికి వచ్చి సాధారణమైన పనులన్నీ చేసికోవాలి.

*ఏతదేవ విధిం కుర్యాద్యోషిత్సు పతితాస్వపి,*
*వస్త్రాన్నపానం దేయం తు వసేయుశ్చ గృహాంతికే.188*

*ఏనస్విభిరనిర్ణిక్తైర్నార్థం కించిత్సహాచరేత్,*
*కృతనిర్ణేజనాంశ్చైవ న జుగుప్సేత కర్హి చిత్.189*

*బాలఘ్నాంశ్చ కృతఘ్నాంశ్చ విశుద్ధానపి ధర్మతః,*
*శరణాగతహంతౄంశ్చ స్త్రీహంతౄంశ్చన సంవసేత్.190*

స్త్రీ పతితయైతే భర్త, సపిండాదులు ఈ విధంగానే ప్రేతకార్యాలన్ని చేసి ఆమెను తన ఇంటి దగ్గర ఉంచుకొని ఆమెకు బట్టలు, అన్నపానాలు మొదలైన వాటిని ఇవ్వాలి. పాపాలు చేసి ప్రాయశ్చిత్తం చేసికొనిన వారితో ధన సంబంధమైన కార్యాలు ఇచ్చిపుచ్చుకోవడాలేవి చేయకూడదు. అట్లే ప్రాయశ్చిత్తం చేసికొన్నవారిని వారు ఇంతకు ముందు చేసిన పాపాలు పేర్కొని నిందింపరాదు. బాలుని చంపినవాడు చేసినమేలును మరచిపోయేవాడు, శరణుజొచ్చిన వాడు, స్త్రీలను చంపువాడు, అతడు ఎంత పవిత్రంగా ఉన్నా వారితో కలిసిమెలిసి నివసించకూడదు.

*ఏషాం ద్విజానాం సావిత్రీ నానూచ్యేత యథావిధి,*
*తాం శ్చారయిత్వా త్రీన్ కృచ్ఛ్రాన్ యథావిధ్యుపనాయయేత్.191*

నిర్దిష్టమైన కాలంలో యధావిధిగా ఉపనయనం జరుగని ద్విజుల చేత మూడు ప్రాజాపత్యకృచ్ఛ్రాలు చేయించి ఆ తరువాత ఉపనయన సంస్కారాన్ని శాస్త్ర ప్రకారం చేయించాలి.

*ప్రాయశ్చిత్తం చికీర్షంతి వికర్మస్థాస్తు యే ద్విజాః,*
*బ్రహ్మణా చ పరిత్యక్తా స్తేషా మప్యేతదాదిశేత్. 192*

ఉపనయన సంస్కారం జరిగినా శూద్రసంగమం వల్ల ద్విజ కర్మలనన్నిటిని, గాయత్రీ మంత్రాన్నీ మరచిపోయిన ద్విజుడు కూడ మూడు ప్రాజాపత్య కృచ్ఛ్రాలను చేయాలి.

*యద్గర్హి తేనార్జయంతి కర్మణా బ్రాహ్మణా ధనమ్,*
*తస్యోత్సర్గేణ శుద్ధ్యంతి జప్యేన తపసైవ చ.193*

*జపిత్వా త్రీణి సావిత్ర్యాస్సహస్రాణి సమాహితః,*
*మాసం గోష్ఠే పయః పీత్వా ముచ్యతేऽసత్ప్రతిగ్రహాత్.194*

*ఉపవాసకృశం తం తు గోవ్రజా త్పునరాగతమ్,*
*ప్రణతం పరిపృచ్ఛేయుః సామ్యం సౌమ్యేచ్ఛసీతి కిమ్.195*

*సత్యముక్త్వా తు విప్రేషు వికిరేద్యవసం గవామ్,*
*గోభిః ప్రవర్తితే తీర్థే కుర్యుస్తస్య పరిగ్రహమ్.196*

నిందించ తగిన దుష్ప్రతిగ్రాహం వంటి కర్మల ద్వారా బ్రాహ్మణుడు ధనం సంపాదిస్తే ఆ ధనాన్ని ఇతరులకు దానం చేసి ఇకముందు చేప్పే జపతపాదులచే అతడు పరిశుద్ధుడౌతాడు. దుర్మార్గుల దగ్గర దానం స్వీకరిస్తే మూడువేల గాయత్రీ మంత్ర జపాన్ని చేసి, ఆవులు కాస్తూ, ఆ ఆవుల పాలను మాత్రం తాగుతూ ఒక నెల రోజులుంటే అతని పాపం నశిస్తుంది. ఆతడు నెల రోజుల తర్వాత బక్కచిక్కి ఇంటికి తిరిగివస్తే తోటి బ్రాహ్మణులు అతనితో మంచిగా మాట్లాడాలి. అప్పుడాతడు తన తోటివానితో ఇకనేను అసత్ప్రతిగ్రహము చేయనని గడ్డిని చేతిలో ఉంచుకొని ప్రతిజ్ఞ చేయవలెను. ఈ విధంగా ప్రతిజ్ఞ చేసి ఆ గడ్డిని ఆవులకు వేసి అవి ఆ గడ్డిని తిన్న తరువాత పరిశుద్ధమైన ఆ స్థలమున ఆ బ్రాహ్మణులాతనిని కౌగిలించుకోవలెను.

*వ్రాత్యానాం యాజనం కృత్వా పరేషా మంత్యకర్మ చ,*
*అభిచారమహీనం చ త్రిభిః కృచ్ఛ్రైర్వ్యపోహతి.197*

*శరణాగతం పరిత్యజ్య వేదం విప్లావ్య చ ద్విజః,*
*సంవత్సరం యవాహార స్తత్పాపమప సేధతి.198*

నిర్దిష్ట కాలంలో ఉపనయ సంస్కారం చేసికొనని వ్రాత్యులచే వ్రాత్యస్తోమంవంటి యాగాలు చేయించినవాడు, నిషిద్ధులకు ప్రేత సంస్కారం వంటి కర్మలు చేయించినవాడు అభిచారం, అహీనం వంటి యాగాలు చేసినవాడు మూడు ప్రాజాపత్య కృచ్ఛ్రములతో

పరిశుద్ధుడౌతాడు. శరణుజొచ్చిన వానిని రక్షింపక వదిలిపెట్టుట, అనధ్యయన దినాల్లో వేదాధ్యయనం చేయుటవంటి పాపాలు ఆతడు ఒక సంవత్సరం వరకు యవలను తింటూ గడిపితే నశిస్తాయి.

*శ్వసృగాలఖరైర్దష్టో గ్రామ్యైః క్రవ్యాద్భిరేవ చ,*
*నరాశ్వోష్ట్రవరాహైశ్చ ప్రాణాయామేన శుద్ధ్యతి.199*

*షష్ఠాన్న కాలతా మాసం సంహితాజప ఏవ వా,*
*హోమాశ్చ సకలా నిత్యమపాంక్త్యానాం విశోధనమ్.200*

కుక్క, నక్క, గాడిద, ఊరిలోనున్న పిల్లి మొదలైన పచ్చిమాంసాన్ని తినే జంతువులు, ఒంటె, పంది కరిస్తే ప్రాణాయామముచే పరిశుద్ధుడు కావచ్చు. పంక్తి బాహ్యులతో కలసి తింటే అట్టివారు ఒకనెల వరకు మూడు దినాలుపవాసము నాలుగవ దినం సాయంకాలం భోజనం, మళ్ళీ మూడు రోజులుపవాసం నాలుగవ దినం సాయంకాలం భోజనం అన్నట్లు కాలం గడుపుచూ ఆ సమయంలో ప్రతి దినం వేదాధ్యయనం చేస్తూ 'దేవకృతస్యైనసె వయజనమసిస్వాహా' అనే ఎనిమిది మంత్రాలతో హెూమం చేస్తే ఆ నెల రోజులకు అపంక్తి భోజన పాపం పోతుంది.

*ఉష్ట్రయానం సమారుహ్య ఖరయానం తు కామతః,*
*స్నాత్వా తు విప్రో దిగ్వాసాః ప్రాణాయామేన శుద్ధ్యతి.201*

*వినాద్భిరప్సు వా ప్యార్త శ్శారీరం సన్నివేశ్య చ,*
*సచేలో బహిరాప్లుత్య గామాలభ్య విశుద్ధ్యతి.202*

*వేదోదితానాం నిత్యానాం కర్మణాం సమతిక్రమే,*
*స్నాతకవ్రతలోపే చ ప్రాయశ్చిత్తమభోజనమ్.203*

ఒంటెలు లేక గాడిదలు కట్టిన బండిని బుద్ధిపూర్వకంగా ఎక్కిన బ్రాహ్మణుడు దెసమొలతో స్నానం చేసినవాడు ప్రాణాయామం చేస్తే పరిశుద్ధుడౌతాడు. నీళ్ళలో మూత్ర పురీషాలను విడిస్తే కట్టుకున్న బట్టతో ఊరిబయటికి వచ్చి నదిలోనో చెరువులోనో స్నానం చేసి ఆవును ముట్టుకుంటే అప్పుడు పరిశుద్ధుడౌతాడు. వేదప్రతిపాదితమైన నిత్య కార్యాలను వదిలిపెట్టినా స్నాతకవ్రతాలను వదలిపెట్టినా ఒకపూట భోజనం చేయకపోవుటే ప్రాయశ్చిత్తమౌతుంది.

*హుంకారం బ్రాహ్మణ స్యోక్త్వా త్వంకారం చ గరీయసః,*
*స్నాత్వానశ్నన్నహశ్శేష మభివాద్య ప్రసాదయేత్.204*

*తాడయిత్వా తృణే నాపి కంఠే వాబద్ధ్య వాససా,*
*వివాదే వావినిర్జిత్య ప్రణిపత్య ప్రసాదయేత్.205*

విద్యా వయస్సులలో తనకంటె పెద్దవాడైన బ్రాహ్మణునితో హుంకరించి లేక నీవు అని ఏకవచనంతో అగౌరవపరిస్తే స్నానంచేసి భోజనం చేయక ఆ బ్రాహ్మణుని కాళ్ళు పట్టుకొని గడుపవలెను. అట్లే అతడు తృణంతో కొట్టినా, మెడకు బట్టవేసి ఈడ్చినా, వాదంలో జయించినా అతనికి నమస్కరించి సంతోషపెట్టాలి.

*అవగూర్య త్వబ్దశతం సహస్రమభిహత్య చ,*
*జిఘాంసయా బ్రాహ్మణస్య నరకం ప్రతిపద్యతే.206*

*శోణితం యావతః పాంసూన్ సంగృహ్ణాతి మహీతలే,*
*తావంత్యబ్దసహస్రాణి తత్కర్తా నరకే వసేత్.207*

*అవగూర్య చరేత్ కృచ్ఛ్ర మతికృచ్ఛ్రం నిపాతనే,*
*కృచ్ఛ్రాతికృచ్ఛ్రౌ కుర్వీత విప్రస్యోత్పాద్య శోణితమ్.208*

ఆ బ్రాహ్మణుని చంపదలచి కట్టె పైకెత్తితే నూరేండ్లు నరకంలో నివసిస్తాడు, కట్టెతో కొట్టితే వేయి సంవత్సరాలు నరకంలో బాధలు పడుతూ ఉంటాడు. బ్రాహ్మణుని కొట్టినప్పుడు అతని శరీరంనుండి రక్తం కారితే భూమిపై పడ్డప్పుడు ఎన్ని రేణువులు రక్తంలో తడుస్తాయో అన్ని వేల సంవత్సరాలు బ్రాహ్మణుని కొట్టినవాడు నరకంలో ఉంటాడు. బ్రాహ్మణుని చంపుటకై దండాన్ని ఎత్తితే అతికృచ్ఛ్ర వ్రతాన్ని ఆచరించాలి. అతనికి దెబ్బ తగిలితే కృచ్ఛాతికృచ్ఛాలు రెండింటిని ఆచరించాలి.

*అనుక్తనిష్కృతీనాం తు పాపానామపనుత్తయే,*
*శక్తిం చావేక్ష్య పాపం చ ప్రాయశ్చిత్తం ప్రకల్పయేత్. 209*

ఇందు చెప్పబడని పాపాలను తొలగించుకొనుటకై కర్తయొక్క శరీరదార్ఢ్యాన్ని, అది తెలిసి చేశాడా లేదా అనే విషయాన్ని, ఎన్నిసార్లు చేయబడిందనే విషయాన్ని పరిగణనలోనికి తీసికొని ప్రాయశ్చిత్తం చేయాలి.

*యైరభ్యుపాయైరేనాంసి మానవో వ్యపకర్షతి,*
*తాన్ వోఽ భ్యుపాయాన్ వక్ష్యామి దేవర్షిపితృసేవితాన్. 210*

మానవుడు తన పాపాలను తొలగించుకొనే ఉపాయాలు కొన్ని దేవతలతో, ఋషులతో, పితృగణంతో చేయబడ్డాయి. వాటిని కూడ వివరిస్తాను అని భృగు మహర్షి పలికెను.

*త్ర్యహం ప్రాతస్త్ర్యహం సాయం త్ర్యహమద్యాదయాచితమ్,*
*త్ర్యహం పరం చ నాశ్నీయా త్ప్రాజాపత్యం చరన్ ద్విజః.211*

ప్రాజాపత్య కృచ్ఛాన్ని చేసే ద్విజుడు అయాచితంగా తనకు దొరికిన ఆహారాన్ని మూడు దినాలు పగటిపూట మాత్రమే భుజించాలి. మూడు దినాలు రాత్రిపూట మాత్రమే తినాలి. మూడు దినములే మాత్రం ఆహారం తీసికొనవద్దు. (ఉపవాసం చేయాలి ).

*గోమూత్రం గోమయం క్షీరం దధి సర్పిః కుశోదకమ్,*
*ఏకరాత్రోపవాసశ్చ కృచ్ఛ్రం సాంతపనం స్మృతమ్.212*

గోమూత్రం, గోమయం, గోక్షీరం, గోదధి, ఆవునేయి అనే పంచగవ్యాలను, దర్భలు చేర్చిన నీరు ఈ ఆరిటిని చేర్చి ఒక దినం తినాలి. మరుసటి రోజు ఉపవాసముండాలి. దీనిని సాంతపనమంటారు.

ఏకైకం గ్రాసమశ్నీయాత్త్ర్యహాణి త్రీణి పూర్వవత్,
త్ర్యహం చాపవసేదంత్య మతికృచ్ఛ్రం చరన్ ద్విజః.213

అతికృచ్ఛ్రవ్రతమునాచరించువాడు తొలిమూడు దినములు ప్రాతఃసాయ సమయాల్లో అయాచితంగా వచ్చిన ఒక్కొక్క ముద్దను మాత్రమే తినాలి. తరువాత మూడు దినములు వరుసగా ఉపవాసముండాలి. తరువాత మూడు దినాలు మరల ఒక్కొక్క ముద్దను మాత్రమే ఉదయం రాత్రివేళల్లో భక్షించాలి.

తప్తకృచ్ఛ్రం చరన్ విప్రో జలక్షీరఘృతానిలాన్,
ప్రతిత్ర్యహం పిబేదుష్ణాన్ సకృత్స్నాయీ సమాహితః. 214

తప్తకృచ్ఛ్రమనే వ్రతాన్ని ఆచరించే బ్రాహ్మణుడు మూడు దినాలు కాచిన నీటిని, మూడు దినాలు కాచిన పాలను, మూడు దినాలు కరిగించిన నేతిని, తీసికొని ఉపవాసం చేయాలి. ప్రతి దినమొకసారి మాత్రమే స్నానం చేయాలి.

యతాత్మనో ప్రమత్తస్య ద్వాదశాహమభోజనమ్,
పరాకో నామ కృచ్ఛ్రోz యం సర్వపాపాపనోదనః.215

పరాక కృచ్ఛ్రంలో ద్విజుడు అప్రమత్తుడై పన్నెండు దినములు ఉపవాసం చేయాలి. ఈ పరాక కృచ్ఛ్రం సమస్త పాపములను పోగొట్టుతుంది.

ఏకైకం హ్రాసయేత్పిండం కృష్ణే శుక్లే చ వర్ధయేత్,
ఉపస్పృశం స్త్రిషవణ మేతచ్చాంద్రాయణం స్మృతమ్.216

ఏతమేవ విధిం కృత్స్నమాచరేద్యవమధ్యమే,
శుక్లపక్షాదినియతశ్చరంశ్చాంద్రాయణం వ్రతమ్.217

అష్టావష్టౌ సమశ్నీయా త్పిండా న్మధ్యందినే స్థితే,
నియతాత్మా హవిష్యాశీ యతిచాంద్రాయణం చరన్.218

చతురః ప్రాతరశ్నీయాత్ పిండాన్విప్రః సమాహితః,

చతురో స్తామితేసూర్యే శిశుచాంద్రాయణం స్మృతం.219

యథా కథంచిత్పిండానాం తిస్రోzశీతీస్సమాహితః,
మాసేనాశ్నన్ హవిష్యస్య చంద్రస్యైతి సలోకతామ్.220

శుక్లపక్ష దినాల్లో ఒక్కొక ముద్దను పెంచుతూ కృష్ణపక్ష దినాల్లో ఒక్కొక్క ముద్దను తగ్గించాలి. అమావాస్యనాడు ఉపవాసముండాలి. పూర్ణమినాడు పదునైదు ముద్దలు మాత్రమే తినాలి. ప్రతి దినము మూడు పూటలు స్నానం చేయాలి. దీన్ని పిపీలికాచాంద్రాయణవ్రతమనీ అంటారు. యవ మధ్యమ చాంద్రాయణవ్రతంలో కూడ ఇదే పద్ధతిననుసరించాలి. యతిచాంద్రాయణమున ప్రతి దినము మధ్యాహ్నము ఎనిమిది ముద్దలు మాత్రమే తినాలి. దీనిలో శుక్లపక్షంలో ప్రతి దినం ఆహారాన్ని హెచ్చించడం గాని కృష్ణపక్షంలో ప్రతిదినం ఆహారాన్ని తగ్గించడం గాని జరుగదు. యతిచాంద్రాయణంలో మధ్యాహ్నం మాత్రమే తినాలి. రాత్రివేళల భుజింపరాదు. శిశు చాంద్రాయణంలో ప్రతి

దినం ఉదయం నాలుగు ముద్దలు, రాత్రి నాలుగు ముద్దల ఆహారం తీసికోవాలి. నీవారధాన్యపు ముద్దలు ఒకనాడు పది, ఒకనాడు ఐదు, మరియొకనాడు పదహారు ఒకనాడుపవాసం ఈ విధంగా నెలలో రెండువందల నలుభై ముద్దలు మాత్రమే ఆహారంగా తీసికొని చేసే చాంద్రాయణం వల్ల అతడు సకల పాపముల పోగొట్టుకొని, చంద్రలోకాన్ని చేరుతాడు.

*ఏతద్రుద్రాస్తథాదిత్యా వసవశ్చాచరన్ వ్రతమ్,*
*అహింసాం సత్యమక్రోధమార్జవం చ సమాచరేత్.221*

*మహావ్యాహృతిభిర్హోమః కర్తవ్యః స్వయమన్వహమ్,*
*అహింసా సత్యమక్రోధమార్జవం చ సమాచరేత్.222*

*త్రిరహ్న స్త్రిర్నిశాయాశ్చ సవాసా జలమావిశేత్,*
*స్త్రీశూద్రపతితాంశ్చైవ నాభిభాషేత కర్హి చిత్.223*

*స్థానాసనాభ్యాం విహరేదశక్తోऽధశ్శయీత వా,*
*బ్రహ్మచారీ వ్రతీ చ స్యాద్గురు దేవద్విజార్చకః.224*

*సావిత్రీం చ జపేన్నిత్యం పవిత్రాణి చ శక్తితః,*
*సర్వేష్వేవ వ్రతేష్వేవం ప్రాయశ్చిత్తార్థమాదృతః.225*

ఈ చాంద్రాయణవ్రతాన్ని ఏకాదశరుద్రులు, ద్వాదశాదిత్యులు, సప్తమరుత్తులు, అష్టవసువులు కూడ మహర్షులతో కలిసి సమస్త పాప పరిహారార్థం చేసినారు. చాంద్రాయణ వ్రతమునాచరించువాడు ప్రతి దినం మహా వ్యాహృతిమంత్రాలతో హెూమం చేయాలి. నెల వరకు అహింస, సత్యం, అక్రోధం, ఆర్జవం మొదలైన సుగుణాలు కలిగి ఉండాలి. పగటిపూట, సాయం సమయాన, ధరించిన వస్త్రాలతో మూడు మూడు మార్లు స్నానం చేయవలెను. ఆ వ్రతం చేసేటప్పుడు స్త్రీలతో, శూద్రులతో, పతితులతో మాట్లాడకూడదు. ఈ సమయంలో రాత్రింబగళ్ళు కూర్చొని కాని, నిలబడి కాని ఉండి బ్రహ్మచర్య వ్రతాన్ని అవలంబిస్తూ పెద్దలు, బ్రాహ్మణులు, దేవతలనర్చిస్తూ ఉండాలి. ఎల్లప్పుడు గాయత్రీ మంత్రమును జపిస్తూ ఉండాలి. అట్లే ప్రతి దినం స్నానం చేసేటప్పుడు అఘమర్షణ సూక్తాన్ని జపించాలి. తక్కిన ప్రాజాపత్యాదికృచ్ఛ్రాల్లో సైతం గాయత్రీమంత్ర జపాన్ని, అఘమర్షణ స్నానాదులను వదులరాదు.

*ఏతైర్ద్విజాతయశ్శోధ్యా వ్రతైరావిష్కృతైనసః,*
*అనావిష్కృతపాపాంస్తు మంత్రైర్హోమైశ్చ శోధయేత్.226*

*ఖ్యాపనేనానుతాపేన తపసాऽధ్యయనేన చ,*
*పాపకృన్ముచ్యతే పాపాత్తథా దానేన చాపది.227*

అందరికి తెలిసిన పాపాలు చేసినవారు ఈ ప్రాయశ్చిత్తాలనాచరించి పరిశుద్ధులు కావాలి. ఇతరులకు తెలియని పాపాలున్నవారు తమ పాపాలను మంత్రాలు, హెూమాల ద్వారా పోగొట్టుకోవలెను. పాపములు చేసినవాడు తన తప్పులు నలుగురికి

చెప్పుకొన్నందువల్ల, పశ్చాత్తాపపడుటవలన, తపస్సు వలన, వేదాధ్యయనం వల్ల, దాన
చేసినందువల్ల తన పాప దోషాలను పోగొట్టుకొంటాడు.

*యథా యథా నరోఽ ధర్మం స్వయం కృత్వా సుభాషతే,*
*తథా తథా త్వచేవాహి స్తేనాధర్మేణ ముచ్యతే.228*

*యథా యథా మనస్తస్య దుష్కృతం కర్మ గర్హతి,*
*తథా తథా శరీరం తత్తేనాధర్మేణ ముచ్యతే.229*

*కృత్వా పాపం హి సంతప్య తస్మాత్పాపాత్ ప్రముచ్యతే,*
*నైవం కుర్యాం పునరితి నివృత్యా పూయతే తు సః.230*

*ఏవం సంచింత్య మనసా ప్రేత్య కర్మఫలోదయమ్,*
*మనోవాఙ్మూర్తిభిర్నిత్యం శుభం కర్మ సమాచరేత్.231*

మానవుడు పాపం చేస్తే తాను చేసిన తప్పులను పెద్దలముందు ఎంత త్వర
వెల్లడి చేస్తాడో అంతత్వరగా అతడు పాపములకు దూరమౌతాడు. అట్లే అతని మనస
ఎంతగా పశ్చాత్తాపానికి గురియౌతుందో అంత తొందరగా అతడుపాపానికి కూ
దూరమౌతాడు. అతడు పాపాన్ని తెలిసి చేసినా, తెలియక చేసినా, పశ్చాత్తాపానికి గురియై
మళ్ళీ ఇటువంటి పాపపు పనులను చేయనని నిశ్చయించుకోవాలి. తాను చేసిన శుభాశు
కర్మల ఫలితాన్ని సదా ఆలోచిస్తూ మనోవాక్కాయములచే మంచి పనులనే ఎల్లప్పు
చేయుచుండవలెను. తాను తెలిసీ తెలియక చెడు పనులు చేస్తే పశ్చాత్తాపంతో బాధప
తిరిగి అటువంటి తప్పుడు పనులు చేయరాదు.

*అజ్ఞానాద్యది వా జ్ఞానాత్కృత్వా కర్మ విగర్హితమ్,*
*తస్మాద్విముక్తిమన్విచ్ఛన్ ద్వితీయం న సమాచరేత్.232*

*యస్మిన్ కర్మణ్యస్య కృతే మనసస్స్యాదలాఘవమ్,*
*తస్మింస్తావత్తపః కుర్యాద్యావత్తుష్టికరం భవేత్.233*

*తపోమూలమిదం సర్వం దైవమానుషకం సుఖమ్,*
*తపోమధ్యం బుధైః ప్రోక్తం తపోంతం వేదదర్శిభిః.234*

తెలిసి తెలియక తప్పుడు పనులు చేసినవాడు పశ్చాత్తాపంతో ఆ పాపపు పనుల
తిరిగి చేయవద్దు. పాపములు చేసినవాడు తన మనస్సుకు తృప్తి కలుగునంతవర
ప్రాయశ్చిత్తాన్ని ఆచరిస్తూనే ఉండాలి. దేవతలు, మానవులు అనుభవించు సుఖాలకన్ని
తపస్సే కారణము. తపస్సే అన్ని కార్యాలకు ఆది మధ్యాంతములని చెప్పవచ్చును.

*బ్రాహ్మణస్య తపో జ్ఞానం తపః క్షత్రస్య రక్షణమ్,*
*వైశ్యస్య తు తపో వార్తా తపశ్శూద్రస్య సేవనమ్.235*

*ఋషయస్సంయతాత్మానః ఫలమూలానిలాశనాః,*
*తపసైవ ప్రపశ్యంతి త్రైలోక్యం సచరాచరమ్.236*

జ్ఞానం సంపాదించుకొనుట బ్రాహ్మణుని తపస్సు. రాజుకు ప్రజా సంరక్షణ

తపస్సు. కృషి, గోరక్ష, వాణిజ్యములు వైశ్యుని యొక్క తపస్సు. పరిచర్యయే శూద్రుని తపస్సు. ఋషులు మనోవాక్కాయములందు నియమమేర్పరచుకొని పండ్లు, గడ్డలు, గాలిని ఆహారంగా తీసికొని తపస్సు చేసి తమ జ్ఞానచక్షువుతో చరాచరసృష్టితోనున్న ముల్లోకాలు చూడగల్గుచున్నారు.

*ఔషధాన్యగదో విద్యా దైవీ చ వివిధా స్థితిః,*
*తప సైవ ప్రసిద్ధ్యంతి తపస్తేషాం హి సాధనమ్.237*

*యద్దుస్తరం యద్దురాపం యద్దుర్గం యచ్చ దుష్కరమ్,*
*సర్వం తు తపసా సాధ్యం తపో హి దురతిక్రమమ్.238*

*మహాపాతకినశ్చైవ శేషాశ్చాకార్యకారిణః,*
*తప సైవ సుతప్తేన ముచ్యంతే కిల్బిషాత్తతః.239*

*కీటాశ్చాహిపతంగాశ్చ పశవశ్చ వయాంసి చ,*
*స్థావరాణి చ భూతాని దివం యాంతి తపోబలాత్.240*

ఔషధాలు, ఆరోగ్యం, బ్రహ్మజ్ఞానం, ధర్మశాస్త్రం తెలిసికోగలిగిన జ్ఞానం, దేవతలకు చెందిన స్వర్గాది లోకాలు ఇవన్నీ తపస్సు వలననే సిద్ధిస్తున్నందువల్ల తపస్సు వాటికి సాధకమై ప్రసిద్ధి చెందింది. దాటరానిదానిని, పొందరానిదానిని, సాధ్యంకానిదానిని, చేయరానిదానినంతయు తపస్సుతో సాధించవచ్చు. కావున తపస్సుకు అసాధ్యమనేది లేదు. మహాపాతకులైనా మిగిలిన ఉపపాతకాది అకార్యాలు చేసేవారైనా గొప్ప తపస్సు చేసి పాపాలను పోగొట్టుకొనుచున్నారు. కీటకములుగాని, సర్పాలుగాని, పశు పక్షులు గాని, స్థావర జంగమములు ఏవియైనా తపస్సునాచరించి స్వర్గమును చేరుకోగలుగుచున్నవి.

*యత్కించిదేనః కుర్వంతి మనోవాఙ్మూర్తిభిర్జనాః,*
*తత్సర్వం నిర్దహంత్యాశు తప సైవ తపోధనాః.241*

*తప సైవ విశుద్ధస్య బ్రాహ్మణస్య దివౌకసః,*
*ఇజ్యాశ్చ ప్రతిగృహ్ణంతి కామాన్ సంవర్ధయంతి చ.242*

మనో వాక్కాయములచే జనులు చేస్తున్న పాపాలన్నిటిని తపోధనులైన మహర్షులు తపస్సంపదచే నాశనం చేస్తున్నారు. తపస్సు చేసి పరిశుద్ధుడైన బ్రాహ్మణుడు చేయు యాగంలోని హవిస్సులనన్నిటి దేవతలు స్వీకరించి వారి కోరికలు తీర్చుచున్నారు.

*ప్రజాపతిరిదం శాస్త్రం తప సైవాసృజత్ ప్రభుః,*
*తథైవ వేదానృషయస్తపసా ప్రతి పేదిరే.243*

*ఇత్యేత త్తపసో దేవా మహాభాగ్యం ప్రచక్షతే,*
*సర్వస్యాస్య ప్రపశ్యంత స్తపసః పుణ్యముత్తమమ్.244*

హిరణ్యగర్భుడను ప్రజాపతి తపస్సు చేసియే ఈ ధర్మశాస్త్రాన్ని రచింపగలిగినాడు. అట్లే ఋషులందరు తపస్సు చేసియే వేదములను సందర్శించగలిగినారు. ఇన్ని కార్యాలు తపస్సు వల్ల జరిగినందువల్ల ఇవన్ని తపస్సు యొక్క మహాభాగ్యమని పెద్దలందురు.

*వేదాభ్యాసో ఽన్వహం శక్త్యా మహాయజ్ఞక్రియా క్షమా,*
*నాశయంత్యాశు పాపాని మహాపాతకజాన్యపి.245*

*యథైధస్తేజసా వహ్నిః ప్రాప్తం నిర్దహతి క్షణాత్,*
*తథా జ్ఞానాగ్నినా పాపం సర్వం దహతి వేదవిత్.246*

ప్రతి దినం తన శక్తి కొద్ది వేదాభ్యాసం చేసి పంచమహాయజ్ఞాలు చేస్తూ, ఓపిక కలిగి ఉంటే, మహాపాతకాల వల్ల కలిగిన పాపాలు సైతం నాశనమైపోతాయి. అగ్ని ఎండిన కట్టెలనుక్షణంలో దహించునట్లు వేదవేత్త యొక్క జ్ఞానాగ్ని సమస్తపాపాలను అపహరిస్తుంది

*ఇత్యేతదేనసాముక్తం ప్రాయశ్చిత్తం యథావిధి,*
*అత ఊర్ధ్వం రహస్యానాం ప్రాయశ్చిత్తం నిబోధత.247*

ఇంతవరకు అందరికి తెలిసిన బ్రహ్మ హత్యాది పాపాల ప్రాయశ్చిత్తాన్ని వివరించి తరువాత రహస్యంగా చేసిన పాపాల ప్రాయశ్చిత్తం వివరింపబడుతున్నది.

*సవ్యాహృతిప్రణవకాః ప్రాణాయామాస్తు షోడశ,*
*అపి భ్రూణహణం మాసాత్పునంత్యహరహః కృతాః.248*

*కౌత్సం జప్త్వాప ఇత్యేద్వాసిష్ఠం చ ప్రతీత్యృచమ్,*
*మాహిత్రం శుద్ధవత్యశ్చ సురాపోఽపి విశుద్ధ్యతి. 249*

*సకృజ్జప్త్వాస్య వామీయం శివసంకల్పమేవ చ,*
*అపహృత్య సువర్ణం తు క్షణాద్భవతి నిర్మలః.250*

*హవిష్పాంతీయమభ్యస్య న తమంహ ఇతీతి చ,*
*జపిత్వా పౌరుషం సూక్తం ముచ్యతే గురుతల్పగః.251*

సప్తవ్యాహృతులతోను, ప్రణవంతోనున్న గాయత్రీ మంత్రంతో పదహారు ప్రాణాయామాలు ప్రతి దినం చేస్తే భ్రూణహత్యాది పాపాలన్ని వెంటనే నశిస్తాయి. కౌత్స మహర్షిచే దృష్టమైన "ఆపోనఃశోశుచదఘం" అనే సూక్తం, వసిష్ఠ మహర్షిచే దృష్టమైన ప్రతీతి సూక్తం, మాహిత్ర సూక్తం, శుద్ధవతీ సూక్తం, అనే మూడు సూక్తాలు ప్రతి దినం చదివితే నెల లోపల సురాపానం చేసినవాడు కూడ పరిశుద్ధుడౌతాడు. బంగారమునపహరించిన బ్రాహ్మణుడు " అస్యవామస్య పలితస్య" అనే సూక్తాన్ని గాని శివ సంకల్పాన్ని గాని ఒక్కసారి చదివినా ఆతడు చేసిన పాపం నశిస్తుంది. "హవిష్పాంతమజరం" అనే పందొమ్మిది ఋక్కులనుగాని, "న తమంహో న దురితం" అనే ఎనిమిది ఋక్కులను గాని, ఇతివా ఇతిమే మనః అనే ఋక్కును గాని పురుష సూక్తమును గాని ప్రతి దినం చదువుతూ ఉంటే గురుభార్యా గమన దోషాన్నుండి విముక్తుడౌతాడు.

*ఏనసాం స్థూలసూక్ష్మాణాం చికీర్షన్నపనోదనమ్,*
*అవేత్యృచం జపేదబ్దం యత్కిం చేదమితీతి వా.252*

గొప్పనైన పంచమహాపాతకాలను గాని, చిన్నవైన ఉపపాతకాలను గాని చేసి ఆ పాపాన్ని పోగొట్టుకోవాలని అనుకున్నవాడు "అవ తేహేడోవరుణనమోభిః" అనే బుక్కును గాని, "యత్కించేదం వరుణదేవ్యైవ్రతం" అనే బుక్కును, ఇతివా ఇతిమే మనః అనే బుక్కును గాని దినమునకొకసారి చొప్పున సంవత్సరం వరకు జపిస్తే అతని పాపాలన్నీ నాశనమౌతాయి

*ప్రతిగృహ్యాప్రతిగ్రాహ్యం భుక్త్వా చాన్నం విగర్హితమ్,*
*జపంస్తరత్సమందీయం పూయతే మానవస్త్ర్యహాత్.253*

*సోమారౌద్రంతు బహ్వేనా మాసమభ్యస్య శుద్ధ్యతి,*
*స్రవంత్యామాచరన్ స్నానమర్యమ్ణామితి చ త్ర్యృచమ్.254*

*అబ్దార్థమింద్రమిత్యేతదేనస్వీ సప్తకం జపేత్,*
*అప్రశస్తం తు కృత్వాప్సు మాసమాసీత భైక్షభుక్.255*

*మంత్రైశ్శాకల హోమీయైరబ్దం హుత్వా ఘృతం ద్విజః,*
*సుగుర్వప్యపహంత్యేనో జప్త్వా వా నమ ఇత్యృచమ్.256*

*మహాపాతకసంయుక్తోz నుగచ్ఛేద్గాస్సమాహితః,*
*అభ్యస్యాబ్దం పావమానీ ర్భైక్షాహారో విశుద్ధ్యతి.257*

గ్రహించతగిన వాని దగ్గర అన్నాన్ని తీసికొని పాపాన్ని పొందితే "తరత్సమందీ ధావతి"అనే మంత్రాల్ని మూడు దినాలు జపిస్తే ఆ పాపం దూరమౌతుంది అనేక పాపాలు చేసినవాడు "సోమారుద్రా ధారయే ధామసుర్యం" అనే నాలుగు బుక్కులను గానిఅర్యమణం మిత్రం వరుణమగ్నిం అనే మూడు బుక్కులను గాని ప్రతిదినం నదిలో స్నానం చేస్తూ నెలదినాలవరకు జపిస్తే అతడు చేసిన పాపాలన్నీ తొలగిపోతాయి. ఇంకా అనేక పాపాలు చేసినవాడు "ఇంద్రంమిత్రం వరుణమగ్నిం" అనే ఏడు బుక్కులను ఆరునెలల కాలము జపించాలి. నీటిలో మలమూత్ర విసర్జన వంటి పాపాలు చేస్తే ఒక నెలవరకు భిక్షాన్నమును తినుచుండిన అతనిపాపములు నశించిపోతాయి. మహాపాతకమొనర్చినవాడు "దేవకృతస్య' 'అనే శాకలహోమమంత్రములతో ఒక సంవత్సరం ఆజ్యహోమం చేసి 'నమ ఇంద్రశ్చ" అనే బుక్కును సంవత్సర కాల జపం చేస్తే అతని పాతకమంతా నశించిపోతుంది. అట్లే అతడు ప్రతిదినం ఆవులను మేపుచూ ఆవుల వెంటపోవుచూ జితేంద్రియుడై భిక్షాహారాన్ని తింటూ"యః సావమనీ రభ్యేతి" మొదలగు బుక్కులను అనేక మార్లు జపిస్తే అతని పాపలన్నీ నశించిపోతాయి.

*అరణ్యే వా త్రిరభ్యస్య ప్రయతో వేదసంహితామ్,*
*ముచ్యతే పాతకైస్సర్వైః పరాకైః శోధితస్త్రిభిః.258*

*త్ర్యహం తూపవసేద్యుక్త స్త్రీరహ్నోz భ్యుపయన్నరః,*
*ముచ్యతే పాతకైస్సర్వై స్త్రీర్జపిత్వాz ఘమర్షణమ్.259*

*యథాశ్వమేధః క్రతురాట్సర్వపాపాపనోదనః,*
*తథాఘమర్షణం సూక్తం సర్వపాపాపనోదనమ్.260*

# ఏకాదశాధ్యాయం

మూడు ప్రోక్షణమంత్రములచే పవిత్రుడై మంత్రబ్రాహ్మణ రూపమైన వేదసంహితను అరణ్యంలో ఉండి పారాయణం చేస్తే అతడు సమస్త పాపాలనుండి ముక్తుడౌతాడు. మూడు రాత్రులు ఉపవాసముండి మూడు సంధ్యలలో అఘమర్షణమంత్రాలు మూడు సార్లు జపిస్తూ స్నానం చేస్తు ఉంటే అన్ని పాపాలు నాశనమౌతాయి. యాగాలన్నిటిలో అశ్వమేధయాగం శ్రేష్ఠమైనట్లు అఘమర్షణసూక్తం పాపహరాలైన సూక్తాలన్నిటిలో శ్రేష్ఠమైంది.

*హత్వా లోకానపీమాంస్త్రీనశ్నన్నపి యతస్తతః,*
*ఋగ్వేదం ధారయన్ విప్రో నైనః ప్రాప్నోతి కించన.261*

*ఋక్సంహితాం త్రిరభ్యస్య యజుషాం వా సమాహితః,*
*సామ్నాం వా సరహస్యానాం సర్వపాపైః ప్రముచ్యతే.262*

*యథా మహాహ్రదం ప్రాప్య క్షిప్తం లోష్టం వినశ్యతి,*
*తథా దుశ్చరితం సర్వం వేదే త్రివృతి మజ్జతి.263*

*ఋచో యజూంషి చాన్యాని సామాని వివిధాని చ,*
*ఏష జ్ఞేయస్త్రివృద్వేదో యో వేదైనం స వేదవిత్.264*

*ఆద్యం యత్త్ర్యక్షరం బ్రహ్మత్రయీ యస్మిన్ ప్రతిష్ఠితా,*
*స గుహ్యో ఽన్యస్త్రివృద్వేదో యస్తం వేద స వేదవిత్.265*

ఋగ్వేదాన్ని ప్రతి దినం అధ్యయనం చేస్తూఉంటే సమస్తలోకాలను హత్యచేసినా, మహాపాతకుల ఇంట్లో భుజించినా అతని కే మాత్రం పాపమంటదు. ఋగ్వేదాన్ని మూడు మార్లు అధ్యయనం చేసినవానికి, యజుర్వేదంపై శ్రద్ధకలవానికి, సామవేదాన్నంతా పారాయణం చేసిన వానికి ఎట్టి పాపాలు కలుగవు. గొప్పమడుగులో మట్టిపెళ్ళ పడి కరిగి పోయినట్లు మూడు వేదాలనధ్యయనం చేనస్తూ ఉన్నవాడి దగ్గర సమస్తపాపాలు నశించిపోతాయి. ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదానికి సంబంధించిన మంత్రాలను త్రివృద్వేదమంటారు. త్రివృద్వేదం తెలిసినవాడు వేదములన్నీ తెలిసినవాడు. అకార ఉకారమకారాత్మకమైనప్రణవం వేనికి మొదట ఉచ్చరింపబడుతుందో వేదములన్నీ ఎచ్చటనున్నవో ఆత్రివృద్వేదము పరమగుహ్యమైంది. దాన్ని ఎరిగిన వాడే వేదవేత్త.

ఇతి మానవే ధర్మశాస్త్రే భృగుప్రోక్తాయాం సంహితాయాం ఏకాదశో ధ్యాయః.

భృగుమహర్షి చెప్పిన మానవ ... అనే సంహితయందు పదకొండవ అధ్యాయం సమాప్తం

## ద్వాదశాధ్యాయం

*చాతుర్వర్ణ్యస్య కృత్స్నోऽయముక్తో ధర్మస్త్వయానఘ,*
*కర్మణాం ఫలనిర్వృత్తిం శంస నస్తత్త్వతః పరామ్.1*

*స తానువాచ ధర్మాత్మా మహర్షీన్మానవో భృగుః,*
*అస్య సర్వస్య శృణుత కర్మ యోగస్య నిర్ణయమ్.2*

మహానుభావా మాకింతవరకు బ్రాహ్మణక్షత్రియ వైశ్యశూద్రులనుష్ఠించాల్సిన ధర్మాలనన్నీ చెప్పినవారు. ఇక ఇప్పుడు ఈ జన్మలో చేసిన కర్మలకు తరువాతి జన్మలలో కలుగుఫలమేవిధంగా ఉంటుందో దానినంతా వివరించండి అని మహర్షులు భృగుమహర్షిని అడిగినారు. అప్పుడామహర్షులతో మనుపుత్రుడైన భృగుమహర్షి సమస్తకర్మల యొక్క ఫలితాన్ని ఇట్లు చెప్పసాగెను.

*శుభాశుభఫలం కర్మ మనోవాగ్దేహసంభవమ్,*
*కర్మజా గతయో నృణాముత్తమాధమమధ్యమాః.3*

*తస్యేహ త్రివిధస్యాపి త్ర్యధిష్ఠానస్య దేహినః,*
*దశలక్షణయుక్తస్య మనోవిద్యాత్ప్రవర్తకమ్. 4*

మనస్సు, వాక్కు దేహం ఇవిచేసే కర్మ శుభాశుభఫలములనుకలిగిస్తున్నది. ఈ కర్మవల్లనే జీవులకు ఉత్తమ, మధ్యమ అధమగతులేర్పడుతున్నాయి. ఈ విధంగా జీవికి మనోవాక్కాయములచే ఉత్తమాది త్రివిధగతులేర్పడుతున్నా. దశవిధ లక్షణాలుగల కర్మకు కారణమని చెప్పాల్సి ఉంది.

*పరద్రవ్యేష్వభిధ్యానం మనసానిష్టచింతనమ్,*
*వితథాభినివేశశ్చ త్రివిధం కర్మ మానసమ్.5*

*పారుష్యమనృతం చైవ పైశున్యం చాపి సర్వశః,*
*అసంబద్ధప్రలాపశ్చ వాఙ్మయం స్యా చ్చతుర్విధమ్.6*

*అదత్తానాముపాదానం హింసా చైవావిధానతః,*
*పరదారోపసేవా చ శారీరం త్రివిధం స్మృతమ్.7*

పరులధనాన్ని సంపాదించాలనే కోరిక, ఇతరులకు కీడు చేయాలనే భావన, భౌతిక విషయాలపై పట్టుదలకలిగియుండుట అనే మూడు అశుభమైన మానస కర్మలుగా పరిగణింపబడుతున్నాయి. పరుషంగా పలుకుట, అబద్ధాలడుట, పరోక్షంలో ఇతరుల తిట్టుట, అసంబద్ధమైన మాటలాడుట అనే నాలుగు వాక్కుకుసంబంధిన అశుభకర్మలు. ఇతరుల సొమ్మును బలాత్కారంగా లాక్కోవడం, ఇతరులను హింసించడం, వ్యభిచారం చేయడం అనే మూడు శరీరానికి సంబంధించిన పాపకర్మలు.

*మానసం మనసైవాయముపభుఙ్క్తే శుభాశుభమ్,*
*వాచా వాచాకృతం కర్మ కాయేనైవ చ కాయికమ్.8*

*శరీరజైః కర్మదోషైర్యాతి స్థావరతాం నరః,*
*వాచికైః పక్షిమృగతాం మానసైరంత్యజాతతామ్.9*

జీవుడుమనస్సుచే చేయుశుభాశుభకర్మల యొక్కఫలితమైన సుఖదుఃఖాలను మనస్సుతోనే అనుభవిస్తుండగా వాక్కు చేయుశుభాశుభకర్మఫలాన్ని వాక్కుచేతనే అనుభవిస్తున్నాడు. అట్లే శరీరంతో చేయుశుభాశుభకర్మలవలన గౌరవము, వ్యాధిమొదలైన ఫలితాలనుభవిస్తున్నాడు. మానవుడు శరీరసంబంధాలైన కర్మదోషాలనాచరించి చెట్టు కొండవంటి స్థావరాలుగా మారుచున్నాడు. వాగ్దోషాలనాచరించి పక్షిజన్మ, మృగజన్మ మొదలైనవి పొందుతున్నాడు. మానసదోషాలవల్ల చండాలాది అంత్యజాతులులో జన్మనెత్తుతున్నాడు.

*వాగ్దండోఽథ మనోదండః కాయదండ స్తథైవ చ,*
*యస్యైతే నిహితా బుద్ధౌ త్రిదండీతి స ఉచ్యతే.10*

*త్రిదండమేతన్నిక్షిప్య సర్వభూతేషు మానవః,*
*కామక్రోధౌ తు సంయమ్య తతస్సిద్ధిం నియచ్ఛతి.11*

పై మూడు విధాలైన దోషాలు పొందకుండ నిషిద్ధమైన మాటలు పలుక కున్నందువల్ల వాగ్దండాన్ని చెడు ఆలోచనలు లేకమనోదండాన్ని చెడ్డపనులు చేయకకాయదండాన్ని కలిగిఉన్నందువల్ల అతనిని త్రిదండి అని అనవచ్చును త్రిదండాన్ని సమస్త ప్రాణులయందు ప్రయోగించుకొంటే మానవుడు మోక్షసిద్ధిని పొందగలుగుచున్నాడు.

*యోఽ స్యాత్మనః కారయితా తం క్షేత్రజ్ఞం ప్రచక్షతే,*
*యః కరోతి తు కర్మాణి స భూతాత్మోచ్యతే బుధైః.12*

*జీవసంజ్ఞోఽ ంతరాత్మాన్యస్సహజస్సర్వదేహినామ్,*
*యేన వేదయతే సర్వం సుఖం దుఃఖం చ జన్మసు.13*

ఆత్మోపకారకమైన శరీరాన్ని శుభాశుభాలైనఅన్ని కార్యాలు చేయుటకు వినియోగించేవాడు క్షేత్రజ్ఞుడని పంచభూతాత్మకమై సమస్తకార్యాలను చేసే శరీరాన్ని భూతాత్మ అని అంటారు. ఈ క్షేత్రజునికన్నాభూతాత్మకన్నా భిన్నమై సమస్తప్రాణులలో ఉన్న అంతరాత్మయేజీవుడు. అతడే ఆయా సమయాలందు సుఖాదుఃఖాది భావాలను గుర్తింపగలుగుచున్నాడు.

*తావుభౌ భూతసంపృక్తౌ మహాన్ క్షేత్రజ్ఞ ఏవ చ;*
*ఉచ్చావచేషు భూతేషు స్థితం తం వ్యాప్య తిష్ఠతః.14*

*అసంఖ్యా మూర్తయస్తస్య నిష్పతంతి శరీరతః,*
*ఉచ్చావచాని భూతాని సతతం చేష్టయంతి యాః.15*

*పంచభ్య ఏవ మాత్రాభ్యః ప్రేత్య దుష్కృతినాం నృణామ్,*
*శరీరం యాతనార్థీయమన్యదుత్పద్యతే ధ్రువమ్.16*

*తేనానుభూయ తా యామిశ్శరీరేణేహ యాతనాః,*
*తాస్వేవ భూతమాత్రాసు ప్రలీయంతే విభాగశః.17*

ఆ మహత్తత్త్వం మరియు క్షేత్రజ్ఞుడు ఇద్దరు పృధివ్యాది పంచభూతములతో కూడి త్తమమధ్యమాధమ జంతువులందున్న పరమాత్మనాశ్రయించి ఉన్నారు. ఆ పరమాత్మనుండి త్రజ్ఞులనే అసంఖ్యమూర్తులు గల జీవులు లింగశరీరములతో అగ్నినుండి ల్వడుమిణుగురులవలె నీచమధ్యమోత్తమమైన భూతకర్మలందు ప్రవరిస్తున్నారు. పాపం సేమానవులు నరకంలోని సమస్తబాధలనుభవించుటకై జరాయుజాదిదేహవ్యతిరిక్తమైన యాతనాశరీరం పరలోకంలో పంచభూతాలవల్లనే కలుగుచున్నది. పాపాత్ములైన జీవులు యాతనాశరీరంతోనే యముడు పెట్టుసమస్త బాధలనుభవించి, సూక్ష్మశరీరంనశించగా నికి మూలమైన పంచభూతాల్లోనే లయంచెందుచున్నారు.

*సోఽనుభూయాసుఖోదర్కాన్ దోషాన్విషయసంగజాన్,*
*వ్యపేతకల్మషోఽభ్యేతి తావేవోభౌ మహౌజసౌ.18*

*తౌ ధర్మం పశ్యతస్తస్య పాపం చాతంద్రితౌ సహ,*
*యాభ్యాం ప్రాప్నోతి సంపృక్తః ప్రేత్యేహ చ సుఖాసుఖమ్.19*

*యద్యాచరతి ధర్మం స ప్రాయశోఽధర్మమల్పశః,*
*తైరేవ చావృతో భూతైః స్వర్గే సుఖముపాశ్నుతే.20*

*యది తు ప్రాయశోఽధర్మం సేవతే ధర్మమల్పశః,*
*తైర్భూతైస్స పరిత్యక్తో యామీః ప్రాప్నోతి యాతనాః.21*

*యామీస్తా యాతనాః ప్రాప్య స జీవో వీతకల్మషః,*
*తాన్యేవ పంచ భూతాని పునరభ్యేతి భాగశః. 22*

దేహి లింగశరీరంతో శబ్దస్పర్శాదివిషయానుభవం వల్ల కలిగిన యమబాధలనన్నీ అనుభవించి నరకానుభవం వల్ల పాపాలు పోగొట్టుకొని మహత్పరమాత్మలను పొందుచున్నాడు. ఆ జీవుడు ధర్మాన్ని అధికంగా అధర్మాన్ని తక్కువగా ఆచరించి స్థూలశరీరరూపంలో పరిణమించిన పృధివ్యాది భూతాలతో కూడి స్వర్గసుఖాన్ని అనుభవిస్తున్నాడు. ఆ జీవుడే ధర్మాలు తక్కువగా అధర్మాలు ఎక్కువగా చేసి స్థూల శరీరరూప భూతాలతో కలిసి యమబాధలనన్నిటిని అనుభవిస్తున్నాడు . ఆ జీవుడు యమయాతనలనన్నిటిని అనుభవించి పాపములను పోగొట్టుకొని తిరిగి పంచభూతాత్మకమైన శరీరాన్ని పొందుతున్నాడు.

*ఏతా దృష్ట్వాస్య జీవస్య గతీస్స్వేనైవ చేతసా,*
*ధర్మతోఽధర్మతశ్చైవ ధర్మే దధ్యాత్సదా మనః.23*

ఈ విధంగా జీవునికి పాపాచరణవల్ల కలుగు యమ యాతనలను మనస్సులో ఉంచుకొని మానవుడెల్లప్పుడు తన మనస్సును ధర్మాచరణయందే ఉంచాలి.

*సత్త్వం రజస్తమశ్చైవ త్రీన్విద్యాదాత్మనో గుణాన్,*
*యైర్వ్యాప్యేమాన్ స్థితో భావా న్మహాన్సర్వానశేషతః.24*

*యో యద్రైషాం గుణో దేహే సాకల్యేనాతిరిచ్యతే,*
*స తదా తద్గుణప్రాయం తం కరోతి శరీరిణమ్.25*

ఆత్మకు సత్యం, రజస్సు తమస్సు అను మూడుగుణాలున్నాయి. ఈ మూడు గుణాలతో నున్న మహత్తత్వం అంతటా వ్యాపించియున్నది. ఈ మూడు గుణాలలో ఏగుణం శరీరమందెక్కువగా కన్పిస్తే ఆ గుణంగలవాడని నిశ్చయించాలి.

*సత్త్వం జ్ఞానం తమో z జ్ఞానం రాగద్వేషౌ రజస్స్మృతమ్,*
*ఏతద్వ్యాప్తిమదేతేషాం సర్వభూతాశ్రితం వపుః.26*

జ్ఞానరూపమైనది సత్వజ్ఞానం. అజ్ఞానరూపమైనది తమస్సు. రాగద్వేషరూపమైనది రజస్సు. శరీరమున ఈ ఈ భావాలు వ్యాపించియుండును.

*తత్ర యత్ప్రీతిసంయుక్తం కించిదాత్మని లక్షయేత్,*
*ప్రశాంతమివ శుద్ధాభం సత్త్వం తదుపధారయేత్.27*

*యత్తు దుఃఖసమాయుక్త మప్రీతికరమాత్మనః,*
*తద్రజో ప్రతిపం విద్యాత్సతతం హారి దేహినామ్.28*

*యత్తు స్యా న్మోహసంయుక్త మవ్యక్తం విషయాత్మకమ్,*
*అప్రతర్క్యమవిజ్ఞేయం తమ స్తదుపధారయేత్.29*

ఆత్మయందుప్రేమతో శ్రమలేక ప్రశాంతంగా నున్నట్లు కన్పించే గుణం సత్వగుణం దుఃఖంతో నుండి ఆత్మకు సంతోషాన్ని కలిగించి ప్రాణులకు విషయస్పృహను కలిగిస సత్వస్వరూపాన్ని తెలుపనందువల్ల ఆత్మవిరోధియై యుండు గుణము రజోగుణం మంచిచెడ్డలు తెలుపుజ్ఞానంలేనిది, స్పష్టంగా లేనిది, విషయాత్మకము, ఆకారస్వరూపాలన ఊహించుటకు వీలు లేనిది. అంతఃకరణబహిఃకరణములచే ఎరుగరానిది తమోగుణమ

*త్రయాణామపి చైతేషాం గుణానాం యః ఫలోదయః,*
*అగ్ర్యో మధ్యో జఘన్యశ్చ తం ప్రవక్ష్యామ్యశేషతః.30*

ఇక ఈ సత్వరజస్తమోగుణాలవల్ల కలిగే ఉత్తమ, మధ్యమాధమ రూపమై కర్మఫలాలువివరించబడ్డాయి.

*వేదాభ్యాసస్తపో జ్ఞానం శౌచమింద్రియనిగ్రహః,*
*ధర్మక్రియాత్మచింతా చ సాత్త్వికం గుణలక్షణమ్.31*

*ఆరంభరుచితా ధైర్యమసత్కార్యపరిగ్రహః,*
*విషయోపసేవా చాజస్రం రాజసం గుణలక్షణమ్.32*

*లోభః స్వప్నో ధృతిః క్రౌర్యం నా స్తిక్యం భిన్నవృత్తితా,*
*యాచిష్ణుతా ప్రమాదశ్చ తామసం గుణలక్షణమ్.33*

వేదాభ్యాసం, తపస్సు, జ్ఞానం, శుచిగానుండుట, ఇంద్రియాలను నిగ్రహిం కొనుట, ధర్యకార్యాలు చేయుట, ఆత్మచింత అనేని సాత్వికగుణలక్షణాలు . చెడుపన

యందుత్సాహం, ధైర్యంలేక పోవుట చెడుపనులయందు ఆలోచన, శబ్దాది విషయాలననుభవింపగోరుట అనునవన్నియు రాజసగుణలక్షణాలు.అత్యాశ, అతినిద్ర, అధైర్యం, క్రౌర్యం. నాస్తిక్యం ఆచారరాహిత్యం, యాచించుస్వభావం ధర్మకార్యాచరణయందు పట్టుదలలేక పోవుట అనేవి తామసగుణలక్షణాలు.

*త్రయాణామపి చైతేషాం గుణానాం త్రిషు తిష్ఠతామ్,*
*ఇదం సామాసికం జ్ఞేయం క్రమశో గుణలక్షణమ్. 34*

మానవునిలో ఎల్లప్పుడు ఈ త్రిగుణాలలక్షణాలు కన్పించినా ఈ లక్షణాలు కూడా సాధారణంగా కనిపిస్తాయి.

*యత్కర్మ కృత్వా కుర్వంశ్చ కరిష్యంశ్చైవ లజ్జతి,*
*తత్ జ్ఞేయం విదుషా సర్వం తామసం గుణలక్షణమ్.35*

*యేనాస్మిన్ కర్మణా లోకే ఖ్యాతిమిచ్ఛతి పుష్కలామ్,*
*న చ శోచత్యసంపత్తౌ తద్విజ్ఞేయం తు రాజసమ్.36*

*యత్సర్వేణేచ్ఛతి జ్ఞాతుం యన్న లజ్జతి చాచరన్,*
*యేన తుష్యతి చాత్మాస్య తత్సత్త్వ గుణలక్షణమ్.37*

పని చేయబోవున్నప్పుడు, చేయునప్పుడు, చేసిన తరువాత సైతం సిగ్గుపడుట తమోగుణవంతుని లక్షణము. తానొకపని చేసి కీర్తి ప్రతిష్ఠలు సంపాదించుకొనవలెనని అట్లే ఆ ఆపని ఫలించకపోయినా నిరాశ చెందనివాడు రజోగుణసంపన్నుడు. సమస్తవిషయాలు తెలిసికోవలెనన్న భావన పని చేస్తున్నప్పుడు సిగ్గుపడకపోవుట తాను చేసిన పనివల్ల ఆత్మతృప్తిని పొందుట అనేవి సత్వగుణునిలక్షణాలు.

*తమసో లక్షణం కామో రజసస్త్వర్థ ఉచ్యతే,*
*సత్త్వస్య లక్షణం ధర్మః శ్రైష్ఠ్యమేషాం యథో త్తరమ్.38*

తమోగుణానికి కామబుద్ధి, రజోగుణానికి ధనసంపాదనతత్వం, సత్వగుణానికి ధర్మబుద్ధి కలిగి ఉండుట అనేవి ప్రధానలక్షణాలు.

*యేన యాంస్తు గుణేనైషాం సంసారాన్ ప్రతిపద్యతే,*
*తాన్ సమాసేన వక్ష్యామి సర్వస్యాస్య యథాక్రమమ్.39*

ఈ గుణాలవల్ల మానవుడు ఏఏగతులుపొందునో అవి అన్ని వివరించబడుతాయి.

*దేవత్వం సాత్వికా యాంతి మనుష్యత్వం చ రాజసాః,*
*తిర్యక్త్వం తామసా నిత్యమిత్యేషా త్రివిధా గతిః.40*

సాత్వికగుణసంపన్నులు దేవత్వమును పొందగా రాజసగుణసంపన్నులు మానవులైపుట్టారు. తమోగుణసంపన్నులు తిర్యగ్జన్మ నొందెదరు. ఇది త్రివిధజన్మ ప్రాప్తి లక్షణం.

*త్రివిధా త్రివిధైషాం తు విజ్ఞేయా గౌణికీ గతిః,*
*అధమా మధ్యమాగ్ర్యా చ కర్మవిద్యా విశేషతః.41*

సత్వాదిగుణాలవల్ల కలుగు జన్మలగురించి చెప్పబడ్డా, అవి దేశకాలభేదాన్ను నుసరించి అధమ, మధ్యమ ఉత్తమభేదములతో మరల మూడువిధములుగా ఉన్నవి.

*స్థావరాః క్రిమికీటాశ్చ మత్స్యాస్సర్పాస్సకచ్ఛపాః,*
*పశవశ్చ మృగాశ్చైవ జఘన్యా తామసీ గతిః.42*

*హస్తినశ్చ తురంగాశ్చ శూద్రా మ్లేచ్ఛాశ్చ గర్హితాః,*
*సింహా వ్యాఘ్రా వరాహాశ్చ మధ్యమా తామసీ గతిః.43*

*చారణాశ్చ సుపర్ణాశ్చ పురుషాశ్చైవ దాంభికాః,*
*రక్షాంసి చ పిశాచాశ్చ తామసీషూత్తమా గతిః.44*

చెట్లు, గుట్లలు మొదలైన స్థావరాలు, క్రిమికీటకాలు, చేపలు. పాములు. తాబేళ్ళు పశువులు, మృగాలు ఇవన్నీ తామసగుణం వల్ల కలిగిన నీచజన్మలు, ఏనుగులు. గుఱ్ఱాలు, శూద్రులు, మ్లేచ్ఛులు. సింహాలు, వ్యాఘ్రాలు, పందులు ఇవన్నీ తామసగుణం వల్ల కలిగే మధ్యమజన్మలు. నటులు మొదలైనవారు, పక్షులు, ఆడంబరంగా తిరిగే మానవులు, రాక్షసులు,పిశాచులు వీరంతా తామసగుణంవల్ల కలిగే ఉత్తమ జన్మలు.

*ఝల్లా మల్లా నటాశ్చైవ పురుషాశ్శస్త్రవృత్తయః,*
*ద్యూతపాన ప్రసక్తాశ్చ జఘన్యారాజసీ గతిః.45*

*రాజానః క్షత్రియాశ్చైవ రాజ్ఞాం చైవ పురోహితాః,*
*వాదయుద్ధ ప్రధానాశ్చ మధ్యమా రాజసీ గతిః.46*

*గంధర్వా గుహ్యకా యక్షా విబుధానుచరాశ్చ యే,*
*తథైవాప్సరసస్సర్వా రాజసీషూత్తమా గతిః.47*

కఱ్ఱసాము చేసేఝల్లులు, బాహుయుద్ధం చేసే మల్లులు, నటులు, శస్త్రములచే జీవించుసైనికులు, జూదరులు, తాగుబోతులు వీరంతా రాజసులలో అధమజన్మలు. రాజ్యం చేసే రాజులు, క్షత్రియవంశంలో పుట్టినవారు, రాజసులలో మధ్యములు. అట్లే గంధర్వులు, గుహ్యకులు, యక్షులు, దేవతలకు అనుచరులైన విద్యాధరులు, అప్సరసలు, వీరంతా రాజసులలో ఉత్తములు.

*తాపసా యతయో విప్రా యే చ వైమానికా గణాః,*
*నక్షత్రాణి చ దైత్యాశ్చ ప్రథమా సాత్త్వికీ గతిః.48*

*యజ్వాన ఋషయో దేవా వేదా జ్యోతీంషి వత్సరాః,*
*పితరశ్చైవ సాధ్యాశ్చ ద్వితీయా సాత్త్వికీ గతిః.49*

*బ్రహ్మా విశ్వసృజో ధర్మో మహానవ్యక్తమేవ చ,*
*ఉత్తమాం సాత్త్వికీమేతాం గతిమాహుర్మనీషిణః.50*

తపస్వులు. సన్యాసులు, వేదవేత్తలైన బ్రాహ్మణులు, విమానాలలో తిరిగే కొందరు దేవతలు, నక్షత్రాలు. దైత్యులు వీరంతా సాత్వికగుణసంపన్నులలో తక్కువవారు. యాగం చేసే స్వభావం కలవారు, ఋషులు. దేవతలు, సాధ్యులు వీరంతా సాత్వికులలో

మధ్యములు, బ్రహ్మదేవుడు, మహత్తు, అవ్యక్తం ఇవి అన్ని సత్వగుణ సంపన్నులలో ఉత్తమ శ్రేణికి సంబంధించినవి.

*ఏష సర్వస్సముద్దిష్ట స్త్రిప్రకారస్య కర్మణః,*
*త్రివిధస్త్రివిధః కృత్స్నః సంసారస్సార్వభౌతికః.51*

ఇంతవరకు సత్వరజస్తమోగుణములవలన చేయుకర్మలవలన పుట్టు ఉత్తమ, మధ్యమాధమములను మూడుభేదములతోనుండు ప్రాణివర్గాన్నంతా వివరించడం జరిగింది.

*ఇంద్రియాణాం ప్రసంగేన ధర్మస్యాసేవనేన చ,*
*పాపాన్ సంయాంతి సంసారమవిద్వాంసో నరాధమాః.52*

మూఢులైన మానవులు ఇంద్రియాలకు వశమగుటవల్ల ధర్మాన్ని అనుష్ఠించ నందువల్ల పాపఫలితాన్ననుభవిస్తున్నారు.

*యాం యాం యోనిం తు జీవో యం యేన యేనేహ కర్మణా,*
*క్రమశో యాతి లోకేz స్మిం స్తత్తత్సర్వం నిబోధత.53*

తాము చేసే ఆయా కర్మలవల్ల పుట్టే జన్మలగురించి ప్రస్తుతం వివరించ బడుతుంది.

*బహూన్ వర్షగణాన్ ఘోరాన్నరకాన్ ప్రాప్య తత్ర్పయాత్,*
*సంసారాన్ ప్రతిపద్యంతే మహాపాతకినస్త్విమాన్.54*

బ్రహ్మహత్యాదిమహాపాపాలను చాల కాలమనుభవించినా ఆపాపానుభవం ఇంకామిగిలి ఉన్నందువల్ల ఆ మహాపాతకులు ఈ జన్మలనెత్తుచున్నారు.

*శ్వసూకరఖరోష్ట్రాణాం గోజావిమృగపక్షిణామ్,*
*చండాలపుల్కసానాం చ బ్రహ్మహా యోనిమృచ్ఛతి.55*

బ్రహ్మహత్యచేసినవాడు తాననుభవింపవలసిన నరకాది పాపఫలాన్ని అనుభవించి ఇంకా మిగిలి ఉన్నందువల్ల కుక్క, గొఱ్ఱె, మృగము, పక్షి, చండాలురు, పుల్కసులువీరి జన్మలెత్తుచున్నాడు.

*క్రిమికీటపతంగానాం విడ్భుజాం చైవ పక్షిణామ్,*
*హింస్రాణాం చైవ సత్త్వానాం సురాపో బ్రాహ్మణో వ్రజేత్.56*

సురాపానం చేసిన బ్రాహ్మణుడు క్రిమి కీటకములు, మిడుతలు, మలాన్ని తినే జంతువులు, పక్షులు, క్రూరమృగాలు వీటియొక్క జన్మనెత్తుచున్నాడు.

*లూతాహిసరటానాం చ తిరశ్చాం చాంబుచారిణామ్,*
*హింస్రానాం చ పిశాచానాం స్తేనో విప్రస్సహస్రశః.57*

బంగారమునెత్తుకొనిపోయిన బ్రాహ్మణుడు సాలీడు,పాము, తొండ, నీటి పక్షులు, హింసించేస్వభావం కల మృగాలు, పిశాచాల జన్మనెత్తుచున్నాడు.

*తృణగుల్మలతానాం చ క్రవ్యాదాం దంష్ట్రిణామపి,*
*క్రూరకర్మకృతాం చైవ శతశో గురుతల్పగః.58*

గురుభార్యను పొందినవాడు గడ్డి, పొదలు, తీగలు, పచ్చిమాంసం తినే గద్దలు, కోరలున్న సింహం ఇతరుల చంపే పులులు మొదలైనజంతువులుగా పుట్టుచున్నాడు.

*హింస్రా భవంతి క్రవ్యాదాః క్రిమయో భక్ష్యభక్షిణః,*
*పరస్పరాదినః స్తేనాః ప్రేతాంత్యస్త్రీని షేవిణః.59*

ఇతరప్రాణులను వధించువారు పచ్చిమాంసం దినే పిల్లులు, రాక్షసులౌతారు. లేక తినదగని దానిని తినే క్రిములైజన్మనెత్తుతారు. ఇంకా ఒకరి మాంసాన్ని ఒకడు తినేవారుగా చోరులుగా, చండాలాదిస్త్రీలతో పోయేజాతులలో పుట్టుతారు.

*సంయోగం పతితైర్గత్వా పరస్యైవ చ యోషితమ్,*
*అపహృత్య చ విప్రస్వం భవతి బ్రహ్మరాక్షసః.60*

పతితులతో స్నేహం చేసేవాడు, పరస్త్రీవ్యామోహం కలవాడు, బ్రాహ్మణుని ధనాన్ని అపహరించేవాడు. వీరందరు బ్రహ్మరాక్షసులై పుట్టుతారు.

*మణిముక్తాప్రవాళాని హృత్వా లోభేన మానవః,*
*వివిధాని చ రత్నాని జాయతే హేమకర్తృషు.61*

అత్యాశతో ఇతరుల ఇంట్లో రత్నాలు, ముత్యాలు, పగడాలు. మొదలైనవాటిని దొంగతనం చేసిన మానవుడు తరువాతి జన్మలో బంగారుపని చేయువాడై పుడ్తాడు.

*ధాన్యం హృత్వా భవత్యాఖుః కాంస్యం హంసో జలం ప్లవః,*
*మధు దంశః పయః కాకో రసం శ్వా నకులో ఘృతమ్. 62*

*మాంసం గృధ్రో వపాం మద్గుస్తైలం తైలపకః ఖగః,*
*చీరివాకస్తు లవణం బలాకా శకునిర్దధి. 63*

*కౌశేయం తిత్తిరిర్హృత్వా క్షౌమం హృత్వా తు దర్దురః,*
*కార్పాసతాంతవం క్రౌంచో గోధా గాం వాగ్గుదో గుడమ్. 64*

*ఛుచుందరిశ్శుభాన్ గంధాన్ పత్రశాకం తు బర్హిణః,*
*శ్వావిత్కృతాన్నం వివిధమకృతాన్నం తు శల్యకః. 65*

ఇతరుల ధాన్యాన్ని అపహరించినవాడు ఎలుకగా పుట్టుతాడు. కంచును దొంగిలిస్తే హంసగా నీటిని దొంగిలించి బెగ్గురు పక్షిగా, తేనెను దొంగిలించి ఈగగా, పాలను దొంగిలించి కాకిగా, చెరుకుమొదలైనరసవస్తువులనపహరించి కుక్కగా, నేయిని ఎత్తుకొని పోయిముంగినగా జన్మనెత్తుతాడు, మాంసమును దొంగిలించినవాడు గద్దగా, వపనుదొంగిలిస్తే నీటికాకిగా నూనెను దొంగిలించి గబ్బిలంగా ఉప్పుదొంగిలించి చీరివాకంగా పెరుగు ఎత్తుకొని పోయి కొంగగా జన్మనెత్తుచున్నాడు పట్టు బట్టనపహరించి తిత్తిరి పక్షిగా, నారబట్టనెత్తుకొని పోయి, కప్పగా దూదిబట్టనపహరించినవాడు క్రౌంచపక్షిగా, అవునెత్తుకొని పోయి ఉడుముగా, బెల్లాన్ని దొంగతనం చేసి వాగ్గువదమనే పక్షిగా పుట్టున్నాడు.

సుగంధద్రవ్యాలనపహరించినవాడు చుండెలుకగా, ఆకుకూరలను దొంగతనం చేసినవాడు నెమలిగా, వండిన అన్నాన్ని ఎత్తుకొనిపోయినవాడు ముండ్లపందిగా జన్మనెత్తుతున్నాడు.

*బకో భవతి హృత్వాగ్నిం గృహకారీ హ్యుపస్కరమ్,*
*రక్తాని హృత్వా వాసాంసి జాయతే జీవజీవకః 66*

*వృకో మృగేభం వ్యాఘ్రో ఽశ్వం ఫలమూలం తు మర్కటః,*
*స్త్రీమృక్షః స్తోకకో వారి యానాన్యుష్ట్రః పశూనజః. 67*

అగ్నిని అపహరించినవాడు కొంగగా, చెట్టు, రోకలి మొదలైన గృహోపకారణాల నపహరించి పేడ పురుగుగా, ఎఱ్ఱని బట్టలు దొంగతనం చేసి వెన్నెల పురుగుగా పుడ్తున్నాడు. జింకను, ఏనుగును దొంగిలించి తోడేలుగా గుఱ్ఱాన్ని దొంగిలించి పులిగా పండ్లు కాయలపహరించి కోతిగా, స్త్రీని దొంగిలించి ఎలుగుబంటిగా, నీటిని అపహరించి చాతకపక్షిగా, బండ్లుమొదలైనవానిని దొంగిలించి ఒంటెగా ఇతరమైన పశువులనపహరించి మేకగా పుట్టుచున్నాడు.

*యద్వా తద్వా పరద్రవ్య మపహృత్య బలాన్నరః,*
*అవశ్యం యాతి తిర్యక్త్వం జగ్ధ్వా చైవాహుతం హవిః. 68*

ఇతరుల ద్రవ్యాన్ని బలవంతంగా అపహరించి లేక హోమానికి సిద్ధమై యున్న పురోడాశాన్ని బలవంతంగా ఎత్తుకొనిపొయి తిన్నచో తప్పక మృగమై పుట్టును.

*స్త్రియోఽప్యేతేన కల్పేన కల్పేన హృత్వా దోషమవాప్నుయుః,*
*ఏతేషామేవ జంతూనాం భార్యాత్వముపయాంతి తాః .69*

స్త్రీలు కూడ ఇదే విధంగా ఇతరుల ధనాన్ని అపహరిస్తే స్త్రీమృగాలుగా జన్మనెత్తుతారు.

*స్వేభ్య స్స్వేభ్యస్తు కర్మభ్యశ్చ్యుతా వర్ణా హ్యనాపది,*
*పాపాన్ సంసృత్య సంసారాన్ ప్రేష్యతాం యాంతి శత్రుషు .70*

బ్రాహ్మణాది చాతుర్వర్ణములవారు తమకు శక్తియున్నా తమనిర్దిష్ట ధర్మాలను వదిలివేస్తే పాపంపొంది జన్మాంతంలో శత్రువులకు దాసులగుచున్నారు.

*వాంతాశ్యుల్కాముఖః ప్రేతో విప్రో ధర్మాత్స్వకాచ్చ్యుతః,*
*అమేధ్యకుణపాశీ చ క్షత్రియః కటపూతనః.71*

*మైత్రాక్షజ్యోతికః ప్రేతో వైశ్యో భవతి పూయభుక్,*
*చైలాశకశ్చ భవతి శూద్రో ధర్మాత్స్వకాచ్చ్యుతః.72*

బ్రాహ్మణుడు స్వతః కర్మభ్రష్టుడైతే వాంతి చేసికోన్న అన్నాన్ని తింటూ జ్వాలాముఖుడనే ప్రేతగా జన్మిస్తాడు. క్షత్రియుడు స్వకర్మభ్రష్టుడైతే పురీషశవాలను తినే కటపూతనుడనే ప్రేతగా పుట్టుతాడు వైశ్యుడు. తనకర్మ భ్రష్టుడైతే మైత్రాక్షజ్యోతి అనే చీమును భుజించే ప్రేతగా పుడ్తాడు. శూద్రుడు చీరపేలను భక్షించే చైలాశకమనే ప్రేతగా పుడ్తాడు.

*యథాయథా నిషేవంతే విషయాన్ విషయాత్మకాః,*
*తథా తథా కుశలతా తేషాం తేషూపజాయతే .73*

*తేఽభ్యాసాత్కర్మణాం తేషాం పాపానామల్పబుద్ధయః,*
*సంప్రాప్నువంతి దుఃఖాని తాసు తాస్విహ యోనిషు.74*

*తామిస్రాదిషు చోగ్రేషునరకేషు వివర్తనమ్,*
*అసిపత్రవనాదీని బంధనచ్ఛేదనాని చ.75*

*వివిధాశ్చైవ సంపీడాః కాకోలూకైశ్చ భక్షణమ్,*
*కరంభవాలుకాతాపాన్ కుంభీపాకాంశ్చ దారుణాన్.76*

*సంభవాంశ్చ వియోనీషు దుఃఖప్రాయాసు నిత్యశః,*
*శీతాతపాభిఘాతాంశ్చ వివిధాని భయాని చ.77*

శబ్దాది విషయాలను సేవించుచున్నకొద్దీ ఆయావిషయాలయందు ప్రావీణ్యమ కలుగుచుండును. మూఢబుదుద్ధలైనవారు ఆయాపాపకర్మలనునుష్ఠిస్తూ ఆయ పాపఫలితంగా ఆయా జాతులలో పుట్టుచున్నారు. వారు తామిస్రాది ఘోరనరకాలన అసిపత్రవనం ఛేంధనం, మేదనం వంటి బాధలను అనుభవిస్తారు. ఇంకా అనేకవిధాలై బాధలను, కాకులు, గూబలు తినుట కాలిన ఇసుకలో మాడుట కుంభీపాకంమొదలై ఘోరనరకాలెన్నో అనుభవింతురు, ఇంకా ఇతర జాతుల్లో పుట్టుట చలి, వాన, ఎం మొదలగు వానియందుండుట మొడలైన బాధలనుభవిస్తారు.

*అసకృద్గర్భవాసేషు వాసం జన్మ చ దారుణమ్,*
*బంధనాని చ కాష్టాని పరప్రేష్యత్వమేవ చ .78*

*బంధుప్రియవియోగాంశ్చ సంవాకం చైవ దుర్జనైః,*
*ద్రవ్యార్జనం చ నాశం చ మిత్రామిత్రస్య చార్జనమ్ .79*

*జరాం చైవాప్రతీకారాం వ్యాధిభిశ్చోపపీడనమ్,*
*క్లేశాంశ్చ వివిధాంస్తాంస్తా న్మృత్యుమేవ చ దుర్జయమ్ .80*

మరియు మాటిమాటికి గర్భవాసం చేయుట, జన్మరూపమైన దారుణమై దుఃఖాన్ని అనుభవించుట, పుట్టిన తరువాత సంకెళ్ళు మొదలైన వానితో కట్టబడు ఇతరులకు దాసులై యుండుట, మొదలైన కష్టాలనన్నీ అనుభవిస్తారు. బంధు మిత్ర ఎడబాటు, దుర్జనులతో సహవాసం, ధనం సంపాదించుట, దాన్ని నష్టపోవుట, శత్రువు మిత్రులను సంపాదించుకొనుట మొదలైన కష్ట కార్యాలు చేస్తారు. తిరుగుల ముసలితనాన్ని, రోగాల బాధను, అనేక విధాలైన బాధలు, జయింపరాని మృత్యువు సైతం పొందుతారు.

*యాదృశేన తు భావేన యద్యత్కర్మ నిషేవతే,*
*తాదృశేన శరీరేణ తత్తత్ఫలముపాశ్నుతే . 81*

ఎటువంటి భావనతో కర్మ చేస్తామో, ఆ కర్మఫలంగా అటువంటి శరీర లభిస్తుంది.

*ఏష సర్వస్సముద్దిష్టః కర్మణాం వః ఫలోదయః,*
*నైశ్శ్రేయసకరం కర్మ విప్రస్యేమం నిబోధత . 82*

ఇంతవరకు ఆయాకర్మల యొక్క దుష్ఫలితాల గురించి వివరించబడింది. ఇక బ్రాహ్మణునికి మోక్షాన్ని కలిగించే కర్మల గురించి వివరించబడుతుంది.

*వేదాభ్యాసస్తపో జ్ఞాన మింద్రియాణాం చ సంయమః,*
*అహింసా గురు సేవా చ నిశ్శ్రేయసకరం పరమ్ .83*

*సర్వేషామపి చేతేషాం శుభానామిహ కర్మణామ్,*
*కించిచ్ఛ్రేయస్కరతరం కర్మోక్తం పురుషం ప్రతి .84*

*సర్వేషామపి చైతేషామాత్మజ్ఞానం పరం స్మృతమ్,*
*తద్ధ్యగ్ర్యం సర్వవిద్యానాం ప్రాప్యతేహ్యమృతం తతః .85*

*షణ్ణామేషాం తు సర్వేషాం కర్మణాం ప్రేత్య చేహ చ,*
*శ్రేయస్కరతరం జ్ఞేయం సర్వదా కర్మ వైదికమ్.86*

*వైదికేకర్మయోగే తు సర్వాణ్యేతాన్యశేషతః,*
*అంతర్భవంతి క్రమశస్తస్మింస్తస్మిన్ క్రియావిధౌ . 87*

ప్రతి దినం వేదములనభ్యసించుట, వాటి అర్థాన్ని తెలిసికొనుట, తపస్సు, బ్రహ్మజ్ఞానం, ఇంద్రియములనణచుట, అహింస, పెద్దలను సేవించుట మొదలైనవి బ్రాహ్మణునకు మోక్షాన్ని కలిగిస్తాయి. పైన చెప్పిన వేదాధ్యయనాది కర్మలలో మిక్కిలి శ్రేష్టమైన కర్మ ఆత్మజ్ఞానము. దాని వలన బ్రాహ్మణుడు మోక్షము సంపాదించుకొనగలుగును. అట్లే పై ఆరు కర్మలలో ఆత్మజ్ఞానరూపమైన వైదిక కర్మ సర్వశ్రేష్ఠం. కావున బ్రహ్మజ్ఞానాన్ని తప్పక సంపాదించాలి. పరమాత్మోపాసనమనే వైదిక కర్మయందే పైన చెప్పిన కర్మలన్నీ ఆయా క్రియా విధులందు విలీనమగుచున్నవి. కావున బ్రహ్మజ్ఞాన సంపాదనమే సర్వశ్రేష్ఠము.

*సుఖాభ్యుదయికం చైవ నైశ్శ్రేయసికమేవ చ,*
*ప్రవృత్తం చ నివృత్తం చ ద్వివిధం కర్మ వైదికమ్. 88*

*ఇహ చాముత్ర వా కామ్యం ప్రవృత్తం కర్మ కీర్త్యతే,*
*నిష్కామం జ్ఞానపూర్వం తు నివృత్తముపదిశ్యతే.89*

*ప్రవృత్తం కర్మ సంసేవ్య దేవానామేతి సామ్యతామ్,*
*నివృత్తం సేవమానస్తు భూతాన్యత్యేతి పంచ వై .90*

ఈ ప్రతి కర్మ స్వర్గాది సుఖములను కలిగించు జన్మప్రాప్తికి కారణమైన ప్రవృత్తి కర్మగా సంసారనివృత్తి హేతువైన నివృత్తి కర్మగా రెండు విధములుగా ప్రసిద్ధి చెందినది. ఈ లోకంలో పరలోకంలోను కోరికలను తీర్చునది ప్రవృత్తికర్మ, నిష్కామమైనది, జ్ఞానపూర్వమైనది అగు కర్మ నివృత్తి కర్మ. ప్రవృత్తికర్మను చక్కగా నిర్వర్తించినచో దేవలోకాన్ని పొందవచ్చు. అట్లే నివృత్తికర్మను ఎల్లప్పుడు అభ్యసించి పంచభూతాత్మమైన సంసారాన్ని దాటి మోక్షమును పొందుచున్నాడు.

# ద్వాదశాధ్యాయం

సర్వభూతేషు చాత్మానం సర్వభూతాని చాత్మని,
సమం పశ్యన్నాత్మయాజీ స్వారాజ్య మధిగచ్ఛతి. 91

ఆత్మజ్ఞానం కలవాడు సమస్త భూతములందు తనను, అట్లే తనయందు సమస్త భూతాలను దర్శిస్తూ మోక్ష సామ్రాజ్యమును దర్శించగలడు.

యథోక్తాన్యపి కర్మాణి పరిహాయ ద్విజోత్తమః,
ఆత్మజ్ఞానే శమే చ స్యాద్వేదాభ్యాసే చ యత్నవాన్ .92

మోక్షాన్ని అర్థించేవాడు పైన పేర్కొన్ని కర్మలలో అన్నీ వదిలి పెట్టినా బ్రహ్మజ్ఞానము, ఇంద్రియ జయం, వేదపారాయణమను మూడిటిని మాత్రం తప్పక ఆచరిస్తూ ఉండాలి.

ఏతద్ధి జన్మ సాఫల్యం బ్రాహ్మణస్య విశేషతః,
ప్రాప్యైతత్కృతకృత్యో హి ద్విజో భవతి నాన్యథా .93

ద్విజుడైనవాడు ప్రధానంగా బ్రాహ్మణుడు పై ఆత్మజ్ఞాన వేదాభ్యాసాదులచే తన జన్మను సఫలం చేసికోవాలి. మిగిలిన ఏ కర్మలాచరించినను ద్విజ జన్మసార్థకం కాజాలదు.

పితృదేవమనుష్యాణాం వేదశ్చక్షుస్సనాతనమ్,
అశక్యం చాప్రమేయం చ వేదశాస్త్రమితిస్థితిః .94

పితరులకు దేవతలకు మనుష్యులకు వేదమే కన్ను వంటిది. ప్రమాణమైనది. అది అపౌరుషేయం కావున ఇతరులెవ్వరు రచింపవీలు లేనిది. మీమాంసాది శాస్త్రములన్యాయాలతో సంబంధం లేనిది కావున అప్రమేయమైనది.

యా వేదబాహ్యాః శ్రుతయో యాశ్చ యాశ్చ కుదృష్టయః,
సర్వాస్తా నిష్ఫలాః ప్రేత్య తమోనిష్ఠా హి తాః స్మృతాః .95

ఉత్పద్యంతే చ్యవంతే చ యాన్యతో஽న్యాని కాని చిత్,
తాన్యర్వాక్కాలికతయా నిష్ఫలాన్యనృతాని చ .96

వేదబాహ్యాలైన ఆధునిక శాస్త్రాలు, వేదాన్ని నిందించే దృష్టితో చూడబడే శాస్త్రాలు ఇవి అన్నీ వ్యర్థమైనవే. వేద బాహ్యాలైన శాస్త్రాలు కొత్త కొత్తవి పుట్టుకొస్తున్నాయి. గిట్టుతున్నాయి. ఇవన్నీ ఆధునికమైనవి కావున ప్రయోజనం లేనివి.

చాతుర్వర్ణ్యం త్రయో లోకాశ్చత్వారశ్చాశ్రమాః పృథక్,
భూతం భవద్భవిష్యచ్చ సర్వం వేదాత్ప్రసిద్ధ్యతి .97

శబ్దః స్పర్శశ్చ రూపశ్చ రసో గంధశ్చ పంచమః,
వేదాదేవ ప్రసూయంతే ప్రసూతిగుణకర్మతః.98

బిభర్తి సర్వభూతాని వేదశాస్త్రం సనాతనమ్,
తస్మాదేతత్పరం మన్యే యజ్జంతోరస్య సాధనమ్ .99

సైనాపత్యం చ రాజ్యం చ దండనేతృత్వమేవ చ,
సర్వలోకాధిపత్యం చ వేదశాస్త్రవిదర్హతి .100

*యథా జాతబలో వహ్నిర్దహత్యార్ద్రానపి ద్రుమాన్,*
*తథా దహతి వేదజ్ఞః కర్మజం దోషమాత్మనః .101*

*వేదశాస్త్రార్థతత్త్వజ్ఞో యత్ర తత్రాశ్రమే వసన్,*
*ఇహైవ లోకే తిష్ఠన్ స బ్రహ్మభూయాయకల్పతే.102*

బ్రాహ్మణాది చతుర్వర్ణాలు, భూరాది లోకాలు, బ్రహ్మచర్యాశ్రమాది నాలుగు ఆశ్రమాలు, వర్తమాన, భూత, భవిష్యత్కాలాలనే మూడు కాలాలు ఇవన్నీ వేదంలో ప్రసిద్ధి చెందినాయి. శబ్ద స్పర్శ రూప రసగంధములనే పంచగుణాలు వేదంలోనే కన్పిస్తున్నాయి. సమస్త జీవులు కూడ వేదాన్నే సనాతన శాస్త్రంగా భావిస్తున్నారు. అందువల్ల వేదశాస్త్రం పురుషునికి గొప్ప పురుషార్థసాధకంగా కనిపిస్తున్నది. సేనాపతి పదవి, రాజ్యము, దండనాయకత్వము, సర్వలోకాధిపత్యం ఇవన్నీ వేదరూప శాస్త్రం తెలిసిన వానికి అబ్బుతాయి. బాగా మండుతున్న అగ్ని పచ్చి కట్టెలను సైతం కాల్చుచున్నట్లే వేదవేదార్థములు తెలిసినవాడు తన కర్మదోషాలను పోగొట్టుకొనును. వేదవేదార్థాలు తెలిసినవాడు ఏ ఆశ్రమంలో ఉన్నా, ఈ లోకంలోనే ఉన్నా మోక్షార్హుడై యున్నాడు.

*అజ్ఞేభ్యో గ్రంథినః శ్రేష్ఠా గ్రంథిభ్యో ధారిణో వరాః,*
*ధారిభ్యోజ్ఞానినః శ్రేష్ఠా జ్ఞానిభ్యో వ్యవసాయినః .103*

*తపో విద్యా చ విప్రస్య నిఃశ్రేయసకరం పరమ్,*
*తపసా కిల్బిషం హన్తి విద్యయాZ మృతమశ్నుతే .104*

వేదం గురించి ఏ మాత్రం తెలియని వారికంటె ఇంట్లో వేదగ్రంథాలున్నవారు శ్రేష్ఠులు, వేద గ్రంథాలున్న వారికంటె వేదాన్ని అభ్యసించేవారు శ్రేష్ఠులు. వారికంటెను వేదవేదార్థజ్ఞానం కలవారు చాలా గొప్పవారు. బ్రాహ్మణునకు బ్రహ్మజ్ఞానం, తపస్సు ఈ రెండూ మిక్కిలి మేలు చేస్తాయి. తపస్సు చేస్తే చేసిన పాపాలన్నీ తొలగిపోతాయి. బ్రహ్మజ్ఞానం మోక్షాన్ని కలిగిస్తుంది. అందువల్ల బ్రహ్మజ్ఞానం చాలా గొప్పది.

*ప్రత్యక్షం చానుమానం చ శాస్త్రం చ వివిధాగమమ్,*
*త్రయం సువిదితం కార్యం ధర్మశుద్ధిమభీప్సతా.105*

*ఆర్షం ధర్మోపదేశం చ వేదశాస్త్రాZవిరోధినా,*
*యస్తర్కేణానుసంధత్తే స ధర్మం వేద నేతరః .106*

ధర్మశాస్త్రం యొక్క వాస్తవజ్ఞానాన్ని తెలుసుకో దలచినవాడు, ప్రత్యక్షానుమాన ప్రమాణాలను, ధర్మసాధనాలైన వివిధ శాస్త్రాలను, అనేక ఆగమ శాస్త్రాలను చక్కగా తెలిసియుండవలెను. ఋషి దృష్టమైన వేదాన్ని, వేదానికి ఆధారాలైన స్మృత్యాది గ్రంధాలను వేదశాస్త్ర విరోధం లేని మీమాంసాన్యాయాలతో తెలిసికొన్నవాడే ధర్మశాస్త్రం తెలిసినవాడు.

*నైశ్శ్రేయసమిదం కర్మ యథోదితమశేషతః,*
*మానవస్యాస్య శాస్త్రస్య రహస్యముపదిశ్యతే .107*

ఇంతవరకు మోక్షసాధనమైన కర్మజాతమంతా ఎరిగించబడింది. ఇక ఈ మానవ ధర్మశాస్త్రము యొక్క రహస్య విషయాలు వివరింపబడ్డాయి.

*అనామ్నాతేషు ధర్మేషు కథం స్యాదితి చేద్భవేత్,*
*యం శిష్టా బ్రాహ్మణా బ్రూయుస్స ధర్మస్స్యాదశంకితః. 108*

త మానవ ధర్మశాస్త్రంలో చెప్పబడని ధర్మాలను శిష్టులైన బ్రాహ్మణులనడిగి తెలిసికోవాలి.

*ధర్మేణాధిగతో యైస్తు వేదస్సపరిబృంహణః,*
*తే శిష్టా బ్రాహ్మణా జ్ఞేయాః శ్రుతిప్రత్యక్షహేతవః.109*

*దశావరా వా పరిషద్యం ధర్మం పరికల్పయేత్,*
*త్ర్యవరా వాపి వృత్తస్థా తం ధర్మం న విచాలయేత్.110*

వేదములను శిక్షా వ్యాకరణాద్యంగములు, మీమాంసా, ధర్మశాస్త్ర పురాణాదులతో కలిపి చక్కగా అధ్యయనము చేసినవారే శిష్టులు. వారు వేదములను వేదార్థములను చక్కగా తెలిసినవారు. చాలామంది పండితులు కలిసి ధర్మ నిర్ణయం చేయుటకు వీలు లేకపోతే పదిమంది లేక ముగ్గురున్న పండిత సభ ఏ ధర్మాన్ని నిర్ణయిస్తుందో దాన్ని సంశయించక శిరసా వహించాలి.

*త్రైవిద్యో హేతుక స్తర్కీ నైరుక్తో ధర్మపాఠకః,*
*త్రయశ్చాశ్రమిణః పూర్వే పరిషత్స్యాద్దశావరా .111*

*ఋగ్వేదవిద్యజుర్విచ్చ సామవేదవిదేవ చ,*
*త్ర్యవరా పరిషద్ జ్ఞేయా ధర్మసంశయనిర్ణయే .112*

*ఏకోऽ పి వేదవిద్ధర్మం యం వ్యవస్యేద్ద్విజోత్తమః,*
*స విజ్ఞేయః పరో ధర్మో నాజ్ఞానాముదితోయుతైః .113*

పదిమంది ఉండు పండిత సభలో వేదాలకు సంబంధించిన మూడు శాఖలనధ్యయనం చేసినవారు ముగ్గురు శృతి స్మృతి విరుద్ధం కాని న్యాయ శాస్త్రాన్ని అధ్యయనం చేసినవాడు, మీమాంసా రూపమైన తర్క శాస్త్రం చదివినవాడు, నిరుక్తమును తెలిసినవాడు, ధర్మశాస్త్రములు చదివినవాడు, బ్రహ్మచారి, గృహస్థు, వానప్రస్థు అను మూడు ఆశ్రమముల వారు ఉండవలెను. ముగ్గురుండు పండిత పరిషత్తులో ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము అను మూడు వేదాలను వాటి అర్థమును తెలిసికొన్న ముగ్గురు పండితులుండవలెను. పండిత పరిషత్తులో ముగ్గురు సభ్యులు సైతం లేకపోతే వేదమునధ్యయనం చేసి వేదార్థాన్ని చక్కగా తెలిసిన బ్రాహ్మణోత్తముడొక్కడైనను ధర్మ విచారము చేయవచ్చును. వేద, వేదార్థ తత్వజ్ఞులు కానివారు పదివేల మంది ఉన్నా వారు నిర్ణయించిన ధర్మం గ్రాహ్యం కానేరదు.

*అవ్రతానామమంత్రాణాం జాతిమాత్రోపజీవినామ్,*
*సహస్రశస్సమేతానాం పరిషత్త్వం న విద్యతే .114*

*యం వదంతి తమోభూతా మూర్ఖా ధర్మమతద్విదః,*
*తత్పాపం శతధా భూత్వా తద్వక్తౄననుగచ్ఛతి .115*

బ్రహ్మచర్య వ్రతం లేక, గాయత్రీమంత్ర జపానుష్ఠానం లేక జాతిపై మాత్రం జీవించేవారు వేలమంది ఉన్నా వారు ధర్మ పరిషత్తులో సభ్యులు కాజాలరు. తమో గుణంతో నున్న మూర్ఖులు ధర్మమేమి తెలియక ప్రాయశ్చిత్తాది విషయాలను చెప్పితే ఆ పాపం నూరింతలై ఆ పరిషత్ సభ్యులనందరిని బాధిస్తుంది.

*ఏతద్వో ऽభిహితం సర్వం నిశ్శ్రేయసకరం పరమ్,*
*అస్మాదప్రచ్యుతో విప్రః ప్రాప్నోతి పరమాం గతిమ్ .116*

ఇంతవరకు మోక్ష సాధకమైన ఉత్తమ ధర్మాదికమునంతయు మీకు తెలిపితిని. ఈ ధర్మాన్ని తప్పని బ్రాహ్మణుడు అపవర్గ రూపమైన మోక్షాన్ని తప్పక పొందును.

*ఏవం స భగవాన్ దేవో లోకానాం హితకామ్యయా,*
*ధర్మస్య పరమం గుహ్యం మమేదం సర్వముక్తవాన్ .117*

అని జ్ఞాన రూపుడైన మనువు లోకహితాన్ని కోరి ధర్మశాస్త్ర రహస్యాన్ని అంతా నాకు వివరించినాడు.

*సర్వమాత్మని సంపశ్యేత్సచ్చాసచ్చ సమాహితః,*
*సర్వం హ్యాత్మని సంపశ్యన్నాధర్మే కురుతే మనః .118*

*ఆత్మైవ దేవతాస్సర్వాస్సర్వమాత్మన్యవస్థితమ్,*
*ఆత్మా హి జనయత్యేషాం కర్మయోగం శరీరిణామ్.119*

సద్వస్తువు అసద్వస్తువు పరమాత్మ స్వరూపమైన తన యందే ఉన్నట్లు భావింపవలెను. అట్లే సమస్తము తనయందే ఉన్నట్లు భావించువాడు అధర్మ కార్యములనెప్పుడు చేయజాలడు. ఇంద్రాది దేవతలందరు తన ఆత్మయే. సర్వము పరమాత్మ స్వరూపుడగు తనయందే ఉన్నది. ఈ ఆత్మయే కర్మాను బంధమును కలిగించుచున్నది.

*ఖం సన్నివేశయేత్ఖేషు చేష్టనస్పర్శనే ऽనిలమ్,*
*పజ్క్తిదృష్ట్యోః పరం తేజః స్నేహే ऽపో గాం చ మూర్తిషు,120*

*మనసీందుం దిశః శ్రోత్రే క్రాంతే విష్ణుం బలే హరమ్,*
*వాచ్యగ్నిం మిత్రముత్సర్గే ప్రజనే చ ప్రజాపతిమ్ .121*

*ప్రశాసితారం సర్వేషామణీయాంసమణోరపి,*
*రుక్మాభం స్వప్నధీగమ్యం విద్యాత్తం పురుషం పరమ్ .122*

బ్రహ్మ ధ్యానము చేయునప్పుడు బాహ్యాకాశమును శరీరాకాశమునందు లయము చేయవలెను. అట్లే బాహ్య వాయువును చేష్టా స్పర్శలకు కారణమైన శరీర వాయువున లయింప చేయవలెను. అగ్ని, సూర్యుల వెలుగును కడుపు, కండ్లలోని వెలుగున విలీనము చేయవలెను. బాహ్య జలమును దేహజలములలో, పృథివిని శరీరమున, చంద్రుని మనస్సులో, దిక్కులను శ్రోత్రేంద్రియమున, విష్ణువును పాదములందు, హరుని బలమున, అగ్నిని వాక్కులో, మిత్రుని పాయ్వింద్రియంలో, ప్రజాపతిని ఉపస్థేంద్రియమున విలీనము చేయవలెను. ఇట్లు ఆధ్యాత్మిక భూతాదులను స్వాత్మ యందు విలీనమైనట్లు భావించి

కర్మలనియతిఫలాన్ని ఇస్తూ అణువు కంటె అణువుగా, జ్ఞాన నేత్రంతో తెలియుటకు వీలైన, బంగారం వలె ప్రకాశించుచున్న పరమాత్మ స్వరూపాన్ని జ్ఞానంచే చూడగలగాలి.

*ఏతమేకే వదంత్యగ్నిం మనుమన్యే ప్రజాపతిమ్,*
*ఇంద్రమేకే పరే ప్రాణమపరే బ్రహ్మ శాశ్వతమ్ .123*

*ఏష సర్వాణి భూతాని పంచభిర్వ్యాప్య మూర్తిభిః,*
*జన్మవృద్ధిక్షయైర్నిత్యం సంసారయతి చక్రవత్ .124*

*ఏవం యస్సర్వభూతేషు పశ్యత్యాత్మానమాత్మనా,*
*స సర్వసమతామేత్య బ్రహ్మాభ్యేతి పరం పదమ్ .125*

ఆ పరమాత్మను కొందరగ్ని అని, మరి కొందరు మనువనే ప్రజాపతియని, ఇంక కొందరు ఇంద్రుడని, ప్రాణమని శాశ్వత స్వరూపుడైన పరబ్రహ్మ అని పిలుస్తున్నారు. ఆ పరమాత్మయే ప్రాణులను పృథివ్యాది పంచమహాభూతములచే వ్యాపించి ఆ ప్రాణులకు జన్మ వృద్ధి క్షయ రూపమైన ఈ సంసారాన్ని చక్రం వలె తిప్పుచున్నాడు. ఈ విధంగా సమస్త ప్రాణుల యందున్న ఆత్మను బ్రహ్మజ్ఞానం చేత వాడు బ్రహ్మ సాక్షాత్కారం వల్ల ఉత్తమ స్థానాన్ని పొందుతున్నాడు.

*ఇత్యేతన్మానవం శాస్త్రం భృగుప్రోక్తం పఠన్ ద్విజః,*
*భవత్యాచారవాన్నిత్యం యథేష్టాం ప్రాప్నుయాద్గతిమ్ .126*

భృగు మహర్షి చెప్పిన ఈ మనుధర్మ శాస్త్రాన్ని శ్రద్ధతో చదువుతున్న ద్విజునికి సదాచార సంపత్తి గలిగి చివరకు ఇష్ట లోకాలు కూడ కలుగుతాయి.

ఇతి మానవే ధర్మశాస్త్రే భృగుప్రోక్తాయాం సంహితాయాం ద్వాదశోఽధ్యాయః

భృగు మహర్షి చెప్పిన మానవ ధర్మ శాస్త్రమనే సంహితయందు పన్నెండవ అధ్యాయం సంపూర్ణం.

స్వస్తి.

